కావ్యరత్న, వేదాంతరత్న, వేదాంతతీర్థ, వేదాంతవాచస్పతి.
శ్రీమాన్. కందాడై శేషాచార్యులవారు
తెనిగించిన శ్రీవైష్ణవ సంప్రదాయ గ్రంథములు.

శ్రీమదాంధ్ర శ్రీభాష్యము. శ్రీరామానుజబ్రహ్మసూత్రభాష్యమునకు సరియయిన తెనుగు) మొదటి సంపుటం 8 0 0

శ్రీమదాంధ్ర శ్రీభాష్యము. రెండవ సంపుటం 8 0 0

శ్రీవచనభూషణము. శ్రీపిళ్ళైలోకాచార్యులవారు సాయించిన దివ్యమగు శ్రీవైష్ణవ సిద్ధాంతగ్రంథము. ఇది శ్రీమణవాళ మహామునులు సాయించిన వ్యాఖ్యానముతోఁగూడ తెనిగింపఁబడి ద్రావిడభాషలోనుండు మూలవ్యాఖ్యానములతోఁగూడ ముద్రింపఁబడినది. 8 0 0

తిరుమంత్రార్థము. టిటో డిటో 4 0 0

తత్త్వత్రయము. డిటో (ఇతరులది) 2 0 0

ఆచార్యహృదయము. పిళ్ళైలోకాచార్యులవారి తమ్ములగు అళగియ మణవాళ పెరుమాళ్ నాయనార్ సాయించిన దివ్యమయిన శ్రీవైష్ణవ సిద్ధాంత గ్రంథము. డిటో డిటో 8 0 0

విలక్షణ మోక్షాధికారి నిర్ణయము. శ్రీమణవాళమహామునులశిష్యులలోనొక్కరగు ఎఱుంబిల్ అప్పాగారు సాయించినది. శ్రీవైష్ణవుని కుండవలసిన లక్షణంబులను, అనుష్ఠానంబులను, అభిప్రాయంబులను మొదలగు వాటిని తెలుపుటలో నింతకుమించినగ్రంథము లేదని చెప్పతగినంత ముఖ్యమైనది. వెల 2 0 0

వార్తామాల—పిన్బళగియ పెరుమాళ్ జియ్యరువారు సాయించినది. శ్రీమన్నాథమునులు మొదలగు పూర్వాచార్యులు అప్పుడప్పుడు గోష్ఠిగాఁజేరినప్పుడు "బోధయంతః పరస్పరం" అన్నట్లు అయాసద్విషయములను గుఱించి చర్చించిన అనేక విషయములును, అనేకరహస్యార్థములనుగుఱించి వారివారియభిప్రాయములు ఈ గ్రంథమువలనఁ దెలియఁగలవు. ఈయొకగ్రంథముచే నన్ని గ్రంథములను చదివినంత యుపయోగము కలదని వేరు చెప్పనక్కఱలేదు. 3 0 0

వార్తామంజరి—ఇందు శ్రీరామానుజాచార్యులవారు మొదలగు పూర్వాచార్యులు అనేకులు సాయించిన వార్తలును కలవు 0 6 0

వేదార్థ సంగ్రహము. ఉపనిషత్తులలో అద్వైతులకును విశిష్టాద్వైతులకును అభిప్రాయ భేదముగల వాక్యములన్నింటి యొక్కయును అర్థము తేటతెల్లముగ తెలియునట్లు శ్రీరామానుజుల వారిచే రచియింపఁబడిన విశిష్టాద్వైత సిద్ధాంతసంగ్రహరూపమగు గ్రంథము. 2 0 0

రహస్యత్రయసారము. శ్రీ వేదాంతదేశిక విరచితము. వడగలవారి తిరుమంత్రార్థము. ఇది చక్కగ తెనిగింపఁబడినది. 5 0 0

స్తోత్రరత్నము—ఆళవందారు స్తోత్రము. శ్రీ ఆళవందారులు రచియించిన దివ్యమైన స్తోత్రము. టీకా తాత్పర్య పీఠిక సహితము ఇందు ప్రతిశ్లోకమునకును మధురంబులగు పద్యంబులును కలవు 0 12 0

ఈశావాస్యోపనిషత్తు. శ్రీరామానుజ సిద్ధాంతపరములగు టీకా తాత్పర్యములతోను విపులమయిన పీఠికతోను గూడియున్నది 0 8 0

కేనోపనిషత్తు. డిటో డిటో 0 8 0

అధ్యాత్మచింత. భగవద్విషయమునకు పన్నిరాయిరప్పడి వ్యాఖ్యానము వ్రాయించిన అప్పిళ్లైకియమణవాళ జియ్యరువారు వ్రాయించినది. ఇందు సులలితములగు శ్లోకములతో తిరుమంత్ర, ద్వయ, చరమశ్లోకార్థములును అర్చిరాదిమార్గమును వివరింపఁబడినవి. ఇది చక్కగ తెనిగింపఁబడినది. 0 4 0

యతిరాజవింశతి. శ్రీ మణవాళమహామునులు రచియించిన స్తోత్రము టీకా తాత్పర్య పీఠిక సహితము. ఇందు ప్రతిశ్లోకమునకును మధురంబులగు పద్యంబులును కలవు, 0 4 0

ముకుందమాల. శ్రీకులశేఖరాళ్వారులు రచియించినది పద్యసహితము టీకా తాత్పర్యసహితం 0 4 0

చతుశ్శ్లోకి. కాంతాస్తోత్రము. శ్రీ ఆళవందారులు రచియించినది శ్రీదేవి విషయమగు స్తోత్రము. టీకా తాత్పర్య పీఠిక సహితము 0 2 0

ఎనబదిరెండు వార్తలు-శ్రీరామానుజులవారు వ్రాయించినది 0 2 0

కందాడై శేషాచార్యులు,
ప్రొప్రైటరు,
వేదాంతముద్రాక్షరశాల, 88 ఏడుబావులవీథి, మద్రాసు.

ఇదిగో ఒక్కమాట:—

ఈ గ్రంథమును రచియించినవారు వేంకటనాథులను వారు. వీరు కాంచీపురముకు సమీపముననుండు తూప్పుల్ గ్రామవాస్తవ్యులగు అనంతసూరి తోతాద్రియమ్మ అనువారి గర్భమున తిరుపతియందు (కలి 4370 విభవ సం॥) అనఁగా 1268 సం॥ భాద్రపద (సెప్టంబర్ — అక్టోబరు) మాసమున శ్రవణనక్షత్రమునాడు తిరుపతిలో జన్మించిరి. తిరుపతిలోజన్మించినందున, వీరితల్లితండ్రులు వీరికి వేంకట నాథుఁడని పేరిడిరి.

వీరు తమ మేనమామగారగు ఆత్రేయరామానుజాచార్యులవారి సన్నిధియందు సర్వశాస్త్రముల నధిగమించి, వాటియందు మంచి ప్రావీణ్యమును సంపాదించుకొని, యందు మూలముగ కవితార్కికసింహులనియు, సర్వతంత్రస్వతంత్రులనియు, వేదాంతదేశికులనియు నిర్విఘ్నముగ సార్థకములగు బిరుదులను వహించిరి.

వీరు సంస్కృతమునందును ద్రావిడమునందును మొత్తముకు 120 గ్రంథములకు పైగా రచియించిరి. వీరికాలమున వైష్ణవసిద్ధాంతమును ద్వేషించునట్టి మతాంతరుల నెంతమందినో వీరు జయించి మతమును కాపాడుటయేకాక, విశిష్టాద్వైత సిద్ధాంతమున శతదూషణి మొదలగు అనేక వాదగ్రంథములను రచియించి, శ్రీభాష్యమును బలపఱచుచు, అందుమూలముగ విశిష్టాద్వైత సిద్ధాంతముకు మంచిక పూనిక నిచ్చియున్నారు.

వీరు రచియించిన శ్రీవైష్ణవసాంప్రదాయిక గ్రంథములలో, ఈ రహస్యత్రయసారము చాలముఖ్యమైనది. ఈగ్రంథమునఁగల విశేషంబెద్దియనఁగా—తెంగలవారగు శ్రీపిళ్ళలో

కాన్ఛాచార్యులవారు అళకియమణవాళప్పెరుమాళ్ నాయనారు మొదలగువారు తమతమ గ్రంథములయందు వర్ణాశ్రమాచారధర్మంబులనంత పాటింపకయు, ఔచిత్యానౌచిత్యములను బొత్తుగ గమనింపకయును, శ్రీరామానుజసిద్ధాంతమునైనను లక్ష్యపెట్టకయును తమకుపట్టినదే పట్టుగ గ్రంథములను రచియించియుండిరి.

వీరు అట్లుచేయక, వర్ణాశ్రమధర్మములను పాటించుచు, వాటికనుగుణముగనే వైష్ణవసిద్ధాంతమును తెలుపుచు, ఔచిత్యానౌచిత్యములను ముఖ్యము గమనింపుచు, శ్రీభాష్యకారులవారి సిద్ధాంతమును శిరసావహించి, తాను వ్రాయునది యంతయును శ్రీభాష్యంబున కనుగుణంబైనది యని తెలుపుటకుగాను అచ్చటచ్చట పలుమారు బ్రహ్మసూత్రముల నుదహరించుచు, శ్రీవైష్ణవసిద్ధాంతమును శ్రీభాష్యముతో తుల్యతూగునట్లు నిరూపించి చూపించినట్టి మహాగ్రంథం బిది.

వర్ణాశ్రమాచారములను చక్కగ గమనించుకొనుచు వాటికెట్టిబాధకమున్ను కలుగకుండ, వైష్ణవసిద్ధాంతము నవలంబింపఁగోరునట్టివారికి ఈ గ్రంథమే శరణంబని చదువరులకే తెలియఁగలదు.

వీరు "శతాయుః పురుషః" అన్నట్లు 100సంవత్సరములు జీవించియుండి 1369 - వ సం ॥ కార్తీకమాసమున పరమపదించినట్లు వీరిచరిత్రమువలనఁ దెలియఁగలదు.

ఇట్లు,

కందాడై శేషాచార్యులు.

## స్థిరీకరణ విభాగము.



## పదవాక్యయోజనాభాగము.



## సంప్రదాయప్రక్రియాభాగము.





# తనియనులు.



శ్లో॥ కమప్యాద్యంగురుంవందే కమలాగృహమేధినం।
ప్రవక్తాఛంధసాంవక్తా పంచరాత్రస్యయస్స్వయం॥
సహధర్మచరీంశౌరే స్సమ్మంత్రితజగద్ధితాం।
అనుగ్రహమయీంవందే నిత్యమజ్ఞాతనిగ్రహాం॥
వందేవైకుంఠసేనాన్యం దేవంసూత్రవతీసఖం।
యద్వేత్రశిఖరస్పందే విశ్వమేతద్వ్యవస్థితం॥
యస్యసారస్వతస్రోతో వకుళామోదవాసితం।
శ్రుతీనాంవిశ్రమాయాలం శఠారింతముపాస్మహే॥
నాథేన మునినాతేన భవేయంనాథవానహం।
యస్యనైగమికంతత్త్వం హస్తామలకతాంగతం॥
నమస్యామ్యరవిందాక్షం నాథభావేవ్యవస్థితం।
శుద్ధసత్త్వమయంశౌరే రవతారమివాపరం॥
అనుజ్ఝితక్షమాయోగ మపుణ్యజనబాధకం।
అస్పృష్టమదరాగంతం రామంతుర్యముపాస్మహే॥
విగాహే యామునంతీర్థం సాధుబృందావనేస్థితం।
నిరస్తజిహ్మగస్పర్శే యత్రకృష్ణఃకృతాదరః॥
దయానిఘ్నంయతీంద్రస్య దేశికంపూర్ణమాశ్రయే।
యేనవిశ్వసృజోవిష్ణో రపూర్యత మనోరథః॥
ద్వైశాఖేరోహిణీజాతం కాశ్యపాన్వయవారిధేః।
ఇందుంశ్రీపుండరీకాంశం గోష్ఠీపూర్ణమహంభజే॥
యోనిత్యమచ్యుతపదాంబుజయుగ్మరుక్మ
వ్యామోహతస్తదితరాణి తృణాయమేనే।
అస్మద్గురోర్భగవతోఽస్యదయైకసింధోః
రామానుజస్యచరణౌశరణంప్రపద్యే॥
ఆత్రేయగోత్రసంభూతమాశ్రయేశ్రితవత్సలమ్।
యతీంద్రమాహానసికం ప్రణతార్తిహరంగురుమ్॥

ఆత్రేయగోత్రాంబుధిపూర్ణచంద్ర మాచారయుక్తాత్మగుణోపపన్నమ్।
నత్వా త్రివేద్యద్దేశికరత్నసూనుం రామానుజార్యంగురుమాశ్రయామః॥

శ్లో॥ రామానుజార్యతనయంరమణీయవేషమాత్రేయమాత్మగుణపూర్ణ మనర్ఘశీలమ్। శ్రీరంగరాజమివతద్దయయావతీర్ణం శ్రీరంగరాజగురువర్య మహంప్రపద్యే॥

శ్లో॥ శ్రీమచ్ఛ్రీరంగరాజాహ్వయగురుతనయం శ్రీమదాత్రేయగోత్రం శ్రేయోహేతుం నతానాంవరదగురుకృపావాప్తసచ్ఛాస్త్రజాతమ్ । వేదాన్తాచార్యవర్యేకృతసకలరహస్త్యసచ్ఛాస్త్రజాతంవందేరామానుజార్యం గురుకులతిలకం వాదిహంసాంబువాహమ్॥

నమోరామానుజార్యాయ వేదాంతార్థప్రదాయినే।
ఆత్రేయపద్మనాభార్య సుతాయ గుణశాలినే॥
రామానుజదయాపాత్రం జ్ఞానవైరాగ్యభూషణమ్।
శ్రీమద్వేంకటనాథార్యం వందే వేదాంతదేశికమ్॥
శ్రీమల్లక్ష్మణయోగీంద్ర సిద్ధాంతవిజయధ్వజమ్।
విశ్వామిత్రకులోద్భూతం వరదార్యమహంభజే॥
పర్యాయభాష్యకారాయ ప్రణతార్తింవిధున్వతే।
బ్రహ్మతంత్రస్వతంత్రాయ ద్వితీయబ్రహ్మణేనమః॥
హస్తీశంలోకవిఖ్యాతం కౌండిన్యంవిగుపాంవరమ్।
రామానుజార్యసిద్ధాంత స్థాపనాచార్యమాశ్రయే॥
నమోవరదవిష్ణ్వార్య నయనానన్దదాయినే।
వాత్స్యవరదార్యాయ వాదిసింహరభాస్వతే।
ప్రపద్యేనిరవద్యానాం నిపద్యాం గుణసంపదామ్।
శరణంభవభీతానాం శఠకోపమునీశ్వరమ్॥

శీరొఙ్గత్తు ఊప్పిల్ తిరువేంగడముడైయాన్ పాదొఙ్గచ్చొన్న పల్లాణ్డుపల్లాణ్డు — ఓరొఙ్గుతానే యమైయాతో తారణియిల్ వాళ్ వాళ్గ వా సేరపొ్పమళవుమ్ వాళ్వు.





శ్రీమతే రామానుజాయ నమః.

శ్రీమతే నిగమాంతదేశికాయ నమః.



# రహస్యత్రయసారము

## గురుపరంపరాసారము.

## ప్రవేశము.

శ్రియః పతియును, నిఖిలహేయ ప్రత్యనీక కల్యాణగుణ స్వరూపుండును, సర్వశేషియును, పురుషోత్తముండు నగు నారాయణుండు తనకు శేషభూతులయినట్టివారును సంసారబంధముననుండు వారునగు ఆత్మలు నిత్యసూరులవలెనే తన కైంకర్యమొనర్చుటయందు యోగ్యతయున్నను, అనాదియగు కర్మప్రవాహమునఁబడి లెక్కలేని దుఃఖములకుపాత్రులై ఐహికాముష్మికములగు క్షుద్రపురుషార్థముల కాశపడి, తత్సాధనముల ననుష్ఠించుచుండుటఁ గని, మనస్సు కరిగినవాఁడై పరమపురుషార్థముఁ దెలిసికొనినట్లయిన, అందులకుఁగానగు సాధనానుష్ఠాన మొనర్చుటచే నట్టి కైంకర్యమును లభింతురని

హంస, మత్స్య, హయగ్రీవ నరనారాయణాది రూపముగా నవతరించి తన నుపాసించుటఁ దెలుపునట్టి శాస్త్రములఁ బ్రవర్తింపఁ జేసియు, అట్టి యనుష్ఠాన మొనర్చుటకు శక్తి లేనివారికి గాను తానే స్వయముగ గీతాచార్య, శఠగోప, నాథ, యామున తిరుతిరాజులమూలముగ ప్రపత్తి శాస్త్రమును బ్రవర్తింపఁ జేసియు, అదిన్ని మిక్కిలియగాధంబగుటం జేసి సామాన్యజ్ఞానవంతులంత గ్రహింపఁదగినట్టిదికాదని తలంచి "యద్యద్విభూతిమత్సత్వం శ్రీమదూర్జితమేవవా। తత్తదేవావగచ్ఛత్వం మమ తేజోంశ సంభవం" (ఎది యేది శ్రీమంతమై వృద్ధిపొందునట్టిదియో అది యది నాతేజస్సుయొక్క యంశమువలనఁ గలిగినదియని తలంచుము) అన్నట్లు తానే స్వయముగ అసాధారణమగు సర్వతంత్ర స్వాతంత్ర్యముగల శ్రీ వేదాంతదేశికులుగా నవతరించి శ్రీశఠారిదులందఱును విశదముగాఁ దెలిసికొనుటకై సకలశాస్త్ర సంగ్రహమగు రహస్యత్రయ సారమును మోక్షసాధనమునగు భరన్యాసము (శరణాగతి=ప్రపత్తి) యొక్క స్వరూపమును యథార్థరీతిని తెలుపుటకుగాను సంస్కృత ద్రావిడప్రమాణ గ్రంథంబులనన్నింటికిని అనుగుణముగ రహస్యత్రయమును వివరింపఁదలంచి, యాకార్యము నిర్విఘ్నముగా ముగించుటకై, చేయవలసినదిగాను శ్రుతిస్మృతులయందుఁ జెప్పియున్నందున గురునమస్కార రూపమగు మంగళము నొనర్చుచు తమ శిష్యులు మొదలగువారును అట్లే యాచరించుటకై దానిని గ్రంథస్థముగాఁ జేయుచున్నారు.



## మంగళాచరణము.

శ్లో॥ గురుభ్య స్త ద్గురుభ్యశ్చ నమోవాక మధీమహే।
వృణీమహేచ తత్రాద్యౌ దమ్పతీ జగతాంపతీ॥

టీ॥ గురుభ్యః=ఆచార్యులకును, తద్గురుభ్యశ్చ=వారి యాచార్యులకును, నమోవాకమ్=నమః అని, అధీమహే = చెప్పుచున్నాము. తత్ర=అప్పుడు, ఆద్యౌ=మొట్టమొదటి యాచార్యులును, జగతాంపతీ=జగత్తును పాలకులగు పెరుమాళ్లునున్న పిరాట్టినిన్ని, వృణీమహే=మోక్షోపాయము గాను వరించుచున్నాము.

తా॥ ఆచార్యులకున్ను పరమాచార్యులకున్న దండము సమర్పించి శ్రీ శ్రియఃపతులను మోక్షోపాయభూతులను గాను వరించుచున్నాము.

పొయ్ గైమునిపూదత్తార్ పేయాఴ్వార్, తణ్పొరు
నల్ వరుఙ్గురుకేశన్ విట్టుచిత్తన్, తుయ్యకులశేకర
నమ్పాణనాదన్, తొణ్డరడిప్పొడి మఴిశైవంద శోది,
వైయమెల్లామఱై విళంగవాళ్ వేలేన్దు, మంగైయర్కోన్
ఎన్నివర్ కణ్మకిఴ్న్దుపాడుమ్, శెయ్యతమిఴ్ మాలై
కళాన్దెళియవోది, తెళియాదమఱైనిలంగళ్ తెళిక్కిన్ఱోమే.

టీ॥ పొయ్ గై=పొయ్ గై ఆళ్వారులును, పూతత్తార్=పూతత్తాళ్వారులును, పేయాఴ్వార్ = పేయాళ్వారులును, తణ్=శీతలమైన, పొరునల్=తామ్రపర్ణీనది, వరుకై=ఆవరించియున్న, కురుకా=కురుకాపురికి, ఈశన్=స్వామియైనట్టి శ్రీనమ్మాళ్వారులును, విష్ణుచిత్తన్=పెరియాళ్వారులును, తుయ్య=పరిశుద్ధులగు కులశేఖరన్ = శ్రీకులశేఖరాళ్వారులును, నమ్=మనయొక్క, పాణనాదన్ = తిరుప్పాణియాళ్వారులును, తొండరడిప్పొడి=తొండరడిప్పొడి యాళ్వారులును, మఴిశై=తిరుమఴిశైయా

దు, వంద = వచ్చియున్నట్టి, జ్యోతిః = తిరుమొళిశై యాళ్వారులును, వైయ్యమెల్లామ్ = భూమి యందంతటను, మఱై = వేదములు, విళంగ = ప్రకాశించునట్లు, వాళ్ - వేల్ = ఆయుధములను, ఏన్దుమ్ = ధరించుకొనియుండినట్టివారై, మంగై = మంగై యను నగరమునకు, కోన్ = స్వామియైనట్టి తిరుమంగైయాళ్వారులును, ఎన్ను = అనే, ఇవర్కళ్ = వీరిచే, మకిళ్న్దు = ప్రీతితో, పాడుం = గానము చేయఁబడునట్టివియు. శెయ్య = మధురములయినట్టివియునగు, తమిళ్మాలైకళ్ = ద్రావిడప్రబంధములను, నామ్ = మేము, తెళియ = విశదముగా, ఓతి = అధ్యయనము చేసి, తెళియాత = మాకు తెలియని మఱైనిలంగళ్ = వేదాంతార్థములను, తెళికిన్టోమే = విశదముగాఁ దెలిసికొనుచున్నాము.

తా॥ ఆళ్వారులు పాడినట్టి నాలాయిర దివ్యప్రబంధముల నన్నింటిని చదివి జ్ఞానము గలుగఁజేసికొని మాకుముందు తెలియనట్టి వేదాంతార్థములను విశదముగాఁ దెలిసికొనుచున్నాము.

ఇన్బత్తిలిఱైఞ్జుతలిలిశైయుమ్పేఱ్ఱిల్, లికప్పాదపల్లురవులి
రాకమాఱ్ఱిల్, తన్బత్తిల్ విన్నైవిల కిన్ఱ నకవోక్క
త్తిల్, తత్తువత్తైయుణర్త్త తలిల్ నన్మైయాక్కిల్, అ
న్బర్క్కేయవతరిక్కు మాయనిఱ్క, వరుమఱైకళ్తమిళ్
శైధాన్తాళ్వాన్ముం, తున్బఱ్ఱ మధురకవితోన్ఱ కాట్టుం
తొల్ వళియే నల్వళికళ్ తుణివార్కళ్కే.

టీ॥ ఇన్బత్తిల్ = కణ్ణినుణ్ శిఱుత్తాంబుయొక్క మొదటి పాశురమునఁ జెప్పఁబడినట్టి మాధుర్యమును, ఇఱైఞ్జుతలిల్ = రెండవ పాశురమునందుఁ జెప్పఁబడినట్టి సేవ్యత్వమును, ఇశైయుమ్ పేఱ్ఱిల్ = మూఁడవ పాశురమునఁ జెప్పఁబడినట్టి పురుషార్థమును, ఇకప్పాత పల్లురవు = నాల్గవ పాశురమునందుఁ జెప్పఁబడిన సర్వవిధ బంధుత్వమును

ఇరాకమాత్తిల్ = అయిదవ పాశురమునందుఁ జెప్పఁబడినట్టి వైరాగ్య
మును, తక్ శదిర్తే = ఆఱవ పాశురమునందుఁ జెప్పఁబడినట్టి తనయొక్క
సంశ్లేషమును, విన్నైవిలక్కిల్ = ఏడవ పాశురమునఁ జెప్పఁబడినట్టి
పాపనివృత్తియును, తనవోక్కత్తిల్ = ఎనిమిదవ పాశురమునఁ జెప్పఁ
బడిన నిరవధిక కృపయును, అత్తుపత్తై యుణర్త్తియిల్ = తొమ్మిదవ పాశుర
మునఁ జెప్పఁబడిన తత్త్వయాథాత్మ్య దర్శనమును, తన్నైశ్రయాక్కిల్ =
పదియవ పాశురమునఁ జెప్పఁబడినట్లు భాగవతులు సంతోషించునట్లు స్వరూ
పము దిద్దుపాట్లగుటయును, అన్బర్ = భాగవతులకు, ఇన్బత్తిల్ = ఇన్బత్తిల్
అని యారంభించి చేర్కొనంబడినట్టి దశవిధపురుషార్థములును లభించు
నట్లుచేయుటక్కై, అయన్ నిర్క = శ్రీకృష్ణుండున్నను, అరుమ్ కరినములయిన,
మఱై = వేదములను, తమిళ్ శెయ్ తాన్ = ద్రావిడభాషయం దొనర్చిన
నమ్మాళ్వారులయొక్క, తాళ్ = శ్రీపాదములను, కొండు = ఉపాయమును
గా స్వీకరించి, తున్బత్త = దోషరహితుండైనట్టి, మధురకవి = మధురకవు
లచే, తోన్ఱ = తెలుపఁబడినట్టి, తొల్ వழి = అనాదియైనట్టిమార్గము, నల్
వழி = మంచిమార్గమగుట, తుణివార్గళ్కు = అట్టి యాచార్యనిష్ఠయం దెడ
విశ్వాసముగలవారికే.

తా॥ శ్రీ మధురకవులు తామురచియించిన కణ్ణినుణ్ శిరుత్తాంబను
గ్రంథమునందు సూచించినట్టి దశవిధపురుషార్థములను లభింపఁజేయు
టకై భగవంతుండు సంసిద్ధుండుగానున్నను, కఠినములగు వేదార్థములను
ద్రావిడభాషయందు వివరించినవాఁడగు శ్రీనమ్మాళ్వారులయొక్క శ్రీపాద
ములను రక్షకముగా నమ్మియున్నట్టివారును దోషరహితులగు మధురకవులు
జూపించినమార్గము వారివలెనే యాచార్యనిష్ఠగలవారికి మంచిమార్గము
కాఁగలదు.

## ఆచార్యసంబంధ ముత్తాంకము.

"పాపిష్ఠః క్షత్రబన్ధుశ్చ పుండరీకశ్చ పుణ్యవాన్ ఆచార్యవత్తయా ముక్తౌ తస్మాదాచార్యవాన్ భవేత్" (పాపిష్ఠుండగు క్షత్రబంధువును, పుణ్యాత్ముండగు పుండరీకుండును సదాచార్య సంబంధమువలన మోక్షమును బొందినారు. కావున ఆచార్యసంబంధము గలవారుగానుండునది) అన్నందున సదాచార్య సంబంధమే అందఱికిన్ని మోక్షసాధనమని చెప్పియున్నది. కావున ముముక్షువయినట్టివాడు ఆచార్య పరంపరను భగవంతుని వరకును అనుసంధించుకొనునది.

## భగవంతుని యాచార్యత్వము.

"తమిమం సర్వసంపన్న మాచార్యం పితరంగురుం" అనియు, "మమా వ్యఖిలలోకానాం గురుఃనారాయణోగురుః" అనియు, "త్వమేవబన్ధుశ్చ గురుస్త్వమేవ" అనియు, "గురురసి గతిశ్చాసి జగతాం" అనియును చెప్పియున్నట్లు సమస్తలోకములకును పరమాచార్యుండగు సర్వేశ్వరుండు ప్రథమమున చతుర్ముఖబ్రహ్మకు వేదముల నుపదేశించియు, వానిని రాక్షసులు దొంగిలించుకొని పోయినప్పుడు మరల గొనివచ్చి యిచ్చి యీతనిద్వారా శాస్త్రములఁ బ్రవర్తింపఁజేసియు, ఈతని పుత్రులగు సనత్కుమారాదులను "స్వయమాగతవిజ్ఞానా నివృత్తిం ధర్మమాస్థితాః" (స్వయముగ జ్ఞానవంతులై నివృత్తిధర్మము నవలంబించినట్టివారు) అని చెప్పఁదగినట్టి వానిఁగాఁజేసి వారిద్వారా హితోపదేశములఁ బ్రవర్తింపఁజేసి,

ఇవ్విధముననే నారద, పరాశర, శుక, శౌనకాద్యనేక మహర్షు లను పంపించి వేదాంతసంప్రదాయము చెడిపోకుండ ప్రవ ర్తింపఁజేసి “కృష్ణద్వైపాయనం వ్యాసం విద్ధి నారాయణంప్రభుం కోహ్యన్యో భువిమైత్రేయ మహాభారతకృద్భవేత్” (శ్రీమన్నారాయణుండే వ్యాసుఁడని తలంచుము, వేఱొక్కండు అంత మహాభారమును రచియింపఁగలఁడా?) అనియు “మహర్షేః కీర్తనా త్తస్యభీష్మః ప్రాంజలిరబ్రవీత్” (వ్యాసుని ధ్యానించుచు భీష్మాచార్యుండు చేతులుజోడించుకొని యుండెను) అనియును చెప్పియున్నట్టు వ్యాసాదులలో నంతరాత్మగా ప్రవేశించి, మహాభారత శారీరకాది శాస్త్రములఁ బ్రవర్తింపఁజేసియు, హంస, మత్స్య, హయగ్రీవ, నర, నారాయణ, శ్రీకృష్ణాద్యవతారములనెత్తి తానే స్వయముగవచ్చి తత్త్వహితపురుషార్థములను బయలుపఱచియు, తాను సాయించినట్టి యర్థంబుల నన్నింటిని శ్రీభీష్మాచార్యులు మొదలగువారిఁగొని వ్యాపింపఁజేసియు, “పంచరాత్రస్య కృత్స్నస్య వక్తా నారాయణస్స్వయం” (పంచరాత్ర సంహితనంతయును నారాయణుండు స్వయముగ ఉపదేశించినాడు) అన్నట్లు తాను యింతకుముందు సాయించిన పాంచరాత్రశాస్త్రమును, “బ్రాహ్మణైః క్షత్రియై ర్వైశ్యై శ్శూద్రైశ్చ కృతలక్షణైః అర్చనీయశ్చ సేవ్యశ్చ నిత్యయుక్తై స్స్వకర్మసు। సాత్వతం విధిమాస్థాయ గీతస్సంకర్షణేనయః” అన్నట్లు అవసరము వచ్చినప్పుడెల్ల అవతరించియు, “పూర్వోత్పన్నేషు భూతేషు తేషు తేషు కలౌప్రభుః అనుప్రవిశ్యకురుతే యత్సమీహితమచ్యుతః” (సర్వేశ్వరుండు తానింతకుముందు సృజించినట్టి వాటిలోఁబ్రవేశించి తనయిష్ట

మును నెరవేర్చుకొనుచున్నాడు) అన్నట్లు, పరాంకుశ, పరకాలాది రూపములతో నూతనముగ దశావతారములుగా నవతరించి మేఘములు సముద్రజలమును పానముచేసి జీవరాశులకన్నింటికిని ఉపయుక్తంబగు జలమును వర్షించునట్లు, వేదములలో సారభూతములగు అర్థములను అందఱికిని తెలియునట్లు ద్రావిడభాషయందు సంగ్రహముగాఁ దెలిపియు, ఇప్విఃముగ తాను ప్రవర్తింపఁజేసినట్టి సన్మార్గమును బయటికి ఉపదేశించునట్టివారుగాను, లోపల నాస్తికులుగాను నున్నట్టి పాషండులవలన నెట్టి యుపద్రవమున్ను గలుగకుండుటకుగాను, "సాక్షాత్ నారాయణోదేవః కృత్వా మర్త్యమయీం తనూం మగ్నానుద్ధరతే లోకాన్ కారుణ్యాచ్ఛాస్త్రపాణినా" (నారాయణుండే స్వయముగ శాస్త్రమును జేతనుంచుకొని అజ్ఞానములోఁ బడియున్నట్టి జనులను ఉద్ధరించుచున్నాడు) అనియు "పీతకవాడై పిరానార్ పిరమగురువాకి వన్దెన్నుమ్" (పీతాంబరధరుండును ఉపకారకుండు నగు సర్వేశ్వరుండు చతుర్ముఖబ్రహ్మకు గురువుగా నవతరించి) అనియును సాయించినట్లు అగస్త్యుండు వసించియున్నట్టి దక్షిణదేశమునందు అనేకులగు ఆచార్యులుగాను అవతరించినవాఁడాయెను.

## గురుపరంపరావతారము.

దీనినిబట్టియే "కలౌఖలు భవిష్యన్తి నారాయణపరాయణాః క్వచిత్క్వచి న్మహాభాగా ద్రావిడేషు చ భూరిశః తామ్రపర్ణీనదీయత్ర కృతమాలాపయస్వినీ కావేరీచమహాభాగా ప్రతీచీచ మహానదీ" (కలియుగమునందు అచ్చటచ్చట

నారాయణభక్తులగు మహాపురుషులు జన్మించుదురు. కావేరీ తామ్రపర్ణి మొదలగు మహానదులు ప్రవహించునట్టి ద్రావిడ దేశమునం దెక్కువగా జన్మించుదురు.) అని మహర్షులు చెప్పి యున్నారు.

## శ్రీమన్నాథమునులు వారి గ్రంథములు.

ఇట్లు అవతరించినట్టి యీ యాచార్యులలో ఈశ్వరముని కుమారులు నాథమునులు. వీరు న్యాయతత్వమనెడి శాస్త్రమును యోగరహస్యమను గ్రంథమునున్ను రచియించియున్నారు. శ్రీమధురకవులు మొదలుకొని యున్నట్టి సంప్రదాయపరంపరవలనను, తిరువాయ్ మొళిని లభించుటకుగాను యోగమునందు సాక్షాత్కరించుటం జేసియును శ్రీనమ్మాళ్వారులు వీరికి ఆచార్యులయిరి.

## శ్రీయాళవందారులు వారి గ్రంథములు.

శ్రీమన్నాథమునుల కుమారులు ఈశ్వరభట్టాళ్వార్. వీరి కుమారులు శ్రీయాళవందారులు. వీరు ఆగమప్రామాణ్యమును, పురుషనిర్ణయమును, ఆత్మసిద్ధి, ఈశ్వరసిద్ధి, సంవిత్సిద్ధియనఁబడు సిద్ధిత్రయమునున్ను, గీతార్థసంగ్రహమునున్ను స్తోత్రమునున్ను, చతుశ్శ్లోకిసిన్ని రచియించి యున్నారు. వీరి కుమారులు శొట్టనంబిగారు. వీరి కుమారులు యెన్నాచ్చాన్. ఎన్నాచ్చాను కుమారులు నల్గురు. వీరిలో నొక్కరు పిళ్లైయప్పన్ అనువారు. వీరి కుమారులు తోళప్పరనువారు. తోళప్పరనువారికి యిద్దఱు కుమార్తెలు.

శ్రీమన్నాథమునుల నాశ్రయించినవారు—ఉయ్యక్కొండారులు, కురుకైక్కావలప్పన్, నమ్బి కరుణాకరదాసులు, ఏఱు తిరువుడైయారు, తిరుక్కణ్ణమంగైయాండాన్, వానమాదేవియాండాన్, ఉరుప్పట్టూరాచ్చాన్ బిళ్ళై, శొకత్తూరాళ్వాన్ అనువారు ఎనిమిదిమంది.

ఉయ్యక్కొండారులను ఆశ్రయించినవారు— మణక్కాల్‌నంబి. తిరువళ్ళిక్కేణి పాణ్బెరుమాళరైయర్, శెట్టలూర్ శెణ్డలంగార్, పుండరీకదాసులు ఉలకప్పెరుమాళ్ నంగై.

మణక్కాల్ నంబిగారి శ్రీపాదముల నాశ్రయించినవారు—ఆళవందారులు తెయ్వత్తుక్కరశునంబి, నంబి,గోమఠం తిరువణ్ణకరప్పన్ శిరుప్పుళ్ళూరావుడైయపిళ్ళై, ఆచ్చి

శ్రీయాళవందారుల శ్రీపాదములనాశ్రయించినవారు—పెరియనంబి, తిరుక్కోట్టియూర్‌నంబి, తిరుమాలైయాండాన్, ఆళవందారాళ్వాన్, తిరుమలైనంబి, ఈశాండాన్, తెయ్వవారియాండాన్, శిరిశాండాన్, తిరుమోహూరప్పన్, తిరుమోహూర్ నిన్ఱార్, తెయ్వప్పెరుమాళ్ తిరుమంగైయాళియార్, పిళ్ళై తిరుమాలిరుంజోలైదాసులు, మారనేర్ నంబి,ఆళ్కొండి,

పెరియనంబిగారి శ్రీపాదముల నాశ్రయించినవారు—శ్రీరామానుజులవారు, మలైకునియనిన్ఱార్, ఆర్య శ్రీశఠగోపదాసులు, అణియరంగత్తముతనార్, తిరువాయ్ కులముడైయాన్, భట్టర్, తిరుక్కచ్చినంబి.

వీరిలో శ్రీరామానుజులవారు తిరుక్కోట్టియూర్ నంబిగారి సన్నిధిని రహస్యార్థముల నధిగమించిరి. తిరుమాలైయాం

డానుగారి సన్నిధిని తిరువాయ్ మొళియర్థమును తెలిసికొనిరి. ఆళవందా రాళ్వానుగారి సన్నిధియందు తిరువాయ్ మొళిని అధ్యయనముచేసి స్తోత్రాది గ్రంథములయందుండు సదుపదేశములఁ దెలిసికొనిరి. తిరుమలనంబిగారి సన్నిధియందు శ్రీమద్రామాయణము కాలక్షేపము చేసిరి.

వీరు సాయించిన గ్రంథము లెవ్వియనఁగా — శ్రీభాష్యము, వేదాంతదీపము, వేదాంతసారము, వేదార్థసంగ్రహము, శ్రీగీతాభాష్యము, చిన్నగద్య, పెద్దగద్య, శ్రీవైకుంఠగద్య నిత్యమనునవి. వీరి శ్రీపాదముల నాశ్రయించిన వారినిగుఱించి వారు వారు తమతమ సంప్రదాయప్రకారము తెలిసికొనునది.

శ్లో॥ గురుంప్రకాశయేద్ధీమా౯ మంత్రంయత్నేన గోపయేత్।
అప్రకాశ ప్రకాశాభ్యాం క్షీయేతే సంపదాయుషీ॥

బుద్ధిమంతుండయినవాఁడు గురువుని ప్రకాశింపఁజేయవలయునని శాస్త్రము చెప్పుచున్నది. లోకమున నొక్కండు గురువును ప్రకాశింపఁజేయుటయు, వేఱొక్కండు అట్లు ప్రకాశింపఁజేయక పోవుటయును, వారికిఁగల గురుభక్తియొక్క తారతమ్యమును బట్టియే కదా యుండును. భగవంతుండు తన విషయమున ఎక్కువభక్తిగలవాని కోరికలన్నియును నెరవేర్చునని కఠజాబాలాది శ్రుతులవలనను సంజయాది వృత్తాంతాదులవలనను ప్రసిద్ధముగాఁ దెలిసిన విషయము. ఇట్టి భక్తిలేని వారికి ఇవ్విధమగు జ్ఞానసంపత్తు ఉండజాలదని శిష్యులయొక్క జ్ఞాన తారతమ్యమునుబట్టి తెలిసికొనవచ్చును. మిక్కిలి గుణా

ధికులయినట్టి శిష్యులకున్ను వెంటనే అధ్యాత్మవిషయములను ఉపదేశింపని ఆచార్యునికి అందువలన వానినిష్ఠకు లోపము రాదనువిషయమును *రైక్వాదులచరిత్రయందుఁ దెలియఁగలను ఉన్నంతవరకే చాలు ననుకొని యుపదేశించి నట్లయిన "శిష్యపాపం గురోరపి" (శిష్యుని పాపము గురువుకున్ను చుట్టుకొనును) అన్నట్లు ఆచార్యునికి అరిష్టముకలుగునని యెఱుంగక, ఇంద్రుని కుపదేశించినందున తానున్ను బ్రహ్మవిద్యను బొత్తుగ మరచిపోయి, తన శిష్యుండగు నారదునిఁగొని సర్వేశ్వరుండుదానిని తెలిపింపఁజేయవలసివచ్చినట్టియవస్థలోబడినట్టి చతుర్ముఖుని విషయమునఁ జూడవచ్చును. ఈపైని యుదహరించిన ప్రమాణమునందు గురువును ప్రకాశింపఁజేయనందున సంపత్తు క్షీణించుచున్నదనియు, అనధికారులకు ఉపదేశించి

---

* ఒకానొకప్పుడు జానశ్రుతియను రాజుండెను. అతండు గొప్ప అన్నప్రదాత యగుటంజేసి యతని కీర్తి భూమ్యంతరిక్షములను వ్యాపించియుండెను. ఒకదినమున రెండుహంసలు ఆకాశమార్గమునఁ బోవుచుండఁగా, వాటిలో నొక్కటి రెండవదానితో జానశ్రుతి కీర్తి వ్యాపించుటచేం గలిగిన తేజస్సును దాటుకొని పోవద్దని చెప్పఁగా నది రైక్వుని తేజస్సుకంటెను ఎక్కువ కదా ? యని యడిగెను. వీటి సంభాషణమునంతయును మేడమీదనున్నట్టి జానశ్రుతి విని రైక్వునికై తననౌకరినిపంపించి వెతకించి రైక్వుండుండు తావునుకనిపెట్టి యతనియొద్దకువెళ్లి జ్ఞానోపదేశమునకై యాశ్రయించెను. అతండు జానశ్రుతి తనజ్ఞానాధిక్యముఁ గని దుఃఖముతో వచ్చుటఁగని యధికారపూర్తి లేనందువ మూడు వాళ్లు తడవలుత్రిప్పి అటుపిమ్మట అతని కధికారపూర్తి గలిగినదని తెనకు తృప్తిగలిగినపిమ్మట జ్ఞానము నుపదేశించెనాడని యుపనిషత్తులయందు ఈ వృత్తాంతము చెప్పియున్నది.

సందున ఆయుస్సు క్షీణించుచున్నదనియును ఇట్లు ఔచిత్య
మునుబట్టియు, ప్రమాణప్రసిద్ధిని బట్టియును చెప్పియున్నది.
ఇంతియే కాని వాటిలో నొక్కొక్కదానివలననున్ను ఈ
పైరెండు ఫలములును సిద్ధించుచున్నవన్నను బాధకము లేదు.
కావున నన్నియవస్థలయందును గురుభక్తియొక్క ఫలితముగ
గురువును ప్రకాశింపఁజేయునది. విలువగల రత్నములతోఁ
గూడుకొని యున్నట్టి ఆభరణమువంటిది యగు తిరుమంత్రము
యొక్క మహిమయును, అందుఁగల నిష్ఠయున్ను చెడిపోకుండు
టకుగాను, బుద్ధిమంతుండైనట్టివాఁడు ప్రయోజనము లేనివా
టిని యాధారముగాఁగొని శిష్యులకుండవలసినట్టి లక్షణములు
పూర్తిగాలేనట్టి చపలుల చెవిని పడకుండునట్లు మంత్రమును
రహస్యముగా ననుసంధించుకొనుచు రక్షించునది. ఈకావున
గురువనఁగా పరమగురువులను సయితము అర్థము చేసికొనవ
చ్చును. గురుశబ్దము సామాన్యముగ గురువుని తెలుపునట్టిదానిని
గానును గొనవచ్చును. మంత్రశబ్దము మంత్రార్థము మొదలగు
వాటినిన్ని తెలుపునది. కావున ఈచేతనుండు ఈ రహస్యము
లను అనుసంధించుకొనునప్పుడెల్లను ప్రథమమున ఆచార్య
పరంపరను అనుసంధించుకొనునది యని శాస్త్రవిధి తెలుపు
చున్నది. ఇట్లు ఆచార్యపరంపరను అనుసంధించుకొనుట యును
నది. "సమ్యాభ్యష్య పుంశ్రీకృతో మనసా ధ్యాయేత్" అను ప్ర
మాణమునుబట్టి నిషిద్ధములైనట్టివాటిని సంభాషించి నందులకు
ప్రాయశ్చిత్తమున్ను కావచ్చును.

అట్టి గురుపరంపరానుసంధాన మెట్టిదనఁగా—

ము॥ఎన్నుయిర్ తందళిత్తవరై చ్చరణమ్పుక్కు, యానడై

వేయవర్ కురుక్కళ్ నిరై వణఙ్గి, ప్పిన్నరుళాల్ పెరుమ్బూ
దూర్ వన్దవళ్లల్ పెరియనమ్బియాళవన్దార్ మణక్కా
ల్నమ్బి, నన్నెఱియై యవర్కురైత్త వుయ్యక్కొండార్,
నాదముని శడకోపన్ శేనైనాదన్, ఇన్నముద త్తిరుమ
కళెన్ఱి మ్మున్నిట్టె మ్బెరుమా న్ఱిరువడిగళడైకిన్ఱేనే.

టీ॥ యాన్ = నేను, ఎన్నుయిర్ తందళిత్తవరై = నాలో నంతరాత్మగానుండి నాకు ప్రాణభూతుండగు పరమాత్మను గుఱించి తెలుపుటచే, నాకు ఉపకారకుండయినట్టి యాచార్యుని, శరణంపుక్కు = శరణుజొచ్చి, అడవే = క్రమముగ, అవర్ గురుక్కళ్ నిరై = వారివారి యాచార్యులకు దండము సమర్పించి, పిన్ = ఆటుపిమ్మట, అరుళాల్ పెరుమ్బూదూర్ వందవళ్లల్ = సంసారుల విషయమున నిర్హేతుక కృపవలన వారిని యుజ్జీవింపఁజేయుటకొఱకును భూతపురియం దవతరించిన పరమోదారులగు శ్రీరామానుజులవారినిన్ని, పెరియనంబి = వారి యాచార్యులగు పెరియనంబిగారిని, ఆళవందార్ = వారి యాచార్యులగు శ్రీయాళవందారులనున్ను, మణక్కాలనంబి = వారియాచార్యులగు మణక్కాలనంబినిన్ని, నన్నెఱియై అవర్కురైత్తఉయ్యక్కొండార్ = వారికి సన్మార్గములను ఉపదేశించినట్టివారగు ఉయ్యక్కొండారులనున్న, నాథముని = వారియాచార్యులగు నాథమునులనున్న, శఠగోప = వారియాచార్యులగు శ్రీనమ్మాళ్వారులను, శేనైనాథన్ = వారి యాచార్యులగు సేనైముదలియాళ్వారులనున్న, ఇన్నముతత్తిరుమకళ్ = అమృతముకంటె నెక్కువ భోగ్యురాలగుపిరాట్టినిన్ని, ఇవరై = వీరిని, మున్నిట్టు = పురషకారముగాఁగొని, ఎమ్బెరుమాన్ = సర్వేశ్వరునియొక్క, తిరువడికళై = శ్రీపాదములను, అడైకిన్ఱేనే = ఆశ్రయించినాఁడను.

తా॥ నేను నా ఆచార్యులనున్న, వారి యాచార్యులనున్న శ్రీరామానుజులవారు మొదలుగాఁగల యందరి యాచార్యులనున్న పురుషకారముగాఁగొని సర్వేశ్వరుని యాశ్రయించుచున్నాఁడను.

శ్లో॥ ఏతేమహ్యమపోఢమన్మథశరో న్మాథాయనాథాదయః
త్రయ్యంతప్రతినందనీయవివిధో దన్తాస్స్వదంతామిహ।
శ్రద్ధాతవ్యశరణ్య దమ్పతిదయా దివ్యాపగావ్యాపకా
స్స్పర్ధావిప్లవవిప్రలమ్భపదవీ వైదేశికాదేశికాః.

టీ॥ త్రయ్యంత=వేదాంతముల చేత, ప్రతినందనీయ=శ్లాఘింపఁదగిన, వివిధ = నానావిధములగు ఉదాన్తాః = ప్రవర్తనలు గలవారును, శ్రద్ధాతవ్య=విశ్వసింపఁదగినట్టివారును, శరణ్యదమ్పత్యోః=రక్షకులునగు శ్రీ శ్రియఃపతులయొక్క, దయా=దయయనెడి, దివ్యాపగా = గంగయందు, వ్యాపకాః=అవగాహించునట్టివారును, స్పర్ధా=అసూయయు, విప్లవ=అనాచారమును, విప్రలంభ=వంచనయు, పదవీ=వాటిపద్ధతిని, వైదేశికాః=ఎఱింగియుండనివారును నగు, ఏతే-ఈ, నాథాదయః= శ్రీమన్నాథమునులు మొదలగు, దేశికాః=ఆచార్యులు, అపోఢ=నివర్తించిన, మన్మథశరబాధాయ=మన్మథబాధ గలిగినట్టి, మహ్యం=నాకు, స్వదంతాం=రుచించుదురు గాక.

తా॥ వేదాంతములయందు శ్లాఘింపఁబడినట్టి వ్యాపారముగలవారును, శరణ్యులగు శ్రీ శ్రియఃపతులయొక్క దయకు పాత్రులయినట్టివారును అసూయ, అనాచారము, వంచన మొదలగు వాటి నెఱింగియుండనివారును నగు శ్రీమన్నాథమునులు మొదలగు ఆచార్యులు కామబాధరహితుండనగుటుంజేసి నాకు రుచించుదురు.

శ్లో॥ హృద్యాహృత్పద్మసింహాసనరసిక హయగ్రీవ హేషోర్మి
ఘోష క్షిప్తప్రత్యర్థిదృష్టిర్జయతి బహుగుణాపంక్తిరస్మ
ద్గురూణామ్। దిక్సంధాబద్ధజైత్ర ధ్వజపటపవన స్ఫాతిని
ర్ధూతతత్త త్సిద్ధాంతస్తోమతూలస్తబకవిగమన వ్యక్త
సద్వర్తనీకా.

టీ॥ హృత్పద్మ=హృదయకమలమనెడి, సింహాసన=సింహాసనమం దు, రసిక=ప్రీతిగలవాఁడగు, హయగ్రీవ=హయగ్రీవునియొక్క, హేషోర్మిః= అశ్వధ్వని పరంపరలయొక్క, ఘోష=కోలాహలముచేత, దూరీకృతమై న, ప్రత్యర్థి=శత్రువులయొక్క, దృప్తి=గర్వముగలదియు, దిక్=దిక్కులనే, సౌధ=మేడలయందు, ఆబద్ధ=స్థాపింపఁబడిన, జైత్ర = జయకరములగు, ధ్వజపట=ధ్వజపటములయొక్క, పవన=వాయువుయొక్క, స్ఫాతి=ఆధి క్యముచేత, నిర్ధూత=తిరస్కృతములయిన, సిద్ధాంత=సిద్ధాంతములయొక్క స్తోమ=సమూహములనే, తూలస్తబక = దూదిపింజలయొక్క, విగమ న=లేకపోవుటచే, వ్యక్త = ప్రకాశమానమైన, సద్వర్తనీ=సత్ప్రవర్తన ముగల, అస్మద్గురూణాం=మాయాచార్యులయొక్క, పఙ్క్తిః = పరంపర, జయతి=జయముతోనున్నది.

తా॥ హృదయకమలమునందు ప్రీతితో వసించునట్టి శ్రీహయగ్రీవుని కోలాహలముచేత తరమబడినట్టి శత్రువుల గర్వముగలదియు, జయధ్వజము లయొక్క గాలివలనఁ గలిగిన వాతముచేత దూరముగ కొట్టుకొనిపో బడినట్టి సిద్ధాంతములుగలదియగు మాయాచార్యుల పఙ్క్తి యనునది జయముతో వర్ధిల్లుచున్నది.

మూ॥ ఆరణనూల్వఴిచ్చెవ్వైయఴిత్తిడుమ్ హైతుకర్క్కోర్, వా
రణమాయవర్ వాదక్కదలిగళ్ మాయ్త్తపిరాన్. ఏరణికీ
ర్తియిరామానుశమునియిన్నురైశేర్, శీరణిశిన్దైయి
నోం శిన్దియోమినిత్తీవినైయే.

టీ॥ ఆరణనూల్=వేదాంతశాస్త్రముయొక్క, వఴి=మార్గముయొ క్క, చ్చెవ్వై=ఋజుత్వమును, అఴిత్తిడుమ్ = నశింపఁజేయుటకు, హైతు కర్క్కు=కారణభూతముగ కుచ్ఛితవాదము చేయువారికి, ఓర్ వారణమా మ్=అద్వితీయమైనట్టి గజమై, అవర్వాదక్కదలికళ్=వారివాదములనెడి పత్రములను, మాయ్త్తు=ఛేదించి, పిరాన్=పరమోపకారకుండగు, ఏరణి

కీర్తి=సౌందర్యవిశిష్టమగు కీర్తితో ప్రకాశించునట్టి శ్రీరామానుజులవారియొక్క, ఇన్నైశేర్=భోగ్యతమములగు శ్రీసూక్తులయొక్క పరిచయము వలన, శీర్=గుణమును, అణికై=ప్రాప్తిని, శిన్దైయునోం=మనస్సునున్న గలిగియున్నాము, ఇని=ఇఁక. తీవినైగళై=క్రూరకర్మములను శిన్దియోమ్=తలంపము.

తా॥ వేదాంతశాస్త్రమునందుఁ జెప్పియున్నట్టి సన్మార్గమును పాడుచేయునట్టి కుదృష్టులను నిరసించునట్టివారగు శ్రీరామానుజులవారియొక్క భోగ్యములగు శ్రీసూక్తులతోఁ గల పరిచయమువలన గుణమును, ప్రాప్తిని, శమదమాదియుక్తమగు మనస్సునున్న గలిగియున్నాము. ఇంక పాపములను గుఱించి చింతింపఁబని లేదు.

మూ॥ నీళవన్దిన్ఱువిదివశైయాల్ నైవొన్నియనామ్ మీళవన్నుంవినైయొడుమ్మెబ్బిన్నివిఝ్ఝన్దొఝిలా, దాళవన్దారెనవె
న్నరుళ్ తన్దువిళఙ్గియశీర్ ఆళవన్దారడియోమ్ప్పడియో
మ్॥ ఇని?యల్వఝక్కే.

టీ॥ నీళవన్దిన్ఱు = దీర్ఘకాలముగడచిపపిమ్మట, ఇన్ను=ఇప్పుడు, విధివశైయుల్=అజ్ఞాతసుకృతమువలన, నినై వొన్నియ నామ్=శేషత్వజ్ఞానముగల మేము, మీళవన్దుమ్=మరలవిషయప్రావణ్యముగలవారమై, ఇన్నుం=ఇకమీదనున్న, వినైయొడమ్మిన్ని=శరీరమునుబొంది, విఝన్దొఝిలాతు=దుఃఖపడకుండునట్లు, ఆళవందార్ కృపతో వేంచేసినట్టి వారని ప్రసిద్ధిగలవారగునట్లు అరుళ్ తన్దు=మావిషయమున కృపచేసి, విళంగియశీర్=ప్రకాశించునట్టి కీర్తిగల, ఆళవందార్=శ్రీయమునాచార్యుల వారియొక్క, అడియోం=దాసులమైనట్టి మేము, ఇని=ఇఁకమీదు అల్వఝక్కు=న్యాయవిరుద్ధములైన వాటిని, పడియోమ్=పఠింపము.

తా॥ శ్రీయామునాచార్యులవారి శ్రీపాదముల నాశ్రయించి వారికి దాసులమైనట్టి మేము కుమతులు రచియించినట్టి గ్రంథముల నెన్నటికిని చదువము.

మూ॥ కాళంవలమ్బురియన్న నత్తాదలడియవర్కు తాళం
వళఙ్గిత్తమిళ్మఱైయిన్నిశైతందవళ్లల్ । మూళుంతవ
నెఱిమూట్టియనాదమునికళలే నాళున్తొళుతెళువోన
మక్కార్ నికర్ నానిలత్తే॥ అ-సం-హా ౬

టీ॥ కాళం=విజయచిహ్నభూతమగు కాహళియును, వలమ్బురి=శంఖమున్ను, వీటిరెయొక్క, కాతల్=ధ్వనిరూపమగు భక్తినల్ కాదలడియవర్క్కు=మంచిభక్తిగల వారగుదాసులకు, అనఁగా మైత్రేయకత్తాఁ కిన్నరియకత్తాఁ అను భాగినేయులకు, తాళం=తాళశాస్త్రమును, వళంగి=ఉపదేశించి, తమిళ్మఱై=ద్రావిడవేదముయొక్క ఇన్=పరమభోగ్యమైన, ఇశై=గానప్రకారమును, మూళం=ఆదరముతో, తవనెఱి=తపోమార్గమును అనఁగా కర్మయోగమును మూట్టియ=ప్రవర్తింపజేసిన నాథముని=శ్రీమన్నాథమునులయొక్క, కళలే=శ్రీపాదములనే, నాళ్=అనుదినమును, తొళుతు=నమస్కరించి, ఎళువోమ్=ఉజ్జీవింతుము నమక్కు=ఇటువంటివారమగు మాకు, నానిలత్తే=నాల్గువిధములుగల భూమియందు, ఆర్=ఎవరు, నికర్=తుల్యులు.

తా॥ భక్తిగలదాసులకు తాళవిద్యను, గానవిద్యనున్ను ఉపదేశించి యోగమార్గమును ప్రవర్తింపఁజేసినట్టివారగు శ్రీమన్నాథమునులను ఆశ్రయించునట్టి భాగ్యముగలవారమగు మాతో యీభూలోకమునందు సమానులైనట్టి వారెవ్వరు గలరు?

గురుపరంపరాసారము

ముగిసెను.

శ్రీమతేనిగమాంతదేశికాయనమః.







# రహస్యత్రయసారము

## ఉపోద్ఘాతాధికారము

శ్లో॥ శ్రీమాన్వేంకటనాథార్యః కవితార్కికకేసరీ
వేదాంతాచార్యవర్యో మే సన్నిధత్తాం సదా హృది॥

శ్లో॥ ఆభగవత్తః ప్రథితామనఘామాచార్యసంతతిం వందే॥
మనసిమమయత్ప్రసాదాద్వసతిరహస్యత్రయస్యసారో
ఽయం॥

శ్లో॥ కర్మబ్రహ్మాత్మకే శాస్త్రే కౌతస్కుతనివర్తకాన్ ।
వందే హస్తిగిరీశస్య వీథీశోధనకింకరాన్ ॥

మూ॥ అళియమడైక్కలమెన్ఱెమ్మైయమ్బుయత్తాళ్ కణవన్ తాళి
ణైశేర్న్దెమక్కు మన్దందతకవుడైయార్ । మూళు
మిరుట్కుళ్ విళ్ఞ్ఞమయక్కోదియమూన్నినుళ్ళం నాళు
ముకక్కవింగేన మక్కోర్ విదివాయ్క్కిన్ఱదే॥ ౧

టీ॥ అమ్బుయత్తాళ్ కణవన్=లక్ష్మీదేవికిభర్తయైనట్టినారాయణుం
డు, అడైక్కలమెన్ఱు=రక్ష్యవస్తువులని తలంచి, ఎమ్మై=మమ్ములను, అళిన్
అనుగ్రహింపవలయునని, తాళిణై=అట్టిసర్వేశ్వరుని శ్రీపాదములను, శేర్
న్దు=శరణుజొచ్చి, ఎమక్కున్=మాకున్ను, అవై=ఆశ్రీపాదములురక్షకంబుల

ని, తన్ద = ఉపదేశించినవారును, తగ్గవుడైయార్ = కృపావంతులగు ఆచార్యులచే, మీళుం = వృద్ధిపొందు చున్నట్టి, ఇరుళ్ = అజ్ఞానములు, విళ్ల నశించునట్లు, మున్న = రహస్యత్రయముయొక్క, ఉళ్ళం = తాత్పర్యమును, నాళుం = అనుదినమును అనుసంధించుకొని, ఉకక్క = సంతోషించునట్లు, ఇంగే = ఈలోకముననే, నమక్కు = మాయొక్క, ఓర్ = అద్వితీయమైన, విధి = భాగ్యము, వాయ్ క్కిన్నదే = ఫలించినది.

తా॥ చిరకాలముగ సంసారములో పడియుండి శబ్దాదివిషయముల యెడల రుచిగల వారము గు మాకు యిప్పుడు భగవత్కృపవలన సదాచార్య సంబంధిముగలిగుటచే ఎల్లప్పుడును రహస్యత్రయార్థమును అనుసంధించు కొనుచు ఎక్కువసంతోషము గలిగియున్నాము.

శ్లో॥ మణివరఇవ శౌరేర్నిత్య హృద్యోప్యపి జీవః కలుషమతిర విందన్ కింకరత్వాధిరాజ్యం। విధిపరిణతిభేదా ద్వీక్షి తస్తేన కాలే।గురుపరిషదుజ్ఞం ప్రాప్యగోపాయతిస్వం॥

టీ॥ శౌరేః = శ్రీమన్నారాయనునియొక్క, మణివరఇవ = కౌస్తుభ మునివలెనే, నిత్యహృద్యోపి = నిత్యము హృదయముననుండువాడైనను, కలు షమతిః = అజ్ఞానయుక్తమగు మనస్సుకలవాఁడగు, జీవః = జీవుండు, కింకర త్వాధిరాజ్యం = తాను భగవంతునికి శేషభూతుండనను నెడివిషయమును అవిన్దన్ తెలియనివాఁడై, విధిపరిణతిభేదాత్ = కర్మము పరిపక్వముకాఁగా, కాలే = జాయమానకాలమునందు కటాక్షింపబడి, గురుపరిషదు పజ్ఞం = ఆచార్యుని కృపవలన పూర్వపుజ్ఞానము విశదపడునట్లు, స్వం = స్వస్వరూపమును, ప్రాప్య = పొంది, గోపాయతి = (తనను) రక్షించుకొనుచున్నాడు.

తా॥ జీవుండు భగవంతుని కౌస్తుభమణివలెనే పరిశుద్ధుండైనను, కర్మసంబంధమువలన తనకుఁగల సర్వజ్ఞత్వమును బోగొట్టుకొని, తాను భగ

వంతునికి శేషభూతుండననెడి జ్ఞానములేనివాఁడై యుండి, కాలాంతరమున కర్మము నశింపఁగా, జాయమానకాలమునందు భగవంతునిచే కటాక్షింపఁబడి, సదాచార్యునియాశ్రయించి, వారి కృపవలన, జ్ఞానమును లభించి, ఉపాయానుష్ఠానముచేత తనస్వరూపమును కాపాడుకొనుచున్నాడు.

శ్రియఃపతియగు సర్వేశ్వరునికి కౌస్తుభస్థానీయుండై, హృదయముననుండువాఁడును, కుమారుండనియు, పుత్రుండనియు, శిష్యుండనియు, కింకరుండనియు, శేషభూతుండనియు, దాసభూతుండనియును ఆయా శాస్త్రములయందుఁ దెలియవచ్చునట్టి జీవుండు, తనకు ప్రాప్తశేషియై నిత్యసూరినిర్వాహకుండై అవిచ్ఛిన్నమగు జ్ఞానానందముకలవాఁడై, మనకున్న లక్ష్మీదేవికిన్ని ఆనందమునుగలుఁజేయునట్టివాఁడై, ఇహలోకపరలోకములయందుండు వారికి నాయకుండైనట్టి సర్వేశ్వరుండు, "వైకుంఠేతుపరేలోకే శ్రియాసార్థం జగత్పతిః ఆస్తే" (శ్రీవైకుంఠమునందు పెరుమాళ్లు పిరాట్టితోఁగూడ వేంచేసియున్నాడ) అనియు "ఒండొడియాళ్ తిరుమకళుమ్") (మెరయునట్టి కంకణములుగల లక్ష్మీదేవియును నీవున్ను కలిసియుండఁగా) అనియును సాయించినట్లు, పెరియపిరాట్టితోఁగూడ దేదీప్యమానమై "యాఽయోధ్యేత్యపరాజితేతి విదితా నాకంపరేణస్థితా" అన్నట్లు అయోధ్యాదిశబ్దములచేఁ బేర్కొనఁబడునట్టి పరమపదమందు సహస్రస్థూణాదివాక్యములందుఁ జెప్పఁబడునట్టి తిరుమామణి మండపమునందుండు, కౌషీతకి బ్రాహ్మణాదులయందుఁ జెప్పఁబడునట్టి పర్యంకమునందు "శేనాల కుడైయామిరుండాల్ చ్చింగాసన

మామ్" (నడుచుచున్నప్పుడు గొడుగుగానగును కూర్చున్నప్పుడు సింహాసనమగును) అనియు "నివాసశయ్యాసన" అనియును సాయించినట్లు సర్వదేశ సర్వకాల సర్వావస్థోచితములగు సర్వవిధకైంకర్యములను అనేకవిధములగు శరీరములను ధరించి యనుభవించి శేషత్వమే తనకు స్వరూపంబగుటంజేసి శేషుండని పిలువఁబడునట్టి శ్రీమాదిశేషుననెడి పరుపుమీఁద వేంచేసియుండి నిత్యసూరులకు నాథుఁడై తాను అనుభవించునట్టి యానందమును సర్వాత్మలును అనుభవించి కృతార్థులు కావలెయునని హితైషిగానున్నట్టి స్థితివిబట్టి నిత్యము సర్వేశ్వరుని యనుభవించుచు అనంతమైనట్టి యానందముగల నిత్యసూరులతోఁ బాటు ఈజీవుండును స్వామికైంకర్యమునొనర్చుటకుఁదగినట్టి స్వరూపయోగ్యతతో బుట్టియుండియును, అనాదిమాయవలన మందబుద్ధిగలవాఁడై "అనేకజన్మసాహస్రీమ్ సంసారపదవీంవ్రజన్ మోహాచ్ఛ్రమం ప్రయాతోఽసౌ వాసనారేణుకుంఠితః (అనేకజన్మములుగా సంసారమునఁ బడియుండి యజ్ఞానమువలన శ్రమపడుచు అట్టిసంసారవాసనవలన బుద్ధి మందగించియుండువాఁడు) అన్నట్లు ప్రకృతియనెడి పాడుగుంటలోఁబడి అనేకజన్మములనెత్తుచు జ్ఞానప్రకాశమును బోగొట్టికొనినందున తత్త్వము విషయమునను హితమైనట్టి దానివిషయమునను సరియయిన జ్ఞానములేనివాఁడై యుండఁగా, అదెటువలెననిన,

ఒకరాజు అంతఃపురజనులతోఁగూడ వేటాడుటకై యరణ్యమునకుఁజని యున్నప్పుడు, రాజకుమారుండు ఆటలాడుటకై అరణ్యములోనికిఁబోయి దారితప్పి కిరాతులచేఁజిక్కి వారి

బిడ్డగా నెద్దియోయొక గుడిసెలో పెరిగి పెద్దవాఁడై వాఁడుతన
కు స్వాభావికముకానట్టి వేటకాండ్రవేషమును ఆరోపించుకొని
“మాతా హ్యేకా పితాహ్యేకా మమ తస్యచ పక్షిణః। అహంమునిభి
రానీతః సచానీతో గవాశనైః। అహం మునీనాంవచనంశ్రుణో
మి గవాశనానాం సవచఃశ్రుణోతి। ప్రత్యక్షమేతద్భవతాపిదృ
ష్టం సహవాసజాదోషగుణాభవంతి” (నేనున్ను ఆ పక్షియును
ఒక్క-తల్లిదండ్రికి పుట్టినవారము. అయితే నన్ను ఋషులుగొని
వచ్చినారు. వానిని కిరాతులు గొనివచ్చినారు. అందువలననేను
ఋషులసంభాషణలను వినుచున్నాను. అతండు కిరాతుల సం
భాషణలను వినుచున్నాఁడు. సహవాసమువలన దుర్గుణములు
పట్టుపడునన్నవిషయము మీకున్ను తెలిసియున్నదే) అన్నట్లు
కిరాతులగుడిసెయందుండు చిలుకవలెనే వారు మాట్లాడునట్టి
మాటలనే తానును మాట్లాడుచు, వారి గర్భవాసమునపుట్టినట్టి
వారివలెనేవారుఅవలంబించునట్టివృత్తియే తనకున్నవృత్తియై
తనజన్మము కనుగుణంబులగు భోగములవిషయమునను సంబం
ధము లేక, రాజభోగవిరుద్ధములగు నీచవిషయములయందే తన
కు లాభనష్టములును సుఖదుఃఖములును గలవాఁడై తాను
రాజకుమారుండని తన జన్మవృత్తాంతము నెఱింగియున్నట్టి
కొందఱు ఋషిప్రాయులయినట్టి వారున్నను వారు తనవద్దకు
రాకూడని యవస్థలోనున్నవాఁడై, ఇట్లు భ్రాంతిమూలకమగు
కిరాతవేషముతో యావజ్జీవముప్రవర్తించినట్లయిన, రాబోవు
జన్మమునందైనను కడతేరనేరని యవస్థలోనుండి తొట్రుపడు
చుండును.

అట్లే, ఈజీవుండును దేహాత్మాభిమానాదులమూలముగ తన స్వరూపమును పోగొట్టుకొని వేఱొక్క రూపముతోనుండఁగా, ఆ రాజకుమారుని లక్షణాదులనుబట్టి వానిజన్మవృత్తాంతమునుగన్పెట్టియున్నట్టి కొందఱు ధార్మికులు యేదొకవిధమున ఈతనిని ఆదారినుండితప్పించి, అభిమానించి, ఈతండారోపించుకొనిన జాత్యంతరాభిమానమును పోగొట్టి, దృష్టాదృష్టసంస్కారముల మూలముగ ఉత్తరోత్తరభోగములకును, వాటికిగానగు సాధనానుష్ఠానముకును యోగ్యుండగువిధమున దిద్దుబాటుచేసి, ఈతనికి స్వజాత్యనుగుణములగు గుణములనున్ను నడవడికలనున్ను తమయొక్క యుపదేశంబుల మూలముగను, అనుష్ఠానముల మూలముగనున్ను, కలుగఁజేసి, ఈతనికిఁగల దుష్టములగు కిరాతాదిభోగ్యక్షుద్ర విషయములను బోగొట్టి, రాజభోగ్యములగు గొప్పగొప్ప పురుషార్థములను కోరతగినట్టి శక్తిని గలుగఁజేసి, దిద్దుబాటుచేయునట్టి విధమున, కొందఱు ధార్మికులు ఈయాత్మను తల్లితండ్రులవలెనే యాదరించి, "పుమాన్నదేవోనసరోన పశుర్నచపాదపః । శరీరాకృతిభేదాస్తుభూపై... కర్మయోనయః" (ఈయాత్మ పురుషాకారముగల వాఁడు కాని దేవాకారముగలవాఁడు కాని, మనుష్యాకారముగలవాఁడు కాని పశువృక్షాద్యాకారముగలవాఁడు కాని కాడు. అయితే యీయాకారములును, శరీరాకారభేదములును కర్మనుబట్టి వచ్చినవి) అన్నట్లు ఆత్మస్వరూపమునుగుఱించిన జ్ఞానమును గలుగఁజేసి, అందుల కనుగుణములగుపురుషార్థతదుపాయములలో నన్వయించుటకు మార్గమును గలుగఁజేసి, సరమాంసభక్షకులవలెఁగాకుండ, జ్ఞానవంతులయిన వారికి ఉండి

వలసిన గుణములను ఆచారమునున్ను గలుగఁజేసి, హేయో పాదేయంబులను వివేచించి తెలుసుకొనునట్టి వానినిగా దిద్దుపాటు చేయఁగా, ఈతని బాహ్యవైలక్షణ్యమును, కొందఱు ధర్మాత్ములమూలముగ లభించినట్టి యోగ్యతనున్ను (అంతరవైలక్షణ్యమునున్ను) నేరుగ కటాక్షించి, పరమకారుణికుండైనట్టి సర్వేశ్వరునిచే ప్రేరేపింపఁబడినట్టివారై, తాము స్వయముగ కారుణికలయినట్టి కొందఱు ఆచార్యులు “ఈశ్వరస్య చ సౌహార్దమ్ యదృచ్ఛాసుకృతం తథా విష్ణోః కటాక్షమద్వేషమాభిముఖ్యంచ సాత్త్వికైః సంభాషణంషడేతానిహ్యాచార్య ప్రాప్తిహేతవః” (భగవదిచ్ఛయును, యాదృచ్ఛికసుకృతమును, భగవత్కటాక్షమును, అద్వేషమును, అభిముఖ్యమును, సాత్త్వికసంభాషణమును, ఈ యాఱును ఆచార్యప్రాప్తికి హేతువులు) అన్నట్లు, ఏదోకవిధమున రాజుకు అంతరంగులయినట్టి వారు యీరాజకుమారునితోఁ గలుసుకొని, వాని జన్మమును తెలుసుకొని, యీతనికిఁ గావలసిన ప్రియహితంబులఁ దెలియపఱచి, యేదోకవిధమున ఆరాజునకు, ఈ రాజకుమారునికిని పరస్పర సమావేశమును గలుగఁజేయునట్లు,

ఈచేతనునికిని “నాఽయం దేవోనమనుష్యోవానతిర్యక్ స్థావరోపివా జ్ఞానానందమయస్త్వాత్మా శేషోహిపరమాత్మనః” (ఈయాత్మ దేవమనుష్యస్థావరాద్యాకారుండు కాఁడు. అయితే యీతండు జ్ఞానానందమయుండును, సర్వేశ్వరునికి శేషభూతుండును) అనియు, “దాసభూతాస్స్వత స్సర్వే హ్యాత్మానః పరమాత్మనః” (స్వభావసిద్ధముగానే యీయాత్మలన్నియును సర్వేశ్వరునికి శేషభూతులు) అని యీ మొదలగు ప్రమాణ

ములయందుఁ దెలిపియున్నట్లు నిత్యవిభూతి లీలావిభూతులలో నుండువారి నొక్కరినైన్ని విడువకుండ పాలించునట్టి యేకచక్రాధిపత్యమును వహించియున్నట్టి శ్రియఃపతియగు నారాయణునితోఁగల సంబంధమును తెలిపి, ఈచేతనుండు అట్టిభగవంతుని పొందుటకై యొనర్చునట్టి సాధనానుష్ఠానమువలనఁ గలుగునట్టిఫలమును తాము పొందునట్లు తలంచి, తనకు పుట్టిన దూడవిషయమునతల్లియైనట్టి ఆవువలెనే ఈతనియెడలయొక్క వ ప్రీతిగలవారై యీాచార్యులున్న ఈయాత్మకుఁగల యజ్ఞానాన్యథాజ్ఞాన విపరీతజ్ఞానములు బొత్తుగపోవలయునని తలంచి, అందుల కుపయుక్తములగు ప్రమాణవాక్యములఁగొని, „తత్త్వేనయశ్చిదచిదీశ్వర" ఇత్యాది తావులఁ జెప్పియున్నట్లు సర్వేశ్వరునియొక్కయును, వానిచే రక్షింపఁబడునట్టి జీవరాశులు మొదలగువాటియొక్కయునుస్వరూపస్వభావసంబంధములును, ఇహలోకపరలోకసుఖములును, త్యాజ్యోపాదేయరూపములగు వీటియొక్క సాధనములును, వీటియొక్క ఫలభేదములును, మోక్షవిరోధులును ఈమొదలగు అర్థములు ముముక్షువగు ఈయాత్మచే దెలియవలసినవవిగాన, వాటినన్నింటిని వేదాంతశాస్త్రసారభూతమగు రహస్యత్రయమునందు, సర్వసిద్ధాంతములయొక్కయును సారమును గ్రహించి, సంగ్రహముగాఁ దెలుపుచున్నారు.

మూ॥ తిరువుడన్ వంద శెజ్జుమణిపోల్ తిరుమాలిదయమ్, మ
గువిడ మెన్న మలరడిశూడుమ్వకైపెఱునామ్, కరువుడన్
వందకడువినైయార్ట్రిల్ విழுందొழுకా, తరువుడనైం
దఱివారరుళ్ శెయ్యవమైందనరే॥ ౮

టీ॥ తిరువుడన్ = లక్ష్మీదేవితోఁగూడ, వన్ద = అమృతమథనకాలమున ఉత్పన్నమైనట్టి, శెళ్ళుమణిపోల్ = శ్లాఘ్యమైనట్టిమణియగు కౌస్తుభమునందువలెనే, తిరుమాల్ = లక్ష్మీదేవివిషయమున వ్యామోహముగల సర్వేశ్వరుని యొక్క, ఇదయం = హృదయము, మరువిడమెన్న = వాసస్థానమగునట్లు, మలరడిశూడుమ్ = భగవత్పాదపద్మములచేనలంకరింపఁబడిన. వకై = విధమును, పెఱ = ఎఱింగియున్నట్టి, నామ్ = మనము, కరువుడన్ = పుట్టుకతోఁగూడ, వంద = వచ్చిన. కడువినై = తీవ్రపాపములనెడి, ఆర్ఱిల్ = నదిలోఁ కుఱ్ఱుంగు = పడి, ఉళలాదు = కొట్టుకొనిపోకుండునట్లు, అరువుడన్ = సూక్ష్మమైన శేషశేషిభావసంబంధముతోఁగూడ, ఐందు = అర్థపంచకమును, అఱివార్ = తెలిసికొనినట్టివారమై, అరుళ్ శెయ్య = కటాక్షింపఁబడుటకు, అమైందనరే = తగియున్నారము.

తా॥ కౌస్తుభమునువలెనే లక్ష్మీదేవిని ప్రేమించుచున్నట్టి సర్వేశ్వరుని శ్రీపాదములను శిరసావహించునట్టి మనము అనాదిగావచ్చుచున్నట్టి పాపరూపమగు సంసారములోఁపడకుండ సూక్ష్మమైనట్టి శేషశేషిభావసంబంధముతోఁగూడ నర్థపంచకమును గుర్తెఱింగియున్నవారమై సర్వేశ్వరుని కటాక్షమునకు పాత్రులమగుదుము గాక.

శ్లో॥ కర్మావిద్యాదిచక్రే ప్రతిపురుషమిహానాదిచిత్రప్రవాహే।
తత్తత్కాలేవిపక్తిర్భవతిహివివిధాసర్వసిద్ధాంతసిద్ధా।
తల్లబ్ధస్వావకాశప్రథమగురుకృపాగ్రహ్యమాణఃకదాచిత్।
ముక్తైశ్వర్యాంతసమ్పన్నిధిరపిభవితా కశ్చిదిత్థంవిపశ్చిత్॥

టీ॥ ఇహ = ఈలోకమునందు ప్రతిపురుషం = ప్రతిపురుషునికి, అనాదిచిత్రప్రవాహే = నానావిధసుఖదుఃఖములనుగలుగఁజేయునట్టికర్మావిద్యాదిచక్రే = కర్మ, అవిద్యారుచి, వాసనాదిరూపమగు సంసారచక్రమునందు త

త్తత్కాలే=ఆయాకాలములయందు, వివిధా=నానావిధములుగల, విపత్తిః ఆపత్తుగలుగుటయనునది, సర్వసిద్ధాంతసిద్ధా=అన్ని సిద్ధాంతములవారును అంగీకరించినదే కదా! తల్లబ్ధస్యావకాశ = అట్టివిపత్తుయొక్క పరిపాకము చేత అవకాశముగలుగుటచే, ప్రథమగురు కృపాగ్రాహ్యమాణః=ప్రథమ గురువగు భగవంతునిచే కటాక్షింపఁబడినట్టి, విపశ్చిత్=జ్ఞానియైనట్టివాఁడు, ఇత్థం=ఇవ్విధముగ ముక్త్యైశ్వర్యాంత సమృద్ధిరపి=ముక్త్యైశ్వర్యపర్యంత సమృద్ధిరూపమగునిధి గలవాఁడుగాను, కదాచిత్=ఒకప్పుడు, భవితా= కాఁగలఁడు.

తా॥ ప్రతిపురుషునికిని నానావిధ సుఖదుఃఖములకు హేతుభూతము గు ఈ యజ్ఞానరూపమగు సంసారసముద్రమునందు ఆయాకాలములయందు ఏదోయొకవి పత్తికలుగుచుండుననియుండఁటను అంగీకరించిన విషయమే. కావున, ఈలోగా అట్టివిపత్తులు మూగియుంటచే నవకాశము గలిగినందున భగవంతునిచే కటాక్షింపఁబడినట్టి జ్ఞానవంతుఁడు ఇవ్విధము గానే క్రమముగ ముక్త్యైశ్వర్యముగలవాఁడును కాఁగలఁడు.

శ్రీనిగమాంతదేశిక విరచితమగు రహస్యత్రయ సారమునందు
ఉపోద్ఘాతాధికారము
ముగిసెను.



శ్రీమతే నిగమాంత దేశికాయ నమః.







# రహస్యత్రయసారము

## సారనిష్కర్షాధికారము



శ్లో॥ శ్రుతిపథవిపరీతం క్ష్వేళకల్పం శ్రుతౌచ।
ప్రకృతిపురుషభోగప్రాపకాంశోనపథ్యః।
తదిహవిబుధగుప్తంమృత్యుభీతావిచిన్వన్తు।
ఉపనిషదమృతాబ్ధే రుత్తమంసారమార్యాః॥

టీ॥ శ్రుతిపథ విపరీతం=వేదశాస్త్ర నిషిద్ధములైనట్టి కర్మంబుల నాచరించుట, క్ష్వేళకల్పమ్=విషభక్షణమువంటిది. ప్రకృతిపురుషభోగ ప్రాపకాంశః=ప్రకృతి=ప్రకృత్యనుభవమునుగుఱించిగాని, పురుషభోగ= ఆత్మానుభవరూపకైవల్యమును గుఱించిగాని,సాధనాంశః=సాధనానుష్ఠానమును తెలుపునట్టి విషయము, పథ్యః=హితకరమైనది, న=కాదు. తత్= అందువలన, ఇహ=ఈలోకమునందుండువారును, మృత్యుభీతాః =సంసారమునుండి భయపడునట్టి, ఆర్యాః=ముముక్షువులు, విబుధగుప్తం=జ్ఞానులచే రహస్యముగానుంచి కాపాడుకొనివచ్చినదియు,ఉపనిషదమృతాబ్ధేః=ఉపనిషత్తులనెడి క్షీరాబ్ధినుండి గొనబడిన, ఉత్తమం=శ్రేష్ఠమైన, సారం=సారభూతమైనట్టియర్థమును విచిన్వన్తు=తెలుసుకొనుటకై పాటుపడుదురుగాక.

తా॥ వేదశాస్త్రవిరుద్ధములగు కర్మముల ననుష్ఠించుట విషభక్షణము వంటిదనియును, సంసారభోగమును గాని కైవల్యానుభవమును గాని

గలుగఁజేయునట్టి సాధనములనవలంబించుటయును ఇవి యెంతమాత్రము హితకరములు కావనియును ఎఱింగి సంసారమునుండి భయపడి భగవదను భవముఁగోరునట్టి ముముక్షువులు ఉపనిషత్తులనెడి క్షీరసముద్రమునుండి యెత్తబడినట్టి యమృతమా! యనఁబడునట్టి సారభూతములగు అర్థములను తెలిసికొని తదనుష్ఠానమునఁ బ్రవర్తించుదురు గాక.

ఈ మూఁడు రహస్యములలో తిరుమంత్రము ‘‘సర్వ వస్త్వాత్మకాంతస్థం’’ అన్నట్లు తన యర్థమును తెలిసికొనినంత మాత్రమున అన్ని యర్థములును తమంతనే తెలియునట్లు చేయునట్టిది యగుటం జేసియు, చరమశ్లోకము ‘‘సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణంవ్రజ’’ అని తెలుపఁబడునట్టియుపాయ భూతుండగు సర్వేశ్వరునొక్కనిని శరణుజొచ్చిన మాత్రమున తక్కిన యుపాయంబుల నన్నింటిని యనుష్ఠించుట వలనఁ గలుగునట్టి ఫలంబులన్నియును సిద్ధించునని స్థాపించుటం జేసియు, ద్వయము కరద్రశుత్యాదులయందుఁ జెప్పియున్నట్లు తనను ఒక్కతడవయుచ్చరించినవానిని అన్నివిధములనుకృతార్థునిగాఁ జేయునట్టి వైభవము గలదియైనందునను ఈ మూఁడు రహస్యములును ముముక్షువులచే మిక్కిలి యాదరింపవలసినవి.

‘‘అసారమల్పసారంచ సారం సారతరం త్యజేత్ భజేత్సార తమం శాస్త్రే రత్నాకర ఇవామృతం’’ (బొత్తుగసారములేనివాటిని న్ని, కొంచముసారములయిన వాటినిన్ని, సామాన్యముగ సారభూతములయినవాటినిన్ని, వాటికంటెను కొంచము యెక్కువ సారభూతములయిన వాటినిన్ని, వాటికంటెను కొంచెముయెక్కువ సారభూతములయిన వాటినిన్ని విడిచిపెట్టి, అన్నింటికంటెను ఎక్కువసారభూతమగు అర్థమును క్షీర

సముద్రమునుండి యమృతముఁగొనినట్లు, శాస్త్రమునుండి (గ్రహించునది) అన్నట్లు పరమపురుషార్థమగు మోక్షమున్ను తత్సాధనానుష్ఠానమున్ను ప్రత్యక్షాది ప్రమాణముల మూలము గాఁ దెలియవచ్చునట్టివి కానందున, వాటిని «శాస్త్రైర్ద్వేద్మి జనార్దనం తస్మాచ్ఛాస్త్రం ప్రమాణంతే కార్యాకార్యవ్యవస్థితౌ। శబ్దబ్రహ్మణినిష్ణాతః పరబ్రహ్మాధిగచ్ఛతి'' (శాస్త్రము నుండియే సర్వేశ్వరుని తెలియుఁదగను. కావున ఇది చేయవచ్చును ఇది చేయకూడదు అను వాటిని నిష్కర్షించుటలో శాస్త్రమే సాధనము. శాస్త్రమునందు విశ్వాసముకలవాఁడు పరబ్రహ్మమును బొందుచున్నాఁడు) అని చెప్పియున్నందున శాస్త్రమేప్రమాణము. ఇందులోను, «అనంతపారం బహువేదితవ్యం అల్పశ్చకాలో బహవశ్చవిఘ్నాః యత్సారభూతంతదు పాదదీత హంసో యథాక్షీరమివాంబుమిశ్రం'' (శాస్త్రము న్నన్నో అంతులేనిది. దానినుండి తెలియనలసినదిన్ని మిక్కుట ముగానున్నది. జీవితకాలమో కొంచము. విఘ్నములో అనేకములు. కాఁబట్టి హంసజలమునుండిపాలను వేఱుపఱచి త్రాగున ట్లు మనము ఆ శాస్త్రములలోనున్న సారతమమైనట్టి దానిని గ్రహింపవలయును)అను శ్లోకమునందు «సారతమం''అను పదముచేఁ దెలుపఁబడినట్టి యర్థమె గ్రహింపవలసినది.

అది యెట్లనిన, వేదబాహ్యులగు కుదృష్టుల శాస్త్రములు బొత్తుగసారము లేనివి యగుటంజేసి యవి యుపాదేయంబులు కావు. వేదములలోనున్న పూర్వభాగమున ఐహికఫలసాధనములగు కర్మంబులను దెలుపునట్టియంశము అల్పసారంబైనందున నది యుపాదేయము కాదు. అందులోను పారలౌకికములగు

స్వర్గాదిఫలంబులు ఐహికఫలంబులగాంబెనున్న ఉత్కృష్టము లైనందున కొందఱు వాటిని సారభూతములయినట్టి వాటిని గాఁదలంచినను, అవి దుఃఖమూలకము లగుటంజేసి యుపాదే యంబులు కావు. ఆత్మనున్ను ఆత్మానుభవరూపమగు కైవల్యము నున్ను తెలుపునట్టి శాస్త్రభాగము పైవాటిని యతిశయించి నది యైనందున సారతరంబైనను, అన్నింటిని యతిశయించి నదియగు పరమాత్మానుభవముఁ గోరునట్టి వారికి అదియుం త యుపాదేయంబు కాదు. పరమాత్మయొక్క స్వరూపము నున్ను వానిని బొందింపఁజేయునట్టి సాధనానుష్ఠానమునున్ను తెలుపునట్టి శాస్త్రభాగము సారతమ మగుటచే వివేకవంతుల లయిన వారి కది యుపాదేయము.

అందులోను ప్రతిసిద్ధాంతమునను ప్రధానములగు అర్థ ములను సంగ్రహముగాఁ దెలుపునట్టివి యైనందున యీ మూఁడు రహస్యములును మిక్కిలి సారతమంబులని చెప్పఁద గును. కావున “ బహుభ్యశ్చ మహద్భ్యశ్చ శాస్త్రేభ్యోమతి మాన్నరః సర్వతస్సారమాదద్యాత్ । పుష్పేభ్యఇవషట్పదః” (బుద్ధిమంతుడగు మనుజుండు తుమ్మెద అనేకములగు పుష్ప ములనుండి సారతమంబగు మకరందమును పానముచేయు చం దంబున, అనేకములును, విస్తారములునగు శాస్త్రములలో నన్ని తావులనుండి సారతమంబగు అర్థమును గ్రహించునది) అన్నట్లు, రహస్యత్రయమున్ను ముముక్షువగు ఈ యాత్మకు మిక్కిలి యుపాదేయంబు కాఁగలదు.

మూ ॥ అమైయావివై యెనన్న మాశైయినాలరుమాన్నులకిల్, శు
మై యానకల్వికళ్ శూళవన్దాలుంతొకణినై, యెన్నిమై

యూవిమైయవరేత్తియ వెట్టిరణ్డేణ్ణియనమ్, శమైశరి
యర్ శదిర్క్కుంతనినిలై తందనరే॥ అ-సం-పా ౯

టీ॥ ఇవై = ఈవిద్యలు, అమైయాశు = చాలవు, ఎన్న = అనెడి, ఆశై యినాల్ = ఆశవలన అభ్యసింపఁబడునట్టి, ఊలకిల్ = లోకప్రసిద్ధములగు, ఆరుమూన్ఱు = అష్టాదశవిద్యలును, శుమైయాన = భారభూతములు, కల్వికళ్ = ఈవిద్యలు, శూఴ్ = పూర్తిగా, వందాలుం = వచ్చినప్పటికిన్ని, ఇవై = ఇవి, తొకై = లెక్కకుమాత్రమే, ఎన్న = అని, నిశ్చయించుకొని, యిమైయా = నిమేషగహితులగు, ఇమైయవర్ = దేవతలు, అనఁగా నిత్యసూరులు, ఏత్తియ = స్తుతించినట్టి, ఎట్టు = అష్టాక్షరాత్మకమగు తిరుమంత్రమును, ఇరండు = ద్వయమును, చరమశ్లోకమునున్ను, ఎణ్ణియ = పరిశీలించుచున్నట్టి, నమ్ = మాకు, శమయాశరియర్ = సిద్ధాంతప్రవర్తకులగు పూర్వాచార్యులు, శతిర్ = సామర్థ్యమును, శతిర్క్కుం = సామర్థ్యపాదకమగు, తఙ్ = తమయొక్క, తని = అద్వితీయమైన, నిలై = స్వభావమును, తందనరే = ఒసంగినారు

తా॥ ఆశతో నభ్యసింపఁబడునట్టి యష్టాదశవిద్యలును భారభూతము లనియు, ఒకవేళ అభ్యసించినను, అవి లెక్కకుమాత్రమే యనియును నిశ్చయించుకొని, నిత్యసూరులచే స్తుతింపఁబడునట్టి రహస్యత్రయమును పరిశీలించుచున్నట్టి మాకు సిద్ధాంత ప్రవర్తకులగు పూర్వాచార్యులు తమకుఁగల తెలివితేటలను కృపచేయుదురు గాక!

శ్లో॥ శాఖానాముపరిస్థితేన మనునా మూలేనలబ్ధాత్మక ।
స్సత్తాహేతుసకృజ్జపేన సకలం కాలంద్వయేనక్షిపన్ ।
వేదోత్తంసవిహార సారథిదయాగుంభేనవిస్రంభిత ।
స్సారజ్ఞోయదికశ్చిదస్తి భువనేనాథస్సయూథస్సనః ॥

టీ॥ శాఖానాముపరిస్థితేన = "ఓమిత్యగ్రేవ్యాహరేత్" అను తాపన వేదాంతమునఁ జెప్పఁబడినదియగు, మూలేనమనునా = మూలమంత్రముచేత

లబ్ధాత్మకః = ఆత్మ యాథాత్మ్యము నెఱింగినవాఁడై, సత్తాహేతుసకృజ్జపేన=సత్తారూపమగు భగవదను సంధానమునకు విచ్ఛేదము కలుగకుండఁ జేయునట్టి హేతువగుటంజేసి యనుసంధింపఁబడునట్టి ద్వయముతో, సకలంకాలం= (నిత్యనైమిత్తికములకు ఆటంకము గాకుండు) కాలమునంతయును, క్షిపన్ = గడుపుచు, వేదోత్తంసవిహారసారథి దయాగుంఫేన వేదోత్తంస=వేదముల కలంకారభూతుండును,విహారసారథి=విహారార్థము సారథిగానున్నట్టి శ్రీకృష్ణునియొక్క, దయాగుంఫేన=కృపవలన చెప్పఁబడినట్టి చరమశ్లోకముచే, విజృంభితః = విశ్వాసము కలుగఁజేయంబడినట్టి, సారజ్ఞః= సారభూతంబగు శరణాగతిని గుర్తెఱింగియున్నట్టివాఁడు, భువనే=ఈలోకమునందు, కశ్చిత్ = ఒకానొకండు, అస్తియది=ఉన్నట్లయిన, సః=అట్టి మహానుభావుండు, నః=మాకు, యూథః=స్వామి.

తా॥ తిరుమంత్రమువలన స్వస్వరూప పరస్వరూపముల నెఱింగి యెల్లప్పుడును ద్వయమును అనుసంధించుకొనుచు, చరమశ్లోకముచేఁ దెలుపఁబడినట్టి శరణాగతిని గుర్తెఱింగినవాఁ డెవ్వండైన, ఈభూలోకమునం దుండెనేని, అతండే మాకు నాథుండు.

రహస్యత్రయ సారమునందు

సారనిష్కర్షాధికారము

ముగిసెను.



శ్రీమతే నిగమాంతదేశికాయ నమః







# రహస్యత్రయసారము

## ప్రధానప్రతితన్త్రాధికారము.

శ్లో॥ ఆధేయత్వప్రభృతినియమైరాదికర్తుశ్శరీరం ।
సత్తాస్థేమప్రయతనఫలేష్వేతదాయత్తమేతత్ ।
విశ్వం పశ్యన్నితి భగవతి వ్యాపకాదర్శదృష్టే ।
గంభీరాణామకృతకగిరాంగాహతే చిత్తవృత్తిం ॥ ౧౦

టీ॥ ఆధేయత్వప్రభృతి నియమైః = ఆధేయత్వ, విధేయత్వ, శేషత్వనియామములచే, ఆదికర్తుః = బ్రహ్మరుద్రాదులనున్ను సృజించినట్టివాఁడగు సర్వేశ్వరునియొక్క, శరీరం = శరీరముగాను వ్యవహరింపఁబడునట్టిదనియును, సత్తాస్థేమ ప్రయతనఫలేషు = సత్తా=స్వరూపప్రాప్తి విషయమునను, స్థేమ= స్థితివిషయమునను, ప్రయతన=ప్రవృత్తివిషయమునను, ఫలేషు=ప్రయోజనము విషయమునను, ఏతదాయత్తం = భగవదధీనమైనదనియును, ఏతత్=మనకు ప్రత్యక్షముగాఁ దెలియవచ్చునట్టి, విశ్వం=చేతనాచేతనాత్మకమగు సమస్తప్రపంచమును, పశ్యన్ = మూలమంత్రమువలనఁ దెలిసికొనుచు, వ్యాపకాదర్శదృష్టే=భగవంతుని వ్యాపకత్వమును స్పష్టముగాఁ దెలుపునట్టి మూలమంత్రమునఁ దెలియవచ్చునట్టి, భగవతి=భగవంతుని విషయమున, గంభీరాణామ్ = గ్రహించుటకు కష్టములయినట్టి, అకృతకగిరాం = వేదాంతములయొక్క (యర్థమును) చిత్తవృత్తింగాహతే=నిశ్చయించి తెలుసుకొనుచున్నాడు.

తా॥ ఈ సమస్తప్రపంచమును ఆధేయత్వ, విధేయత్వ, శేషత్వాదు లమూలముగ సర్వేశ్వరునికి శరీరభూతమై, తనయొక్క స్వరూప స్థితి ప్రవృత్తులను, భగవదధీనములయినట్టివిగాను గలిగియున్నదని మూలమంత్ర మువలనఁ దెలిసికొనినట్టివాఁడు సర్వవేదాంతములును, సర్వశబ్దములచేత నున్ను సర్వేశ్వరునే తెలుపుచున్నవని నిశ్చయించుకొనునది.

ప్రతితంత్రమనఁగా—తక్కినసిద్ధాంతులెవ్వరును ఒప్పుకొనక, తనయొక్క సిద్ధాంతమునందే యొప్పుకొనబడినట్టిదియగు నొక యర్థము. వేదాంతులమగు మనయొక్క సిద్ధాంతమునందే యుండునదియై ప్రధానంబైనట్టి యర్థం బెద్దియంటివేని,యది చేతనాచేతనపదార్థములకు రెంటికిన్ని, సర్వేశ్వరునికిన్ని గల శరీరాత్మభావ సంబంధాదులు. అందులో ఈశ్వరునికిఁగల శరీరిత్వమనఁగా—చేతనాచేతన పదార్థములకు నియతముగ ధారకుండైయ్యును, నియంతయైయ్యును శేషియైయ్యు నుండుట. అందులో చేతనాచేతన పదార్థములు శరీరముగానుండుట యనఁగా—నియతముగ ఈశ్వరునిచే ధరింపఁబడినవైయ్యును, నియమింపఁబడినవైయ్యును, శేషభూతములగు వస్తువులయ్యును నుండుట. చేతనాచేతనములకు ధారకుండుగాను, నియామకుండుగాను నుండుట యనఁగా— తన స్వరూపమువలననున్ను, సంకల్పమువలననున్ను, వాటికిఁ దగినట్లు వాటివాటి సత్తను, స్థితిని, ప్రవృత్తినిన్ని గలుఁజేయునట్టి వాఁడుగా నుండుట.

అది యెట్లనిన, సర్వేశ్వరుండు తన స్వరూప నిరూపక ధర్మంబులకును నిరూపిత స్వరూపవిశేషణంబులగు గుణంబు

లకును తానే యాధారభూతుండుగానుండునట్లు తక్కిన పదార్థంబులకన్నింటికిని నేరుగ తానే ఆధారభూతుండుగా నుండుట. ఆయాపదార్థముల నాశ్రయించి యుండునట్టి గుణంబులకున్ను ఆయాపదార్థములద్వారా ఆధారభూతుండుగా నుండును. జీవులు ధరించియున్నట్టి శరీరంబులకు ఆజీవుల ద్వారాగానే యాధార భూతుండుగానుండునని కొందఱు ఆచార్యులు చెప్పుదురు జీవుని మూలముగానును, తానే నేరుగానున్ను ఆధారభూతుండుగా నుండునని మరికొందఱు ఆచార్యులు చెప్పుదురు.

ఇట్లుఅంతయును సర్వేశ్వరుని స్వరూపమునుండి వేఱుగా నుండనిదియై వానిగుణముగానుండుటంజేసి దీనియొక్క యునికి పట్టు దీనికాశ్రయమైనట్టివాని (సర్వేశ్వరుని) యునికిపట్టును ఆధారముగాఁగొనియుండును. అన్నివస్తువులయొక్కయును సత్తయనునది సర్వేశ్వరుని సంకల్పము కధీనముగా నుండుట యనఁగా—అనిత్యములగుపదార్థములు అనిత్యములుగా నుండవల యుననెడి వానియిచ్ఛవలన నుత్పన్నములయియుండుటయును, నిత్యములగుపదార్థములునిత్యములుగా నుండవలయుననెడివాని యిచ్ఛవలన నట్టివిగా నుండుటయునని యెఱుంగునది. ఈయర్థ మును "ఇచ్ఛాత ఏవ తవ విశ్వ పదార్థసత్తా" అను శ్లోకమున తత్వవేత్తలగు మనపూర్వాచార్యులు తెలిపియున్నారు. కావున సర్వ పదార్థములయొక్కయును సత్తానువృత్తి (continuous existance) రూపమగు స్థితియును ఈశ్వరుని యిచ్ఛకధీన ముగా నుండుటంజేసి సర్వమున్ను ఈశ్వర సంకల్పాధీనంబని చెప్పఁబడినది.

రహస్యత్రయ సారము.

గొప్పగొప్ప పదార్థములు ఈశ్వరుని సంకల్పమువల ననే అవి యవి వాటి వాటి తావులను విడువక స్థిరముగా నున్నవని శాస్త్రము చెప్పుచున్నది. అదియెట్లనిన, "ద్యౌస్స చంద్రార్క నక్షత్రాఖం దిశోభూర్మహోదధిః వాసుదేవస్య వీర్యేణ విధృతాని మహాత్మనః" (ద్యులోకము, చంద్రుండు, సూర్యుండు, నక్షత్రములు, ఆకాశము, దిక్కులు, భూమి, సముద్రము ఇవి మహాత్ముండగు వాసుదేవునియొక్క వీర్యము వలన ధరింపంబడి యున్నవి. ఇట్లు తమతమ తావులను విడువకుండ, వాటిని పట్టుకొనియుండుటచే నందుమూలముగ భగవంతునియిచ్ఛ కధీనములగు స్థితిప్రవృత్తులంగలిగియున్నట్టి యీ వస్తువులకు పరమాత్మయొక్క స్వరూపంబేమిచేయుచున్నదనంగా, పరమాత్మయొక్క యిచ్ఛయనునది యీవస్తువులనుపరమాత్మయొక్క స్వరూపములోనుండునట్లుచేయును ఇట్లు సమస్త పదార్థములును సర్వేశ్వరుని స్వరూపము నాశ్రయించి నవియై యీశ్వరుని యిచ్ఛ కధీనములై యుండును. లోకమునందును శరీరము శరీరి(ఆత్మ) యొక్క స్వరూపము నాశ్రయించియుండునట్టిదై వాని యిచ్ఛకధీనములోనుండునట్లు చూచుచున్నాము కదా, అది యెట్లనిన, శరీరము జీవుండున్నంతవరకు బాగుగానుండి జీవుండు దీనిని విడిచినతోడనే శిథిలంబగుటనుబట్టి యది జీవుని స్వరూపము నాశ్రయించి యుండునది యగుచున్నది, ఈ విషయము సంకల్పాదు లెవ్వియును లేనట్టి సుషుప్త్యాద్యవస్థలయందుం దెలిసికొనవచ్చును. జాగరాది దశలయందు సంకల్పమువలన శరీరము శిథిలము కాకుండ యుండుటనుబట్టి యప్పు డది సంకల్పమును ఆశ్రయించియుండునది గాను చెప్పంబడుచున్నది. ఇందులో స్వరూపము నాశ్రయించి

యుండుట ఆధేయత్వమనియు. సంకల్పాధీనముగా నుండుట
నియామ్యత్వమనియును చెప్పఁబడుచున్నవి.

ఈశ్వరుండు సర్వశేషి యగుట యనఁగా— "ఉపా
దత్తేసత్తాస్థితి నియమనా ద్యైశ్చిదచితౌ సముద్దిశ్యశ్రీమాం ఇతి
వదతివాగౌపనిషదీ! ఉపాయోపేయ త్వేతదిహ తవతత్త్వం
నతుగుణాః అతస్త్వాం శ్రీరంగేశయ శరణమవ్యాజ మభజం"
(ఓ రంగనాథ! సత్తా స్థితి నియమనాదుల మూలముగ నీవు
చేత నాచేతన పదార్థములను నీలో నుంచుకొని యున్నావు
అందువలన శ్రుతివాక్యములనిన్ను "శ్రీమాన్" అని పేర్కొనుచు
చున్నది. కావున ఉపాయోపేయములుగా నుండుట నీయొ
క్క స్వరూపమే; కాని యది నీయొక్క గుణము కాదు. కావున
నే స్వాభావికముగా నిన్ను శరణు జొచ్చినాడను) అన్నట్లు
సర్వేశ్వరుండు పరులకుగాను యేర్పడియుండునట్టి (పరతంత్ర
ములగు) చేతనాచేతన పదార్థములను స్వప్రయోజనము
గాను తనలోనుంచుకొని వీటిమూలముగా నొక యతిశయ
ముగల వాఁడయినాఁడు.

ఈ యాధారాధేయరూపములగు స్థితులవలన
ఈచేతనునికి ఫలించునది యెద్దియనఁగా, ఆధారాధేయభావ
మువలన సర్వేశ్వరునియొక్క జ్ఞానశక్త్యాదులవలెనే వానినుం
డి వేఱుగానుండక, వానితోఁ జేరియేయుండుట యనెడిస్వరూ
పము సిద్ధించుటయును, శేషశేషిభావమువలన ఆత్మాభిమానా
నుగుణమగుపురుషార్థము వాస్తవముగానుండవలసిన విధమున
స్వరూపానురూపమగుపురుషార్థమువిషయమునఁ బ్రీతియును,
శేషశేషి భావమువలనను, నియన్తృనియామ్య భావమువల

ననున్న స్వరూపానురూపమగు పురుషార్థమునకు అనుగుణమై వేఱొక్కదాని సహాయము నపేక్షింపని యుపాయము యొక్క స్వరూపము నెఱింగియుండుటయును ఫలించును.

కావున ఈ పైని చెప్పిన దానివలన ఈ చేతనుండు వేఱొక్కయాధారము లేనివాఁడనియు, అనన్య ప్రయోజనుండనియు, అనన్య శరణుండనియును సిద్ధమగుచున్నది.

ఈ యర్థము తిరుమంత్రమువలనఁ దెలియవచ్చుటయెట్లంటివేని, నారాయణ శబ్దము నందలి * తత్పురుష బహువ్రీహి సమాసములరెంటివలనఁ దెలియవచ్చునట్టి ధారకత్వ వ్యాపకత్వాదులవలన అనన్యాధారత్వాది విశిష్టమగు స్వరూపము తెలియవచ్చును. పారార్థ్య (పరుని యుపయోగముకైయుండుట) పారతంత్ర్యములను తెలుపునట్టివై దాని యందుండు మొదటిరెండు పదముల చేతను (ఓమ్ నమఃఅను వాటిచేత) అనన్య ప్రయోజనత్వమును, అనన్య శరణత్వమున్ను తెలియవచ్చును.

ప్రపత్త్యనుష్ఠానముఁ దెలుపునట్టి మంత్ర రత్నము (ద్వయము) నందుండు పూర్వ ఖండమువలన అనన్య శరణత్వమును. ఉత్తర ఖండమువలన అనన్య ప్రయోజనత్వమును,

* నారాణాం అయనః= నారాయణః అనునది తత్పురుష సమాసము. నారము లనఁబడునట్టి యాత్మల కాశ్రయభూతుండని దీనియర్థము. ఇందువలన దీనిచే ధారకత్వము తెలుపఁబడుచున్నది. నారాః అయనం యస్య సః= నారాయణః అనునది బహువ్రీహి సమాసము. నారములనఁబడునట్టి యాత్మల నాశ్రయముగాఁగొని వాటిలో నంతరాత్మగా నుండువాఁడని దీనియర్థము. ఇందువలన వ్యాపకత్వము తెలుపఁబడుచున్నది.

రెండుభాగములవలనను అనన్యాధారత్వము తెలియవచ్చును. ఇవ్విధమున శబ్దమునుబట్టియును, అర్థసందర్భమును బట్టియు ను చరమశ్లోకమునను ఈ పైయర్థములఁ దెలిసికొనునది. ఇట్లు చరమశ్లోకమునందు సిద్ధోపాయమును (భగవంతుని) వశపర చుకొనుటకుగాను విధింపఁబడిన సాధ్యోపాయమును (శరణా గతిని) ద్వయానుసంధానముతో ననుష్ఠించుకొనునప్పుడు అను సంధించుకొన వలసినవిగా అవశ్యముగ కావలసినట్టి యర్థం బుల నన్నింటిని, చిన్న అద్దము పెద్దపెద్ద వస్తువులను చూపిం చునట్లు, సంగ్రహముగాను వాటి నన్నింటిని తిరుమంత్రము తె లుపఁగలదు. (1)దీనిలోని మొదటిపదముయొక్క యర్థమును అర్జునుని రథమునందును, "అగ్రతః ప్రయయౌరామః సీతామధ్యేసుమధ్యమా" అను శ్లోకమునందును చూచు కొనునది. రెండవ పదమునందు శబ్దముచేతను అర్థ స్వారస్యముచేతనున్న తెలుపఁబడునట్టి యర్థములను (2)శ్రీభర

(1) ప్రణవమునందలి మొదటిపదము ఓమ్ అనునది. దీనియందు అ, ఉ, మ్ అను మూడుపదములు క్రమముగ పరమాత్మను, పిరాట్టిని, జీవా త్మనున్న తెలుపునది. "అగ్రతః ప్రయయౌరామః సీతామధ్యేసుమధ్యమా పృష్ఠతస్తుధనుష్పాణిః లక్ష్మణోనుజగామహ" (శ్రీరాముండు ముంగు నడుచు చుండగా వానితోఁగూడ పిరాట్టి పోవుచుండెను. పిరాట్టివెనుక శ్రీలక్ష్మణ స్వామి ధనస్సును చేతనుంచుకొని వెళ్లెను) అను శ్లోకమునను న్న పరమా త్మయును, పిరాట్టియును, జీవుండును తెలుపబడినారు అర్జునరథమునంద నఁగా—శ్రీకృష్ణుని పరమాత్మనుగాను అర్జునుని జీవునిగాను వీరియుభయు లకు ఆశ్రయణీయమగు రథమును పిరాట్టిస్థానమునఁగొని యుచటనున్నవీరు మూగ్గురును తెలియవచ్చుచున్నట్లు గ్రహించునది.

(2) శ్రీరామచంద్రుండు పాదుకలనొసంగి వాటిఁగొని తాను దిరిగి వచ్చువరకును రాజ్యము చేయుచుండుమని యానతియ్యగా శ్రీభరతులవారు

తుల వారియొక్కయును శ్రీశత్రుఘ్నుల వారియొక్కయును చరిత్రములయందుఁ దెలిసికొనునది. “నానున్నైయొట్రియిలేఁ కణ్ణాయ్ నారణనే నీయెన్నైయొట్రియిలై” (ఓ నారాయణా నీవు నన్ను విడనాడి యుండలేదు నేను నిన్ను విడనాడి యుండలేను సుమీ) అన్నట్లుండునట్టి నారాయణశబ్దార్థమును, (3) కోసలదేశముననుండు జంతువులనున్ను శ్రీరామచంద్రునిన్ని యుదాహరణముగాఁగొని యెఱుంగునది. మొదటి రెండుపదముల వలనను (ప్రణవమువలనను నమః అను పదమువలనను) తెలియవచ్చునట్టి యచేతన వస్తుస్థితివంటి పారార్థ్య పారతంత్ర్యములు విశదమగునట్లు తృతీయపదమునందుండు (నారాయణాయ అను పదమునందుండు) “ఆయ”? అను చతుర్థియొక్క తాత్పర్యార్థముచే ప్రార్థనీయముగాఁ దెలియవచ్చునట్టిదియు, శేషికి మిక్కిలి ప్రియంబగు కైంకర్యమును(4) శ్రీలక్ష్మణస్వామివారి యొక్కయును వీరియొక్క యవతారంబగు శ్రీ

వారికి పరతంత్రులై యట్లే వారికై కాచుకొనియుండిరి. శ్రీశత్రుఘ్నుల వారును అట్లే శ్రీభరతులవారికి పరతంత్రులైయుండిరి. ఇట్టి పారతంత్ర్యము నమః శబ్దము తెలుపుచున్నదని భావము.

(3) శ్రీరామచంద్రుండు అరణ్యమునకుఁ బోవునప్పుడు వృక్షములు సహితము రామవిరహమును సహింపఁజాలక వాడిపోసాగినవనియు, జంతువులన్నియును మిక్కిలి విరహబాధను అనుభవించినవనియును “అపివృక్షాః పరిమ్లానాః” ఇత్యాదిగాను శ్రీరామాయణమునఁ జెప్పఁబడినది.

(4) రామచంద్రుండు అరణ్యమునకుఁ బోవునప్పుడు కూడవుండి కైంకర్యముఁజేయుటకై శ్రీలక్ష్మణస్వామివారు ప్రార్థించినందునను, శ్రీరామానుజులవారును అట్లె కైంకర్యమునకై ప్రార్థించినందున నని యెఱుంగునది.

రామానుజులవారి యొక్కయును, ఆచరణయందుఁ దెలియఁ దగును. ఇది తిరుమంత్రార్థానుసంధానమునకు అనుకూలముగా నుండునట్టి విధమున (1) శ్రీ అప్పుళ్లారను వారు సాయించిన పద్ధతి. ఈ పద్ధతి ప్రకారము ద్వయము యొక్కయును అర్థంబులనెఱుంగనది. వీటి వలనఁ దెలియ వచ్చునట్టి సర్వేశ్వరుని శేషిత్వమనునది చేతనాచేతనముల విషయమున సర్వసామాన్యముగా నుండునట్టి ధర్మంబగుటం జేసి, దానిని చేతనుల విషయమున మాత్రముండునట్టి స్వామిత్వరూపమగు విశేషమున పర్యవసించునట్టి దానినిగాఁ గొని యనుసంధించు కొనవలసియున్నది. అట్లే యాజీవునికిఁ గల శేషత్వమున్ను దాస్యరూపమగు విశేషమునపర్యవసించునట్టిదానినిగాఁగొని యనుసంధించుకొన వలసినది. వీరియందు సామాన్యముగానుండు శేషశేషిభావము ప్రణవమందలి ప్రథమాక్షరముచేఁ దెలుపఁబడునది. వీరియందు విశేషములుగా చెప్పంబడునట్టిదాసత్వస్వామిత్వములు, వీరు ఉభయులును చేతనులుగాను తెలియవచ్చుటంజేసి, యర్థాత్సిద్ధములు. ఇట్లు నారాయణ శబ్దమునను౦డు సామాన్యార్థమును విశేషార్థమునున్ను తెలియఁదగును. వీటిలో సామాన్యముగ శేషత్వమునుబట్టి యావశ్యకంబగు కించిత్కారము దాసత్వరూపమగు విశేష స్వరూపమునుబట్టి కైంకర్యరూపమగు పురుషార్థమైనది. ఇట్లు సర్వేశ్వరునికి తాను శేషియగుటం జేసివచ్చిన యతిశయము స్వామిత్వరూపమగువిశేషమువలన వానికొక పురుషార్థము గాను యేర్పడుచున్నది. చేతనులను రక్షించువిషయమున సర్వే

(1) కిడాంబి అప్పిళ్ళానువారు శ్రీవేదాంతదేశికులవారి యాచార్యులు.

శ్వరుండు అవశ్యకుండును, సమర్థుండును. జీవులందఱును వానిసంకల్పానుసారముగ ప్రవర్తింపవలసినదే. వీరు తమను తాము రక్షించుకొనుటకు ఆవశ్యకులు కాకుండుటకును, అందులకు సమర్థులు కాకుండుటకును హేతువు సర్వేశ్వరుండు నిరుపాధిక శేషియగుటయు, నిరుపాధిక నియంత యగుటయును, వీరన్ననో, నిరుపాధిక శేషభూతులగుటయు, నిరుపాధిక నియామ్యు లగుటయును. దృష్టాంతము:— ప్రతివాఁడును తాను తన వస్తువును కాపాడుకొనుటయును, సమర్థుఁడైనట్టి వాఁడు అసమర్థుండైనట్టి వానిని రక్షించుటయును స్వభావ సిద్ధము కదా।

శ్లో॥ నిఱైతంద తారకనాయ్ నియమిక్కుమిఱైవనుమాయ్ ।
ఇఱైతొన్ఱినావకైయెల్లాంతన తేనుమెన్దైయుమాయ్ ॥
తుఱైయొన్ఱిఱైయెననిన్ఱతుళాయ్ ముడియానుడమ్బాయ్ ।
పిఱైయొన్ఱినామడియోమెన్ఱు వేదియర్ మెయ్ప్పొరుళే ॥

టీ॥ నిఱై = సత్తను, తంద = ఒసంగిన, తారకనాయ్ = ధారకుండై, నియమిక్కుమ్ = నియమించునట్టి, ఇఱైవనమాయ్ = స్వామియై, ఒన్ఱు = ఒక్కటియును, ఎనతు = నాది, ఇఱై = లేకపోయి, ఎల్లాం = అంతయును, తనతెనుం = తనదని చెప్పునట్టి, ఎన్దైయుమాయ్ = నాకు తండ్రియై, ఒన్ఱు = ఒక్కటియును, తుఱై = తనతో సమానమైనది, ఇఱై = లేకుండునట్లు, నిన్ఱ = వేంచేసియున్నట్టి, తుళాయ్ముడియాన్ = తులసిమాలను కిరీటమునందు ధరించుకొనియున్నట్టి, శ్రీనివాసునియొక్క ఉడమ్బాయ్ = శరీరభూతులమై, పిఱైయిన్ఱి = వెలలేకుండ, నామ్ = మేము, అడియోమ్ = నిరుపాధిక దాసులము, ఎన్ఱు = అని, వేదియర్ = వైదికులయొక్క, మెయ్ప్పొరుళే = సత్యభూతమైనట్టి యర్థము.

తా॥ మాకు శక్తిను గలుగఁజేసి మమ్ములను ధరించి యుండువాఁడై మాకు నియామకుండగు స్వామి మేము మాదియనునది యొక్కటియును లేకుండ అంతయును వానిదే యగునట్లు వానికి మేము నిరుపాధిక దాసులమని వేదవేదాంతవేత్తలు చెప్పునది సత్యము.

శ్లో॥ యద్యేతం యతిసార్వభౌమకథితంవిద్యాదవిద్యాతమః।
ప్రత్యూషంప్రతితంత్రమంతిమయుగేకశ్చిద్వపశ్చిత్తమః॥
తత్త్రైకత్రఝడితిత్యుపైతివిలయంతత్తన్మతస్థాపనా।
హేవాకప్రథమానహైతుకకథాకల్లోలకోలాహలః॥

టీ॥ అవిద్యాతమః ప్రత్యూషం = అజ్ఞానాంధకారమునకు ప్రభాతరూపంబయినట్టియు, యతిసార్వభౌమకథితం = శ్రీరామానుజుల వారిచే ప్రకాశింపఁజేయఁబడినట్టి, ఏతం = ఈ, ప్రతితంత్రం = స్వమతసిద్ధాంతమును, అంతిమయుగే = కలియుగమునందు, కశ్చిత్ = ఎవ్వండైన నొక్కండు, విద్యాద్యది = తెలుసికొనియున్నట్లయిన. తస్మిన్ = ... = అవొక్కనియందు, తత్తన్మతస్థాపనాహేవాకేన = ఆయామతస్థాపించుట యందలి మతూహలవశమున, ప్రథమాన = వర్థిల్లుచున్నట్టి, హైతుకకథాకల్లోలకోలాహలః = వాదులయొక్క వాదరూపమగు తరంగము, ఝడితి = శీఘ్రముగ, విలయం = నాశమును, ఉపైతి = పొందుచున్నది.

తా॥ కలియుగమునందు శ్రీరామానుజులవారి సిద్ధాంతము నెఱింగియున్నట్టి వాడెవ్వండైనను ఒక్కండున్నచో, తమతమ మతములను స్థాపింపఁ బూనుకొనునట్టి వారి వారి వాదములన్నియును అంతటితో శమింపఁగలవు.

ప్రధానప్రతి తంత్రాధికారము ముగిసెను.



శ్రీమతే నిగమాంతదేశికాయ నమః.







# రహస్యత్రయసారము

## అర్థపంచకాధికారము.



శ్లో॥ ఆదౌప్రాప్యంపరమమనఘంప్రాప్తృరూపంచమాదౌ।
నిష్టోపాయత్వయననమసోరీప్సితార్థంచతుర్థ్యాం॥
తద్వ్యాఘాతంమమకృతిగిరివ్యంజయంతంమనంతం।
తత్త్వాత్రియంచద్వయమపివిదన్సమ్మతస్సర్వవేదీ॥

టీ॥ ఆదౌ = ప్రణవమునందుండు అకారమునందును, నారాయణపదమునందును, పరమం=కల్యాణగుణాకరంబును, అనఘం = దోషరహితంబును నగు, ప్రాప్యం=ప్రాప్యవస్తువగు భగవంతుని స్వరూపమును, ప్రాప్తృరూపంచ = ప్రాప్తయగు ఈ చేతనుని స్వరూపమును, మాదౌ = నమశ్శబ్దమునందును, ప్రణవమునందుండు మకారమునందును, నారపదమునందును, ఇష్టోపాయం = సిద్ధోపాయమును సాధ్యోపాయమునన్ను అనఁగా అయన నమసోః = అయన శబ్దమునందు సిద్ధోపాయమును, నమశ్శబ్దమునందు సాధ్యోపాయమును, ఈప్సితార్థం = పురుషార్థరూపమగు కైంకర్యమును, చతుర్థ్యాం = "ఆయ" అను చతుర్థియందును, తద్వ్యాఘాతం = అట్టి కైంకర్యమునకు గానగు విఘాతముయొక్క కారణమును, మమకృతిగిరి =

అహంకారవాచకమగు నః అనుపదమునందును, వ్యంజయంతం = ఇట్లు అర్థపంచకమును తెలియపఱచుచుండునట్టి, తం = ప్రసిద్ధమగు, మనుం= తిరుమంత్రమును, తత్ప్రియంచ= దాని వలె నేయర్థపంచక ప్రతిపాదకం బగు ద్వయమపి=ద్వయమునున్ను చరమ శ్లోకమునున్ను, దఙ్ = తెలిసి కొనినట్టివాఁడు, సర్వవేదీ = సర్వము నెఱింగినవాఁడుగాను, సమ్మతః= ఒప్పుకొనబడినట్టివాఁడు.

తా ॥ ప్రాప్యస్వరూపము, ప్రాప్తృస్వరూపము ఉపాయస్వ ము, ఫల స్వరూపము, విరోధి స్వరూపములనఁబడు అర్థపంచకమును తెలుపునట్టిదియగు తిరుమంత్రమును, అట్టిదియగు ద్వయమును చరమ శ్లోకమునున్ను యెఱింగినవాఁడు సర్వము నెఱింగినట్టివాఁడుగాను, పండి తులచే నొప్పుకొనఁబడినవాఁడు.

నారాయణాది శబ్దములయందు వివక్షింపఁబడినట్టి సంబంధవిశేషమును సిద్ధాంతమునకు ప్రధానముగాఁగొని దానిసిబట్టి యుండునట్టి యర్థపంచకమునుకొందఱువిచారించి నారు. ఈసంబంధముతోఁగూడ ఆరు అర్థములని కొందఱుఅను సంధించుకొని యున్నారు. ఈసంబంధమువలెనే ముముక్షువుచే విశేషముగ తెలిసికొనవలసినట్టిదిగాను అనుసంధింపఁబడునట్టి యర్థపంచకమెద్దియనఁగా—అవి "ప్రాప్యస్యబ్రహ్మణోరూపం ప్రాప్తుశ్చప్రత్యగాత్మనః। ప్రాప్త్యుపాయంఫలంచైవ తథాప్రా ప్తివిరోధిచ। వదన్తిసకలావేదా స్సేతిహాసపురాణకాః" అను తావునఁ జెప్పఁబడినట్టి ప్రాప్యమగు బ్రహ్మస్వరూపము ను, ప్రాప్తయగు ప్రత్యగాత్మస్వరూపమును, ప్రాప్తికిగానగు

ఉపాయము యొక్క స్వరూపమును ప్రాప్తియొక్క ఫలస్వరూపమును ప్రాప్తివిషయమగు విరోధియొక్క స్వరూపమనునవి. వీటిలో ప్రాప్యవస్తువగు బ్రహ్మముయొక్క స్వరూపమును, తిరుమంత్రమునందుండు మొదటి యక్షరము నందును, నారాయణ శబ్దమునందును, ద్వయమునందు "శ్రీమత్" అను విశేషణముతోఁ గూడియుండునట్టి నారాయణశబ్దము నందును, చరమ శ్లోకమునందు "మాం" "అహం" అను పదములయందును అనుసంధించుకొనునది. అనఁగా ఈ తావులయందు ప్రాప్యవస్తువగు బ్రహ్మమును అనుసంధించుకొనునప్పుడు "శ్రియా సార్థంజగత్పతిః" అనియు, ఏష నారాయణః శ్రీమాన్" అనియు, "భవాన్ నారాయణో దేవః" "శ్రీమాన్ చక్రాయుధోవిభుః" "శ్రీవత్సవక్షానిత్యశ్రీః" "విష్ణోశ్శ్రీరనపాయినీ" "సీతాసమక్షంకాకుత్స్థమిదంవచన మబ్రవీత్" "సీతామువాచాతియశా రాఘవంచమహావ్రతం" అనియు "అలమేషాపరిత్రాతుంరాఘవాద్రాక్షసీగణం" అనియు, "భవేయంశరణం హివః" అనియు "తయాసహాసీనమనంత భోగిని" అనియు, "కాంతస్తే పురుషోత్తమః" అనియు, "స్వపరిచరణ భోగైః శ్రీమతి ప్రీయమాణే" అనియు "శ్రీమతే నిర్మలానందోదన్వతే విష్ణవేనమః" "శ్రియఃకాన్తోనన్తో వర గుణగణైకాస్పదవపుః" అనియు, "బ్రహ్మణి శ్రీనివాసే" అనియు, "శ్రియఃపతిః నిఖిలహేయ ప్రత్యనీక కల్యాణైక తానంత జ్ఞానానందైక స్వరూపః" అనియు "నీయుం తిరుమకళుమ్ నిన్ఱాయాల్ ఒండొడియాళ్ తిరుమకళుమ్ నీయు

మేని లానిల్పి” అనియు “కోలత్తిను మామకళోడున్నై” అనియు “నిన్తిరు వరుళుమ్” అనియు “పంగయత్తాళ్ తిరుపరుళుమ్” అనియు “ఉన్నామత్తై మంగైయుమ్ నీయుమ్” అనియు “అకలకిల్లేనిత్తైయుమ్” అనియు “ఉణర్ ముల్రు నలం” అనియు “నందావిళక్కే యళత్తర్కణాటియాయ్” అనియును ఈ మొదలగు ప్రమాణములయందు సాయించిన విధమున సర్వవిధములను సర్వావస్థలయందును సహధర్మచారిణియగు పెరియ పిరాట్టిని ఎన్నడును విడనాడకుండయుండునట్టి సంపూర్ణానందస్వరూపంబని యనుసంధించుకొనునది. ఇట్లు “సమస్తహేయరహితం విష్ణ్వాఖ్యం పరమంపదం పరః పరాణాం సకలాన యత్ర క్లేశాదయస్సన్తిపరావరేశే” అనఁగా హేయగుణ రహితుండును, విష్ణువనఁబడు పరాత్పరునికి యెవ్విధములగు దుఃఖములును లేవు అని సాయించినట్లు హేయగుణము లెంతమాత్రములేనట్టి వానినిగానును అను సంధించుకొనునది.

“త్రైర్యుక్తః శ్రూయతాంనరః” అనియు, “తమేవం గుణ సమ్పన్నమప్రధృష్య పరాక్రమం జ్యేష్ఠం శ్రేష్ఠగుణైర్యుక్తం” అనియు “ఏవం శ్రేష్ఠగుణైర్యుక్తం” అనియు “గుణైర్విరురుచే రామః” అనియు, “బహవోతవ కల్యాణగుణాః పుత్రస్య సన్తితే। ఆనృశంస్యమనుక్రోశశ్శ్రుతం శీలందమశ్శమః। రాఘవంశోభయన్త్యేతే షడ్గుణాః పురుషోత్తమం” అనియు “విదితస్సహి ధర్మజ్ఞః శరణాగతవత్సలః” అనియు, “శరణ్యం శరణంచత్వా మాహుర్దివ్యామహర్షయః” “నివాసవృక్షస్సాధూనాం” అనియు, “తేజోబలైశ్వర్యమహా

మూలకనుగుణముగా నెఱుంగునది. అట్లే, ''జన్మాద్యస్యయతః'' అని యు ''క్రీడాహరేరిదం సర్వం క్రీడతో బాలకస్యేవ'' అనియు 'బాలః క్రీడనకైరివ' అనియు ''హరే విహరసి క్రీడాకన్తు కైరివ జన్తుభిః'' అనియు ''లోకవత్తు లీలాకైవల్యం'' అని యును సాయించినట్లు క్రీడార్థము జగత్తును సృజించునట్టి వానినిగానును అనుసంధించుకొనునది.

౫ు ఇట్లు లక్ష్మీ సహచరుండై, అపరిమితముగ జ్ఞానానంద ములు గలవాఁడై, హేయగుణములకు ప్రతిభటుండై, జ్ఞాన శక్త్యాద్యనంత మంగళగుణ విశిష్టుండై, దివ్యమంగళ విగ్ర హోపేతుండై, శరీరభూతములగు నిత్య విభూతి లీలావిభూతు లతోఁగూడి యున్నట్టివాఁడై, జగత్సృష్ట్యాది వ్యాపారములను క్రీడార్థ మొనర్చునట్టివాఁడై, ప్రాప్యవస్తువై యున్నట్టి పరబ్ర హ్మమును బొందగోరునట్టి యీజీవుండు నిత్య, ముక్త, బద్ధుల తో సమానముగా నుండునట్టి రూపమును ఉపాయాధికారి యగు తనకు ప్రస్తుతముండునట్టి విశేషరూపమునున్ను తెలిసి కొని యుండవలయును.

వీరిలో, బద్ధులనఁగా— అనాదియగు కర్మపరంపరవలన యెడతెగకుండ యుండునట్టి సంసార సంబంధము గలవారై బ్రహ్మాది స్తంబ పర్యంతముండు పదార్థములుగాను విభజింపఁ బడియున్నట్టి జీవులు.

ముక్తులనఁగా— శాస్త్రముచే విధింపఁబడినట్టి యుపా యానుష్ఠానమువలనఁ గలిగిన భగవదనుగ్రహమువలన నిరతి శయానంద యుక్తులుగా నుండువారు.

నిత్యులనఁగా— సర్వేశ్వరునివలెనే యనాదికాలముగ

జ్ఞానసంకోచములేని వారగుటంజేసి "సవయస ఇవ యే నిత్య నిర్దోషగంధాః" (ఎవ్వరు సమానవయస్కులవలెనే నిత్యనిర్దోషులై యుందురో) అనిగూడను సాధించినట్లు సంసారసంబంధమెన్నడును లేనివారై నిత్యకైంకర్యమొనర్చుచుండు నట్టి యనంత, గరుడ, విష్వక్సేనాదులు.

వీరికందఱికిన్ని సర్వసాధారణముగా నుండుచున్నట్టి రూపము—అణుత్వ, జ్ఞానత్వ, ఆనందత్వ, అమలత్వాదులును, భగవచ్ఛేషత్వ పారతంత్ర్యాదులును,

ముముక్షువగు తనకు (ఈజీవునికి) మాత్రముండునవిగాను తెలిసికొనవలసినట్టి యాకారములను ఉపోద్ఘాతమునందు యింతకుముందు చెప్పియే యున్నాము. ఇంక మీఁదనున్న ఆయాసందర్భమునఁ జెప్పినప్పుడు తెలియఁదగును.

ఈ జీవుని యొక్క స్వరూపమును ప్రణవమునందును 'నమః' అను పదము నందునున్నట్టి మకారములయందును, నారశబ్దమునందును "ప్రపద్యే" అను ఉత్తమపదక్రియాపదమునందును "వ్రజ" అను మధ్యమపదక్రియాపదమునందును "త్వా" అను పదమునందును "మాశుచః" అను వాక్యమునందును అనుసంధించుకొనునది.

భగవత్ప్రాప్తికిగానగు ఉపాయమును, దానికి సహాయకములయినవియును, అట్టి భగవత్ప్రాప్తి రూపమగు ఫలముండునట్టి విధమును యింకమీఁదు సందర్భము వచ్చినప్పుడు విశదముగాఁ దెలుపఁబడును.

వీటిలో ఉపాయమును తిరుమంత్రము నందుండు "నమః" అనుపదమునను, "అయన" శబ్దమునందును,

జ్ఞానసంకోచములేని వారగుటంజేసి "సవయసణవయే నిత్య నిర్దోషగంధా:" (ఎవ్వరు సమానవయస్కులవలెనేనిత్య నిర్దోషులై యుండువారో) అని యాగము సాధించినట్లు సంసార సంబంధమెన్నడును లేని వారై నిత్యకైంకర్య మొనర్చుచుండు నట్టి యనంత, గరుడ, విష్వక్సేనాదులు.

వీరికందఱికిన్ని సర్వసాధారణముగా నుండు కున్నట్టి రూపము—అణుత్వ, జ్ఞానత్వ, ఆనందత్వ, అమలత్వాదులును, భగవచ్ఛేషత్వ పారతంత్ర్యాకారులును,

ముముక్షువగు తనకు (ఈజీవునికి) మాత్రముండునవిగాను తెలిసికొన వలసినట్టి యాకారములను ఉపోద్ఘాతమునందు యింతకుముందు చెప్పియే యున్నాము. ఇంక మీఁదనున్న ఆయాసందర్భమునఁ జెప్పినప్పుడు తెలియఁదగును.

ఈ జీవుని యొక్క స్వరూపమును ప్రణవమునందును 'నమః' అను పదము నందునుండునట్టి మకారములయందును, నారశబ్దమునందును "ప్రపద్యే" అను ఉత్తమపదక్రియాపదమునందును "వ్రజ" అను ముఖ్యమపదక్రియాపదమునందును "త్వా" అను పదమునందును "మాశుచః" అను వాక్యము నందును అనుసంధించుకొనునది.

భగవత్ప్రాప్తికిగానగు ఉపాయమును, దానికి సహాయకములయినవియును, అట్టి భగవత్ప్రాప్తి రూపమగు ఫలముండునట్టి విధమును యింకమీఁదు సందర్భము వచ్చినప్పుడు విశదముగాఁ దెలుపఁబడును.

వీటిలో ఉపాయమును తిరుమంత్రము నందుండు "నమః" అనుపదమునను, "అయన" శబ్దమునందును,

ద్వయమందలి పూర్వఖండమునందును, చరమశ్లోకమునందు పూర్వార్థమునందును అనుసంధించుకొనునది.

ఫలస్వరూపమును చతుర్థీవిభక్త్యంతములగు పదముల యందును ద్వయమునందుండు "నమః" అనుపదమునందును "సర్వపాపేభ్యో మోక్షయిష్యామి" అను తావునను అనుసంధించుకొనునది.

భగవత్ప్రాప్తికిఁగానగు విరోధియనఁగా, అవిద్యా, కర్మ వాసనాదిరూపములగు మోక్షప్రతిబంధకములు. వాటిలో ప్రధానమైనది అనాదికాలముగ యొనర్పంబడునట్టి భగవదాజ్ఞాతిక్రమణము మూలముగఁ గలిగినదియగు భగవన్నిగ్రహము. ఇది జీవులకు జ్ఞానసంకోచకరమై సత్త్వరజస్తమోగుణాత్మకమగు ప్రకృతితో సంబంధమునుఁగలుగఁజేసియును, ప్రకృతి పరిణామరూపములగు శరీరేంద్రియాదులతోఁ జేర్చి "తిణమ్ముఱ్ఱు పల్ శెవినైవఱ్ కంయిట్ట్ ఱాల్ పుణ్ణై మఱైయవఱిందెన్నై పోక్కువాయ్ పురమే" (పాపరూపములగు త్రాళ్లతో దృఢముగాబంధించి వ్రణప్రచురమగు శరీరమును చర్మముతోఁగప్పఁబడియుండునట్లుచేసి నన్ను విషయభోగపరునిగాఁజేసినావు) అనియు "అన్నాళ్ నీతన్ద ఆక్కైయిన్ వఴి యుఴల్వేన్" (ఆదినమున నీవొసంగిన శరీరము గొనిపోయినట్లు పోవుచున్నాను) అనియును పాయించినట్లు దేహేంద్రియాదిపరతంత్రునిగాఁజేసియును, ఆయాయవస్థలయందు శాస్త్రవశ్యత కవకాశము లేనట్టి తిర్యగ్జంతువులు మొదలగు వాటి యవస్థలలోనుంచియును, శాస్త్రవశ్యత కనుకూలములగు మనుష్యజన్మములయందు వేదబాహ్యులగు కుదృష్టులు మొదలగు వారి

ద్వయమందలి పూర్వఖండమునందును, చరమశ్లోకమునందు పూర్వార్ధమునందును అనుసంధించుకొనునది.

ఫలస్వరూపమును చతుర్థీవిభక్త్యంతములగు పదముల యందును ద్వయమునందుండు "నమః" అనుపదము నందును "సర్వపాపేభ్యో మోక్షయిష్యామి" అను తావునను అనుసంధించుకొనునది.

భగవత్ప్రాప్తికిగాను విరోధియనఁగా, అవిద్యా, కర్మ, వాసనాదిరూపములగు మోక్షప్రతిబంధకములు. వాటిలో ప్రధానమైనది అనాదికాలముగ యొనర్పంబడునట్టి భగవదాజ్ఞాతిక్రమణము మూలముగఁ గలిగినదియగు భగవన్నిగ్రహము. ఇది జీవులకు జ్ఞానసంకోచకరమై సత్త్వరజస్తమోగుణాత్మకమగు ప్రకృతితో సంబంధమునుఁ గలుగఁజేసియును, ప్రకృతి పరిణామరూపములగు శరీరేంద్రియాదులతోఁ జేర్చి "తిణమఖు నరమ్బు పల్ శెవిలైవరకు కంబుల్ శాల్ పుర్ణైమరైయు నడిండరే ఎనై పోతువైత్తాయ్ పురమే" (పాపరూపములగు త్రాళ్లతో దృఢముగా బంధించి వ్రణప్రచురమగు శరీరమును చర్మముతో గప్పఁబడియుండునట్లుచేసి నన్ను విషయభోగపరునిగాఁ జేసినావు) అనియు "అన్నాళ్ నీతన్ద ఆక్కైయిన్ వழి యుழల్వేన్" (ఆదినమున నీవొసంగిన శరీరముం గొనిపోయినట్లు పోవుచున్నాను) అనియును పాయించినట్లు దేహేంద్రియాదిపరతంత్రునిగాఁ జేసియును, ఆయాయవస్థలయందు శాస్త్రవశ్యత కవకాశము లేనట్టి తిర్యగ్జంతువులు మొదలగు నాటి యవస్థలలో నుంచియును, శాస్త్రవశ్యత కనుకూలములగు మనుష్యజన్మములయందు వేదబాహ్యులగు కుదృష్టులు మొదలగు వారి

మతములలోఁ బ్రవేశింపఁజేసి మనస్సును కలవరపెట్టియు, వాటిలో ప్రవేశింపని వారిని సముఖమును "భగవత్స్వరూప తిరోధానకరీం విపరీతజ్ఞానజననీమ్ స్వవిషయాయాశ్చ భోగ్య బుద్ధేర్జననీమ్" అన్నట్లు మూలప్రకృతి రూపమగు మోహాన పింఛముచే అజ్ఞాన, విపరీతజ్ఞాన విషయప్రావణ్యములను గలుగఁజేయును, వీటిమూలముగ "అవిత్తైక్కైనైవరుక్కైనై క్కుమ్ శిక్ష్యంపావియేనై ప్పలనీ కాట్టి ప్పడుప్పాయో" (మనస్సువ్యాకులపడుచుండ పంచేంద్రియములచే నొసర్పంబడునట్టి క్రీడకు మూలమగు క్షుద్రసుఖములు మొదలగువాటిని అనేకములను జూపించి నన్ను చెరిచెదవా) అనినాయించినట్లు అల్పసుఖములకుగాను అకృత్యకరణ కృత్యాకరణరూపమగు ఆజ్ఞాతిలంఘనమును గలుగఁజేసియు, "పాపం ప్రజ్ఞాం నాశయతి క్రియమాణం పునఃపునః నష్టప్రజ్ఞః పాపమేవ పునరారభతే జ్జన" (పాపము జ్ఞానమును నశింపఁజేయును జ్ఞానహీనుండు మరలమరల పాపమునే చేయుచుండును.) అన్నట్లు పైపైని అపరాధపరంపరలోఁ బ్రవేశపెట్టియును, అందుమూలముగ "క్షిపామ్యజస్రం" ఇత్యాది తావులఁ జెప్పియున్నట్లు గర్భ, జన్మ, జరా, మరణ, నరకాది సంసారచక్రమునఁ ద్రిప్పియు, క్షుద్ర భోగంబులకు సాధనములగు రాజస తామస శాస్త్రంబులఁ గొని "యక్షరక్షాంసి రాజసాః ప్రేతాన్ భూతగణాంశ్చాన్యే యజన్తే తామసా జనాః" అన్నట్లు తనతోఁ బాటు సంసారములోఁ జిక్కుకొనియున్నట్టి వారికాళ్ళపై బడునట్లు చేసియు, వారొసంగినట్టి యాసహ్యంబులగు క్షుద్రపురుషార్థములవలన క్రిమి జంతువులవలె తృప్తులగునట్లు మాయచేసియు, యోగాభ్యాస

మొనర్చునట్టి వారినిన్ని క్షుద్రదేవతాధ్యానమునఁగాని, నామము మొదలగు అచేతనముల విషయమగు ధ్యానమునఁగాని, ప్రవేశపెట్టి క్షుద్రఫలములతో తృప్తిపొందించుటచే యోగమును ముగింపఁజేసియు, ఆత్మవిషయమున ప్రావణ్యము గలవారిని ప్రకృతిసంసృష్టమనియు, ప్రకృతివియుక్తమనియును చెప్పఁబడునట్టి రెండువిధములను (1) బ్రహ్మదృష్టితోఁగాని స్వరూపమాత్రముగాని ఉపాసింపఁజేసి, ఈ నాల్గువిధములగు ఉపాసనములకును ఫలముగ స్వల్పభోగంబుల నొసంగి మరల యీ లోకమునకు వచ్చునట్లు చేసియు, (2) బ్రహ్మాత్మకముగా స్వాత్మను ఉపాసించునట్టి వారినిన్ని, స్వాత్మశరీరుండగు పరమాత్మను ఉపాసించునట్టి వారినిన్ని, అంతరాయరూపమగు స్వాత్మానుభవముచేఁగాని, అష్టైశ్వర్యసిద్ధిని గలుగఁజేయుటచేఁగాని, వస్వాదిపదవిని పొందించుటచేఁగాని, చతుర్ముఖబ్రహ్మ దర్శనము మొదలగు వాటిచేఁగాని, పట్టాభిషేకమునకై ముహూ

(1) ప్రకృతి సంసృష్టమనియు, ప్రకృతి వియుక్తమనియును ఉపాసనమును ద్వివిధముగాఁగొని వాటిలోను ఒక్కొక్కదానిని బ్రహ్మదృష్టిచేతను, స్వరూపముచేతనని యిట్లు ద్వివిధముగాఁ గొనుటంజేసి నాల్గువిధములగు ఉపాసనములు యేర్పడుచున్నవని యెఱుంగునది.

(2) శ్రీరామానుజులవారు శ్రీభాష్యమునందు "ఛందోభిధానాన్నేతిచేన్న ఉపాసాత్రైవిధ్యస్య వివక్షితత్వాత్" అను సూత్రభాష్యమునందు ప్రతీకోపాసనమనియు, అంతర్యామిత్వోపాసనమనియు, యథావస్థితోపాసనమనియు నిట్లు ఉపాసనమును త్రివిధముగాఁగొని, "అప్రతీకాలంబనాన్నయతీతి బాదరాయణః" ఇత్యాది సూత్రభాష్యమున ప్రతీకోపాసకులకు అర్చిరాదిమార్గమునఁబోయి పొందునట్టి బ్రహ్మప్రాప్తిరూపమగు మోక్షము లేదనియు, ప్రకృతివియుక్తమగు ఆత్మను బ్రహ్మాత్మకముగా నుపాసించునట్టి

ర్తము పెట్టబడినట్టి రాజకుమారునికి తనను చెరలోనుండి బ
యటికి తీసుకొనిపోవుటకై తోడ్పడునట్టి దాసీలపై మనస్సు
పోవునట్లు, (ప్రారబ్ధకర్మఫలములగు దేహేంద్రియముల విషయ
మునను. వాటి మూలకములగు భోగముల విషయమునను,
మోహముఁ గలుగఁజేసికాని, భగవద్వ్యతిరిక్త విషయపర
వశులనుగాఁజేసియును ఇట్లు పలువిధముల భగవత్ప్రాప్తిగలు
గుట కాటంకములను గలుగఁజేయును. ముప్పదిరెండు అడుగుల
దూరము దుమికి దాటుటకై యుద్యుక్తులైనట్టి వారిలో ముప్పది
యొక్క యడుగువరకు దాటుటచే పరాజితుండైనట్టి వానికిని

వారికిన్ని యథావస్థితముగా బ్రహ్మము నుపాసించునట్టి వారికిన్ని అర్చిరాది
మార్గమునఁబోయి పొందునట్టి బ్రహ్మప్రాప్తిరూపమగు మోక్షము కలదని
యు, పంచాగ్నివిద్యయందు ఉపదేశింపఁబడినట్టి యాత్మోపాసనముకు
ఫలముగ అర్చిరాదిమార్గగమనము శ్రుతియందు చెప్పియున్నందున నది
కేవలాత్మోపాసనము కాదనియు, అది బ్రహ్మాత్మకముగ ఆత్మ నుపాసించు
టయనియు, అట్టియుపాసనముకు అర్చిరాదిమార్గమునఁబోయి పొందునట్టి
బ్రహ్మప్రాప్తిరూపమగు మోక్షమే ఫలమనియును సాధించియున్నారు) వీరు
స్వాత్మానుభవ రూపమగు కైవల్యము శ్రీభాష్యమునం దెచ్చటనున్న
ఉపపాదించియుండలేదు సరియే కదా, అనేకతావుల బ్రహ్మశరీరముగ
ఆత్మనుపాసించుటనున్న బ్రహ్మోపాసన తుల్యముగాఁ గొనియున్నారు.
ఇట్లుండ ఈ గ్రంథకర్త స్వాత్మశరీరక పరమాత్మోపాసనమనున్న
స్వాత్మానుభవ రూపమగు కైవల్యప్రాప్తిని ఫలమును గాఁ దెలుపుటయెంత
మాత్రము శ్రీభాష్యము కనుగుణము కాఁజాలదు, మరియు సృష్టికిపూర్వ
ము సూక్ష్మచిదచిత్తులను శరీరముగాఁ గలిగియున్నట్టి బ్రహ్మమే సృష్టి
కనంతరము స్థూలములగు చిదచిత్తులను శరీరముగాఁ గలదనెడి విశిష్టాద్వై
తసిద్ధాంతము స్వాత్మశరీరక పరమాత్మోపాసనముపై యాధారపడియు
న్నది. కావున, యీ యుపాసనమునకు స్వాత్మానుభవరూపమగు కైవ
ల్యము ఫలమగు పక్షమున ఈ సిద్ధాంతమునకు మొదటికే మోసమువచ్చును.

మొదటియడుగులోనే పరాజితుడైనవానికిన్ని పరాజయము విషయమున భేదములేకుండునట్లు, ఏదైన నొక విషయమున లోపముగలిగినప్పటికిన్ని యీజీవుండుసంసారమునుండి కడతేర జాలడు. కర్మయోగాదులలో ప్రవేశించినవానికి "నేహాభిక్రమ నాశోస్తి" (ఆరంభించినదానికి ఫల మెప్పటికైనను గలుగును) అన్నట్లు ఆరంభించినది గట్టిగావుంటే ఎప్పటికైన నొకనాటికి ఫలము సిద్ధించునుగాని, అది కల్పాంతర, మన్వంతర, యుగాంతర, జన్మాంతరాదులలో నెప్పుడుకలుగునో తెలియదు. మోక్షము సిద్ధించుటకు అనుకూల్యము మిక్కుటముగా నున్నను, వసిష్టాదులు సయితము అందులకై కాచుకొని యుండవలసినట్లు మనము చూచియున్నాము. అందులకు ప్రాతికూల్యము మిక్కుటముగా నున్నను, వృత్ర క్షత్రబంధు మొదలగువారికి వెంటనే మోక్షము సిద్ధించినట్లును చూచియున్నాము. కావున వెంటనే మోక్షమును సిద్ధింపఁజేయునట్టి సుకృతవిశేషమ లెవ్వరికిఁగలవో, తెలియక యున్నది. మోక్షసిద్ధి కాలక్ష మును గలుగఁజేయునట్టిదియగు భగవన్నిగ్రహమున్నెవ్వారి యెడలఁగలదో, అదియును తెలియకయున్నది. ఇట్లు అనిష్టపరంపరకు హేతువులగు భగవదాజ్ఞాతిక్రమణములవలనఁ గలిగిన భగవన్నిగ్రహంబనెడి ప్రధానవిరోధికిగానను పరిహారమునుగాను శరణాగతిని "తస్యచవశీకరణంతచ్ఛరణాగతిరేవ" అనుతావున, కరవల్లియందు జెప్పఁబడునట్టి విధమున శ్రీభాష్యకారులవారు సాయించియున్నారు. కావున ఈవిరోధులనన్నింటినిన్ని రహస్యత్రయమున విధింపఁబడుఅర్థములయొక్క వ్యవచ్ఛేదశక్తివలననుఁ 'నమః' శబ్దములయొక్కందు 'మః' అనుఅక్ష

రమునఁగల షష్ఠీవిభక్త్యర్థములవలనను “సర్వపాప” శబ్దములచేతనున్ను అనుసంధించుకొని సంసారమునఁగల బాధవలన మోక్షానుకూలముగా విధమున ప్రవర్తించుటకై త్వరపడవలసియున్నది.

పొరుళొన్ఱైననిన్ఱ పూమగళాదనవనడి శేర్,
న్దరుళొన్ఱుమన్బనవన్గొళుపాయమమైన్దపయన్,
మరుళొన్ఱియవినైవల్ విలంగెన్ఱివైయైన్దఱివార్,
ఇరుళొన్ఱిలావకైలావకై యెన్మనం తేఱవియమ్బినరే॥

టీక॥ పొరుళ్ = పురుషార్థము, ఒన్ఱైన = ఒక్కటియేయని చెప్పఁదగినట్లు, నిన్ఱ = వున్నట్టి, పూమగళాతన్ = శ్రియఃపతియైనవాడు, శరణం = రక్షకమనుకొని, శేర్న్ద = పొందునట్టి, అరుళ్ = కృపయును, ఒన్ఱు = ఒక్కటియె, అన్బనవన్ = భక్తుండగు ఈ జీవునిచేత, కొళ్ = స్వీకరింపఁబడునట్టి, ఉపాయమ్ = ఉపాయమును, అమైన్ద = పరిపూర్ణముగు, పయన్ = ఫలమును, అజ్ఞానమొన్ఱియ = అజ్ఞానము ఏకీభూతమైనట్టి, వినై = పాపము, వల్ = ధృఢమైన, విలంగు = గొలుసు, ఎన్ఱివై = ఈ, ఐన్దు = అయిదింటిని, అఱివార్ = తెలిసికొనియుండునట్టివారు, ఇరుళ్ = అజ్ఞానము, ఒన్ఱు = కొంచెమైనను, ఇలావకై = లేకుండునట్లును, ఎన్ = మాయొక్క, మనం = మనస్సు, తేఱ = ప్రసన్నమగునట్లును, వియమ్బినరే = సాధించినవారు.

తా॥ అర్థపంచకమును బాగుగాఁ దెలిసికొని యున్నట్టివారు మా యజ్ఞానము పోవునట్లును, మామనస్సు ప్రసన్నంబగునట్లును మాకు అర్థపంచకమును తెలిపినవారగుదురు.

శ్లో॥ ప్రాప్యం బ్రహ్మ సమస్తశేషి పరమం ప్రాప్తాహమస్యోచితః
ప్రాప్తిర్దాయధనక్రమాదిహ మమ ప్రాప్తా స్వతస్సూరివత్।
హన్తైనా మతివృత్తవానహమహం మత్యావిమత్యాశ్రయ స్సే
తుస్స(మ్ప్రతి( శేషసంపది) శేషిదమ్పతిభరన్యాసస్తు మే శిష్యతే॥

టీక॥ వరమం = నిరతిశయమైనట్టి, ప్రాప్యం = ప్రాప్యవస్తువు, సమస్తశేషి = సర్వశేషియగు, బ్రహ్మ = పరబ్రహ్మము, అస్య = ఇట్టి బ్రహ్మకు, ఉచితః = తగినట్టి, ప్రాప్తా = ప్రాప్తయయిన వాఁడను, అహం = నేను, ప్రాప్తిః = నేను పొందువట్టి బ్రహ్మానుభవము, దాయక్రమాత్ = పుత్రునికి పితృధనము లబ్ధమగునట్లు, సూరివత్ = నిత్యసూరులవలెనే, ఇహ = ఈ పరబ్రహ్మమునందు, మమ = నాకు, స్వతః ప్రాప్తా = స్వతస్సిద్ధమైయున్నది. హన్త = అయ్యో! విమత్యాశ్రయః = అజ్ఞానాశ్రయుండగు నేను, అహమ్మత్యా = అహంకారముచేత, ఏనాం = ఇట్టిప్రాప్తిని, అతివృత్తవాన్ = అతిక్రమించినవాఁడను, సంప్రతి = ఇప్పుడు, మే = నాకు, శేషిదంపతి భరన్యాసః = పిరాట్టినిన్ని పెరుమాళ్ళనున్ను. శరణజొచ్చుటయే, సేతుః = ఆధారము.

తా॥ ప్రాప్య ప్రాపకాదులు సంసిద్ధములై యున్నను, భగవదాజ్ఞాతిక్రమణమువలన నేను అధోగతిపాలయి యున్నాఁడను. ఈ స్థితిలోనున్నట్టి నాకు భగవంతుని శరణుజొచ్చుటయే యాధారము.

అర్థపంచకాధికారము

ముగిసెను.



శ్రీమతే నిగమాంతదేశికాయ నమః.



# రహస్యత్రయసారము

## తత్త్వత్రయాధికారము.



శ్లో॥ ప్రకృత్యాత్మభ్రాన్తి ర్గళతి చిదచిత్తత్త్వధియా
తథా జీవేశైక్యప్రభృతికలహ స్తద్విభజనాత్,
అతో భోక్తా భోగ్యం తదుభయనియన్తేతి నిగమై
ర్విభక్తం న స్తత్త్వత్రయ ముపదిశన్త్యాప్తధియః॥

టీక॥ ప్రకృత్యాత్మభ్రాన్తిః = దేహాత్మాభిమానము, చిదచిత్తత్త్వధియా = చేతనాచేతనపదార్థముల స్వరూపముఁ దెలిసికొనుటచే గళతి = నశించుచున్నది, తథా = అట్లే, జీవేశైక్యప్రభృతికలహః = జీవాత్మపరమాత్మ లొక్కటియనెడి వాదము, తద్విభజనాత్ = జీవాత్మ పరమాత్మలకుఁగల భేదము నెఱుంగుటచే, గళతి = నశించుచున్నది. అతః = అందువలన, ఆప్తధియః = బుద్ధిమంతులు, భోక్తా = జీవుండు భోక్తయనియు, భోగ్యం = అచేతనపదార్థము భోగ్యవస్తువనియు, తదుభయనియన్తేతి = ఈశ్వరుండు వాటిరెంటిని నియమించువాఁడనియు నిట్లు, నిగమైః = శాస్త్రములచేతను, విభక్తం = విభజింపఁబడినట్టి, తత్త్వత్రయం = మూడుతత్త్వములను, ఉపదిశన్తి = ఉపదేశించుచున్నారు.

తా॥ చేతనాచేతన స్వరూపములఁ దెలిసికొనుటచే దేహాత్మాభిమానము నశించుటంజేసియు, జీవాత్మపరమాత్మలకుఁగల భేదమును తెలిసికొ

నుటచే జీవాత్మ పరమాత్మలొక్కటియే వస్తువనియును ఈ మొదలుగాఁ
గల వాదము నశించుటంజేసియును, బుద్ధిమంతులగు మనపూర్వాచార్యులు
జీవాత్మ భోక్తయనియు, అచేతనపదార్థము భోగ్యవస్తువనియు, సర్వేశ్వ
రుండు ఈ రెంటిని నియమించువాఁడనియును ఇవ్విధమున విభజించి
తత్త్వత్రయమును ఉపదేశించుచున్నారు.

సంబంధమున్ను అర్థపంచకమున్ను కలిసి మొత్తముకు
ఆరు అర్థములు తెలిసికొన వలసినవిగానుండఁగ, వాటిలో
కొంత భాగమగు తత్త్వత్రయమును మాత్రము ముముక్షువుచే
విశేషించి తెలిసికొన వలసినట్టి దానినిగాను పూర్వాచా
ర్యులు ఉపదేశించి యుండుటకుఁ గారణంబెద్ది యనఁగా —
దేహమే యాత్మయను భ్రాంతియును, ఆత్మ స్వతంత్రుండను
భ్రాంతియును, ఈ రెంటికిని హేతువగు నిరీశ్వర వాదమునఁ
బ్రీతియును, ఈ మహావిరోధులను ముందుగ తొలగించుట
ఆవశ్యకంబగుటయే యందులకుఁ గారణము. ఈ యుద్దేశము
తోనే శాస్త్రకారులు శాస్త్రములందు భోక్తయనియు, భోగ్య
వస్తువనియు, నియంతయనియును ఇవ్విధముగ చిదచిదీశ్వరు
లను విభజించి తెలిపియున్నారు.

వాటిలో 'అచేతనాపరాధాఽచ నిత్యాసతతవిక్రియా।
త్రిగుణాకర్మిణాం క్షేత్రం ప్రకృతేరూపముచ్యతే । అనాదిర్భగ
వాన్ కాలో నాన్తోస్యద్విజవిద్యతే ॥ కలాముహూర్తాది మయ
శ్చకాలో నయద్విభూతేః పరిణామహేతుః । 'జ్ఞానానందమ
యాలోకాః' 'కాలంసపచతేతత్ర' 'నకాలస్తత్రవై ప్రభుః' ఈ
మొదలగుతావుల శాస్త్రమునందు త్రిగుణములుగాను, కాల
రూపముగాను, శుద్ధసత్త్వమయములుగాను నిట్లు మూఁడువిధ

ములుగాను నుండునట్టి యచేతన పదార్థములయొక్క స్వభావము తెలుపఁబడినది.

'ఘమాన్న దేవోననరః' 'నాయందేవోనమర్త్యోవా' 'తురస్సర్వాణిభూతాని కూటస్థోతురఉచ్యతే' 'యద్వైవశ్వన్ని నూరయః' ఇత్యాదితావుల మూఁడువిధములుగల జీవులయొక్కయును విధములు వివేచించి తెలుపఁబడినవి.

'సర్వజ్ఞస్సర్వశక్తిః జ్ఞానబలర్ధిమాన్ । క్లమతంద్రీ భయక్రోధకామాదిభిరసంయుతః' ఇత్యాదితావుల సర్వేశ్వరునియొక్క స్వరూపము ఉపదేశింపఁబడినది.

ఇట్లు నియంతగాను, నియామ్యములుగాను నుండునట్టి తత్త్వత్రయముండునట్టి విధమును తెలుపఁబూని, వాటిలో నీశ్వరుండు తక్కిన త్రివిధ చేతనాచేతన పదార్థములయొక్కస్వరూప,స్థితి, ప్రవృత్తులను తన యధీనములో నుంచుకొనియుండువాఁడని తెలిపియున్నారు. త్రివిధచేతనములనగా—బద్ధులును, ముక్తులును, నిత్యులును,త్రివిధాచేతనములనఁగా—త్రిగుణద్రవ్యమును, కాలమును,శుద్ధసత్త్వమయంబగు ద్రవ్యమును. స్వరూపమనఁగా — తనయందుమాత్రమే యుండునట్టిధర్మమువలనఁ దెలుపఁబడునట్టి వస్తువు. స్థితియనఁగా—ఇది కాలాంతరమందు సయితముండుట. ఇది నిత్యవస్తువులయందు నిత్యముగానుండును. అనిత్యవస్తువులయందు ఈశ్వరసంకల్పానుగుణముగ హెచ్చియును తగ్గియును ఉండగలదు. ఈ తావున ప్రవృత్తియనఁగా—ప్రవృత్తి నివృత్తిరూపమగు వ్యాపారము, ఇవియన్నియును ప్రతివస్తువునందును చతురాదిప్రమాణముల కనుగుణముగా నుండగలవు. ఈ ప్రమాణములు ఆయాపదా

ర్థములఁ దెలుపునప్పుడు, ఆయా పదార్థములయొక్క స్వరూపము
ను, అట్టి స్వరూపమును నిరూపించునట్టి ధర్మములను, అట్లు నిరూ
పింపఁబడినట్టి స్వరూపమునకుఁగల విశేషంబులను, వ్యాపారము
లనున్ను తెలుపును. అట్లు స్వరూపముఁ దెలుపునపుడు స్వరూ
పనిరూపకములగు ధర్మములతోఁ గూడియున్నట్టి దానిని గానే తె
లుపఁగలవు. అనఁగా దానిని దెలుపునప్పుడు ఆయా ధర్మములతో
గూడ చేర్చి తెలుపునే తప్ప, వేఱొక్కవిధమునఁ దెలుపఁజాలవు.
అట్టి ధర్మములను విడిచిపెట్టి వస్తువును మాత్రము తెలుపుటయ
నునది(1) శశవిషాణతుల్యంబగును. కావున జీవస్వరూపమును
జ్ఞానత్వ, ఆనందత్వ, అమలత్వ, అణుత్వాది ధర్మముల మూల
ముగ నిరూపించి, జీవుండు జ్ఞానమనియు, ఆనందమనియు, అ
మలమనియు, అణువనియును ఇవ్విధముగ పేర్కొనంబడుచు
న్నాఁడు. ఈ జీవతత్త్వము సర్వేశ్వరునికి శేషభూతమైయే
యుండుననియు, వానికిని స్వభావసిద్ధముగా శేషభూతంబైన
దనియు, (2) అయోగాన్యయోగ వ్యవచ్ఛేదంబులవలన తిరుమం
త్రమునందలి ప్రథమపదమునఁ దెలియవచ్చునట్టి యీ శేష
త్వము సంబంధరూపమైనందున, ఇది సంబంధించియుండు
నట్టి వస్తువుయొక్క స్వరూపము నిరూపింపఁబడిననే తప్ప యట్టి

---

(1) ఒకవస్తువును నిరూపించునప్పుడు "ఇది యిట్టిది" అని నిరూ
పింపవలయును. "ఇట్టిది" అనఁగా ఆవస్తువు దాని ధర్మములతోఁ గూడ
నిరూపింపఁబడుట. "ఇట్టిది" అని యివ్విధమున నిరూపింపఁబడనిపక్షమున
కుందేటికి కొమ్ములు వాస్తవమునకు లేకున్నను కుందేటి కొమ్ములనెడి వా
డుకవలెనే వాస్తవముగ నిరూపణమనునది సదే లేకున్నను పేరుమాత్ర
ముండగలదని భావము.

(2) అవ్యాప్తి, అతివ్యాప్తి, దోషరహితము గావని యర్థము.

సంబంధము తెలియరానందున, జీవుని కిది నిరూపితస్వరూప
విశేషణంబనియును చెప్పవచ్చును. అణువయి, చేతనుండుగా
నుండుట జీవుని లక్షణంబయినట్లు, శేషభూతుండై చేతనుండు
గానుండుటయును జీవలక్షణముగాఁగొనఁబడినందున, ఈ శేష
త్వమనునది జీవునికి స్వరూప నిరూపకంబనియును చెప్పవచ్చు
ను. అట్లే విభువయి చేతనుండుగా నుండుటయు, అన్యాధీనుం
డు కాకుండుటయు, నిరుపాధిక శేషియగుటయును ఈ మొదలగు
నవి యీశ్వరలక్షణములు. జీవాత్మలకును సర్వేశ్వరునికిన్ని
సాధారణమగు లక్షణము చేతనత్వమును, ప్రత్యక్త్వమును.
చేతనత్వమనఁగా—జ్ఞానము కాశ్రయముగా నుండుట. ప్రత్య
క్త్వమనఁగా—తనకుతాను తెలియవచ్చుట. అనఁగా ధర్మ
భూతజ్ఞానముయొక్క సహాయమక్కఱలేకుండ "నేను" అనియిట్లు
తనను తాను తెలిసికొనుట. ఇట్లు చేతనత్వాదులు జీవునికిన్ని
ఈశ్వరునికిన్ని సాధారణముగా నుండుటంజేసి, జీవేశ్వరులకు
భేదము తెలియవచ్చుటకుగాను, జీవుని లక్షణముఁ జెప్పినప్పు
డు, నిరుపాధిక శేషత్వము మొదలగునవి చెప్పఁబడినవి. తిరు
మంత్రమునందలి ప్రథమాక్షరమునను చతుర్థీవిభక్తిచేఁ
దెలుపఁబడిన తాదర్థ్యమునకు (కైంకర్యమునకు) ఉపాధి
(నిమిత్తము) యెద్దియును లేనందున సర్వరక్షకుండగు సర్వేశ్వరు
నికి జీవాత్మ నిరుపాధిక శేషభూతుండుగానే యుండగలడు. ఇట్లు
జీవుని స్వరూపమున్నంతవఱకును ఈతనికి సర్వేశ్వరునితో సం
బంధమున్నట్లు చెప్పఁబడినందున, నిట్లుండుట యయోగ వ్యవ
చ్ఛేద మనఁబడుచున్నది. ప్రణవమునందలి ఉకారముయొక్క
అవధారణార్థ సామర్థ్యమువలన సర్వేశ్వరునికే యీజీవుండు

శేషభూతుండనియు, వేఱొకనికి శేషభూతుండు కాఁడనియును తెలుపఁబడినందున, సిద్ధించుట యన్యయోగ వ్యవచ్ఛేదంబనఁబడుచున్నది. ఈ శేషత్వమనునది భాగవతులవరకును వ్యాప్తి పొందునదియను విషయము ఇఁకమీఁద తెలుపఁబడును. ఇవ్విధముగానుండునట్టి యాత్మలయొక్క ప్రవృత్తియనునది — పరాధీనమై (సర్వేశ్వర సంకల్పాధీనమై) పరార్థముగ (సర్వేశ్వరుని భోగముకొఱకుగానగు) కర్తృత్వమును, భోక్తృత్వమును. అది యెట్లనిన, సర్వేశ్వరుండు తన భోగమునకుఁగాను వీరలకు కర్తృత్వ భోక్తృత్వములఁ గలుగఁజేయుటంజేసి, యివి పరార్థము లనఁబడుచున్నవి. ముక్తాత్మలకంటెను బద్ధచేతనులకుఁగల భేదము అవిద్యా, కర్మ, వాసనా, రుచి, ప్రకృతిసంబంధయుక్తులుగానుండుట. వీరికి పరస్పరము గలుగునట్టి జ్ఞానసుఖాదులలోఁగల భేదమును బ్రహ్మాది స్తంబపర్యంతమునుండు జీవస్థితిగతులలోఁ జూచుకొనునది. బద్ధచేతనులు తమకు తమతమకర్మానుగుణముగ సర్వేశ్వరుండు గలుగఁజేసిన శరీరములను ధర్మి (స్వాత్మ) స్వరూపముచేతను ధర్మభూతజ్ఞానముచేతను ధరించియుండగలరు. ధర్మి (స్వాత్మస్వరూపము) వలనఁ గలుగునట్టి ధారణమనునది ఈ శరీరముయొక్క సత్తకు కారణముగా నుండుట. (ధర్మభూతజ్ఞానమువలనఁ గలుగునట్టి శరీరధారణము జాగ్రదాద్యవస్థలయందు పురుషార్థప్రాప్తికిని తత్సాధనానుష్ఠానమునకును, ఉపాయానుష్ఠానమొనర్చియున్నట్టి పరమైకాంతిని భగవదనుభవ కైంకర్యంబులకును ఉపయుక్తముగా నుండుట. పాపాత్ములయినట్టివారికి యీశరీరధారణము విపరీతఫలంబులకు హేతువు కాఁగలదు) ఈజీవుఁడు ఈ

శరీరమును విడనాడినట్లయిన, ఈ శరీరమునందలి ఆయాయవ యవములకుఁగల చేరిక చెడిపోవును. ఇంతియే. అయితే శరీర మునకు ఉపాదానకారణములుగా నుండునట్టి పదార్థములు ఈశ్వరునికి శరీరభూతములుగా నుండఁగలవు.

ఇతరులకంటెను బద్ధచేతనులకుఁగల స్థితిభేదంబెద్దియనఁ గా—సంసారబంధము మోక్షము గలుగువరకును అనువర్తిం చుట. ప్రవృత్తిభేదంబెద్దియనఁగా—పుణ్యపాపానుభయ రూప ములగు త్రివిధప్రవృత్తులు. బద్ధులకంటెను ముక్తులకుఁగలభేద మె ద్దియనఁగా—మోక్షప్రతిబంధకముపోవుటంజేసి స్వస్వరూపా విర్భావముగలవారై యుండుట. స్థితిభేదమెద్దియనఁగా—ఇప్ప టినుండియనెడి యొకయవధితోనున్నట్టిస్వస్వరూపావిర్భావము నకు ఇంతవరకని యికమీఁదు ఒకయవధియు లేకపోవుట. పరస్పరము వీరలకుఁగల స్థితిభేదంబెద్దియనఁగా—ఒకరికి స్వ స్వరూపావిర్భావము (మోక్షము)ముందుగను మరియొకరికది తరువాతనున్ను గలుగుటంజేసి, ముందుగ స్వస్వరూపావిర్భా వముగలిగినట్టివారనెడి యాధిక్యము. ప్రవృత్తిభేదంబెద్దియనఁ గా—అనాదికాలముగ కష్టపడి సంపాదించుకొనినట్టి సంపూ ర్ణభగవదనుభవమువలనఁ గలిగినప్రీతిచేఁ బ్రేరితులై యథేష్ట ముగా నొనర్పఁబడునట్టి కైంకర్యవిశేషములు. బద్ధులకంటె ను నిత్యులకుఁగలభేదం బెద్దియనఁగా—అనాదికాలముగ స్వ స్వరూపావిర్భావము గలవారైయ్యును, పరతంత్రులైయ్యు నుం డుట. ముక్తులకంటెను వీరికిఁగల స్థితిభేదంబెద్దియనఁగా — అ నాదికాలముగ గలుగుచుండునట్టిభగవదనుభవము. ఇది నిత్యు లకంతటికిని సర్వసాధారణముగా నుండుననియగుటంజేసి, వీరికి

తమతమ స్థితులలో పరస్పరము భేదములేదు. వీరికిఁ గల ప్రవృత్తి భేదంబెట్టిదనఁగా—అనాదిగ ప్రవాహ నిత్యములగు (ఒకప్పుడుండి మఱియొకప్పుడులేనట్టి) కైంకర్య విశేషములు.

అనంతగరుడాదులకు అధికారములును, వాటి కనుగుణంబులగు కైంకర్యములును వీరికివియని నియతంబులైయుండఁగా, నిత్యులకును ముక్తులకును సర్వవిధకైంకర్యసిద్ధి కలదని చెప్పుట యెట్లు పొసగునంటివేని, చెప్పెదను. స్వామియొక్క యభిప్రాయము ననుగుణముగ ఈ చేతనుని కిష్టంబులగు కైంకర్యములలో యీతనికి లభింపనిది యొక్కటియును లేనందునను, ఒక్కరికి యేర్పడియుండునట్టి కైంకర్యంబులను తామే యొనర్పవలయుననెడి కోరిక వేరొక్కరికి కలుగనందునను, యెవ్వరు కైంకర్యమొనర్చినను, స్వామికి యిష్టంబగుటంజేసి, వానికి తగినట్టి కైంకర్యంబులును అందరికిన్ని యిష్టంబులై, వాటిమూలముగ భగవంతునికిఁగలుగునట్టి ప్రీతియందును తారతమ్యము లేకపోవుటఁ జేసియును, అందరికిని అన్ని కైంకర్యములయందును, అధికారము కలదని చెప్పినయెడల విరోధములేదు.

ఈయాత్మలందఱికిని ధర్మి (స్వాత్మ) స్వరూపమువలెనే ధర్మభూతజ్ఞానమున్ను ఒకవస్తువుగానుండఁగా, దీనియొక్క స్వరూపమును ఈతావున ప్రత్యేకించి చెప్పకపోవుటకుఁ గారణమేమనిన, చేతనులని మొత్తముగా పేర్కొనినప్పుడు, అది మొత్తము కందఱికిన్ని విశేషణముగా నుండగలదు. ఈధర్మభూతజ్ఞానము ఆయావస్తువులను దెలియంజేయునప్పుడు స్వాశ్రయమగు ఆత్మకు తనకుతానే తెలియవచ్చునదిగా నుండగలదు. ఇది సర్వేశ్వరునియందును, నిత్యులయందును ఎల్లకాలము విభువు

గానుండగలదు. తక్కినవారియందన్ననో, సంసారావస్థయందు కర్మానుగుణముగ నానావిధములగు సంకోచ వికాసములఁగల దియై, మోక్షావస్థయందు ఒక్కవిధముగ ప్రకాశించునదియై యావత్కాలము విభుస్వరూపముగానుండగలదు.

దీనియొక్క ప్రవృత్తియనునది విషయములఁ బ్రకాశింపఁ జేయుటయు, ప్రియత్నావస్థచే శరీరాదులఁ బ్రేరేపింపఁజేయుటయు, బద్ధావస్థయందు సంకోచవికాసములఁ బొందుటయు, అనుకూలముగను ప్రతికూలముగను ప్రకాశించుటచే భోగరూపమగు అవస్థనుబొందుటయును. భోగమనఁగా తనకు అనుకూలముగాను కాని, ప్రతికూలముగాను కాని, యెట్లైన నొకదానిని అనుభవించుట.

ఈశ్వరునియొక్క విభూతియగు సర్వపదార్థములును ఆనుకూల్యమే స్వభావముగాఁగలవియై, అవ్విధముననే ఈశ్వరుండును, నిత్యులును, ముక్తులును వాటిననుభవించుచుండ, సంసారులకు కాలభేదమువలనను, పురుషభేదమువలనను, దేశభేదమువలనను, అవికొంతవరకు అనుకూలమైనవిగాను, ప్రతికూలమైనవిగాను, ఉభయవిధములును కానివిగానున్న ఇట్లు నానావిధములుగానుండుట వాటికి స్వభావసిద్ధము కాదు. అయితే అవియట్లుండుటచేతనులకు కర్మానుగుణముగ సత్యసంకల్పుండగు సర్వేశ్వరుండిచ్చినఫలము. దీనిననుభవించుటకుగాను ఈబద్ధాత్మలకు స్వరూపయోగ్యతయును సహకారియోగ్యతయును కలవు. వీరికిఁగలస్వరూపయోగ్యతపరతంత్రచేతనత్వము. సహకారియోగ్యత సాపరాధత్వము. నిత్యులకును, ముక్తులకును పరతంత్రిచేతనత్వముండుటనుబట్టి స్వరూపయోగ్యతయున్నను, ఈశ్వరనియభి

మతమునకు విరుద్ధంబైనట్టి యనుష్ఠానంబెద్ది కూడ వీరియందు లేనం
దున వీరికి సహకారి యోగ్యత లేదు, సర్వేశ్వరుండు అన్నింటిని
నియమించువాఁడై తాను మాత్ర మెక్కడ దాని చేతనున్న నియ
మింపఁబడునట్టివాఁడు కాక పోవుటం జేసి, యతనికి పరతంత్రిచేత
నత్వరూపమగు స్వరూపయోగ్యత లేదు స్వతంత్రజ్ఞాతింం
ఘనరూపమగు సహకారి యోగ్యతయును లేదు. జీవులుగాను
ఈశ్వరుండు గానునుండునట్టి సర్వాత్మలయొక్కయును స్వరూప
ము స్వయంప్రకాశము అనఁగా తనకుతాను ప్రకాశించునది.
బద్ధులతోఁగూడ అందఱియొక్కయును ఆత్మస్వరూపము యొక్క
ప్రకాశమునకు ఎన్నఁడును సంకోచ వికాసములు లేవు. ఆత్మ
లందఱియొక్కయును ధర్మభూతజ్ఞానము, విషయములను ప్రకా
శింపఁజేయునప్పుడు తనకాధారమగు ఆత్మస్వరూపము విషయ
మున స్వయంప్రకాశముగానె యుండగలదు. జ్ఞానత్వమును, స్వ
యంప్రకాశత్వమును ఈ రెండును ధర్మమునకును (ధర్మభూత
జ్ఞానమునకును) ధర్మికిని (ఆత్మకును) సమానములు. ధర్మ
భూతజ్ఞానమునకు విషయిత్వము ఆధిక్యము. ధర్మియగు ఆత్మ
స్వరూపమునకు ప్రత్యక్త్వము ఆధిక్యము. జ్ఞానత్వమనఁగా
వేరైన నొక వస్తువును ప్రకాశింపఁజేయుట అనఁగా తనను
గాని వేరొక్కదానినిగాని యేదైననొకదానిని వ్యవహారయో
గ్యతగల దానినిగాఁజేయుట. స్వయంప్రకాశత్వమనఁగా తన
ను తెలుపుటకుగాను వేఱొక్కజ్ఞానముయొక్క సహాయమునపే
క్షింపక తానే స్వయముగ తెలియవచ్చుట. ధర్మభూతజ్ఞానము
కుఁగల విషయిత్వమనఁగా తనను తప్పతక్కినవాటిని తెలుపుట. ఆ
త్మలకుఁగల ప్రత్యక్త్వమనగా తనకుగాను ప్రకాశించుట. అ

నఁగా తనప్రకాశమువలనఁబ్రయోజనమును తానే కలిగియుం
డుట. ఏదైన వస్తువుయొక్క ప్రకాశముయొక్క యుపయోగ
ముకలదినెడి సామాన్యాకారమును తనప్రకాశముయొక్కయు
పయోగముకలదితానయనెడివిశేషణముతోఁ జేర్చితిమేని యది
ప్రత్యక్త్వమనఁబడుచున్నది. ఇట్టివిశేషము లేనివస్తువుకు ఈ
సామాన్యమును, దీనిచే వ్యాప్తంబైనట్టి చేతనత్వమును లేవు.
ఈధర్మధర్మిలు రెండును స్వయంప్రకాశంబులు గానున్నను, ని
త్యత్వాది ధర్మవిశేష విశిష్టములుగాఁ దెలియునప్పుడు జ్ఞానాం
తరవేద్యములును గాగలవు. తనయొక్క ధర్మభూతజ్ఞానము త
నకు జ్ఞానాంతరవేద్యంబగునప్పుడు, అది ప్రసరించునట్టి ద్వార
ములకుంగలభేదమువలన నది జ్ఞానాంతరముగా వ్యవహరింపఁ
బడుచున్నది మూఁడవిధములగు చేతనులును యితరులకె తెలి
యఁబడునవిగా నుండగలవు.

అచేతనత్వమనఁగా జ్ఞానము కాశ్రయముకానిదియగు
ట. ఇతరులకే తెలియ వచ్చునదియగుట, అనఁగా తనప్ర
కాశమువలనఁ బ్రయోజనముకలది తానే కాకపోవుట, ఈరెం
డును ధర్మభూత జ్ఞానాములకున్ను సమానములు. త్రివిధాచేతను
ములనిచెప్పినవాటిలో ప్రకృతియును, కాలమును జడములు.
శుద్ధసత్త్వమను ద్రవ్యమునయితము జడమేయని కొందఱు
చెప్పుదురు. జడత్వమనఁగా స్వయంప్రకాశముకానిదైయుండు
ట, శుద్ధసత్త్వద్రవ్యమునకుజ్ఞానాత్మకత్వము శాస్త్రసిద్ధంబగుటం
జేసి యది స్వయంప్రకాశంబని భగవచ్ఛాస్త్రములను (పాం
చరాత్రాదులను): పరామర్శించినట్టివారు చెప్పుదురు.

ఇట్లు అది స్వయంప్రకాశంబైనట్టయిన, సంసారులకది శా

స్త్రమువలనం దెలియవలసినది కాకుండ, తనకుతానే తెలియ వచ్చునదిగానుండ నక్కరలేదా? యంటివేని, చెప్పెదను. ఆత్మల న్నింటియొక్కయును స్వరూపమును, ధర్మభూతజ్ఞానమున్ను స్వయంప్రకాశమైనట్టివిగానుండఁగా, స్వరూపము తనకుమాత్రమే స్వయంప్రకాశంబై తక్కిన, వారికందఱికది జ్ఞానాంతరవేద్యంబై నచందంబునను, ధర్మిభూతజ్ఞానము తనకాశ్రయంబైనదానికిస్వ యంప్రకాశంబై, తక్కినవారికి స్వయంప్రకాశముకానిదియగు చందంబునను, ఇదియును నియతముగ కొన్నివిషయములయెడలమాత్రము స్వయంప్రకాశంబగుపక్షమున విరోధము లేదు.

"యోవేత్తియుగపత్సర్వం ప్రత్యక్షేణసదాస్వతః। తం ప్రణమ్యహరింశాస్త్రం న్యాయతత్త్వం ప్రచక్ష్మహే" అని సాయించినట్లు ధర్మభూతజ్ఞానమువలన సర్వమును సాక్షాత్కరించినట్టివాఁడగు సర్వేశ్వరునికి శుద్ధసత్త్వద్రవ్యము స్వయంప్రకాశంబగుట యెట్లంటివేని, చెప్పెదను. ఈతనియొక్క ధర్మభూతజ్ఞానము దివ్యాత్మస్వరూపము మొదలుగాఁగల సర్వమున్ను తెలుపుచున్నను, దివ్యాత్మస్వరూపము స్వయంప్రకాశంబగు చందంబున, ఇదియును స్వయంప్రకాశంబై యుండవచ్చును. ఇది నిత్యులవిషయముననున్ను సమానమే. వస్తువులఁ దెలియఁజేయునట్టి సమయమున ధర్మభూతజ్ఞానము తనయాశ్రయమునకుమాత్రము స్వయంప్రకాశంబగుచందంబున, ముక్తులకున్ను అట్టిదశయందు ఇదియును స్వయంప్రకాశంబైనట్లయిన, విరోధము లేదు ధర్మభూతజ్ఞానముయొక్క తననుతాను ప్రకాశింపఁజేసికొనునట్టి శక్తియనునది విషయములను తెలుపని సమయమునందు కర్మవిశేషంబులచే బంధింపఁబడియున్నట్లు, శుద్ధ

సత్త్వముయొక్కయును తనను తాను ప్రకాశింపఁ జేసికొనునట్టి శక్తి బద్ధావస్థయందు నిర్బాధితమైనందున శుద్ధసత్త్వము; బద్ధులకు తెలియరాదు. "ధియస్స్వయం ప్రకాశత్వం ముక్తౌ స్వాభావికం యథా బద్ధే కదాచిత్సంరుద్ధం తథా త్రాపి నియమ్యతే" (జ్ఞానముకు మోక్షావస్థయందు స్వయంప్రకాశత్వము స్వాభావికంబగునట్లును, బద్ధావస్థయందది యొకప్పుడు బంధింపఁబడునట్లును, ఈవిషయమునను అట్టినియతికలదు) అన్నట్లు యింత మాత్రము అవస్థాంతరమును బొందుట వికారమును బొందునట్టి వస్తువునకు విరుద్ధము కాదు. కావున ప్రమాణములఁగొని నిర్ణయింపఁబడినట్టి దానిని మన యుక్తిచే విరుద్ధమని చెప్పుట కవకాశము లేదు.

ఇంతియొకాక, గౌణార్థముచే నిర్వహింపఁదలంచితిమేని, ఆత్మస్వరూపమును తెలుపునట్టి జ్ఞానానందాది శబ్దములకున్ను గౌణార్థములఁగొనివాటినిఅన్యార్థములఁదెలుపునట్టి వాటినిగాఁ జేయవచ్చును. కావున స్వయంప్రకాశమును రూపరసాది గుణములును, వాటిమూలకమగు పృథివ్యాది విభాగములును, పరిణామాదులును ఉండుటపొసగునా? యనెడి యాక్షేపమున్ను, ధర్మభూతజ్ఞానముకున్ను ధర్మిజ్ఞానమునకున్ను ఉండుకున్నట్టి వైషమ్యములను వ్యాజముగాఁగొని ప్రమాణబలముచేత పరిహరింపఁబడినది. ఇట్లు స్వయంప్రకాశంబగు శుద్ధ సత్త్వద్రవ్యమును జ్ఞాతృత్వము లేనందున అచేతన పదార్థములు మూఁడు విధంబులని యిట్లు దానిని అచేతన పదార్థములతోఁ జేర్చి చెప్పినాము.

ఈ యచేతన పదార్థంబులకు మూఁడింటికిఁ గలప్రవృ

త్రియొద్ధియునఁగా— సర్వేశ్వరుని సంకల్పమునకు అనుగుణం బులగు విచిత్రపరిణామములు. వీటిలో త్రిగుణద్రవ్యమనఁగల స్వరూపభేదము గుణత్రయమునకు ఆశ్రయంబగుట. అది యెల్లనిని, యెల్లప్పుడును మార్పులను బొందుచుండునట్టి యీద్రవ్యమునందు సత్వరజస్తమోగుణములు పరస్పరము సమాన భాగములుగా నుండునప్పుడు మహాప్రళయము గలుగును. అట్లుకాక, విషమములుగా నుండునప్పుడు సృష్టిస్థితులు గలుగఁ గలవు. వైషమ్యముగలప్రదేశమునమహదాదివికారంబులు గలుగును, వీటిలో వికృతినిబొందనిదానినిన్ని (ప్రకృతిని) వికృతినిబొందునట్టివాటినిన్ని చేర్చిప్రకృతి, మహదహంకార, భూత, ఇంద్రియములనియిట్లు ఇరువదినాలుగు తత్వములనుగాను, శాస్త్రములు తెలుపఁగలవు. వివక్షాభేదమునుబట్టి యీ తత్వములు యెక్కువ తక్కువగానును చెప్పఁబడుట కద్దు. ఈ తత్వములకుఁ గల యవాంతరభేదములును, వాటి వాటి యభిమాన దేవతలును, ఉపాసకులచే యావశ్యముగ తెలియవలసినవి. వాటినుండి యాత్మకుఁగల భేదము నెఱింగియుండుట మనకున్ను (ప్రపన్నులకును) అవశ్యకము. ఇవి యన్నియును భగవంతునికి అస్త్రభూషణాదులగా నుండునవి యని యీ క్రిందు పాశురమునఁ దెలిపియున్నారు.

పా॥ పురుడన్ మణివరమాక పొన్నా మూలమ్, పిరకిరుతిమఱు
వాకమాన్ దణ్డాక, త్తెరుళ్ మరుళ్ వాళ్ మఱైవాక వాంగ రంగళ్,
శారంగం శంగాక మన నేకిరియాక, ఇరుడిగళ్ ఉత్తరుం శరంగ
ళాక, విరుబూతమాలై వనమాలైయాగ, కరుడనారు వామత్తై
యిక్ పొరుళాక్కొణ్డ్, కరికరిమేనిత్తనైత్తుంకాక్కిన్నానే॥

* తా॥ పురుషుని కౌస్తుభమణిని గాను, ప్రకృతిని శ్రీవత్స చిహ్నమునుగాను, మహత్తును గదాయుధమునుగాను, జ్ఞానమును, ఖడమ్గుగాను అజ్ఞానమును ఖడ్గముయొక్క వరను గాను, సాత్విక తామసాహంకారంబులను శార్ఙ్గమును చక్రమును గాను, కర్మేంద్రియములను జ్ఞానేంద్రియములనున్ను శరంబులనుగాను, సూక్ష్మస్థూలముగాను ద్వివిధంబులగు భూతంబులను వనమాలనుగాను కలిగియున్నవాఁడై గరుడశరీరముగాను చెప్పఁబడినట్టి శ్రుతుల యందుఁ దెలియవచ్చునట్టి శ్రీకృష్ణుఁడు కరిగిరియందు వేంచేసియుండినవాఁడై యీఁదటినిన్ని రక్షించుచున్నాఁడు.

ఈపైపాశురమునఁ జెప్పియున్న ప్రకారము తెలిసికొనుట యుచితము. ఈ యిరువదినాల్గు తత్వంబుల స్వరూపంబులకు పరస్పరముందు కున్నట్టి భేదమును వాటివాటి లక్షణముల వలనఁ దెలియఁదగును. వీటిలో కార్యభూతములగు

---

* ఆత్మానమస్యజగతో నిర్లేపమగుణామలం। బిభర్తి కౌస్తుభ మణిస్వరూపం భగవాన్హరిః॥ శ్రీవత్ససంస్థానధర మనన్తేచసమాశ్రితం। ప్రధానంబుద్ధిరప్యాస్తే గదారూపేణమాధవే। భూతాదిమింద్రియాదించ ద్విధాహంకారమీశ్వరః। బిభర్తి శంఖరూపేణ శార్ఙ్గరూపేణచస్థితమ్। పంచరూపాతుయామాలా వైజయంతీగదాభృతః। సాభూతహేతుసంఘాతో భూతమాలాతువై ద్విజ। చలస్వరూపమత్యంతం జవేనాన్తరితానిలం। చక్రస్వరూపంతుమనో ధత్తే విష్ణుకరేస్థితమ్। యానీన్ద్రియాన్యశేషాణి తానిధత్తేజనార్దనః। బిభర్తియచ్చాసిరత్న మచ్యుతోత్యంతనిర్మలం। విద్యామయన్తుతజ్జ్ఞాన మవిద్యాచర్మసంజ్ఞికం। ఇత్యాదిశ్లోకములయందును ఈపాశురార్థము తెలుపఁబడినది.

యిరువది మూఁడు తత్త్వములయొక్కయును, వాటినుండిగలి గినవాటియొక్కయును స్థితులయందుఁగల హెచ్చు తక్కువలను పురాణములయందుఁ జెప్పియున్నప్రకారమెఱుంగునది.

“స్వసత్తాభాసకంసత్వం గుణసత్వాద్విలక్షణం తమసఃపరమోధాతా” “అప్రాకృతంసురైర్వంద్యం” ఇత్యాది ప్రమాణములయందు తమస్సుకు పైగాను పలక్షణదేశం బొక్కటియున్నట్లు తెలియవచ్చుటంజేసి “అనంతస్యనతస్యాంతస్సంఖ్యానంవాపివిద్యతే తదనంత మసంఖ్యాతప్రమాణంచాపి వైయతః” ఇత్యాది తావుల (నిత్యవిభూతిచే వ్యాప్తముకానట్టి ప్రదేశమునుబట్టి మూలప్రకృతి యనంతమైనట్టిదిగాను చెప్పఁబడుచున్నది.)

త్రిగుణద్రవ్యమునకుప్రవృత్తిభేదంబెట్టిదనఁగా.—బద్ధచేతనులయొక్క భోగాపవర్గంబులకును, సర్వేశ్వరుని యొక్క లీలారసమునకును సమముగను, విషమముగను మాఱిమాఱి పోవుచుండునదియై దేహేంద్రియాదిరూపముగ ఆయావ్యాపారములఁజేయుట. ఇది రజోగుణ తమోగుణములమూలముగ బద్ధచేతనులకు తత్త్వస్వరూపమును తెలియకుండచేసి, వారికి భోగార్థము విపరీతజ్ఞానమును గలుగఁ జేయుచున్నది. ఇదియే మోక్షార్థము సత్వగుణమును వృద్ధిపఱచి, వారికి తత్త్వస్వరూపమును ఉన్నదియున్నట్లుగాఁ దెలియఁబఱచుచున్నది. ఇవియన్నియును సర్వేశ్వరునిలీలారసయునువృద్ధిపఱచునట్టివి.

శుద్ధసత్త్వముయొక్కస్వరూపమునఁగలభేదంబెట్టిదనఁగా.-రజోగుణ తమోగుణములతోఁ నెంతమాత్రము చేరియుండక సంపూర్ణముగ సత్త్వగుణ యుక్తముగా నుండుటయే.

దీనియొక్క స్థితిభేదము సత్యములగు మండప గోపు రాదుల యందును, సర్వేశ్వరుని యొక్కయును, నిత్యసూరు లయొక్కయును శరీరములయందును నిత్యముగానుండును. నిత్యసూరుల యొక్కయును, ముక్తపురుషులయొక్కయును, సర్వేశ్వరుని యొక్కయును, అనిత్యములుగానుండవలయున నెడి సంకల్పమువలనఁ గలిగిన శరీరాదులయందు అనిత్య ముగానుండును.

దీనియొక్క ప్రవృత్తిభేదము—వీరియొక్క కోరికప్రకా రము పరిణమించుటవలన శేషికి భోగోపకరణముగాను, శేష భూతునికి కైంకర్యోపకరణముగాను నుండుట.

కాలమునకుఁగల స్వరూపభేదము—జడముగాను, విభువు గాను నుండుట.

దీనిస్థితి—కాలపరిమితిలేకుండుటంజేసి నిత్యమై యుండుట.

దీనికిఁగల ప్రవృత్తిభేదమును కలాకాష్ఠాది విభాగము చే సృష్ట్యాదులకు సాధనముగా నుంటలోఁ జూచుకొనునది.

ఈ పదారములన్నియును స్వరూపతః నిత్యములుగా నుండగలవు. నామాంతమును గలుగఁజేయఁదగినట్టి యవస్థాం తరమును బొందుటంజేసి కొన్నింటిని యనిత్యములనియును వ్య వహరించుట కద్దు. నశించుటయు, మరల కనుపించుటయునిట్టి యవస్థాంతరములుపైపైనిసంపూర్ణముగాఁగలవియగుటంజేసిఇవి * ప్రవాహనిత్యములనిచెప్పఁబడుచున్నవి. ఈపదార్థంబులన్నిం టియొక్కయును స్వరూప స్థితి భేదంబులు ఈశ్వరుని కధీనములు

* ప్రవాహనిత్యములనఁగా—ఏటిప్రవాహమువలె వొకప్పుడుం డుటయును, వేఱొకప్పుడు లేకపోవుటయును నగుట.

గానుండుటయనఁగా—ఈశ్వరసత్తయును, ఈశ్వరసంకల్పము
నుతప్ప, వీటికిగాను ప్రత్యేకముగా సత్తయనునది వేఱొక్కటిలే
కుండయుండుట. కావున ఈసమస్తవస్తువులకునుస్వాభావసిద్ధముగా
నుండుకున్నట్టి యానుకూల్యము ఈశ్వరసంకల్పము కధీనము.
ఈశ్వరసంకల్పమువలన స్వాభావసిద్ధమగు ఆనుకూల్యముండు
టంజేసి, ఈశ్వరునికిని, నిత్యులకును, ముక్తులకును సర్వము అను
కూలముగా నుండగలదు. బద్ధులకు కర్మానుగుణముగ పురుష
భేదమునుబట్టియును, కాలభేదమునుబట్టియును ఇవి ప్రతికూల
ములుగాను, కొంచముగ అనుకూలములుగాను నుండగలవు.
బద్ధులకును స్వాత్మస్వరూపము సర్వదా అనుకూలముగానుండు
ను అయిననిట్లువానిసంకల్పముచే అనుకూలమైనట్టి యాత్మస్వ
రూపముతో నొక్కటియనెడి (దేహాత్మ) భ్రాంతివలనను, కర్మవశ
మునను కదా హేయమైనట్టి శరీరము జ్ఞానహీనులకు అనుకూ
లమైనదిగాఁ దెలియఁగలదు. కర్మమువలన సంప్రాప్తములగు
నందున ప్రతికూలములగుటచే నివి ముముక్షువుకు త్యాజ్యంబుల
కాఁగలవు. స్వాభావ సిద్ధమగు ఆనుకూల్యమును బట్టి ముక్తుని
కివి తనకుమాత్రమే యుపాదేయంబులు కాఁగలవు. అహంకార
మమకారయుక్తుండై తనకు కావలయునని స్వీకరింపఁబడు
నట్టివి యన్నియును ప్రతికూలంబులు కాఁగలవు. అయితే స్వ
రూపజ్ఞానముకలిగి ఇవి యన్నియును సర్వేశ్వరునివియని భా
వించుకొనినట్టయిన, అన్నియును అనుకూలములు కాఁగలవు.
ఈవిషయమును పరిపూర్ణానుభవమును గుఱించి చెప్పునట్టి
సందర్భమున విశేషముగాఁ దెలుపఁగలము.

ఇవ్విధముగ అన్నింటియొక్కయును స్థితిగతులను తన

యధీనములో నుంచుకొని యున్నట్టివాఁడగు సర్వేశ్వరుఁడొ
క్క సత్యత్వము మొదలుగాఁగల స్వరూప నిరూపకధర్మ ము
లనుబట్టి, సత్యమై, జ్ఞానమై, అనంతమై, ఆనందమై, అమలమై
యుండును. ఈ యర్థమును ‹‹ నన్దావిళక్కై యాళ్ త్రర్ తి
యాయ్'' అనియు ‹‹ఉణర్ ముఝునలం'' (జ్ఞానమును, సంపూ
ర్ణానందమును) అనియు ‹‹శూఝ్ందతనిల్ పెరియశుడర్ ఞాన
విన్బమే '' (అంతటను వ్యాపించి దానికంటెను గొప్పదియగు
స్వప్రకాశము, జ్ఞానము, ఆనందము) అనియు (అమలన్=అ
మలుఁడు) అనియును ఈ మొదలగు పాశురములయందు ఆళ్వా
రులు అనుసంధించుకొని యున్నారు. తక్కినగుణములును, దివ్య
మంగళ విగ్రహాదులును, ఇవియన్నియును సర్వేశ్వరునికి నిరూ
పిత స్వరూప విశేషణము లుగా నుండగలవు. ఈ గుణంబులలో
జ్ఞాన, బల, ఐశ్వర్య, వీర్య, శక్తి, తేజస్సులు అనునవి ఆఱుగు
ణలును అందఱికిని యుపయుక్తములుగా నుండుగలవు. సౌశీ
ల్యవాత్సల్యాదులు సౌలభ్యమునకు ఉపయుక్తములుగా నుండగ
లవు. ఈ గుణములన్నియును సర్వకాలము సర్వేశ్వరుని స్వరూ
పమును ఆశ్రయించి యుండగలవు. పరవ్యూహాదివిభాగములఁ
దెలుపునట్టి సందర్భమున, దీనియందీగుణము లుకలవు దీనియం
దీగుణములుకలవని యిట్లు గుణ నియమమును చెప్పనదియంత
యును ఆయాస్వరూపముల ననుసంధించుకొనునట్టివారికి సర్వే
శ్వరుండు తనయందు బయలుపఱచునట్టి గుణంబులను తెలియఁ
జేయుటకుగానని యెఱుంగునది. ఉపనిషత్ప్రతిపాద్యమగు
ప్రతిభగవదుపాసనమునందును ఉపాసింపవలసినట్టి గుణములు
నియతంబులయినట్లు, పాంచరాత్ర శాస్త్రమునఁ జెప్పఁబడినం

బడినట్టి స్వరూపమును అనుసంధించుకొనునప్పుడును. అనుసం ధేయములగు గుణములు నియతముగ ఏర్పడియుండునవియని యె యుంగునది. అట్టిసందర్భమున పరస్వరూపమును అనుసంధించు కొనునప్పుడు జ్ఞానాదిగుణములు ఆఱును తెలియ వలసినవి

కొన్ని శాస్త్రములయందు వ్యూహములు నాలుగని యు,మరికొన్ని శాస్త్రములయందవి మూఁడనియును తెలుపఁ బడుచున్నవి వ్యూహములు నాలుగయినను, వాసుదేవవ్యూ హ స్వరూపమునకును పరస్వరూపమునకును అనుసంధేయంబులగు గుణములలో భేదములేనందున వ్యూహములు మూఁడేయని చెప్పుదురు. ఇట్లు వ్యూహములు మూఁడను పక్షమును పూర్వా చార్యులు "గుణైః షడ్భిస్త్వేతైః ప్రథమతరమూర్తిస్తవబభౌ తత స్తిస్రస్తేషాం త్రియుగయుగళైర్హి త్రిభిరభూః" (ఓ రంనాథా! నీయొక్క మొట్టమొదటిమూర్తి ఆఱుగుణములతో ప్రకాశించు చున్నది. తక్కినమూడింటిలో నొక్కొక్కటి రెండేసిగుణము... తో ప్రకాశించుచున్నది) అను శ్లోకమున సంగ్రహముగాఁ దెలి పియున్నారు.

ఈ పరవ్యూహంబులయొక్క గుణములు "షాడ్గుణ్యా ద్వాసుదేవః పర ఇతి స భవాన్ ముక్తభోగ్యో బలాఢ్యాత్। బో ధాత్సంకర్షణస్త్వం హరసి వితనుషే శాస్త్రమైశ్వర్యవీర్యాత్। ప్రద్యుమ్నస్సర్గధర్మౌ నయసి చ భగవాన్ శక్తితేజోనిరుద్ధో। బిభ్రా ణః పాసి తత్త్వం గమయసి చ తథా వ్యూహ్య రంగాధిరాజ" (ఓరంగ నాథా! నీవు షడ్గుణపరిశిష్టుండవై వాసుదేవుండుగాను పరమ పదవాసుండుగాను ముక్తులచే ననుభవింపఁబడుచున్నావు. నీవే జ్ఞానబలములవలన సంకర్షణుండవని పేర్కొనఁబడుచు

ములవలననున్న అధిష్ఠించి, వారిచే లోకోత్కృష్టములగు పను లను చేయించుటయును యొకయవతారవిశేషమే.

ఇట్లు పరవ్యూహాది రూపములుగా నుండునట్టి సర్వేశ్వరుండు తానే స్వయముగ ఆశ్రితులకుగాను వారుకోరినప్రకారము "బింబాకృత్యాత్మనాబింబే సమాగత్యావతిష్ఠతే" (విగ్రహాకారముగ తానే స్వయముగ విగ్రహమునందు నిలిచి యున్నవాఁడు) అన్నట్లు వేంచేసియుండుట యనునది యర్చావతార మనఁబడుచున్నది.

అందఱి యొక్కయును హృదయమునందు సూక్ష్మముగానుండునట్టి యొకశరీరముఁగొని వేంచేసియుండుట యంతర్యామ్యవతార మనఁబడుచున్నది. ఇది సర్వాంతర్యామియగు దివ్యాత్మ స్వరూపమును అనుసంధించుకొనుటకు శక్తిలేనివారికి వీలు అయినట్టిదిగాను "అష్టాంగయోగసిద్ధానాం హృద్యాగనిరతాత్మనాం। యోగినామధికారస్స్యాత్ ఏకస్మిన్ హృదయేశయే" (అష్టాంగయోగమున సిద్ధిగలిగినట్టివారై హృదయమునందుండువానినిధ్యానించుటయందు ప్రీతిగలవారికి హృదయమునందు శయనించియుండునట్టివానిని ధ్యానించుటయందధికారముగలదు) అనుతావులఁ జెప్పియున్నందున నిది యంతర్యామి రూపంబని చెప్పఁబడినది. ఇట్లు అవతరించినట్టి రూపంబుల విధంబులన్నియును శుద్ధసత్వమయంబులై, కర్మముతోఁగాని దానిఫలంబులతోఁగాని సంబంధము లేనివగుటంజేసి శుద్ధసత్వ సృష్టియని ప్రసిద్ధిపొందినవి. ఈ యవతారంబులన్నియును సత్యంబులనియు, ఏటిలోనుండునప్పుడు సర్వేశ్వరునికి జ్ఞానసంకోచం బెద్దియునులేదనియు, ఈ విగ్రహంబులు శుద్ధ

సత్వ మయాంబులనియు, వీటికి సర్వేశ్వరుని సంకల్పంబే నిమి
త్తంబనియు ధర్మపరిపాలనము చేయవలసినట్టి కాలమే, కాలం
బనియు, సాధుపరిత్రాణాదులే ప్రయోజనంబులనియు, ఈవిష
యముం దెలిసికొని అనుసంధించుకొను నట్టివారికి ఆజన్మమున
నే తమయధికారమున కనుగుణముగ ఇష్టోపాయము సిద్ధించు
టచే వేఱొక్కజన్మము నెత్తకుండ, ముక్తులు కావచ్చునని
"బహూని మేవ్యతీతాని" ఇత్యాది శ్లోకము మొదలుకొని
అయిదు శ్లోకంబులచే భగవంతుండే స్వయముగ తెలిపియు
న్నాడు. ఇది స్వతంత్రమగు ప్రవృత్తియందు నిష్ఠగలవానికి
అనంగా ప్రపన్నునికి శరణ్యుండగు వర్వేశ్వరుని గుణంబులం
దెలిపి, యందుమూలముగ ఉపాయానుష్ఠాన సమయమున
మహా విశ్వాసాదులను స్థిరపఱచి, యందుమూలముగ ఉప
యుక్తమైనది కాంగలదు. ఇవ్విధముగానే యర్చావతారమున్ను
మోక్షము నొసంగునను విషయమును "సురూపాం ప్రతిమాం
విష్ణోః ప్రసన్నవదనేక్షణాం కృత్వాత్మనః ప్రీతికరీం సువర్ణర
జతాతిభిః । తామర్చయేత్తాం ప్రణమేత్ తాంయజేత్తాంవి
చింతయేత్ । విశత్యపాస్త దోషస్తు తామేవబ్రహ్మరూపిణీం"
అనంగా ప్రసన్నములగు తిరుముఖమండలమును తిరునేత్రము
లనున్ను గలిగియున్నదైయందమగు విష్ణువుయొక్క విగ్రహమును
తనకు ప్రీతిఁగలుగఁ జేయునట్టి దానిని గాను స్వర్ణరజతాది
లోహంబులతోఁ జేయించి దానిని పూజించునది. దానికి దండ
ము సమర్పించునది. దానికి తిరువారాధనను సమర్పింపవలసి
నది. దానిని ధ్యానింపవలసినది. అట్లానర్చినట్లయిన, బ్రహ్మ
స్వరూపియగు ఆ విగ్రహమునే యాతండు ప్రవేశించుచున్నాడు

అని యివ్విధమున శౌనమహర్షివర్ణించియున్నాడు. ఇట్లా ళ్వారులున్ను యీ యర్చావతారముయొక్క రహస్యమునున్ను యీ యర్చావతారమునకుఁగల వైలక్షణ్యమునున్ను మిక్కట ముగా ననుసంధించుకొని దీనియొక్కయే సంక్షిప్త స్వరూప మునుగాను పరతత్త్వమును తలంచియున్నారు.

ఇట్టి వాఁడగు సర్వేశ్వరుండు తనయానందమునకు సహకారముగాను చేయునట్టి పనులు సృష్టి, స్థితి, సంహార, మోక్ష ప్రదత్వాదులు. ఇట్టి సర్వేశ్వరుండు "నిత్యైవైషాజగ న్మాతా । విష్ణోశ్శ్రీరనపాయినీ" ఇత్యాది తావులఁ జెప్పియు న్నట్లు సర్వావస్థలయందును పత్నీసహితుండై యుండుటను విషయమును "తత్త్వేనయః" అనియు "మాతాపితా" అని యును ఈ మొదలగు శ్లోకములయందు ఆదరముతో విశేషిం చిచెప్పియున్నట్టి పరాశర పరాంకుశాది ప్రబంధములయందు తెలిసికొనఁగలరు. ప్రకృతమున నన్ననో, దండధరత్వము (శి క్షించుట) పెరుమాళ్లయొక్క కృత్యముగాను, పురుషకారముఁ జేయుట పిరాట్టియొక్క కృత్యముగానును బాగుగ విభజించి తెలుపఁబడుచున్నది. ఇప్పుడుపదేశించినదానికంటెను, ముం దేయుపదేశించినదానిఁ బేర్కొనుటలో విశేషముస్వతస్సిద్ధం బని వీరు సాయించినదానికి యిట్టివిభాగమునందు దెలియవ చ్చునట్టి వైష్యమ్యమున తాత్పర్యము. ఈ విషయము *"యువ

---

*శ్లో॥ యువత్యాదౌ తుల్యే ప్యపరవశతా శత్రుశమన
స్థిరత్వాదీన్ కృత్వా భగవతిగుణాన్ పుంస్త్వసులభాన్
త్వయి స్త్రీత్వైకాన్తాన్ మ్రదిమపతిపారార్థ్యకరుణా
క్షమాదీన్వా భోక్తుమ్భవతియువయోరాత్మనిభిదా॥

త్వా దాతుల్యే" అను శ్లోకమున శ్రీగుణరత్నకోశమున నిర్ణయింపఁబడినది "యిత్తైనిత్తై యుణర్వరితు" (సర్వేశ్వరుని స్వరూపస్థితుల నెఱుంగుట యశక్యము) అని యాళ్వారులు సాయించినది వృథానిర్బంధము కాఁజాలదు. "కృశానర్థాన్ తతః కేచిత్ అకృశాం స్తత్రకుర్వతే" (కొందఱు సారములేని యర్థములనున్ను మఱికొందఱు సారవంతములగు అర్థములనున్ను చెప్పుచున్నారు) అన్నట్లు తర్కపాండిత్యమువలన నిష్టమువచ్చిన దంతయును సాధింపవచ్చుననికదా, మనము ప్రమాణపరతంత్రులమై యున్నాము. కావున ఈశ్వరతత్త్వమును, వానిచేపాలింపఁబడునట్టి జీవులు మొదలగు ఇతరతత్త్వములనున్ను ప్రమాణానుగుణముగ తెలిసికొని యుండుట యావశ్యకము. ఈవిషయమును తెలిసికొనుటకు సర్వజ్ఞులమై యుండవలసిన పనిలేదు. నిరుపయోగములైనట్టి వాటివలెనే యుండునట్టి యల్పఫలంబుల కాశింపఁబనిలేదు. అంతులేని సముద్రమును ఓడపైనెక్కి దాటగోరువారికి దారిమొదలగునవి తెలియవలసినట్లు ఇంతమాత్రము విచారించుట మిక్కిలి యావశ్యకము. ఇది ప్రతిష్ఠితంబైనందున దీనిహేతువులను గమనింపవలయును.

---

తా. తల్లీ! మీయిద్దఱికిని యౌవనాదిగుణములు సమానములైనను నీభర్తయందు అపరవశతా (స్వతంత్రత్వమున్ను) శత్రుశమన (శత్రువులను నిగ్రహించుట) స్థిరత్వ (స్వకార్యమునుండి చలింపకుండుట) ఈమొదలగు గుణములును, నీయందు మ్రదిమ (మృదుహృదయము) పతిపారార్థ్య (భర్తకు పరతంత్రురాలుగా నుండుట) కరుణా (ఇతరుల దుఃఖములను సహింపలేకుండుట) క్షమా (ఇతరుల అపరాధములను సహించుట) ఈమొదలగు గుణములు మీస్వరూప విగ్రహములను అనుభవించుటలో భేదమునుస్పష్టముగ లిగించుచున్నవి.

ఇవ్విధమున మూఁడుతత్త్వములుగాను విభజించి విచా
రించునట్టి వారివలెనే సర్వవిశిష్టంబగు స్వరూపమునుబట్టి
సర్వేశ్వరుం డేకతత్త్వంబని యనుసంధించుకొనునట్టి వారికిని,
జ్ఞాతవ్యములు ఈ శేశితవ్యంబులనియు, చేతనాచే తనంబు
లనియు, ఉపాయోపేయంబులనియును చెప్పునట్టి వారివలెనే
రెండు అర్థములను దెలిసికొన వలసినట్టి వాటినిగాను అంగీ
కరించునట్టి వారికిని, రక్ష్యవస్తువు, రక్షకుండు, హేయము,
ఉపాదేయంబనియిట్లు అర్థచతుష్టయమును తెలియవలసిన
దానినిగా నంగీకరించునట్టి వారికిని, యింతకు ముందుచెప్పి
నట్లు అర్థపంచకము జ్ఞాతవ్యంబనియు, అర్థషట్కము జ్ఞాత
వ్యంబనియునిట్లు వివేచించునట్టి వారికిని, రహస్యశాస్త్ర
ములయందుఁ జెప్పియున్నట్లు సప్తపదార్థములను వివేచిం
చునట్టి వారికిని వారివారి జ్ఞానానుష్ఠానంబుల కనుగుణంబు
లగు ఫలవిశేషంబుల గనుఁగొనునది.

“శాస్త్రజ్ఞానం బహుక్లేశం బుద్ధేశ్చలనకారణం ఉప
దేశాద్ధరింజ్ఞాత్వా విరమేత్సర్వకర్మసు” (శాస్త్రములఁ
జదివి జ్ఞానమును సంపాదించుకొనుట కష్టతరము దానివలన
నొకప్పుడు బుద్ధియును చలించును. ఉపదేశమువలన భగ
వంతునెఱింగి సమస్తకర్మంబులను విడనాడునది) అని చెప్పి
నది మొదలుకనఁగా ఉపయుక్తంబగు సారాంశమును శీఘ్ర
ముగాఁ దెలిసికొని, కృషిసల్పక, భోజనమున్నవాఁడు వ్యవ
సాయముఁ జేయకుండునట్లు విస్తృతములగు శాస్త్రాభ్యాస
రూపములగు పనులను విడనాడి వెంటనే మోక్షోపాయ

ములోఁ బ్రవేశించుటయు యుక్తమని యెఱుంగునది. కావుననేఁ "ఉపయుక్తేషు వైశద్యం త్రివర్గే నిరపేక్షతా। కరణత్రయసారూప్యమితి సౌఖ్యరసాయనమ్" ఉపయుక్తంబులయినట్టి వాటిని బాగుగా నెఱింగియుండుటయు, ధర్మార్థకామముల విషయమున వైరాగ్యమును, మనోవాక్కాయంబులేకరూపములుగా నుండుటయును నిది సౌఖ్యము గలుగుటకు ముఖ్యహేతువు) అని చెప్పఁబడినది.

పా॥ తేఱవియమ్బినర్ శిత్తుమశిత్తుమిఱైయుమెన, వేఱుపడుం
వియత్తత్తువమ్మూన్ఱుం విణైయుడమ్బిల్, కూఱుపడుంకొ
డుమోహముం తానిఱై యాంజ్ఞానమ్ కురిప్పమ్, మాఱనిఱైం
దరుళాల్ మణవాళ మామునిగళ్ తందవాదియరే॥ ౧౨

టీ॥ మణవాళమామునిగళ్ తందవాదియరే = వేదాంతశాస్త్రోపదేశకులగు మామునులగు వరవరమునీంద్రాచార్యులు, విణైయుడమ్బిల్ = ప్రారబ్ధంబగు శరీరమునందు, కూఱుపడుం = అంశముగానుండి, కొడుమోహం = క్రూరమైనట్టి భ్రమను, తాన్ = తాను, ఇఱై = స్వామి, ఆమ్ = అయినాననెడి, కురిప్పుం = జ్ఞానమును, మాఱనిఱైన్దు = నివర్తింపఁజేయవలయుననెడి యిచ్ఛతో, అరుళాల్ = కృపవలన, శిత్తుమ్ = చిత్తును, అశిత్తుమ్ = అచిత్తును, ఇఱైయుం = ఈశ్వరుండును, ఎన = అని, వేఱుపడుమ్ = పృథక్ స్వరూపయుక్తంబైనట్టి, తత్తువమ్మూన్ఱుం = తత్వత్రయమును, తేఱ = విశదముగ నుండునట్లు, వియమ్బినర్ = ఉపదేశించినారు.

తా॥ వేదాంతశాస్త్రోపదేశకులగు మామునులు దేహాత్మభ్రమను, స్వాతంత్ర్యాత్మభ్రమను, ఆత్మైక్యభ్రమనునున్న పోగొట్టవలయుననెడి తలంపుతో చిదచిదీశ్వరరూపమగు తత్త్వత్రయమును వివేచించి యుపదేశించినారు.

శ్లో॥ ఆవాపోద్వాపతస్స్యుః కతికతికవిధీచిత్రవత్తత్తదర్థే
ష్వానంత్యాదస్తి నాస్త్యోరనవధికుమహా యుక్తికాన్తాః
కృతాన్తాః । తత్త్వాలోకస్తులోపం ప్రభవతిసహసా
నిస్సమాస్తాన్సమస్తాన్ పుంస్త్వే తత్త్వేనదృష్టేపునరపి
నఖలుప్రాణితాస్థాణుతాదిః ॥

టీ॥ కవిధిచిత్రవత్ = కవులయొక్క బుద్ధిచాతుర్యప్రకారము, తత్తద్ధర్థేషు = ఆయాయర్థముల విషయమున, అస్తినాస్త్యోరానంత్యాత్ = ఇదియవును ఇది కాదు అనెడి వాదనలు అనంతముయినందున, ఆవాపోద్వాపతః = కొన్నింటిని గ్రహించుటచేతను మఱికొన్నింటిని విడిచిపెట్టుటచేతనున్ను, అనవధికమహా యుక్తికాంతాః = అనంతములగు కుయుక్తులచే సుందరములయినట్టి, కతికతికృతాంతాః = కొన్నికొన్ని సిద్ధాంతములు, స్యుః = ఉండగలవు. అట్లయినను, నిస్సమః = ప్రతిపక్షరహితంబైనట్టి, తత్త్వాలోకః = జ్ఞానవిశేషము, సమస్తాన్ = సమస్తములగు, తాన్ = ఆసిద్ధాంతములను, సహసా = శీఘ్రముగ, లోపం = రూపుమాసి పోవునట్లుచేయుటకు, ప్రభవతి = సమర్థమగుచున్నది. పుంస్త్వే = పురుషుండు, తత్త్వేన = యథార్థముగ, దృష్టే = చూడబడినట్లయిన, స్థాణుతాదిః = స్థాణువనెడిభ్రాంతి, పునరపి = మరల, నప్రాణితాఖలు = జీవించియుండదు కదా.

తా॥ బుద్ధి చాతుర్యముగలవారలు వాదములచే సుందరముగ అనేక సిద్ధాంతములను నిర్మించినను, తత్త్వజ్ఞానము వాటినన్నింటిని త్వరితముగ రూపుమాసిపోవునట్లు చేయగలదు. అది యెటువలెననిన, చీకటిలో నిలువబడియున్నట్టి పురుషునియెడల స్తంభమనెడి భ్రాంతి వెలుతురున చూచి పురుషుడే యని నిశ్చయముగలిగినప్పుడు, మరల యాతనిమనంబున నుండగలదా?

తత్త్వత్రయాధికారము.
ముగిసెను.







శ్రీమతే నిగమాంతదేశికాయ నమః,

# రహస్యత్రయసారము

## పరదేవతాపారమార్థ్యాధికారము.



శ్లో॥ ఆత్మైక్యం దేవతైక్యం త్రికసమధిగతా తుల్యతైక్యం త్రయాణా । మన్యత్రైశ్వర్యమిత్యాద్యనిపుణ ఫణితీ ర్నాద్రియన్తేన సంతః । త్రయ్యంతైరేకకంఠై స్తదనుగుణమనువ్యాస ముఖోక్తిభిశ్చ । శ్రీమాన్నారాయణో నః పతిరఖిలతనుర్ముక్తిదో ముక్తభోగ్యః॥

టీ॥ ఆత్మైక్యం = ఆత్మయొక్కటియే యనెడి మతమును, దైవతైక్యం = దేవతలన్నియు నొక్కటియేయను మతమును, త్రికసమధిగతా = బ్రహ్మవిష్ణు మహేశ్వరుల విషయమగు, తుల్యతా = సామ్యమును, ఐక్యం = ఐక్యమునున్ను, త్రయాణాం = ఈముగ్గురికంటెను, అన్యత్ర = వేఱుగ, ఐశ్వర్యమ్ = ఈశ్వరత్వము కలదని, ఇత్యాద్యనిపుణఫణితీః = ఇవ్విధముగ శాస్త్రపరిచయములేనివారు చేయునట్టి వాదములను, సంతః = తత్వవేత్తలు, నాద్రియంతే = లక్ష్యపెట్టరు. ఏకకంఠైః = ఒకేవిధముగా చెప్పనట్టివియగు, త్రయ్యంతైః = ఉపనిషత్తులచేతను, తదనుగుణ మనువ్యాస ముఖోక్తిభిశ్చ = వాటికనుగుణముగ మనువును, శ్రీవేదవ్యాసులునురచియించిన గ్రంథముచేతనున్ను, శ్రీమన్నారాయణః = శ్రీమన్నారాయణుండే, నః = మాకు, పతిః = పాలకుండనియు, అఖిలతనుః = సమస్తపదా

ర్థములను శరీరముగాఁగలవాడనియు, ముక్తిదః = మోక్షమునిచ్చువాఁడనియు, ముక్తభోగ్యః = ముక్తపురుషులచే ననుభవింపఁబడువాఁడనియును తెలియవచ్చుచున్నాఁడు.

తా ॥ అన్నిశరీరములలో నుండునట్టి జీవుండొక్కఁడే యనియు, ఇంద్రాది దేవతలన్నియునుచేరి యొక్కటియే దేవతయనియు, త్రిమూర్తులకు సామ్యమునున్న ఐక్యమునున్న సాధించుచు శాస్త్రపరిచయములేని వారివాదములకు ప్రమాణపరతంత్రులయినవారు నొప్పుకొనరు, ఏలననఁగా ఉపనిషత్తులచేతను వాటికనుగుణముగ వ్యాసాదిమహర్షులు రచియించిన గ్రంథములచేతనున్న శ్రీమన్నారాయణుం డొక్కండే యంతటిని పాలించునట్టివాఁడుగాను, అన్నింటిని శరీరముగాఁగలవాఁడుగాను, మోక్షమునొసంగునట్టివాఁడుగానును, ముక్తపురుషులచే అనుభవింపఁబడునట్టివాఁడుగానును తెలియవచ్చుచున్నాఁడు.

పూర్వము చెప్పిన ప్రకారము సామాన్యముగ ప్రకృతి పురుషస్వరూపంబులను వివేచించినను, “ఒన్నుం తేవం” (ఒక్కండే దేవుండు) ఇత్యాది తావులఁ జెప్పియున్నట్లు, పరదేవత యెద్దియో, విచారింపని పక్షమున “ఉన్నైత్తు మత్తొరు తైవంతొళ్ళావన్నైయల్లాల్” (నిన్నుతప్ప వేఱొక్కదైవమును నమస్కరింపని వాఁడను) అన్నట్టి పరమైకాంతిత్వము సిద్ధింపనందునను, పరమైకాంతికి తప్ప (తక్కిన వారికి) నిరాటంకముగ మోక్షము సిద్ధింపనందునను, ఈశ్వరుండిట్టి దేవతయని నిర్ణయించి తెలిసికొనవలసియున్నది.

ఈ సందర్భమున, చేతనాచేతనంబులకు భేదము మిక్కుటముగా నుండి యున్నట్లు ప్రమాణసిద్ధంబగుటంజేసి, యిది యంతయును పరదేవతయగు బ్రహ్మమే యనిచెప్పుట యెంతమాత్రము పొసగదు. స్వభావసిద్ధముగ జీవేశ్వరులకు భేదముండుటను, అట్లే దేవాదిరూపులగు జీవులకుఁ బరస్పరముగల

భేదము సుఖదుఃఖాది వ్యవస్థలనుబట్టి ప్రమాణసిద్ధంబగుటం జేసి, సర్వాంతర్యామి యొక్కఁడే యైనను, బ్రహ్మేంద్రాది సర్వదేవతలకును ఈశ్వరునితోఁ గాని, తమలోఁ దమకుఁ గాని నైక్యము కలదనుటయును యుక్తము కాదు.

(ఈ దేవతలలో ప్రధానులుగాఁ జెప్పఁబడునట్టి బ్రహ్మరుద్రేంద్రాదులు సృష్టింపఁబడినట్టి వారుగాను, కర్మవశ్యులుగాను నుండుట ప్రమాణ సిద్ధంబగుటం జేసియు, "ఆభూతసంప్లవే ప్రాప్తే ప్రలీనే ప్రకృతౌ మహాన్ । ఏకస్తిష్ఠతి విశ్వాత్మా స తు నారాయణః ప్రభుః । ఆద్యో నారాయణో దేవః తస్మాత్ బ్రహ్మ తతో భవః । పరో నారాయణో దేవస్తస్మాజ్జాతశ్చతుర్ముఖః తస్మాద్రుద్రోభవద్దేవి' (భూతములన్నింటికిని మహాప్రళయము సంభవించినప్పుడు ఇది యంతయును ప్రకృతియందు లీనము కాఁగా, విశ్వరూపుండగు నారాయణుండు మాత్రమే స్థిరముగా నుండియుండువాఁడు. మొట్టమొదట నారాయణుం డొక్కఁడే యుండెను. వానినుండి చతుర్ముఖబ్రహ్మము పుట్టెను. వానినుండి రుద్రుండు పుట్టెను. నారాయణుండు పరాత్పరుండు. కావుననే వానినుండి చతుర్ముఖబ్రహ్మము పుట్టెను. వానినుండి రుద్రుండు పుట్టెను) ఇత్యాదితావులను "తతస్త్వమపి దుర్ధర్షస్తస్మాద్భావాత్సనాతనాత్ । రక్షార్థం సర్వభూతానాం విష్ణుత్వముపజగ్మివాన్" (అటుపిమ్మట దుర్ధర్షుండవగు నీవున్ను నీకు స్వాభావికమగురూపముచే సమస్తజీవరాశులను రక్షించుటకై విష్ణువుగా నవతరించినావు." అని చెప్పియున్నట్లు స్వేచ్ఛతో నవతరించినవాఁడై, త్రిమూర్తి మధ్యనుండు విష్ణువు నారాయణుం డనఁబడువాఁడు. వాఁడు తానే తన పూర్వావస్థయందు

సర్వముకును కారణమని చెప్పియున్నందునను "నిత్యంహినాస్తి జగతిభూతం స్థావరజంగమం । ఋతేతమేకంపురుషం వాసుదేవంసనాతనం" (నారాయణుండుతప్ప స్థావరజంగమపదార్థములలో నిత్యమైనది లేదు) అనట్లుఆనారాయణుండే నిత్యుండని చెప్పియుండుటంజేసియును, త్రిమూర్తులు సమానులనికాని, త్రిమూర్తులొక్కటియే తత్వమనికాని, త్రిమూర్తులకంటెను వేఱయినవాఁడు ఈశ్వరుండనియును, త్రిమూర్తులలో బ్రహ్మకాని, రుద్రుండుగాని, ఈశ్వరుండనియు ఇవ్విధముగ చేయునట్టి వాదము లెవ్వియు పొసగునవికావు.

బ్రహ్మరుద్రాదులు సర్వేశ్వరునిచే సృజింపఁబడినట్టి వారనెడి విషయము "తద్విసృష్టస్సపురుషోలోకే బ్రహ్మేతికీర్త్యతే" (వానిచే సృజింపఁబడినట్టి పురుషుఁడే బ్రహ్మయని లోకమున వ్యవహరింపఁబడుచున్నాఁడు.) ఇత్యాది తావులను "సంక్షిప్యచపురాలోకాన్ మాయయాస్వయమేవహి। మహార్ణవే శయానోప్సుమాంత్వంపూర్వమజీజనః । కఇతి బ్రహ్మణోనామ ఈశోహం సర్వదేహినాం అవాంతవాంగే సంభూతౌ తస్మాత్కేశవనామవాన్ । అహంప్రసాదజస్తస్యకస్మింశ్చిత్కారణాంతరే త్వాంచైవక్రోధజస్తాత పూర్వసర్గే సనాతనః" (పూర్వమునందు లోకములనన్నింటిని తనశక్తివలన తనలో నుంచుకొని మహార్ణవమునఁ బవ్వళించియున్నప్పుడు నన్ను పుట్టించితివి. కకారముకు బ్రహ్మంబనియర్థము నేనుసర్వజీవులకును ఈశుండను మేము ఉభయులమున్ను నీలోనుండి పుట్టినందున నీవు కేశవుండని పిలువఁబడుచున్నావు. నేనొకప్పు డొకకారణవశ

మున వానియనుగ్రహమువలనఁ బుట్టినట్టివాఁడను. నీవో వాని యొక్క క్రోధమువలనఁ బుట్టినవాఁడవు." అనియిట్లు బ్రహ్మ రుద్రులే స్వయముగ చెప్పియున్నందున వారి వాక్యమువలననే యీవిషయము తేటబడుచున్నది.

వీరు కర్మవశ్యులై కొన్నికర్మముల ననుష్ఠించుటచే సర్వేశ్వరుని యారాధించి, తమతమ యధికారములను లభించినారనియును, ఈక్రింద ఉదహరించిన వాక్యములవలనఁ దెలియవచ్చుచున్నది.

శ్లో॥ సర్వే దేవా వాసుదేవం యజన్తే

తా॥ సమస్తదేవతలును వాసుదేవుని ఆరాధించుచున్నారు.

శ్లో॥ సర్వే దేవా వాసుదేవం నమస్తే

తా॥ సమస్తదేవతలును వాసుదేవునికి దండము సమర్పించుచున్నారు.

శ్లో॥ సబ్రహ్మకా సరుద్రాశ్చ సేంద్రా దేవా మహర్షయః ।
అర్చయన్తి సురశ్రేష్ఠం దేవం నారాయణం హరిం।

తా॥ చతుర్ముఖబ్రహ్మమును, రుద్రుండును, ఇంద్రుండును తక్కిన దేవతలందఱును దేవదేవుండగు నారాయణుని యారాధించుచున్నారు.

శ్లో॥ చిన్తయన్తోహియంనిత్యం బ్రహ్మేశానాదయఃప్రభుం ।
నిశ్చయం నాధిగచ్ఛంతి తమస్మి శరణం గతః॥

తా॥ బ్రహ్మేశానాదు లెవ్వనిని దివారాత్రములు ధ్యానించుచునేయున్నను, వాఁడిట్టివాఁడని యింకను నిర్ణయింపనేరకయున్నారో, అట్టి సర్వేశ్వరుని శరణుజొచ్చుచున్నాఁడను.

శ్లో॥ పద్మేదివ్యేర్కసంకాశే నాభ్యాముత్పాద్యమామపి।
ప్రాజాపత్యంత్వయాకర్మసర్వంమయినివేశితం॥

తా॥ దివ్యమును సూర్యునివలెనే దేదీప్యమానంబగు నాభికమలమునందు నన్ను జనింపఁజేసి ప్రాజాపత్యకర్మను నాయధీనములో నుంచియున్నావు.

శ్లో॥ సోహంసన్యస్తభారోహిత్వాముపాసే జగత్పతిం।

తా॥ అట్లు ప్రాజాపత్యాధికారమున నియోగింపఁబడినట్టివాఁడనై నేనెల్లప్పుడును నిన్నే యుపాసించుచున్నాను.

శ్లో॥ యుగకోటిసహస్రాణి విష్ణుమారాధ్య పద్మభూః।
పునస్త్రైలోక్యధాతృత్వం ప్రాప్తవానితిశుశ్రుమ॥

తా॥ చతుర్ముఖబ్రహ్మము వేలకొలదియును కోట్లకొలదియును యుగములు విష్ణువు నారాధించి మరల త్రైలోక్యసృష్టియందు నియమింపఁబడుచున్నాడని వినియున్నాము.

శ్లో॥ విశ్వరూపోమహాదేవస్సర్వమేధేమహాక్రతౌ।
జుహావసర్వభూతాని స్వయమాత్మానమాత్మనా॥

తా॥ విశ్వరూపుండగు మహాదేవుండు సర్వమేధ మనఁబడునట్టి మహాక్రతువునందు సర్వభూతములనున్ను హోమము చేసెను. తనను కూడ తానే స్వయముగ అందులో హోమము చేసెను.

శ్లో॥ మహాదేవస్సర్వమేధే మహాత్మాహుత్వాత్మానం దేవదేవోబభూవ। విశ్వాన్లోకాన్వ్యాప్యవిష్టభ్యకీర్త్యావిరాజతే ద్యుతిమాన్ కృత్తివాసాః॥

తా॥ మహాత్ముండగు మహాదేవుండు సర్వమేధంబను యజ్ఞమునందు తనను హోమముచేసి యందు మూలముగా

దేశ దేవుండాయెను. అంతట అతండు అగ్నిలోకములనున్ను వ్యాపించి, ప్రసిద్ధమైనవాండై ప్రకాశవంతుండుగాను ధర్మధరుండుగానున్ను విరాజిల్లుచున్నాడు.

శ్లో॥ యోమేయథాకల్పితవాన్ భాగమస్మిన్ మహాక్రతౌ।
సతదాయజ్ఞభాగార్హో వేదసూత్రేమయాకృతః॥

తా॥ ఈ మహాక్రతువునందు నాకు భాగమును యేర్పఱచితివిగాన, నీవున్ను యజ్ఞభాగార్హుండవుగాను నాచే వేదసూత్రమునందు చెప్పంబడి యున్నావు.

ఈ పైవాక్యములనుండి సిద్ధమగుచున్నది.

వీరు భగవన్మాయా పరతంత్రులై, సత్వరజస్తమోగుణవశ్యులై జ్ఞానమునందు సంకోచ వికాసములను బొందునట్టి వారగుటను వేదాపహారాది వృత్తాంతములయందును.

శ్లో॥ బ్రహ్మాద్యాస్సకలాదేవాః మనుష్యాఃపశవస్తథా
విష్ణుమాయామహావర్త మోహాంధతమసాకృతా॥

తా॥ బ్రహ్మమొదలుకొని సమస్తదేవతలును, మనుష్యులును పశువులును విష్ణువుయొక్క మాయయనెడి యంధకారములో మునింగిపోయి యున్నారు.

శ్లో॥ బ్రహ్మవిశ్వసృజోధర్మః మహానవ్యక్తమేచ।
ఉత్తమాంసాత్వికిమేతాం గతిమాహుర్మనీషిణః

తా॥ బ్రహ్మము, మహత్తు, అవ్యక్తము వీటిని విశ్వస్రష్టయగు భగవంతుని శరీరమునుగానెఱుంగుటను సాత్వికమగు ఉత్తమగతినిగాను జ్ఞానులు చెప్పుదురు.

ఈపైవాక్యముల వలననున్ను తెలియంగలదు.

వీరు తమకంతరాత్మయగు సర్వేశ్వరుం డిచ్చినట్టి జ్ఞానములఁగాని వావికేపనిచేయుదురను విషయము,

శ్లో॥ ఏతౌ ద్వౌవిభుధశ్రేష్ఠౌ ప్రసాదక్రోధజౌస్మృతౌ
తదాదర్శితపంథానౌ సృష్టిసంహారకారకౌ॥

తా॥చతుర్ముఖ బ్రహ్మయును శివుండును వీరు ఉభయులలోఁ బరబ్రహ్మముయొక్క అనుగ్రహమునుండి యొక్కఁడును కోపమునుండి మఱియొక్కఁడును పుట్టినవారు. వీరు సర్వేశ్వరునిచే నియమింపఁబడినట్టి విధమున సృష్టిసంహారముల నొనర్చునట్టివారు.

ఈపైవాక్యములయందుఁ జెప్పఁబడినది,

వీరు మంగళవంతులుకారను విషయము "హిరణ్యగర్భోభగవాన్ వాసవోథప్రజాపతిః" అనియారంభించి "అశుద్ధాస్తే సమస్తాస్తు దేవాద్యాః కర్మయోనయః" (దేవతలందఱును అపరిశుద్ధులును, కర్మమువలన జన్మించినట్టివారును) అనియు "ఆబ్రహ్మస్తంబపర్యంతాః జగదంతర్వ్యవస్థితాః ప్రాణినః కర్మజనిత సంసారవశవర్తినః" (బ్రహ్మము మొదలుకొని గడ్డిపాచవరమును జగత్తులో నుండునట్టి ప్రాణులు కర్మమువలనఁగలిగిన సంసారవశముననుండువారు) అనియు, "కర్మణాంపరరిపాకత్వా దావిరించాద మంగళం ఇతిమత్వావిరక్తస్య వాసుదేవః పరాగతిః" (కర్మపరిపాక మగుటంజేసి, బ్రహ్మము మొదలుకొని యంతయును అమంగళము. ఇవ్విధమున తలంచుకొని విరక్తుండయినవానికి వాసుదేవుండే శరణము) అనియు నివ్విధముగ పరాశర శౌనకాదులు ప్రతిపాదించియున్నారు. వారికి భగవంతుండే యాధారమనియు, భగవంతునికి వే

జోక్క యాధారమక్కఱ లేదనియు "రుద్రం సమాశ్రితా దేవాః। రుద్రో౽బ్రహ్మణ మాశ్రితః బ్రహ్మమామాశ్రితో౽రాజన్ నాహం కంచిదుపాశ్రితః మమాశ్రయోన శ్చిత్తు సర్వేషామాశ్రయోహ్యహం' ! (దేవతలు రుద్రుని యాశ్రయించుదురు. రుద్రుండు చతుర్ముఖబ్రహ్మను నాశ్రయించును. చతుర్ముఖబ్రహ్మను నన్ను ఆశ్రయించును. నేనుఒక్కనినిన్ని ఆశ్రయించియుండునట్టివాఁడను కాను. అయితే నేను అందఱికిన్ని ఆశ్రయభూతుండను) అనుతావున భగవంతుండే స్వయముగ చెప్పియున్నాడు

వీరు ఉభయవిభూతి నాయకుండగు సర్వేశ్వరుని విభూతిలోఁ జేరియుండునట్టివారను విషయము "బ్రహ్మదక్షాదయః కాలః । రుద్రః కాలాంతకాద్యాశ్చ'' ఇత్యాది తావులయందు తక్కిన వారితో సమానులనుగా వీరిఁ బేర్కొనుటంజేసి తెలుపఁబడినది.

ఇట్లు తక్కినపదార్థములవలెనే వీరును సర్వశరీరియగు సర్వేశ్వరునికి శరీరభూతులయినవారనెడి విషయము తక్కిన వస్తువులనున్ను వీరినిన్ని చేర్చి అందరినిన్ని నారాయణాది శబ్దములసామానాధికరణ్యమువలనఁ దెలుపుటచేఁ దెలియఁదగును.

వీరందఱున్ను శరీరభూతులనియు, సర్వేశ్వరుండు వీరి కాత్మయనియును "తవాన్తరాత్మామమచ యేచాన్యే దేహిసంజ్ఞకాః సర్వేషాం సాక్షిభూతో౽సౌ నగ్రాహ్యః కేన చిత్ క్వచిత్'' (సర్వేశ్వరుండు నీకును నాకును అంతరాత్మయై జీవులందఱిలోనును సాక్షిభూతుండుగా నుండువాఁడు. ఎవ్వని చేతనున్ను ఎచ్చటనున్ను ఇంతవాత్రమని గ్రహింప శక్యుండు కాఁడు) అనియిట్లు బ్రహ్మ రుద్రునితోఁ జెప్పుటచేఁ దెలియుచున్నది.

వీరు శేషభూతులనియు పర్వేశ్వరుండు శేషియని యును ఈవిషయము «దాసభూతాస్స్వతస్సర్వే హ్యాత్మానః పరమాత్మనః అతోఽహమపితేదాస ఇతిమత్వానమామ్యహం' (సమస్తాత్మలును పరమాత్మకు దాసభూతులు కావున నేనున్ను నీకుదాసుండనుగాన, దండము సమర్పించుచున్నాఁడను). అని మంత్రరాజస్తోత్రమునందు సర్వజ్ఞుండగు రుద్రుండే స్వయముగ చెప్పియున్నాడు.

ఇట్లు సర్వవిధములను నారాయణుండు తనతో సమా నుండుగాని తనకంటెనధికుండుకానిలేనివాఁడను విషయమును,

శ్లో॥ నపరం పుండరీకాక్షా ద్దృశ్యతే పురుషర్షభ।
పరంహిపుండరీకాక్షా న్నభూతంచభవిష్యతి
నవిష్ణోఃపరమోదేవో విద్యతే నృపసత్తమ॥

తా॥ పుండరీకాక్షునికంటెను ఉత్కృష్టదేవత గానఁ బడదు. పుండరీకాక్షునికంటెను ఉత్కృష్టమైనట్టిదేవత ఇంతకు ముందుండి యుండలేదు. ఇంకమీాదుఉండపోదు. విష్ణువుకంటె ను ఉత్కృష్టమైనట్టిదేవత యెద్దియును లేదు.

శ్లో॥ నవాసుదేవా త్పరమస్తిమంగళం
నవాసుదేవా త్పరమస్తిపావనం।
నవాసుదేవా త్పరమస్తిదైవతం
నవాసుదేవం ప్రణిపత్యసీదతి॥

తా॥ విష్ణువుకంటె నుత్కృష్టదేవతలేదు. వాసుదేవుని కంటె మంగళమైనదియునులేదు పవిత్రమైనదియునులేదు. వా సుదేవునికి దండము సమర్పించి కష్టపడను.

శ్లో॥ త్రైలోక్యే తాదృశఃకశ్చిత్ నజాతోనచవిద్యతే!
నదైవం కేశవాత్పరం॥

తా॥ మూఁడులోకములలోనును విష్ణువు వంటివాఁడు ఇంతకుముందుండి యుండలేదు. ఇప్పుడున్ను లేడు. కేశవుని కంటెనున్ను దేవతలేదు

శ్లో॥ రాజాధిరాజస్సర్వేషాం విష్ణుర్బ్రహ్మమయోమహాన్
ఈశ్వరంతంవిజానీమ సపితా స ప్రజాపతిః॥

తా॥ వేదమయుండగు విష్ణువు అందఱికిని రారాజయి నట్టివాఁడు. అతనిని సర్వేశ్వరునిగా నెఱుంగుము. అతండే తండ్రి అతండే ప్రజాపతి.

ఈ పైవాక్యములయందు అనేకవిధములుగాఁ దెలిపి యున్నారు.

గర్భములోనున్నప్పుడేయదృష్టవంతులై, జన్మింపఁబోవునట్టి సమయమున రజోగుణ తమోగుణములను నశింపఁజేయునట్టి వాఁడగు మధుసూదనునిచే కటాక్షింపఁబడువారలుముముక్షువులు కాఁగలరను విషయమును, అట్లుకాక,బ్రహ్మరుద్రులచేఁ జూడఁబడినట్టివారలు రజోగుణ తమోగుణ పరవశులగుదుర ను విషయమున్ను,

శ్లో॥ జాయమానంహిపురుషం యంపశ్యే న్మధుసూదనః
సాత్వికస్సతువిజ్ఞేయ స్సవై మోక్షార్థచింతకః॥

తా॥ జన్మింపఁబోవునట్టి కాలమున యేపురుషుని మధుసూదనుండు కటాక్షించునో, అతఁడు సాత్వికుండు కాఁగలడు. అతండే మోక్షమునకై ప్రయత్నించునట్టివాఁడు.

శ్లో॥ పశ్యత్యేనంజాయమానం బ్రహ్మారుద్రోథవాపునః
రజసాతమసాచైవ మానసం సమభిప్లుతం॥

తా॥ జన్మింపఁబోవు సమయమున ఏపురుషుని చతుర్ము ఖబ్రహ్మముగాని రుద్రుండుగాని కటాక్షించునో, అతండు రజస్తమోగుణ వ్యాప్తంబైనట్టి మనస్సుకలవాఁడు కాఁగలడు.

అని ఈపైవాక్యములయందు విభజించి తెలుపఁబడినది.

ఈ బ్రహ్మారుద్రులు ముముక్షువులచే నుపాసింపనలసి నట్టివారు కారను విషయమును, వీరికి కారణభూతుండగు సర్వేశ్వరుండే వీరిచేతనున్ను ఉపాసింప వలసినట్టివాఁడను విషయమున్ను,

శ్లో॥ సంసారార్ణవమగ్నానాం విషయాక్రాంతచేతసాం
విష్ణుపోతం వినా నాన్యత్కించిదస్తి పరాయణం॥

తా॥ సంసారసముద్రములో మునిఁగి విషయాంతరపరులైనట్టివారికి యీ సంసారసముద్రమును దాటుటకు విష్ణువనఁబడు ఓడతప్ప వేఱొక్క రక్షకము లేదు.

శ్లో॥ బ్రహ్మాణం శితికణ్ఠంచ యాశ్చాన్యా దేవతాస్స్మృతాః
ప్రతిబుద్ధానసేవన్తే యస్మాత్పరిమితం ఫలం॥

తా॥ బ్రహ్మను, రుద్రుని, శాస్త్రమునఁ జెప్పఁబడినట్టి యింక యితరదేవతలనున్ను జ్ఞానులు ఉపాసింపరు. ఏలననఁగా వారిని ఉపాసించుటవలనఁ గలుగునట్టిఫలము పరిమితమైనది.

శ్లో॥ హరిరేకస్సదాధ్యేయో భవద్భిస్సత్వసంస్థితైః
ఉపాస్యోయంసదావిప్రాః ఉపాయోస్మిహరేస్స్మృతౌ॥

తా॥ సత్వగుణ సంపన్నులగు మీచే విష్ణువుమాత్రమే యుపాసింపవలసినవాఁడు. ఈతండే సర్వదా ఉపాసింపవలసిన

వాఁడు. ఈతనిని స్మరించుకొనుటయే మోక్షోపాయము.

ఈ పైవాక్యములయందుఁ జెప్పఁబడినది. కావున వీరిని మోక్షోపాయభూతులనుగాను చెప్పియుండుట యనునది, జ్ఞానాదులను గలుగఁజేసినట్టి వారగుటంజేసి ఆచార్యులను మోక్షహేతువులనుగాఁ జెప్పినట్లని యెఱుంగునది.

ఈవిషయము,

శ్లో॥ సూర్యస్యైవతుయోభక్తః సప్తజన్మాంతరంనరః
తస్యైవతుప్రసాదేన విష్ణుభక్తఃప్రజాయతే॥

తా॥ ఎవ్వఁడు సూర్యుని యుపాసించుటచే వానికి భక్తుండై యున్నాఁడో, అట్టిపురుషుండు ఏడుజన్మములకుపైని అట్టి సూర్యుని యనుగ్రహమువలన విష్ణుభక్తుండుగా జన్మించుచున్నాడు.

శ్లో॥ శంకరస్యతుయోభక్త స్సప్తజన్మాంతరంనరః
తస్యైవతుప్రసాదేన విష్ణుభక్తఃప్రజాయతే॥

తా॥ ఎవ్వఁడు శంకరునికి భక్తుండో, వాఁడు ఏడుజన్మములకుపైని యట్టిశంకరుని యనుగ్రహమువలన విష్ణుభక్తుండుగాఁజన్మించుచున్నాడు.

శ్లో॥ వాసుదేవస్యయోభక్తః సప్తజన్మాంతరంనరః।
తస్యైవతుప్రసాదేన వాసుదేవే ప్రలీయతే॥

తా॥ ఎవ్వఁడు వాసుదేవుని భక్తుండో, వాఁడు ఏఁడు జన్మములకుపైని అట్టివాసుదేవుని యనుగ్రహమువలనవానితో సాయుజ్యమును బొందుచున్నాడు.

ఈపైవాక్యములవలనఁ దెలియఁగలదు. ఇట్లు సూర్యభక్తి మొదలగునవి పరంపరగ భగవద్భక్తిలోఁ బ్రవేశింపఁ

జెప్పుటయు, పరావరతత్త్వముల విషయమున ఐక్యబుద్ధియును, వ్యత్యయబుద్ధియును, సమబుద్ధియును ఇఁక వీటిమూలకము గాఁ గలుగునట్టి జ్ఞానవైకల్యాదులును, అసుర స్వభావమువలన నొక్క విషయమునయున్న ప్రద్వేషాదులు లేకుండ, సూర్యాదుల నాశ్రయించునట్టి వారికే గలుగునవి యను విషయమును ‘‘యేతుసామాన్య భావేన మన్యన్తే పురుషోత్తమమ్। తేవై పాషండినో జ్ఞేయాః సర్వకర్మబహిష్కృతాః’’ (ఎవ్వరు పురుషోత్తముని దేవతాంతర తుల్యునిగాఁ దలంచుదురో, అట్టివారు పాషండులుగాఁ దెలియఁదగుదురు. వారు సర్వకర్మ బహిష్కృతులు) ఇత్యాది తావుల నెఱుంగునది. ఇవ్విధమున జ్ఞానాదుల విషయమున వైకల్యాదులఁ గలిగి యుండునట్టి వారికి దేవతాంతరముల విషయమున భక్తి యున్నను, భగవన్నిగ్రహము మూలముగ నది విపరీతము గానే ఫలించును. కావుననే ‘‘త్వంహిరుద్రమహాబాహో మోహశాస్త్రాణికారయ దర్శయిత్వా ల్పమాయాసం ఫలంశీఘ్రం ప్రదర్శయ’’ (ఓరుద్రుడా! నీవు జనులను మోహింపఁజేయునట్టి కొన్ని శాస్త్రములఁ బ్రవర్తింపఁజేసి, స్వల్పకష్టముతో శీఘ్రముగ ఫలము గలుగునట్టి మార్గమును ఉపదేశింపుము) అన్నట్లు మోహశాస్త్రములయందు దృష్టఫలములను జూపించినదియును నాటిమూలముగ మోహింపఁజేసి వారిని నరకములోఁ బడద్రోయుటకుగాను. ఇంతియే.

సత్యసంకల్పుండగు సర్వేశ్వరుండు యెవ్వనినైనను శిక్షింపఁదలంచినట్లయిన, ‘‘బ్రహ్మా స్వయంభూశ్చతురాననోవా రుద్రస్త్రినేత్ర స్త్రిపురాంతకోవా। ఇంద్రోమహేంద్ర స్సురనా

యశోవా త్రాతుంనశక్తా యుధిరామవధ్యం" (నాల్గుముఖము లుగల బ్రహ్మకాని, త్రిపురములను దహించినవాఁడై మూఁడు నేత్రములుగలవాఁడగు రుద్రుండుగాని, దేవతలకు నాయకుం డగు దేవేంద్రుండుకాని, రామచంద్రునిచే యుద్ధమునందు నశింపఁజేయఁ దలంపఁబడినట్టివానిని రక్షింపఁజాలఁడు) అన్నట్లు దేవతాంతరములు రక్షింపఁజాలవు, దేవతలందఱును సుగ్రీవ మహారాజు మొదలగు వారివలెనే తనకు అంతరంగులయినవా రైనను, తనను ఆశ్రయించినట్టివానిని బాధింపఁదలంచినట్లయిన, "సకృదేవ ప్రపన్నాయ" అన్నట్లు సత్యప్రతిజ్ఞుండగు తనయొ క్క ప్రతిజ్ఞకు భంగము కలుగకుండుటకుగాను రావణాదుల వలె దుష్టస్వభావముగలవారై నిరాకరింపవలసినట్టి వారిని ని రాకరించియును, వానరవీరులవలెనే మంచిస్వభావముగలవా రై సుఖపెట్టవలసినట్టివారిని సుఖపెట్టియును, సర్వేశ్వరుండు రక్షింపఁగలఁడు.

దేవతాంతరముల నారాధించుటచే, "కాంక్షంతః కర్మ ణాంసిద్ధిం యజన్త ఇహదేవతాః క్షిప్రం హి మానుషే లోకే సిద్ధిర్భవతి కర్మజా" (లోకులు కర్మముల సిద్ధికిగాను దేవత లనుగుఱించి యజ్ఞముల నొనర్చుచున్నారు. మనుష్యలోకము న కర్మములు శీఘ్రముగా సిద్ధించుచున్నవి) అన్నట్లు పరిణామ మున విషతుల్యంబులై ప్రస్తుతముమాత్రము భోగ్యములగు క్షుద్రఫలములు శీఘ్రముగా సిద్ధింపఁగ -వు. అవియును,

శ్లో॥ లభతేచతతః కామాన్ మయైవవిహితాన్ హితాన్

తా॥ ఈమనుష్యుండు నాచే తనకు హితకరములుగాను యేర్పఱుపఁబడినట్టి తనకోరికలను సిద్ధింపఁజేసికొనుచున్నాఁడు.

శ్లో॥ ఏషమాతాపితాచాపి యుష్మాకంచపితామహః।
మయానుశిష్టోభవితా సర్వభూత వరప్రదః।

తా॥ తల్లియును, తండ్రియును, మీపితామహుండునగు చతుర్ముఖబ్రహ్మము నాచే నియమింపఁబడినట్టివాఁడైయే యందఱికిని వరంబుల నొసంగుచున్నాఁడు?

శ్లో॥ అస్యచైవానుజోరుద్రో లలాటాద్యస్సముత్థితః।
బ్రహ్మానుశిష్టోభవితా సర్వసత్త్వవరప్రదః॥

తా॥ ఈతని కనుజుండగు రుద్రుండు లలాటమునుండి పుట్టినట్టివాఁడు ఈతండునుపరబ్రహ్మముచే నియమింపఁబడియే యందఱికిని వరంబుల నొసంగునట్టి వాఁడగుచున్నాడు.

ఈపైని చెప్పినట్టి విధమున భగవంతుని యధీనములో నుండునవి.

“ యస్మాత్పరిమితంపలం సాత్వికేషు తుకల్పేషుమాహాత్మ్య మధికంహరేః తేష్వేవ యోగసంసిద్ధాః గమిష్య న్తిపరాంగతిం” (దేవతాంతరముల మూలముగ లభించునట్టి ఫలంబు పరిమితంబు. సాత్విక కల్పములయందు విష్ణువుయొక్క మాహాత్మ్య మధికముగా నుండగలదు కావున నట్టి సమయమున, యోగులు ఉత్కృష్టమగు గతిని బొందుచున్నారు) అని చెప్పియున్నందున దేవతాంతరముల యనుగ్రహమువలన మోక్షమనునది (అప్పుడు కలుగక పోయినను) కొంతకాలముకు పైగా నయినను కలుగనేరదని సిద్ధమగుచున్నది.

సర్వేశ్వరుని యాశ్రయించినట్టి వారికన్ననో, “ యుగకోటిసహస్రాణి విష్ణుమారాధ్య పద్మభూః” (వేలకొలదియు నకోట్లకొలదియును యుగములుగా చతుర్ముఖబ్రహ్మము విష్ణు

వును ఆరాధించి తనపదవిని లభించెను) ఇత్యాది తావులఁ జెప్పియున్నట్లు, అతిశయముగల యైశ్వర్యాదులు సంయుతము కలుగఁగలవు. అటుపిమ్మట ఆయైశ్వర్యాదులు, శ్రమపరిహారార్థ మొనర్చినట్టి గంగాస్నానము క్రమముగ పాపమును బోగొట్టుటలో నుపయోగపడునట్లు, భగవద్విషయముయొక్క స్వభావమువలన తలవనితలంపుగ తనంతటనే పాపము నశింపఁగా, రజోగుణ తమోగుణములు అణిగిపోయి, సత్వగుణమతిశయించి జనక, అంబరీష, కేకయాదులకువలెనే క్రమేణ మోక్షము గలుగువరకును ఉపయోగపడును. ఈ చేతనుండు మోక్షోపాయనిష్ఠుండగునప్పుడు,

శ్లో॥ బహూనాంజన్మనామంతే జ్ఞానవాన్మాంప్రపద్యతే॥
(యేజన్మకోటిభిస్సిద్ధా స్తేషామంతేత్రసంస్థితిః॥)

తా॥ అనేకజన్మలు గడచినపైని జ్ఞానవంతుండు నన్నుపొందుచున్నాడు. ఎవ్వరు కోటిజన్మములెత్తి సిద్ధినిపొందినవారో, వారున్ను తుట్టతుదకు నన్నేపొందుచున్నారు.

శ్లో॥ జన్మాంతరసహస్రేషు తపోధ్యానసమాధిభిః।
నరాణాంక్షీణపాపానాం కృష్ణేభక్తిఃప్రజాయతే॥

తా॥ వేలకొలది జన్మంబులనెత్తఁగా నెత్తఁగా, తపస్సు, ధ్యానము, సమాధి వీటిమూలముగ పాపము క్షీణించినట్టివారికి శ్రీకృష్ణునివిషయమున భక్తి గలుగుచున్నది.

అని చెప్పియున్నట్లు మోక్షము కలుగుటలోకొంత ఆలస్యము కద్దు.

మోక్షమునందు రుచికలిగి మంచి యుపాయానుష్ఠానము నవలంబించినట్లయిన,

శ్లో॥ తేషామహంసముద్ధర్తా మృత్యుసంసారసాగరాత్।
భవామి నచిరాత్పార్థ మయ్యావేశితచేతసాం॥

తా॥ అట్టి నాయెడల భక్తికలవారిని జన్మమరణరూపమగు సంసారసముద్రమును కడతేర్చునట్లు వాఁడనుగాను నేనే శీఘ్రముగా నగుచున్నాఁడను.

అని సాయించినట్లు మోక్షము సిద్ధించుటలో నాలస్యము లేదు.

స్వతంత్రోపాయమగు ప్రపత్తియందు నిష్ఠగలవారికి తాము కోరినదే గడువు. ఇంతేకాని, ఆలస్యముకాని శీఘ్రముకాని యేద్ధియును లేదు. ఈనియమంబులన్నియును, «స్వాతంత్ర్య మైశ్వరమపర్యనుయోజ్యమాహుః” (ఈశ్వరుని స్వాతంత్ర్యము మనచే వివేచింప శక్యముకాదు) అన్నట్లు, సర్వేశ్వరునికిఁగల నిరంకుశ స్వాతంత్ర్యమువలన సిద్ధించునవియను విషయము ప్రమాణపరతంత్రులయినట్టివారికి విశదము. ఈ విషయము నిర్విధముగ తెలిసికొని యుండనివారికే దేవతాంతరములు సేవ్యంబులని «ప్రతిబుద్ధవర్జం సేవన్తు” అనుతావున నొక వ్యవస్థ చేయఁబడినది.

ఈ దేవతాంతరములు భగవంతునికి శరీరభూతములని తెలియక యాశ్రయించునట్టివారిచే, నాస్తికుండగు ఒకసేవకుఁడు రాజుయొక్క శరీరమున చందనముపూయఁగా, నందుమూలముగ ఆరాజుయొక్క శరీరములోనుండునట్టి యాత్మ ప్రీతినొందుచందంబున, వాస్తవముగ సర్వేశ్వరుండే పూజింపఁబడినను,

శ్లో॥ యేప్యన్యదేవతాభక్తా యజంతే శ్రద్ధయాన్వితాః।
　　తేపిమామేవకౌంతేయ యజంత్యవిధిపూర్వకం॥

తా॥ ఎవ్వరు దేవతాంతరభక్తులై యట్టి దేవతాంతరము లను భక్తితోఁ బూజించుచున్నారో, వారును అందుమూలముగ నన్నే పూజించుచున్నారు. అయితే వారవ్విధమున నన్ను పూజించుటయనునది శాస్త్రీయము కాదు.

అని సాయించినట్లు వారి యాశ్రయణము శాస్త్రార్థము కనుగుణముగ నటలో వైకల్యమున్నట్లు, అట్టి యాశ్రయణమువలని గలుగునట్టి ఫలమునందును వైకల్యము కలుగఁగలదు.

దేవతాంతరములన్నియును భగవంతునికి శరీరభూతంబులని యెఱింగియును, క్షుద్రఫలంబులను శీఘ్రముగా లభింపవలయుననెడి యాశవలన, వారిని యాశ్రయించునట్టివారికి ఆ యాఫలంబులు సంపూర్ణముగా లభింపఁగలవు.

ఇవ్విధమునఁ దెలిసికొని, భగవంతునే "ఆర్తోజిజ్ఞాసురర్థార్థీ" అన్నట్లు, ఫలాంతరంబులకుగాను యాశ్రయించినట్లయిన, ఆట్టిఫలము లెక్కువ యతిశయముగలవి కాఁగలవు.

వేఱొక్కఫలము నపేక్షింపక సర్వేశ్వరునియాశ్రయించినట్టివారికి,

శ్లో॥ శరీరారోగ్యమర్థాంశ్చ భోగాంశ్చైవానుషంగికాన్।
　　దదాతిధ్యాయినాంనిత్య మపవర్గప్రదోహరిః॥

తా॥ మోక్షప్రదుండగు సర్వేశ్వరుండు తనను ధ్యానించునట్టివారికి శరీరారోగ్యమునున్ను, ద్రవ్యమునున్ను, భోగములనున్ను తనంతట తానే యిచ్చుచున్నాడు.

అని సాయించినట్లు తక్కిన ఫలంబులన్నియును వీరు కోరకుండ వాటికవ్వియే సిద్ధింపఁగలవు.

ఈవిషయమును, తాను కోరకయే యైశ్వర్యాదులను లభించినట్టివారగు శ్రీకులశేఖరప్పెరుమాళ్లు "నిన్నయేతా న్వేండినిల్ శెల్వం వేండాతాౕ తన్నైయేతాౕ వేండుమ్ శెల్వ మ్పోల్" (నిన్నే ప్రాప్యమునుగా, గోరి, దీర్ఘకాలానుభావ్యములగు బ్రహ్మరుద్రాద్యైశ్వర్యములను సయితము ఉపేక్షించునట్టివాఁడునగు నాకు తనకుతానే కోరునట్టి యైశ్వర్యమువలె) అనుతావున సాయించినారు. "అలభిషితదురాపాయేపురాకామభోగా జలధిమివజలౌఘా తేవిశంతి స్వయంనః" (మనముకోరినప్పటికిన్ని దుర్లభములగు కామభోగము లన్నియును భగవదిచ్ఛవలన తమంతట తామే, సముద్రములోనికి నదులువచ్చి పడునట్లు, స్వయముగ మనకు లభించుచున్నవి.) అనతావున ఈశాండాను అనువారు తాముసాయించినట్టి స్తోత్రమునందు తెలిపియున్నారు. ఇది యీచేతనుని యుపాసనను బట్టియును వానికోరికలను బట్టియును ఉండగలదు.

ఇవ్విధమున సర్వేశ్వరునికిన్ని బ్రహ్మరుద్రాదులకున్ను ఉండుకున్నట్టి భేదములను "ఎమ్బెరుమానుండుమిళ్ంద వెచ్చిల్ తేవరల్లాతాౕ తాముళరే" (సర్వేశ్వరుండు కక్కివేసిన ఉచ్ఛిష్టమువంటివారు తక్కినదేవతలు కావునవారు ఉపాసింపవలసినవారుకారు అనఁగా ప్రళయకాలమునందు లోపలనుంచుకొని సృష్టిసమయమున బయటికిఁ గొనిరాబడినవారు) అనియు, "నాన్ముఖనై నారణౕ పడైత్తాౕ నాన్ముకనుంతాన్ముకమాయ్ శంకరనైత్తాన్పడైత్తాౕ" (శ్రీమన్నారాయణుండు చతుర్ముఖబ్రహ్మమును సృజించినాఁడు చతుర్ముఖబ్రహ్మము తన కంతరాత్మయగు నారాయణుని మూలముగ రుద్రునిసృ

జించెను) అనియు, "మేవిత్తొళ్ళుం పిరమన్ శివనిందిరనాదిక్కె ల్లాం నాపిక్కమలముదత్ క్కిడందే" (బ్రహ్మరుద్రేంద్రాదుల కెద్దియైన ఆపత్తు సంభవింపగా వారందఱును గుమిగూడి ప్రార్థించినప్పుడు వారికి కారణభూతుడగు నాభికమలమును గడవలె) అనియు, "తీర్త్తనుఱకళంద శేవడిమేల్ పూన్దామం శేర్త్తియవై యేశివన్ముడిమేల్ తాన్ కండుపార్త్తన్ తెళిందొళింద పైన్దుళా యాన్ పెరుమై" (పరమపావనుండగు సర్వేశ్వరునియొక్క లోకములను కొలిచినట్టి శ్రీపాదములయందు పుష్పములనుంచి వాటిని వెంటనే శివుని శిరమునందుఁ జూచినట్టి యర్జునుండు తెలిసికొనినట్టి తులసీమాలాలంకృతుండగు సర్వేశ్వరునిమహిమ) అనియు, "వానవర్ తమ్మైయాళ మవనుంనాన్ముకనుం శడైముడియణ్ణలుంశ్ శెమ్మైయాలవన్ పాతపంకయం శిన్దిత్తేత్తితిరివరే" (దేవతలకు నియంతయగు ఇంద్రుండును, చతుర్ముఖబ్రహ్మయును, యేదొకదానికిగాను దీక్షనువహించియున్నట్లు సూచింపఁజేయునట్టి జడలను ధరించి యున్నట్టివాఁడయినను ఈశ్వరుండనఁబడు రుద్రుండును, భగవంతుని శ్రీపాదంబులను ధ్యానించుచు స్తుతించుచును సంచరించుచున్నారు) అనియు, "పేశినిన్ఱ శివనుక్కుమ్ పిరమన్ తనక్కుమ్ నాయకనవనే" (జ్ఞానశూన్యులచే నీతండే సర్వేశ్వరుండని చెప్పఁబడునట్టి శివునికిని చతుర్ముఖబ్రహ్మకును నాయకుండువాఁడే) అనియు, "ఒన్ఱువిడై యనుమ్ నాన్ముకనుమునైయఱియాప్పెరుమైయోనే" (అద్వితీయముగు ఋషభమువాహనముగాఁ గలవాఁడగు రుద్రునిచేతను చతుర్ముఖబ్రహ్మచేతను తెలిసికొనశక్యముగానట్టి మహిమగలవాఁడవు) అనియు, "ఎరుత్తుక్కొడియుడైయానుం పిరమను

మిన్దిరనుం మత్ర్ ఱుమొరుత్తొరు మిప్పిరవినోయిక్కు మరున్ద
ఱివారుమిల్లై" (ఋషభధ్వజుండును, చతుర్ముఖ బ్రహ్మయును,
ఇంద్రుండును, తక్కినవారెవ్వరును ఈ జన్మమరణ రూపమగు
వ్యాధికిగాను మందు నెఱుంగరు) అనియు, నిట్లు అనేకవిధము
లుగ సాయించి యున్నారు.

ఈ పరదేవతయొక్క వాస్తవస్థితిని తిరుమంత్రమునందుండు
మొదటి యక్షరమునందును, నారాయణశబ్దమునందును, ద్వ
యమునందు శ్రీమతేయను విశేషణముతోఁగూడియుండునట్టి
నారాయణ శబ్దములయందును, చరమశ్లోకమునందు "మాం"
"అహం" అను శబ్దములయందును అనుసంధించుకొనునది.

పరదేవత యిట్టిదియనెడి నిశ్చయముగలవారికేతప్ప
"కణ్ణనల్లాల్ దెయ్వమిల్లై యోరెల్ కణ్ణే" (కృష్ణునికృపతప్ప వేఱొక్కటి
రక్షకముకాదు) అనియు, "కళైహాయ్ తున్బంకళై యాదొళి
వాయ్ కళై కణ్మత్తిలేన్" (నాకష్టములను పోగొట్టినానసరే పోగొ
ట్టకపోయినానసరే నీకంటెను వేఱొక్కరక్షకుండు లేనివాఁడను)
అనియు, "అవిత్తోర్ పత్రుక్కొంబు నిన్నలాలఱికిన్దిలేన్
యాన్" (నాకు ఆధారభూతుండైనట్టివానినిగాను నిన్నుతప్ప
వేఱొక్కని నెఱుఁగను) అనియు, "తరుతుయరందడాయేలున్
శరణల్లాల్ శరణిల్లై" (దుఃఖకరంబగు పాపమును నివర్తింపక
పోయినప్పటికిన్ని నీకంటెను రక్షకుండు లేడు.) అనియును ఈ
మొదలగు తిరుమొళి పాశురములయందు సాయించినట్టి య
నన్య శరణత్వావస్థ (భగవంతుండేరక్షకుండనెడిస్థితి)కలుగదు.

ఇట్టి పరదేవతా పారమార్థ్యమును తిరుమంత్రముచేఁ

దెలిసికొని యుండుటంజేసి భాగవతులవరకును దేవతాంతర
త్యాగమును, భాగవతులపర్యంతము భగవచ్ఛేషత్వమునున్ను
స్థిరముగాఁ గలిగియుండుటను, ‘‘మఱ్ఱుమోర్ తైవముళతెన్ఱి
రుప్పారోడుఱ్ఱిలేనుఱ్ఱతు మున్నడియార్కడిమై’’ (వేఱొ
క్కదైవముకలదని తలంచునట్టివారి చెంతచేరను నేను ప్రేమిం
చునది నీదాసుల విషయమగు కైంకర్యము) అను పాశురము
నందు సర్వేశ్వరుని విషయమున సర్వార్థములను గ్రహించినట్టి
యాళ్వారులు సాయించినారు.

ఈ యాళ్వారులు ‘‘పారురువిల్ నీరెరికాల్’’ అను
పాశురమునందు, ఎవ్వరు ఎక్కువవారనెడి వివాదములోనుండు
వారగు త్రిమూర్తులను ముగ్గురినిన్ని సరిచూచి వారి ముగ్గురి
లో ప్రమాణానుసంధానమువలన ఇద్దరిని నిషేధించి తక్కిన
పరంజ్యోతిస్సయినట్టివాని నొక్కనినే ‘‘ముకిలురువమ్ ఎమ్మడి
కళ్’’ (కాలమేఘశ్యాముం డొక్కండే సంసారతాపమును హ
రించునట్టివాఁడు) అని నిర్ణయించియున్నారు. ఇట్టి రూపవిశే
షముగలపరమపురుషుండే సర్వవేదప్రతిపాద్యంబగుపరతత్త్వం
బనెడి విషయము సర్వవేదసారంబగు ప్రణవమునందుఁ బ్రతి
పాదింపఁ బడుటంజేసి, ‘‘మూలమాకియ ఒత్తెఴుత్తై మూ
న్ఱుమాత్తిరైయుళ్ళెఴవాంగి వేదనైవణ్ణాని మేవుతురాకిల్’’ (వేద
ములకు మూలభూతంబగు ప్రణవమును త్రిమాత్రవిశిష్టముగాఁ
జేసి దానితో నీలమేఘశ్యాముండగు శ్రీమన్నారాయణుని
ధ్యానింపుడు) అని పెరియాళ్వారులు సాయించియున్నారు.

తైత్తిరోపనిషత్తునందు శ్రియఃపతిత్వ చిహ్నమువలన
మహాపురుషునికిఁగల వైలక్షణ్యముఁ జెప్పినవిధముఁగని, ‘‘తిరు

క్కండేన్ పొన్ మేనికండేన్'' (శ్రీదేవిని సేవించితిని స్వర్ణమయంబగు దివ్యమంగళ విగ్రహమును సేవించితిని) అనియారంభించి, ''శార్వ్వన్నమక్కు'' అను పాశురము చేతనులమగు మనకు పెరియసిరాట్టితోఁగూడ అంతటను వ్యాపించియున్నట్టి యీ సర్వేశ్వరుంతప్ప (ప్రాప్యాంతరముగాని శరణ్యాంతరముకాని లేదు ఈ దంపతులే మనకు ప్రాప్యమును శరణ్యము నని నిర్ణయింపఁబడినది. ఈ యర్థమును ''దేవతా పారమార్థ్యంచ యథావద్వేత్స్యతే భవాన్ పులస్త్యేన యదుక్తంతే సర్వమేతద్భవిష్యతి, (నీవు దేవతా పారమార్థ్యమును బాగుగా నెఱింగియున్నావు. పులస్త్యుండు నీకు చెప్పినది యథార్థము కాఁగలదు.'' అన్నట్లు పులస్త్యుని యొక్కయును వశిష్ఠుని యొక్కయును వరప్రసాదమువలన పరదేవతా పారమార్థ్యము విషయమగు జ్ఞానముగలవాడై పెరియ ముదలియారను వారిచే ''తస్మైనమో మునివరాయ పరాశరాయ'' అని యాదరింప వలసినట్టి వాఁడగు శ్రీపరాశరమహర్షి విశేషముగాఁ జెప్పి ''దేవతిర్యఙ్మనుష్యేషు పున్నామా భగవాన్ హరిః స్త్రీనామ్నీ లక్ష్మీర్మైత్రేయ నానయోర్విద్యతేపరం'' (దేవతిర్యఙ్మనుష్యులలో పురుషుఁడగు నారాయణుండును స్త్రీయగు లక్ష్మీదేవియును ఉత్కృష్టులు వీరికంటెను పరదేవతయెద్దియును లేదు.) అని పరమరహస్య యోగ్యుండగు సచ్ఛిష్యునికి యుపదేశించినాడు.

౫౨. ఈయర్థమును భగవదనుగ్రహమువలన అజ్ఞానాన్యథా జ్ఞానములులేనట్టి జ్ఞానానందమును లభించినట్టివారై ''ఆద్యస్యనః కులపతేః'' అన్నట్లు, ప్రథన్న సన్తానకూట

స్థలగు శ్రీనమ్మాళ్వారులును "ఒండొడియాళ్ తిరుమకళుమ్ నీయు మేనిలానిఱ్ప కణ్డశెతిర్కణ్డేన్" (పద్మ్యము) ఇయున వసించునట్టి పిరాట్టియును నీవును ఉభయులును వేంచేసియుండఁగా సేవించినాను) అనుతావున సాయించినారు. ఈవిషయమునఁ జెప్పవలసినది యెంతయును చతుశ్శ్లోకీ వ్యాఖ్యానమున పరపక్షనిరసన పూర్వకముగ విస్తరించి చెప్పియున్నాము. కావున ఆగ్రంథమునఁ జూచుకొనునది.

పా॥ వాదియర్ మన్నుం తరుక్క చ్చెరుక్కి న్మఱైకుళైయ,
చ్చాతుశనంగళడంగ నెడుంగ త్తని త్తనియే, ఆదియెనా
వళై యారణతేశికర్ శాత్తినర్, నమ్మోదమరుం
తిరుమాదుడన్నిన్నపురాణనైయే॥

టీ॥ వాదియర్ = వాదించునట్టివారు, మన్ను = స్థిరమైన, తరుక్కం = తర్కముచే, శెరుక్కి = గర్వమువలన, మఱైకుళైయ = వేదములకు భయము లేకుండునట్లును, శాతుశనంగళ్ = సాధుజనులు, అడంగ = సంపూర్ణముగ, నడుంగ = భయముచే కంపితులగునట్లు, తని త్తనియె = బ్రహ్మాదిదేవతలు ప్రత్యేక ప్రత్యేకముగ, ఆది = ఆదికారణమని, ఏనావళై = చెప్పకుండునట్లు, ఆరణదేశికర్ = అరణ్యకములనఁబడు ఉపనిషత్తుల నుపదేశించునట్టి మాయాచార్యులు, శాత్తినర్ = నారాయణుండే యాదికారణమని యుపదేశించిరి. నమ్ = మాయొక్క అమరు వై = స్థితి, పోదమరుం = పుష్పవాసినియగు, తిరుమాతు ఉడన్ = శ్రీదేవితోఁగూడ, నిన్న = ఉన్నట్టి, పురాణనైయె = పురాణపురుషుండగు శ్రీమన్నారాయణుండే.

తా॥ తార్కికులు తర్కచాతుర్యము వలనఁగల గర్వమువలన వేదములు భయపడునట్లు వాదింపకుండునట్లును, సాధుజనులు భయపడునట్లు

బ్రహ్మేంద్రాదులను ప్రత్యేక ప్రత్యేకముగా పరదేవతనుగాను నిరూపింపకుండునట్లును జ్ఞానసంపన్నులగు మాయాచార్యులు శ్రీమన్నారాయణుండే పరదేవతయని యుపదేశించియున్నారు. కావున మాకు లక్ష్మీపతియే శరణము.

శ్లో॥ జనపదభువనాధిష్ఠానజైత్రాసనస్థే।
ష్వనుగతనిజవార్తంనశ్వరేష్వీశ్వరేషు॥
పరిచితనిగమాంతఃపశ్యతి శ్రీసహాయం।
జగతిగతిమవిద్యాదంతురే జంతురేకః॥

టీ॥ అవిద్యాదంతురే = అజ్ఞాన పరిపూర్ణమగు, జగతి = ప్రపంచమునందు, పరిచిత నిగమాంతః = వేదాంతశాస్త్రపరిచయముగలవాఁడగు ఏకోజన్తు = ఎవ్వండైన నొక్కండు, జనపద భువనాది స్థానజైత్రాసనస్థేషు = జనపదాద్యాధిపత్యమునను ట్టి, ఈశ్వరేషు = ప్రభువులు అనుగతనిజవార్తం = కీర్తిశేషులగునట్లు, నశ్వరేషు = నశించుచుండగా, శ్రీసహాయం = శ్రీమన్నారాయణునిఁ గతినిగా, పశ్యతి = తెలిసికొనుచున్నాఁడు.

తా॥ అజ్ఞానపరిపూర్ణమగు యీజగంబునందు జనపదాద్యధీశ్వరులు కొంతకాలమునకు పైని కీర్తిశేషులగునట్లు నశించిపోవుటంజూచి, వేదాంతశాస్త్రజ్ఞానముగలవాఁడు శ్రీమన్నారాయణుండే పరదేవతయని తెలిసికొనుచున్నాఁడు.

పరదేవతాపారమార్థ్యాధికారము

ముగిసెను.



శ్రీమతేనిగమాంతమహాదేశికాయనమః.







# రహస్యత్రయసారము



## ముముక్షుత్వాధికారము.

శ్లో॥ కాలావర్తాన్ ప్రకృతివికృతీః కామభోగేషు దోషాన్।
జ్వాలాగర్తప్రతిమదురితోదర్కదుఃఖానుభూతిం॥
యాథాతథ్యంస్వపరనియతంయచ్చదివ్యంపదంతత్।
కారాకల్పంవపురపివిదన్కస్తితిక్షేత బన్ధమ్॥

టీ॥ కాలావర్తాన్ = కాలభేదములను, ప్రకృతి వికృతీః = అష్ట ప్రకృతులను షోడశవికారములను. కామభోగేషు = శబ్దాదివిషయముల యందుండు, దోషాన్ = దోషములను, జ్వాలాగర్త ప్రతిమదురితోదర్కదుఃఖానుభూతిం = అగ్నిగుండము తీవ్రములగు పాపములవలనఁ గలిగినట్టి దుఃఖానుభవమును, యాథాతథ్యం = యథార్థంబగు, స్వపరనియతం = స్వస్వరూప పరస్వరూపములకు నియతంబైనట్టి, యత్ = ఏ, దివ్యం పదం = పరమపదము కద్దో, తత్ = దానినిన్ని, కారాకల్పం = కారాగారతుల్యంబగు, వపుః = శరీరమునున్ను, విదన్ = వీటి స్వరూప స్వభావముల నెఱింగి యున్నట్టి, కః = ఎవ్వఁడు, బంధం = సంసారబంధమును, తితిక్షేత = సహించి యుండఁగలఁడు,

తా॥ కాలభేదములనున్ను, ప్రకృతి వికృతులనున్ను. కామభోగములయందుఁగల దోషములనున్ను, అగ్నిగుండతుల్యంబగు పాపము వల

నఁ గలిగిన దుఃఖానుభవమునున్ను, స్వస్వరూప పరస్వరూపములకు నిఁ
తంబగు పరమపదమునున్ను, కారాగార సదృశంబగు శరీరమునున్ను వీ
నన్నింటినిన్ని బాగుగా ఎఱిఁగియున్నట్టి వాఁడగు యెట్లుండు
సంసార బంధమును సహింపఁగలఁడు?

ఇవ్విధమున ఈ యర్థములను అధ్యాత్మశాస్త్రము
వలనఁ దెలిసికొని, స్వయంప్రకాశత్వము, జ్ఞాతృత్వము, కర్తృ
త్వము, భోక్తృత్వము, శరీరిత్వము, అణుత్వము, నిత్యత్వ
నిరవయవత్వము, ఛేదన, దహన, క్లేదన, శోషణాదుల
బొందనిదిగానుండుట, హెచ్చుతక్కువలను బొందకుండు
యీ మొదలుగాఁగల స్వరూపము వలన ఆత్మ తనతోనుండున
దేహేంద్రియాదులనుండి విలక్షణంబగుటఁగని, ఈ యా
పరలోకమునకుఁ బోవునట్టివాఁడనియు, దేహాంతరము నుబొం
దునట్టి వాఁడనియును ఈవిషయమున నిశ్చయముగలవార
టంజేసి, సామాన్యముగ లోకవిలక్షణంబగు పురుషార్థ
కుఁ దగినట్టివారై, నరకప్రాప్తి, జన్మాంతరక్లేశము మొదల
వాటికి భయపడి, వాటికిఁ గారణభూతంబులగు కర్మముల
విడనాడి, ఆధేయత్వము, విధేయత్వము, శేషత్వము, అ
శక్తిత్వము, అణుత్వము, అజ్ఞాన, సంశయ, విపర్యయ, ద
ఃఖాదులను బొందఁదగియుండుట, అశుభాశ్రయంబగుట యి
మొదలగు వాటినిబట్టి యీయాత్మ సర్వేశ్వరుని కంటె
వేఱయినదనెడి నిశ్చయమువలన భగవత్కైంకర్య రూప
స్వస్వరూపప్రాప్తంబగు వైభవమును అపేక్షించుటకుఁ దగిన
వారై, సర్వాపేక్షితంబగునున్న సంగ్రహముగాఁ దెలుపున
ట్టియగు తిరుమంత్రమునుగొని సారతమంబులగు అర్థములన

సంధించుకొనునప్పుడు ప్రథమ పదమునందుండు తృతీయా
క్షరమువలనఁ దెలియవచ్చునట్టి జ్ఞానత్వాదుల ననుసంధించు
కొనుటచే, దేహమువిషయమునను, దేహమునుబట్టియుండునట్టి
వాటివిషయమునను న్న అహంకారమమకారములనుత్యజించి,
ప్రథమాక్షరమునందుండు లుప్తచతుర్థిచేఁ దెలియవచ్చునట్టి
శేషత్వము ననుసంధించుకొనుటచే దేహాతిరిక్తంబగు ఆత్మ
స్వరూప విషయమునను దానిగుణముల విషయమునను న్న
"త్వంమేహంమే" అను శ్లోకమునఁ జెప్పియున్నట్లు తనకొక
యతిశయముకలదని తలంచుకొనుటయనెడి యహంకారమమ
కారంబులను త్యజించి, మధ్యమాక్షరమునఁ దెలియవచ్చునట్టి
యవధారణార్థమువలన "నేను సర్వేశ్వరునికి తప్ప వేఱొక్క
నికి శేషభూతుడను కానుకదా! అనియు "సర్వేశ్వరుండు తప్ప
వేఱొక్కండు నాకు శేషికాఁడుకదా!" అనియు నివ్విధము
లగు అహంకారమమకారములను త్యజించి, మధ్యమ పదమునఁ
దెలియవచ్చునట్టి నిషేధమువలనస్వరక్షణ వ్యాపారమునుబట్టి
యుండునట్టి నిరపేక్ష స్వాతంత్ర్య నిరుపాధిక శేషిత్వాభి
మానరూపములగు అహంకారమమకారంబులను త్యజించి,
ఇట్టి నిషేధముయొక్క సామర్థ్యమువలన తృతీయ పదమునం
దుండు చతుర్థీవిభక్తిచే దెలుపఁబడినదై యిఁకమీఁదు (మోక్షా
వస్థయందు) లభింపఁబోవునట్టి కైంకర్యాభవంబనెడి ఫలము
విషయమున, ప్రస్తుతము ఫలాంతరానుభవమునందు వాంఛకల్గో
నుండు స్వాధీనకర్తృత్వ, భోక్తృత్వ, స్వార్థ కర్తృత్వ, భోక్తృ
త్వ, భ్రమరూపంబులగు అహంకార మమకారంబులనున్న
వీటినన్నింటిని వాటి వాటికిఁ దగినట్లు శబ్దముచేతనున్ను అర్థము

చేతనున్న రూపుమాసి పోవునట్లుచేసి, యిట్టి జ్ఞానమును స్థిర ముగా మనస్సునందుంచుకొనినట్టివారై «అల్ప శారంగళన్నైశు వైత్త కన్డొళిన్దేక్ కండుకేట్టుళ్ణు మోందుందుళ్ణుళుమైం గరు వికణ్ణ విన్బ న్తైతివటియ వళవిల్లాచ్చిత్తిన్బమ్'' (అల్పసారంబు లగు శబ్దాదివిషయముల ననుభవించి వాటిలో మునిఁగి యుం టిని-చూచియు, వినియు, కల్పించియు, వాసనచూచియు, భుజించియు, ఇట్లు వృథా కాలయాపనము చేయించునట్టివియగు పంచేంద్రియములతో ననుభవింపఁ బడినట్టిశబ్దాది విషయము ల వలని సుఖమును, ఇంతమాత్రమని నిర్ణయించి తెలిసికొనుట కశక్యంబగు ఆత్మానందమును) అనియు

శ్లో॥ తస్మిన్ ప్రసన్నే కి మిహాస్త్యలభ్యం
ధర్మార్థకామై రలమల్పకాస్తే॥

తా॥ భగవంతుండు అనుగ్రహించి నట్లయిన, ఈలోక మునందు అలభ్యం బెద్ది కలదు? అల్పసుఖములగు ధర్మార్థకా మములకై పాటుపడి యికఁ జాలను.

శ్లో॥ అంతవత్తుఫలం తేషాం తద్భవత్యల్పమేధసాం
అనిత్యమసుఖంలోక మముంప్రాప్య భజస్వమాం॥

తా॥ ధర్మార్థ కామములవలనఁ గలుగునట్టి ఫలము అనిత్యము. జ్ఞానహీనులయినట్టి వారు దానికై పాటుపడు దురు. అనిత్యమును సుఖరహితమునునగు ఈ లోకములో నుండి నన్ను శరణుజొచ్చుము.

శ్లో॥ మహాబలాన్మహావీర్యా ననంతధనసంచయాన్ ।
గతాన్ కాలేన మహతా కథాశేషాన్నరాధిపాన్

తా॥ మిక్కిలి బలవంతులును, మిక్కిలి వీర్యవంతులును మితిలేని ధనముగలవారునునగు మహారాజులు మొదలగువారు కాలముగడువఁగా మృతినొంది పోయియుండిరి. ప్రస్తుతము వారి చరిత్రలను మాత్రము మనము వినుచున్నాము.

శ్లో॥ శ్రుత్వానపుత్రదారాద్యా గృహక్షేత్రాదికేపివా।
ద్రవ్యాదావకృతప్రజ్ఞో మమత్వంకురుతేనరః॥

తా॥ ఈవిషయముఁ దెలిసికొని, భార్యాపుత్రాదులవిషయమునను, గృహక్షేత్రాదులవిషయమునను, ద్రవ్యాదులవిషయమునను ప్రీతిలేనివారై వాటివిషయమున మమతయనెడి యహంకారమును వదలుకొనునది.

శ్లో॥ సర్వందుఃఖమయంజగత్।
స్వర్గేపిపాతభీతస్య క్షయిష్ణోర్నాస్తినిర్వృతిః॥

తా॥ జగత్తంతయును దుఃఖమయంబైనది. నరకపాతభీతుండై కృశించునట్టివానికి స్వర్గమునందైనను సుఖములేదు.

శ్లో॥ రాజ్యేగ్రధ్నన్త్యవిద్వాంసో మమత్వాహృతచేతనః
అహంమానమహాపాన మదమత్తానమాదృశాః॥

తా॥ రాజ్యమునందున్నను. మమకారవంతులును, అహంకారాభిమానమద్యపానమత్తులగు యూఢులు శ్రమపెట్టుదురు.

శ్లో॥ ఆబ్రహ్మభవనాదేతే దోషాస్సన్తిమహామునే।
అతఏవహినేచ్ఛన్తి స్వర్గప్రాప్తింమనీషిణః॥

తా॥ ఓమహాముని! సత్యలోకము వరకును ఈదోషము లుండియున్నవి. కావుననే బుద్ధిమంతులయినట్టివారు స్వర్గమును కోరరు.

శ్లో॥ బ్రహ్మణస్సదనాదూర్ధ్వం తద్విష్ణోః పరమంపదం।
శుద్ధంసనాతనంజ్యోతిః పరబ్రహ్మేతితద్విదుః॥

తా॥ సత్యలోకమునకుపైగాను విష్ణువుయొక్క పరమపదము గలదు. అది పరిశుద్ధమును, సనాతనమును, జ్యోతిస్స్వరూపమును, దానిని పరబ్రహ్మమునుగాఁ దెలిసికొనుచున్నారు.

శ్లో॥ నతత్రమూఢాగచ్ఛన్తి పురుషా విషయాత్మకాః।
డంబలోభమదక్రోధ ద్రోహమోహైరభిద్రుతాః॥

తా॥ డంబము, క్రోధము, ద్రోహము, మోహము వీటితో నతిశయించియుండినవారై శబ్దాదివిషయానుభవపరులగు మూఢులు ఆపరమపదమునకు పోజాలరు.

శ్లో॥ నిర్మమానిరహంకారా నిర్ద్వంద్వాస్సంయతేంద్రియాః।
ధ్యానయోగరతాశ్చైవ తత్ర గచ్ఛన్తి సాధవః॥

తా॥ అహంకార మమకార రహితులును, శీతోష్ణసుఖదుఃఖాదిద్వంద్వాతీతులును, ఇంద్రియ జయముగల వారును, భగవద్ధ్యానపరులునగు సత్పురుషులు మాత్రమే యట్టి పరమపదమునకుఁ బోవుచున్నారు.

శ్లో॥ రమ్యాణికామచారాణి విమానాని సభాస్తథా।
ఆక్రీడావివిధారాజ న్పద్మిన్యశ్చామలోదకాః।
ఏతేవై నిరయాస్తాత స్థానస్య పరమాత్మనః।

తా॥ రమ్యములును, స్వేచ్ఛాసంచార యోగ్యములునగు విమానములును, నానా విధములగు క్రీడలును, నిర్మలోదకములగు సరోవరంబులును, ఇవియన్నియును ఆపరమపదమునుబట్టి చూస్తే నరకతుల్యములు.

ఈపై ప్రమాణములయందుఁ జెప్పియున్నట్లు, అల్పాస్థిరంబులగుటయు, దుఃఖమూలములములగుటయు, దుఃఖమిశ్రములగుటయు, దుఃఖోదర్కంబు లగుటయు, విపరీతాభిమాన మూలకంబులగుటయు, స్వాభావికానంద విరుద్ధంబులగుటయు, నివ్విధముగ అచేతన విషయానుభవమునఁగల దోషసప్తకమును, వీటిలో యథాసంభము గలుగునట్టి చేతనమాత్రానుభవ దోషములనున్ను, ఈయనుభవములన్నింటికంటెనున్ను విలక్షణంబగు భగవదనుభవమునకుఁగల వైలక్షణ్యమునున్ను విశదముగా ననుసంధించుకొని, “పరమాత్మని రతో రక్తో విరక్తోఽపరమాత్మని,” (ఎవ్వఁడు పరమాత్మయందు ప్రీతిగలవాఁడై తదితరముల విషయమున వైరాగ్యము గలవాఁడో) అన్నట్టి స్థితిని బొందినట్టివారై, “ప్రవృత్తిలక్షణం ధర్మం ప్రజాపతి రథాబ్రవీత్” అన్నట్లు ప్రవృత్తి ధర్మముల విషయమున విరక్తిగలవారై “నివృత్తిలక్షణం ధర్మం, ఋషిర్నారాయణోఽబ్రవీత్” అన్నట్లు నివృత్తి ధర్మంబుల నవలంబించియున్నట్టి వారు ముముక్షువులగు అధికారులు. ముందుచెప్పిన విధమున పరావరతత్త్వంబులును, పురుషార్థంబును తెలిసియున్నను, వైరాగ్యపూర్వకముగ పరమపురుషార్థోపాయానుష్ఠానమునఁ బ్రవర్తింపక పోయినట్లయిన, “శీలవృత్తఫలం శ్రుతం। శమార్థం సర్వశాస్త్రాణి విహితాని మనీషిభిః తస్మాత్స సర్వశాస్త్రజ్ఞో యస్య శాంతం మనస్సదా” (శీలముయొక్కయును ఆచరణయొక్కయును ఫలమిట్లు తెలియుచున్నది. ఎట్లనిన, శాస్త్రజ్ఞులు శాంతికిగాను సర్వశాస్త్రములనున్ను

యేర్పఱచినారు. ఎవ్వనిమనస్సు శాంతముగానుండునో, వాఁడు సర్వశాస్త్రముల నెఱింగియున్నట్టివాఁడు; అన్నట్టి పాండిత్య ఫలమును బోగొట్టుకొని "నాచ్ఛాదయతి కౌపీనం నదంశమశకావహం శునఃపుచ్ఛమివానర్థం పాండిత్యం ధర్మవర్జితం" (కుక్కతోక కౌపీనముగాను నుపయోగపడకయు, ఈగలు దోమలు మొదలగు వాటిని తోలుకొనుటకును ఉపయోగపడకుండుటంజేసి వ్యర్థంబైనట్లు, ధర్మానుష్ఠానరూపమగు ఉపయోగములేనట్టి పాండిత్యమున్ను వ్యర్థము.) అన్నట్లు పరిహాసాస్పదుండు కాఁగలఁడు.

కావున "వయసః కర్మణోఽర్థస్య శ్రుతస్యాభిజనస్య చ వేషవాగ్వృత్తి సారూప్యమాచరన్ విచరేదిహ" (వయస్సునకును, కర్మమునకున్ను, ద్రవ్యమునకున్ను, పాండిత్యమునకున్ను వంశమునకున్ను వేషమునకున్ను వాగ్వ్యాపారమునకున్ను అనుగుణముగ ప్రవర్తించునది) అన్నట్లు పూర్వాచార్యులు సాయించిన విధమున తనకుఁదగినట్టి పరమ పురుషార్థోపాయానుష్ఠానమునఁ బ్రవేశించుటకు త్వరపడునట్టివాఁడు "తన్నూరుమమ్ చెయ్యపిఱుకన్దారో" "తనపనిని తాను చేయఁగాఁజూచి యితరులు సంతోషపడినారు" అనియు, "తం దేవా బ్రాహ్మణం విదుః" "ప్రణమంతి దేవతాః" (అట్టి వానిని బ్రాహ్మణుండని దేవతలు చెప్పుదురు అట్టివానికి దేవతలు దండము పెట్టుదురు) అన్నట్టి మహిమను పొందగలరు.

పా॥ నిన్ఱపురాణ నడియిణై యేన్దు నెఱుమ్పయనుమ్ ।
పోన్ఱుతలేనిలై యెన్ఱిడప్పాఙ్గుమ్ పవక్కడలుమ్ ।
నన్ఱితుతీయతితెన్ఱున విన్ఱవర్నల్లరుళాల్ ।
వెన్ఱుపులంకళై వీడినై వేంశమ్ పెఱుమ్ పయనే॥

టీ॥ నిన్ఱ = భక్తులను రక్షించుట కవకాశముకై నిరీక్షించుచున్నట్టి, పురాణన్ = పురాణపురుషుండగు సర్వేశ్వరునియొక్క, అడియిణై = చరణద్వంద్వమును, ఏన్దుం = ధ్యానించుట, నెఱుం = గొప్పదగు, పయన్ = పురుషార్థము, పోన్ఱుతల్ = వినాశమే, నిలై = స్థితి, ఎన్ఱిడ = అని చెప్పఁదగినట్టి. పాఙ్గుం = వికారమును బొందునట్టి, పవక్కడలుమ్ = సంసారసముద్రమును, నన్ఱిగు = ఇది మంచిది, తీయదిదు = ఇది చెడ్డది, ఎన్ఱు = అని, నవిన్ఱవర్ = బోధించునట్టివారి నల్లరుళాల్ = మంచి కృపవలన, పులంకళై = ఇంద్రియములను, వెన్ఱు = జయించి, వీడినై = పరమపదము విషయమున నపేక్షయే వేంశుం పెఱుం పయనే = మేము కోరునట్టి సర్వపురుషార్థమును.

తా॥ భక్తులను రక్షించుటకై యవకాశమును నిరీక్షించుచుండునట్టివాఁడగు సర్వేశ్వరుని శ్రీపాదములను ధ్యానించుటయె గొప్ప పురుషార్థము. జన్మస్థితి నాశరూపములగు వికారములను బొందునట్టి సంసార సముద్రమును గుఱించియును కైవల్యాదులను గుఱించియును ఇది మంచిది యిది చెడ్డదియని మాకు బోధించునట్టి వారగు పూర్వాచార్యుల కృపవలన నింద్రియములను జయించి మేము కోరునట్టి గొప్ప పురుషార్థమంతయును పరమపదమును బొందుటయేయని భావము,

శరణ్యుండగు సర్వేశ్వరునికిఁ దెలియునట్లు, పూర్వప్రపత్తి విశిష్టం బుగ ఆచార్యుండు ఉపదేశించినట్టి వాక్యముచే, అంతరంగులు చెప్పిన మాటలతో సార్వభౌముఁడగు రాజును శరణుజొచ్చునట్టి అప్రవీణుఁడగు సామంతరాజునలెనే «స్వామీ! సమ్రక్షిం చుట నీభారమే» అని విన్నవించుట. అది యెట్టువలెననిన, పదవాక్యాది వృత్తాంతంబుల నెఱింగియుండని బాలుండు ఒక్క మారు «భవతి భిక్షాం దేహి» అని చెప్పినట్లయిన, పూర్ణులగు సత్పురుషుల గృహమునందు వెంటనే యపేక్షితము సిద్ధించు నట్లు అనఁగా బిక్షనుగొనివచ్చి పెట్టునట్లు «కొల్లకొల్లైన విల స్వండి తెల్లాంతరుం» అనందగుణ విశిష్టుండగు సర్వేశంయుండు కోరినదంతయు ను ఈయఁగలడని చెప్పినట్లు పరిపూర్ణుండును పరమోదారుండునునగు సర్వేశ్వరుని సన్నిధియందు విన్న వించినట్టి యీ శరణాగతి వాక్యముకు ఫలమును సిద్ధింపఁజేయు నట్టి సామర్థ్యము కలదు.

జ్ఞానరహితులై యీ వాక్యమును మాత్రమే యుద్ధార్థ ముగా సమ్మియుండునట్టివారి విషయమున «యేన కేనాపి ప్రకారేణ ద్వయవక్తాత్వం» (యేదొక విధమున నీవు ద్వయ మును ఉచ్చరించిన వాఁడవయితివి) అన్నట్లు యీవాక్యము మాత్రము శబ్దార్థజ్ఞానాదుల నపేక్షింపదు. ఇది భగవత్కృప. ఈ యర్థమును «పాపీయసోపి శరణాగతి శబ్దభాజః» (పాపా త్ములయినను శరణాగతి వాక్యమును చెప్పుట కర్హులు) అని యు «శరణవరణవాగియం రమోదితా నభవతి బతనాపి ధీపూ ర్వికా» (అయ్యో! బుద్ధి పూర్వకముగ శరణన్నమాట నైనను

శావ్యం శేః) అనియు "ప్రపత్తి వాచైవ నిరీక్షితుం వ్రణే" (ప్రప
త్తి వాక్యముచే జేప్పుడు నిన్నే నిరీక్షించుటకు కోరుచున్నాను)
అనియును ఈ తావుల పూర్వాచార్యులు నాయించియున్నారు.
ఈ యుపాయము నిష్ఠగలవారియొక్క — రెండు తెగల
నున్నచెప్పి "త్వదనఘ రోపాహమాకాంక్షిభి ర్ధార్మికైః శరణమిత్యపి
వాచముదీరితం ఇతి సనాతన యత్నదమధ్యవసాంకుసు భరం
తవ రంగధురంధర" (ఓ శ్రీరంగనాథా! ధార్మికులగు మా
పూర్వాచార్యులు నాభారమునంతయును నీపై పెట్టించినారు. ఈ
విషయమందును యెఱింగినదే. కావున నా భారమునంతయును
నీపై పెట్టుకొనుము) అనుతాత్పర్యము అనుసంధించుకొనియు
న్నారు. ఈ శ్లోకమునందు అధ్యర్థ వాచకమగు "అపి"
శబ్దమువలన ఈ రెండు విధములలో నేదైనను నొక్కదాని
నవలంబించియున్నను చాలునని సూచింపబడుచున్నది.

ఆచార్యనిష్ఠుండెనంగా "పుత్రః ప్రేష్యస్తథా శిష్య ఇత్యే
వంచసి వేదయేత్" అని శాండిల్య స్మృత్యాదులయందుఁ
జెప్పియున్నట్లు ఆచార్యుండగు తనయున్న తనతో సంబంధము
గల వారినెల్ల రక్షించునట్టి భారము శర్వేశ్వరునిపై పెట్టి
శరణుజొచ్చినప్పుడు తత్సంబంధులలో తానున్న అంతర్భా
తుండు "సిద్ధ్యతివా నేతి సంశయోచ్యుత సేవినాం నసంశయో
స్తి తద్భక్త పరిచర్యారతాత్మనాం" (భగవంతుని సేవచేయు
నట్టివారికి మోక్షము సిద్ధించునా? సిద్ధింపదా! యనెడి సంశయ
ము కద్దు. భగవద్భక్తుల సేవచేయునట్టివారికి మోక్షము కలుగు
నను విషయమున నట్టి సంశయమెద్దియును లేదు) అని చెప్పియున్నం
దున, ఆచార్య నిష్ఠునకి మోక్షము కలుగువిషయమున సంశ

చెప్పవలసినది యేమున్నది? సందేహమెంతమాత్రము లేదు. ఒక
పర్వతమునుండి వేఱొక్కపర్వతమునకు పోవునట్టిసింహముయొక్క
శరీరమునంటుండు జంతువులు దానితోఁగూడ బోవునట్లు
శ్రీరామానుజులవారు కడతేరునప్పుడు వారి సంబంధము
మూలముగ మనమున్న కడతేరగలమని శ్రీముదలియాండా
నువారు సాధించియున్నారు. "అంధోఽనంధగ్రహణవశగో
యాతిరంగేశయద్వత్పంగుర్నౌకాకుహరనిహితో నీయతే
నావికేన । భుంక్తేభోగానవిదితనృప స్సేవకస్యార్భకాద్యాః
త్వంత్సప్రాప్తౌ ప్రభవతితథా దేశికో మేదయాళుః" (ఒక గ్రుడ్డి
వాఁడు ఒక కండ్లుగలవానితోఁగూడ నడచిపోవునట్లును, ఒక
కుంటివాఁడొక నావయందు కూర్చుండి నావికునిచేఁగొనిపో
బడునట్లును, రాజు యెవ్వఁడో తెలియకున్నను, రాజసేవకుని
పుత్రుండు రాజభోగముల ననుభవించునట్లును, దయాళుఁ
వగు నా యాచార్యుండు నన్ను ఓరంగనాథా నీసన్నిధిఁబొం
దించుచున్నాడు.) అని న్యాసతిలకమను గ్రంథమునఁ జెప్పి
యున్నారు. ఏది యెట్లున్నను, ఎవ్వ రెవ్విధమున ననుష్ఠించి
నను, శరణాగతికితప్ప పరమపురుషార్థంబగు మోక్షము
నొసంగుటకు సర్వేశ్వరుని మనస్సు కరుగదని యేర్పడు
చున్నది. అట్లే, "పశుర్మనుష్యః పక్షీవా యేచవైష్ణవసం
శ్రయాః తేనైవతేప్రయాస్యంతి తద్విష్ణోఃపరమంపదం" (పశువు
గాని మనుష్యుండుకాని పక్షిగాని యెవ్వరు శ్రీ వైష్ణ
వసంబంధము గలవారో, వారు శ్రీమన్నారాయణుని శ్రీవైకుంఠ
మును బొందుచున్నారు) అనియు, "తేవయంభవతారక్ష్యాః
భవద్విషయవాసినః నగరస్థోవనస్థోవా త్వంనోరాజజనేశ్వర"

చెప్పవలసినది యేమున్నది? సందేహమెంతమాత్రము లేదు. ఒక పర్వతమునుండి వేఱొక్క పర్వతమునకు పోవునట్టి సింహముయొక్క శరీరమునంటుకొనియుండు జంతువులు దానితోఁగూడ పోవునట్లు శ్రీరామానుజులవారు కడతేరునప్పుడు వారి సంబంధము మూలముగ మనమున్ను కడతేరగలమని శ్రీముదలియాండానువారు సాధించియున్నారు. "అన్ధోఽనన్ధగ్రహణవశగో యాతి రంగేశయద్వత్పంగుర్నౌకాకుహరనిహితో నీయతే నావికేన। భుంక్తే భోగానవిదితనృపస్సేవకస్యార్భకాద్యః త్వంత్సంప్రాప్తౌ ప్రభవతి తథా దేశికో మే దయాళుః" (ఒక గ్రుడ్డివాఁడు ఒక కన్నులుగలవానితోఁగూడ నడచిపోవునట్లును, ఒక కుంటివాఁడొక నావయందు కూర్చుండి నావికునిచేఁగొనిపోబడునట్లును, రాజు యెవ్వఁడో తెలియకున్నను, రాజ సేవకుని పుత్త్రుండు రాజ భోగముల ననుభవించునట్లును, దయాళుఁవగు నా యాచార్యుండు నన్ను ఓరంగనాథా నీసన్నిధిఁ బొందించుచున్నాఁడు.) అని న్యాసతిలకమను గ్రంథమునఁ జెప్పియున్నారు. ఏది యెట్లున్నను, ఎవ్వరెవ్విధమున ననుష్ఠించినను, శరణాగతికి తప్ప పరమపురుషార్థంబగు మోక్షము నొసంగుటకు సర్వేశ్వరుని మనస్సు కరుగదని యేర్పడుచున్నది. అట్లే, "పశుర్మనుష్యః పక్షీ వా యే చ వైష్ణవసంశ్రయాః తేనైవ తే ప్రయాస్యంతి తద్విష్ణోః పరమం పదం" (పశువుగాని మనుష్యుండుకాని పక్షిగాని యెవ్వారు శ్రీ వైష్ణవ సంబంధము గలవారో, వారు శ్రీమన్నారాయణుని శ్రీవైకుంఠమును బొందుచున్నారు) అనియు, "తే వయం భవతా రక్ష్యాః భవద్విషయవాసినః నగరస్థా వనస్థా వా త్వం నో రాజా జనేశ్వర"

(మేము నీయొక్క రాజ్యమునందుండునట్టి వారము గాన, నీచే రక్షింపఁదగిన వారము. నగరమునందున్నను, అరణ్యమునందున్నను నీవే మాకు రాజువు) అనియు, «నజ్ఞాలమో త్తియిల్ వాళుంశరాశరం మత్ బ్రవు నజ్ఞాలుక్కుయ్ త్తవర్" (మంచి పట్టమగు అయోధ్యయందు వసించునట్టి స్థావర జంగమంబులన్నింటికి పరమపురుషార్థ హేతువగు తన సంబంధమును గలుగఁజేసిన వాఁడు) అనియు «వన్నైయామవనోఱుబిల్ ఎ బ్రుమ్ వెట్టెణవళ్" (ఉపాయ సంబంధ రూపమగు సీ కోవిలయందుండునట్టి వైష్ణవుండు) అనియును నాయించియున్నారు. ఈ పై పాశురమున «వన్నై" అని చెప్పియున్నట్టి భాగవతాభిమాన భగవద్విషయ వ్యాసాదులకున్ను తనయందుగాని యితరులయందుగాని, పూర్వముగాని తరువాతనుగాని, ఒకవిధమైనట్టి యుపాయ సంబంధములేదు. అదియెట్లననన, ఇవియును, ఈచేతనుని ఉపాసనమునఁగాని, ప్రపత్తిలోఁగాని ప్రవేశపెట్టియును, ఉపాసనమున రుచిపుట్టినవానికి అట్టి యుపాసనమును పై పైగా వృద్ధిపొందించియును, స్వతంత్రమగు ప్రపత్తిని అనుష్ఠించునట్టి వానికి ఈ లోకమున నొనర్చునట్టి కైంకర్యమును వృద్ధిపఱచియును, భగవత్ప్రాప్తి విషయమున త్వరను గలుగఁజేసియును ఉపకారకములు కాఁగలవు.

వీరిలో, వ్యాసాదులవలెనే యుపాయాంతరానుష్ఠానమునకు సమర్థుఁడగుటంజేసి యాకించనుండుకాకుండ, మోక్షము కలుగుటలో నాలస్యమును సహించియుండునట్టి వాఁడగుటంజేసి అనన్యగతుండున్ను కాకుండ యుండునట్టి సద్వారక ప్రపత్తినిష్ఠునికి (ప్రపత్తిని యుపాసనాంగముగాఁగొనినట్టివానికి)

ప్రారబ్ధకర్మము ముగింపఁగానే గలుగునట్టి యంతిమస్మృతిని అవధిగాఁ గలిగియుండునట్టి యుపాసనరూపమగుఅంగివాస్త వముగ పరిపూర్ణమగుటచేఁ గలుగునట్టి మోక్షము ఫలము.

సర్వాధికారమై, సర్వానిష్టంబులను పోగొట్టుటకు సమర్థంబై, సర్వేష్టసాధనమై, సుకరమై, సకృత్తుగాఁ జేయవలసినదియై, శీఘ్రముగాఁ ఫలమునిచ్చునదియై, ప్రతిబంధములకవకాశమీయనిదై (బ్రహ్మాస్త్ర)బంధమువలెనే తానుఫలమునిచ్చుటలో నుపాయాంతర ప్రయోగమును సహింపనిదైయున్నట్టిప్రపత్తిని తనయధికారానుగుణముగ అద్వారకముగ (నేరుగ) అవలంబించినట్టి వానికి పరిపూర్ణానుభవముగలుగటకు వేఱొక్క ప్రతిబంధకమొద్దియును లేనుగాన, ప్రపత్తిచేసిన క్షణము మొదలుకొని, ‘‘ఇంగేతిరిన్దేర్క్కుళ్ళుక్కుమ్ నైఙ్’’ (భగవంతుండు కృపచేసినట్లయిన, యిక్కడ యున్నను కొదవలేదు) అనియు ‘‘ఇచ్చువైత విరియానోప్ ఇన్దిర లోకమాళుమచ్చువై పెఱినుమ్ వేణ్డేన్’’ (ఇచ్చటనుండు భగవద్గుణ సంకీర్తనానుభవమును వదలుకొని పరమపదమునకుఁ బోవుటకు ఒప్పుకోనను) అనియు ‘‘వేరార్ ముయల్వోట్టు క్కైక్కప్పిన్ పోవతే’’ (చేతిలోనున్నట్టి భోగ్యమైన కుందేటిమాంసమును వదలుకొని కాకిమాంసమునకై యేల పఱుగెత్తవలయును) అనియు ‘‘స్నేహో మేపరమో రాజన్ త్వయి నిత్యం ప్రతిష్ఠితః । భక్తిశ్చ నియతా వీర భావో నాన్యత్ర గచ్ఛతి’’ (రాజా నీవిషయమున నాకు ఎక్కువస్నేహము నిత్యముగాఁ గలదు. భక్తియున్ను మిక్కుటముగాఁ గలదు నామనస్సు నీవిషయమునతప్ప వేఱొక్క విషయమున నెప్పటికిన్ని పోదు) అనియును వాయించినట్లు ఈశరీరముతోనుండియే కైంకర్యాను

ములును నన్నాశ్రయించుచున్నారు) అన్నట్లు, ఉపాసనము నాలుగువిధములగు ఫలములకును యేదొకవిధముగ సాధనము కాఁగలదు, అట్లె, "తావదార్తి స్తథావాంఛా తావన్మోహ స్తథాసుఖం। యావన్న యాతి శరణం త్వామశేషాఘనాశనం" (ఎంతవరకు భగవంతుని శరణుజొచ్చఁడో, ఎంతవరకు పాపము నశింపదో, అంతవరకే వాంఛ, అంతవరకే మోహము. అంతవరకే సుఖముసు) అనుతావున ప్రపత్తియును చతుర్విధ ఫలంబులకును సాధనమని కదా! మహాత్ములు సాయించి యున్నారు. ఈ పైశ్లోకమునందు "అశేషాఘనాశనం" అని యాదరము తెలియవచ్చునట్లును 'అంతవరకు అంతవరకు' అని అధికారము తెలియవచ్చునట్లును ఏదేవదే చెప్పుటంజేసియును ఈతండు కోరిన ఫలమంతయును ఈతండు కోరినప్పుడే యీతని మనోరథము ప్రకారము సిద్ధించును. ఇట్టి మహిమను మనస్సునఁ బెట్టుకొనియే "సత్కర్మనిరతాశ్శుద్ధాః సాంఖ్యయోగవిద స్తథా నార్హంతి శరణస్థస్య కలాం కోటితమీమపి" (కర్మయోగ నిష్ఠులుగాని, సాంఖ్యయోగ నిష్ఠులుగాని శరణాగతుండైన వానియొక్క మహిమలో ఒకకోటివంతు భాగముకైనను సమానులుకారు) అని చెప్పఁబడినది.

ఈతనికి ఈలోకమునందున్నప్పుడు కైంకర్యమునఁగల(రుచి) భేదము ఈతనికోరికనుబట్టి యుండునని యెఱుంగునది. దానికిఁ గారణము ప్రారబ్ధ సుకృతవిశేషము. ఈ శరీరమును విడిచిన పిమ్మట బొందునట్టి ఫలమునందు భేదంబెద్దియును లేదు. పారతంత్ర్య మొక్కవిధమైనది "పారతంత్ర్యం పరేపుంసి ప్రాప్య నిర్గత బంధనః స్వాతంత్ర్య మతులంప్రాప్య తేనైవసహ మో

దతే" అని ఫలదశయందున్నట్టిదిగాను చెప్పఁబడునట్టి స్వాతంత్ర్యమనునది కర్మవశ్యుఁడు కాకుండ సర్వవిధ కైంకర్యయోగ్యుఁడగుటయని ఫలవాదమున నిర్ణయింపఁబడినది.

వేణ్డుమ్పెరుంపయన్ వీడెన్ఱఱిన్దువిదివకైయాల్
నీణ్డుంకుఱుకియుం నిఱ్కునిలైకళుక్కేఱ్కుమన్బర్
మూణ్డొన్ఱిల్ మూలవినైమాఱ్ఱుదలిల్ ముకున్దనడిపూణ్డొన్ఱి
మఱ్ఱోర్పుకలొన్ఱిల్లైయెననిఱ్పనరే.

టీ॥ వేండుమ్ = స్పృహణీయంబైనట్టి, పెరుమ్బయన్ = గొప్ప ఫలము, వీడు = పరమపదము, ఎన్ఱు = అని, అఱిన్దు = తెలిసికొని, విధివకైయాల్ = అదృష్టపరిపాకప్రకారము, నీండుం = దీర్ఘకాలము నష్ఠింపఁబడునదిగాను, కుఱుకియుమ్ = క్షణకాలము నష్ఠింపఁబడునట్టిదిగాను, నిఱ్కుమ్ = ఉన్నట్టి, నిలైకళుక్కు = భక్తిప్రపత్తిరూపములగు అనుష్ఠానములకు, ఏఱ్కుమ్ = అధికారముగలవారగు, అన్బర్ = భక్తులు అనఁగా ముముక్షువులు, మూండు = శ్రద్ధగలవారై, ఒన్ఱిల్ = వీటిలో నెద్దియైన నొక్కదానియందుఁ బ్రవర్తించి, మూలవినై = కారణభూతములగు పాపములను, మాఱ్ఱుదలిల్ = నశింపఁజేయుటనుగాను, ముకుందనడి = భగవంతుని పాదములను, పూండొన్ఱి = ఆశ్రయింపకపోయినట్లయిన, మఱ్ఱోర్ = అందులకుఁ జెందు వేఱొక్క, పుకల్ = రక్షకము, ఒన్ఱు = ఒక్కటియును, ఇల్లై = లేదు. ఎన = ఇవ్విధమున చెప్పవలెనన్నట్లు, నిఱ్పనరే = ఉండియున్నారు,

తా॥ పరమపురుషార్థము మోక్షంబని యెఱింగియున్నట్టి వారై చిరకాలానుష్ఠేయంబగు భక్తియందును ఒకానొకస్వల్పకాలానుష్ఠేయంబగు ప్రపత్తియందును వారివారి యదృష్టపరిపాకప్రకారము అధికారముగల వారగు ముముక్షువులు ఈరెండింటిలో నెద్దియైననొక్కదాని నవలంబించి

పాపపరిహారముకుగాను భగవంతుని శ్రీపాదముల నాశ్రయించుటయేతప్ప వేఱొక్క రక్షకం బెద్దియును లేదని నిశ్చయించుకొని యున్నారు.

శ్లో॥ ప్రపన్నాదన్యేషాం నదిశతిముకుందో నిజపదం
ప్రపన్నశ్చద్వేధాసుచరితపరీపాకభిదయా
విళంబేత(త)నప్రాప్తిర్భజనసుఖమేకస్య విపులం
పరస్యాశుప్రాప్తిః పరిమితరసా జీవితదశా॥

టీ॥ ముకుందః = భగవంతుండు, ప్రపన్నాత్ = ప్రపన్నునికంటెను, అన్యేషాం = ఇతరులకు, నిజపదం = స్వస్థానమగు పరమపదమును, నదిశతి = కృపచేయుడు. సుచరితపరీపాకభిదయా = సుకృతపరిపాకప్రకారము, ప్రపన్నశ్చ = ప్రపన్నుండును, ద్వేధా = రెండు విధములు గలవాఁడు, ఏకస్య = ఒక్కనికి, ప్రాప్తి = భగవత్ప్రాప్తి, విళంబేత = ఆలస్యముగ గలుగును. భజనసుఖం = భగవద్గుణానుభవరూపమగు సుఖము, విపులం = విస్తారముగానుండును, పరస్య = వేఱొక్కనికి, ప్రాప్తిః = భగవత్ప్రాప్తిరూపమగు మోక్షము, ఆశు = శీఘ్రముగ గలుగును. జీవిత దశా = జీవితకాలము, పరిమితరసా = సామాన్యరసముగలదిగానుండును.

తా॥ భగవంతుండు ప్రపన్నులకుతప్ప యితరులకు మోక్షమునియ్యఁడు. ప్రపన్నులన్ననో సద్వారకప్రవత్తి నిష్ఠుండనియు, అద్వారకప్రవత్తి నిష్ఠుండనియును రెండుతెగలవారు. వీరిలో సద్వారకప్రవత్తి నిష్ఠునికి మోక్షము గలుగుటలో నాలస్యమగును. అయితే యీతనికి యీలోకమునందు భగవద్గుణానుభవము విపులముగానుండగలదు. అద్వారకప్రవత్తి నిష్ఠునికన్ననో, మోక్షము శీఘ్రముగాఁ గలుగును. అయితే యీతనికి యీలోకమునందు జీవయాత్ర అంత సారవంతముగా నుండదు,

అధికారి విభాగాధికారము.

ముగిసెను.



శ్రీమతే నిగమాంతమహాదేశికాయ నమః.







# రహస్యత్రయసారము



## ఉపాయవిభాగాధికారము.

శ్లో॥ ఉపాయస్స్వప్రాప్తేరుపనిషదధీతస్స భగవాన్
ప్రపత్త్యైతస్యోక్తే ప్రపదననిధ్యాసన(గ)స్మృతీ
తదారోహః పుంసస్సుకృతపరిపాకేన మహతా
నిదానం తత్రాపి స్వయమఖిలనిర్మాణనిపుణః॥

టీ॥ ఉపనిషదధీతః = ఉపనిషత్తులనుండి జగత్కారణముగాఁ దెలియవచ్చునట్టి భగవంతుండే, స్వప్రాప్తేః = ఈ చేతనుండు తనను బొందుటకు, ఉపాయః = ఉపాయంబైనట్టివాఁడు తస్య = ఆ భగవంతుని, ప్రపత్త్యై = పొందుటకుగాను, ప్రపదన నిదిధ్యాసన స్మృతీ = భక్తిప్రపత్తి రూపములగు మార్గములు, ఉక్తే = శాస్త్రమునందుఁ జెప్పఁబడినవి. పుంసః = పురుషునికి, తదారోహః = వాటి నవలంబించుటయనునది, మహతా = గొప్పదియగు, సుకృతపరిపాకేన = పుణ్యపరిపాకము వలనఁ గలుగఁగలదు, తత్రాపి = ఆ విషయమునను, అఖిలనిర్మాణనిపుణః = సమస్తప్రపంచమును సృజించుటలో సమర్థుండగు సర్వేశ్వరుండు, స్వయం = స్వయముగ, నిదానం = కారణభూతుండు,

తా॥ ఉపనిషత్ప్రతిపాద్యుండగు భగవంతుండే యీ చేతనులు తనను బొందుటకు కారణభూతుండు. భక్తిప్రపత్తులనెడు మోక్షోపాయములు

గాను శాస్త్రమునందు చెప్పఁబడినవి. ఈచేతనులు తమతమ పుణ్యపరిపాక ప్రకారము భక్తిప్రపత్తులయందు నిష్ఠఁగలవారగుచుండుచు సర్వేశ్వరుండే వ్యాపారముక కారణభూతుండుగ నున్నాఁడు.

వీరికి కర్తవ్యంబగు ఉపాయమనునది ఒకవిధమైన జ్ఞాన వికాసము. దీనిఁగొని సాధింపఁబడునట్టిదియై ప్రాప్తిరూపంబగు ఉపేయమనునది ఒకవిధమైన జ్ఞానవికాసము. వీటిలో ఉపాయభూతంబగు జ్ఞానవికాసము ఇంద్రియముల సహాయము నపేక్షించునట్టిదియై, శాస్త్రముచే విధింపఁబడినదై, సత్య త్వాది స్వరూపనిరూపకధర్మంబు లయిదింటితోఁగూడియుండి ఆయా యుపాసనములకు నియతములగు గుణాదులతోఁగూడి యున్నట్టి బ్రహ్మమునుగుఱించినదిగా నుండఁగలదు. ఉపేయంబగు జ్ఞానవికాసము ఇంద్రియముల సహాయము నపేక్షింపనిదై స్వభావప్రాప్తంబై గుణములు విభూతులు మొదలగు వాటి తోఁనన్నింటితోను పరిపూర్ణంబగు బ్రహ్మమునుగుఱించినదియై యుండఁగలదు. "ఉపాసితగుణాదేర్యా ప్రాప్తావప్యబహిష్క్రియా । సాతత్క్రతునయగ్రాహ్యా నాకారాంతరవర్జనం" (వది ప్రాప్తి సమయమునను నున్న ఉపాసిత గుణములను విడువకుండ యుండనదియై, తత్క్రతున్యాయప్రకారము గ్రహింపఁబడునది యై, ఆకారాంతరములను విడువకయుండునట్టిదో) అన్నట్లు. ప్రాప్తిరూపంబగు ఈ యనుభవమునయొక్క యతిశయమువల నఁజేయఁబడునట్టి కైంకర్యము ఉపేయము. ఇట్లు ఉపాయరూ పముగానును ప్రాప్తిరూపముగానునుండునట్టి జ్ఞానమునకు విష యంబై ఫలప్రదుండును, భోగ్యుండునగు టంజేసి, సర్వేశ్వరునికి ఉపాయత్వమును, ఉపేయత్వమును కలవు. ఈ యీశ్వరుని

యుపాయత్వము అనన్యాంతిక ప్రపత్తినిష్ఠుని విషయమున ఉపా
యాంతర స్థానమును పొంది యుండగలదు. తక్కిన యధి
కారికిని కర్మయోగారంభము మొదలుకొని ఉపాసనపూర్తి
పర్యంతము మధ్యనుండు కర్తవ్యముల విషయమున కష్టములు
గలుగుచున్నను ఈ ప్రపత్తిచే పరిగ్రహింపబడినట్టి యీశ్వ
రుండు లోపల ప్రవేశించి అట్టి దుష్కరములగునట్టి కార్య
ములవలన గలుగవలసిన పాపనివృత్తినిన్ని, సత్వగుణోత్ప
త్త్యాదులనున్ను గలుగజేసి, అట్టి యుపాసనమనబడునట్టి
యుపాయమును ఫలపర్యంతము కొనసాగించుకొనివచ్చును.

వానిలో కర్మయోగమనగా, శాస్త్రము మూలముగ
జీవాత్మ పరమాత్మ స్వరూపస్వభావములను గుఱించి యథార్థ
మైనట్టి జ్ఞానము గలిగినట్లయిన తనచే నొనర్పశక్యంబులై ఫలాపే
క్షారహితంబులగు కామ్యకర్మములతోను నిత్యనైమిత్తిక కర్మ
ములతోను సహితముగా పరిగ్రహింపబడినట్టి కర్మవిశేషము.
దీనియొక్క యవాంతరభేదములు "దైవమేవాపరేయజ్ఞము"
అని ప్రారంభించి శ్రీభగవద్గీతలయందు జెప్పబడినట్టి దేవా
ర్చన, తపస్సు, తీర్థయాత్ర, దాన, యజ్ఞాదులు. వారివారి అధికార
భేదమును బట్టి ప్రపత్తియే భక్తిని మధ్యనునుంచుకొనియును,
ఉంచుకొనకయును, మోక్షహేతువగు చందంబున, ఈకర్మయో
గమున్ను జ్ఞానయోగమును మధ్యనునుంచుకొనియు, ఉంచు
కొనకయును, పరికరయుక్తంబగు యోగముగాని ఆత్మసాక్షా
త్కారమునకు సాధనము కాగలదు.

జ్ఞానయోగమనగా—కర్మయోగము మూలముగ మనస్సును
వశపఱచుకొనినట్టి వానికి ప్రకృత్యాదులకంటెనున్ను విలక్ష

ణంబై ఈశ్వరునివిషయమున అధేయత్వ,విధేయత్వ, శేషత్వ ములవలన వానికిశరీరముగుటచే వానికొక విశేషణముగానుం డునట్టిదియగు ఆత్మస్వరూపమును యెడతెగకుండ యెల్ల ప్పుడు చింతించుకొనుచుండుట. ఈ కర్మయోగజ్ఞానయోగము లచే యోగముద్వారా ఆత్మసాక్షాత్కారము గలిగినప్పుడు, శబ్దాదివిషయ సుఖముల యెడల వైరాగ్యమును గలుగఁజేయు నట్టి యాత్మానుభవ సుఖమనెడి యాకర్షకవస్తువుచే ఆకర్షింపఁ బడినవాఁడయినట్టియిన, పరమపురుషార్థంబగు భగవదను భవమునకు ఉపాయభూతంబగు భక్తియోగములోఁ ప్రవేశించు నప్పుడు,లోపలనుండునట్టి రత్నమునుజూచుటకుముందుగదాని పంచిఁజూచునట్లు, అంతర్యామిని జూచుటకు, వానికిశరీరభూతం బగు జీవాత్మ యొక్క దర్శనము ఉపయుక్తంబైనదై భక్తి యోగమునకుఁ గావలసిన యధికారముఁ గలుఁగజేయును.

భక్తి యోగమనఁగా—వేఱొక్కదానియందు నిష్ఠ లేని వాఁడై, వేఱొక్కదాని యధీనములో నుండని వాఁడై వేఱొక్కనికి శేషభూతుండుగానట్టిభగవంతునియొక్కస్వరూ పాదుల విషయమున నిరతిశయ ప్రీతిరూపమగు ధ్యాన విశే షము అది తైలధారవలెనే యెడతెగకుండ నిరంతరస్మృతి రూపంబై సాక్షాత్కారతుల్యంబగు మనోవైశద్యమును గలిగి యుండునదై, ఈజీవుండు ఈశరీరమును విడిచి పరమపదమున కుఁబోవుటకై ప్రయాణముచేయు వరకును ప్రతిదినమును అనుష్ఠింపగా అనుష్ఠింపఁగా వృద్ధిపొంది వచ్చునట్టిదై అంతిమ స్మృతి వరకు నుండునట్టి జ్ఞానపరంపర. వర్ణాశ్రమధర్మ ములు.జ్ఞానవికాసమునకు హేతుభూతంబగు సత్వగుణము వృద్ధి

ప్రకృతి సంబంధములగు రజోగుణ తమోగుణంబులకు కారణ
భూతములగు పాపములు పోగొట్టి దీనికి యుపయుక్తములుగా
నుండును. ఈ భక్తి యోగము "ప్రత్యయార్థం చ మోక్ష
స్య వదయః పరికీర్తితాః" (మోక్షము సమ్యక్కముకై ఫల
ములు చెప్పబడినవి) అన్నట్లు చపలులమనస్సును త్రిప్పుటకు
తగు వారివారి కోరికలకుగల భేదము వలన ఐశ్వర్యా
దులకు సాధనము లగును. ఈ విషయము "చతు
ర్విధా భజన్తే మాం" అను శ్లోకమున శ్రీభగవద్గీతలయందు
చెప్పబడినది. ఆ గ్రంథమున "తేషాం జ్ఞానీ నిత్యయుక్త ఏక
భక్తిర్విశిష్యతే" అని యారంభించి చెప్పినట్టి జ్ఞానియొక్క
మాహాత్మ్యము "చతుర్విధా మమ జనా భక్తా ఏవ హి తే స్మృతాః
తేషామేకాన్తినః శ్రేష్ఠాః తే చైవానన్యదేవతాః అహమేవ
గతిస్తేషాం నిరాశీః కర్మకారిణాం యే తు శిష్టాస్త్రయో భక్తాః
ఫలకామా హి తే మతాః సర్వే చ్యవనధర్మాణః ప్రతిబుద్ధస్తు
మోక్షభాక్॥ (నాయొక్క భక్తులు నాల్గువిధములవారు, వారిలో
దేవతాంతరపరులు కాకుండ నన్నే నమ్మియున్నట్టి యేకాంతు
లు శ్రేష్ఠులు ఫలాపేక్ష లేకుండ కర్మములననుష్ఠించువారికి నేనే
రక్షకుండను. తక్కినముగ్గురు ఆయా ఫలముల కాశించి యం
దుకొరకై కర్మములననుష్ఠించునట్టి వారుకావున జ్ఞానవంతుండే
మోక్షమును బొందునట్టి వాడు) అని తావున భగవంతుండే
స్పష్టముగ చెప్పియున్నాడు.

ఇట్లు మోక్షోపాయముగాను విధింపబడినట్టి భక్తి
యోగము పరభక్తియని వ్యవహరింపబడుచున్నది. దీనికి
హేతువై సాత్త్వికపరిశీలనాదుల వలన భగవద్విషయమున

గలిగిన ప్రీతియనునది సర్వేశ్వరుని నిరవధికముగాఁ దెలిసికొనవల
యునట్టి యభినివేశమునకుఁ గారణంబైన పరభక్తియని వ్యవహరిం
పఁబడుచున్నది దీనిమూలముగ "శుద్ధభావంగతో భక్త్యా శా
స్త్రాద్వేద్మి జనార్దనం" (భక్తిచే పరిశుద్ధమైనట్టి మనస్సుకల
వాఁడనై శాస్త్రము వలన భగవంతుని తెలిసికొనుచున్నాను) అ
న్నట్లు శాస్త్రజన్యంబగు తత్త్వజ్ఞానము, కర్మయోగము మొదల
గువాటిచే గలిగిన పరభక్తియనునది భగవంతుని సాక్షాత్కా
రింపవలయునని యభినివేశముఁ గలుగఁ జేసి, "యోగేశ్వరత
తో మే త్వం దర్శయాత్మానమవ్యయం" (ఓ యోగేశ్వర! నాశ
రహితంబగు నీయొక్క స్వరూపమును నాకుఁ జూపింపుము) అని
యు "కాణుమారు అళాయ్" (ఎప్పుడైన నేకన్నునాకుగాన
రావే) అనియు, "ఒరునాళ్ కాణవారాయే" (ఒక దినమున సేవ
సాయింపుమా) అనియుఁ గా మొఱపెట్టునట్లు చేసి, యిట్టి యపే
క్షామాత్రమువలనఁ గలిగిన భగవదనుగ్రహమువలననట్టి కాల
ము నందు నియతంబైనట్టి పరిపూర్ణసాక్షాత్కారమును గలుగఁ
జేయును. ఈ సాక్షాత్కారము పరజ్ఞానమని వ్యవహరింపఁబడును.

ఇట్లు నిరతిశయ భోగ్యంబైనట్టి భగవత్స్వరూపమును
సాక్షాత్కరించినతోడనే, యెండలో మిక్కిలి దప్పికగొని
వచ్చినట్టి వాఁడు జలపరిపూర్ణంబగు తటాకముఁ గని సంతో
షించునట్లు ఈ చేతనునికిఁ గలుగునట్టి ప్రీతియనునది పరభక్తి
యనఁబడుచున్నది.

ఇది "మునియేనాన్ముకనే" అను తిరువాయిమొళి
యందుఁ జెప్పియున్నట్లు సంకోచము లేకుండ భగవంతుని యను

భవించినే తప్ప ధరించియుండజాలనట్లు అభినివేశముం గలుగఁజేసి మఱపోకుండునట్లు నిర్బంధించి, బిగ్గఱగా మొఱ పెట్టుకొనునట్లు చేయుటచే నీతనికి శీఘ్రముగ పరమపదము నొసంగునట్లు సర్వేశ్వరునికి త్వరను గలుగఁజేసి యీతనిని శీఘ్రముగా పరమపదమును బొందించును.

ఈ భక్తియోగ త్రైవర్ణికులు కాని వారికిని, త్రైవర్ణికులలోనను జ్ఞానము విషయమునఁగాని, శక్తివిషయమునఁగాని యీరెంటి విషయమునఁగాని కొరత గలవారికిన్ని, ఫలము (మోక్షము) గలుగుటలో నాలస్యమును సహించియుండజాలనంత తీవ్రమైనట్టియార్తి గలవారికిని, అనుకూలమైనట్టిది కానందున, తమతమశక్తులను గుర్తెఱింగి అద్వారకముగ ప్రపత్తిని మోక్షోపాయముగా నవలంబించినట్టివారికి సర్వఫలసాధనభూతంబగు ఈప్రపత్తియే పరభక్తిస్థానమున నుండుటం జేసి, ఉపాసకునికి పరభక్తి పైపైగా గలుగునట్టి యవస్థలవలెనే ఈస్వతంత్రమగు ప్రపత్తియందు నిష్ఠగలవాని యంగీకారమునకుఁ దగినట్లు ఈ ప్రపత్తికి పైపైగా గలుగునట్టి అనుకూలావస్థలు దీని ఫలముగ నుండగలవు

ఇవ్విధమున ప్రపత్తికిని భక్తికిని దాని దాని యధికారులయొక్క భేదమునుబట్టి ఫలము సరిసమానముగా నుండుటం జేసి, యివి వికల్పములు కాఁగలవు. అనఁగా నీరెంటిలో దేనిననుష్ఠించినను, ఫలంబొక్కటియే యనుట. "నానా శబ్దాది భేదాత్" అను అధికరణమునందు వీటికి భేదమున్నట్లు సిద్ధమగుచున్నది. "వికల్పో విశిష్ట ఫలత్వాత్" అను అధికరణమున వీటికి వికల్పమున్ను ఉన్నట్లు సిద్ధమగుచున్నది.

ఉపాసనమునకు భేదములున్నట్లు, భిన్న భిన్న శాఖల యందును, శ్రీ పాంచరాత్రాది సంహితలయందును చెప్పఁబడినట్టి యీ ప్రపత్తికిన్ని మంత్రాది భేదములుగలవని యెఱుంగునది. నమస్కారమును వాచికము, కాయికము, మానసము అని విభజించినట్లు, ప్రపత్తికిని యేదొక హేతువుఁగానియే యీ విభాగములు చెప్పఁబడినవి. ఈ మూఁడున్ను సరీగా నున్నప్పుడు పూర్ణ నమస్కారంబగునట్లు, పూర్ణ ప్రపత్తి కాఁగలదని చెప్పినట్టి వారి శ్రీ సూక్తులకును, వాచిక కాయికములగు వ్యాపారములు అతిశయించియున్నప్పుడు మానసప్రపత్తి యొక్క పూర్తియే యుద్దేశము కాఁగలదు. అధికారానుగుణముగ నివియన్నియును ఫలప్రదంబులు కాఁగలవని చెప్పియున్నాము.

నిన్ఱనిలైక్కు ఒఴి ఒఴుక్కక్కరుమమున్ నేర్మదియాల్,
నన్ఱెన నాడియ ఞానముం నల్ కుముట్ కణ్డుడైయార్,
ఒన్ఱియపత్తియుమొన్ఱుమిలావిరైవార్క్కరుళాల్,
అన్ఱుపయన్దరుమాఱుమఱిన్దవరన్దణరే॥

టీ॥ నిన్ఱనిలైక్కు = ప్రస్తుతమున్నట్టి వర్ణాశ్రమాచారస్థితికి, ఒఴి = అవశ్యకముగా, ఒఴుక్కమ్ = శాస్త్రసిద్ధమైనట్టి, కరుమమ్ = కర్మయోగమున్ను, నేర్మతియాల్ = సూక్ష్మబుద్ధిచే, నన్ఱెన = మంచిదనుకొని, నాడియ = ఆలోచించుకొని స్వీకరించినట్టి, ఞానముమ్ = జ్ఞానయోగమున్ను, నల్ కుముళ్ కండుడైయార్ = ప్రీతిరూపాపన్న జ్ఞానవంతులు, ఒన్ఱియ = ఏకకంఠముగా స్వీకరించినట్టి, పత్తియుమ్ = భక్తియున్ను, ఒన్ఱుమిలా = వీటిలో నొక్కటియును లేకపోయి నప్పటికిన్ని, విరైవార్క్కు = భగవంతుని పొందుటకై త్వరపడునట్టివారికి, అన్ఱు = వెంటనే, పయన్ = ఫలమును, తరుమ్ = ఇచ్చునట్టి, ఆఱుమ్ = ఉపాయమును అనఁగా శరణాగతిని, అఱిందవర్ = తెలిసికొని యున్నట్టివారు, అన్దణరే = వారే బ్రాహ్మణులు.

కాని కర్మజ్ఞాన, భక్తియోగములనగ్రహించుటకు శక్తిలేక భగవంతుని పొందుటకై త్వరపడునట్టివారికి వెంటనే ఫలమునిచ్చునట్టి యుపాయమగు శరణాగతిని యెఱింగియున్నట్టివారే బ్రాహ్మణు లనఁబడుదురు.

శ్లో॥ కర్మజ్ఞానముపాసనంచ శరణం ప్రవ్రజ్యాతిచావస్థితాన్
సన్మార్గానపవర్గసాధనవిధౌ సద్వారకాద్వారకాన్।
ఏకద్విత్రిప్రకృతియోగసంభృతపృథగ్భావానుభావానిమాన్
సమ్యక్ప్రేక్ష్య శరణ్యసారథిగిరామన్తేరమన్తేబుధాః॥

టీ। అపవర్గసాధనవిధౌ = మోక్షప్రతిపాదకమగు శాస్త్రమునందు, సద్వారకాన్ = వేఱొకదాని కంగములుగాను, అద్వారకాన్ = స్వతంత్రోపాయములుగాను విధింపఁబడినట్టి. కర్మ = కర్మయోగమనియు, జ్ఞానం = జ్ఞానయోగమనియు, ఉపాసనంచ = భక్తియోగమనియు, శరణం ప్రవ్రజ్యాతిచ = ప్రపత్తియనియును, అవస్థితాన్ = ఇవ్విధముగానున్నట్టి, సన్మార్గాన్ = మోక్షోపాయములను, ఏకద్విత్రిప్రకృతియోగసంభృత పృథగ్భావానుభావాన్ = ఏక = ఒక్కటియగు ప్రపత్తియొక్క, ద్విత్రిప్రకృతియోగ = రెండు మూడు ఆకారములచే, సంభృత = సంపాదింపఁబడినట్టి, పృథగ్భావానుభావాన్ = మాహాత్మ్యముగలవాటినిగా, సమ్యక్ప్రేక్ష్య = బాగుగా పరిశీలించి, శరణ్యసారథిగిరాం = సర్వశరణ్యుండగు సర్వేశ్వరునియొక్క క్రీడార్థమగు కృష్ణావతారముయొక్క, గిరాం = అప్పుడు సాయించిన భగవద్గీతలయొక్క, అంతే = అంతమునందుఁగల చరమశ్లోకమునందు సాయించిన శరణాగతియందు, బుధాః = వివేకవంతులగు ముముక్షువులు, రమంతే = ఆనందించుచున్నారు.

తా॥ కర్మజ్ఞానభక్తు లనంబడునట్టి యుపాయాంతరములకంటె నున్న ప్రపత్తికిఁగల వైలక్షణ్యముఁగనినట్టి ముముక్షువులు భగవంతుండు శ్రీకృష్ణావతారమునందు సాయించిన శ్రీభగవద్గీతలయందు అంతిమమున సాయించిన చరమశ్లోకమునందుఁ జెప్పఁబడినట్టి శరణాగతియందు మిక్కిలి యాదరపడియున్నారు.

ఉపాయవిభాగాధికారము ముగిసెను.



    

# రహస్యత్రయసారము



## ప్రపత్తియోగ్యాధికారము.

శ్లో॥ అర్థిత్వేన సమర్థతాత్రికతనుస్సంపిండితాధిక్రియా
సాచాష్టాంగషడంగయోగనియతావస్థావ్యవస్థాపితా।
శ్రౌతీసర్వశరణ్యతా భగవతస్స్మృత్యాపి సత్యాపితా
సత్యాదిష్వివ నైగమేష్వధికృతి స్సర్వాస్పదే సత్పథే॥

టీ॥ అర్థిత్వేన = ఫలాపేక్షచే, సంపిండితా = కూడుకొని యున్నట్టిదియు, త్రికతనుః = మూఁడువిధములగు సామర్థ్యములతోఁ గూడి యున్నట్టిదియునగు, సమర్థతా = సామర్థ్యము, అధిక్రియా = అధికారము, సా చ = అట్టి యధికారము, అష్టాంగ షడంగయోగ నియతావస్థా = భక్తిప్రపత్తులకు నియతములయినట్టి యాకారముగలదియని, వ్యవస్థాపితా = శాస్త్రజ్ఞులచే నిర్ణయింపఁబడినది. సర్వశరణ్యతా = భగవంతునికిఁగల సర్వశరణ్యత్వము, శ్రౌతీ = శ్రుతిప్రోక్తంబైనది, భగవతః = భగవంతునియొక్క, స్మృత్యాపి = స్మృతిచేతనున్న, సత్యాపితా = శపథపూర్వకముగ ప్రతిపాదింపఁబడినది. సర్వాస్పదే = భగవద్భక్తులకందరికిని ఆస్పదంబగు, సత్పథే = శరణాగతియందు, నైగమేషు = వేదోక్తములగు, సత్యాదిష్వివ = సత్యవచనాదులయందువలెనే, అధికృతిః = అందఱికిని అధికారము కలదు.

తా॥ అర్థిత్వ సామర్థ్యములతోఁ గూడియుండినదియగు అధికారము భక్తినిష్ఠులకును ప్రపత్తినిష్ఠులకును యథాధికారము శాస్త్రముల

మాంగ నిర్దిష్టయింపఁబడినది. కరణాంతరమునది శ్రుతియందు మాత్రమే కాక పురాణేతిహాసస్మృత్యాగమములందును ప్రతిపాదింపఁబడియున్నది. వేదోపబృంహణ వాక్యవచనాంతరములగుటవలనే వేదోక్తంబైనటి యీకరణాంతి ఈనిష్ఠము విషయమునను శాస్త్రములో చూపఁబడినట్టి అధికారములుఁ గలవు.

ఇట్టి న్యాసము ఇష్టఫలసిద్ధికై యుపాయాంతరముల విషయమున మనస్సును పోనీయక, న్యాసవిద్యను (ప్రపత్తిని) అవలంబించినట్టి వానికి యీ విద్యా విషయమున అధికార విశేషములు మొదలగు వాటిని గఱించి తెలియవలసి యున్నది.

అధికారమనఁగా— ఆయా ఫలములు సిద్ధించుటకు గాను సాధనముల ననుష్ఠింపఁబోవునట్టి యీ పురుషునికి ఫలవిషయమున కోరికయును, ఉపాయ విషయమున సామర్థ్యమును. వీటిలో సామర్థ్యమనఁగా— శాస్త్రార్థముల నెఱింగి యుండుటయు, తాను ఎఱింగియున్న ప్రకారము అనుష్ఠించు కొనుటకు సమర్థుండగుటయును, శాస్త్రానుమతముగ జాతి గుణాది రూపమగు యోగ్యతయును. ఈ యధికారము ముందుగానే యుండియుండగలదు. ఇట్టి యధికారముగల వాఁడు కోరి సాధించుకొనదలంచినది ఫలమనఁబడును. అట్టి ఫలమును లభించుటకుగాను సాధనముగాను విధింపఁబడునది ఉపాయమనఁబడును.

ముముక్షుత్వముండియుండి, స్వతంత్ర ప్రపత్తి రూపమగు మోక్షోపాయము ననుష్ఠించునట్టి వానికి శాస్త్రము వలనఁ దెలియవచ్చునట్టి సంబంధ జ్ఞానాదులు ఉపాసకునిలోఁ బాటు యీతనికిన్ని యుండియే యున్నను, వానికంటెను ఈ

తనికిఁగల విశేషాధికారము తనయొక్క యాకించన్యమును, అనన్యగతిత్వమును. ఆకించన్యమనఁగా—ఉపాయాంతరము ననుష్ఠించుటకు సామర్థ్యము లేకపోవుట. అనన్య గతిత్వము నఁగా—ప్రయోజనాంతరవైముఖ్యము—వేఱొక్క ఫలమును పేక్షింపకుండుట. దీని శరణ్యాంతర వైముఖ్యంబనియును చెప్పవచ్చును. * ఇది ప్రయోజనాంతర వైముఖ్యము చేతనున్న సిద్ధింపఁగలదు. ఈ విషయమును "బ్రహ్మాణం శితికంఠంచ యాశ్చాన్యా దేవతాఃస్మృతాః ప్రతిబుద్ధా నసేవంతే యస్మాత్పరిమితంఫలం" (చతుర్ముఖ బ్రహ్మను, రుద్రుండు యీ మొదలగు ఇతర దేవతలను జ్ఞానులు ఆశ్రయింపరు. ఏలననఁగా, వారవలనఁ గలుగఁగల ఫలము పరిమితమైనది) అనియును ఈ మొదలగు ప్రమాణ వచనములనుండి యెఱుఁగఁదగును.

తీవ్రతమంబగు యీ ముముక్షుత్వము లేనివాఁడై, దేహాదుల విషయమున వైరాగ్యము లేనివాఁడై, దేహసుఖము నపేక్షించి అందులకుఁ గావలసినట్టి ప్రయోజనాంతరముల యెడల ప్రీతిగలవాఁడు మోక్షార్థము ప్రపత్తిని చేసినట్లయిన, ఆయా ప్రయోజనాంతరముల పరిమితికి అనుగుణముగ మోక్షముగలుగుటకు విళంబము గలుగఁగలదు.

ఈ యధికారికి ఆకించన్యమును అనన్య గతిత్వమున్ను ఉండియుండవలయుననుటలో నుద్దేశమేమనఁగా--ఉపాయాం

---

* మోక్షమునిచ్చువాఁడు సర్వేశ్వరుండే గాన, అందులకై యీ యధికారి దేవతాంతరముల చెంత చేరడు. కావున ప్రయోజనాంతర వైముఖ్యమున్నచో, శరణ్యాంతర వైముఖ్యము తనంతనే సిద్ధమని భావము.

తాదృశములగు సాధనము విషయమున ఈ యధికారికిఁగల యజ్ఞా
నాశక్తులును, ఫలమును సిద్ధించుటలో నాలస్యమును సహించి
యుండజాలకపోవుటయును. వీటిలో, శరణ్యాంతర వైముఖ్య
ముండవలయునని చెప్పుటలో నుద్దేశమేమనఁగా—"యథా
వయోః శ్రృంగాగ్రాణే వశంయాంతి బలీయసః ధాతురేవం
వశంయాంతి సర్వభూతాని భారత" (మనము సులభముగా
కొమ్ములను చేతితో బట్టుకొనునట్లు, బలవంతుండగు పరబ్ర
హ్మము సర్వభూతములను తన వశమున నుంచుకొని
యున్నాడు) అన్నట్లు, తనకును ఇతరులకును సర్వసామాన్య
ముగానుండునట్టి భగవదేక పారతంత్ర్య విషయమగు
ఉపాయవిషయమును, ప్రయోజనాంతర వైముఖ్యమును. ప్రప
త్త్యధికారమునకుఁగల యీ విశేషము "సపిత్రా చ పరిత్యక్తః
సురైశ్చ సమహర్షిభిః త్రీన్ లోకాన్ పరిక్రమ్య తమేవ శరణం
గతః" (కాకాసురుండు తల్లిదండ్రులచేతను, దేవతలచేతను,
మహర్షులచేతనున్ను విడనాడబడినట్టి వాఁడై మూఁడు లోక
ములలోనున్ను సంచరించి, యెచ్చటనున్ను రక్షకముఁగానక
మరలవచ్చి ఆ రామచంద్రునే శరణుజొచ్చినట్టి వాఁడాయెను)
అనియు "అహమస్మ్యపరాధానామాలయోఽకించనోఽగతిః"
(నేను అపరాధములకు పుట్టిల్లు. అకించనుండను. అనన్య గతుం
డను) అనియు "అకించనోఽనన్యగతిశ్శరణ్యః" (నాయందెట్టి
యోగ్యతయును లేనివాఁడనై వేఱొక్క గతిఁగానక, నిన్ను
శరణుజొచ్చినట్టి వాఁడను) అనియు "అనాగతానంతకాలస
మీక్షయాప్యదృష్ట సంతారోపాయః తత్ప్రాప్త్యుపాయే చ
తత్త్వజ్ఞానంబుపర్యాయ ప్రపత్తేరన్యన్న మేకల్ప కోటిసహస్రేణాపి

సాధనమస్తీతి మన్వానః" (రాబోవు కాలము నెంతవరకు నిరీక్షించినను కడతేరుటకు వేఱొక్క యుపాయమును గనిపెట్ట నేరనివాఁడనై, అందులకై నీ శ్రీపాదద్వంద్వమును శరణము జొచ్చుటకంటె మఱియొక వేఱొక్క యుపాయం బెద్దియును కోట్ల కొలది యుగములు గడచినను కానరాదని తలంచినట్టివాఁడను) అనియు "పుకలొక్కల్లావడియేఁ" (వేఱొక్క గతిలేని వాఁడనై నిన్ను శరణుజొచ్చినవాఁడను) అనియును ఈ మొదలగు ప్రమాణములచేతను సంప్రదాయముచేతను సిద్ధమగుచున్నది. ఇంతమాత్రము అధికారమును లభించినట్లయిన, ప్రపత్తికి కులగోత్రాది నియమములు లేనందున దాని ననుష్ఠించుటకందఱికిని యధికారము కలదని సిద్ధమగుచున్నది.

శ్లో॥ అన్దణర్ న్దియరెల్లైయినిన్ఱవనైత్తులకుమ్
నోన్దవరేముదలాక నుడఙ్గయనన్నియరాయ్
వన్దడైయుమ్ వకై వణ్కవేన్దివరున్దియనమ్
అన్దమిలాతియైయన్పరతీన్దరివిత్తనరే॥

టీ॥ అందణర్ = బ్రాహ్మణులు మొదలుకొని, అందియర్ = చండాలుల, యెల్లైయిల్ = వరకును, నిన్ఱ = ఉన్నట్టి, అనైత్తు = అందఱు, ఉలకమ్ = జనులు, నొందవరే ముతలాక = సంసారర్తులగుటంజేసి, అనన్నియరాయ్ = అనన్యప్రయోజనులై, వందు = వచ్చి, ఉడంగ = దండము సమర్పించి, అడైయుమ్వకై = ఉపాయముగాఁగోరి యాశ్రయించునట్లు, వణ్ = దృఢమైన, తకవు = కృపను, యేంది = ధరించి, వరుందియు = తనను ఆశ్రయించుటకై తానే స్వయముగ ప్రయత్నించునట్టి, అందమిల్ = అంతరహితమై, ఆదియై = కారణభూతుండగు సర్వేశ్వరుని, నమ్ = మాకు, అన్బర్ = మాయెడల ప్రీతిగలవారగు మాయాచార్యులు, అఱిన్దు = స్వయముగ నిశ్చయించి, అఱివిత్తనరే = ఉపదేశించియున్నారు.

శ్రీమతే నిగమాంతమహాదేశికాయనమః.

    

# రహస్యత్రయసారము



## పరికర విభాగాధికారము.

శ్లో॥ ఇయానిత్థంభూతస్సకృదయమవశ్యం భవనవాన్
దయాదివ్యాంబోధౌ జగదఖిలమన్తర్యమయతి।
భవధ్వంసోద్యుక్తే భగవతి భరన్యాసవపుషః
ప్రపత్తేరాదిష్టః పరికరవిశేషశ్శ్రుతిముఖైః॥

టీ॥ దయాదివ్యాంబోధౌ = దయాసముద్రుండును, అఖిలం = సమస్తమగు, జగత్ = జగత్తును, అంతర్యమయతి = లోపలనుండి నియమించునట్టివాఁడును, భవధ్వంసోద్యుక్తే = స్వయముగానే సంసారమునునశింపఁజేయుటకై యుద్యుక్తుండగు, భగవతి = భగవంతునియందు, భరన్యాసవపుషః = భరసమర్పణ రూపమగు, ప్రపత్తేః = ప్రపత్తియొక్క, పరికరవిశేషః = సహాయసంపత్తి, శ్రుతిముఖైః = శ్రుతి తుల్యములగు పాంచరాత్రాది ప్రమాణములచే, ఇయాన్ = ఈ ప్రపత్తి, ఇత్థంభూతః = ఇవ్విధముగ ఆనుకూల్య సంకల్పాద్యంగములతోఁ గూడియున్నట్టిదై, సకృదవశ్యంభవనవాన్ = అంగ్యనుష్ఠానకాలమున సకృత్తుగ అవశ్యము కాఁగ లదని, ఆదిష్టః = ఉపదేశింపఁబడినది.

తా॥ దయాసముద్రుండగు భగవంతుని విషయమున నొనర్పంబడు నట్టి ప్రపత్తికి ఆనుకూల్య సంకల్పాది పరికరము వేద తుల్యములగు పాంచరాత్రాది ప్రమాణములయందు ఉపదేశింపఁబడినది.

ఈ విద్యకు పరకరమనునది—ఆనుకూల్య సంకల్ప
మును, ప్రాతికూల్య వర్జనమును, కార్పణ్యమును, మహా
విశ్వాసమును, గోప్తృత్వ వరణమును. ఈ విషయమును
గురించి "ఆనుకూల్యస్య సంకల్పః ప్రాతికూల్యస్య వర్జనం।
రక్షిష్యతీతి విశ్వాసో గోప్తృత్వ వరణం తథా ఆత్మనిక్షేప
కార్పణ్యే షడ్విధా శరణాగతిః" ఇత్యాది తావులఁ జెప్పియు
న్నట్టి షాడ్విధ్యమనునది అష్టాంగ యోగమన్నట్లు అంగాంగి
యోగ సముచ్చయమునుబట్టి యుండగలదను విషయమును,
వీటిలో నిదియంగియనియు, తక్కినవి యంగములను విషయ
మును, "నిక్షేపాపరపర్యాయో న్యాసః పంచాంగసంయుతః।
సన్న్యాసస్త్యాగ ఇత్యుక్తః శరణాగతి రిత్యపి" (నిక్షేపమని పిలువఁ
బడునట్టి న్యాసము అయిదు అంగములతోఁ గూడియుండునది
ఇది శరణాగతియనియును, సన్న్యాసమనియును, త్యాగమనియును
పిలువఁబడుచున్నది) ఇత్యాది శ్లోకమునందు నిర్వివాదముగ
తెలుపఁబడినది. ఈ సందర్భమున "శాశ్వతీ మమ సంసిద్ధి
రియం ప్రహ్వీభవామియత్ పురుషం పరముద్దిశ్య న మేసిద్ధి
రితోన్యథా। ఇత్యంగముదితం శ్రేష్ఠం ఫలేప్సాతద్విరోధినీ" అని
అహిర్బుధ్న్య సంహితయందుఁ జెప్పఁబడినట్టి ఫలత్యాగ
రూప అంగాంతరము మోక్షార్థంబగు ఆత్మ నిక్షేపమునకు
తప్పకుండ యుండవలసినట్టి యంగము. ఫలాపేక్ష, కర్తృ
ము మొదలగు వాటిని త్యజించి యుండుట యనునది కర్మ
యోగము మొదలగు నివృత్తిధర్మములకన్నింటికిని యావశ్య
మగుటంజేసి దీని విషయమగు అనుసంధానము ముముక్షు
వుకు సాంగ సమర్పణ దశయందు చేయవలసినది. దీనికి

ఈ విద్యకు పరికరమనునది—ఆనుకూల్య సంకల్పమును, ప్రాతికూల్య వర్జనమును, కార్పణ్యమును, మహావిశ్వాసమును, గోప్తృత్వ వరణమును. ఈ విషయమును గురించి "అనుకూల్యస్య సంకల్పః ప్రాతికూల్యస్య వర్జనం। రక్షిష్యతీతి విశ్వాసో గోప్తృత్వ వరణం తథా ఆత్మనిక్షేప కార్పణ్యే షడ్విధా శరణాగతిః" ఇత్యాది తావులం జెప్పియున్నట్టి షాడ్విధ్యమనునది అష్టాంగ యోగమన్నట్లు అంగాంగి యోగ సముచ్చయమునుబట్టి యుండగలదను విషయమును, వీటిలో నిదియంగియనియు, తక్కినవి యంగములను విషయమును, "నిక్షేపాపరపర్యాయో న్యాసః పంచాంగసంయుతః। సన్న్యాసస్త్యాగ ఇత్యుక్తః శరణాగతిరిత్యపి" (నిక్షేపమని పిలువంబడునట్టి న్యాసము అయిదు అంగములతోం గూడియుండునది ఇది శరణాగతియనియును, సన్న్యాసమనియును, త్యాగమనియును పిలువంబడుచున్నది) ఇత్యాది శ్లోకమునందు నిర్వివాదముగ తెలుపంబడినది. ఈ సందర్భమున "శాశ్వతీ మమ సంసిద్ధిరియం ప్రహ్వీభవామియత్ పురుషం పరముద్దిశ్య న మే సిద్ధిరితోఽన్యథా। ఇత్యంగముదితం శ్రేష్ఠం ఫలేప్సా తద్విరోధినీ" అని అహిర్బుధ్న్య సంహితయందుం జెప్పంబడినట్టి ఫలత్యాగ రూప అంగాంతరము మోక్షార్థంబగు ఆత్మ నిక్షేపమునకు తప్పకుండ యుండవలసినట్టి యంగము. ఫలాపేక్ష, కర్తృత్వము మొదలగు వాటిని త్యజించి యుండుట యనునది కర్మయోగము మొదలగు నివృత్తిధర్మములకన్నింటికిని యావశ్యమగుటంజేసి దీని విషయమగు అనుసంధానము ముముక్షువుచే సాంగ సమర్పణ దశయందు చేయవలసినది. దీనికి

పరికరంబులయినట్టి వాటిలో ఆనుకూల్య సంకల్పమునకును ప్రాతికూల్యవర్జనమునకున్ను హేతువు సర్వశేషియగు శ్రియఃపతిని ప్రవృత్తి నివృత్తి రూపములగు కర్మముల ననుష్ఠించుటచే వానికి యిష్టమువచ్చిన విధమున ఆశ్రయింపవలయునని యీతనికిఁగల పరవిషయమగు జ్ఞానము. దీనిచే ''ఆనుకూల్యేతరాభ్యాంతు వినివృత్తి రపాయతః'' (ఆనుకూల్యసంకల్పముచేతనున్ను ప్రాతికూల్యవర్జనముచేతనున్ను అపాయము నివర్తించుచున్నది) అన్నట్లు అపాయ పరిహారము సిద్ధించుచున్నది.

కార్పణ్యమనఁగా—ముందు చెప్పిన ఆకించన్యాదులయనుసంధానము గాని, దానిమూలకమగు గర్వహానిగాని, (దయపుట్టించునట్టి) కృపణవృత్తిగానియై శరణ్యుండగు సర్వేశ్వరునికి కరుణపుట్టించుటకుగానునై ''కార్పణ్యేనాప్యుపాయనాం వినివృత్తిరిహేరితా'' అన్నట్లు ఇఁకమీఁదు అనన్యోపాయత్వమునకున్ను ఉపయుక్తమైనట్టిదిగా నుండగలదు.

మహావిశ్వాసమనఁగా—''రక్షిష్యతీతి విశ్వాసా దభీష్టోపాయకల్పనం'' (తప్పక రక్షించుననెడి నమ్మకమువలన నభీష్టోపాయమునుగాఁ జేసికొనుట) అన్నట్లు ఎడతెగకుండ అనుష్ఠానము సిద్ధించుటకును, అటుపిమ్మట నిర్భరుండుగానుండుటకున్ను ఉపయుక్తముగా నుండగలదు. స్వరూపముతో ననుకూలింపనట్టి పురుషార్థములవలెనే, స్వరూపానుకూలంబగు మోక్షమున్ను పురుషార్థంబగునప్పుడు, ఈతండుకోరిననే దానిని సర్వేశ్వరుండు యిచ్చునుగాన, గోప్తృత్వవరణమున్ను ఆవశ్యకము మంచిదాని నొక్కదానినిన్ని, ఈపురుషుండు కోరినను, సర్వేశ్వరుం డీయని పక్షమున నతండు, పురుషార్థము నొసంగినట్టి

వాఁడు కాఁజాలఁడు కదా! కావుననే కదా "అప్రార్థితో నగో పాయేత్" (ప్రార్థింపనియెడల రక్షింపఁడు) అనియు "గోప్తృత్వవరణంనామ స్వాభిప్రాయనివేదనం" (గోప్తృత్వవరణము నఁగా తనకోరికను విన్నవించుట) అనియును చెప్పఁబడినది.

ఇవ్విధమున ఈ వైదికుఁడు ఈవిద్యననుష్ఠించు కాలమున ఉపయుక్తంబు లగుటంజేసి, యివి యాయాత్మ నిక్షేపముతో విడువకుండయుండునట్టి స్వభావములు. ఈ యర్థము సీతాపిరాట్టిని "శరణుజొచ్చుండని" సాత్వికస్వభావముగలదియగు త్రిజట రాక్షసులతోఁ జెప్పినట్టి వాక్యములవలనను తెలియఁగలదు. అచటనే "తదలంక్రూరవాక్యైర్వః" (మీయొక్క నిష్ఠూరపుమాటలు చాలును) అన్నందున ప్రాతికూల్యవర్జనము చెప్పఁబడినది. "సాంత్వమేవాభిధీయతాం" (బుజ్జగించి చెప్పవలసినది) అనుటావున, మనఃపూర్వకముగానే తప్ప వాక్కు ప్రవర్తింపనందున ఆనుకూల్య సంకల్పమున్ను సంగ్రహింపఁబడినది. "రాఘవాద్ధి భయంఘోరం రాక్షసానాముపస్థితం" (శ్రీరామచంద్రునివలన రాక్షసుల కెక్కువ భయము కలదు) అని వేఱొక్కగతి లేనట్టిస్థితిని చెప్పుటచే అధికారంబగు ఆకించన్యమును, దాని ననుసంధించు కొనుటచేఁ గలిగినట్టి గర్వహాన్యాదిరూపమై అంగభూతంబగునట్టి కార్పణ్యమున్ను చెప్పఁబడినవి.

"అలమేషాపరిత్రాతుం రాక్షస్యో మహతోభయాత్" (పిరాట్టి రాక్షస్త్రీలను ఈగొప్పభయమునుండి రక్షింపఁగలదు) అనుటచేతనున్ను, దీనిని వివరించుచు "అలమేషాపరిత్రాతుం రాఘవాద్రాక్షసీగణం" (ఈమె శ్రీరామచంద్రునివ

లన రాక్షసస్త్రీలను రక్షింపఁగలదు) అని శ్రీయాంజనేయుల వారు అనువదించుటంజేసియును పెరుమాళ్లు యెవ్వనినైనను నిగ్రహించుటకైయత్నించినను, వానికోపమునుచల్లార్చియీామె రక్షింపఁగలది యైనందునను "రక్షిష్యతి" రక్షింపఁగలద నెడి విశ్వాసము చెప్పఁబడినది. "అభియాచామవైదేహీం మే తద్ధి మమరోచతే। భర్త్సితామపియాచధ్వం రాక్షస్యఃకిం వివక్షయా" (సీతాపిరాట్టిని ప్రార్థించెదము. ఇదియే నాకిష్టమైనది. ఆమెను మీరు శ్రమపెట్టియున్నను, ఓ రాక్షసులారా! ఆమెను ప్రార్థింపుడు. యోచించి యేమిప్రయోజనము) అనుటచే గోప్తృత్వవరణము చెప్పఁబడినది.

ఈ యైదింటికిని అంగియగు ఆత్మనిక్షేపము "ప్రణిపాతప్రసన్నాహి మైథిలీ జనకాత్మజా" అనుతావున పిరాట్టికి అనుగ్రహము గలుగుటలో హేతువును జెప్పునట్టి "ప్రణిపాత" శబ్దముచేఁ దెలుపఁబడినది. కావున "న్యాసః పంచాంగ సంయుతః" అని శాస్త్రమునఁ జెప్పియున్నట్టి యంగపూర్తి దీనికిఁ గలదు.

ఇట్లు ఉపదేశింపఁగా, రాక్షసస్త్రీలు వెదుక్తియనుండుటనే హేతువునుగాఁగొని సీతాపిరాట్టి తనయొక్కవాత్సల్యము వలన "భవేయం శరణంహివః" (మిమ్ములను రక్షించెదను) అని వాగ్దానము చేసినదాయెను. ఈ వాగ్దానము ఫలపర్యంతము నెరవేరుటను మనపూర్వాచార్యులు "మాతర్మైథిలి రాక్షసీస్త్వయితథైవార్ద్రాపరాధాత్వయా రక్షంత్యా పవనాత్మజా ల్లఘుతరా రామస్యగోష్ఠీకృతా" (ఓతల్లీ! సీతాదేవి! నీయెడల మిక్కుటముగ అపరాధముల నొనర్చినట్టి రాక్షసస్త్రీలను

ఆంజనేయుండు శిక్షింపఁబోఁగా, వానినుండి వారిని నీవురక్షించు టనుచూస్తె రామునికంటెను నీవే మిక్కిలి కీర్తికెక్కినదానవు) అని సాయించినారు.

ఈసందర్భమున త్రిజట ఆత్మాత్మీయంబులనన్నింటిని ఆమెకు వొప్పచెప్పినప్పుడు ఆమెతోఁగలజాతిసంబంధమువలనమా యామెయని అభిమానముగల రాక్షసస్త్రీలును అంతిర్భ్యాతులు?

అట్లే శ్రీవిభీషణులవారితోఁగూడ వచ్చినట్టి నలుగురు రాక్షసులును ఏ రొనర్చినట్టి యుపాయవరణములో నంత ర్భాతులు. ఆసందర్భమున నొసంగినట్టి యభయప్రదానము లోనును యీ యంగాంగిభావమును యోజించుకొనవచ్చును, అదియెట్లనిన, ప్రాతికూల్యమునే చేయవలయునని పట్టుపట్టియు న్నట్టి రావణాసురునికిన్ని «ప్రదీయతాం దాశరథాయ మైథిలీ» (సీతాదేవిని శ్రీరామచంద్రుని కొప్పగింపుము) అనియు «సీతాంచ రామాయ నివేద్య దేవీం వసేమ రాజన్నిహ వీతశోకాః» (ఓరావణా! సీతాదేవిని శ్రీరామచంద్రుని కొప్పగించి యిచ్చుటనే సుఖముగా నుండెదము) అనియును హితమును బోధించుటచే ఈతావున ఆనుకూల్యసంకల్పము తెలియఁగలదు. ఈహితోపదేశము పిత్తరోగము కలవానికి పాలు వానిరోగమును వృద్ధిపఱచునట్లు, వానికి యెక్కువ కోపమును గలుగఁజేసినదాయెను. అందువలన రావణుండు «త్వాంతుధిక్కులపాంసనం» (ఛీఛీపో వంశనాశకుఁడా!) అని ధిక్కరించిన పిమ్మట, «ఇఁక యీతనికి ఉపదేశింపశక్యముకాదు. ఈతనితోఁ సంబంధించియున్నట్టి సంపత్తులవలననున్ను ఉపయోగములేదు ఈతండు ఉన్నట్టితావుననున్ను ఉండకూడదు» అని నిశ్చయించుకొని

“త్యక్త్వాపుత్రాంశ్చ దారాంశ్చ” (భార్యాపుత్రాదులను విడనాడితిని) అనియు “పరిత్యక్తామయాలంకా మిత్రాణిచధనానిచ” (నేను లంకాపట్నమునున్ను స్నేహితులనున్ను ధనమునున్ను విడనాడితిని) అనియును తానే స్వయము చెప్పినట్లు వాటితో సంబంధ మెంతమాత్రమున్ను లేకుండ చేసికొనుటచే ప్రాతికూల్యవర్జనము ఈతావున తెలియవచ్చుచున్నది.

“రావణోనామ దుర్వృత్తః” అని యారంభించి, సర్వమును జయించినట్టి రావణునితో విరోధమువలన తాము నిలువజాలమని చెప్పుటం జేసియును, పిమ్మటనున్ను “అనుజో రావణస్యాహం తేనచాస్మ్యవమానితః । భవంతం సర్వభూతానాం శరణ్యం శరణం గతః” (రావణునికి తమ్ముడనని చెప్పుకొనుటచే నవమానపడుచున్నాను. సర్వభూత శరణ్యుండవగు నిన్ను శరణుజొచ్చినాడను) అనుటచేతనున్ను కార్పణ్యము చెప్పఁబడినది.

భయపడకుండ సన్నిధికివచ్చి “సర్వలోక శరణ్యాయ రాఘవాయ మహాత్మనే” అన్నట్లు శరణుజొచ్చినానని విన్నవించుకొనునట్లు చేసినట్టి మహావిశ్వాసము “విభీషణో మహాప్రాజ్ఞః” అనుతావున “మహాప్రాజ్ఞః” అనుటచే చెప్పఁబడినది, ఈపైవాక్యమున “మహాప్రాజ్ఞుండగు విభీషణుండు” అనినప్పుడు “మహా” అను విశేషమువలన నట్టి మహావిశ్వాసము కదా వివక్షింపఁబడినదనియును చెప్పవచ్చును.

“రాఘవం శరణంగతః” అనుటచే ఉపాయవరణముకు హేతుభూతంబైనట్టి గోప్తృత్వవరణము చెప్పఁబడినది. ఇట్లు ఉపాయవరణముచే సూచితంబగుటయే కాకుండ, “నివేదయత

నట్టి యాక్షేపంబులు పరిహరింపఁబడుట యెట్లనఁగా—సర్వే
శ్వరుండు సర్వజ్ఞుండుగాను సర్వశక్తుండుగాను నున్నను, నిరాక
రించుటకు వీలులేనట్టి పురుషకారము (పిరాట్టి) వలన (రాజు)
అంతఃపురముననుండు పరిచారకుల విషయమునవలెనే, తనను
పొందుటకు ప్రతికూలంబులగు అపరాధంబుల నన్నింటిని క్ష
మించి, అవి తనకు తెలియనట్లు మెలంగి, సులభప్రాప్యుండై,
కర్మానుగుణముగ ఫలము నిచ్చునట్టి వాఁడైనను, ఈ
ప్రపత్తిరూపమగు వ్యాజమువలన, ప్రసన్నుండై వాఁడు స్వామి
యాతండు దాసుండు అనెడి సంబంధమునుబట్టి యుండునదియై
భాగలబ్ధంబగు ధనమువలెనే స్వతఃప్రాప్తంబైనట్టి యనంత
మగుఫలమునున్ను మోక్షమున్ను కృపచేయును.

సర్వేశ్వరుండు అవాప్త సమస్త కాముండగుటఁ జేసి
యీచేతనునినుండి యెవ్విధమైనట్టి యుపకారము నపేక్షింపని
వాఁడైనను, యేదో స్వల్పకార్యమువలన వశపఱచుకొనఁబడు
నట్టిరాజువలెనే, తనకు స్వభావసిద్ధములగు కారుణ్యాదుల మూ
లముగ, ఈ చేతనుండొనర్చునట్టి స్వల్పకైంకర్యము ను గొప్ప
యుపకారమునుగాఁ దలంచి, యాదరించి, కృతజ్ఞుండై ఈతని
కార్యమును నెరవేర్చును.

సర్వేశ్వరుండు శాస్త్రమునఁ జెప్పియున్నట్టి తక్కిన
యుపాయంబుల ననుష్ఠించునట్టివారికి, ఆలస్యముగ ఫలమునొ
సంగునట్టివాఁడైనను, అనన్యశరణుండై యీచేతనుం డొనర్చిన
ప్రపత్తికిమాత్రము ఔదార్యగుణయుక్తుండై వేఱొక్కదాని స
హాయము నపేక్షింపనిదియగు తనసంకల్పమాత్రమువలన కా
కాసురుండు, శ్రీవిభీషణులవారు మొదలగువారి కొసంగినట్లు,

ఈ చేతనుండు అపేక్షించినకాలముననే యాతని కోరికను నెరవేర్పంగలఁడు.

సర్వేశ్వరుండు సమాధిక దరిద్రుండే యైనను, స్వాతంత్ర్యాదిగుణవిశిష్టుండై, తనయొక్క కార్యముగాఁ దలంచి, యాశ్రితుల కోరికలను నెరవేర్చునట్టివాఁ డగుటంజేసి *కోసల దేశమునందుండు జంతువులకువలెను, లోకమున జనులు తమపిల్లలతోఁబాటు తిర్యగ్జంతువగు చిలుకను పాలుపోసి పెంచునట్టి చందంబునను, భగవంతుండును ఈ చేతనుల యోగ్యత నంత ఫలము నొసంగఁగలఁడు.

ఇట్లు లోకసామాన్యముగాఁ దోఁచునట్టి యాక్షేపములకు లోకసామాన్యముగానే పరిహారంబులుండియుండుటంజేసి, శాస్త్రమునందుఁ జెప్పియున్న ప్రకారము ప్రపత్తి యీచేతనుని కోరికలను నెరవేర్చుటలో కొరత యెద్దియును లేదు.

ఈపైని గనఁబఱచిన విశేషములతోఁ గూడియున్నట్టి పురుషకారాదుల నైదింటిని సదాచార్యానుగ్రహములన నెఱింగియున్నట్టివాని కేతప్ప, యితరులకు ఈ మహావిశ్వాసముకలుగ నేరదు. ఎట్లనిన, ఈచేతనుండన్ననో, ఈశ్వరుండు అభిముఖుండు కాకపోవుటంజేసి కర్మయోగాదుల కనర్హుండగునంత మహాపరాధంబులఁ గలవాఁడు, "ధిగశుచిమవినీతం" అన్నట్లు

*శ్రీరామచంద్రుండు అరణ్యమునకుఁ బోవునప్పుడు కోసల దేశమునందుండు జనులును, పశుపక్ష్యాదులును శ్రీరామచంద్రుని విరహమును సహింపఁజాలక వానివెంట పోవుటకై యుద్యమించునట్లు భగవంతునిచే కటాక్షింపఁబడినవి యని "అపివృక్షాః పరిమ్లానాః" అనుతావున శ్రీరామాయణమునందుఁ జెప్పఁబడినది దానిని ఈతావున ననుసంధించుకొనునది.

దుర్లభంబులగు ఫలంబులకై యాశపడునట్టి చాపల్యము
గలవాఁడు. ఈ ఫలముకై యనుష్ఠింపఁబడునట్టి యుపాయ
మన్ననో, శరీరకష్టము, ద్రవ్యవ్యయము, చిరకాలానుష్ఠానము
మొదలగునవి యెవ్వియును అక్కఱలేకుండ, యేదొకసమయ
మున నొకతడవమాత్రమే యనుసంధించుకొనుటగాని, అన్నిం
టిని దెలిసికొని యుండి యేదొకతడవ విన్నవించుట మాత్రము
గానిద్దై యుండునది. ఇట్లు సులభంబైనట్టి యుపాయముఁ
గొని గొప్పఫలంబగు మోక్షమును తాను కోరినప్పుడు లభిం
చుటకై యాశపడి, యట్టి ఫలమునకు, పురోడాశమునకు కుక్క
వలె, తాను తన కులాచరణములనుబట్టిచూస్తే యనర్హుండైనం
దున తన యనుచరులతో సహా యిట్టి ఫలమును లభించుటలో
నొక్కనికిని నమ్మకము గలుగుట యరుదని తలంచి, ఒకపుట్టి
నువ్వులు ఒకపుటినూనెయగుటవలె నిదియును దుర్లభంబని శ్రీ
యెంబారులు సాయించుదురు.

ఇట్లు సర్వేశ్వరునియొక్క పరత్వమును తెలిసికొనుటచే
భయపడి, నరాధముండనిపించుకొని చెడిపోవుటకంటెను,
గోకులమునందుండు గోపికలవలెనే వివేకము (పరాపరస్వరూప
జ్ఞానము) లేకపోయినప్పటికిన్ని, సర్వేశ్వరుని సౌలభ్యమును
దెలిసికొని, ఆయానంద స్వరూపుని యొక్కనియందే విశ్వాస
ముగలవాఁడు పరమాస్తికుండని అప్పుళ్ళారు సాయించుదురు.

ఇట్లు, పురుషకారాదుల విషయమగు జ్ఞానమువలనఁ
గలిగినట్టి విశ్వాసముయొక్క మహిమను, అట్టివిశ్వాసముయొ
క్క స్వరూపమును, కార్పణ్యమును, వీటిని ద్వయమునందలి
"ప్రపద్యే" అను క్రియాపదమునందును, "ప్ర" అను ఉపసర్గ
మునందును, శరణశబ్దముయొక్క ధాతువునందును, ఉత్తమపు

రుషయందును అనుసంధించుకొన వలసినది.

"ప్రపద్యే" అను తావున ఉత్తమపురుషయందు వివక్షింపఁబడినట్టి యర్థమును "అనన్యశరణః" అను తావున శరణాగతి గద్యయందు శ్రీభాష్యకారులవారు వివరించియున్నారు. ఈతావున ఉపాయత్వాధ్యవసాయముఁ దెలుపునట్టి శబ్దమునందు గోప్తృత్వవరణమునున్ను లోలోపలగలదు.

"అహమస్మ్యపరాధానా మాలయోఽకించనోఽగతిః। త్వమేవోపాయభూతో మే భవేతి ప్రార్థనామతిః । శరణాగతిరిత్యుక్తా సా దేవేఽస్మిన్ ప్రయుజ్యతాం" ( నేను అపరాధముల కాకరుండను, అకించనుండను, అనన్యగతుండను నీవే నేను కడతేరుటలో నుపాయము కాఁగలవు అనెడి ప్రార్థనారూపమగు బుద్ధియే శరణాగతి యనఁబడుచున్నది. ఇట్టి శరణాగతిని భగవత్సన్నిధిని విన్నవించునది.) అనియు "ఉపాయే గృహరక్షిత్రోః శబ్దశ్శరణమిత్యయం। వర్తతే సాంప్రతం త్వేష ఉపాయార్థైకవాచకః" (శరణశబ్దము ఉపాయవాచియును, గృహవాచియునైనను, ప్రకృతమున నిది ఉపాయవాచకముగాఁ గొనఁబడినది) అనియును చెప్పియున్నట్లు, ఉపాయాంతరముల ననుష్ఠించుటకు శక్తిలేనివాని విషయమున సర్వేశ్వరుండు సర్వశాస్త్రములయందును సామాన్యముగఁ జెప్పియున్నట్లు రక్షకుండు మాత్రమే కాకుండ, ఈ చేతనుని భారమునంతయును తనపై బెట్టుకొని ఉపాయాంతరస్థానమున నుండుటం జేసియును, వానిపై భారము నుంచియున్నట్టి యీయధికారికి పోఁగా పోఁగా అనన్యోపాయత్వము మనస్సున నెలకొని యుండుటకుగాను

ఉపాయత్వాధ్యవసాయము ఈ తావున వివక్షింపఁబడినది. ఉపాయంబనఁగా, ఒక సాధనమన్న మాత్రమే గాన, ఈ యుపాయత్వమనునది చేతనాచేతన పదార్థములన్నింటి విషయమున సర్వసాధారణమగుటం జేసియును, "రక్షిష్యతీతి విశ్వాసో గోప్తృత్వవరణం తథా" అనియు "సర్వజ్ఞోపి హి విశ్వేశస్సదా కారుణికోపిసఁ। సంసారతంత్రవాహిత్వాత్ రక్షాపేక్షాం ప్రతీక్షతే" (సర్వేశ్వరుండు సర్వజ్ఞుండైనను, సర్వదా కారుణికుండగుచు, సంసారతంత్రమును వహించియున్నందున రక్షింపుమనెడి కోరికను మాత్రము ఈ చేతనునినుండి యపేక్షించుచున్నాఁడు) అనియును చెప్పియున్నట్లు చేతనులకు మాత్ర ముండతగినదియగు గోప్తృత్వవరణము అనుసంధించుకొనవలసినదియైనందునను ఈ తావున నది వివక్షింపఁ బడినది. అయితే అందులోను "శరణ" శబ్దము తాను ప్రయోగింపఁబడినట్టి యొక్క తావుననే రెండు అర్థముల నియఁజాలదుగాన, ఈ యధికారికి ముఖ్యముగా నుండవలసినదియగు ఉపాయత్వాధ్యవసాయము ఈ తావున శబ్దముచేఁ దెలుపఁబడునదియై, సర్వాధికారులకును సర్వసాధారణమగు గోప్తృత్వవరణము ఉర్థసిద్ధమైనది కాఁగలదు.

పా॥ ఉఱవి త్తనరన్బరైయుమ్పత్తైయుముపాయమెల్లామ్,
తుఱవిత్తుణియిల్ తనైయామ్పరనై పరిక్కుంవకై,
ఉఱవిత్తనై యిఱ్ఱియొత్తా రెననిన్ఱవుమ్పరెనామ్,
పిఱవిత్తుయరఱ్ శెకువీరెన్ఱిరుక్కుంపిఱప్పాయఱవే॥

టీ॥ తురని = సంసార నివృత్తికిగాను, తుణియిల్ = విశ్వసించినప్పుడు, తుణైయాం = రక్షించునట్టి వాఁడగు, పరనై = పరాత్పరుండగు భగవంతుని, పరిక్కుంవకై = ఆశ్రయించునట్టివిధము ఎద్దియనఁగా,

ఐయమప్పైరియు ముపాయమెల్లాం = సంశయు విశిష్టమగు భక్తియోగము లేకపోయినప్పటికిన్ని, ఉరవు = సంబంధము, ఇత్తనై = ఇంతమాత్ర మని, ఇన్ని = లేకపోయినప్పటికిన్ని, ఒత్తారననిన = భగవత్తుల్యులని చెప్పుటకై తగినట్టివారుగానున్నట్టి, ఉంబరై = దేవతలనుగురించి, నామ్ = మేము, పిఱవి = జన్మరూపమగు, తుయర్ = దుఃఖమును, శెకువీర్ = పోగొట్టుమని ప్రార్థించుటయనెడి, పిణ్ణై = స్థాలిత్యము, అరవే = కలుగకుండునట్లు ఆశ్రయింపుడని, అన్బర్ = భగవద్భక్తులగు మాయాచార్యులు, అఱివిత్తనర్ = బోధించినారు,

తా॥ సంసారనివృత్తికై భగవంతుని యాశ్రయించునట్టి విధం బెట్టిదనఁగా, పామరులచే ఈశ్వరులని చెప్పఁబడునట్టివారై మనవలెనే సంసారగ్రస్తులగు బ్రహ్మేంద్రాదులను సంసారనివృత్తికై యాశ్రయింప కుండయుండుట మూలముగానని భగవద్భక్తులయినట్టి మాయాచార్యులు తెలియఁజేసినారు.

శ్లో॥ ప్రఖ్యాతఃపంచషాంగస్సకృదితిభగవచ్ఛాసనైరేష యోగ
స్తత్రద్వాభ్యామపాయాద్విరతిరనితరోపాయతైకేనబోధ్యా।
ఏకేనస్వాన్తదార్ఢ్యంనిజభరవిషయేన్యైనతత్సాధ్యతేచ్ఛా
తత్వజ్ఞానప్రయుక్తాత్విహాసపరికరేతాదధీన్యాదిబుద్ధిః॥

టీ॥ ఏష యోగః = ఈసాధ్యోపాయము, భగవచ్ఛాసనైః = శ్రీపాంచరాత్ర శాస్త్రములచేత, పంచషాంగః = అయిదు ఆరు అంగములు గలదిగాను, సకృదితి = సాంగముగ సకృత్కర్తవ్యముగాను, ప్రఖ్యాతః = బోధింపఁబడినది. తత్ర = అందులోను, ద్వాభ్యాం = ఆనుకూల్య సంకల్ప ప్రాతికూల్యవర్జనములవలన, అపాయాద్విరతిః = ఆజ్ఞాతిలంఘన రూపమగు అపాయమునుండి నివృత్తియును, ఏకేన = కార్పణ్యముచేత, అనితరోపాయతా = భగవద్వ్యతిరిక్తోపాయము నంగీకరింపకుండుటయును, ఏకేన = మహావిశ్వాసముచేత, స్వాంతదార్ఢ్యం = నిస్సంశయత్వమును,

అన్యేన = గోప్తృత్వవరణముచేత, నిజభరవిషయే = తనరక్షణము విషయమగు భారము విషయమున, తత్సాధ్యతేచ్ఛా = భగవంతునిచేత నేయది సాధింపవలసినదియనెడి యిచ్ఛయును, బోధ్యా = ఇట్లు యెఱుంగదగినవి, సపరికరే = ఇట్లు అంగయుక్తంబగు, ఇహ = ఈ, ప్రపదనే = ప్రపత్తి విషయమున, తాదర్థ్యాది బుద్ధిః = సర్వము భగవదధీనంబనెడి జ్ఞానము, తత్త్వజ్ఞానప్రయుక్తా = తత్త్వజ్ఞాన నియమితమైనది.

తా॥ ఈ సాధ్యోపాయము పంచాంగములు కలదిగానును, షడంగములు గలదిగాను భగవచ్ఛాస్త్రమున విధింప బడినది. (ఫలస్వరూపాంశమునుబట్టి షడంగమైనదిగానున్నూ, ఫలత్యాగమును అంగ్యంతర్భూతమైనదిగాను గొనుటచే పంచాంగమైనదిగానును నెన్నఁబడు చున్నదనుట) వీటిలో ఆనుకూల్య సంకల్ప ప్రాతికూల్య వర్జనములవలన ఆజ్ఞాతిలంఘన రూప పాపమునుండి నివృత్తియును, కార్పణ్యమువలన ఉపాయాంతర నివృత్తియును, మహావిశ్వాసమువలన నిస్సంశయత్వమును, గోప్తృత్వవరణమువలన భగవంతుండె తన భారమును వహింపవలయుననెడి యిచ్ఛయును, ఇవి కలుగుచున్నవి. అంగయుక్తముగ ఈ ప్రపత్తిని అనుష్ఠించునప్పుడు సర్వము భగవదధీనమనెడి జ్ఞానము "ఏష ఏవ సాధుకర్మ కారయతి" ఇత్యాద్యుపనిషత్సిద్ధమైనది.

పరికర విభాగాధికారము

ముగిసెను.



శ్రీమతే నిగమాంతమహాదేశికాయ నమః.







# రహస్యత్రయసారము



## సాంగ ప్రపదనాధికారము.

శ్లో॥ అభీష్టే దుస్సాధ్యే స్వత ఇతరతో వా క్వచన తత్
భరన్యాసం యాచ్ఞాన్వితమభివదంతి ప్రపదనం।
ఇతః పశ్చాదస్మద్యతననిరపేక్షేణ భవతా
సమర్థ్యోఽసావర్థస్త్వితి మతివిశేషం త(మ)దవిదుః॥

టీ॥ దుస్సాధ్యే = సాధించుట కశక్యంబైనట్టి, అభీష్టే = ఫల విషయమున, స్వతః = స్వయముగ గాని, ఇతరతః = ఆచార్యునిచేం గాని, యాచ్ఞాన్వితం = ప్రార్థనాసహితంబగు, తద్భరన్యాసం = ఆఫలము విషయపు భారమును సర్వేశ్వరునిపైనుంచుటను, ప్రపదనం = ప్రపత్తిని గాను, అభివదంతి = జ్ఞానులు చెప్పుచున్నారు, ఇతఃపశ్చాత్ = ఇంక మీదు, అస్మద్యతననిరపేక్షేణ = మా ప్రయత్నము నపేక్షింపనట్టి వాండవును, భవతా = మా భారమును స్వీకరించినట్టి నీచే, అసౌ = ఈ, అర్థః = నాయభీప్సితార్థము, సమర్థ్యః = సంపాదింపవలసినదియనెడి, మతివిశేషం = జ్ఞానవిశేషమును, తమ్ = అట్టి ప్రపత్తినిగాను, అవిదుః = తెలిసికొనుచున్నారు.

తా॥ ఉపాయాంతరసాధ్యముకానట్టి ఫలము విషయమున స్వయముగ గాని, ఆచార్యునిమూలముగం గాని, భగవంతుని ప్రార్థించి వానిపై భారము నుంచుటను ప్రపత్తియందురు. ఇంకమీదు నేనుకోరినదానిని నెరవేర్చునట్టిభారము నీదేయనెడిజ్ఞానమునున్న ప్రపత్తిని గాను తెలిసికొనుచున్నారు.

ముముక్షువగు అధికారికి యీ యుపాయమునందు అంగిస్వరూపమనఁగా ఆభరణముయొక్క యజమానునికి (వానిదాసుండు) దానిని జాగ్రత్తపెట్టి ధరించుకొనునప్పుడు యిచ్చువట్లు యథావస్థితమగు ఆత్మనిక్షేపము. (ఈయాత్మను భగవదధీనముచేయుట) ఎట్లన, ప్రణవమునందుండు అకారమునఁగల ప్రకృతి ప్రత్యయములచే సర్వరక్షకుండుగానును, సర్వ శేషిగానును తెలియవచ్చునట్టి సర్వేశ్వరునిబట్టి చూస్తే తననురక్షించుకొను విషయమునఁగాని, తనవాటిని రక్షించుకొనువిషయమునఁగాని, అట్టి రక్షణమువలని ఫలము విషయమునఁగాని, అవి తన యధీనములోనుండి గాని, తనకుగానుగాని తనకెవ్విధమైనట్టి సంబంధమున్ను లేకుండునట్లు, సమస్తభారమును సర్వేశ్వరునిపై నుంచుటయే ప్రధానముగాఁగలదియై అత్యంత పారతంత్ర్యముతోఁ గూడియుండునట్టిశేషత్వము ననుసంధించుకొనుట. "స్వాత్మానంమయినిక్షిపేత్" (తన యాత్మను నాకర్పించునది) అని విధింపఁబడినట్టి యీ యనుసంధానము ననుష్ఠించుకొనుట యెట్లనఁగా — శేషియై, స్వతంత్రుండగు సర్వేశ్వరుండు, తన ఫలమునుగానే తలంచుకొని, తానే రక్షించుటకుఁదగినట్లు, అనన్యార్హ శేషభూతుండును, అనన్య శేషభూతుండును, అత్యంతపరతంత్రుండనునగు నేను "అత్మా పిచాయంనమమ" (ఆత్మయున్ను నాది కాదు) అన్నట్లు నేను నాకు దాసుండనుకానుఒక్కటియును నాదియని తలంచియుండునట్టి వాఁడనున్నుకాను. "స్వయం మృత్పిండభూతస్యపరతంత్రస్యదేహినః। స్వరక్షణేప్యశక్తస్య కోహేతుః పరరక్షణే" (మట్టి ముద్దవలేనే

పరతంత్రుండైనట్టి యీ చేతనునికి తనను రక్షించుకొను విష
యమున నే శక్తిలేనప్పుడు, ఇతరులను రక్షించు విషయమున
శక్తి యేల యుండగలదు?) అన్నట్లు, నన్నున్ను నావియని
పిలువఁబడునట్టి వాటినిన్ని నేనే స్వతంత్రుండనై నేనే యందు
వలని ఫలముగలవాఁడనై రక్షించుకొనుటకు సమర్థుండను కాను.
"ఆత్మా రాజ్యం ధనంచైవ కళత్రం వాహనానిచ ఏతద్భగవతే
సర్వమితి తత్ప్రేక్షితం సదా'' (నేనున్ను, రాజ్యమున్ను, భార్య
యున్ను, అశ్వాది వాహనములున్ను ఇవియన్నియును భగవం
తునివి యని తలంచియున్నాను) అని వివేకవంతులు అనుసం
ధించుకొనినపక్షమున, నేనున్ను నాతో సంబంధించినవియును
వానివే. "ఆత్మాత్మీయభరన్యాసో హ్యాత్మనిక్షేప ఉచ్యతే''(తన
యొక్కయును, తనవాటియొక్కయును భారమునంతయును
సర్వేశ్వరునిపై నుంచుట ఆత్మనిక్షేప మనఁబడును) అనుటచే
వీటిని రక్షించునట్టి భారమున్ను, "నహి పాలన సామర్థ్య మృ
తే సర్వేశ్వరం హరిం'' (సర్వేశ్వరునికి తప్ప వేఱొకనికి రక్షిం
చునట్టి సామర్థ్యములేదు) అన్నట్లు, సర్వరక్షకుండయినట్టి వా
నిదే. "తేనసంరక్ష్యమాణస్య ఫలేస్వామ్యవియుక్తతా। కేశవా
ర్పణపర్యంతా హ్యాత్మనిక్షేప ఉచ్యతే''(వానిచే రక్షింపఁబడు
నట్టివాఁడనగుటచే నట్టి రక్షణమూలకమగు ఫలమున్ను నాది
కాదు. కేశవునికి యాత్మను సమర్పించువరకు కదా ఆత్మనిక్షే
పమనఁబడుచున్నది.) అన్నట్లు రక్షణమువలని ఫలమున్ను ప్ర
ధానముగ ఫలముగలవాడగు సర్వేశ్వరునిదే.

"ముముక్షుమాత్రసామాన్యం స్వరూపాదిసమర్పణం।
అకించనే భరన్యాస స్త్వధికోంగితయా స్థితః । అత్ర రక్షా భర

న్యాసస్సముస్సర్వఫలార్థినాం।స్వరూపఫలనిక్షేపస్త్వధికో మో
క్షకాంక్షిణాం'' (స్వరూపాదులను భగవదర్పణముచేయుట,
ముముక్షువుల కందఱికిని సర్వసాధారణమే అయినను, అకిం
చనునికి భరన్యాసము ప్రధానమగు విశేషము. రక్షణవిషయ
మై భగవంతునిపై భారమునుంచుట ఫలార్థులందఱికిని సమాన
మేయైనను, స్వరూపఫలములను భగవదధీనము చేయుటయే
మోక్షార్థులకుఁగల విశేషము) అన్నట్లు ఫలాపేక్షగలవాఁడై,
యుపాయానుష్ఠానము నొనర్చునట్టి జీవుండె ఫలస్వామిగానుం
డ, ఈ సందర్భమున సర్వేశ్వరుండే ప్రధానుండగు ఫలస్వామి
యని యెట్లుచెప్పఁ దగునంటివేని, చెప్పెదను. అచేతనవస్తువుకుఁ
గల వికారంబులవలెనే చేతనవస్తువుకు తానొనంగినట్టిపురుషా
ర్థంబులును సర్వశేషియగు తనకు అనుకూలంబులయినవి య
గుటంజేసి, యీశ్వరుండు ప్రధానుండగుఫలస్వామి కాఁగలఁడు.
దృష్టాంతము — అచేతనమగు బొమ్మను చక్కఁ జేసి, యలంక
రించి, దాని సౌందర్యమునుజూచి సంతోషపడు వారివలెను,
చేతనమగుచిలుకను పంజరములోనుంచి దానికి పాలుపోసియు,
ఇష్టమువచ్చినట్లు పోనిచ్చియును దానిఁజూచి సంతోషపడు
వారివలెను నిరపేక్షుండై రసికుండగు సర్వేశ్వరుండు ఈచేత
నునిఁజూచి సంతోషపడును. ''స్వనిర్భరత్వపర్యంత రక్షైకా
ర్థ్యభావనం। త్యక్తరక్షాఫలస్వామ్యం రక్ష్యస్యాత్మసమర్ప
ణం'' (తాను నిర్భరుండుగా నుండువరకును అంతయును
రక్షకునిదేయని తలచియుండుటయు, అట్టి రక్షణమువలని
ఫలము తనదికాదనుకొనుటయును, తనయాత్మను సర్వేశ్వరు
నికి సమర్పించుటయే ఆత్మసమర్పణము) అని చెప్పియున్నది.

శ్రీయాళవందారు స్తోత్రమునందు "వపురాదిషు యోపి కోపివా గుణతోసాని యథాతథావిధః । తదయం తవపాద పద్మయోరహ మద్యైవ మయా సమర్పితః" (శరీరేంద్రియాదులకంటె నాత్మ వేఱైనను, వాటిలోనొక్కటియైనను, ఎవ్విధమైనను ఆవిచారణతో నాకుఁబని లేదు. దానిని దేవరవారి పాదపద్మములయందు యిప్పుడే సమర్పించుచున్నాడను) అని చెప్పియున్నట్టిదానియభిప్రాయం బెద్దియని యడిగెదవా? చెప్పెదను. సార్వభౌముండగు రాజుయొక్క చేతిలో నుండవలసిన రత్నసంచియేదొక కారణమువలన తనచేతిలోనికివచ్చినట్లయిన, సేవకుండు రాజుతో మీవద్దనే యుంచుకొండనుచు తిరిగి వానికిచ్చునప్పుడు దానిలోనుండు రత్నముయొక్క స్వరూపస్వభావములను పరిశీలించి చూడకయే యిచ్చునట్టిచందంబున దేహాదులకంటెను విలక్షణంబైనట్టి యాత్మయొక్క స్వరూపస్వభావములను విశదముగాఁ దెలియనివారు తమకున్నట్టి జ్ఞానముఁగొని ఆత్మసమర్పణము నొనర్చినట్లయిన, అంతమాత్రముచేతనున్న అనాదికాలముగ ఆత్మాపహారమువలనఁ గలిగినట్టి భగవన్నిగ్రహము శమింపననెడి శాస్త్రార్థమును తెలుపుటలో నభిప్రాయము.

ఈ శ్లోకముకుపైని *"మమనాథయదస్తి" అనుశ్లోకము

---

*శ్లో॥ మమనాథ యదస్తి యోస్మ్యహం సకలం తద్ధి తవైవ మాధవ।
నియతస్వమితి ప్రబుద్ధధీ రథవా కిన్ను సమర్పయామి తే॥

తా ॥ అనాద్యచిత్సంబంధమగు మమకారమునకు విషయములగు ప్రకృతి ప్రాకృతములును అట్టిమమకారమున కాశ్రయమగు నేనును సకలమును శ్రియఃపతియగు దేవరవారికే యనన్యార్హమగు సొత్తైయుండుటనున్న సకలచేతనాచేతనములకు నిరుపాధిక శేషియగు దేవరవారిదే కాని,

త్యజింపవలయునని చెప్పుటలోనభిప్రాయ మేమనఁగా— తనకుఁ గల కర్తృత్వమున్ను సర్వేశ్వరుని మూలకముగ వచ్చినది గాన, తనకు తానున్నంశపరకును స్థిరముగా నుండునట్టిదాని నిగాను భగవదేకపారతంత్ర్యము నెఱింగి యుండవలయుననుట. మమకారమున్ను ఫలమున్ను త్యజింపవలయుననుటలో నభిప్రాయమేమనఁగా— ఆత్మాత్మీయములు రెండింటికిన్ని భగవంతుండే శేషి(స్వామి)యనెడి జ్ఞానము. ఫలోపాయత్వమును త్యజింపవలయుననుటలో హేతువేమనఁగా- శరణ్యుండగు సర్వేశ్వరుని సంతోషింపఁ జేయుటకుగాను ఈతని యనుష్ఠానము మోక్షమునకు సాక్షాత్తుగ కారణంబు కాకపోవుటయును, అచేతనమగుటనే ఫలమునిచ్చుటలోనగు సంకల్పాదులకాశ్రయము కాకపోవుటయును. సర్వేశ్వరుండు ఫలోపాయమగుట యెట్లనఁగా— స్వాభావికమగు కారుణ్యమువలన కరణకళేబర ప్రదానము మొదలుకొని స్వమోచ్చారణముపర్యంతము సర్వమునకును ఆది కారణమగు తానే అనుగ్రహ పూర్వకమగు సంకల్పముతోఁ గూడియున్నట్టివాఁడై, సాక్షాత్తుగ కారణంబగుటం జేసియు, ఉపాయాంతర శూన్యునికి ఆయాయుపాయముల స్థానమున నుండుటం జేసియుననుట. ఇట్లుండుటకుఁ గారణమువానినిగుఱించి తెలుపునట్టి శాస్త్రమువలనఁ దెలియవచ్చునట్టి వస్తుస్వభావము. కావున ఈవిషయము యుక్తులచే వేఱొక్కవిధముగాఁ జేయ శక్యమైనది కాదు. ఈ సాంగ ప్రపత్త్యనుష్ఠానమును శ్రీ నడాదూరమ్మాళను వారు ఇట్లు సాయించినారు— "స్వామీ! అనాదికాలముగ దేవరవారికి అనిష్టంబులగు కార్యముల నొనర్చినందున, సంసారమునఁ బడియున్నాడను. ఈ దినము

మొదలుకొని దేవరవారికి అనుకూలముగ ప్రవర్తింపఁగలను. ప్రతికూలముగ ప్రవర్తింపను. దేవరవారిని పొందుటకుగాను నాయందు ఒక్క యోగ్యతయును లేదు. దేవరవారినే ఉపాయముగా నెఱింగియున్నాడను. దేవరవారే నేను కడతేరుటలో నుపాయము కాఁగలరు. అనిష్ట నివృత్తివిషయమునఁ గాని యిష్టప్రాప్తి విషయమునఁగాని నేను యిఁకఁజేయవలసినది యేమున్నది?''

ఈ విషయమున ఆనుకూల్య సంకల్పాదులు ఉపాయ సహాకారులై ఒక్కతడవ మాత్రము అనుష్ఠింప వలసినవిగా నుండగలవు. ఇఁకమీఁద ఈతండు కోరినప్రకారము అనుకూలముగు నడివడికతో ప్రవర్తించుటయును ఉపాయఫలంబై యావదాత్మభావిగా నుండఁగలదు. వీటిలో, ప్రాతికూల్యవర్జనము శ్రీ అమ్మాళువారు సాయించినట్లు, ఆనుకూల్య సంకల్పమువలెనే సంకల్పరూపంబైనను, అది వొకతడవ మాత్రమే యనుష్ఠింపవలసినదియనెడివిషయము స్పష్టమే. ''అపాయేభ్యోనివృత్తోస్మి'' (అపాయములనుండివిడువబడినాను) ''అన్నట్లు అది వేఱాపేక్ష లేకపోవుటగాని, ప్రాతికూల్యస్వరూపనివృత్తిగాని అయినను, దానిలో ప్రథమక్షణము అంగమై, అందులకుపైగా నుండునది ఫలము కాఁగలదు. ఇవ్విధముననే విశ్వాసము విషయమునను యోజించుకొనునది. ''ప్రవృత్తిరనుకూలేషు నివృత్తిశ్చాన్యతః ఫలం। ప్రారబ్ధ సుకృతాచ్చస్యాత్ సంకల్పేచ ప్రవృత్తితః'' (అనుకూలమగు వాటియందుఁ ప్రవర్తించుటయును, ప్రతికూలములగు వాటినుండి నివర్తించుటయును ప్రారబ్ధ సుకృతమువలనఁ గలుగఁ గలదు, అనుకూల్య

సంకల్పము విషయమున ప్రవృత్తియన్ననో, ప్రపత్తివలనఁ గలుగఁగలదు) అనిచెప్పియున్నది. కావున, ఈ లోకములో నున్నంతవరకును నిరపరాధ కైంకర్యమును, ప్రారబ్ధశరీరావసానమున మోక్షమునున్ను ఈరెంటిని ఫలమునుగాఁగోరు నిపుణులయినట్టివారు ప్రపత్తిని చేయుదురు.

అఱవేపరమెన్ఱదెక్కలమ్వైత్తనగన్ఱునమ్మై,
పెఱవేకరుతిప్పెరున్దకవుఱ్ఱపిరానడిక్కీళ్,
ఉఱవేయివనుయిర్ కాక్కిన్ఱవోరుయిరుణ్మైయెన్నీ,
మఱవేలెననమ్మై మఱై ముడిశూడియమన్నవరే॥

టీ॥ నంమఱై ముడిశూడియ మన్నవరే = మాయొక్క వేదరూపమగు కిరీటమును ధరించియున్నట్టి రాజులవంటి వారగు మాయాచార్యులు, ఉఱవే - స్వామిత్వరూప సంబంధముచేత, ఇవనుయిర్ = ఈజీవాత్మయొక్క, కాక్కిన్ఱ = రక్షకుండును, ఓరుయిర్ = అద్వితీయంబగు ప్రాణముగాను చెప్పఁబడినట్టివాఁడును నగు సర్వేశ్వరునియొక్క ఉణ్మైయై = స్వాభావికాకారమును, నీమఱవేలెన = నీవు మఱవవలదని యుపదేశించి, అన్ఱు = సృష్టికాలమునందు, నమ్మైప్పెఱవే = మమ్ములను లభించుటకుగానే, కరుతి = ఆలోచించి, పెరుంతకవు, మిక్కిలి కృపచేసినట్టి, పిరాన్ = ఉపకారకుండగు సర్వేశ్వరునియొక్క, అడిక్కీళ్ = శ్రీపాదములక్రింద, అఱవేపరమెన్ఱు = నాభారమెంతమాత్రము లేకుండునట్లు, వైత్తనర్ = ఉంచినారు.

తా॥ వేదవేత్తలగు మాయాచార్యులు ఆత్మకు ఉపకారకుండును సర్వాంతర్యామియగు భగవంతుని స్వాభావికాకారమును మఱవవలదని యుపదేశించి సృష్టిసమయమున మనకై శ్రమపడినట్టి యుపకారకుండగు సర్వేశ్వరునిపై నావిషయమగు సమస్తభారమునుంచి నన్నువాని శ్రీపాదముల సన్నిధిని చేర్చినారు.

శ్లో॥ యుగ్యస్యన్దనసారథిక్రమవతి త్రయ్యన్తసందర్శితే
తత్త్వానాం త్రితయే యథార్హవివిధ వ్యాపారసన్తానిని
హేతుత్వం త్రిషు కర్తృభావ ఉభయోస్స్వాధీనతైకత్రతత్
స్స్వామి స్వీకృతయద్భరోఽయమలసస్తత్రస్వయంనిర్భరః॥

టీ॥ యుగ్యస్యందన సారథిక్రమవతి = అశ్వంబనియు, రథంబనియు, సారథియనియును నిట్టిక్రమమువ, త్రయ్యంతసందర్శితే = వేదాంతమునఁ జూపింపఁబడినట్టి, తత్త్వానాం = తత్త్వములయొక్క, త్రితయే = మూడింటివిషయమునఁ జెప్పియున్నట్లు, యథార్హ వివిధవ్యాపారసంతానిని = స్వస్వయోగ్యముగ నానావిధవ్యాపారములను గలిగియుండు విషయమును, హేతుత్వం = హేతువగుట, త్రిషు = మూడింటియందునుగలదు, కర్తృభావః = కర్తృత్వము, ఉభయోః = జీవేశ్వరుల కుభయులకును గలదు. తత్ = అందువలన, అలసః = అకించనుండగు, అయం = ఈజీవుండు, స్వామిస్వీకృతయద్భరః = స్వామిచేస్వీకరింపఁబడినట్టి భారముగలవాఁడై, తత్ర = ఆవిషయమున, నిర్భరః = నిశ్చింతుండుగా నుండునది.

తా॥ ఉపనిషత్తులయందు అశ్వములనియు, రథమునియు, సారథియనియు నిట్లువర్ణించి చేతనాచేతనేశ్వరు లనఁబడు మూడుతత్త్వముల విషయమునఁ జెప్పియున్నట్లు ఇవిఆయావ్యాపారములకు హేతువులు కాఁగలవు, అయితే స్వతంత్రకర్తృత్వము సర్వేశ్వరునియందును, వానిసంకల్పాధీనమగు కర్తృత్వము జీవునియందును గలగు. అందువలన అకించనుండగు ఈజీవుండు, తన భారమునంతయును భగవంతుడు స్వీకరించినందున, నిర్భరుండుగా నుండగలడు.

సాంగ ప్రపదనాధికారము
ముగిసెను.



షారమునున్ను జూచి సంతోషించినట్టివాఁడై, ‘‘దేవర్షిభూ
తాత్మనృణాం పితౄణాం న కింకరో నాయ మృణీచ రాజన్।
సర్వాత్మనా యః శరణం శరణ్యం నారాయణం లోకగురుం
ప్రపన్నః’’ అను శ్లోకమునఁ జెప్పియున్నట్లు ప్రజాపతియనియు,
పశుపతియనియు నివ్విధముగ పేరుపెట్టుకొనియున్నట్టి సజాతీయు
లగు జీవులనుగుఱించి ఒక్కొక్క సమయమున కూలియి
చ్చినట్లు, యేదొక కారణవశమున శ్రుతులయందుఁ జెప్పఁబడి
నట్టి దాసత్వరూపమగు దోషమును, అసలుపుచ్చుకొనకవడ్డిని
పుచ్చుకొనునట్టి ఋణమువలెనుండు పితృఋణాదిరూపమగుదో
షమున్ను ఇవియేవియును లేనివాఁడైనందున పంచమహాయజ్ఞాది
నిత్యనైమిత్తిక కర్మంబుల నొనర్చునప్పుడు వారిపేరు చెప్పవలసి
వచ్చినప్పుడు ‘‘యేయజన్తి పితౄన్ దేవాన్ బ్రాహ్మణాన్ సహు
తాశనాన్ సర్వభూతాంతరాత్మానం విష్ణుమేవ యజంతి తే’’ (పి
తృలను, దేవతలను నిత్యాగ్నిహోత్రులగు బ్రాహ్మణులనున్ను
పూజించునట్టివారు అందుమూలముగ సర్వాంతరాత్మయగు
విష్ణువునే పూజించుచున్నారు) ఇత్యాదితావుల మహర్షులచేఁ
దెలియఁబఱచినట్లును, లోకమున రాజసేవకులు రాజుకు వాని
కవచముపై మాలనున్ను ఆభరణములనున్ను సమర్పించినను,
కవచమునంత గమనింపక, రాజుకుఁగలుగునట్టిప్రీతినే ప్రయో
జనముగాఁ దలంచియుండునట్లును, యజ్ఞాగ్రహారాధ్యాయా
గులయందును, శ్రీహస్తిగిరి మాహాత్మ్యమునందును ‘‘సాక్షా
దప్య విరోధం జైమినిః’’ అను బ్రహ్మసూత్రమునందును చెప్పి
యున్నట్లు దేవతలు, పితృలు అనెడి యాధికారములతో సంబం
ధములేకుండ, ఆయాశబ్దములు అవయవ శక్తివలన సర్వేశ్వ

రుని నారాయణాది శబ్దములవలెనే తెలుపునట్టివిగా నుండుటం
గని, వాటిని ఉచ్చరించునప్పుడు శ్వేతద్వీపవాసులగు శుద్ధయా
జకుల వలెనే తనయొక్క పరమైకాంతిత్వము చెడిపోకుండ
యుండునట్టి మార్గమును గనిపెట్టి, తనయొక్క వర్ణాశ్రమ
నిమిత్త గుణాద్యధికారమునకుఁ దగినట్లు, తనయొద్ద నుండి
కైంకర్యమును స్వీకరించుటకు సంకల్పించుకొని యున్నట్టి
నియామకుండగు సర్వేశ్వరునియొక్క శాస్త్రవేద్యంబగు ఆజ్ఞ
నున్ను అనుజ్ఞనున్ను కాపాడుట యనెడి కైంకర్యముద్వారా,
సమస్తమున సర్వేశ్వరుని యభిప్రాయము నెఱింగియున్నట్టి
వారలగు యుక్తపురుషులవలెనే, యేదొక కైంకర్యము
నొనర్చుచు, ముక్తపురుషతుల్యుండై, ఉపాయపూర్తినిబట్టి
కృతకృత్యుండనియు, పురుషార్థపూర్తినిబట్టి కృతార్థుండని
యును శాస్త్రములచేతను శాస్త్రార్థనిష్ఠులచేతనున్ను కొని
యాడఁబడుచుండును.

ఈతనియొక్క కృతకృత్యత్వానుసంధానమును "అత
స్త్వంతవతత్త్వతో మద్జ్ఞానదర్శన ప్రాప్తిషు నిస్సంశయస్సుఖ
మాస్వ" అను తావున శరణాగతిగద్యయందు శ్రీభాష్యకారు
లవారు నిర్ణయించియున్నారు. దీనియభిప్రాయమేమనఁగా—
"అనాదికాలముగ భగవదాజ్ఞాతిక్రమణమువలనఁ గలిగిన
భగవన్నిగ్రహమువలన సంసారమున కష్టపడుచుండునట్టి మన
కు, రక్షణావకాశముకై నిరీక్షించుచుండునట్టి భగవంతునికృప
మూలముగఁ, గలిగినసదాచార్యాంగీకారమువలన, లభించినట్టి
ద్వయోచ్చారణానూచ్చారణవలన ప్రపత్త్యనుష్ఠానము గలి
గినపిమ్మట, శరణ్యుండగు సర్వేశ్వరుని సంతోషపెట్టుటకుగాను

ఈప్రవృత్తికిం బెను ప్రైగాన్ద్యము లేనందున, భగవంతునికిఆగ్ర
హము గలుగఁ జేయుటలో హేతుభూతము లయినట్టి యపరా
ధంబుల నన్నింటిని క్షమించి. దిద్దుపాటు కాఁదగినట్టి దాసుల
నందఱిని దిద్దుపాటుచేసి, వారివలన కైంకర్యమును గొనుటకు
సమర్థుండును, సర్వశేషియునగు సర్వేశ్వరుండు, తన పనిని
గాను దలంచుకొని, తానే స్వయముగ రక్షింపఁగలఁడని తలం
చుకొని, నిశ్చింతుండనుగా నుండగలను" అనుట. ఇది
"మాశుచః" అని శరణ్యుఁడగు సర్వేశ్వరుని వచనముచేతనే
నిర్ణయింపఁబడినట్టి విషయము. అది యెట్లనిన, ఈతనికి
ప్రవృత్తిచేయుటకు పూర్వమున్నట్టి దుఃఖము అధికారములోఁ
జేరును. కావున, ముందు ఈతనికి దుఃఖము లేనట్లయిన, ఈత
నికిఅధికారమున్ను ఉండజాలదు. కావున కారణము లేకుండ కార్య
ముగలుగనేరదనెడి న్యాయప్రకారము ఈతనికిఉపాయనివృత్తి
కాఁజాలను. ఉపాయమును స్వీకరించినట్టి వానిఁగాను తనను
దలంచి యున్నపిమ్మట, శరణ్యుని వాగ్దానమువిషయమునసమ్య
క్జ్ఞానము లేనివాఁడై దుఃఖపడినట్లయిన, కార్యములేనందునసామగ్రి
యును లేదను న్యాయప్రకారము, పూర్ణోపాయము గలవాఁ
డు కాఁజాలడు. ఫలము ఉపాయపూర్తినిబట్టి యుండునది గాన,
నది సిద్ధించటలోనాలస్యము కాఁగలదని యెఱుంగునది. కావున
పూర్వము దుఃఖప్రసక్తి గలవాఁడై, పిమ్మట "మాశుచః=
దుఃఖపడకుము" అని నిషేధించిన ప్రకారము దుఃఖరహితుం
డైనట్టివాఁడు కృతకృత్యుండని యెఱుంగునది.

మన్నవర్ పిణ్ణవర్ వానోర్ కైయెనవాన్కరుత్తోర్,
అన్నవర్ వేళ్వియనైత్తుముడిత్తనరన్పుడైయార్,

కైన్న వరన్తర వెష్టు నమ్మ త్తికిరి త్తిరుమాల్,
మున్నమ్వరుందియడైక్కలజ్కొణ్డ నమ్ముక్కియరె॥

టీ॥ అన్బడైయార్=భక్తులను, ఎన్నవరంతర వెన్టు = ఏవరము ని చ్చెదనని నిరీక్షించుచున్నట్టి, నమ్మ త్తిగిరి త్తిరుమాల్ = మా హాస్తిగిరి యందు వేంచేసియున్నట్టిస్వామిచే, మున్నంవరుంతి=కరణకళేబరంబుల నొసంగుటచే ముందుగనే ప్రయత్నించి, అడైక్కలంకొండ=రక్ష్యవస్తువుగా నంగీకరింపఁబడినట్టి, నమ్ముక్కియర్=మాస్వాములగు ప్రపన్నులు, వేళ్ వి=యజ్ఞములను, అనైత్తుం=అన్నింటిని, ముడిత్తనర్ = ముగించినట్టివారు మన్నవర్=కర్మవశ్యులుకానట్టి మాస్వాములు. విణ్ణవర్ = నిత్యసూరులవలెను, వానోర్కై=వారికి స్వామియగు సర్వేశ్వరునివలెను, వాన్కరుత్తోర్=పరమపదమునందు దృష్టిగలవారలగు వీరితో, అన్నవర్=తుల్యులు.

తా॥ ఆశ్రితుల కేమి యిచ్చుగునాయని నిరీక్షించుచు కరిగిరియందు వేంచేసియున్నట్టిస్వామిచే కరణకళేబరాదుల నొసంగినప్పుడే రక్ష్యభూతులుగా స్వీకరింపఁబడినట్టి మాస్వాములు కృతకృత్యులైనారు. వీరు పరమపదమునందు దృష్టిగలవారగు నిత్యసూరులతోను పరమపదనాథుని తోనును సమానులుగా నున్నారు.

శ్లో॥ భగవతిహారౌపారం గన్తుంభరన్యసనంకృతం
పరిమితసుఖప్రాప్త్యైకృత్యం ప్రహీణమకృత్యవత్,
భవతిచవపుర్వృత్తిః పూర్వం కృత్తైర్నియతక్రమా
పరమిహావిభోరాజ్ఞాసేతుర్బుధైరనుపాల్యతే॥

టీ॥ పారంగంతుం=సంసారమునుండి కడతేరుటకు, హారౌ=దోషహరుండగు, భగవతి=భగవంతునియందు, భరన్యసనం = భరన్యాసము, కృతం=చేయఁబడినది. పరిమితసుఖప్రాప్త్యై= పరిమితఫలములగు ఐశ్వర్య

కైవల్యాదులను పొందుటకు గాను, కృత్యం=సాధనానుష్ఠానము, అకృత్యం=పాపకృత్యము లైనన్నీ, ప్రహీణం=త్యజింపఁబడినది. వపుర్వృత్తిః శరీరరక్షణవ్యాపారములు, పూర్వైంః కృతైః=ప్రాచీనసుకృతములచేత, నిశ్చక్రమా=అవశ్యముగఁగలుగునది. ఇహ=ఈలోకమునందు, పరం = ప్రపత్త్యనంతరము, విభోః = భగవంతునియొక్క, ఆజ్ఞా = ఆజ్ఞారూపమగు సేతుః=మర్యాద, బుధైః = జ్ఞానులచేత, అనుపాల్యతే = పాలింపఁబడుచున్నది.

తా ॥ సంసారమునుండి తరించుటకుగాను భగవంతునిపై భారము నుంచినాము. ఐశ్వర్యకైవల్యాది పరిమితఫలంబులకై యాశపడి యాచరింపఁబడునట్టి కర్మానుష్ఠానమును పాపకృత్యమునుగాఁ దలంచి విడనాడినాము. దేహయాత్రాదులు పూర్వకర్మానుగుణముగ జరుగఁగలవు. ప్రపత్త్యనంతరము జ్ఞానులు భగవదాజ్ఞా పరిపాలనముఁ జేయుచు కాలమును గడుపుచున్నారు గదా.

కృతకృత్యాధికారము

ముగిసెను.









# రహస్యత్రయసారము



## స్వనిష్ఠాభిజ్ఞానాధికారము.

శ్లో॥ స్వరూపోపాయార్థేష్వవితథనివిష్టస్థిరమతేః।
స్వనిష్ఠాభిజ్ఞానం సుభగమపవర్గాదుపనతాత్।
ప్రథిమ్నా యస్యాసౌ ప్రభవతి వినీతస్స్థగయితుం।
గభీరాన్దుష్పారాన్ గగనమహతశ్ఛిద్రనివహాన్॥

టీ॥ యస్య=ఏస్వనిష్ఠాభిజ్ఞానముయొక్క, ప్రథిమ్నా = సామర్థ్యము చేత, వినీతః=ఆచార్యునిచే శిక్షింపఁబడినట్టి, అసౌ = ఈప్రపన్నుండు, గభీరాన్=భయంకరములును, దుష్పారాన్=తప్పించుకొనుట కశక్యములును, గగనమహతః=అతివిస్తృతములునగు, ఛిద్రనివహాన్=కామక్రోధలోభాదులను, ఆదౌ=ఉత్పత్తికాలమునందే, స్థగయితుం= అణచిపెట్టుటకు, ప్రభవతి=సమర్థుండగుచున్నాడో, స్వనిష్ఠాభిజ్ఞానం = అట్టిస్వనిష్ఠావిషయమగుజ్ఞానము, స్వరూపోపాయార్థేషు = స్వరూపోపాయపురుషార్థముల విషయమున, అవితథనివిష్టస్థిరమతేః=యథార్థమైనట్టి నిష్ఠగలవాఁడగుటచే స్థిరమైనజ్ఞానముగలవానికి, ఉపనతాత్=పొందఁబడునట్టి, అపవర్గాత్=మోక్షముకంటెను, సుభగం=భోగ్యమైనది.

తా॥ ఈప్రపన్నుని స్వనిష్ఠను గుఱించిన జ్ఞానము జన్మకాలమునందే కామక్రోధాదులను అణచిపెట్టుటలో సమర్థమగుచున్నది. కావున నది యాతనికి మోక్షముకంటెనున్న ఎక్కువ భోగ్యమైనది.

ఇవ్విధమగు నిష్ఠ తనకుఁ గలదని తనకుఁ దెలియుట యెట్లంటివేని, చెప్పెదను. తనను ఇతరులు పరిభవించినప్పుడు తన దేశాదులనుబట్టి యితరులు గాన్పించునట్టి దోషములు తనయొక్క స్వరూపముతో సంబంధించినవి కాకపోవుటంగని, యందువలన మనస్సును చిన్నబుచ్చుకొనక యుండుటయును, "శపమానస్యయత్పాపం శపన్తమనుగచ్ఛతి" (తిట్లు పడే వాని పాపము తిట్టే వానితోఁగూడపోవును) అన్నట్లు, తనను పరిభవించుటచే తన పాపమును గొనిపోవునట్టి బుద్ధిహీనులను గుఱించి "బద్ధవైరాణి భూతాని ద్వేషం కుర్వంతిచేత్తతః । శోచ్యాన్యహోతిమోహేన వ్యాప్తానీతి మనీషిణా ఆత్మద్రుహ మమర్యాదం మూఢముజ్ఝితసత్పథం సుతరామనుకంపేత నరకార్చిష్మదింధనం" (పరస్పరము వైరముగలవియగు ఈజంతువులు పరస్పరము ద్వేషించుచున్నట్లయిన, అయ్యో పాపము ఇవి యజ్ఞానములోఁ బడియున్నవని జ్ఞానియగువాఁడు చింతించునది. తనకు ద్రోహముచేసినట్టివాఁడును, మర్యాదలేనివాఁడును, మూఢుండును, తప్పుదారిన పోవువాఁడునునగు మనుష్యునిజూచి నరకరూపమగు అగ్నిలో పడునట్టి వానినిగాఁ దలంచి వాని విషయమున సానుభూతిని జూపించునది) అన్నట్లు, సంపూర్ణమగు కృపయును, "అమర్యాదః క్షుద్ర," అను శ్లోకమునందును, "వాడినేన్ వాడి" ఈ మొదలగు ఆళ్వారుల పాశురములయందును తాను అనుసంధించుకొనవలసినట్టివి గాను ఉదహరింపఁబడినట్టి దోషములను తనపై నిరూపించుటచే తాను వాటిని మరవకుండ చేసినారనెడి యుపకారస్మృతియును, ఇన్ని అన్నింటికిన్ని స్వరూపంబగు భగవత్పారతంత్ర్య

మునున్ను జీవులందఱును కర్మవశ్యులుగా నుండునట్టిస్థితినిన్ని మనస్సునకుఁ దెచ్చుకొని, మనకున్ను మనలను ద్వేషించునట్టి వారికిన్ని ఉండుకున్నట్టి కర్మంబుల కనుగుణముగ నిట్టిస్థితిలోఁ బెట్టియున్నట్టి స్వతంత్ర శేషియగు సర్వేశ్వరునిచే ప్రేరింపఁబడినట్టివారై వారు పరిభవాదుల నొనర్చుచున్నారని తలంచుకొని, వారి విషయమున నెంతమాత్రము కోపగించుకొనకుండుటయు, ప్రారబ్ధపాప శేషము నశించుచున్నదనెడి సంతోషమును ఇవి యుండి యున్నట్లయిన, తిరుమంత్రమునందుండు ప్రథమ మధ్యమపదములచేఁ అనఁగా ప్రణవ(ఓంకార)ముచేతను "నమః" అను శబ్దముచేతనున్ను విధింపఁబడినట్లు, అచేతన పదార్థమునుండి తనకుఁగల వైలక్షణ్యమును, సర్వభూతముల యొక్కయును ఆనుకూల్యాదులకుఁ దగినట్టి జ్ఞానమును అన్ని విధములను ఆకించన్యమును, స్వయముగ సర్వసమర్థుడై కర్మానుగుణముగ ఫలముల నిచ్చునట్టివాఁడగు స్వతంత్ర శేషికి (సర్వేశ్వరునికి), ఇష్టమొచ్చినవిధమున ఉపయోగపఱచుకొనుటకనుకూలమగునట్లుండునట్టి యనన్యార్హ శేషత్వ పారతంత్ర్యములను, "యద్ధితం మమ దేవేశ" ఇత్యాది శ్లోకమునఁ జెప్పియున్నట్లు, సర్వేశ్వరుని యధీనములోనున్నట్టి హితసిద్ధియును వీటిని గలిగియున్నట్టిదియగు తనయొక్క స్వరూపమునందు తనకు నిష్ఠ గలదని తెలిసికొనవచ్చును.

సర్వేశ్వరుండుతప్ప, తాను కాని, యితరులు కాని తనకు రక్షకులుకారనెడి బుద్ధియును, ప్రాణములఁ గొనిపోవునట్టి యాపత్తు సంభవించినను, "ప్రాయేణాకృతకృత్యత్వాన్మృతేరుద్విజతేనరః । కృతకృత్యాః ప్రతీక్షన్తే మృత్యుం ప్రియ

మివాతిథిం" (సామాన్యముగ జనులు కృతకృత్యులు కానం
దున, మృత్యువునుండి భయపడుదురు. కృతకృత్యు లన్ననో,
మృత్యువును ప్రియుండైనట్టి యతిథినిగాఁ దలంచుదురు)
అన్నట్లు ఈ శరీరము పోయినపిమ్మట యేమిగానున్నదో? య
నెడి భయమెంతమాత్రము లేకుండ, ఇష్టప్రాప్తి విషయమునఁ
గలకోరికవలన సంతోషముతో నుండుటయును, "గజం వా
వీక్ష్యసింహం వా వ్యాఘ్రం వాపి వరాననా నాహారయతి సం
త్రాసం బాహూ రామస్య సంశ్రితా" (శ్రీరామచంద్రుని చె
య్యి పట్టుకొనియున్నట్టి సీతాదేవి ఏనుగనుగాని, సింహమును
గాని, పులికిగాని భయపడియుండలేదు" అనియు "అసందే
శాత్తు రామస్య తపసశ్చానుపాలనాత్। నత్వాంకుర్మిదశగ్రీవ
భస్మ భస్మార్హ తేజసా" (ఓ రావణా! శ్రీరామచంద్రుని యు
నుజ్ఞ లేకపోవుటంజేసియు, నాయొక్క పారతంత్ర్యమును కా
పాడుకొనవలసియుండుటంజేసియును, నాయొక్క పాతివ్రత్య
రూపమగు అగ్నిజ్వాలచే నిన్ను భస్మముగాఁ జేయకుంటిని)
అనియు, "శరైస్తుసంకులాంకృత్వా లంకాం పరబలార్దనః।
మాంనయేద్యది కాకుత్స్థః తత్తస్యసదృశంభవేత్" (శత్రుసంహార
కుండగు శ్రీరామచంద్రుండు బాణములచే లంకాపట్టణమును
చిల్లాచిదరుగ చేసి నన్ను గొనిపోయినట్లయిన, అది రామచం
ద్రునిస్థితికి తగినట్లుండగలదు) అనియును చెప్పియున్నట్లుసీతా
పిరాట్టి అనుష్ఠించిచూపించిన విధమున, రక్షకుండగు సర్వేశ్వ
రునిపై భారమునుంచుటచేఁ గల యతిశయమున్ను, అందులోను
అనిష్టనివృత్తియును ఇష్టప్రాప్తియును వాని యధీనములయి
నవని తలంచియున్నట్లయిన, తాను కోరినట్టి సమస్తఫలము

లకును సాధనభూతంబై, చరమశ్లోకమునందలి పూర్వార్థముచే విధింపఁబడినదై, ద్వయమునందలి పూర్వఖండమునందను సంధించుకొనవలసినదియై, తిరుమంత్రమునందలి మధ్యమపదమునందు వివక్షింపఁబడినట్టి యుపాయమునందు తనకు నిష్ఠ గలదని తెలిసికొనవచ్చును.

"ఉత్పత్తి స్థితి నాశానాం స్థితౌ చింతా కుతస్తవ యద్ధోత్పత్తిస్తథానాశః స్థితిస్తద్వద్భవిష్యతి" (ఉత్పత్తి, స్థితి, నాశములనుగూర్చి నీవేల చింతింపవలయును. ఎవ్విధమున పుట్టుచున్నవో, అవ్విధముననే నశించుచున్నవి. స్థితియును అట్టిదిగానే యుండగలదు) అనియు "అచేష్టమాన మాసీనం శ్రీః కంచిదుపతిష్ఠతి। కర్మీకర్మానుసృత్యాన్యో నప్రాశ్య మధిగచ్ఛతి" (ఏమియు చేయక ఊరకయుండువానికి సంపత్తు లభింపదు. కర్మిష్ఠుఁడు తాను ఒనర్చియున్నట్టిదానినే, తప్ప వేఱొక్కదానిని అనుభవింపఁడు) అనియును చెప్పియున్నట్లు, ప్రారబ్ధకర్మమునకుఁదగినట్లు ఈశ్వరుండు గలుగఁజేయునట్టి దేహయాత్రాదులవిషయమున మనస్సు నొప్పించుకొనక, ఒకవేళ తాను మనస్సునొప్పించుకొనినను, "ఉత్పతన్నపి చాకాశం విశన్నపి రసాతలం। అటన్నపి మహీంకృత్స్నాం నాదత్తముపతిష్ఠతే। యత్కించిద్వర్తతే లోకే సర్వంతన్మద్విచేష్టితం। అన్యోహ్యన్యచ్చింతయతి స్వచ్ఛందం విదధామ్యహం" (ఆకాశము మీఁదపడినను, భూమి క్రుంగిపోయినను, భూలోకమునందంతను సంచరించినను, తాను ఒనర్చియున్నట్టిదానినే అనుభవింపఁగలఁడు. లోకమునం దెద్ది కలదో, అది యంతయును నేనొనర్చినదియే. లోకులు వేఱొక్కవిధముగ తలంపవచ్చును. అయితే

నేను స్వచ్ఛందముగ ప్రవర్తించువాఁడను) అన్నట్లు సర్వేశ్వ
రుండు తలంచినట్టి విధముననే తప్ప వేఱొక్క విధముగా నెద్ది
యును జరుగనేరదని నిశ్చయించుకొని. "అప్రయత్నాగతాస్సే
వ్యా గృహస్థైర్విషయాస్సదా। ప్రయత్నేనాపి కర్తవ్యః స్వధ
ర్మ ఇతి మే మతిః। నాహారంచిన్తయేత్ప్రాజ్ఞో ధర్మమేవాను
చిన్తయేత్। ఆహారోహి మనుష్యాణాం జన్మనాసహ జాయతే"
(తాను ప్రయత్నింపకయే లభించునట్టివాటిని గృహస్థుండనుభ
వించునది. ప్రయత్నముతోనైనను స్వధర్మమును పాలించునది.
ప్రాజ్ఞుండయినవాఁడు తనయాహారమునుగుఱించి యంతగమ
నింపవలదు. ధర్మపరిపాలనమునే గమనింపవలయును. ఆహార
మనునది మనము పుట్టినప్పటినుండి యుండియేయున్నది.) అని
పరాశరగీతాదులయందును, "నసన్నిపతితంధర్మ్యముపభోగం
యదృచ్ఛయా। ప్రత్యాచక్షే నచాన్వేన మనురుంధే సుదుర్ల
భం" (ధర్మానుగుణమగు భోగము యాదృచ్ఛికముగ సంప్రా
ప్తింపఁగా దానిని నిషేధింపను. దుర్లభంబైనట్టిదానిని పొందు
టకై ప్రయత్నించుటయును లేదు.) అని యాజగరోపాఖ్యానమునం
ను, చెప్పియున్నట్లు, శాస్త్రవిరుద్ధములు కానివాటిని తానొక
ప్రక్క చేయకుండ యుండియుండఁగా, భగవత్సంకల్పమువలన
నవి తమంతనే సంభవించుచున్నవు ప్రారబ్ధకర్మఫలమగు ఋణము
తీరిపోవుచున్నదనుకొని, వెనుదీయక అనుభవించుటయును,
ఇవ్విధముగ కర్మవిశేషానుగుణముగ సంప్రాప్తంబులగునట్టి
ప్రాప్యాంతరములయొక్క లాభనష్టములవిషయమున, "తమో
రేకతరోరాశిర్యద్యైనముపసన్నమేత్। నసుఖం ప్రాప్యసం
హృష్యేద్దుఃఖంప్రాప్యనసంజ్వరేత్" (లాభనష్టంబులలో నెద్ది

మైననొక్కటి సంప్రాప్తంబైనప్పుడు, లాభమునుపొంది సంతో
షింపఁగూడదు. నష్టమునుపొంది దుఃఖింపఁగూడదు) అనియు,
“ఉళ తెన్నిరుగ్గాంవార్” (మాకు ఇదికలదని గర్వపడునట్టివారు)
అనియును పాయించినట్లు, హర్షశోకవర్జితుండై, స్వరూపాను
రూపమును, పరమప్రాప్యంబునగు కైంకర్యమువిషయమున
రుచియును, శ్రీ యాళవందారుల స్తోత్రమునందును, శ్రీ వైకుంఠ
గద్యాదులయందును చెప్పియున్నట్లు ఎప్పుడా! ఎప్పుడా! అని
నోరూరునట్లుచేయునట్టిభగవత్ప్రాప్తివిషయమున త్వరయును
ఇవి యున్నట్లయిన, తిరుమంత్రమునందుండు నారాయణ
పదమునందలి చతుర్థీవిభక్తిచేతను, ద్వయమునందుండు చతుర్థీ
విభక్తిచేతను “నమః” అను శబ్దముచేతనున్ను, చరమశ్లోక
మునందుండు “అహంత్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి”
అను వాక్యముచేతనున్ను ఇదిగో! చూడు! అని చేయిజాచి చూ
పింపఁబడునట్టి సముద్రమువలెనె యనంతంబైనట్టి పరమపురు
షార్థమువిషయమున తనకు నిష్ఠకలదని తెలిసికొనవచ్చును.

ఇవ్విధమున ఆయాగుర్తులచే “అహమాత్మా న దేహో
స్మి విష్ణుశేషః పరిగ్రహః। తమేవశరణం ప్రాప్తః తత్కైంకర్య
చికీర్షయా” (“నేను” అనునట్టి యీయాత్మ దేహము కాదు
విష్ణువుకు శేషభూతమైనట్టిదిగా నంగీకరింపఁబడినది. కావున
నట్టి విష్ణువుకు కైంకర్యముఁ జేయవలయుననెడి కోరికతో వా
నినే శరణుజొచ్చినాడను) అన్నట్లు, తిరుమంత్రాదులఁగొని
స్వరూపోపాయ పురుషార్థముల విషయమున తనకుఁగల నిష్ఠ
ను తెలిసికొనియుండునట్టి యీయధికారికి “నైషాపశ్యతిరా
ష్ట్రో నేమాన్ పుష్పఫలద్రుమాన్। ఏకస్థహృదయానూనం

రామమేవానుపశ్యతి" (చెరలోనున్నప్పుడు సీతాపిరాట్టి రాక్షస స్త్రీలవైపుననున్ను చూడదు. పుష్పఫలపూర్ణములగు వృక్షములవైపుననున్ను చూడదు శ్రీరామచంద్రునే తనయొక్క హృదయమునందుంచుకొనినట్టిదియైనందున వానినే ధ్యానించుచుండును) అన్నట్లు, విరోధితోఁగూడియున్నట్టి తనకు ఏదోక నిమిత్తవశమున సంప్రాప్తంబై బ్రహ్మవిదపచారాది వ్యతిరిక్తంబగునట్టి యేదోక భయహేతువు విషయముననున్ను, స్వరూపప్రాప్త కైంకర్యమునకు ఒంటునున్న వేఱగునట్టి యేదోక ప్రీతిహేతువగు వస్తువు విషయముననున్ను ఈతని మనస్సు పోఁజాలదు. ఒకవేళ అవి తలవని తలంపుగా సంభవించినను, వాటినుండి భయముకాని, వాటియెడల ప్రీతిగాని యీతనికిఁగలుగనేరదు.

పా॥ ముక్కియమందిరమ్ కాట్టియ మూన్ఱిల్ నిలైయుడైయార్,
తక్కవైయన్ఱి తకాతవైయొన్ఱుమ్ ఇశైయార్,
ఇక్కరుమంగళ్ ఎమక్కుళ(దె)వెన్ను మిలక్కణత్తాల్,
మిక్క వుణర్త్తియర్ మేతినిమేవియ విణ్ణవరే॥

టీ॥ ముక్కియమందిరమ్=ముఖ్యమంత్రము, కాట్టియ= చూపించునట్టి, మూన్ఱిల్=స్వరూపోపాయ పురుషార్థములయందు మూడింటియందును, నిలైయుడైయార్=నిష్ఠగలవారు, తక్కవై=తమతమవర్ణాశ్రమోచితంబులయినవి, అన్ఱి=వినాగా, తకాదవై=అనుచితంబైనట్టివాటిని, ఒన్ఱుమ్=ఒక్కదానినిన్ని, తమక్కు=తమకు, ఇశైయార్=ఒప్పుకొనరు. ఇక్కరుమంగళ్=ఇవ్విధములగు కర్మములు, ఎమక్కు=మాకు, వుళవు=కలవు, ఎన్నుమ్=అని యివ్విధమగు, ఇలక్కణత్తాల్=చిహ్నముచేత, మిక్కవుణర్త్తియర్=జ్ఞానాధికులయినవారై, మేదినిమేవియ=భూమియందుండువారు, విణ్ణవరే=పరమాకాశమునందుండునట్టి నిత్యసూరులే.

తా॥ ముఖ్యమంత్రముచేఁ దెలుపఁబడినట్టి స్వరూపోపాయపురుషార్థములయందు మూఁడింటియందును నిష్ఠగలవారు తమతమ వర్ణాశ్రమోచితంబులయినట్టి వాటిని తప్ప, తక్కినవాటిని ఒప్పుకొనక, ఈ యనుష్ఠానము మోక్షమునకు కలదని తెలిసికొనియుండుటచే జ్ఞానాధికులై యీ భూలోకమునందున్నట్టి ప్రపన్నులు పర[illegible]కాలము[illegible]న్నట్టి నిత్యసూరులే.

శ్లో॥ స్వాపోద్బోధవ్యతికరనిభే భోగమోక్షాంతరాళే
కాలంకంచిజ్జగతివిధినా కేనచిత్స్థాప్యమానాః।
తత్త్వోపాయప్రభృతివిషయే స్వామిదత్తాం స్వనిష్ఠాం
శేషాంకృత్వా శిరసికృతిన శ్శేషమాయుర్నయంతి॥

టీ॥ స్వాపోద్బోధ వ్యతికరనిభే=స్వాపోద్బోధ=నిద్రాజాగరముల యొక్క, వ్యతికరనిభే=సంసర్గసదృశంబగు, భోగమోక్షాంతరాళే=ప్రకృత్యనుభవమోక్షానుభవముల మధ్యకాలమున, అనఁగా ప్రపత్తినిచేసినపిమ్మట, ఇహజగతి=ఈలోకమునందు, కేనచిద్విధినా=ప్రారబ్ధశేషముచే, కంచిత్కాలం=కొంతకాలము, స్థాప్యమానాః=ఉంచబడినటి, కృతినః=కృతకృత్యులయినట్టివారు, తత్త్వోపాయప్రభృతివిషయే=స్వరూపోపాయపురుషార్థములవిషయమున, స్వామిదత్తాం=భగవంతునిచే నొసంగఁబడినట్టి, స్వనిష్ఠాం=తమనిష్ఠను, శిరసి=శిరస్సునందు, శేషాంకృత్వా=అలంకారముగాఁగొని, శేషం=మిగిలిన, ఆయుః=జీవితకాలమును, నయన్తి=గడుపుచున్నారు.

తా॥ ప్రకృత్యనుభవమునకు మోక్షానుభవమునకును మధ్యనుండుకాలమున, అనఁగా ప్రపత్తిచేసినపిమ్మట కొంతకాలము ఈలోకమునందుంచబడినట్టి కృతకృత్యులయినట్టి ప్రపన్నులు భగవంతునిచే నొసంగఁబడినట్టి స్వరూపోపాయపురుషార్థనిష్ఠను శిరసావహించి కాలముగడుపుచున్నారు.

స్వనిష్ఠాజ్ఞానాధికారము ముగిసెను.



శ్రీమతే నిగమాంతమహాదేశికాయ నమః







# రహస్యత్రయసారము



## ఉత్తరకృత్యాధికారము

శ్లో॥ సన్తోషార్థం విమృశతి ముహుః సద్భిరధ్యాత్మవిద్యాం
నిత్యం బ్రూతే నిశమయతి చ స్వాదుసువ్యాహృతాని।
అంగీకుర్వన్ననఘలలితాం వృత్తిమాదేహపాతా
ద్దృష్టాదృష్టస్వభరవిగమే దత్తదృష్టిః ప్రపన్నః॥

టీ॥ దృష్టాదృష్టస్వభరవిగమే=ఐహలౌకిక పారలౌకిక భోగముల భారము తనది కాదనువిషయమున, దత్తదృష్టిః=జ్ఞానముకలవాఁడగు, ప్రపన్నః=ప్రపన్నుండు, ఆదేహపాతాత్ = శరీరావసానమువరకు, అనఘలలితాం = శాస్త్రీయమును భగవత్కైంకర్యమగుటచే భోగ్యమునునయినట్టి, వృత్తిం=దేహయాత్రను, అంగీకుర్వన్=అవలంబించినట్టివాఁడై, సంతోషార్థం=సంతోషముకొఱకును, సద్భిస్సహ=సత్పురుషులతోఁగూడ, ముహుః=మాటిమాటికి, అధ్యాత్మవిద్యాం=బ్రహ్మవిద్యనుగుఱించి, విమృశతి=విచారించుచున్నాఁడు. స్వాదుసువ్యాహృతాని = భోగ్యములగు శ్రీసూక్తులను, నిత్యం=రోజుల్లప్పుడును, బ్రూతే=చెప్పుచున్నాఁడు, నిశమయతి చ=వాటిని వినుచున్నాఁడు.

తా॥ ఐహికలౌకికములును, పారలౌకికములును భగవదధీనంబులనుకొని భగవంతునిపై భారమునుంచినట్టి ప్రపన్నుండు, జీవించియున్నంతవరకును

శాస్త్రీయమగువృత్తి నవలంబించి, సంవాసార్థము సత్పురుషులతో అధ్యాత్మవిద్యనుగురించి విమర్శించుచు, పూర్వాచార్యుల శ్రీసూక్తులను ఉదహరించుచు. ఇతరులు చెప్పఁగా వినుచు నిర్వ్యాధముగ కాలముగడుపుచున్నాడు

ఇవ్విధముగ కృతకృత్యుండై, తనయొక్క నిష్ఠనుఁ దెలిసికొని, ఈ శరీరముతో నున్నంతకాలము, సంసారిగా నున్నప్పుడు యేదొక దాని విషయమున ప్రీతిగలిగి యుండునట్లు, ప్రపన్నుండైనప్పుడు వీదొక దానితో (సంసారముతో) ఎక్కువ సంబంధమును గలుగఁ జేసికొనకయు, వేఱొక్కదానితో (భగవద్విషయముతో) ఎక్కువ సంబంధమును గలుగఁ జేసికొనియు నుండునట్టి యీ యధికారికి ముక్తులయొక్క కైంకర్యమువలెనే యెక్కుడు రుచికరంబగుటం జేసి స్వయముగ ప్రయోజనంబై, శాస్త్రముచే విభజింపఁబడినట్టి కాలమునందు నియతంబై, ఇఁకవిూఁదు చేయఁబోవునటి కైంకర్యమును అవకాశము కలుగుటకుగాను, యింతకుమునుందొనర్చుచు వచ్చునట్టి కైంకర్యము ముగింపవలసినట్లు ఒక్కదానితో నొక్కటి సంబంధించి యున్నట్టిదై, భగవంతునికి ప్రీతిఁగలుగఁ జేయుటలో హేతువై, అందువలని ఫలమునునై, "వాశిత్తు క్కేట్టుమ్ వణంగి వఴి పట్టుమ్ పూశిత్తు మ్పోక్కినేన్ పోతు" (శాస్త్రములఁజదివియు, వినియు, దండము సమర్పించియు, శాస్త్రప్రకారము ఆరాధించియును కాలముగడిపితిని) అనియు, "శీర్ కలన్ద శొల్ నినైన్దు పోక్కారేల్ శూழ்వినైయి నాழ்తుయిరై యెన్నినెను పోక్కువరిప్పోతు" (దివ్యసూరుల శ్రీసూక్తుల ననుసంధించుకొని కాలక్షేపము చేయకపోయినట్లయిన, పాప మూల

ము దుఃఖము ను చేసిన తలంచుకొనుటచేఁ బోగొట్టకొన
గలరు) అనియు, ‹‹ఒళివిల్ కాలమెల్లాముడనాయ్మన్ని ఒళి
విలావడిమై శెయ్యవేణ్డునామ్'' (సర్వకాల సర్వావస్థల
యందును ఎడతెగకుండ సమస్త కైంకర్యములను చేయుచుండ
యున) అనియు, ‹‹పొ, గేళ్ పుకళ్ కళ్ వాయవాయ్ పులం
కాళ్ వడివెనె ననతాయంగే మలర్ కళ్ కైయ్యవాయ్
వళిప్పట్టోడవరుళిల్'' (ఎట్లు సర్వదా భగవంతుని కల్యాణ
గుణంబులను నేను అనుసంధించుకొనుచుందునో, ఎట్లు సర్వేం
ద్రియములను ఆకర్షించునట్టి భగవంతుని దివ్య మంగళ విగ్ర
హము నామనస్సునందు స్థిరముగా నుండగలదో, ఎట్లు వానిని
ఆరాధించుటకుపయుక్తములగు పుష్పములు నాచేతిలో నుండ
గలవో అట్లు కరణత్రయముతోను భగవంతుని కైంకర్యముఁ
జేసికొనుచు నేను సంచరించునట్లు భగవంతుండు కృపచేసినట్ల
యిన, యీ లోకమున సంచరించుచున్నను నాకేమి కొరత)
అనియు, ‹‹వాడాత మలర్ వాడి'' (దొరకని పుష్పంబుల నయి
నను కష్టపడి సంపాదించి) అనియు ‹‹వడివిణైయిల్లా మలర్
మకళ్ మత్తై నిలమకళ్ పిడిక్కుమెల్లడియై కొడువినైయె
నుమ్ పిడిక్క'' (సమానులుకాని అధికులుకాని లేనట్టి లక్ష్మీ
భూదేవులచే పిసకపడునట్టివియు, అత్యంతము మృదువైనవియుం
నగు నీ శ్రీపాదములను పిసుకుటకు ప్రాప్తిలేనందుననిర్భాగ్యుం
డనగు నేను దేనిని పిసకగిలను) అనియు ‹‹తనక్కే యాక వెనై
క్కొళ్ళుమీదే'' (సర్వేశ్వరుండు తనకుగానే నన్ను అంగీకరిం
పవలయును) అనియు, ‹‹ఉనక్కే నామాట్చెయ్ వోమ్'' (నీకే
మేము కైంకర్యమొనర్చెదము) అనియు ‹‹పళ్ళికొళ్ళుమిడత్తడి

కొట్టిడకొ, ళ్ళుహుళాల్'' (నీవు వచ్చి యుండినప్పుడు నీ శ్రీపాదము లను పిసుకుట కై నన్ను అంగీకరింపుమా) అనియు "ఎణ్ణక్కణ్ణ విరల్కళ్'' (భగవన్నామములను లెక్కపెట్టుట కుపయోగ పడునట్టి (వ్రేళ్ళు) అనియు "ఉణ్ణానాళ్ పశియావత్తొన్ఱిల్లై యోవాదే నమోనారాయణా వెన్ఱెణ్ణా నాళుమిరుక్కుచ్చ్చామవేదనాణ్మలర్ కొణ్డున్పాద మ్ణ్ణానాళ్ వైత్తిడుమాకిల్ అన్నాళెన్ వైప్పిజినాళే'' (భోజనము చేయకున్నందున నాకు క్షుద్బాధ లేదు అయితే నిరంతరము నమోనారాయణాయ అని యనుసంధింపకొనని దినమున్ను, ఋగ్యజుస్సామవేద సూక్తములతో పుష్పములచే నిన్ను పూజింపని దినమున్ను నాకు ఉపవాసదినము) అనియు, "నావుక్కు నిన్నైయల్లాలఱియాతు నానదఞ్జువనే వశవుస్టు'' (వాక్శుద్ధిలేక పోవుటచే నీనామమును నుచ్చరించుట కర్హుండను కానందున భయపడు చున్నాను అయినను, వాక్కున్ననో నీ నామోచ్చారణను తప్ప వేఱొక్కదాని నెఱుంగదు) అనియు "వాయవనైయల్లతు వాళ్తాదు'' (నా వాక్కు నారాయణుని తప్ప వేఱొక్కనిని స్తుతింపదు) అనియు, "తోళ్ శవనైయల్లాల్ తొళ్ళా'' (హస్తములు నీకు తప్ప వేఱొక్కనికి దండము పెట్టవు) అనియు, "నయవేన్ పిరర్పొరుళై'' (పరుల సొత్తు కాశింపను) అనియు, "ఇరుళిరియ''అనియు, "ఊనెరుశెల్వత్తు'' అనియు, "నీణాకత్తు'' అని యీ మొదలగు తిరుమొழిలయందును,

"పత్యుః ప్రజానా మైశ్వర్యం పశూనాం వా న కామయే అహంకదంబోభూయాసం కుందో వాయమునాతటే'' (ప్ర

జాపతియొక్కగాని పశుపతియొక్కగాని నైశ్వర్యముతో నాకు
పని లేదు. యమునానదీతీరమున కదంబవృక్షముగానుగాని కుంద
వృక్షముగానుగాని జన్మింపఁగోరెదను) అనియు, "కురుష్వ
మామనుచరం వైధర్మ్యం నేహవిద్యతే । కృతార్థోహం భవిష్యా
మి తవచార్థః ప్రకల్పతే । అహం సర్వం కరిష్యామి జాగ్రతః స్వప
తశ్చ తే । ఏవ వానస్మి కాకుత్స్థ త్వయి వర్షశతం స్థితే । స్వయం
తు రుచిరే దేశే క్రియతామితి మాం వద। కామయే వైష్ణవత్వం తు
సర్వజన్మసు కేవలం" (ఓ రామచంద్రా! నన్ను నీ యనుచరుని
గాఁ గైకొనుము. ఈ విషయమున విరుద్ధమెద్దియును లేదు. ఇందు
మూలముగ నేను కృతార్థుండను కాఁగలను. నీకున్న పని జరుగును.
నీవు నిద్రించుచున్నను, మేల్కొనియున్నను సర్వకైంకర్యము
లను నేనొనర్చెదను. ఎప్పటికిని నేను పరతంత్రుండను కావున
నీవే స్వయముగ ఈస్థలమునఁ జేయుమని నియమింపుము. ఎన్ని
జన్మములనెత్తినను విష్ణుభక్తుఁడుగా నుండవలయునని కోరుచు
న్నాను) అనియు, "వర్తమానస్సదా చైవం పాంచకాలికవ
ర్త్మనా । స్వారితైర్గంధపుష్పాద్యైః శుభైశ్శక్త్యనురూపతః।
ఆరాధయన్ హరింభక్త్యా గమయిష్యామి వాసరాన్" (ఎల్లకా
లము పాంచకాలికమార్గమున నున్నట్టివాఁడనై నాశక్తి కను
గుణముగ నాచే గొనిరాఁబడినట్టి పరిశుద్ధములగు పుష్పముల
చేత భక్తితో భగవంతుని యారాధించి కాలము గడిపెదను)
అనియును చెప్పియున్నట్లు స్వరూపానురూపమగు కాల
క్షేపముకుగాను నగు ఉత్తరకృత్య ముండవలసిన విధమున
ఆత్మనిష్ఠ కనుగుణముగ తెలిసికొని యుండవలసినట్టి
యర్థములలో, తనకు తెలియనివాటిని నేను కృతకృత్యుండను

కదా యనుకొని, అలక్ష్యముచేయక, అనుభవపూర్తి గలుగుట
కుగాను తెలివియును, ప్రీతియును ఉండవలసి యుండుటచేతను,
"తత్పాదభక్తిజ్ఞానాభ్యాం ఫలమన్యత్కదాచన । నయాచేత్పు
రుషోవిష్ణుం యాచనానశ్యతిధ్రువం" ( విష్ణువువిషయమగు
భక్తికిగాను జ్ఞానమునకుగానుతప్ప వేరొక ఫలమునకుగాను విష్ణు
వున గూర్చి ఎన్నడును యాచన నిశ్చయముగ నశించును )
అన్నట్లు, జ్ఞానశక్తుల నపేక్షించినట్లయిన దోషము లేకపోవు
టంజేసియును, తనకు శేషియగు సర్వేశ్వరుని విషయమున
మనస్సుకు వైశద్యముగలుగుటకుగాను "పీతకవాడైప్పిరానార్
పిరమ గురువాకివన్దు" (పీతాంబరధరుండును తనకు శరీరము
నిచ్చినందున ఉపకారకుండగు బ్రహ్మమేగురువుగావచ్చి) అనిచె
ప్పఁదగినట్లు వేంచేసియున్నట్టి జ్ఞానవంతులగు పరమైకాంతుల
సన్నిధియందు "తద్విద్ధిప్రణిపాతేన పరిప్రశ్నేనసేవయా। ఉప
దేక్ష్యన్తితేజ్ఞానం జ్ఞానినస్తత్త్వదర్శినః" (తత్త్వద్రష్టలగుజ్ఞానులు
దండము సమర్పించుటచేతను, కుశలప్రశ్నచేతను, ఆశ్రయిం
చుటచేతనున్ను జ్ఞానమును ఉపదేశింపఁగలరు) అని చెప్పియు
న్నట్టి విధమునఁ దెలిసికొనుటకై వారిని యాశ్రయించి, "మం
దోప్యమందతామేతి సంసర్గేణవిపశ్చితః। పంకచ్ఛిదఃఫలస్యేవ
నికషేణావిలంపయః" (చిల్లగింజ గంధముయొక్క సంపర్క
మువలన మలినమైనట్టి యుదకము నిర్మలంబగునట్లు, పండిత
సంబంధమువలన జ్ఞానహీనుండు నయితము జ్ఞానవంతుండగు
చున్నాఁడు) అన్నట్లు, పరిశుద్ధమైనట్టి జ్ఞానము గలవాఁడై,
"యస్యానుభవపర్యన్తా బుద్ధిస్తత్త్వేప్రతిష్ఠితా । తద్దృష్టిగోచ
రాస్సర్వే ముచ్యన్తేసర్వకిల్బిషైః" ( యెవ్వనికి తత్త్వవిషయ

మున అనుభవపర్యంతమగు జ్ఞానము కలదో, వానిదగ్గఱనమా
త్రమున సందఱును పాపరహితు లగుచున్నారు) ఇట్టి ఈ
యరములయందు నిష్ఠగలవారియెడల విశ్వాసముతో ప్రవర్తిం
చి, వారి యనుష్ఠానములలో ‹‹యావానర్థ ఉదపానే సర్వత
స్సంప్లుతోదకే›› (ఉదకము ప్రవాహమై యంతటను వ్యాపిం
చియున్నను తనకు కావలసినంతమాత్రమే త్రాగునట్లు
ఎంత యావశ్యకమో అంతమాత్రమే గ్రహించునది) అన్నట్లు
తనయొక్క వర్ణ, ఆశ్రమ, జాతి, గుణాదుల కనుగుణముగ
కర్తవ్యాంశముల నిష్కర్షించుకొని, అనుష్ఠించి, ఇట్టి యను
ష్ఠానము మనకే కదా యున్నదనుకొనుటచే తాను ఉత్కృ
ష్టుడననియు, ఇతరులు నికృష్టులనియును తలంచుకొనుట యను
నెడి పాడుగుంటలో పడకుండ, దూరదృష్టితో ప్రవర్తించుట
యు, తనకు భగవత్కటాక్ష విశేషమువలన శ్రీనమ్మాళ్వా
రులు, శ్రీమన్నాథమునులు మొదలగువారికివలెనే సాక్షాత్కా
రాది రూపములగు ఫలోద్గమ పర్వములు సంప్రాప్తించినను,
తనకు మంచి చెడ్డ యేమియు తెలియదనియు, ‹‹అఱివనేలుమి
వైల్లామెన్నాల్ అడైప్పనీకొణ్ణా›› (జ్ఞానమున్నప్పటికిని దీని
నంతయును అనుష్ఠించుటకుగాని, పరిత్యజించుటకు గాని నేను
సమర్థుండనుకాను) అనియును నిశ్చయించుకొని, పరాధీనస్వ
రూపుండై ప్రవర్తించుట యనెడి తనయధికారములో నంతర్గ
తంబైయున్నట్టి ఆకించన్యమును పోగొట్టుకొనక, ‹‹అహమ
స్మ్యపరాధానామాలయోఽకించనోఽగతిః›› (సర్వాపరాధిని, దీనుం
డను, గతిలేనివాఁడను) ఇత్యాదివాక్యములననుసరించి యుండు
నట్టి ‹‹నోన్ఱ్ నోన్బిలేన్ నుణ్ణఱివిలేన్›› (ఎవ్విధమైనట్టి యనుష్ఠాన

మునున్న అనుష్ఠించియున్నట్టివాఁడను కాను) అనియు, ,,ఎ
న్నాళ్ శెయ్ కేన్" (జ్ఞానాదిరహితుండనగు నేను దేనిని అను
ష్ఠింపఁగలను) అనియు ,,కళైవాయ్ తున్బంకళై యాతొళ్ళి
వాయ్ కళైకణ్ మత్త్ ఇలేన్" (రక్షింపుము రక్షింపకపో! నీకం
టెను నాకు వేఱొక్క రక్షకుండు లేడు) అనియు, ,,పుకలొన్రి
ల్లావడియేన్" (వేఱొక్క గతిలేనట్టి దాసుండను) అనియు,
,,అవిక్కోర్ పత్త్రు కొళ్ళుమ్బు నిన్నలాలరిక్కిన్రేన్" (ఆత్మకు
ఆధారభూతుండుగా నాశ్రయింపఁదగినవాఁడు నీకంటెను వేఱొ
క్కఁడు లేడు) అనియు, ,,కళైవకళ్ పిన్ శెన్రు" (కేవలముదర
పోషణార్థము పశువులఁగాచి) అనియు, ,,కుళిత్తు మూన్రనలై
యోమ్బమ్" (ప్రాతఃకాలమున స్నానముచేసి త్రేతాగ్నులను
సేవించుటయనెడి బ్రాహ్మణ్యమును పోగొట్టుకొంటిని) అనియు
,,కులంగళాయ వీరిరణ్డిల్" (ధర్మానుష్ఠాన యోగ్యతగల వర్ణ
ములలోఁ బుట్టకపోతిని) అనియు ,,వేణ్ణాప్రయేతిలన్" (దీనుం
డను హీనుండను) అనియు, ,,పత్త్రిలొన్రుమిలేన్" (ఆశ్రయ
మెద్దియును లేనివాఁడను) అనియు, ,,తుక్కతుయర త్తడాయేల్"
(దుఃఖమూలమగు పాపమును పోగొట్టకపోయినప్పటికిన్నీకం
టెను వేఱొక్క రక్షకుండు లేడు) అనియును ఈమొదలగు
పాశురములయందును, ,, నధర్మనిష్ఠోస్మి " అను శ్లోకమునం
దును వీరు సాయించినట్టి కార్పణ్యముయొక్క (దైన్యమును చెప్పు
కొనుటయొక్క) విధములనన్నింటి నవలంబించివర్తించుటయు
ను, ఇవ్విధమున తనకు అనాదికాలముగా నుండుకున్నట్టి అన
ర్హతనున్ను, అందుమూలముగ నష్టపడినట్టి కైంకర్యమును
న్నుజూచి ,,పాయ్ న్నిన్టజానముమ్ పొల్లావొళ్ళుక్కుమ్ మళ్ళు

క్కుడనుబ్బమ్” (దేహాత్మభ్రమయును, దానిమూలకమగు దు
ర్వాసనయును, అందుమూలమగు దేహానుబంధమును నాకు
లేకపోవుగాక) అన్నట్లు మనస్సును కష్టపెట్టునట్టి జుగుప్సాతిశ
యమువలన వ్యాకులపడక, “ఉదయరలిప్సా నేష్ట మోనిము
మాయస్ప్విఅన్దా యుష్మైరోగార్తైనా” (నీకైంకర్యమునందుగల
రుచివలన నెల్లప్పుడు కైంకర్యనిరతులగు నిత్యసూరులకు సర్వా
హకుండవైనను, కేవలము నీకృపచేత దేవ, మనుష్య, తిర్యక్,
స్థావరాదిరూపములగు అనేకశరీరములంగొని యవతరించినావు)
అన్నట్లు ఈచేతనుండు పోవుదారినిపోయి ఈతని నిరక్షించుటకుగా
నుయెదురొకొని వచ్చునట్టిశరణ్యుండగు సర్వేశ్వరునియొక్క, తల్లి
పాలవలె హితంబైప్రియంబైనట్టియుపదేశమువలన తెలివితెచ్చు
కొని, అవతారరహస్యాదులనుపరిశీలించి తెలిసికొని, “ఉత్తమేచే
ద్వయసిసాధువృత్తః” (మంచి వయస్సునందు మంచి ప్రవర్తన
గలవాడనైతినా?) అనియు, “దురాచారోపి సర్వాశీ కృత
ఘ్నో నాస్తికః పురా। సమాశ్రయేదాది దేవం శ్రద్ధయా శరణం
యది। నిర్దోషంవిద్ధి తంజంతుం ప్రభావాత్పరమాత్మనః” (పూ
ర్వము దురాచారుండుగాను, భక్ష్యాభక్ష్య నియమము లేని
వాడుగాను, కృతఘ్నుండుగాను, నాస్తికుండుగాను నుండియు
నిప్పటికిన్ని, శ్రద్ధతో నాదిదేవుండగు భగవంతుని శరణుజొ
చ్చినవాడైనట్టయిన, అట్టి భగవంతుని ప్రభావమువలన నట్టి
వాడు నిర్దోషుండు కాగలడు) అనియు “యద్బ్రహ్మకల్పని
యతానుభవేప్యనాశ్యంతత్కిల్బిషం సృజతిజంతురిహక్షణార్ధే
ఏవంసదానకలజన్మసు సాపరాధం క్షామ్యస్యహో తదభిసంధి
విరామమాత్రాత్” (స్వామీ! బ్రహ్మకల్పములకొలది యను

భవించినను తరఁగనిపాపమును ఈమనుష్యుండు క్షణకాలము
లోఁ జేయుచున్నాఁడు. ఇవ్విధముగ ప్రతిజన్మమునందును అప
రాధములనొనర్చుచువచ్చుచున్నట్టియీయాతనిని నీవు కటాక్షించి
నంతమాత్రముననే క్షమింపుచున్నావు) అనియు ‘‘ప్రవహాత్యేవ
హిజలే సేతుః కార్యో విజానతా’’ (నదిలో జలమున్నప్పుడే కదా
బుద్ధిమంతుండు సేతువును కట్టవలయును) అనియు ‘‘మాళువోరి
డత్తిలుమ్ వణక్కొడు మాళ్వదువలమే’’ (ప్రాణములను విడ
నాడునప్పుడైనను భగవంతునికి దండము సమర్పించుట మేలు)
అనియును చెప్పియున్నప్రకారము జరిగిపోయినదానికై చింతిం
పక, ఇంతకుముందుండియున్నట్టి యయోగ్యతవైపుచూడక, స్థిర
ముగానుండునదై నిరతిశయంబగు శరణ్యుని ప్రభావమువలన
ప్రస్తుతము కలిగినట్టి యోగ్యతఁగని పోయిన ప్రవాహముకు
చింతింపకరాబోవు ప్రవాహమునకుగాను ఆనకట్ట కట్టునట్లు, ఈ
స్థితి కలుగుటకు ఆజ్ఞానుజ్ఞానువర్తనమనెడి కైంకర్యానుభవ
మును పోగొట్టుకొనకుండ, ‘‘ముడియాని’’ అనుతిరువాయ్
మొళియందుఁ జెప్పియున్నట్లు అలసటపడియున్నట్టి యింద్రి
యములను సాత్త్వికాహారాదులను భుజించుటచే చక్కపఱచి,
స్వరూపానురూపములగు అనుభవములయందుఁ బోనిచ్చి,
అయోగ్యములగు విషయాంతరములయెడలఁగల వాసనను పో
గొట్టుకొనుటయు, అర్ధజీవుండు పూరికిపోవుటకు ఓడకుగానునిరీ
క్షించుచు, ప్రొద్దుపోవుటకై చదరంగమాడునప్పుడు విడువఁదల
చుకొనినప్పుడు విడుచుటకుమనస్సురాకుండచేయునట్టి డబ్బులు
పెట్టియాడునట్టిచదరఁగమునాడక, ఇష్టమువచ్చినప్పుడు విడువఁ
దగినట్టి లీలార్థమగుచదరంగమునాడినను, ద్యూతశాస్త్రమునఁ

చెప్పియున్నప్రకారము తప్పకుండ కాయలనుపెట్టి యీడునట్లు
అజ్ఞానుజ్ఞలమూలముగ కైంకర్యముం గొనునట్టి సర్వేశ్వరుని,
శాస్త్ర శాసనమునకుం దగినట్టి కాలవిశేషమున నియమితం
బైనట్టి కైంకర్యమును పిత్తము పోవుటకై పాలు త్రాగునట్టి
వారివలెనే కాకుండ, అయాచితలబ్ధంబగు ఔషధమువలన
శీఘ్రముగ నారోగ్యమును బొందనట్టివారు పాలు పోసుకొని
తినునట్లు, సంతోషముతో నొనర్చుటయు, అట్టి సమయమున
"నిత్యసిద్ధే తదాకారే తత్పరత్వేచ పౌష్కర । యస్యాస్తి
సత్తాహృదయే తస్యాసౌ సన్నిధింవ్రజేత్" (నిత్యసిద్ధమగు
భగవంతుని దివ్యమంగళ విగ్రహము ఎవ్వని హృదయ
మునందుండునో, అట్టివాని సన్నిధి నాశ్రయించునది) అనియు,
"యథా సాముద్రమంభోబైః స్పృష్టమేత్యుపభోగ్యతాం। తథైవ
హిమనుష్యాణాం భక్తైస్సంభావితోహరిః" (సముద్రములో
నుండు ఉదకమేఘములచే స్పృశింపంబడినదై భోగ్యతను బొం
దునట్లు, మనుష్యులలోను భక్తులగువారిచే గౌరవిం
పంబడినట్టివాడై నారాయణుండును భోగ్యతను బొందుచు
న్నాడు) అనియును చెప్పియున్నట్లు ఒక యధికారికిగాను భగ
వంతుండు స్వయముగవచ్చి సమీపించియు,పరమైకాంతియగు
తనకుగాను అర్చావతారముగా వేంచేయుండియును పరమో
పకారుండగు భగవంతుని విషయమున "సర్వాతిశాయిషా
డ్గుణ్యం సంస్థితంమంత్రబింబయోః" (మంత్రబింబములయందు
నిరతిశయమగు షాడ్గుణ్యపూర్తిగలదు) అన్నట్లు గుణపూర్తి
యును, "ఆపీఠాన్మౌళిపర్యంతం పశ్యతఃపురుషోత్తమం। పాత
కాన్యాశునశ్యంతి కింపునస్తూపపాతకం" (ఆపాదమస్తకము

భగవంతుని సేవించుటచే పాతకములన్నియును నశించుచున్నవి ఉపపాతకముల విషయమై చెప్పవలసినది యేమున్నది) అని నట్టి పావనత్వమునున్ను, "సందర్శనాదకస్మాచ్చ పుంసాంసం మూఢచేతసాం। కువాసనా కుబుద్ధిశ్చ కుతర్క నిచయశ్చయః । కుహేతుశ్చకుభావశ్చ నాస్తికత్వం లయంవ్రజేత్" (భగవంతుని ఒక్కతడవ అకస్మాత్తుగా సేవించి మాత్రమున జ్ఞానహీను లయినట్టివారి చెడ్డవాసనయు, కుచ్ఛితబుద్ధియు, కుతర్కము లం జేయుటయు, కుచ్ఛితహేతువులం జూపుటయు, కుచ్ఛితభావన యు, నాస్తికత్వమును ఇవి యన్నియును నశించుచున్నవి)అని చెప్పియున్నట్లు, ప్రత్యక్షాది ప్రమాణములయందు మూడింటి యందును హేతుఫలభావమువలన సంప్రాప్తంబులగునట్టి మ నోవికారంబుల కన్నింటికిని ఔషధమై యుండుటను, "యేయ థామాంప్రపద్యంతే తాం స్తథైవభజామ్యహాం"(ఎవ్వరునన్ను యెవ్విధముగ ఆశ్రయించుచున్నారో, వారిని నేనున్ను అవ్వి ధముగానే పొందుచున్నాను) అనియు, "తమరుకన్దశెవ్వురు వుమ్" (దాసులు ఎవ్విధమైనట్టి శరీరము నిష్టపడుదురో) అని యును సాయించినట్లు, మనోవాక్కులచే నింతమాత్రమని చె ప్పుట కశక్యంబైనట్టి యాశ్రితపారతంత్ర్యమును, "కణ్డకణ్ కళ్ మత్తెళ్ళాన్ని నైక్కానావే" (భగవంతుని ఒక్కతడవసేవిం చినట్టినేత్రములు అటుపిమ్మట కేఱొక్కదానిని సేవింపనొల్లవు) అన్నట్టి యాకర్షకత్వమునున్ను, అనుసంధించుకొని,

శ్లో॥ సతీవప్రియభర్తారం జననీవస్తనంధయం।
ఆచార్యం శిష్యవన్మిత్రం మిత్రవల్లాలయేద్ధరిం॥

తా॥ పతివ్రతయగు స్త్రీ ప్రియుండగు భర్తను లాలించు

నట్లును, తల్లి చంటిబిడ్డను లాలించునట్లును, శిష్యుండు ఆచార్యుని లాలించునట్లును, ఒకస్నేహితుండు వేఱొక్క స్నేహితుని లాలించునట్లును, భక్తుండును భగవంతుని లాలించునది.

శ్లో॥ స్వామిత్వేన సుహృత్త్వేన గురుత్వేన చసర్వదా।
పితృత్వేనతథాభావ్యో మాతృత్వేనచమాధవః॥

తా॥ భగవంతుని స్వామినిగాను, స్నేహితునిగాను, ఆచార్యునిగాను, తండ్రినిగాను, తల్లినిగానును తలంచుకొనునది.

శ్లో॥ యథాయువానంరాజానం యథాచ మదహస్తినం।
యథాప్రియాంతిథింయోగ్యం భగవంతంతథార్చయేత్ ॥

తా॥ రాజునుపూజించునట్లును, పట్టపుయేనుగను పూజించునట్లును, ప్రియుండును, యోగ్యుండునునగు అతిథినిపూజించునట్లును భగవంతుని పూజింపవలయును.

శ్లో॥ యథాచపుత్రందయితం తథైవోపచరేద్ధరిం।

తా॥ పుత్రునకుపచారముచేసినట్లును, భర్తకు ఉపచారము చేసినట్లును భగవంతునికి కైంకర్యమొనర్చునది.

ఈ పైవాక్యములయందుఁ జెప్పియున్నట్లు ఆయాసంబంధములకును, పరత్వ సౌలభ్యములకున్ను తగినట్టి కైంకర్యమునొనర్చునది. అట్టి సమయమున, “ తదాహియత్కార్యముపైతికించిత్ ఉపాయనంచోపహృతం మహార్హం । సపాదుకాభ్యాం ప్రథమంనివేద్య చకారపశ్చాద్భరతోయథావత్ ” (ఏమి పనితటస్థించినను, గొప్పకానుకను గొనివచ్చినప్పుడును శ్రీభరతాళ్వారుపాదుకలసన్నిధినివిన్నపించి అటుపిమ్మట తాను చేయవలసినదానిఁ జేయుచుండెను) అన్నట్లు, శ్రీభరతాళ్వారు భగవంతునిపాదుకులవిషయమునఁనొనర్చినట్టి రాజసేవకవృత్తిని

న్యాయమార్గమున సంపాదింపఁబడినట్టి ద్రవ్యముతో జరిపించుటయు పెండ్లాడినస్త్రీ భర్తృపరిచర్యను తన మాంగల్యరక్షణార్థ మనుకొనునట్లు ఈతండును తనస్వత్వముగానని యీ వృత్తిఁ దలంచుకొని యుండుటయు, ఇట్లు భగవంతునినుండి భాగవతులవరకును యొనర్పవలసినదిగా నుండునట్టి కైంకర్య మనఁబడు పరమ పురుషార్థము సిద్ధించుటకుగాను ప్రధాన కారణం బెద్దియనఁగా — "పాపిష్ఠః క్షత్రబంధుశ్చ పుండరీకశ్చ పుణ్యకృత్ । ఆచార్యవత్తయా ముక్తౌ తస్మాదాచార్యవాన్ భవేత్" (పాపిష్ఠుండగు క్షత్రబంధువును, పుణ్యాత్ముండగు పుండరీకుండును ఆచార్యసంబంధమువలన మోక్షమును బొందినారుకావున ఆచార్యుని ఆశ్రయించునది) అనియు, "ఎమ్మా శరవిణ్ణోర్ పిరానార్ మాశిణ్ణలరడిక్కీళ్ వెళ్ళనిమ్మచ్చేర్వోక్కుమ్ వణ్ణుకళే" (మాకు స్వాములగు నిత్యసూరులకు ఉపకారకుండగు సర్వేశ్వరునియొక్క శ్రీపాదములక్రింద నున్నగొనిపోయి చేర్చునట్టి మా యాచార్యులు) అనియు, "విల్లిపుత్తువైనగర్ నమ్బివిట్టు శిత్తర్ తెంగళ్ దేవరైవల్ల పరిశువరువిప్పరేలతు కాండుమే" (శ్రీవిల్లిపుత్తూరునందు వేంచేసియున్నట్టి శ్రీవిష్ణుచిత్తులు భగవంతుని స్వానార్థము రమ్మని పిలుచుచుండగా సేవించునట్టివారమగుదుము) అనియును సాయించినట్లు సదాచార్యసంబంధమే యని నమ్మియుండి, పట్టాభిషేకము కాబోవునట్టి రాజకుమారునకి ముందుదినము రాత్రి మంగళహారతి యిచ్చినట్లు, తనకు తనయాచార్యులు కృపచేసినట్టి జ్ఞానవికాసమును అందుమూలముగ తనకులభించినట్టి కైంకర్యములనున్ను అనుసంధించుకొని, వారివిషయమున కృతజ్ఞుండైయుండుటయు

వీటి యన్నింటికిని సర్వసాధారణముగ (ప్రధానకారణంబై, మోక్షదశయందు ఆత్మకుఁగల భగవదనుభవము విషయముగ, భగవంతుని నిరంకుశ స్వాతంత్ర్యము మూలముగ అనుమానపడునట్టి విచ్ఛేదముకు పరిహారమై యుండునది యెద్దియనఁగా—"ఇరుళకఱ్ఱు మెరికతిరోన్ మండలత్తూడే వైత్తేణివాంగి" (అంధకారమును బోగొట్టునట్టి సూర్యమండలముగుండా పరమపదముకుఁగొనిపోయి పునరావృత్తిలేకుండ చేసినట్టివాఁడు) అనియు, "పోయినాల్ పిన్నై యిత్తిశైక్కెన్ఱుమ్ పిణై కొడుక్కిలుమ్ పోకవొట్టార్" (పరమపదమునుబొందనపిమ్మట యీ లీలావిభూతి కెన్నండును జామీనుగా నుండుటకు గానున్న వచ్చుట కొప్పుకొనరు) అనియు, "వణ్ పుకళ్ నారణన్ తిణ్ కళల్" (కల్యాణగుణాకరుండగు నారాయణుని యొక్క యాశ్రితుల నెడబాయని (శ్రీపాదములు) అనియు, "శన్మశన్మాంతరం కాత్తడియార్ కళైక్కొండుపోయ్ తన్నై పెఱుత్తి తన్ తాళినైక్కీళ్ కొళ్ళుమప్పన్" (జన్మజన్మాంతరములను నివర్తింపఁజేసి దాసులను పరమపదముకుఁగొనిపోయివారి వలన కైంకర్యమును స్వీకరించునట్టి యుపకారకుండు) అనియు, "తన్ తాళినైక్కీళ్ శేర్త్తవన్ శెయ్యుమ్ శేమమే" (తన శ్రీపాద సన్నిధిని చేర్చుకొనునట్టి సర్వేశ్వరుండొనర్చునట్టి రక్షణము) అనియును సాయించినట్లు పునరావృత్తి రాహిత్యము విషయమునను, మునుపు సంసారమునందుంచియున్నప్పుడువలెనే సత్యసంకల్పుండై శేషియైనట్టి శ్రియఃపతియొక్క "పండైనాళాలే నిన్ తిరువరుళుమ్ పంగయత్తాళ్ తిరువరుళుంగొండు నిన్ కోయిల్ శీయ్త్తు" (అనాదికాలముగ అవసరమును నిరీక్షించు

చున్నట్టి భగవత్కృపను, పురుషకారభూతురాలగు పిరాట్టి యొక్క కృపనున్ను లభించి, భగవత్సన్నిధియందు అంతరంగ కైంకర్యముఁ జేయఁగోరెదను) అని చెప్పఁబడినట్లు ''హాజ కారుణ్యా మనుకొని ఆవిషయమునను కృతజ్ఞుఁడు గానుండునది.

ఈ యుత్తరకృత్యము ననుష్ఠించునప్పుడు మనోవాక్కా యంబు లనఁబడునట్టి మూఁడు యింద్రియములచేతనున్ను పరి హరింపవలసినట్టి విషయముల పరిహరించుటచేతను, గ్రహింప వలసినట్టి విషయములను గ్రహించుటచేతను సారభూతంబైనట్టి యుపయోగముండుటను గుఱించి యిఁక మీఁదు తెలుపఁబడును.

''విషస్య విషయాణాంచ దూరమత్యంతమంతరం। ఉప భుక్తం విషంహన్తి విషయాస్స్మరణాదపి'' (విషముకును విష యములకును ఎక్కువ తారతమ్యము గలదు. విషము తినుటచే నశింపఁజేయును. విషయములన్ననో, స్మరించుకొనినమాత్రము నశింపఁజేయును) అనియు, ''ఆవిదిక్కైవైవర్కు మైక్కమ్ శిఱ్ఱిన్బమ్ పావియెనై ప్పలనీకాట్టి ప్పడుప్పాయో'' (స్వతస్సి ద్ధముగ భగవదనుభవ యోగ్యుఁడనైనను, దానినిపోగొట్టుకొని యున్నట్టినాయొక్క మనస్సును శబ్దాదివిషయములమూలముగ పాడుచేసెదవా) అనియును సాయించుటంజేసి పరమపురుషా ర్థవిషయమగు రుచి చెడిపోకుండుటకు గాను త్యజింపవలసిన వాటిలోఁ బ్రధానమైనది శబ్దాదివిషయములయెడలఁగల ప్రీతి.

కృతఘ్నుం డనిపించుకొనకుండుటకు గాను అను సంధించుకొనవలసినవాటిలోఁ బ్రధానంబైనది ఆచార్యుం డొన ర్చినట్టి ప్రథమకటాక్షము మొదలు గాఁగల యుపకారము.

కార్పణ్యము (దైన్యోక్తి) చెడిపోకుండుటకుగాను చెప్ప

కొనకూడని వాటిలోఁ బ్రధానంబైనది యాత్మోత్కర్షము.

ఉపాయనిష్ఠ చెడిపోకుండుటకుఁగాను "సదైవంవక్తా" (ఎల్లప్పుడును ఇట్లు ఉచ్చరించువాడు) అన్నట్లు సర్వదా యుచ్చరించుచుండవలసినవాటిలోఁ బ్రధానంబైనది ద్వయము.

ఈ చేతనుం డొనర్చునట్టి కైంకర్యమును సంతోషపూర్వకముగ స్వీకరించునట్టి మహోపకారుండగు సర్వేశ్వరునియొక్క మనస్సు నొచ్చుకొనకుండుటకుగాను త్రికరణములచేతనున్ను చేయగూడని వాటిని చేసిన మనివిన్నవింపవలసినట్టివాటిలోఁ బ్రధానంబైనది బ్రహ్మవేత్తలవిషయమున నొనర్చినట్టియపచారము.

పురుషార్థరూపము నగు సముద్రము శుష్కించిపోకుండుటకుగాను కరణత్రయముచేతనున్ను చేయవలసినట్టివాటిలోఁ బ్రధానంబైనది భగవత్కైంకర్యమునకు అవధియై శాస్త్రనియమితమైనట్టి యాచార్యాది భాగవతకైంకర్యము.

ఇవ్విధమున తానే స్వయముగ ప్రయోజనంబైనట్టి యాముత్తరకృత్యము రహస్యత్రయమునందు ఫలప్రతిపాదకంబులగు తావులయందు అనుసంధించుకొనునది.

పా॥ పిణవర్ వేణ్డివిలక్కిన్ఱి మేవుమడిమైయెల్లామ్
మణ్డులక త్తిల్ మకిళ్న్దడైక్కిన్ఱనర్ వణువరై
కణ్ణనడైక్కలజ్కొళ్ళక్కడన్ కళ్ కళన్ద్ తియనమ్
పణ్ణమరున్దమిళ్ వేద మఱిన్ద పకవర్కళే॥

టీ॥ వణువరై = శ్రేష్ఠంబైనట్టి ద్వారకయందు, కణ్ణన్ = శ్రీకృష్ణునిచే, అడైక్కలంకొళ్ళ = రక్ష్యవస్తువుగాను స్వీకరింపఁబడినట్టివారును, కడంగళ్ కళిన్ద్ తియ = ఋణనిముక్తులయినట్టివారును, నమ్ = మాయొక్క, పణ్ = గానముతో, అమరుం = అమరియున్నట్టి, తమిళ్ వేదం = ద్రావిడ వేదమును, అఱింద= తెలిసికొనినట్టి వారును, పకవర్కళే=

భగవచ్ఛబ్దరాచ్యులగు ప్రపన్నులు, విణ్ణవర్ = నిత్యసూరులచేత, వెండి = ఆంతరగముతో, విలక్కిన్ఱి=నిరాటంకముగ, షేవుం = స్వీకరింపఁబడునట్టి అడిమై = కైంకర్యములను, ఎల్లాం = అన్నింటిని, వణ్ణులక త్తిల్ = భూలోకమునందు, మకిళ్న్దు=అత్యంతప్రీతితో అనైకిన్ఱనర్ =పొందినవారు

తా॥ ప్రపన్నులే భగవంతునిచే స్వీకరింపఁబడినట్టి వారు పరమపదమున నిత్యసూరులొనర్చునట్టి కైంకర్యమును ఈ లోకమునందే పొందుచున్నారు

శ్లో॥ ప్రణయినమివప్రాప్తంపశ్చాత్ప్రియాః స్వసమన్వితం
మహతి ముహురామృష్టేదృష్ట్వా మనౌ మణిదర్పణే
ప్రపదనధనాస్సన్తశ్శుద్ధైఃప్రభుం పరిభుంజతే
ప్రసృమరమహామోదస్మేరప్రసూనసమైఃక్రమైః॥

టీ॥ ప్రియాః=ప్రియురాండ్రు, పశ్చాత్ప్రాప్తం = తరువాతపొందబడినవాఁడుగా, స్వసమన్వితం=తనతోఁగూడియున్నట్టి, ప్రణయినం=ప్రియుని, ముహురామృష్టే=పలుమారు తుడువబడినట్టి, మణిదర్పణఇవ=మణినిర్మితంబగు అద్దమునందువలె నే, పశ్చాత్ప్రాప్తం=పూర్వమున్నట్టియాకారముచే ప్రతిపాదింపఁబడువాఁడును, స్వసమన్వితం = స్వాశ్రయశేషత్వనిరూపకుండునగు, ప్రభుం = భగవంతుని, ముహురామృష్టే=పలుమారు విచారింపఁబడినట్టి, మనౌ=మూలమంత్రమునందు, దృష్ట్వా= తెలిసికొని, ప్రపదనధనాస్సన్తః = ప్రపత్తి రూపమగు ధనముకలవారగుచు, ప్రసృమరమహామోదస్మేరప్రసూనసమైః = మహామోదమును పరిమళమును గల విరిసి వికసించినట్టి పుష్పములతో సమానములగు, క్రమైః=సేవాక్రమముల చేతను, భుంజంతే=అనుభవించుచున్నారు.

తా॥ తమయొక్క స్వరూపోపాయ పురుషార్థనిష్ఠను యెఱింగియున్నట్టి ప్రపన్నులు చేతనస్వరూపమును తెలుపుటలో ప్రధానంబైనట్టి మూలమంత్రమునందు తమకు శేషిగాను తెలియవచ్చునట్టి భగవంతుని నిరపరాధ కైంకర్యములచే సంతోషింపఁజేసి యనుభవించుచున్నారు.

ఉత్తర కృత్యాధికారము ముగిసెను.



శ్రీమతే నిగమాంతమహాదేశికాయ నమః.

    

# రహస్యత్రయసారము



## పురుషార్థకాష్ఠాధికారము.

శ్లో॥ స్వతంత్రస్వామిత్వాత్స్వబహుమతిపాత్రేషు నియతం
శ్రియః కాంతో దేవస్సకిలు వినియుఙ్క్తే చిదచితౌ।
యథాలోకామ్నాయం యతిపతిముఖైరాహితధియాం
తతో నః కైంకర్యం తదభిమతపర్యంతమభవత్ ॥

టీ॥ శ్రియఃకాంతః=లక్ష్మీపతియగు, దేవః=భగవంతుడు, స్వతంత్రస్వామిత్వాత్ = స్వతంత్రుండును స్వామియు నగుటం జేసి, స్వబహుమతిపాత్రేషు=తన యభిమానమునకు పాత్రులగువారి విషయమున, చిదచితౌ = చేతనాచేతన పదార్థములను, నియతం=అవశ్యముగ, వినియుంక్తే = నియమించుచున్నాడు. తతః=అందువలన, యతిపతిముఖైః = శ్రీరామానుజుల వారు మొదలగువారిచే, ఆహితధియాం=శిక్షింపఁబడినట్టివారమగు, నః=మాయొక్క, కైంకర్యం=కైంకర్యము, యథాలోకామ్నాయం=లోకమునందు వాడుకలో నున్నట్లును, వేదమునందుఁ జెప్పియున్నట్లును, తదభిమత పర్యంతం=భాగవతపర్యంతము, అభవత్=అనుష్ఠింపవలసినది యాయెను.

తా॥ భగవంతుండు స్వతంత్రుండగుటఁ జేసి చేతనాచేతన పదార్థములను తన అభిమానముగల వారివిషయమున నియోగించుచున్నాడు. కావున మేము ఒనర్చునట్టి భగవత్కైంకర్యము లోకవేదానుసారము భాగవతులవరకును చేయవలసినదిగా నేర్పడుచున్నది.

ఈ తాఁవున భగవత్కైంకర్యమును భాగవత కైంకర్యపర్యంత మొనర్పవలసినట్టి దనిగాఁ జెప్పుటకు హేతువేమనఁగా — "పరగతాతిశయాధానేచ్ఛయా ఉపాదేయత్వమేవ యస్య స్వరూపం స శేషః పరశ్శేషీ" (పరుని విషయమున నతిశయమును గలుగఁజేయవలయునను నేడి యిచ్ఛచే ఉపాదేయత్వమే యెవ్వని స్వరూపమో వాఁడు శేషభూతుండని పించుకొనుచున్నాఁడు పరుండు శేషి యనిపించుకొనుచున్నాఁడు) అని వేదార్థ సంగ్రహమునందుఁ జెప్పి యున్నట్లు, సర్వేశ్వరునికి శేష.భూతుండైనయినట్టి యీచేతనుండు వానివిషయమున నొకయతిశయముఁ జేయుట యీతనికి స్వరూపసిద్ధము. అట్టి యతిశయంబనునది వస్తుశక్తికనుగుణముగ రావలయును.

అయితే యీజీవునిచే సర్వేశ్వరుని విషయమునఁ జేయఁదగినట్టి యతిశయఁబెద్దియని వివేచించి చూచినట్లయిన, సర్వేశ్వరునికి శరీరము గుటచేనందుమూలముగ అతిశయముఁగలుగజేయుట యనునది యీతనికిన్ని అచేతనవస్తువుకున్ను రెంటికిన్ని సమానమే. అయితే యీతండువిశేషముగనొనర్పవలసినట్టి యతిశయంబనునది యీతనికిఁగల చైతన్యము మూలముగా నుండగలదు. అందు విషయమున, ఈతండు శాస్త్రవిరుద్ధముగ ప్రవర్తించు నప్పుడు, శాసించువాఁడై దండిచునట్టివాఁడగు సర్వేశ్వరునికి లీలారసముఁగలుగఁజేసి యందు మూలముగ నతనికొక యతిశయముఁ గలుగఁజేయునట్టివాఁడు కావచ్చును. ఈతండు శాస్త్రానుసారము ప్రవర్తించునప్పుడు, "శుభేత్వసాతుష్యతిదుష్కృతేతు నతుష్యతేసాపరమశ్శరీరీ" (అంతరాత్మయగుసర్వేశ్వరుండు ఈచేతనుండు మంచిపనులను

చేయుటచే సంతోషించును. చెడ్డపనులను చేయుటచే సంతోషిం పడు) అన్నట్లు సర్వేశ్వరునికి సంతోషముఁ గలుగఁజేసి వానియొక్క యౌదార్యాది గుణములు వ్యర్థము కాకుండునట్లు వాటిమూలముగ "ఉదారాస్సర్వఏవైతే" అను తావునఁ జెప్పియున్నట్లు సర్వేశ్వరుండు తానే స్వయముగ కొనియాడునట్లు వానికొక యతిశయముఁ గలుగఁజేయునట్టివాఁడగును, అవ్విధముననే, నిత్యులును, ముక్తులును ఈశ్వరుని యభిప్రాయమును ప్రత్యక్షముగాఁ దెలిసికొని యొనర్చునట్టి కైంకర్యముల మూలముగ "ప్రహర్షయిష్యామి సనాథజీవితః" (ఇచ్చటనుండి నిన్ను సంతోషపెట్టగలను) అన్నట్లు వానికొకవిధమైనట్టి భోగముఁ గలుగఁజేసి, అందుమూలముగ వానికొక యతిశయముఁ గలుగఁచేసినట్టి వారగుదురు. ఇవ్విధముగ శాస్త్రముద్వారా సర్వేశ్వరుని యభిప్రాయము నెఱింగి కైంకర్య మొనర్చుటయనునది కృతకృత్యునికిన్ని సమానమే.

ఇందులో, శాస్త్రవిరుద్ధముగ ప్రవర్తించుటచే సర్వేశ్వరునికి లీలారసమును గలుగఁజేయునప్పుడు, తుట్టతుదకు తనకు అనర్థమే గలుగఁగలదు. బద్ధావస్థయందు శాస్త్రము మూలముగను, ముక్తదశయందు ప్రత్యక్షముగను సర్వేశ్వరుని యభిప్రాయము నెఱింగి అందుల కనుగుణముగ ప్రవర్తించునప్పుడు, సర్వేశ్వరుని లీలాది పురుషార్థముతోఁబాటు ఆనుషంగికముగ తనకున్ను తనయొక్క యభిమతంబగు పురుషార్థము సిద్ధింపఁగలదు.

అయితే చేతనుండగు ఈతఁడు బుద్ధిపూర్వముగ ఒక విషయమున ప్రవర్తించునప్పుడు, తనయొక్క పురుషార్థమున్ను

ఆనుషంగికమైనను, అవియీతనిచే నపేక్షింపవలసినదిఅయితే, అది లభించునప్పుడు ఈశ్వరాభిప్రాయము మూలముగా లభింపవలసినదిగాన, అందులకై ఈశ్వరాభిప్రాయమును పరిశీలింపఁగా, అన్నింటికంటెను భాగవతకైంకర్యమతనికి యెక్కువయిష్టమైనదిగాను తెలియవచ్చుచున్నది. ఈ విషయమును గూర్చి.

శ్లో॥ ఆరాధనానాంసర్వేషాం విష్ణోరారాధనం పరం।
తస్మాత్పరతరంప్రోక్తం తదీయారాధనం పరం॥

తా॥ తక్కినవారినందఱిని ఆరాధించుటకంటెను విష్ణువునారాధించుట మంచిది. దానికంటెను మంచిది వాని భక్తులనారాధించుట.

శ్లో॥ మమ మద్భక్తభక్తేషు ప్రీతిరభ్యధికా భవేత్।
తస్మాన్మద్భక్తభక్తాశ్చ పూజనీయా విశేషతః॥

తా॥ నాకు నాభక్తులయెడల యెక్కువ ప్రీతి గలదు. కావున నాభక్తులకు భక్తులయి నట్టి వారు విశేషముగ పూజింపవలసినట్టి వారు.

శ్లో॥ మద్భక్తజనవాత్సల్యం పూజాయాంచానుమోదనం।
మత్కథాశ్రవణేభక్తిః స్వరనేత్రాంగవిక్రియా।
స్వయమారాధవేయత్నో మమార్థేదంభవర్జనం।
మమానుస్మరణం నిత్యం యచ్చమాంచోపజీవతి।
భక్తిరష్టవిధాహ్యేషా యస్మిన్ మ్లేచ్ఛేపి వర్తతే।
సవిప్రేంద్రోమునిశ్శ్రీమాన్ సయాతి స్సచ పండితః।
తస్మైదేయంతతోగ్రాహ్యంసచపూజ్యోయథాహ్యహమ్॥

తా॥ నాభక్తులయెడలదయయు, వారుచేయునట్టి పూజవిషయమున సానుభూతియును, నాచరిత్రలను వినుటయందుప్రీతియును,

అట్టి ప్రీతవశముచున స్వర, నేత్ర, అంగ వికారములనొందుచుండుట యును, స్వయముగనున్న ఆరాధించుటకై ప్రయత్నించుట యును, నావిషయమున డంబము లేకుండుటయును, ఎల్లప్పుడు నన్ను స్మరించుకొనుటయును, అదిలేకున్న క్షణకాలమైనను ధరించియుండజాలక పోవుటయును ఇట్లు యెనిమిది విధములు గల భక్తి మ్లేచ్ఛునియందున్నను, వాడే బ్రాహ్మణశ్రేష్ఠుండు, వాడె ముని, వాఁడే శ్రీమంతుడు, వాఁడే యతి, వాఁడే పండి తుండనియెఱుంగునది. వాని కియ్యవచ్చును. వానినుండిగైకొన వచ్చును. నేనెట్లు పూజ్యుండనో, అట్లే వాఁడును పూజ్యుండు.

శ్లో॥ అనన్యదేవతా భక్తాః యేమద్భక్తజనప్రియాః ।
మామేవశరణంప్రాప్తాః తే మద్భక్తాః ప్రకీర్తితాః॥

తా॥ దేవతాంతరముల నాశ్రయింపక నాభక్తుల యెడల ప్రీతిగలవారై నన్నె శరణుజొచ్చినట్టివారునాభక్తులుగా నెన్నఁ బడుచున్నారు.

శ్లో॥ తస్య యజ్ఞవరాహస్యవిష్ణోరమితతేజసః।
ప్రణామంయేపి కుర్వన్తి తేషామపి నమోనమః ॥

తా॥ యజ్ఞమునందు వరాహరూపిగా నావిర్భవించి నట్టి యపరిమితతేజోవంతుండగు విష్ణువుకు దండము సమర్పిం చునట్టివాని భక్తులకును దండము సమర్పించుచున్నాఁడను

శ్లో॥ తదాశ్రయస్యాశ్రయణాత్ తస్యాశ్రయస్యచ తస్యచ।
సంసేవనాన్నరా లోకే పూయంతే సర్వపాతకైః॥

తా॥ భగవంతుని యాశ్రయించినట్టి భాగవతుల నా శ్రయించుటవలనను వారి నాశ్రయించినట్టివారినినిన్ని వారి నాశ్రయించినట్టివారినిన్ని యివ్విధముగ వాని దాసానుదాసు

ఆ నాశ్రయించుటవలననున్ను మానవులు పాపవిముక్తు లగు చున్నారు,

ఈ పైని యుదహరించిన ప్రమాణములను పరిశీలించితి మేని, రాజకుమారిని ముద్దులాడుట రాజు కభిమతంబగునట్లు భాగవతులయెడల నొనర్పంబడునట్టి కైంకర్యము భగవంతుని కెక్కువ యభిమతంబు కాఁగలదు. కావున శేషభూతుం డగు ఈ చేతనుండు యొనర్చునట్టి కించిత్కారములలో భాగవత కైంకర్యము ప్రధానమైనది కాఁగలదు.

ఈ విషయమును గుఱించి తత్త్వవేత్తలంగీకరించునట్టి ప్రమాణపరణినిబట్టి చూచినట్లయిన,

శ్లో॥ యేయజన్తిపితౄన్ దేవాన్ బ్రాహ్మణాన్ సహుతాశనాన్।
సర్వభూతాంతరాత్మానం విష్ణుమేవ యజంతి తే॥

తా॥ ఎవ్వారలు పితృవులనున్ను, దేవతలనున్ను, నిత్యాగ్నిహోత్రులగుబ్రాహ్మణులనున్ను పూజించుచున్నారో, వారు అందుమూలముగ విష్ణువునే పూజించుచున్నారు,

ఈ పైప్రమాణమువలన సర్వేశ్వరుండే భాగవతులలో నంతరాత్మగానుండి పూజింపబడుచున్నాడు. "మమ ప్రియః" (నాభక్తుండు నాకు మిక్కిలి ప్రియుండు) అన్నట్లు, పరమైకాంతివిషయమున ప్రీతిపరవశుండైనట్టి భగవంతుని యొక్క యభిప్రాయమునుబట్టిచూస్తె, "జ్ఞానీత్వాత్మైవమే మతం" (జ్ఞానవంతుండు నాయాత్మయని తలంచుదును) అన్నట్లు, భాగవతులవిషయమున నొనర్పంబడునట్టి కైంకర్యమును వారి కంతరాత్మయగు తనవిషయమున నొనర్పఁబడినట్టి దానినిగానుతలంచి భగవంతుండుసంతోషించును.

ఇట్లు భాగవత కైంకర్యము శేషికి (భగవంతునికి) యిష్ట మన్నమాట మాత్రమే కాదు, శేషత్వరూపమగు సంబంధ మున్ను సద్వారకముగాను నుండవచ్చును. అది యెట్లనిన, “నిత్యం శ్రియాసమేతస్య భక్తైరాత్మవతస్సదాసహసద్వారకంచ స్యాచ్ఛేషిత్వం పరమాత్మనః” (ఎల్లప్పుడును పిరాట్టితోను భక్తులతోనును గూడియుండునట్టి పరమాత్మయొక్క శేషిత్వము సద్వారకముగాను నుండగలదు) అనఁగా స్వతంత్రుండై స్వేచ్ఛగ ప్రవర్తించునట్టి రాజు తాను ధరించినట్టి యాభరణములనున్ను, మాలలనున్ను సేవకులయొక్కయును, గుఱ్ఱములు యేనుగలు మొదలగు వాటియొక్కయును మెడలో వేయునట్లు, “అడియార్కెన్నైయాట్ పడుత్త విమలన్” (తన దాసులకు నన్ను దాసునిగాఁజేసినట్టి నిర్మలుండు) అనియు “నారదోహ మనుప్రాప్తః త్వద్దర్శన కుతూహలాత్। ప్రభవో భగవద్భక్తా మాదృశాం సతతం ద్విజ” (ఓ బ్రాహ్మణోత్తమా! నారదుండనఁబడునట్టి నేను నీదర్శనమునకై వచ్చినాడను. మావంటివారికి భగవద్భక్తులే అన్నింటికిని సమర్థులు) అనియు, “మత్తు నుమోర్ తైవముళ తెన్నిరుప్పారోడొత్తిలేన్ ఉత్తు మున్నడియార్కడిమై” (నీకంటెను వేఱొక్కండు దైవంబని తలంచియుండునట్టివారి చెంత చేరను నేను ఇష్టపడునది నీదాసుల కైంకర్యము) అనియును సాయించినట్లు అత్యంత పారతంత్ర్యాదులమూలముగ భగవంతునికి ఇష్టము వచ్చినట్లు ఉపయోగించుకొనుటకుఁ దగివదియగుటంచేసి, భగవచ్ఛేషత్వము యావదాత్మభావియైనందువ భాగవత శేషత్వ పర్యంతమైనదిగా నేర్పడుచున్నది. భాగవతత్వమువలన స్వ

రూపసిద్ధమైనట్టిది యును, “గుణైర్దాస్యముపాగతః” (గుణములనుబట్టి దాసుండనైనాఁడను) అను న్యాయప్రకారము గుణజ్ఞానమూలముగ స్వేచ్ఛచేతను వచ్చినట్టిదియును నగు భాగవతశేషత్వము ఈపైని యుదహరించిన ప్రమాణమునందు “భగవద్భక్తాః” “మాంప్రశాం” అను ఈరెండు పదముల చేతను సూచింపఁబడుచున్నది

ఈభాగవతశేషత్వము విక్రయార్హంబగుటనుగూర్చి “పేశు నారడియార్క్కు లెల్ తమ్మై విర్కవుమ్ పెరువార్కళ్” (భగవన్నామ సంకీర్తనపరులగు భాగవతులకు దాసులయినట్టివారు వారికి దాసులమగు మమ్ములను విక్రయించుటకున్ను అధికారముగలవారు) అను తావున కల్పసూత్రవ్యాఖ్యాతలగు శ్రీపెరియాళ్వారులు సాయించియున్నారు. ఈ భాగవతశేషత్వము తిరుమంత్రమునందలి మధ్యమపదముయొక్క (నమః అనుదానియొక్క) తాత్పర్యార్థము. ఈ యర్థమును అనుసంధించుకొనినట్లయిన, ఈ శేషత్వము సద్వారకముగాను అద్వారకముగాను నున్నట్టివిధమున, శేషత్వవృత్తియగు కైంకర్యమున్ను అటులనే యుండగలదు. కావున తన శక్తికి అనుగుణముగ భగవత్కైంకర్యముయొక్క సాక్షాత్కారముయొక్క వృద్ధియైపురుషార్థముయొక్క యవధియగు భాగవతకైంకర్యమును వ్యర్థముకాకుండ యనుష్ఠించుట ఆవశ్యకము.

ఇది “భర్తృభృత్యగణస్యచ” (యజమానునికిని వాని భృత్యులకును) అనియు, “ఆప్తో విష్ణోరనాప్తశ్చ ద్వేధా పరికరస్స్మృతః । నిత్యోవంద్యోవచానిత్యః కర్మవశ్యో ముముక్షుభిః” (విష్ణువుయొక్క పరికరము ఆప్తమనియు అనాప్తమ

నియును రెండువిధములుగలది. వారిలో నిత్యులు నమస్కార యోగ్యులు నిత్యులుకాకుండ కర్మవశ్యులయినవారు నమస్కారయోగ్యులు కారు) అనియును పౌష్కరాదులయందుం జెప్పియున్నప్రకారము పతివ్రతాధర్మవాచకున్నట్టి పరమైకాంతిత్వముకు మిక్కిలి యుచితంబైనది సర్వేశ్వరుని యిష్టము ననువర్తించిపోవుటయేగాన, వేఱొక్క హేతువునుబట్టి కాకుండ, అనన్యార్హశేషత్వమునుబట్టియే ఈయన్యశేషత్వముస్వరూపవిరుద్ధముకాదు.

ఈ భాగవతశేషత్వము స్వాభావికమైనదా? ఔపాధికమైనదా? అనఁగా నేదైన నొక దానిని నిమిత్తీకరించుకొని యుండునదియా? యంటివేని, కర్మాదులనిమిత్తముగ కాక, నిత్యాభివాంఛిత పరస్పరనీచభావైః" (ఒక్కరివిషయమున వేఱొక్కరు నైచ్యానుసంధానముఁజేయుచు) అన్నట్లు యాతదాత్మభావియై ముక్తావస్థయందును అనువర్తించునదియని చెప్పియున్నందున, స్వభావసిద్ధమనియును చెప్పవచ్చును. భగవత్సంబంధజ్ఞానమును నిమిత్తీకరించుకొని యుండునది యగుటంజేసి యౌపాధికమనియును చెప్పవచ్చును.

అట్లయితే, ఎవ్వరయిన యిద్దఱికి భాగవతత్వమున్నట్లయిన, ఒక్కరివిషయమున వేఱొక్కరికి శేషత్వమున్ను శేషిత్వమున్ను యుండియుండుట విరుద్ధము కాదా? యంటివేని, ఇద్దఱిలో నొక్కరు వేఱొక్కఱిని పరస్పరము ఉపకరించుకొనునప్పుడు, ఉపకార్యోపకారక భావములు విరుద్ధంబులు కానట్లు, ప్రకృతమునను విరోధము లేదు. *అధికార్యవస్థయందు

* కైంకర్యము లేకుండ, శేషత్వరూపమగు అధికారము సిద్ధింపదు

క్రియకు శేషియైనవాఁడే కర్తృత్వావస్థయందు దానికి శేష
భూతుండుగానున్నాఁడు. అట్లే పరస్పరము ఒనర్చునట్టి యతిశ
యంబులను హేతువులనుగాఁ గొనకుండ, ఒక్కరికొక్కరు అతి
శయముఁ గలుగఁ జేసికొనకనట్లయిన, అట్టి యతిశయాధానము
రూపముగ ఉభయులకును శేషత్వముండవచ్చును. అట్టి యతిశ
యమునకు ఆశ్రయమగుట మూలముగ ఉభయులకును శేషిత్వ
మున్ను ఉండవచ్చును. ఇవ్విధమున భగవదిచ్ఛచేత ఉభయు
లును పరస్పరము అతిశయమును గలుగఁజేయునట్టివారుగా
నియమితులగుటంజేసి, ఉభయులకును భాగవత శేషత్వ సంబం
ధము ప్రమాణ సిద్ధము.

గుణములచే నాకర్షింపఁబడుటచే తనయొక్క యిచ్ఛవ
లన భగవద్విషయమందునున్ను భాగవత విషయమునను
తానువర్తించునట్టి దాసత్వము భోగవర్ధకంబై తనయందొక
విశేషముగా నుండగలదు. ఈ సందర్భమున సర్వేశ్వరుండు
స్వాతంత్ర్య సహకృతంబగు తనయొక్క యిచ్ఛవలన భాగవ
తుల కందఱికిని శేషిత్వమును గలుగఁజేయును. వీరియొక్క
యిష్టమునున్నగాని, వీరికి భాగవత శేషత్వమును గలుగఁజే
యును. ఇట్లు స్వామికి ఇష్టమువచ్చినట్లు ఉపయోగపఱచుకొ
నుటకుఁ దగినట్టివారైయుండి శేషిగానుండుటంజేసి, యుభయు
లును తమతమ స్వరూపములను కాపాడుకొనుచున్నారు. ఇట్లు
భగవంతుని కిష్టంబగు భాగవత శేషత్వమున్ను దాని ఫలమగు
భాగవత కైంకర్యమున్ను సిద్ధించుటంజేసి, ఉభయులును పురు

గాన, అధికార్యవస్థయందు కైంకర్యము కాశ్రయమగుటచే శేషియైనవాఁడే
కైంకర్యము నొనర్చునప్పుడు అందుమూలమున శేషభూతుండగుచున్నాఁడు.

ప్రాప్తిని పొందినవారయినారు. ఉభయులకున్ను ఇవ్విధ
మున పరస్పరము శేషభూతులనుగాను శేషియైనట్టివారినిగా
నున్ను నియమించి యనుభవించుటంజేసి సర్వేశ్వరుండునుతన
యొక్క యీశ్వరత్వమునున్ను భోక్తృత్వమునున్ను కాపాడు
కొనినాడు. ఇవ్విధముగ తమకులభించినట్టి శేషత్వ శేషిత్వా
దులన్నియును సర్వేశ్వరుని భోక్తృత్వముకు శేషమని (వాని
యనుభవమునకై యేర్పడినవని) తెలిసికొని యుండుటంజేసి
వీరికి సర్వోత్తమమగు భాగవతశేషత్వము ఉండగలదు.

ఇట్లు నిశ్చితార్థులై సారవేత్తలైనట్టి కృతకృత్యులకు
అపరాధరుచియును, అతిశంకయును, అన్యదేవతాస్పర్శమును,
ఆత్మాధీనభోగమును, ఆత్మార్థభోగమును ఇవ్విధములగుదోష
ములులేనట్టి పరమైకాంతులయొక్క యనుగ్రహమె ఎల్లప్పు
డును స్వయంప్రయోజనముగా నపేక్షింపవలసినది.

పా॥ వేతమఱిన్దవకవర్ వియక్క విళఙ్గియశీర్
నాదన్ వకుత్తవక్కై పెఱునామవనల్లడియార్
కాతరమిక్కవడిమైయిల్ శేర్న్దపిరియామనైనూల్
నీదినిఱుత్తినిలైకులైయావక్కైనిన్దనమే॥

టీ॥ విళంగియశీర్=ప్రకాశమానంబగు గుణముచేత, నాదన్=భగ
వంతునిచే, వకుత్త=సంకల్పింపఁబడినట్టి. వక్కై=భాగవతశేషత్వమును పెఱు
నాం=లభించినట్టిమేము, వేదమఱిన్దపకవర్=వేదవేదాంతములనుగుర్తెఱిం
గినవారు, వియక్క=విస్మయపడునట్లు, అవనల్లడియార్క్కు=వానికిష్టులగు
మాకు, ఆదరంమిక్క=మిక్కిలియాదరణతో. అడమై=కైంకర్యమును,
ఇశైందు=ఒప్పుకొని, అయామనైనూల్ నీదినిఱుత్తినిలై=నాశరహితం
గు వేదశాస్త్రముచే స్థాపింపఁబడినట్టిస్థితి, కులైయావక్కై=చెడిపోకుండు
నట్లు, నిన్దనమే=ప్రవర్తించుచున్నాము.

తా॥ భాగవత శేషత్వపర్యంతమగు భగవచ్ఛేషత్వము గలవారమగు మేము, వేదాంతాభిజ్ఞులగు భాగవతులు విస్మయమును బొందునటు భాగవత కైంకర్యమును ఆదరణతో నంగీకరించి "యథా దేవే తథా గురౌ" ఇత్యాది వేదమార్గానుసారముగ ప్రవర్తించుచున్నాము.

శ్లో॥ నాథేన తృణమన్యదన్యదపి వా తన్నాభినాళీకినీ
నాళీకస్పృహణీయసౌరభముచా వాచా న యాచామహే।
శుద్ధానాంతు లభేమహి స్థిరధియాం శుద్ధాంతసిద్ధాంతినాం
ముక్తైశ్వర్యదినప్రభాతసమయాసత్తిం ప్రపత్తిం ముహుః॥

టీ॥ తృణం = ఐహికమగు ఐశ్వర్యమును తృణకల్పముగాను, అన్యత్ = దానికంటె విలక్షణమగు కైవల్యమున్ను తృణకల్పముగా దలంచి, అన్యదపి వా = మోక్షమునైనన్ను, నః = మాయొక్క, తన్నాభినాళీకినీ = భగవంతుని నాభియనెడి సరస్సునందుండు, నాళీకస్పృహణీయసౌరభముచా = పద్మమువలె మనోహరమైనట్టి గంధమును బయటికి పంపునట్టి, వాచా = వాక్కుచేతను, నాథే = భగవత్సన్నిధియందు, న యాచామహే = యాచింపము. శుద్ధాంతసిద్ధాంతినాం = పిరాట్టియొక్క సిద్ధాంతమును (పారతంత్ర్యమును) నిరూపించునట్టివారును, స్థిరధియాం = స్థిరమైనట్టి యధ్యవసాయము గలవారునగు, శుద్ధానాం = ప్రపన్నులయొక్క, ముక్తైశ్వర్య ప్రభాతసమయాసత్తిం = ముక్తైశ్వర్యమనెడి ప్రాతఃకాల సంబంధరూపమగు, ప్రపత్తిం = భాగవతానుగ్రహమును, లభేమహి = స్వయంప్రయోజనముగాను కోరుచున్నాము,

తా॥ ఐహికమగు ఐశ్వర్యమున్ను కైవల్యమున్ను తృణసదృశములనుగాను తలంచియున్నట్టి మేము మావాక్కుతో మోక్షమునున్ను ఓసంగమని భగవంతుని యాచింపము పిరాట్టివలెనే పారతంత్ర్యమునే ప్రధానముగా నవలంబించినట్టి భాగవతులయొక్క యనుగ్రహమునే కోరుచున్నాము.

పురుషార్థకాష్ఠాధికారము ముగిసెను.



శ్రీమతే నిగమాంతమహాదేశికాయ నమః.







# రహస్యత్రయసారము



## శాస్త్రీయనియమనాధికారము.

శ్లో॥ ముకున్దే నిక్షిప్య స్వభరమనఘో ముక్తవదసౌ
స్వతన్త్రాజ్ఞాసిద్ధాం స్వయమవిదితస్వామిహృదయః।
పరిత్యాగే సద్యస్స్వపరవివిధానర్థజననా
దలంఘ్యామామోక్షాదనుసరతి శాస్త్రీయసరణిం॥

టీ॥ ముకుందే = భగవంతునియందు, స్వభరం = స్వరక్షణభారమును, నిక్షిప్య = ఉంచి. అనఘః = పాపరహితుండగు, అసౌ = ఈ ప్రపన్నుండు, ముక్తవత్ = ముక్తపురుషునివలెనే, పరిత్యాగే = శాస్త్రీయపద్ధతిని పరిత్యజింపఁగా, సద్యః = వెంటనే, స్వపరవివిధానర్థజననాత్ = తన విషయమునను తాను అనుష్ఠించినట్లు అనుష్ఠించునట్టివాఁగు ఇతరుల విషయమునను అనర్థమును కలుగఁజేయుటంజేసి, స్వయం = స్వయముగ, అవిదితస్వామిహృదయః = స్వామియొక్క యభిప్రాయము నెఱుంగనివాఁడై, అలంఘ్యాం = అతిక్రమింపకూడనిదియగు శాస్త్రీయపద్ధతిని, ఆమోక్షాత్ = మోక్షముగలుగువరకును, అనుసరతి = అనుసరించుచున్నాడు.

తా॥ ప్రపన్నుండు ముక్తునివలె శాస్త్రీయపద్ధతిని అనుసరింపక పోయినట్లయిన, తనకును ఇతరులకును అనర్థమును కలుగఁజేయునుగాన, మోక్షముగలుగువరకును శాస్త్రీయపద్ధతిని అనుసరించి ప్రవర్తించుచున్నాడు

ఈ శేషత్వసంబంధము మూలముగ భగవంతుని విషయమునను, భాగవతుల విషయమునను ఈతండు కైంకర్యము నొసర్చుట శాస్త్రసమ్మతమగు రుచివలననా? శాస్త్రసమ్మతము కానట్టి రుచివలననా? యంటివేని, అజ్ఞానాంధకారశూన్యమగుజ్ఞానముతో నుండునట్టియీతనికి శాస్త్రము చేతిదీపమువంటిదిగానుండవలయునుగాన,నది శాస్త్రానుగుణంబై, శాస్త్రము వికల్పముగా విధించినట్టి తావులను మాత్రము రుచ్యనుగుణముగాను నుండగలదు. అది యెట్లనిన, శ్రీ రామానుజులవారు పరమపదమునకు వేంచేయునట్టి సమయమునందు తమసన్నిధిని సేవచేయుచున్నట్టి స్వాములయొక్క యార్తింజూచి, కృపతో వారింబిలిచి "మావియోగకాలమునందు దేహత్యాగముచేయ నిశ్చయించుకొనినవా రున్నట్లయిన ,వారు శ్రీయాళవందారుల శ్రీపాదములకు దూరమగుదురు. నాతో వారికి సంబంధము లేదు" అని సాయింపఁగా, వారది విని మిక్కిలి శోకార్తులై "స్వామీ! మేము యిఁక చేయవలసినది యేమి" అని విన్నవింపఁగా, శ్రీరామానుజులవా రిట్లు సాయించిరి.

ఒక్కండు ప్రపన్నుండైనట్లయిన, అతని యాత్మయాత్ర భగవదధీనంబుగాన,తనకుదానితో సంబంధములేదు.సంబంధమున్నదనుకొనినట్లయిన, తానొసర్చినట్టి యాత్మ సమర్పణము అసత్య మగును.

దేహయాత్ర కర్మాధీనముగాన, దానికై వగవంబని లేదు. వగచెనా, నాస్తికుండగును. కావున ఆత్మయాత్రతోఁగాని దేహయాత్రతోఁగాని యీతనికి సంబంధము లేదు

అయితే మనోవాక్కాయంబు లనఁబడు త్రివిధకరణములఁగొని ఇష్టమువచ్చినట్లు ప్రవర్తించితే చాలునా? అంటారేమో, అది యీతనికి స్వరూపము కాదు. ఉపాయాంశమున ఈతనికి సంబంధము లేకపోయినప్పటికిని, ప్రాప్యంబగు కైంకర్యమునందు మనోవాక్కాయంబులను వినియోగపఱచునది. ఈ లోకములోనున్నంతకాలము ఈతండు చేయవలసినట్టి కైంకర్యము లయిదు కలవు. అవి యేవియనఁగా—శ్రీభాష్యమును చదివి దానిప్రకారము ప్రవర్తించునది. అందులకు శక్తిలేకున్న, ఆళ్వారాదులు సాయించిన నాలాయిర ప్రబంధమును సేవించి ప్రవర్తించేది. అందులకు యోగ్యతలేకున్న, దివ్యదేశముల యందు బియ్యము బాగుచేయుచు, గంధము తీయుచును, దీపములను బెట్టుచు, మాలలను కట్టుచుండునది. అందులకు యోగ్యత లేకున్న, ద్వయార్థము ననుసంధించుకొనునది. అందులకు యోగ్యతలేకున్న, తనవాడని అభిమానించుకొనునట్టి యొక శ్రీవైష్ణవుని యభిమానములో నొదిగియుండి ప్రవర్తించునది.

ఇట్లు ప్రవర్తించునట్టి యధికారికి ముందుగ విమర్శించి ప్రవర్తింపవలసినట్టి విషయములు మూఁడు కలవు. అవియేవి యనఁగా—అనుకూలులు, ప్రతికూలులు, అనుభయులు అను ముగ్గురుకలరు. అనుకూలులు శ్రీవైష్ణవులు. ప్రతికూలులు భగవద్విరోధులు. అనుభయులు ఈరెండును లేనట్టిసంసారులు. వీరిలో, అనుకూలులనఁబడు శ్రీవైష్ణవులఁ జూచినట్లయిన, చందనకుసుమాదులఁజూచినట్లును వెలుతురును చల్లగాలిననుభవించినట్లును, ప్రియమైనట్టి మంచిపదార్థములఁ జూచినట్లును సంతోషముతో ప్రవర్తించునది. ప్రతికూలు లనఁబడు భగవద్ద్వేషులఁజూచి

నట్లయిన, సర్పాగ్నులఁజూచినట్లు భయపడుచు ప్రవర్తించునది. అనుభయు లనఁబడు సంసారులఁ జూచినట్లయిన, కొయ్యాను, మట్టిగడ్డను జూచినట్లు తృణీకరించి ప్రవర్తించునది.

వీరు అనుకూలులై వచ్చినట్లయిన, వీరికి జ్ఞానముఁగలుగఁ జేయునది. అనుకూలింపక పోయినట్లయిన, అయ్యో! యని వారిని దయతోఁజూచునది.

ఇట్లు ప్రవర్తింపకుండునట్లు చేయునది అర్థకామముల విషయమునఁగల ప్రీతి. అర్థకామముల మూలముగ శ్రీవైష్ణవుల నాదరింపక పోయినట్లయిన, సార్వభౌముండగు రాజుయొక్క సన్నిధిలో ఆరాజకుమారులను అవమానపఱచినట్లయిన, రాజుయొక్క మనస్సు నొచ్చునట్లు, భగవంతుని మనస్సున్ను నొచ్చును.

అర్థకామముల మూలముగ ప్రతికూలుల నాదరించినట్లయిన, రాజు సార్వభౌముండైయుండ, రాజమహిషి క్షుద్రుల యిండ్లనుజోలెకట్టుకొని బిచ్చమెత్తుకొని నట్లయిన, రాజుకు అప్రఖ్యాతికరంబై, యందుమూలముగ ఆమెపై యతని మనస్సుకు కష్టము కలుగునట్లు, సర్వేశ్వరునిమనస్సుకు కష్టము కలుగును.

అనుభయు లనఁబడు సంసారులను అర్థకామముల మూలముగ ఆదరించునట్లయిన, రత్నమున్ను, రాతికిన్ని తారతమ్యము నెఱుఁగనట్లు, యీతనికిఁ గలిగినట్టి జ్ఞానమువలన నుపయోగము లేదనుకొని, భగవంతుండును ఈతని విషయమున ఆదరము లేనివాఁడగును,

ఇట్లు శ్రీభాష్యకారులవారు సాయించినట్టి యుక్తిరక్షకత్వము విషయమున,

శ్లో॥ కులటాషండ పతిత వైరిభ్యః కాకణీమపి।
ఉద్యతామపి గృహ్ణీయాత్ నాపద్యపి కదాచన॥

తా॥ వ్యభిచారిణులనుండి కాని, నపుంసకుల నుండి కాని, పతితులనుండి కాని, వారు ఈయవచ్చినను, తాను కష్టస్థితులో నున్నప్పటికిన్ని, వారినుండి యొక గవ్వనైనను స్వీకరింపకూడదు.

శ్లో॥ పరరంధ్రేషు జాత్యంధాః పరదారేష్వపుంసకాః
పరివాదేషు యే మూకాః తేతీవ దయితా మమ॥

తా॥ పరుల తప్పులను గన్పెట్టని వారును, పరదారాసంగమముఁ జేయని వారును, పరులను నిందింపనివారును నాకు మిక్కిలి యిష్టులు.

ఈ పైవాక్యములయందుఁ జెప్పియున్నట్లు, ధర్మవిరుద్ధములగు అర్థకామములు చేంతజేరకుండ చేయఁబడి నందున, ధర్మవిరుద్ధములుకానట్టి యర్థకామములను నిమిత్తీకరించుకొని యైనను అనుకూల ప్రతికూల ఉదాసీనుల విషయమునతనకుఁ గలయధ్యవసాయమును చెడుపుకొనకూడదని యభిప్రాయము.

అందులోను అనుకూలు లనఁబడు శ్రీవైష్ణవులను అనాదరణ చేయుగూడదను విషయము శ్రీశాండిల్యస్మృతియందు,

శ్లో॥ అనాదృతసుతం గేహీ పురుషంనాభినందతి।
తథానర్చిత సద్భక్తం భగవాన్నాభినందతి॥

తా॥ గృహస్తుండు తన పుత్రుని యాదరింపని వానిని

ప్రేమింపని చందంబున, భగవంతుండును తన భక్తుని యాద
రింపనివానిని ప్రేమింపడు.

అని యిట్లు చెప్పఁబడినది. ప్రతికూలు లనఁబడు భగ
వద్విరోధులతో సంబంధము కూడదను విషయమును గుఱించి
శ్రీ మహాభారతమునందు,

శ్లో॥ యేద్విషన్తి మహాత్మానం నస్మరంతిచ కేశవం।
న తేషాం పుణ్యతీర్థేషు గతిస్సంసర్గిణామపి॥

తా॥ ఎవ్వరలు మహాత్ముండగు కేశవుని ద్వేషించుచు
వానిని స్మరింపరోఁ అట్టివారికి పుణ్యతీర్థములకుఁ బోవుట
కర్త్వాతి లేదు.

అనుతావున చెప్పఁబడినది. అట్లే,

శ్లో॥ మూర్ఖైః పాపరతైః క్రూరైః భగవచ్ఛాస్త్రదూషకైః।
సంబంధం నాచరేద్భక్తః నశ్యత్యేతైస్తు సంగమే॥

తా॥ మూఢులును, పాపాత్ములును, క్రూరులును భగ
వచ్ఛాస్త్ర దూషకులును నగు వారితో సంబంధమును గలుగఁ
జేసికొనకూడదు. అట్టివారితోఁ గల సంబంధము మూలముగ
భగవద్భక్తి నశించుచున్నది.

ఈ తావున ప్రతికూలులతోఁ గల సంబంధము భగ
వంతుని విషయమగు ప్రీతిని నశింపఁజేయునని చెప్పఁబడినది.

ఉదాసీను లనఁబడు సంసారులను తృణప్రాయు లను
గాఁ జూచునదియను విషయము,

శ్లో॥ అద్యప్రభృతిహేలోకాయూయంయూయంవయంవయం।
అర్థకామ పరా యూయం నారాయణ పరా వయం॥

తా॥ ఓజనులారా! ఇప్పటినుండి మీరు మీరే, మాకు

మేమే. మీతో మాకు సంబంధము లేదు, మీరు అర్థకామ
పరులు. మేమో భగవద్ధ్యానపరులము.

శ్లో॥ నాస్తిసంగతి రస్మాకం యుష్మాకంచ పరస్పరం।
వయంతు కింకరావిష్ణోః యూయమింద్రియ కింకరాః॥

తా॥ మాకున్ను మీకున్ను పరస్పరము యెవ్విధమైన
సంబంధమున్ను లేదు. మేమో విష్ణువుయొక్క కింకరులము,
మీరో ఇంద్రియ కింకరులు అనఁగా శబ్దాది విషయానుభవ
పరు లనుట.

ఈపై ప్రమాణములయందు సుప్రసిద్ధము.

ఇట్లు విమర్శించి ప్రవర్తింపవలసినది యని సాయించినట్టి
యర్థము శాస్త్రముచేతనే తెలియఁదగిన దగుటంజేసి, శాస్త్రీ
యంబులయినట్టి వాటికుపలక్షణముగ నారను నెత్తి వీరుసాయిం
చినట్టికైంకర్యములున్ను ఈచేతనునికియిష్టమువచ్చిన విధమున
చేయకూడని వైనందున, శాస్త్రోక్తంబగు నియమముతో నా
చరించినట్లయిన, నవికైంకర్యములనిపించుకొనుచున్నవని సూచిత
మైనది

“ఇష్టము వచ్చినట్లు నడుచుకుంటె చాలునా?” అని
స్వాయులనఁగా, అది స్వరూప విరుద్ధంబగునని శ్రీభాష్యకా
రులవారు సాయించినందున, “అశాస్త్రమాసురం కృత్స్నం”
(శాస్త్రవిరుద్ధమైనది యంతయును ఆసురస్వభావమైనది) అని
శ్రీయాళవందారులు సాయించినట్లు, శాస్త్రవిరుద్ధంబులయినవి,
దేవస్వభావుండగు ఈతని స్వరూపమునకు ననుకూలింప నివి
యైనందునను, “శ్రుతిస్మృతిర్మమైవాజ్ఞా యస్తాముల్లంఘ్య
వర్తతే। ఆజ్ఞాచ్ఛేదీ మమద్రోహీ మద్భక్తోపి న వైష్ణవః”

(శ్రుతిస్మృతులు నాయొక్క యాజ్ఞ- వాటి నతిక్రమించి నడుచుకొనునట్టివాడు నాయాజ్ఞను తిరస్కరించినవాడు కావున తంతః నాయెడల ద్రోహముచేసినట్టివాడు. అట్టివాడు నాకు భక్తుండైనను వైష్ణవుండు కాడు) అని కైంకర్యమును స్వీకరించునట్టివాడే (సర్వేశ్వరుండే) చెప్పి యున్నందునను, ఈచేతనుండు ఈశరీరముతో నున్నంతవరకు శాస్త్రపరవశ్యుండై కైంకర్యము నొనర్పవలయునని యభిప్రాయము.

"నిజకర్మాది భక్త్యంతం కుర్యాత్ప్రీత్యైవ కారితః।
ఉపాయతాం పరిత్యజ్య న్యస్యేద్దేవేతు తామభీః" (స్వకీయ కర్మ మొదలుకొని భక్తివరకును ప్రీతిమూలముగానే చేయవలసినది వాటి విషయమున ఉపాయత్వబుద్ధి నుంచదగదు. అట్టిబుద్ధిః భగవంతునియందే యుంచునది) అని గీతార్థ సంగ్రహమునందు "ప్రీత్యైవ" అనుతావున అవధారణార్థమువలన సాధనత్వబుద్ధి కూడదన్న విషయము "ఉపాయతాం పరిత్యజ్య" అనుతావునవివరించియుండుటంజేసి స్పష్టము. శాస్త్రీయ కైంకర్యము యొక్క ప్రేరకత్వాతిశయము వివక్షితమైనను, "నిజకర్మాదిభక్త్యంతం" అను వాటియొక్క స్వరూపము విషయమున శాస్త్రమే ప్రమాణమను విషయము "నిజకర్మ" శబ్దముచే తెలుపఁబడినది. ఈ శాస్త్రీయ నియమనము

శ్లో॥ అవిప్లవాయధర్మాణాం పాలనాయ కులస్యచ।
సంగ్రహాయచలోకస్య మర్యాదాస్థాపనాయచ॥
ప్రియాయమమవిష్ణోశ్చ దేవదేవస్య శార్ఙ్గిణః।
మనీషీవైదికాచారం మనసాపినలంఘయేత్॥

తా॥ ధర్మములు నశింపకుండుటకుగాను, వంశము

నుశాపాదుటకుగాను, లోకసంగ్రహార్థముగాను, దేవదే
వుండును శార్ఙ్గధరుండును, విష్ణువునగు నాయొక్క ప్రీతికిగా
నును బుద్ధిమంతుండైనట్టివాఁడు వేదశాస్త్రోక్తంబగు ఆచార
మును విడనాడుటకు తలపనుగూడ తలంపగూడదు.

అని ప్రపత్త్యధ్యాయమున సుప్రసిద్ధముగాఁ దెలుపఁ
బడినది. ఈ ప్రకారము నడుచుకొనకపోవుటచే సంభవించునట్టి
యనిష్టమును గుఱించి,

శ్లో॥ యథాహివల్లభో రాజ్ఞో నదీమాజ్ఞాప్రవర్తితాం।
లోకోపయోగినీం రమ్యాం బహుసస్యవివర్ధినీం॥
లంఘయన్ శూలమారోపేత్ అనపేక్షోపి తాంప్రతి।

తా॥ రాజాజ్ఞచే యేర్పడినదియు, లోకోపకారకమైన
దియు, సుందరమైనదియు, పైరులను వృద్ధిఁ జేయునదియునగు
నదిని పాడుచేసినట్లయిన, అందువలన తనకెట్టియును ప్రయో
జనము లేకపోయినప్పటికిన్ని, అట్టివాఁడు రాజుచే శిక్షింపఁబడు
చున్నాడు. అట్లే,

శ్లో॥ ఏవంవిలంఘయన్ మర్త్యో మర్యాదాం వేదనిర్మితాం॥
ప్రియోపినప్రియోసౌ మే మదాజ్ఞావ్యతివర్తనాత్॥

తా॥ ఇవ్విధముగ వేదశాస్త్రనిర్మితంబగు ఆచారము
ను అతిక్రమించినడుచుకొనునట్టివాఁడు నాయాజ్ఞను మీరినట్టి
వాఁడుగాన, అతండు ముందు నాకుప్రియుండైనను ప్రస్తుతము
నాకు ప్రియుండు కాఁడు.

అని తరువాతి శ్లోకములయందుఁ జెప్పఁబడినది.

ఈ భగవదపచారమునకుగాను క్షమాపణమును కోరు
కొనునట్లయిన, ఈతండు ముక్తుండగు లోపల అధికారానుగు

ణముగ గలుగఁజేయును, అది యున్నంతవరకును సాత్త్వికప్రకృతి గలవాఁడగు ఈతనికి భగవన్నిగ్రహమువలన పైబడిన నరకము లేదు, అట్టి భగవన్నిగ్రహము శమించుటయును తరువాత ఈతండు క్షమాపణమును కోరుకొనినట్లయినచే, గలుగును. ‘‘సుహృదంసర్వభూతానాం” (సర్వభూతములకును మిత్రుండైనవాఁడు) అని చెప్పఁదగినట్లు స్వాభావికముగ మిత్రుండైనట్టి సర్వేశ్వరునికిఁగలిగిన నిగ్రహము శమించువరకును ఈతనికది మర్మస్పర్శిగానే యుండగలదు. ఇవ్విధముగ ప్రవర్తింపనివానికి స్వామివిషయమైన ప్రీతియును, కైంకర్యరూపమగు మోక్షము విషయమైన నభిరుచియును ఈతనికుండియుంకుట సందేహాస్పదము.

ఈ భగవదాజ్ఞాతిక్రమణము ‘‘ప్రహ్లాయిష్యామి=భగవంతునికి ప్రీతిఁ గలుగఁజేయుగలను) అని యీచేతనుండుద్దేశించినట్టి భగవత్ప్రీతికి విరోధమగుటంజేసి, ఈ శాస్త్రీయనియమనమును రహస్యత్రయమునందు విరోధినివృత్తిని యనుసంధించుకొను తావులయందు అనుసంధించుకొనుట యావశ్యకము.

ఇట్లు నియమన.ఎకాంము ప్రవర్తించుట యనునది ఉపాయపూర్తిలేనట్టి యధికారులకు ఉపాయపూర్తి గలుగుటలో విరోధించునట్టి ఘటిని శమింపఁజేసి, భగవంతుని యనుగ్రహమును గలుగఁజేయుటలో నుపయోగపడును. ఉపాయపూర్తి గలవారి విషయమున నన్ననో, ఇది ఆజ్ఞాతిక్రమణము మూలకమగు అప్రీతిని గలుగకుండచేసి, భగవంతునికి సంతోషావహకముగా నుండగలదు.

శ్లో॥ ఆజ్ఞానుజ్ఞావిభాగేన ద్విధా శాస్త్రీ య్యపద్ధతిః।
నిగ్రహానుదయాయాద్యా పరాత త్ఫలాప్తయే॥

తా॥ ఆజ్ఞారూపముగానును, అనుజ్ఞారూపముగానును శాస్త్రము రెండువిధములుగా నుండగలదు. వాటిలో, ఆజ్ఞారూపమగు శాస్త్రము భగవంతునికి నిగ్రహము గలుగకుండునట్లు చేయును. అనుజ్ఞారూపమగు శాస్త్రము, ఆయాఫలములను లభింపఁజేయుటలో నుపయోగ పడగలదు.

శ్లో॥ అనుజ్ఞయాప్రవృత్తేపి క్రమలోపాదిసంభవే।
ఆజ్ఞాతిక్రమదోషస్స్యాత్ నియమోఽతో దురత్యయః॥

తా॥ భగవదనుజ్ఞానుసారము ప్రవర్తించినను, క్రమము తప్పినట్లయిన, ఆజ్ఞాతిక్రమణ రూపమగు దోషము సంప్రాప్తంబగును. కావున భగవదాజ్ఞను అతిక్రమించుటకు వీలులేదు.

శ్లో॥ ప్రత్యవాయపరీహారే ఫలాంతరసమన్వితే।
తత్రసంవలితంప్రాహు రధికారంవిచక్షణాః॥

తా॥ ప్రత్యవాయమును, దానిపరిహారమును ఫలాంతరములతోఁ గూడియుండునవి. విచక్షణులయినవారు వాటివిషయమగు అధికారమునున్ను తత్సంయుక్తంబైనట్టిదానినిగాఁ జెప్పుదురు.

శ్లో॥ నిత్యకామ్యస్వరూపైక్యే వినియోగపృథక్త్వతః।
ఫలార్థంక్రియమాణేపి నిత్యంభవతితంత్రతః॥

తా॥ నిత్యకామ్యకర్మముల స్వరూపము నొక్కటిగాఁగాని నప్పుడు వినియోగము వేర్వేరగుటంజేసి, ఫలాపేక్షతో నొనర్పఁబడినప్పటికిన్ని అనఁగా కామ్యకర్మంబైనప్పటికిన్ని, తంత్రమునుబట్టి యది నిత్యకర్మము కాఁగలదు.

శ్లో॥ అనుజ్ఞామాత్రసిద్ధేషు కైంకర్యేషు విచక్షణైః।
అకృతౌ తత్ఫలాలాభో నతు దోష ఇతీరితం॥

తా॥ సర్వేశ్వరుని యనుజ్ఞవలనఁ జేయవలసినట్టి విధము గు కైంకర్యములఁ జేయనందున అందవలసిన ఫలమును బొందక పోవుటయనునది యొకదోషముకాదని విచక్షణులు చెప్పుదురు.

పా॥ నిన్ఱనమన్పుడైవానోర్ నిఱైయినిలమళన్దాన్
నన్ఱిదుతీయదెన్ఱు నడత్తియనాన్మఱైయాల్
ఇన్ఱనమక్కిరవాదలిలిమ్మదియున్నిలవే
అన్ఱియడిక్కడియారిరుడీర్కకడియుళదే॥

టీ॥ ఇదు = ఇది, నన్ఱు = మంచిది, ఇతు = ఇది, తీయదు = చెడ్డది, ఎన్ఱు = అని, నడత్తియ = ప్రవర్తింపఁబడినట్టి, నాన్మఱైయాల్ = వేదచతుష్టయముచేత, అన్పుడైవానోర్ నిఱైయిల్ = భక్తిగల వారై పరమపదవాసులగు వారొనర్చునట్టి కైంకర్యమునందు, నిన్ఱన = స్థిరముగానున్నారము. ఇన్ఱు = ప్రస్తుతము, నమక్కు = మాకు, ఇర వాతలిల్ = సంసారరూపమగు రాత్రియందు (అజ్ఞానాంధకారమునందు), ఇమ్మతి ఇన్నిలవే ఉన్ని = వేదరూపమగు చంద్రునియొక్క వెన్నెల యనెడి జ్ఞానములేకున్న, అడిక్కడి = ప్రతితడవను, ఇరుడీర్క = అజ్ఞానాంధకార నివర్తకంబైనది, ఉళదే = వేఱొక్కటి కలదా?

తా॥ యుక్తాయుక్తంబులను నియమించుటకై ప్రవర్తించిన వేదము కనుగుణముగ పరమపద వాసులొనర్చినట్టి కైంకర్యమునందు స్థిరముగానున్నట్టి మాకు సంసారరూపమగు అజ్ఞానాంధకారమును బోగొట్టుటకు అట్టి వేదముకంటెను వేఱొక్కటి కలదా?

శ్లో॥ శ్రుతిస్మృత్యాచారైస్స్వమతిగతిభిః శుద్ధమనసాం
సుసంకల్పైర్ధర్మైః కులచరణదేశాదిసముద్యైః।
నియోగైర్యోగ్యానాంనియమయితురాదేరభిమతం
నిమిత్తస్వప్నాద్యైరపినిపుణమన్విచ్ఛతిబుధః॥

టీ॥ శ్రుతిస్మృత్యాచారైః = శ్రుతుల చేతను, స్మృతుల చేతను=సదాచారము చేతను, స్వమతిగతిభిః = (వికల్పములను విధించినప్పుడు) తన బుద్ధికి యిష్టములైనట్టి విధముల చేతను, శుద్ధమనసాం = పరిశుద్ధమైనట్టి మనస్సుగలవారియొక్క, ధర్మైః=ధర్మాను గుణములగు, సుసంకల్పైః= మంచి సంకల్పముల చేతనున్ను, కులచరణ దేశాదిసముద్యైః = కుల సంకేతముల చేతను, వేదోపదేశము చేతనున్ను, దేశాచారము మొదలగువాటి చేతనున్ను, యోగ్యానాం = యోగ్యులయినట్టి వారియొక్క, నియోగైః= నియమనముల చేతనున్ను. నిమిత్త స్వప్నాద్యైః = శకునము, స్వప్నము మొదలగు వాటిచేతనున్ను, బుధః = బుద్ధిమంతుఁడైనట్టివాఁడు, ఆదేః= ఆదికారణుండగు సర్వేశ్వరునియొక్క, అభిమతం = ఇష్టమును, నిపుణం= చక్కగా, అన్విచ్ఛతి=గుర్తెఱుంగు చున్నాడు.

తా॥ వేదము దురవగాహంబైనను, శ్రుతిస్మృత్యాచారాదుల చేత బుద్ధిమంతుండు ఆదికారణుండగు సర్వేశ్వరునియొక్క యభిప్రాయమును గుర్తెఱుంగు చున్నాడు.

శాస్త్రీయనియమనాధికారము
ముగిసెను.



శ్రీమతే నిగమాంతమహాదేశికాయ నమః

    

# రహస్యత్రయసారము



## అపరాధపరిహారాధికారము.

శ్లో॥ స్వచ్ఛస్వాదుసదావదాతసుభగాం దైవాదయం దేహభృ
న్మాలిన్యప్రశమాయ మాధవదయామందాకినీం విన్దతి।
యద్యప్యేవమసావసారవిషయస్రోతఃప్రసూతైః పునః
పంకైరేవ కళంకయన్నిజతనుం ప్రాజ్ఞైర్నసంశ్లిష్యతే॥

టీ॥ అయం = ఈ, దేహభృత్ = మనుష్యుండు, దైవాత్ = దైవవశమున, మాలిన్యప్రశమాయ = సర్వపాపవిమోక్షణముకుగాను, స్వచ్ఛస్వాదుసదావదాతసుభగాం = కల్మషరహితమైనదియు, రుచికరమైనదియు పరిశుభ్రమైనదియు, రమ్యమైనదియునగు, మాధవదయామందాకినీం = సర్వేశ్వరునిదయయనెడి గంగను, విన్దతి = పొందుచున్నాఁడు, ఏవమప్యసౌ = ఇట్లు భగవత్కృపారూపమగు ప్రపత్తిని లభించినట్టియీతండు, పునః = ప్రపత్తిచేసినపిమ్మటనున్న, అసారవిషయస్రోతఃప్రసూతైః = అసారములగు శబ్దాదివిషయములనెడి ప్రవాహములవలనఁగలిగినట్టి, పంకైః = పాపకృత్యరూపములగు బురదలచేత, నిజతనుం = తనశరీరమును, కళంకయన్ యద్యపి = కళంకముగలదానినిగాఁ జేసికొనినవాఁడైనట్లయిన, ప్రాజ్ఞైః = శాస్త్రవేత్తలగు వారిచేత, నసంశ్లిష్యతే = త్యజింపఁబడుచున్నాఁడు.

తా॥ పాపనివృత్తికిగాను ప్రపత్తిచేసినపిమ్మటనున్న ఈతండు పాపకృత్యములఁజేయుచునేయున్నట్లైన, అట్టివానిని జ్ఞానులుత్యజించుదురు.

ఇవ్విధమున, భగవచ్ఛేషత్వమే స్వభావముగాఁగలవాఁ
డగుటంజేసి, శాస్త్రనియతంబులగు తత్కైంకర్యములయందే
బుద్ధిగలవాఁడగు ఈ యధికారికి అటుపిమ్మట నిర్దోషముగానే
బుద్ధిపూర్వకమగు అపరాధము సంప్రాప్తించుటయనునది ఈ
తండు అవలంబించియున్నట్టి కైంకర్యనిష్ఠకు విరుద్ధంబగుటంజేసి
ప్రాయశః అట్టి దెద్దియును ఈతనికి సంప్రాప్తించుట యసంభ
వము. ప్రారబ్ధకర్మవశమున దేశకాలావస్థావ్యతిరేకమును
బట్టియు, ప్రమాదవశమునను సుషుప్త్యాద్యవస్థలయందును
సంప్రాప్తంబులగునట్టి కొద్దికొద్ది యపరాధములు ఈతనితో
సంబంధింపక తమంతటనే విడిచిపోవును.

బుద్ధిపూర్వకములగు పాపములఁ గలుగఁ జేయునట్టి
పాపకర్మములు సయితము నశించి పోవలయునని ప్రపత్తి
చేయక, పాముతోఁ జేరియుండునట్లు, యీప్రకృతితోఁ జేరియుం
డునట్టి యీతనికి ఆత్మగుణములు సంపూర్ణముగా లేనందున,
మనోధైర్యము మందముగానున్నట్టి ఋషులకువలెనే, బుద్ధి
పూర్వకముగానును కొన్ని విపరీతానుష్ఠానములు సంప్రాప్తం
బులయినప్పటికిన్ని, నిరుపాధిక మిత్రుండగు శ్రియఃపతి యీత
నిని రక్షించుటకై నిరీక్షించుచుండుటంజేసి, యీ విపరీతాను
ష్ఠానములు మెరుపుమెఱసినట్లు స్థిరముగా నుండనివి గాన, ఆకా
లమునఁ గలిగినట్టి విపరీతానుష్ఠానరూపమగు కష్టమును తలం
చుకొని యథోచితముగ లజ్జానుతాపంబులు గలవాఁడై,

శ్లో॥ అపాయసంప్లవే సద్యః ప్రాయశ్చిత్తం సమాచరేత్।
ప్రాయశ్చిత్తిరియం సాత్ర యత్పునశ్శరణం వ్రజేత్॥
ఉపాయానాముపాయత్వ స్వీకారేప్యేతదేవహి।

తా॥ అపాయము తటస్థించినప్పుడు, వెంటనే ప్రాయశ్చిత్తము చేసికొనవలసినది. ఆవిషయమున ప్రాయశ్చిత్తమనునది మరల శరణాగతిని చేయుటయే, ఉపాయాంతరములను మోక్షోపాయముగాఁగొనునప్పుడునుఇదియేప్రాయశ్చిత్తముకాఁగలదు

శ్లో॥ అజ్ఞానాదథవాజ్ఞానా దపరాధేషు సత్స్వపి।
ప్రాయశ్చిత్తంక్షమస్వేతి ప్రార్థనైకైవ కేవలం॥

తా॥ బుద్ధిపూర్వకముగఁగాని, అబుద్ధిపూర్వకముగఁగాని అపరాధములు సంప్రాప్తములయినప్పుడు, క్షమింపుమని భగవత్సన్నిధియందు ప్రార్థించుటయే యందులకుప్రాయశ్చిత్తము.

శ్లో॥ విదితస్సహిధర్మజ్ఞః శరణాగతవత్సలః।
తేనమైత్రీభవతు తే యది జీవితుమిచ్ఛసి॥

తా॥ ఓరావణా! శ్రీరామచంద్రుండు ధర్మజ్ఞుండుగాను, శరణాగత వత్సలుండుగానును ప్రసిద్ధిపొందినట్టివాఁడు. జీవింపవలయునని తలంచితివేని, వానితో స్నేహముఁజేసికొనుటమంచిది.

శ్లో॥ ప్రసాదయస్వత్వంచైనం శరణాగతవత్సలం।
మాంచాస్మైప్రయతోభూత్వా నిర్యాతయితుమర్హసి॥

తా॥ ఓ రావణా! అనుతాపపడుచు శరణాగతవత్సలుండగు శ్రీరామచంద్రునికి నన్ను అర్పించి వానిని సంతోషపెట్టుము.

ఈ పైని ఉదహరించిన ప్రమాణములయందుఁ జెప్పియున్నట్లు, అధికారానుగుణముగ ప్రాయశ్చిత్తముకుగాను ఉద్యుక్తుండు కావలయును.

ప్రారబ్ధకర్మము మూలముగ కలిగిన స్వభావుండై, క్షమా
పణమును కోరక పోవునట్లయిన,

శ్లో॥ స్వపురుషమభివీక్ష్య పాశహస్తం వదతి యమః కిల తస్య
కర్ణమూలే। పరిహర మధుసూదన ప్రపన్నాన్ ప్రభురహ
మన్యనృణాం న వైష్ణవానాం॥

తా॥ యముండు పాశహస్తుండగు తనకింకరుని పిలిచి శ్రీమ
న్నారాయణుని శరణుజొచ్చినట్టివారి చెంతకు పోవలదు. నేను
తక్కినవారికే గాని, విష్ణుభక్తులకు ప్రభువును గానని రహస్య
ముగాఁ జెప్పుచున్నాడు.

శ్లో॥ కమలనయన వాసుదేవవిష్ణో ధరణిధరాచ్యుత శంఖచక్ర
పాణే। భవశరణమితీరయన్తి యే వై త్యజభట దూరతరేణ
తానపాపాన్.

తా॥ ఓ పుండరీకాక్షుండా! వాసుదేవ! విష్ణో! ధరణి
ధర! అచ్యుత! శంఖచక్రధర! నన్ను రక్షింపుము అని యివ్వి
ధమున ప్రార్థించునట్టివారు పాపరహితులుగాన, వారిచెంతకు
పోకుండ, ఓ భటుండా! దూరముగా పొమ్ము,

శ్లో॥ దేవం శార్ఙ్గధరం విష్ణుం యే ప్రపన్నాః పరాయణం।
న తేషాం యమసాలోక్యం నచ తే నరకౌకసః॥

తా॥ శార్ఙ్గధరుండగు విష్ణువును శరణుజొచ్చినట్టి
వారికి యమదర్శనము కాదు. అట్టివారు నరకమునకు పోరు.

అని యివ్విధమున వైష్ణవ, వామనాదిపురాణవాక్యములకు
మూలభూతంబులగు శ్రుతులయందుఁ జెప్పియున్న ప్రకారము,
యమలోకప్రాప్తిలేకుండ, ఆయుధముతో తీసివేయబవలసినది

ముల్లుతో తేసివేయఁబడునంత సులభంబయినట్లు, గ్రుడ్డి కుంటి మొదలగువారి విషయమున దయతోఁజూచుటచే తలగొరిగించుట మొదలగు ఉపాయములఁగాని, సర్వేశ్వరుండు క్షమా, ప్రేమ, దయా వాత్సల్యాంబులచే తనయొక్క ప్రతాపమునంతగాఁ జూపింపనివాఁడై గొప్పదండనను విధింపవలసినట్టి యపరాధముకుగాను, సేవ్యుండగు సార్వభౌముండు తననౌకరులు, అతఃపురనౌకరులు, మరుగుజ్జువాళ్లు మొదలగు దీనుల విషయమున వారి యపరాధంబులకుఁ దగినట్లును, సంబంధ ఆనృశంస్యాదులమూలముగ ఒకప్రక్కన ప్రేమించుచునేయుండి, వారు అపరాధపడినదానికి క్షమాపణముఁ గోరుకొనుటకుగానును, పైగా శిక్షించుటకుగానును, వారికిఁ గనపడకుండ యుండియు, వారిచే పారతోమట్టిపోయించియు, వారినితలవాకిటలోనుంచియు, వారినికొంతకాలము నౌకరిలోనుండితీసివేసియు నివ్విధముగ చేయువట్లు, సర్వేశ్వరుండును కాకాసురుని ఒక కన్ను గ్రుడ్డిగాఁజేయుటచే నామకార్థము శిక్షించి రక్షించిన విధమున, ఈ యాశ్రితులనున్ను రక్షింపఁగలడు.

ఇవ్విధమువ మృదుస్వభావముగల వారిని క్షమాపణముగోరునట్లు చేయుటగాని, కఠినస్వభావముగలవారిని దండించుటచే శిక్షించుటగాని యిదియును పూర్వమొనర్చియున్నట్టి ప్రవృత్తియొక్కఫలముగ క్షమించునట్టి విధంబనితలంచి శిక్షకుండగు సర్వేశ్వరుని విషయమున కృతజ్ఞతయుండుటకుగాను నుబుద్ధిపూర్వకముగ ఇఁకమీఁదు ఈతం డొనర్చునట్టి పాపంబులనున్ను సర్వేశ్వరుండు క్షమింపఁగలడని కొందఱు చెప్పుదురు.

ప్రారబ్ధకర్మములోని పాపభాగమువలెనే, బుద్ధిపూర్వక
ముగ నిఁకమీఁదు నొనర్చునట్టి పాపమునకు ప్రాయశ్చిత్తముఁ
జేసికొనక పోయినట్లయిన, ఫలమునిచ్చునదియే యైనను, ఈతం
డొనర్చియున్నట్టి ప్రపత్తి మోక్షము నీయదా ? అని శంకింపఁ
బనిలేదు నశించిపోవుటకు వేఱవిద్ధ ఇఁగుపపెట్టియున్నట్టి వృత్తు
ములకు నలావభేదములనుబట్టి నశించుటలో కాలతారతమ్య
మున్నట్లు, ప్రపన్నులైనను వీరికి సంసారము నిశ్శేషముగా నివ
ర్తించుటలో కొందఱికి ఆలస్యముగా నివర్తించుటయు మఱి
కొందఱికి శీఘ్రముగా నివర్తించుటయు నిట్టివిధముగు భేదమే
యుండఁగలదు.

ఈ దేహావసానమున మోక్షమును బొందవలయునని
యపేక్షించినను, నియతాయుర్దాయములేనివారై కాలవిళంబ
మును సహింపఁగలవారికి ఆయుర్వృద్ధిమూలముగ విళంబము
గలుగఁగలదు. నియతాయుర్దాయవంతులకు తమ యాయుర్దా
యము ముగియుటకు లోగానే యది ఫలించును.

"భవేయం శరణం హి వః" (మిమ్ముల రక్షింపఁగలను)
అని సీతాపిరాట్టి యభయమిచ్చినపిమ్మట, రాక్షసులు బుద్ధి
పూర్వకముగ నొనర్చినట్టి యపచారములను "మర్షయామి
హదుర్బలా పాపానాం వా శుభానాం వా" అను తావునఁ జెప్పి
నట్లు పిరాట్టి క్షమించియుండ లేదా? యంటివేని ఆసందర్భము
నను, శ్రీ యాంజనేయులవారు తమను బాధించునని భయ
ముకలిగి, అట్లు బాధింపకుండ పిరాట్టి యడ్డుపడుటచే, నరికెద
నని కత్తియెత్తి చూపించి విడుచునట్లు, స్వల్పదండనయును,
క్షమించుటయును ఈరెండును కలిగినవి. కావున ప్రపన్నుండు

బుద్ధిపూర్వకముగ నింకమీఁదు జేయునట్టి పాపము వానితో సం
బంధింపదని విశేషించిచెప్పుట కొక ప్రమాణమున్ను లేకున్న
ను, ఈతండు ప్రపత్తిచేసినపిమ్మట బుద్ధిపూర్వకముగ అపరాధంబు
లనొనర్చినను, తత్పరిహారమునకు గొనఁ గొనవలసిన దిక్కేదనియు, ఈ
తండు తత్పరిహారమునకుఁ గొనకపోయినప్పటికిన్ని, ఈతనికి శి
క్షారూపముగు దండము లేదనియు, మోక్షము కలుగుటలో నాల
స్యముండదనియు, ఈలోకమున నొనర్చునట్టి కైంకర్యంబులకు
ప్రారబ్ధసుకృతాదులమూలముగఁగలుగఁగల విచ్ఛేదసంకోచం
బులు కలుగవనియును ఇవ్విధముగ చెప్పనది యెంతయును
శరణ్యుండగు సర్వేశ్వరునియొక్క వాత్సల్యసౌశీల్యాది కల్యాణ
గుణంబులున్ను శరణాగతియొక్క ప్రభావమున్ను కావి
యాడుటకుఁగానని యెఱుంగునది. అట్లు కాకున్న, పూర్వీకు
లగు ప్రపన్నులయొక్క పరంపరగా వచ్చునట్టి యనుష్ఠానముల
తోనున్ను, ప్రపన్నునకుఁగుఱించి ప్రాయశ్చిత్తమును విధించు
నట్టి శాస్త్రముతోనున్ను, మోక్షము కలుగుటకు కాలమును
నిశ్చయించుకొని ప్రవృత్తి చేయకుండ, బుద్ధిపూర్వకముగ నింకను
అపరాధములను చేయుచునే యుండియును, మోక్షము
కలుగుటలో నాలస్యమును సహింపఁజాలనివారికి మోక్షము
కలుగుటలో నాలస్యమగునని తెలుపునట్టి శాస్త్రముతోనున్ను
విరోధము సంభవించును.

“సర్వపాపేభ్యో మోక్షయిష్యామి” (సమస్త పాప
ములనున్ను పోఁగొట్టెదను) అని సామాన్యముగాఁ జెప్పియు
న్నను, ‘ప్రాయశ్చిత్తిరియం సాత్ర యత్పునః శరణం వ్రజేత్’
(మరల శరణాగతిని చేయుటయే ప్రాయశ్చిత్తము) అని ప్రత్యే

కించి పెప్పుటచే బుద్ధిపూర్వకముగ ఇఁకమీఁదు ఒనర్చునట్టిపాప కృత్యములకుగాను వేఱొక్క తడవ ప్రపత్తిచేయుట ప్రాయశ్చిత్త ముగా నేర్పడినది.

పునః శరణాగతిని విధించునట్టివాక్యము, ముందు ప్రపత్తిచేసినప్పుడు; బుద్ధిపూర్వకముగ ఇఁకమీఁదు చేయఁబోవునట్టి పాపములకు పరిహారముగానును ప్రపత్తిచేసియుండనివారి విషయమున చేసినట్టి నియమము కాఁగూడదా ? యంటివేని, అట్లు చెప్పఁదగదు. ఏలయన, బుద్ధిపూర్వకముగ ఒనర్చినట్టి పాపములకుగానును ప్రపత్తిచేయవచ్చునని ప్రత్యేకించి చెప్పి యున్నానే కదా; అట్లు నియమింపవచ్చుచు. ఈప్రపత్తి బుద్ధిపూర్వకముగ ఇఁకమీఁదు చేయఁబోవునట్టి పాపకృత్యములకుగానును పరిహారంబని చెప్పినట్లయిన, అట్టికృత్యమును విడనాడియున్నట్టి వారికిన్ని పునః ప్రపత్తినొనర్చుట తప్పనిసరి గాన, పునః ప్రపత్తిని విధించునట్టి వాక్యము నిరర్థకముకాఁగ లదు. మరియు సామాన్యవచనమునుబట్టి విశేషవచనమును బాధింపకూడదు. సామాన్యవచనమునుబట్టి విశేషవచనమును బాధించుపక్షమున, ఉపాసననిష్ఠునికిని, బుద్ధిపూర్వకముగా ఇఁకమీఁదు ఒనర్పఁబడునట్టి పాపకృత్యములకున్ను దోషమే లేకపోవలసివచ్చును.

తరువాత బుద్ధిపూర్వకముగ పాపకృత్యముల నొనర్చియున్నను, పరమైకాంతులకు వీరి యుభయులకును, యమవశ్యతాదులు లేవవను విషయము ‘‘యస్మిఁకస్మిఁకులేజాతా యత్రకుత్రనివాసినః । వాసుదేవరతానిత్యం యమలోకంనయాంతితే’’ (ఏ కులమునందైనను పుట్టని, ఎచ్చటనైనను వసింపని,

యెల్లప్పుడును భగవద్గుణానుభవపరులగువారు యమలోకము కుఁబోరు) ఈ మొదలుగాఁగలవచనములబలమువలన సిద్ధమగు చున్నది. పాపంబొక్కటియే జాతిగుణాద్యధికారభేదమునుబట్టి తీక్ష్ణమైనట్టి ఫలమునిచ్చునదిగానును, తేలికయైన ఫలమునిచ్చు నదిగాను నుండగలదను విషయము అందఱునుఒప్పుకొనినదే. ఈ విషయము రాజపుత్రాపరాధాదులయందువలెనే,లోకమ ర్యాదనుబట్టియును ఉపపన్నమగుచున్నది. ఏలయన, "న ప్రాగ్వద్వృద్ధి పూర్వాఘే న చాత్యంతమనిగ్రహః। లఘుర్దండః ప్రపన్నస్య రాజపుత్రాపరాధవత్" (ప్రపన్నుండు బుద్ధిపూర్వకముగ పాపకృత్యముల నొనర్చినప్పుడు దండనము పూర్వమువలె కాదు. బొత్తుగ క్షమించియుండుటయును లేదు. అయితే రాజపుత్రుండపరాధము నొనర్చినప్పుడు, వానిని నామకార్థము సులువుగా దండించునట్లు, ఈతని విషయము నను దండనము సులువైనదై యుండగలదు)అనిచెప్పియున్నది. కావున అధికారానుగుణముగ అట్టిసులువైనట్టి దండనమున్ను సంప్రాప్తింపకుండుటకుగాను పునః ప్రపత్తి శాస్త్రమునందు విధింపఁబడినది. శిష్టులుగాను చెప్పఁబడునట్టి సమర్థులకున్ను లోకసంగ్రహార్థముగానును, ప్రసిద్ధములగు పాపకృత్యములకు శక్త్యనుగుణముగ ప్రసిద్ధంబగు ప్రాయశ్చిత్తమే యుచితము, దానిని తప్పించుకొనుటయును ముందుచెప్పినట్టి భగవదాజ్ఞా తిక్రమణ మనిపించుకొనుచున్నది. సైరంధ్రికను నొకరి పో యినప్పుడు దాదాత్మ్యకములగు పరిమళాదులు విడనాడబడు టయు, భయానులున్ను గలుగునట్లు, భగవదాజ్ఞాతిక్రమణము రెండు విధములుగ అనర్థకము కాఁగలదు.

(శాస్త్రనియమనము లేకున్నను) తన యిచ్ఛామాత్రముచేబుద్ధిపూర్వకముగాఇకమీఁదొనర్పంబోవునట్టి పాపకృత్యవశముగానును ముందేప్రపత్తిచేసియున్ననో, యని యడిగెదవా? యట్లడిగితివేని, అట్టి ప్రపత్తిని ఉపాసనముకుగానును బుద్ధిపూర్వకముగ నొనర్పంబోవునట్టి పాపకృత్యములకుగాను పరిహారముగాను చేసియున్నట్లయిననా? అంగప్రపత్తినిచ్చి దానితోఁ గూడ చేసియున్నట్లయిననా? అని యిట్లు వేఱొక్క వాదము రాఁగలదుగాన, సరి సరిసిపోఁబడినది. ఈ యుభయములకును ఇవ్విధమున నుండవచ్చుననుట శ్రీభాష్యాదివిరుద్ధంబగుటంజేసి మది సిద్ధాంతముతో ననుకూలింపదు. ఉపన్యస్తి మొదలగు బ్రహ్మనిష్ఠులయొక్క యనుష్ఠానముతోనును విరోధించును. కావున విశేషవచనం బెద్దియును లేనందున, "పాపము చేస్తే దాఁ అనుతపింపవలయును" అన్నట్లు,నిమిత్తమొక్కటియేర్పడితేగాని నైమిత్తికముయేర్పడదు. వ్యాయామముబుద్ధిపూర్వకముగచేయఁబోవునట్టి పాపకృత్యములవిషయమున బాధింపఁబడదు. కావున నికమీఁదు రాబోవు బుద్ధిపూర్వకపాపముకుభయపడిన వాఁడయినట్లయిన, అందులకు కారణంబైనట్టి ప్రారబ్ధపాపముకుగాను ప్రపత్తిరూపంబగు ప్రాయశ్చిత్తముఁజేయవలయును. "సాత్యభక్తిస్తుసాహంత్రీ ప్రారబ్ధస్యాపి భూయసీ" (సాత్యభక్తిప్రారబ్ధకర్మమును నశింపఁజేయునది) అని చెప్పియున్నారుకదా? మరియు "జన్మాంతరకృతం పాపం వ్యాధిరూపేణ బాధతే। తచ్ఛాంతిరౌషధైర్దానజపహోమార్చనాదిభిః" (జన్మాంతరమున నొనర్చియున్నట్టి పాపము ప్రసుతము వ్యాధిరూపమై బాధించుచున్నది. అది ఔషధములచేతను దాన,

జప, హోమాదులచేతను శమించును; ఇత్యాది శాస్త్రముల [illegible]న జపాదుల మూలముగానును ప్రారబ్ధకర్మము నశించుచున్నట్లు చెప్పఁబడినది కదా? కావున వేఱొక్కపాపము గలుగఁజేయు గల పాపమునకు భయపడి ప్రవృత్తిచేసినట్లయిన, అట్టి [illegible] బుద్ధిపూర్వకముగ పాపమునే చేయును.

"దాసస్సఖా వాహనమాసనం ధ్వజః" (దాసుండును, స్నేహితుండును, వాహనమును, ఆసనమును, ధ్వజమును) ఇత్యాది [illegible]ములఁ జెప్పియున్నట్లు, అత్యంతము భగవంతుని కంతరంగులైనట్టివారికిన్ని (గరుత్మంతుండు మొదలగువారికిన్ని) మంచితలంపుతోనుండగానే సంభవించినట్టి యేదొక స్వల్పాపరాధమున్ను యేదొక యాపదకు హేతువగునను విషయమును * శాండిలీవృత్తాంతాదులయందు సుప్రసిద్ధము. సర్వేశ్వరుని

* విశ్వామిత్రమహర్షి సన్నిధిని సమస్తవిద్యలను అధ్యయనము చేసిన గాలవుండను బ్రాహ్మణుండు గురుదక్షిణను ఇవ్వనియెడల తనకు ఈ విద్య నిలువదని నిశ్చయించుకొని విశ్వామిత్రులవారి సన్నిధికివచ్చి, "అయ్యా నేను సమర్పింపవలసిన గురుదక్షిణ ఏదో ఆనతి ఇయ్యవలెను" అనియడుగఁగా అయన "నీవు మాకు ఏ దక్షిణయును ఇవ్వ నక్కఱలేదు. నీ శుశ్రూషకును భక్తికిని మిక్కిలి సంతోషించినాము. ఇఁకను నీ యిష్టానుసారముగా నీ యింటికి వెళ్ళుము" అని చెప్పినను, ఈ గాలవుండు అట్లు చేయక దక్షిణను పుచ్చుకొమ్మని నిర్బంధించుటచే "కిఞ్చిదాగత సంరమ్భో విశ్వామిత్రో ఽబ్రవీదిదమ్ః ఏకతః శ్యామకర్ణానాం శతాన్యష్టౌ తు దేహి మే హయానాం చంద్రశుభ్రాణాం గచ్ఛ గాలవ మాచిరమ్" అన్నట్లు ఆ మహర్షికి కొంచము కోపమువచ్చి గాలవునివైపు చూచి "దేహమంతయును చంద్రమండలమువలెనే తెల్లనై ఒక్క చెవిమాత్రము నల్లనై యుండు ఎనిమిదివందల గుఱ్ఱ

వలెనే నిత్యసూరులున్ను అవతరించినప్పుడు కర్మవశ్యులవలె నటించి, లోకహితమును ప్రవర్తింపఁజేయుటకుగాను అపచార

ములను శీఘ్రముగాఁ దెచ్చియున్నా" అని పలికెను. దానిని విని గాలవుండు మిక్కిలి వ్యాకులపడి దీనికిప్పుడేమి చేయవలెను అని పలువిధములుగా నాలోచించినను సర్వాభీష్టప్రదుండగు సర్వేశ్వరునియుపాసించుటకు ఉద్యోగించుచుండగా, పూర్వము ఈతనికి స్నేహితుండయియున్న శ్రీగరుత్మంతుండు యొకటవచ్చి నిలువఁబడఁగా, ఆయనను గాలవుండు స్తుతించి ఇందులకు ఉపాయమేమని యడిగెను, అప్పుడు శ్రీగరుత్మంతుడు "నిన్ను ఈభూమినంతయును త్రిప్పెదను యుద్ధరము వెదకుదమురా" అని ఈతనిఁ దీసికొని సంచారముఁ జేయునప్పుడు శ్రమకలుగఁగా నిచట విశ్రమించి పోయెదమనుకొని పశ్చిమ సముద్రతీరమునందు ఋషభమనెడి పర్వతముపైని నివసించునట్టి జ్ఞానాధికురాలగు శాండిలియను భాగవతోత్తమురాలిని సేవించి నమస్కరింపఁగా, ఆమె యత్యాదరముతో వీరిని సత్కరించెను. అనంతరము విశ్రమించి శయనించి యుండునప్పుడు "ఇట్టి విలక్షణురాలైన ఈమె ఒక విలక్షణదేశమునందు నివసింపకపోయెనే" అని శ్రీగరుత్మంతుఁడు విచారించి "ఈమెను ఒక దివ్యదేశమునకుఁ గొనిపోయి అచ్చట ఉంచివేసెదను" అని యాలోచింపుచు శయనింపఁగా, ఆయన ఆమె నివసించుదేశమును హీనముగాఁదలంచిన అపచారముచేత రెక్కలువూడి నిశ్చేష్టుండై యుండగా, దీనిని కూడపోయిన బ్రాహ్మణుండు చూచి, "యన్మా తే మనసాధ్యాతమశుభం పతతాంవర నహ్యయం భవతస్స్వల్పో వ్యభిచారో భవిష్యతి" "మనస్సులో దేవినైన చెడుపును తలంచి యుంటిరా? దేవరవారికి కొంచమైనను ప్రమాదము కలుగుట కవకాశములేదే అని యడుగఁగా, నంతట గరుత్మంతుఁడు "జరిగినది సుమీ" అనితాము ఆ భాగవతోత్తమురాలి విషయమున తలంచినదానిని వారితోఁ జెప్పఁగా, అనంతరము దీనిని క్షమింపఁచేసికొనుటకై యామెను ఆశ్రయించి, ఆమె యనుగ్రహముచేత ఆయపచారము శాంతింపఁగా, గరుత్మంతుండు పూర్వమువలెనే రెక్కలను లభించెను.

అనభ్యుపగత ప్రారబ్ధకర్మమునున్ను, న్యాసేన = శరణాగతిచేయుటచే క్షపయన్ = నశింపఁజేయుచు, ధీపూర్వోత్తరపాప్మనాం = బుద్ధిపూర్వకముగ చేయఁబడునట్టి యాగామికర్మములు, అజననాత్ = సంభవింపకపోవుటవలనను, జాతేపి = అట్టికర్మము సంభవించినను, తన్నిష్కృతేః = అందులకుగాను ప్రాయశ్చిత్తము చేయుటవలనను, కాటిత్యే సతి = కఠినస్వభావుండై ప్రాయశ్చిత్తము చేయకపోవుటవలన, శిక్షయాపి = దండనను విధించుటచేతనున్ను, అనఘమున్ = ఈజీవుని పాపరహితునిగాఁజేయుచు, ప్రభుః = సర్వేశ్వరుండు, క్రోడీకరోతి = స్వీకరించుచున్నాడు.

తా॥ సర్వేశ్వరుండు ఈజీవుని సంచితాగామి పుణ్యపాపకర్మము లను శరణాగతిమూలముగ నశింపఁజేసి, ఇఁకమీఁదు ఈచేతనుండు బుద్ధిపూర్వకముగ అపరాధముల చేయకపోవుటంజేసియు, అథవా ప్రమాదవశమున చేసినట్లయిన, ప్రాయశ్చిత్తాదులవలనను, ప్రాయశ్చితమును చేసికొననట్లయిన, దండనచేతను పవిత్రునిగాఁజేసి యంగీకరించుచున్నాడు.

అపరాధపరిహారాధికారము

ముగిసెను.



శ్రీమతే నిగమాంతమహాదేశికాయ నమః.







# రహస్యత్రయసారము



## స్థానవిశేషాధికారము.

శ్లో॥ యత్రైకాగ్ర్యం భవతి భగవత్పాదసేవార్చనాదే
ర్యత్రైకాంత్య వ్యవసితధియో యస్యకస్యాపి లాభః।
వాసస్థానం తదిహ కృతినాం భాతి వైకుంఠకల్పం
ప్రాయో దేశా మునిభి రుదితాః ప్రాయికౌచిత్యవంతః॥

టీ॥ భగవత్పాద సేవార్చనాదేః = భగవంతుని పాదములను సేవించుటకును, అర్చించుటకును, యత్ర=ఏప్రదేశమునందు, ఐకాగ్ర్యం=చిత్తైకాగ్ర్య, భవతి = కలుగుచున్నదో, తత్ర = ఆప్రదేశమునందు, ఐకాంత్యవ్యవసితధియః = చిత్తైకాగ్రతగలవానికి, యస్యకస్యాపి=ఏజాతివానికైనను, లాభః = భగవత్ప్రాప్తి కలుగగలదు. కృతినాం=కృతకృత్యులు అయినవారికి, ఇహ = ఈలోకమునందే, శ్రీవైకుంఠకల్పం = దాదాపుగ శ్రీవైకుంఠముతో సదృశంబైనట్టి, వాసస్థానం = వాసస్థానము కలుగగలదు, మునిభిః = మునులచేతను, ప్రాయః = ప్రాయశః, ఉదితాః=పుణ్యక్షేత్రములుగాను పేర్కొనంబడినట్టి మధురాది ప్రదేశములు, ప్రాయికౌచిత్యవంతః = తాత్కాలికమగు ఔచిత్యముగలవి.

తా॥ ఈచేతనునికి భగవద్ధ్యానాదుల విషయమున నెచ్చట యైకాగ్ర్యము కలదో, అదియే వాసయోగ్యమైనట్టి స్థానము. కృతకృత్యులకు

ఈలోకమునందే శ్రీవైకుంఠతుల్యమగు స్థానము కలుగును. మధురాదిక్షేత్రములు ప్రకృతికాలమున నారోగ్యములగుటంజేసి పుణ్యక్షేత్రములుగాను మునులచే పేర్కొనంబడినవి.

జీవించియున్నంతకాలమిట్లు పురుషార్థముగాను తలంచి అపరాధరహితముగ నొనర్పంబడునట్టి కైంకర్యమునందభిరుచియును, త్వరయున్ను గలవాడై "ఏకాంతీవ్యపదేష్టవ్యో నైవ గ్రామకులాదిభి ర్విష్ణునా వ్యపదేష్టవ్యః తస్య సర్వం స ఏవహి" (ఈ ప్రపన్నుడు ఈ కులమువాడని యిట్లు గ్రామకులాదుల పేరులతో ప్రపన్నులను పిలువగూడదు ఈతని కంతయును భగవంతుండేగాన, భగవత్సంబంధముగొనియే ఈతనిని పిలువవలయును) అని చెప్పంబడినట్టి పరమైకాంతియొక్క వ్యాపారము కనుగుణంబగునట్టి వాసస్థానంబెద్ది? యంటివేని, ఆర్యావర్తము మొదలగు పుణ్యదేశములు ప్రకృతకాలమున నంతయనుకూలంబు లయినట్టివి కానందున, బ్రాహ్మణాదిచాతుర్వర్ణ్యధర్మంబులు చక్కగా ననుష్ఠింపంబడునట్టి ప్రదేశమున నివసింపవలసినది యని ప్రకృతస్థితిగతులనుబట్టి చెప్పవచ్చును.

ఎటికంటెనున్ను "కరుద్దడముకిల్ వణ్ణనై క్కైక్కొండు కైతొళుమ్ పత్తర్ కళ్ ఇరుద్దు వూరిలిరుక్కుమానిడరేత్తనంగళ్ శెయ్ తార్ కొలో" (సంసారతాపహారుండగు సర్వేశ్వరుని బాగుగాఁ దెలిసికొనియుండి వాని నర్చించునట్టి పరమభాగవతుల సన్నిధిని వసించునట్టి భాగ్యముగలవారు తపస్సేలచేయవలయును) అన్నట్లు భాగవతోత్తములు వేంచేసియున్నట్టి దేశమే ముముక్షువుచే నివాసయోగ్యమైనదిగాను స్వీకరింపవలసినది.

"కలౌజగత్పతిం విష్ణుం సర్వస్రష్టారమీశ్వరం నార్చ యిష్యంతిమైత్రేయ పాషండోపహతాజనాః" (ఓమైత్రేయుఁడా! కలియుగమునందు జనులు పాషండులై సర్వమును సృజించినట్టి జగత్పతియగు విష్ణువును బూజింపరు) అని చెప్పియున్నను,

శ్లో॥ కలౌఖలుభవిష్యంతినారాయణపరాయణాః
క్వచిత్క్వచిన్మహాభాగాఃద్రావిడేషుచ భూయశః॥

తా॥ కలియుగమునందు నారాయణపరాయణులగు మహానుభావులు దేశమునందచ్చటచ్చటను ద్రావిడదేశమునందు విశేషముగాను నుండగలరు.

శ్లో॥ తామ్రపర్ణీనదీయత్ర కృతమాలాపయస్వినీ।
కావేరీచమహాభాగాప్రతీచీచమహానదీ॥

తా॥ తామ్రపర్ణి, కావేరీ, మహానదీ ఇవి ప్రవహించునట్టి దేశములు ద్రావిడదేశము లనఁబడుచున్నవి.

శ్లో॥ యేపిబన్తిజలంతాసాం మనుజా మనుజేశ్వర।
ప్రాయోభక్తాభగవతి వాసుదేవేఽమలాశయాః॥

తా॥ ఎవ్వారులు పైనియుదహరించిన నదులయొక్క యుదకమును ద్రాగుచున్నారో, వారు నిర్మలమనస్కులై వాసుదేవుఁడగు భగవంతుని యెడల భక్తికలవారలగుచున్నారు.

ఈ పైవాక్యములయందు భాగవతులు నివసించునట్టి దేశములు పేర్కొనఁబడినందున, ఈయుగమున నిట్టిదేశముల తో భాగవతులు అభిమానించిన స్థానములే ప్రపన్నునిచే వాసస్థానముగా నంగీకరింపవలసినవి. తిరునారాయణీయమునందును,

శ్లో॥ ఏకపాదస్థితే ధర్మేయత్రక్వచనగామిని
కథంవస్తవ్యమస్మాభిః భగవన్తద్వదస్వనః

తా॥ ఓ భగవంతుఁడా! ధర్మము ఒక్కపాదమై యెచ్చటనో యొక్క తావున మాత్రముండియున్నప్పుడు మమ్ముల నెచ్చటయుండియుండమంటావో తెలుపుము.

అని యివ్విధమున దేవతలున్ను మహర్షులున్ను విన్నవింపఁగా,

శ్లో॥ గురవోయత్రపూజ్యన్తే సాధువృత్తాశ్శమాన్వితాః
వస్తవ్యంతత్రయుష్మాభిః యత్రధర్మోనహీయతే॥

తా॥ సాధువులును, శమాన్వితులునగు గురువులు యేతావున పూజింపఁబడుచున్నారో, ఏతావున ధర్మమున్ను లోపింపకుండ యుండగలదో, ఆతావున మీరు వసింపవలసినది.

శ్లో॥ యత్రవేదాశ్చయజ్ఞాశ్చతపస్సత్యందమస్తథా।
హింసాచధర్మసంయుక్తా ప్రచరేయుస్సురోత్తమాః॥

తా॥ ఏతావున వేదములును, యజ్ఞములును, సత్యమును, తపస్సున్ను, దమమున్ను ధర్మానుసారమగు హింసయును కలవో, ఏతావున దేవతలు సంచరించుచుందురో, ఆతావున మీరు వసింపవలసినది.

శ్లో॥ సవైదేశోహివస్సేవ్యో మావోధర్మః పదాస్పృశేత్

తా॥ అట్టి తావున మీరుండవలసినది. అచ్చట మీ యొక్క ధర్మము క్షీణింపదు.

ఇవ్విధమున భగవంతుఁడే స్వయముగ చెప్పియున్నాడు. వాటియన్నింటిలోనును, భగవంతుండు ప్రీతితో వేంచేసియున్నట్టి దివ్యదేశములయందు తనకు కైంకర్య మొనర్చుట కనుకూలంబగు తావున నిరంతరము వసించుట యుచితము. ''యావచ్ఛరీరపాతమత్రైవ శ్రీరంగేసుఖమాస్వ'' (యా

వజ్జీవము ఇచ్చట (శ్రీరంగమునందే సుఖముగ వసింపుము) అః సత్వాభివృద్ధికరంబులగు భగవత్ క్షేత్రంబులలో నెచ్చటనైనను నొకతావున వసింపవలయు ననుటకుగాను వీటిలో నొక్క దివ్యదేశమును పేర్కొనియున్నారు. జ్ఞానవంతుండు భగవత్క్షేత్రములయందు వసింపవలయునన్న విషయమును, "యత్ర నారాయణో దేవః పరమాత్మా సనాతనః। తత్పుణ్యం తత్పరం బ్రహ్మ తత్తీర్థం తత్తపోవనం తత్ర దేవర్షయ స్సిద్ధాః సర్వే చైవ తపోధనాః" (ఏ తావున సనాతనుండును పరమాత్మయునగు నారాయణుండు వేంచేసియున్నాడో, అదియే పుణ్యతీరము. అదియే తపోవనము. అట్టితావునయందు వారందఱును, దేవర్షులును, సిద్ధులును, తపోవంతులును) అని యరణ్యపర్వమునందు తీర్థయాత్రాసందర్భమునను, "గోమతః పర్వతో రాజన్ సుమహాన్ సర్వధాతుమాన్ వసతే భగవాన్ యత్ర శ్రీమాన్ కమలలోచనః మోక్షిభిస్సంస్తుతో నిత్యం ప్రభుర్నారాయణో హరిః" (ఓ రాజా! గోమతమనబడు పర్వతంబొక్కటి కలదు. అది చాలగొప్పది. అనేక గైరికాదిధాతువులు కలది. దానియందు కమలలోచనుండగు శ్రీమన్నారాయణుండు వేంచేసియున్నాడు. వానినచ్చట మోక్షార్థులందఱును స్తుతించుచున్నారు) అని వేఱొక్కతావున మహర్షులు తెలిపియున్నారు.

శ్రీమద్వాల్మీకి మహర్షియును, "సుభగశ్చిత్రకూటోసౌ గిరిరాజోపమో గిరిః యస్మిన్ వసతి కాకుత్స్థః కుబేర ఇవ నందనే" (నందనవనమున కుబేరుండున్నట్లు శ్రీరామచంద్రుండు వేంచేసియున్నట్టి చిత్రకూటపర్వతము సౌభాగ్యముగలదియై హిమవత్పర్వతముతో తుల్లతూగుచున్నది) అనుతావున భగవంతుండు

వేంచేసియున్నట్టి క్షేత్రమే వాసయోగ్యంబయినదియగు విషయమును ఈ పైశ్లోకమునందు "సుభగ" శబ్దముచే సూచింపఁజేసియున్నారు.

సాత్వతాదులయందును, స్వయంవ్యక్త, సైద్ధ, వైష్ణవంబులనఁబడునట్టి క్షేత్రంబులను, వాటివాటికిఁగల మాహిమాతిశయంబులనున్న వివరించిచెప్పి, "దుష్టేంద్రియవశాచ్చిత్తం నృణాంయత్ కల్మషైఃవృతం తదంతకాలే సంశుద్ధింయాతి నారాయణాలయే" (దుష్టేంద్రియముల మూలముగ మనస్సు కల్మషమునుపొందినట్టి వారికి దేహావసానకాలమున నది పరిశుద్ధ మగుచున్నది.) అనుతావున ఆ యా క్షేత్రంబుల సరిహద్దులలోపల వసించునట్టి వారికి శరీరావసానకాలమునఁ గలుగునట్టి విశేషము చెప్పఁబడినది.

కావున "యత్కించిదపికుర్వాణోవిష్ణోరాయతనేవసేత్ నకించిదపికుర్వాణో విష్ణోరాయతనేవసేత్" (దేనినైనను అనుష్ఠించుచున్నను విష్ణ్వాలయమున వసించునది. దేనినిన్ని అనుష్ఠింపకపోయినను, విష్ణ్వాలయమున వసించునది) అన్నట్లు ప్రవృతినివృత్తుల మూలముగ శక్యంబులయినట్టి కైంకర్యంబుల నొనర్చుచు, భగవద్భాగవతాభిమానముకు విషయంబయి సత్వగుణోపోద్బలకంబగు క్షేత్రమునందు వసించుట యుచితంబని యెఱుంగునది.

"నిగృహీతేంద్రియగ్రామోయత్రయత్రవసేన్నరః తత్ర తత్రకురుక్షేత్రం నైమిశం పుష్కరంతథా" (ఇంద్రియములను వశపఱచుకొనియున్నట్టివాఁడు ఎచ్చట వసించునో, అదియే కురుక్షేత్రము అదియే నైమిశము, అదియే పుష్కరము) అని

చెప్పినది వేదోక్తమార్గము లేనప్పుడు, ఏదైన నొకదేశము నందు వసించినను, ఈతని నివాసము మూలముగ ఆదేశము ప్రశస్తంబైనది కాఁగలదని తెలుపుటకుఁగానని యెఱుంగునది. ఈవిషయమును గుఱించి *శాండిలీవృత్తాంతమును దృష్టాంతముగాఁ గొనునది. కావున "జ్ఞానసమకాలముక్తః కైవల్యం యాతిగతశోకః తీర్థే శ్వపచగృహేవా నష్టస్మృతిః పరిత్యజన్ దేహం" (జ్ఞానియైనట్టివాఁడు పుణ్యక్షేత్రమున వసించినను, చండాలగృహమునందు వసించినను, అంతిమస్మరణములేక పోయినను ఈశరీరమును విడుచువాఁడై పరమపదమును బొందగలఁడు) అనుతావున శరీరము విడిచిపోవుటకుఁగాను స్థానవిశేష నియమమెద్దియును లేదని చెప్పినదియును, యేతావున మరణించినను, మోక్షమునకు కొదవలేదని తెలుపుటకుఁగానని యెఱుంగునది.

పా॥ ఆరాతవరుళముతమ్బొదిన్దకోయిలమ్బుయత్తోనయోత్తి
మన్నర్కళిత్తకోయిల్ । తోరాతతనివీరన్ తొళుద
కోయిల్ తుణైయానవిభీషణఱ్కుత్తుణైయాఙ్కోయిల్ ।
శేరాతపయనెల్లాం శేర్క్కుఙ్కోయిల్ శెళుమఱైయిన్
ముదలెళుత్తుచ్చేర్న్దకోయిల్ । తీరాతవినైయనైత్తుమ్
తీర్క్కుఙ్కోయిల్ తిరువరఙ్గమెనత్తిగళుఙ్కోయిల్ తానే॥

టీ॥ ఆరాత = ఎంతయనుభవించినను, ఇంకను అనుభవింప వలయునని యాశపుట్టించునట్టిదియు, అరుళముతమ్ = కృపామూలమగు అమృతము, పొదిన్ద = పొంగి బయటికివచ్చునట్టియునగు, కోయిల్ = శ్రీరంగము, అమ్బుయత్తోన్ = చతుర్ముఖబ్రహ్మచే, అయోత్తి = అయోధ్యావాసులగు, మన్నర్క్కు = రాజులకు, అళిత్తకోయిల్ = ఒసంగఁ

*శాండిలీవృత్తాంతమును ౨౪౩వ పేజీని చూచుకొనునది.

బడినట్టిస్థానము. తోరాధతనివీరన్ = పరాజయ మెంతమాత్రములేకుండ అసహాయశూరుండగు శ్రీరామచంద్రునిచే, తొఴుగుకోయిల్ = స్వయముగ ఆరాధింపఁబడినట్టి దివ్యదేశము. తుణైయాన వీభీడణనుక్కు = శ్రీరామచంద్రునికి సహాయభూతుండుగా నున్నట్టి శ్రీవిభీషణులవారికి, తుణైయాంకోయిల్ = సాంసారిక దుఃఖములఁబోఁగొట్టుటకు సహాయభూతంబగు భగవదారాధనస్థానము. శేరాతపయనిల్లామ్ = గుర్లభంబులగు ఫలంబులనన్నింటిని, శేర్కుమ్ = అభిప్రాపఁజేయునట్టి భగవంతునికి, కోయిల్ = వాసస్థానమైనది. శెఴుమఱైయిన్ ముదలెఴుత్తు = వేదములకాదిభూతంబగు ప్రణవముతో, శేర్న్దకోయిల్ = సదృశంబైనట్టిస్థానము. తీరాతవినైయనైత్తుమ్ = నివర్తింపఁజేయుట కలవికానట్టి పాపంబులన్నింటిని, తీర్కుమ్ కోయిల్ = నివర్తింపఁజేయునట్టి స్థానము. తిరువరంగమెన=అందఱు శ్రీరంగమని కొనియాడునట్లు, తిగఴుంకోయిల్ = ప్రకాశమానంబగు స్థానము.

తా॥ శ్రీరంగ మెట్టిదియనఁగా—ఎన్నిదినములుండి భగవద్గుణానుభవముఁజేసినను, ఇంకను అనుభవింపవలయునని యాశపుట్టించునట్టి యమృతమువంటిది. అయోధ్యాదేశపు రాజులకు చతుర్ముఖబ్రహ్మచే వాసస్థానముగా నొసంగఁబడినది. అసహాయవీరుండగు శ్రీరామచంద్రునిచే స్వయముగ సేవింపఁబడినది. శ్రీరామచంద్రునికి సహాయభూతుండగు శ్రీవిభీషణులవారు భగవంతుని ఆరాధించునట్టి స్థానము. గుర్లభంబులగు ఫలంబులొసంగునట్టి భగవంతునికి వాసస్థానము. వేదములకాదిభూతంబగు ప్రణవముతో సదృశమైనట్టి స్థానము. నివర్తింపఁజేయుట కలవికానట్టి పాపంబులనన్నింటిని వర్తింపఁజేయునట్టిస్థానము శ్రీరంగంబని యందఱిచేత కొనియాడఁబడునట్లు దేదీప్యమానంబగు స్థానము.

కణ్ణనడియినైయెమక్కుక్కాట్టుమ్ వెఱ్పెన్ఱు
వినైయరిరువినైయుఙ్కడియుమ్ వేఙ్కు।

తిణ్ణమితుపీడెన్న త్తి కర్రుమ్ వేఙ్బు తెళ్విన్ద
పెరు న్తీర్ తంగళ్ శెఱిన్దవేఙ్బు।
పుణ్ణియ త్తిన్ పుకలి తెన్న పొకర్రుమ్ వేఙ్బు
పొన్నులకిల్ పోకమెల్లామ్ పుణర్క్కుంవేఙ్బు।
విణ్ణవరుమ్ మణ్ణవరుమ్ విరుమ్బుమ్ వెఙ్బు
వేంగడవెఱ్పెనవిళంగుమ్ వేతవేఱ్పే॥

టీ॥ కణ్ణన్ = శ్రీకృష్ణునియొక్క, అడియిణై = శ్రీపాదంబులే, కాట్టుమ్ = ప్రాప్యప్రాపకంబులని నిరూపించునట్టిదియు, కడువినై యగి దువినై = తీక్ష్ణములగు పాపములను, కర్రుమ్ = పోగొట్టునట్టి, తిణ్ణమి తుపీడెన్న తిక్కర్రుమ్ వేఙ్బు = పరమపదంబిదియని చెప్పదగినట్లు ప్రకాశించు నట్టిపర్వతము, తెళ్విన్ద పెరుంతీర్తంగళ్ = నిర్మలంబులగు అనేకతీర్థములు, శెఱిన్దవేఙ్బు = చేరియుండునట్టిపర్వతము, పుణ్ణియత్తిన్ = పుణ్యములకు, పుకలిదెన్ఱు = సాధకమిదియని, పొకర్రుమ్ వేఙ్బు = అందఱునుకొనియా డునట్టిపర్వతము, పొన్నులకిల్ = పరమపదమునందలి, పోకమెల్లాం = భోగంబులనన్నింటిని, పుణర్క్కుంవేఙ్బు = ఇచ్చాట నేకలుగఁజేయునట్టిపర్వ తము. విణ్ణవరుమ్ = నిత్యముక్తులును, మణ్ణవరుమ్ = మానవులును, విరు మ్బుమ్ = ప్రేమించునట్టి, వేఙ్బు = పర్వతము, వేంకటవేర్పెన = శ్రీవేం కటాచలంబని, విళంగుమ్ = శాస్త్రప్రసిద్ధంబైనట్టి, వేదవేఱ్పే = వేద మయంబగు పర్వతము.

తా॥ శ్రీవేంకటాచలం బెట్టిదియనఁగా — శ్రీకృష్ణునియొక్క పాదంబులే ప్రాప్యప్రాపకంబులని తెలుపునట్టిది. తీక్ష్ణములగు పాపము లను నివర్తింపఁజేయునట్టిది. పరమపదంబిదియని చెప్పఁదగినట్లు ప్రకాశిం చునట్టిది. నిర్మలంబులగు పుణ్యతీర్థంబులకు స్థానభూతమైనది. పుణ్యసా ధకమిద్దియని చెప్పఁదగినట్లు ప్రకాశించునది. పరమపదమునందలిభోగం బులనన్నింటిని యీలోకమునందే కలుగఁజేయునట్టిది. నిత్యముక్తులచేతను

కొ్కానారిమయముంకంగైయుమ్ కావిరియుంకడలుమ్
నానానకరముమ్నాకముమ్కూడియనన్నిలమే॥

టీ॥ తేన్ = తేనెచేత, ఆర్ = నిండియున్న, కమల = కమలము నందుండు, తిరుమకళ్ = లక్ష్మీదేవికి, నాథన్ = భర్తయగు సర్వేశ్వరునికి, తికళ్ న్దిరుక్కైయుమ్= దేదీప్యమానమైనట్టి వాసస్థానమును, వానాడుకన్దవర్ = పరమపదమునుకోరునట్టి ముముక్షువులకు, వైయత్తు = భూమియందు, ఇరుప్పిడమ్ = వాసస్థానము, వట్టిరుమకొ్కానారిమయముమ్ = అతిదృఢమగునివృత్తిధర్మమునకభివృద్ధికరమైనట్టిహిమవత్పర్వతమును, కంగైయుమ్ = గంగానదియును, కావిరియుమ్ = కావేరియును, కడలుమ్ = సముద్రమును (సేతువును) నానానకరముమ్ = అయోధ్యాది నానానగరములును, నాకముమ్ = పరమపదమును, కూడియ = ఇవియన్నియునుచేరి, నన్నిలమే = మంచిస్థానము.

తా॥ భాగవతులు వేంచేసియున్నట్టి స్థానము, హిమాలయప్రదేశములును గంగా కావేర్యాది పుణ్యతీర్థములును, అయోధ్యాది పుణ్యనగరములును, పరమపదమును ఇవియన్నియుండును చేరియుండునట్టి పుణ్యక్షేత్రమనిపించుకొనుచున్నది.

శ్లో॥ సాకాశీతినచాకశీతిభువిసా యోధ్యేతినాధ్యాస్యతే
సావంతీతినకల్మషాదవతిసా కాంచీతి నోదంచతి।
ధత్తేనామధురేతినోత్తమధురాం మాన్యాపినాన్యా పురీ
యావైకుంఠకథాసుధారసభుజాం రోచేతనోచేతసే॥

టీ॥ యా = ఏనగరము, వైకుంఠకథాసుధారసభుజాం= సర్వదా భగవద్గుణానుభవము చేయునట్టివారియొక్క, చేతసే= మనస్సుకు, నోరోచేత = రుచింపదో, సా = ఆనగరము, కాశీతి = కాశీయన్నంత మాత్రమున, నచాకశీతి = వాసయోగ్యమైనది కాకున్నది. అయోధ్యేతి = అయోధ్యయన్నంతమాత్రమున, నాధ్యాస్యతే = పాపములను

పోగొట్టునట్టిదికాదు. అవంతీతి=అవంతీయన్నంతమాత్రమున, కల్మషాత్ = పాపమునుండి, నావతి = రక్షింపజాలదు. కాంచీతి = కంచియన్నంత మాత్రమున, నోదంచతి= పూజ్యము కాదు. మధురేతి = మధురయన్నం తమాత్రమున, ఉత్తమధురాం = ఉత్తమక్షేత్రములయొక్క మహిమను, నోధత్తే= ధరింపదు, అన్యాపురీ=వేఱొక్క యేక్షేత్రమున్ను, మాన్యా= ఆదరణయోగ్యమైనది, న = కాదు.

తా॥ కాంచీ, మధురా మొదలగు సమస్తక్షేత్రములును భాగవతు లకు మనోరంజకములగు వాసస్థానము అగుటంజేసి యట్టి మహిమగలవి యగుచున్నవే కాని, వాటివాటిపేరుయొక్క ప్రసిద్ధినిబట్టిమాత్రమే యవి యట్టివిగా నెన్నంబడుచుండలేదని భావము.

స్థానవిశేషాధికారము

ముగిసెను.



శ్రీమతే నిగమాంతమహాదేశికాయ నమః.







# రహస్యత్రయసారము



## నిర్యాణాధికారము

శ్లో॥ మనసికరణగ్రామం ప్రాణేమనః పురుషేచతం
ఝటితిఘటయన్ భూతేష్వేనంపరేచతమాత్మని।
స్వవిదవిదుషోరిత్థంసాధారణేసరణేర్ముఖైః
నయతిపరతోనాడీభేదైర్యథోచితమీశ్వరః॥

టీ॥ ఈశ్వరః = సర్వేశ్వరుండు, మనసి = మనస్సునందు, కరణ గ్రామం = ఇంద్రియ సముదాయమునున్ను, ప్రాణే = ప్రాణమునందు, మనః = మనస్సున్ను, తం = ఆట్టిప్రాణమును, పురుషే = జీవునియందున్ను, ఏనం = ఈజీవుని, భూతేషు = భూతసూక్ష్మములయందున్ను, తం = ఆట్టిజీవుని, పరేఆత్మని = పరబ్రహ్మమునంగను, ఝటితి = శీఘ్రముగ, ఘటయన్ = చేర్చుచున్నట్టివాఁడై, స్వవిదవిదుషోః = జ్ఞాన్యజ్ఞానులకుభయులకున్ను, ఇత్థం = ఇట్టివిధముగ, సాధారణే = దేహములోనుండి బయలువెడలుట సమానమైయుండఁ, పరతః = హృదయమునుండు పరమాత్మను బొందినపిదప, సరణేః = మార్గముయొక్క, ముఖైః = ద్వారభూతములగు, నాడీభేదైః = విశేషనాడులగుండ, నయతి = ఈజీవాత్మను పరమపదమునకుఁ దోడుకొని పోవుచున్నాడు.

తా॥ సర్వేశ్వరుండు మనస్సునం దింద్రియములను, మనస్సును ప్రాణమునందును ప్రాణమును జీవునియందును, అట్టిజీవుని భూతసూక్ష్మములయందును, అట్లు భూతసూక్ష్మ విశిష్టుడగు జీవుని, పరమాత్మయందును శీఘ్రముగ పొందించి, ఇట్లు జ్ఞాన్యజ్ఞానులకు సమానముగ ఉత్క్రమణమును కలుగఁజేయఁగా, హృదయమునందుండు పరమాత్మను పొందినపిదప, సుషుమ్నానాడిగుండ ఈజీవుని పరమపదమును పొందించుచున్నాడు.

ఇవ్విధముగ “లోకవిక్రాంతచరణౌ శరణం తేవ్రజంవిభో” (త్రివిక్రమావతారకాలమున లోకలంబులనన్నింటిని యతిక్రమించినట్టి నీశ్రీపాదములను శరణుజొచ్చినాడను) అన్నట్లు సర్వేశ్వరుని శ్రీపాదములపైపడఁగా, “హస్తావలంబనో హ్యేకో భక్తిక్రీతో జనార్దనః” (భక్తివలన నాకర్షింపఁబడినట్టి భగవంతుండు చేయిచ్చును) అన్నట్లు, సర్వేశ్వరుండు ఈతనిచెయ్యిపట్టుకొని “రాజాధిరాజస్సర్వేషాం” అన్నట్లు ఉభయ విభూతినాథుండగు సర్వేశ్వరుండు, తనకిష్టమువచ్చినట్టి యొక తావునుంచఁగా, పట్టాభిషిక్తురాలగు రాజమహిషివలెనే విశేషముగ అభిమానింపఁబడినట్టివాఁడే, తనపరమైకాంతిత్వమున కనుగుణముగ ప్రవర్తించునట్టి యీయధికారి, తనవంటియధికారులలో, ప్రారబ్ధసుకృత వైచిత్ర్యమువలన సంభవించునట్టి యహంకార మమకారములును, వాటిమూలముగ సంప్రాప్తంబులగు అపచారంబులును, ప్రయోజనాంతర రుచియును, అందుమూలముగ కలుగునట్టి దేవతాంతర సంబంధమున్ను, బుద్ధిదౌర్బల్యమును, అందుమూలకమగు ఉపాయాంతరప్రీతియును, ఇవ్విధమగు వైపరీత్యము కలిగినట్టి వారికిన్ని, ఇట్టివైపరీత్యమెద్దియును కలుగకుండ, ప్రారబ్ధసుకృతము వలనను, ప్రవృత్తిచేసినప్పుడు సంక

ల్పించుకొనినట్టి ఫలవిశేషమువలనను, నిర్దోషమగు కైంకర్య మున స్థిరముగా నుండియుండునట్టి వారికిన్ని సంసారము నుండి మోక్షమును బొందుటకు కాలవిళంబము జరుగుటలోను, అది జరుగకపోవుటలోనును నియామకంబెద్దియని యడిగితివేని, చెప్పెదను.

ఈ సందర్భమున వీరికి (నాస్తికులకు) చార్వాకులకు వలెనే అహంకారమమకారములు స్థిరముగానుండవు. జాగ రూకతో ప్రవర్తించుచున్నను, ఒకప్పుడు కాకపోతే ఒకప్పుడైనను, సలనము గలుగునట్లు, ఎప్పుడైన నొకప్పుడు సంప్రాప్తించునట్టి యహంకారమమకారములు వీరికి వివేకముగలుగువరకు మా త్రమేయుండి యట్టివివేకము మూలముగ నశింపఁగలవు. అప రాధంబులు సంప్రాప్తంబులైనట్లయిన, క్షమాపణమునుకోరు కొనువరకుగాని, దండనను విధించువరకుగాని యుండి, కోరిన కాలమున నశించునవియగునట్లు అపరాధ పరిహారాధికార మునఁ జెప్పియున్నాము.

మోక్షమును బొందుటకు కాలవిశేషమును నిశ్చయిం చుకొనక ప్రపన్నులయినట్టి వారిఁగురించి॥ "అపాయాద్విరతశ్శ శ్వన్మాంచైవ శరణంగతః తనూకృత్యాఖిలం పాపం మామా ప్నోతినరశ్శనైః" (అపాయమునుండి విడదలయైనట్టివాఁడై నన్నే మాటిమాటికి శరణుజొచ్చినట్టివాఁడు, పాపమునంత యును నశింపఁజేసికొని, క్రమముగ నన్ను పొందగలడు). అని చెప్పియున్నది. కావున ముముక్షువగుటంజేసి యీతనికిఁ బ్ర యోజనాంతరములయెడల ప్రీతి స్థిరముగా నుండనేరదు.

రెంటిని విడువక, యట్టివారికివలెనే మోక్షరుచితోఁ బాటు ప్రయోజనాంతరరుచి గూడ నుండియున్నట్లయిన, నాతని హితముఁ గోరునట్టివాఁడగు సర్వేశ్వరుండు «యాచి-తోపి సదా భక్తైః న హితం నాపేక్షతే హరిః । యస్యానుగ్రహమిచ్ఛామి ధనం తస్య హరామ్యహమ్» (భక్తులు కోరినను, వారికి హితముగానట్టిదానిని భగవంతుఁడొసంగఁడు. ఓయర్జునా ! ఎవనిని అనుగ్రహింపఁగోరుచున్నానో, వానిద్రవ్యమును నేను హరించుదును) ఇత్యాదిశ్రుతులను, కుండధరోపాఖ్యానాదులయందును చెప్పియున్నట్లు. కొన్ని ప్రయోజనాంతరముల నీయక, లోపింపఁజేసియు, మరియు నన్నింటివిషయమున అల్పములనియు, అస్థిరములనియు, దుఃఖమిశ్రములనియు నివ్వాధమగు వివేకమును గలుగఁజేయుటచే నాతనికే వాటివిషయమున వైరాగ్యము గలుగఁజేసినను, 1సౌభరి 2కుచేలాదులకు

---

1 సౌభరియనువాఁడు బ్రహ్మర్షి. ఈతఁడు చాలకాలము తపస్సు చేసినపిదప, [illegible] యయాతి యొద్దకువచ్చి వాని కూఁతుళ్లలో నొకదానిని తనకియ్యమని యడిగెను. అంతట యయాతియును తనయొక్క నూరుగురు కూఁతుళ్లలో తనను వరించినదానిని పెండ్లి చేసికొనమని చెప్పెను. అప్పుడు అతని నూర్గురు కూఁతుళ్లును ఈ సౌభరిని వరింపఁగా, సౌభరియును నూర్గురినిన్ని పెండ్లిచేసికొని నూరు శరీరములఁగొని యేకకాలమున వారి నూర్గురితోను సౌఖ్యము ననుభవించునట్టి శక్తిని తన తపోమూలకంబగు భగవదనుగ్రహమువలన లభించి కొంతకాలము సంసార సుఖము ననుభవించి అటుపిమ్మట అట్టి భగవదనుగ్రహమువలననే మోక్షమును పొందినవాఁడాయెను.

2 కుచేలుండు ఒక బీదబ్రాహ్మణుండు. ఈతఁడు శ్రీకృష్ణునికి స్నేహితుండై బాల్యమున శ్రీకృష్ణునితోఁగూడ సాందీపునివద్ద విద్యను లభించినవాఁడాయెను. ఈతఁడు అటుపిమ్మట దారిద్ర్యవశమున అతి కష్టపడుచు శ్రీకృష్ణుని యాశ్రయించి, యతని యనుగ్రహమువలన మిక్కి

వలెనే కొన్ని భోగములనో సంగీతానేవారికి వాటియెడల విసుకు పట్టునట్లు చేసియును మోక్షకాలమునుగుణించి ప్రవర్తిచేసి నట్టివారికి ఆకాలములోపలనే ప్రయోజనాంతరములయెడల వైరాగ్యము కలుగఁగలదు. తక్కినవారికిన్ని ‹‹అథోపాయప్రవణోఽపి భుక్త్వా భోగాననామయాన్ అంతే విరక్తిమాసాద్య విశత్యేవ పరం పదం›› (ఉపాయాంతరములయెడల ప్రీతిగలవాడై నప్పటికిన్ని వాటివలనఁ గలుగునట్టి ఫలము ననుభవించిన పిమ్మట వైరాగ్యముగలవాఁడై శ్రీవైకుంఠమును బొందుచున్నాఁడు) అని చెప్పియున్నట్లు వైరాగ్యము కలుగువరకును మోక్షము గలుగుటలో విళంబము కలుగును.

దేవతాంతర సంబంధమున్నప్పటికిన్ని, సర్వేశ్వరుండు యేదొకమార్గమున, శ్రుతియందుఁ జెప్పియున్నప్రకారము, ఈతనినిపరవైకాంతులతోఁ జేర్చి, ఇవ్విధముగ ప్రవర్తించితిమేయను కొని లజ్జపడువరకునుదిద్దుపాటుచేసి. ఈతనియొక్క హద్దుమీరిన నడివడికను మాన్పగలఁడు. ఒకవేళ, కొందఱికి దేవతాంతర సంబంధము స్థిరముగా నుండియున్నట్లయిన, వారికి సిద్ధోపాయ సంబంధమే లేదనియు, ఇఁకమీఁదు నరకాదిప్రాప్తి గలుగఁగలదనియు నెఱుంగునది. భగవద్విషయమునఁ గృషిజేసినంతవరకు ఈతని కృషియనునది యేదొక దినమున ఈతనికి ఉపాయ నివృత్తిని గలుగఁజేసి, తద్వారా ఉపయోగపడగలదు. మహా విశ్వాసము సంపూర్ణముగాఁగలిగి, ప్రవర్తిచేసినవారికి బుద్ధి

---

మీరిన సంపత్తును లభించినవాఁడై కొంతకాలము గడచినపిమ్మట ఆ శ్రీకృష్ణుని యనుగ్రహమువలననె మోక్షమును బొందినవాఁడను విషయము జగత్ప్రసిద్ధము.

కార్పణ్యమున్ను, ఉపాయాంతరముల విషయమునఁ బీతియును గలుగనేరవు. ఇవి కలిగిన వారివిషయమున, వీరికి ముందు కలిగి నట్టి విశ్వాసము మంచిదైనదిగా నుండగలదనుకొనునది. భగ వంతుండు వీరినన్ని మహావిశ్వాసము గలుగువరకును దిద్దుపా టుచేసి, పూర్ణప్రపత్తినిష్ఠులనుగాఁ జేయఁగలడు. ఇట్టి వైపరీత్య ము తెల్పియును గలుగకుండ ప్రవర్తించునట్టి వారికి మోక్షము క లుగుటలో నాలస్యము కలుగునని శంకయుం గలుగనేరదు. వీరు కోరుటయే యాలస్యము. కోరినట్లయిన, కోరినకాలమున తప్పక మోక్షము కలుగఁగలదు. ఇట్టినిష్ఠ లభించినట్టి యీ యధికారి "కర్మైత్రాయిరున్దువాళుమ్ కోమ్పుత్తియుక్తి" (భ గవంతుండు కోవిలద్వారమున తనసేవకుగాను నిరీక్షించుచున్న ట్టి ప్రపన్నులను మిక్కిలి ప్రేమించుచున్నాడు) అన్నట్లు (శ్రియః పతియగు సర్వేశ్వరునికి యెల్లప్పుడును యిష్టుండుగానుండగల డు. ఈతనివిషయమున నిరుపాధిక సర్వశేషియై, నిరుపాధిక స్వతంత్రుండై, సత్యసంకల్పుండగు సర్వేశ్వరుండు సమస్త భయంబులకును కారణభూతంబగు నిగ్రహసంకల్పమును, "తద ధిగమ ఉత్తరపూర్వాఘయోరశ్లేషవినాశౌతద్వ్యపదేశాత్" (బ్రహ్మవేత్తతో సంచితాగామి పుణ్యపాపకర్మములు సంబంధిం పవు. అట్లు శ్రుతియున్నందున) అను బ్రహ్మసూత్రమునఁ జెప్పి యున్నట్లు, సద్వారక ప్రపత్తినిష్ఠునికి ఉపాసనను ప్రారంభించి నప్పుడువలెనే, ప్రపత్తివాక్యమును ఉచ్చరించునప్పుడును, ప్రథ మక్షణముననే నిలిపివేసి, ఈతనిన్ని ఈతనితో సంబంధించినట్టి వారినిన్ని నిత్యసూరుల గోష్ఠిలోఁ జేర్చినను అభినివేశము చెడిపో కుండ ఆశ్రితుల యపరాధముల నించుకైనను మనస్సునందుం

చుకొనినట్లుగా సర్వేశ్వరుండు ప్రియుండై వానిసంబంధులయొక్క బుద్ధిపూర్వకములగు అపరాధంబులకున్ను అనుతాపాదుల మూలముగ నాశముం గలుగఁ జేయుట కావశ్యకంబైనట్టి అనుగ్రహసంకల్పమునొనర్చి, “విణ్ణులకు ఎల్లాం నానాయ్ విరుకణ్ణన్” (పరమపదమునకు కృపచేయుటకు తగ్గియుండువాడు) అని సాయించినట్లు ఈచేతనుండు సమ్మతింపకున్నను కళంబమునకై తాను పశ్చాత్తాపపడుచు, త్వరపడి, “ఇరుళ్తరుమాఞాలత్తుళినిప్పిఱవియాన్ వేణ్డేన్” (అజ్ఞానావహకమైన అనేక విరోధులుగల భూలోకమునందు జన్మింపగోరను) అనియు “మాయశ్శెయ్యేలెన్నై” (నీకంటె సితరములగు వాటివిషయమున ప్రీతిఁ గలుగఁ జేసి నన్ను మోహింపఁజేయవలదు) అనియు, “ఉన్ తిరుమార్పత్తు మాలైనంగైవాశశ్చెయ్ పూఙ్గుళలాళ్ తిరువాణైనిన్నాణై” (నీవక్షస్థలవాసినియు, కల్యాణగుణపూర్ణురాలును, మనోహరంబులగు కేశములు గలదియునగు పిరాట్టితో శపథముచేసి) అని సాయించినట్లు ఈతండు ఆతురపడుచు నిర్బంధించునట్లుచేసి, “శరణమాకియ నన్తాళడైన్దార్క్కెల్లాం మరణమానాల్ వైకున్దమ్ కొడుక్కుమ్ పిరాన్” (తనను శరణుజొచ్చినట్టివారికి ఉపాయభూతుండగు సర్వేశ్వరుండు శరీరావసానమున మోక్షమునొసంగును) అని సాయించినట్లు, ఈతండు కోరినప్రకారము ప్రారబ్ధ శరీరావసానమున, పరమపదప్రాప్తిని గలుగఁ జేయుటకై సంకల్పించి, బంగారుగొలుసువలెనున్ను ఇనుపగొలుసువలెనున్ను ఈతనితో బంధించియున్నట్టి సంచితాగామి పుణ్యపాపకర్మంబులనున్ను, ప్రారబ్ధకర్మములోను ఈతండు ఇష్టపడినట్టి యంశమునుతప్ప తక్కినదానినంతయును, “పోయపిఴైయుమ్

పుకుత్రవామ్ నిస్తనవృస్తియిన్ హ్యా శాకుమ్" (సంచితాగామి
కర్మంబులను అగ్నియంటుకొనినట్టి దూదివలెనే గహింపఁజేసి)
అని నాయించినట్లు యింతకుముందే యీతనితో సంబంధింపక
యున్నట్టివగుటంజేసి, శరీరావసానము కై తలంచునట్టిసమ
యము కాఁగానే, "ప్రియేషు స్వేషు సుకృత మప్రియేషు చ దు
ష్కృతం విసృజ్య ధ్యానయోగేన బ్రహ్మైత్యేతి సనాతనం" (తన
కు స్నేహితులయినవారికి తనపుణ్యమును తనకు విరోధు
లయినట్టివారికి పాపమును వొప్పగించి ధ్యానయోగముచే
పరబ్రహ్మమును పొందును) అనియు "సమ్మాణపోతేవి
[illegible] త్తముక్కానాట్టులుళ్ళ వమోల్లాం తుమ్మినా తేకైవిట్టోడి
[illegible]కళ్ పాయ్ద్నవే" (మృత్యువువలెనే బాధకంబులగు స
ర్వపాపములును, రాజభటులుచూచినతోడనే దొంగలు పఱు
గెత్తిపోవునట్లు, (ప్రపన్నుని విడిచిపోవుచున్నవి) అని స్మృతిక
ర్తలు చెప్పిన ఉపనిషదర్థప్రకారము ఈతని అనుకూలుల ప్ర
క్కను ప్రతికూలుల ప్రక్కనున్న ఈతని పుణ్యపాపములను ఈత
ని యానుకూల్య ప్రాతికూల్యములకు ఫలముగ ఇతరులకడకుఁ
బోయి వ్యాపించునట్లుచేసి, "దివాచ శుక్లపక్షశ్చ ఉత్తరాయణమే
వచ ముమూర్షతాం ప్రశస్తాని" (పగలును, శుక్లపక్షమును, ఉత్త
రాయణమును చనిపోవువారికి మంచివి) అని స్మృతులయందు
ను, జ్యోతిశ్శాస్త్రమునందలి నిర్యాణప్రకరణమునందును, ఫలాం
తరాసక్తులైయుండు వారినిన్ని మోక్షోపాయపూర్తి లేనట్టివారి
నిన్ని గుఱించి చెప్పఁబడునట్టి కాలనియముతో నిమిత్తములేకుం
డ, "నిశి నేతిచేన్న సంబంధస్య యావద్దేహభావిత్వాత్" (రాత్రి
యందు మృతినొందినవారికి మోక్షము రాదన్నమాట లేదు

సంబంధము దేహమున్నంతవరకు నుండునదికదా) అనియు, "అ
తశ్చాయనేపి దక్షిణే" (అందువలన దక్షిణాయనమందు దోషమున్ను
లేదు) అనియును బ్రహ్మసూత్రములయందుఁ జెప్పియున్నట్లు
పగలు, శుక్లపక్షము, ఉత్తరాయణములయందు గాని, రాత్రి
కృష్ణపక్షము, దక్షిణాయనములయందుగాని తాను సంకల్పిం
చుకొనిన సమయమునందు పూర్వసంస్కారము చెడిపోకుండ
మనోరథపూర్తి యగునట్లుచేసి, చెరలో నుంచబడినట్టి రాజ
కుమారుని విషయమున. ప్రసన్నుండైనట్టి రాజు సంకెళ్లను
విడిపించి చెరసాలలోనుండి బయటికి తీసికొనిపోవునట్లు, ప్రశ
స్తాప్రశస్తరూపమగు కాలనియమంబెద్దియును లేకుండ, అ
క్కాలమున తటస్థింపవలసియున్నట్టి యేదొక కారణమునుమర
ణించుటకుగాను గలుగఁజేసి, వాక్కు మొదలగు బాహ్యేంద్రి
యములను పదింటిని మనస్సుతోఁ జేర్చి, ఇవ్విధమున పదునొకం
డు యింద్రియములతోనును గూడియున్నట్టి ప్రాణవాయువును
జీవునితోఁ జేర్చి, ప్రాణముతోను ఇంద్రియములతోనును గూడి
యున్నట్టి జీవుని, సూక్ష్మశరీరమేర్పడునప్పుడు, స్థూలశరీరమును
విడిపించి, పంచభూతసూక్ష్మములతోఁ జేర్చి, ఇవ్విధమున ఇంద్రి
యములతోను, ప్రాణముతోను, భూతసూక్ష్మములతోనును
గూడియున్నట్టి జీవుని స్వాభావికమిత్రుండై హృదయమునం
దుండువాఁడగు తనయందు విశ్రమించునట్లుచేసి, ఇవ్విధమున
స్థూలశరీరమునుండి యింతవరకును జ్ఞానులకును అజ్ఞానులకును
అందఱికిని సమానమగు ఉత్క్రాంతిని (బయలు వెడలుటను)
గలుగఁజేసి,

శ్లో॥ అనన్తారశ్మయస్తస్య దీపవద్యః స్థితో హృది।
సితాసితాః కద్రునీలాః కపిలాః పీతలోహితాః॥

తా॥ హృదయమునందు దీపమలెనున్నట్టి వానికి లెక్క లేని రశ్మిలు కలవు. వాటిలో కొన్ని తెల్లనివి గాను, కొన్ని నల్లనివి గాను, మరికొన్ని కద్రునీలములు గాను, మరికొన్ని కపిలవర్ణములు గాను, మరికొన్ని పచ్చనివిగాను, మరికొన్ని యెఱ్ఱనివిగాను నిర్విధముగా నుండగలవు.

శ్లో॥ ఊర్ధ్వమేకస్థితస్తేషాం యోభిత్వా సూర్యమండలం।
బ్రహ్మలోకమతిక్రమ్య తేన యాతి పరాం గతిం॥

తా॥ వాటిలో నొక్కటి యూర్ధ్వముగా వ్యాపించి సూర్యమండలమును భేదించుకొని బ్రహ్మలోకమును దాటిపోయి యున్నది. దానితోఁగూడ బోవునట్టి జీవుండు పరమపదమును బొందుచున్నాడు.

శ్లో॥ యదస్యాన్యద్రశ్మిశతం ఊర్ధ్వమేవ వ్యవస్థితం
తేన దేవశరీరాణి సధామాసి ప్రపద్యతే

తా॥ ఊర్ధ్వముగా వ్యాపించునట్టి తక్కిన నూఱురశ్ములను అనుసరించి పోవునట్టివారు దేవలోకమును పొందగలరు.

శ్లో॥ యేనైకరూపాశ్చాధస్తా ద్రశ్మయోస్య మృదుప్రభాః
ఇహకర్మోపభోగాయ తైస్సంసరతిసోవశః

తా॥ క్రిందిపైపున వ్యాపించునవియును, యేకవర్ణము గలవియును, మృదుప్రకాశము గలవియునగు రశ్ములను అనుసరించి పోవువారు ఈలోకమున కర్మానుభవముకుగాను సంసారమున నుందురు.

అని యీగ చెప్పియున్నట్లు దొంగలుగొనిపోవునట్టి మార్గముల లైన ఆత్మాపహారులయిన వారు స్వర్గనరకాదులకుఁ బోవునట్టి మార్గాంతరములకు ద్వారభూతములగు నాడులగుండను పోకుండునట్లు అడ్డగించి, అర్చిరాదిమార్గమునకు ద్వారభూతమైన నూటయొక్కటవదగు బ్రహ్మనాడిగుండ ప్రవేశింపఁజేసి, మూర్ధగణముల ద్వారా బయలువెడలునటు చేయును.

ఒకదినమున శ్రీకూరత్తాళ్వారులవారికి దేహావసాన కాలము సమీపించినప్పుడు నాలుక వెనుకకులాగుకొనిపోవుచుండఁగా శ్రీభాష్యకారులవారి శ్రీపాదములను గట్టిగాపట్టుకొనిరి. అంతట వారు శ్రీకూరత్తాళ్వారుల చెవిలో ద్వయమును సాయించిరి. అకాలమున ప్రక్కనుండు స్వాములందఱును, "ఇట్టియదృష్టము మనకు గలుగుట దుర్లభము. మన మేమి చేయగలము" అని వ్యాకులపడఁగా, వీరి అభిప్రాయమును దెలిసికొని, శ్రీభాష్యకారుల వారిట్లు సాయించిరి. "శ్రీ కూరత్తాళ్వారుల స్వభావము మీకు తెలుసునా? ఈ యవసరమందు వీరికిది కర్ణపూరమునున్ను కలకండనున్ను యిచ్చినట్లు కాగా! మేము దీనిని ఉపాయముకు ఉపకారకముగాను చేసియుండలేదు." ఇట్లు సాయింపఁగా, స్వాములు తెలిసికొని నిశ్చింతులయిరి.

కావున, "నష్టస్మృతేరపి పరిత్యజత దేహం" అనియు "స్థితే మనసి సుస్వస్థే" అనియు నీరెండు శ్లోకములయందును "తుప్పుడైయారై యడైవతెల్లాం" అను పాశురమువందును చెప్పియున్నట్లు, ప్రపన్నునికి అంతిమస్మృత్యాదు లుండవలసిన నిర్బంధములేదు. "శరీరపాతసమయే కేవలం మదీయయైవ

వదమయమాతిప్రబుద్ధో మామేవావలోకయన్నప్రచ్యుతపూర్వ సంస్కారమనోరథః" (దేహావసానకాలమున కేవలము నాయొక్క దయచేతనే మిక్కిలి తెలివి తేటలుగలవాఁడై నావంకనే చూచుచు పూర్వ సంస్కార మనోరథంబులు చెడనివాఁడై) అని సాయించినట్టి దానిని ఈ పైవచనముల కనుగుణముగ నేదొకవిధముగ నిర్వహించుకొనవలయును. అదియెట్లనిన, గద్యత్రయమునఁ జెప్పఁబడినట్టి యంతిమస్మృతియును నది లేకయంతిమస్మృతిరిన్ని ఉపాయఫలముగాఁగోరి ప్రపన్నులైనట్టి వారికిలభింపఁగలదని కొందఱు ఆచార్యులు నిర్వహింతురు.

ఇట్లాటిమేలని, ఒక్క శరీరమునందును అంతిమస్మృతి యనునది నిర్విషయము గా సంశయాలను గాన, ఇది యొకవేళ భగవద్వ్యతిరిక్తమగు విషయమునఁ గలుగునట్లయిన, "యంయంవాపిస్మరన్భావం" (ఎవ్వండు మార్గంపమయమున నెట్టిభావన గలవాఁడుగానుండునో అట్టిభావము ఫలమునే పొందగలఁడు) అన్నట్లు విపరీతముగా పరిణమింపఁగలదు. కావున, గద్యయందు సాయించినవిధమునసే. స్వతంత్రప్రపత్తి నిష్ఠునకి భగవద్విషయమున అంతిమస్మృతి యవశ్యముగ గలుగఁగలదు. కావున "నష్టస్మృతిరపి" ఇత్యాది వచనములు భగవద్గీతల యందు అష్టమాధ్యాయమునందును, "యం యోగినః ప్రాణవియోగకాలే యత్నేనచిత్తే వినివేశయంతి" (యోగాభ్యాసపరులు ప్రాణవియోగకాలమున నెవ్వని ప్రయత్నముతో మనస్సులో నుంచుకొందురో" ఇత్యాది తావుల నున్నస్వయత్నసాధ్యములుగాను విధింపఁబడినట్టి పద్ధతుల యందు ఉపాయముగాను అంతిమస్మృతి యక్కఱలేదని తె

లుపుచున్నవని కొందఱు ఆచార్యులు అనుసంధించుకొనుచు
న్నారు!

ఈతావున "కేవలం మదీయయైవ దయయా=కేవలము
నాదయచేతనే" అనికదా నాయుచియున్నారు. అంతిమస్మృ
తియనఁగా—వాక్కు మొదలగు ఉపశాంతములుకాఁగా
(పడిపోఁగా) మనస్సున్న ఉపశాంతమగుటకు (స్మృతితప్పుటకు)
ముందుగ గలుగునట్టి యొకవిధమైన స్మృతి. ఇది ప్రస్తావన
మున్నవారికి తెలియదు. "దృశ్యతేహి వాగింద్రియం ఉపర
తేపి మనఃప్రవృత్తిః" (నోరుపడిపోయినను మనస్సు పనిచేయు
చున్నట్లు చూచుచున్నాముకదా) అని శ్రీభాష్యమునఁ జెప్ప
బడియును యేదో దానినాలముగ ఈతని మనస్సు పనిచే
యుచున్నట్లు తెలిసికొనునట్టి విధము గా తెలుపుచున్నది.
కొన్నికొన్ని వ్యాధులయందు చూచినదానిని తెలిపినా
రనియును చెప్పవచ్చును కావున భగవద్విషయమున ఈచేత
నునికిఁ గలుగఁగల యంతిమస్మృతి యనునది ముక్తులు కాఁ
బోవునట్టివారికిని, మోక్షము నొసంగునట్టి సర్వేశ్వరునికిన్ని
మాత్రమే తెలియఁగలదు, ఇంతియే. దీనికిపైని యోగులకును
యోగులుకానివారికిని అందఱికిని సర్వసాధారణముగ పరమా
త్మయందు విశేషించుచువరకును సుషుప్త్యవస్థతో తుల్యముగా
నుండగలదు, ఈ యవస్థనుగుఱించి "కాష్ఠపాషాణసన్నిభం"
"నష్టస్మృతిరపి" అనియును "తలంపడు" అనియును చెప్పియు
న్నదియెందువలననంటివేని, ప్రపన్నాధికారి విషయమున విశే
షించి యొక్క యతిశయమునున్న చెప్పనలవికాదు. దీనిపైని
"మత్తః స్మృతిర్జ్ఞానమపోహనంచ" (నావలననే ఈచేతనునికి

జ్ఞానముండుటయును జ్ఞానములేకపోవుటయును గలుగుచున్నవి) అని ప్రాజ్ఞుండు జ్ఞానమును గలుగఁ జేయఁగా, దానిమూలముగ నాడులను గుర్తెఱిఁగినవాఁడై బ్రహ్మనాడిలోఁ బ్రవేశించినట్లయిన, అటుపిమ్మట కాలతత్త్వమున్నంతవఱకును, ఎల్లప్పుడు పగలుగానేయున్నట్లు ఈతనికి ఱంతయును జ్ఞానమయమే కాఁగలదు.

పా॥ నన్నిలమామ(వ)తునల్పగిలామ(వ)తునన్నిమిత్తమ్,
ఎన్నిలుమాం న(వ, ను(ద)యా తామరఙ్గరడియవర్క్కు,
మిన్నై మేనివిడుమ్బయణత్తుక్కిలక్కులదోర్,
నన్నిలైయానదు నాడివఴిపుక్కు నడనెఱివే॥

టీ॥ అరంగరడియవర్క్కు = శ్రీరంగనాథునిదాసులకు, మిన్నై మేని విడుమ్బయణత్తుక్కు = క్షణికంబగు శరీరంబును విడుచుటయనెడి ప్రయాణమునకు, యావదు = ఏదేశము ఉపయుక్తంబైనదో, అదువే = ఆదేశమే, ఇలక్కులదు = లెక్కకు రావుకుఁ గానిపోనిదియు, ఓర్ = అద్వితీయమును, నన్నిలైయానదు = మంచిస్థానంబగు శరీరమధ్యమునందుండు, నాడివఴిపుక్కు నడనెఱి = మూర్ధన్యనాడిగుండ అర్చిరాదిమార్గమునఁ బోవునట్టివానికి, నన్నిలమామ్ = మంచి ప్రదేశము కాఁగలదు, అదువే = అదియే, నల్పకలామ్ = మంచిపగలు కాఁగలదు, అదువే = అదియే, నన్నిమిత్తమెన్నలుమామ్ = మంచి నిమిత్తము కాఁగలదు.

తా॥ ప్రపన్నులతో సంబంధమును గలుగఁజేసికొనుటకుగాను శ్రీరంగమునందు వసించునట్టి వారికి మరణించుటకేవి మంచి దేశకాలనిమిత్తములో, అవియె. మూర్ధన్య నాడిగుండ బయలువెడలి అర్చిరాది మార్గముద్వారా ప్రయాణముచేయునట్టి జీవాత్ములకును మంచి దేశకాలనిమిత్తములు కాఁగలవు.

శ్లో॥ దహర(జఠర)కుహరే దేవ స్తిష్ఠన్నిమద్వరదీర్ఘికా
నిపతితనిజాపత్యాదిత్సావతీర్ణపితృక్రమాత్ ।
ధమనిమిహన స్తస్మిన్కాలే సఏవ శతాధికా
మకృతకపురప్రస్థానార్థం ప్రవేశయతి ప్రభుః॥

టీ॥ దహరకుహరే = దహరాకాశమునందు, తిష్ఠన్ = వసించుచున్నట్టివాఁడును, దేవః = ప్రకాశమానుండునగు పరమాత్మయే, నిమద్వరదీర్ఘికాయాం = బురదతోఁ గూడియుండునట్టి భావియందు, అనఁగా సంసారమునందు, నిపతిత = పడియున్నట్టి, నిజాపత్య = తన సంతానమగు ఈ జీవుని, ఆదిత్సా = పైకి తీయవలయునని, అవతీర్ణపితృక్రమాత్ = సమీపమునకు వచ్చునట్టి తండ్రివలెనే బలవంతముగ పైకితీసి, అకృతకపురప్రస్థానార్థం = పరమపదమునకై ప్రయాణము చేయుటకు గాను, శతాధికాం = నూటయొక్కటియగు, ధమనీం = సుషుమ్నా నాడిని, యః = ఎవండు, నః = మమ్ములను, ఇహ = ఈలోకమునందు, తస్మిన్ కాలే = తత్క్షణమే, ప్రవేశయతి = ప్రవేశింపఁజేయుచున్నాఁడో, సఏవ = వాఁడే, ప్రభుః = మాయొక్క స్వామి.

తా॥ ఎవ్వండు మమ్ములను తండ్రివలెనే ఈ సంసార కూపము నుండి బయటికితీసి మూర్ధన్య నాడిగుండ పరమపదముఁ గొనిపోవుచున్నాఁడో, వాఁడే మాయొక్క ప్రభువు.

నిర్యాణాధికారము

ముగిసెను.



శ్రీమతే నిగమాంతమహాదేశికాయనమః.







# రహస్యత్రయసారము



## గతిచింతనాధికారము.

శ్లో॥ జ్వలనదివసజ్యోత్స్నాపక్షోత్తరాయణవత్సరాన్
పవనతపనప్రాలేయాంశూన్క్రమాదచిరద్యుతిం।
జలచరపతిం దేవాధీశం ప్రజాపతిమాగత
స్తరతి విరజాం దూరేవాచ స్తతఃపరమద్భుతం॥

టీ॥ జ్వలన = అగ్నిని, దివస = పగలు, జ్యోత్స్నాపక్ష = శుక్లపక్షము, ఉత్తరాయణ = ఉత్తరాయణము, వత్సరాన్ = సంవత్సరమును అనఁగా వీటియభిమాని దేవతలను, పవన = వాయువు, తపన = సూర్యుండును, ప్రాలేయాంశూన్ = చంద్రులను, అచిరద్యుతిం = విద్యుత్తును, జలచరపతిం — వరుణుని. దేవాధీశం = దేవేంద్రుని, ప్రజాపతిం = ప్రజాపతినిన్ని, క్రమాత్ = క్రమముగ, ఆగతః = పొందినవాఁడై, విరజాం = విరజానదిని, తరతి = దాటుచున్నాడు. తతఃపరం = అటుపిమ్మట, అద్భుతం = ఆశ్చర్యభూతుండని, వాచఃదూరే = వాచామగోచరుండునగు పరమపదనాథుని బొందుచున్నాడు.

తా॥ ఈ జీవుండు అర్చిరాదిమార్గమున క్రమముగ పోయి విరజానదిని దాటి పరమపదనాథుని బొందుచున్నాడు.

ఇవ్విధముగ మూర్ధన్యనాడిలోఁ బ్రవేశించినట్టి ము
ముక్షువును స్థూలశరీరమనెడి బ్రహ్మపురములోనుండి బ్రహ్మ
నాడి యనెడి తలవాకిలిగుండ దయాళువగు హార్దుండు (హృ
దయమునందుండు సర్వేశ్వరుండు), మార్గవల్ల్యులు పలుకు
నట్లు, పిల్లవానిని రాజు యెత్తుకొని పచారుచేయువట్లు, ఈ
తనిఁగొని బయలువెడలి, “మన్నుంకడుమ్ కదిరోన్ మండలత్తై
నన్నడువూడు అన్నలో రిల్లైయినూడపోయ్” (స్థిరమైన వాఁడు
ను ఉష్ణకిరణుండునగు సూర్యునియొక్క మండలము నడుమగు
నట్టి మధ్యరంధ్రముగుండా బయలువెడలి) అనియు, “తేరా
రుసెయ్యక్కదిరోన్ మండలత్తై క్కీణ్డుపుక్కు” (రశ్మిసమూహముండి
యుడ్డిదిశలను వ్యాపించునట్టి సూర్యునియొక్క మండ
లమును భేదించుకొని బయలువెడలి) అనియు, “తండమండల
త్తినూడుశెన్ఱు” (ఛండకిరణుండగు సూర్యుని మండలముగుండా
బయలువెడలి) అనియు “ఇరుళకత్తు ఎరికదిరోన్ మండల
త్తూడేఱ్ఱి వైత్తేణివాంగి” (అంధకారమును పోగొట్టునట్టిని
యు, దిగంత వ్యాపకములగు కిరణములుగల సూర్యుని మండల
ముగుండ పరమపదమును బొందించి కర్మరహితులనుఁగఁ జేసి)
అనియును సాయించినట్లు దేవయాన మార్గమునఁ గొనిపోయి,
“అమరరోడుయర్విల్ శెన్ఱుఅప్పాల్ తవిప్పఅవి యఋశ్చైరమే”
(ఆతివాహికులచేఁ గొనిపోఁబడి అన్నింటికి పైగానుండు ప్రకృతి
యొక్క యుపరిభాగమునకుఁ బోయి, అర్చిస్సనియు, అహస్సని
యు, పూర్వపక్షమనియు, ఉత్తరాయణమనియు, సంవత్సరమ
నియు, వాయువనియు, ఆదిత్యుండనియు, చంద్రుడనియు, వై
ద్యుతుండనియు, అమానవ పురుషుండనియు, ఈతనికిసహకారు

లగు వరుణేంద్రాది ప్రజాపతులనియును చెప్పఁబడునట్టి వారిని దారితోడుగ నియమించి «అహంస్మరామి మద్భక్తంనయామి పరమాం గతిం" (నాభక్తుని నేనే స్మరించుకొని ఉత్కృష్టమగు అర్చిరాది మార్గమునఁ గొంపోవుచున్నాను) అన్నట్లు, తాను ప్రధానుండయి గొనిపోవుచు ఆయాయా వర ప్రదేశములయందు భగవచ్ఛాస్త్రమున మిక్కుటముగాఁ జెప్పఁబడినట్టి భోగంబులనున్ను అనుభవింపఁజేసి.

శ్లో॥ లోకం వైకుంఠ నామానం దివ్యషాడ్గుణ్య సంయుతం।
అవైష్ణవానామప్రాప్యం గుణత్రయ వివర్జితం॥

తా॥ షడ్గుణోపేతంబును, సత్వరజస్తమో గుణరహితంబును, దివ్యంబునగు వైకుంఠ మనఁబడు లోకము విష్ణుభక్తులు కాని వారిచే పొందబడదు.

శ్లో॥ నిత్యసిద్ధైస్సమాకీర్ణం। తన్మయైః పాంచకాలికైః।
సభాప్రాసాద సంయుక్తం వనైశ్చోపవనైర్యుతం॥

తా॥ ఆ శ్రీవైకుంఠము తన్మయులును పాంచకాలికులు నగు నిత్యసిద్ధులతో వ్యాప్తంబై యుండును. దానియందు సభలును మేడలును వనములును, ఉపవనములును గలవు.

శ్లో॥ వాపీకూపతటాకైశ్చ వృక్షషండైశ్చ మండితః।
అప్రాకృతం సురైర్వంద్యం మయుతార్క సమప్రభం॥
ప్రకృష్టసత్వరాశిం తం కదాద్రక్ష్యామి చక్షుషా॥

తా॥ శ్రీవైకుంఠము వాపీకూప తటాకంబులతోను, వృక్షముల మొగ్గలతోనను ప్రకాశించుచున్నది. అది ప్రకృతి సంబంధములేనిది నిత్యమానులచే సేవింపఁబడునది. కోటిసూ

ర్యప్రకాశము గలది. మిశ్ర్యతమముగ సత్త్వగుణోపేతం బగునట్టి యాశ్రీ వైకుంఠమును నేను ఎప్పుడు కండ్లార సేవింపగలను.

అని యివ్విధమున చిరకాలముగా నాశపడుచునట్టి యొక్క దేశవిశేషమునకుఁ బోయిచేరగోడనే, కర్మానుభవమునకు మాత్రముకాకుండ, విష్ణుచే స్థాపింపఁబడినదై గమనసాధనము గాను ఈజీవునితోఁగూడ గొనిరాఁబడినట్టి సూక్ష్మశరీరమును, ఏటిని దాటుటకు గాను ఎక్కిన తెప్పను వడ్డుకుచేర్చి విడిచిపెట్టినట్లు, విడిచిపెట్టించి విరజానదియొక్క యావలివడ్డుకు గొనిపోయి, అప్రాకృతశరీరము నొసంగి "ఐరంమదీయం" అను సరస్సు వద్దకు గొనిపోయి, సోమసవన మనఁబడునట్టి యశ్వత్థ వృక్షమువద్దకుఁ గొనిపోయి, మాలలు, అంజనములు, చూర్ణములు, వస్త్రములు, భూషణములు పట్టుకొని యుండునట్టి ఐదువందల దివ్యాప్సరసలఁ బంపి యెదుర్కొనునట్లు చేసి, బ్రహ్మాలంకారములతో నలంకరింపఁజేసి, బ్రహ్మగంధ బ్రహ్మతేజస్సులను ప్రవేశింపఁజేసి "కుడియడియారివర్ గోవిందన్ఱనక్కెన్ఱు ముడియుడై వానవర్ ముఱైముఱై యెదిర్కొళ్ళ. కొడియణి నెడుమదిళ్ గోపురం కుఱుగినరే" (గోవిందునకు వంశపరంపరగా దాసులమని పట్టాభిషిక్తులగు ఇంద్రాదులు యెదుర్కొనఁగా పతాకంబులతోఁ గూడియున్నట్టి గోపురము యొక్క సమీపమునకుఁ గొనిపోయి) అని పాడియుంచినట్లు, ఇంద్రప్రజాపతులను వేగతో నొప్పుచుండు ద్వారగోపురవాసుల సమీపమునకుఁ గొనిపోయి, "వైకుంఠంపుకుతలుం" అను పాశురము మొదలుకొని పై మూడు పాశురములయందును నాయించిన విధమున, అప్రాకృతంబులగు రాజోపచారములఁ జేయించి, ఆనందమయమగు

మండపమునందు సుందరమైన [illegible] లోనికిఁ గొనిపోయి,

శ్లో॥ అహం హ్యహం విభ్రాన్తః కాలమేతావదబుద్ధిమాన్ ।
ఉచ్చమధ్యమనీచానాం తామహం కథమావసే ॥

తా॥ ప్రకృతికి వశపడుచు కొన్నాళ్ళు గడచినదే తెలియకయుంటిని. ఉ[illegible] మనుష్య మాధ్యముండుగానుండి యీప్రకృతితో నేను ఎట్లు వసింపఁగలను?

శ్లో॥ అపేత్యాహమిమాం హిత్వా సంశ్రయిష్యే నిరామయమ్।
అనేన సామ్యం యాస్యామి నానయాహమచేతసా।
క్షమం మమ సహానేన నైకత్వమనయా సహ।

తా॥ ఈప్రకృతి వశ్యతను వదలుకొని ప్రకృతిని విడిచిపెట్టి ఆనంద పరిపూర్ణుఁడగు భగవంతుని యాశ్రయించినాను. కావున భగవంతునితో సామ్యమును పొందగలను. అచేతనమగు ప్రకృతితో సామ్యమును పొందను. భగవంతునితో సాయుజ్యము సంభావ్యము కాని ప్రకృతితో సాయుజ్యము సంభావ్యము కాదు.

శ్లో॥ క్రీడంతం రమయా సార్ధం లీలాభూమిషు కేశవం ।
మేఘశ్యామం విశాలాక్షం కదాద్రక్ష్యామి చక్షుషా।

తా॥ క్రీడా ప్రదేశములయందు లక్ష్మీదేవితోఁగూడ క్రీడించుచున్నటివాఁడును, నీలమేఘశ్యాముండును, విశాలనేత్రుండును నగు భగవంతుని కండ్లార యెప్పుడు సేవింపఁగలను

శ్లో॥ మేఘశ్యామం మహాబాహుం స్థిరసత్త్వం దృఢవ్రతం ।
కదాద్రక్ష్యే మహారామం జగచ్ఛోకనాశనమ్ ॥

తా॥ నీలమేఘశ్యాముండును, దీర్ఘబాహుండును, స్థిరమైనట్టి సత్వగుణము కలవాఁడును, దృఢవ్రతుండును, జగత్స్వ

లకుండును గాక శ్రీరామచంద్రుని యెప్పుడు సేవించుచుండును,

శ్లో॥ దృష్టఏవహి నశ్శోకమపనేష్యతి రాఘవః ।
తమస్సర్వస్య లోకస్య సముద్యన్నివ భాస్కరః ॥

తా॥ సూర్యుండు ఉదయించిన వెంటనే సకలలోకమునం దుండు చీకటి నంతయును నశింపఁజేయుచుండునట్లు, భగవం తుండును మనచే సాక్షాత్కరింపఁబడిన వెంటనే మన దుఃఖములను పోగొట్టగలఁడు.

ఈ పైని చెప్పియున్న విధముగ, ముముక్షువు కోరినప్రకారము ఈతని కష్టము లన్నియును తీర్చినట్లే, నిరతిశయ భోగ్యుండగు తనను తానే చూపించి, భక్తిని వృద్ధిపఱచి, తన శ్రీపాదములతోఁ జేర్చుకొని, తనతో సమానముగ భోగము ననుభవించుట యనెడి సాయుజ్యముచే నీతనితో సజాతీయులై యానందాతిశయము గలవారగు తక్కిన జనులగోష్ఠిలో నితనిఁ జేర్చి, ఇవ్విధముగ సమస్త ప్రతిబంధక నివృత్తిపూర్వకము గను, స్వరూపావిర్భావపూర్వకముగను, దేశకాలావస్థలను బట్టి యుండునట్టి సంకోచంబు లెట్టియును లేకుండునట్లును, తనసం కల్పము కనుగుణముగ ఈతఁడపేక్షించునట్టి కైంకర్యంబుల నన్నింటిని ఆత్మ యుండువఱకు నుండునట్టి వానినిగాఁ గృపచేసి, “సవయస ఇవయే నిత్యనిర్దోషగంధాః” (సమాన వయస్కులవలె నిత్యనిర్దోషులై యుండువారు) అన్నట్లు, తనకు ఈడు జోడుగా నుండునట్టి స్నేహితులవలె నుండు నిత్యసూరులవిష యమునను ఈరీతిఁ జేర్చినట్టి యీముక్తపురుషుని విషయ మునను భేదము లేకుండ ప్రవర్తించుచు, శ్రీయాళవందారు స్తో త్రమునందును శ్రీవైకుంఠగద్యయందును చెప్పియున్నట్లు మనో

రథాంబున నేమగు నటుగ వశాంతిశాశ్వంతిక నిత్యకింకరుండగు తనిని సంతోషపఱచె తాను [illegible] విశేషసామర్థ్యము గలవాఁడై యుండును. వ[illegible]ల [illegible] గలుగజేసి తద్ద్వారా మోక్షసాధనము లగునట్టి యుపనిషత్తుల [illegible],

శ్లో॥ స్వయం వహతి శుద్ధాత్మా దేవం నారాయణం హరిం।
ప్రభుం వహతి శుద్ధాత్మా పరమాత్మాన మాత్మనా॥

తా॥ పరిశుద్ధాత్ముఁడగు ఈ జీవుండు సర్వదా భగవంతుని ధ్యానించుచు ఆసని తన మనస్సులోనుంచుకొని యుండగలఁడు

శ్లో॥ యే తు దగ్ధేంధనా లోకే పుణ్యపాపవివర్జితాః।
తేషాం తత్ క్షేమ మధ్యానం నిర్వాణం ద్విజసత్తమ।
సర్వలోకతమోహంత్రా [illegible] ముచ్యతే।
జ్వాలామాలీ మహాతేజా యేనేదం ధార్యతే జగత్॥

తా॥ ఈలోకమునందు జ్ఞానాగ్నిదగ్ధకర్ములగుటం జేసి పుణ్యపాపరహితులగు జీవులు మోక్షమునకుఁ బోవునప్పుడు ఆదిత్యలోకమునం దుండునట్టివాఁడును తీక్ష్ణకిరణములు గలవాఁడును, గొప్పదైయుండు చీకటిని పోగొట్టునట్టి తేజస్సుకలవాఁడును, జగత్తును ధరించి యుండునట్టివాఁడు నగు ఆదిత్యుండు ద్వారముగాఁ జెప్పఁబడుచున్నాడు.

శ్లో॥ ఆదిత్యదగ్ధ సర్వాంగాః అదృశ్యాః కేనచిత్క్వచిత్।
పరమాణ్వాత్మ భూతాశ్చ తం దేవం ప్రవిశంత్యుత॥

తా॥ ఆదిత్యునిచే సమస్తావయవములును దహింపఁబడినట్టివారై యొక్కనికిని కనపడకుండునట్లు పరమాణుస్వరూపులై యాయాదిత్యుని పొందుచున్నారు.

శ్లో॥ శ్వేతద్వీపమితః ప్రాప్య విశ్వరూపధరం హరిం ।
తతోనిరుద్ధ మాసాద్య శ్రీమత్క్షీరోదధౌ హరిం॥

తా॥ ఈలోకమునుండి శ్వేతద్వీపమునకుఁబోయి విశ్వరూపుండగు భగవంతునిబొంది, వానినుండి అనిరుద్ధునిబొంది అటుపిమ్మట క్షీరాబ్ధియందు భగవంతుని బొందుచున్నారు,

శ్లో॥ తతః ప్రద్యుమ్న మాసాద్య దేవం సర్వేశ్వరేశ్వరం ।
తతస్సంకర్షణం దివ్యం భగవంతం సనాతనం ॥

తా॥ అంతట సర్వేశ్వరేశ్వరుండును దేవుండును నగు ప్రద్యుమ్నుని పొంది అంతట సనాతనుండును భగవంతుండు నగు సంకర్షణుని పొందుచున్నారు.

శ్లో॥ అయమస్య పరోమార్గః సదాబ్రహ్మానుభావిణాం ।
పరమైకాంత సిద్ధానాం పంచకాలరతాత్మనాం ॥

తా॥ ఎల్లప్పుడును బ్రహ్మానందమును పొందగోరునట్టివారును, పరమైకాంతులును, సిద్ధపురుషులును పంచకాల రతులగు వారు మోక్షమును పొందుటకుగాను ఈపైని గనఁబఱచినది యును ఒకవిధమైనట్టి మార్గంబని యెఱుంగునది.

ఈపైని గనఁబఱచిన విధమున జయత్సంహితాదుల యందును, "విభవాదర్చా నాద్వ్యూహం ప్రాప్య వ్యూహార్చాత్పరం తద్బ్రహ్మ వాసుదేవాఖ్యం సూక్ష్మంప్రాప్యత ఇతివదంతి" (విభవమునుండి వ్యూహమును బొంది వ్యూహమునుండి వాసుదేవుం డనఁబడునట్టి బ్రహ్మమును బొందుచున్నాడని చెప్పుదురు) అని శ్రీపాంచరాత్రాధికరణమునందును వారి వారి యధికారములను బట్టి చెప్పఁబడినట్టి క్రమముక్తిపక్ష

మునను, సత్యలోకాదులనుండి ముక్తులైపోవువారిని గుఱించి చెప్పఁబడినట్టి మార్గభేదములును, ఇవి యన్నియును, ఆయా యధికారులకు మాత్రమే తెలిసి యుండవలసినవి గాన, వాటిని గుఱించి యీతావున విస్తరించి చెప్పవలసినయవసరములేదు.

ఈమార్గముల ననుసంధించుకొనుట మొదలగునవి స్వతంత్ర ప్రపత్తినిష్ఠుండగు ఈతనికి సద్వారక ప్రపత్తినిష్ఠునికి వలెనే ఉపాయాంగముగాను దినములకొలది యనుష్ఠింపవలసినవి కాకపోయినను, ఈయుపాయమును అవలంబించునప్పుడు అధికారిత్వసిద్ధికిగాను ఫలముఁగోరుట ఆవశ్యక మగుటంజేసి, ఫలపర్వ విశేషానుసంధానరూపముగ ఇవి ఈతనికిన్ని ఆవశ్యకములు కాఁగలవు. అటుపిమ్మట, ముందురాబోవు కల్యాణముకుగాను రోజులను లెక్కపెట్టునట్టి వారివలెనే, పూర్వము ప్రార్థించినట్టి పురుషార్థమును స్మరించుకొనుటమై, ఇట్టి పురుషార్థమును పొందబోవుచున్నామనెడి ప్రీత్యతిశయమును గలుగఁజేయుచు, స్వయంప్రయోజనముగా నుండగలవు. కావున సముదాయజ్ఞానము వలనను ఈతని యపేక్షితము సిద్ధింపఁగలదు.

శ్లో॥ సమీపం రాజ సింహస్య రామస్య విదితాత్మనః ॥
సంకల్ప హయసంయుక్తైః యాంతీమివ మనోరథైః ॥

తా॥ సీతాపిరాట్టి సంకల్పరూపములగు గుఱ్ఱములు కట్టినట్టి మనోరూపములగు రథములపై నెక్కి పోవుచున్నట్టి దానివలెనే రాజసింహుండును ప్రసిద్ధుండునగు శ్రీరామచంద్రుని సన్నిధికి పోవుచున్నది.

శ్లో॥ తస్మాదపి వినిర్ముక్తాః అనిరుద్ధతనౌ స్థితాః ।
మనోభూతా స్తతో భూయః ప్రద్యుమ్నం ప్రవిశన్త్యుత ॥

తా॥ ఆదిత్యుని నుండి బయలుదేరి అనిరుద్ధుని శరీరము నందుండి, వానినుండి మనోభూతులై ప్రద్యుమ్నుని బొందుచున్నారు.

శ్లో॥ ప్రద్యుమ్నాచ్చ వినిర్ముక్తాః జీవం సంకర్షణం తతః ।
విశంతి విప్రప్రవరాః సాంఖ్యా యోగాశ్చ తైస్సహ ॥

తా॥ అంతట ప్రద్యుమ్నునినుండి సంకర్షణుండను జీవుని పొందుదురు. వారితోఁగూడ సాంఖ్యయోగులును పొందుదురు.

శ్లో॥ తతస్త్రైగుణ్యహీనాస్తే పరమాత్మాన మంజసా ।
ప్రవిశంతి ద్విజశ్రేష్ఠా క్షేత్రజ్ఞం నిర్గుణాత్మకం ॥
సర్వావాసం వాసుదేవం క్షేత్రజ్ఞం విద్ధి తత్త్వతః ॥

తా॥ అచ్చట వారు సత్త్వరజస్తమోగుణరహితులై క్షేత్రజ్ఞుండును, దోషగుణరహితుండు నగు పరమాత్మను బొందుచున్నారు. అంతట నుండునట్టి వాఁడగు వాసుదేవునే వాస్తవమునకు క్షేత్రజ్ఞునిగా నెఱుంగుము.

శ్లో॥ సమాహిత మనస్కాస్తు నియతాస్సంయతేంద్రియాః ॥
ఏకాంతభావోపగతా వాసుదేవం విశంతి తే ॥

తా॥ స్థిర మనస్కులును, నియతులును, ఇంద్రియజయముఁ గలవారును ఏకాంతిత్వమును బొందినట్టివారును, వాసుదేవుని పొందుచున్నారు.

ఈపైని యుదహరించినట్టి మహాభారతాది వచనములయందును,

టీ॥ శిశృపథ = సే మార్గరూపమగు, ఘటీయంత్ర = ఘటీయంత్రమునందు, ఆరోహావరోహపరిభ్రమైః = ఆలోకమునకుపోవుచు, ఈలోకమునకువచ్చుచు నిట్టిసంచారరూపముగను, నిరంతరైః = ఎడతెగనివియునను, నిరయపదవీయాతాయాతక్రమైః = నరకమునకుపోవుచు మరలయీలోకమునకువచ్చుచు నివ్విధములచేత, అధిగతపరిక్రాంతిః = మార్గాయాసమును బొందినట్టి, నః = మనుష్యులను, అర్చిరాద్యైః = అర్చిరాద్యధిష్ఠానదేవతలచేత, అవాహ్య = పరమపదమునకుఁ గొనిపోయి, నిజచ్ఛాయాగాయీ = తనయొక్కనీడ నొసంగునట్టి, హరిచందనః = హరిచందన వృక్షమువంటివాఁడగు సర్వేశ్వరుండు, స్వయం = స్వయముగ, సుఖయతి = సుఖపెట్టుచున్నాఁడు.

తా॥ నరకమునకుపోవుచు, ఈలోకమునకు మరలవచ్చిపుట్టుచు నివ్విధమున కష్టపడునట్టి మనుష్యులను హరిచందన వృక్షమువంటి యుదారస్వభావుండగు భగవంతుండు అర్చిరాదిమార్గముగుండా పరమపదమునకుఁ గొనిపోయి మనుష్యులను సుఖపెట్టుచున్నాఁడు.

గతిచింతనాధికారము

ముగిసెను.



శ్రీమతే నిగమాంతమహాదేశికాయనమః.

    

# రహస్యత్రయసారము



## పరిపూర్ణబ్రహ్మానుభవాధికారము.

శ్లో॥ వితమసి పదే లక్ష్మీకాంతం విచిత్రవిభూతికం
సచివగమితస్సంపద్యావిర్భవత్సహజాకృతిః।
స్ఫుటతదపృథక్సిద్ధిస్సిద్ధ్యద్గుణాష్టకశ్శలో
భజతి పరమంసామ్యంభోగేనివృత్తికథోజ్ఝితం॥

టీ॥ వితమసి = తమోగుణరహితంబై యనఁగా శుద్ధసత్వమయ మగు, పదే = పరమపదమునందు, సచివగమితః = అతివాహికులచేఁగొని పోబడినవాఁడై, విచిత్రవిభూతికం= ఆశ్చర్యయుక్తమగు లీలాభోగవిభూతులతోఁగూడియున్నట్టి, లక్ష్మీకాంతం= శ్రియఃపతిని, సంపద్య=పొంది, ఆవిర్భవత్సహజాకృతిః = స్వస్వరూపావిర్భావముగలవాఁడై, స్ఫుటతదపృథక్సిద్ధిః = ప్రత్యక్షముగ పరమాత్మతోఁ గూడియున్నట్టివాఁడై, నివృత్తికథోజ్ఝితం = పునరావృత్తియన్నమాటలేనట్టి, భోగే = భోగమాత్రమునందు, పరమంసామ్యం = మిక్కుటమగు సాదృశ్యమును, భజతే= పొందుచున్నాడు.

తా॥ ప్రపన్నుండు అతివాహికులచే పరమపదమునకుఁ గొనిపోబడినవాఁడై, భగవంతునిబొంది స్వస్వరూపావిర్భావముగలవాఁడై పునరా

వృత్తియన్న మాటలేకుండ వానితో భోగమాత్రమునందు పరమసామ్య మును బొందుచున్నాడు.

ఈ మార్గముగుండ పోయినవానియొక్క పరిపూర్ణాను భవ మెవ్విధమైనదియనఁగా— "అస్తైత్తులకుముడైయ అరవిన్ద లోశననై త్తినై త్తనైయుమ్‌విడాళ్" (ఉభయవిభూతి విశిష్టుం డును అరవిందలోచనుండునునగు సర్వేశ్వరుని యనుభవించు నప్పుడు కొంచముమున్న విడువరు) ఇత్యాది పాపులయందుఁ జెప్పియున్నట్లు, సర్వదేశ సర్వావస్థలయందును, సర్వేశ్వరుని అనంతములగు విగ్రహ, గుణ, చేష్టితంబులలో నొక్కటియును కొరతబడకుండ నిరతిశయ భోగ్యముగ సేవించి యనుభవించు చుండుట. ఈ యనుభవము ఈతనికిన్ని ఈశ్వరునికిన్ని తుల్యం బగుటంజేసి, యీతండు ఈశ్వరునితో పరమసామ్యమును బొం దుచున్నాడని చెప్పఁబడినది.

"ఉణర్ముళునలం" (అంతయు జ్ఞానమును ఆనంద మును) అనియు "నిరస్తాతిశయాహ్లాద సుఖభావైకలక్షణా। భేష జంభగవత్ప్రాప్తిః ఏకాంతాత్యంతికామతా" (అతిశయమున తిశయించినది లేనట్టి యానంద స్వరూపంబైనది భగవత్ప్రా ప్తిరూపమగు మోక్షము) అని చెప్పియున్నట్లు భగవత్స్వ రూపము భోగ్యంబైనదిగా నుండగలదు. తక్కినవియును భోగ్య ములుగానుండుట యెట్లంటివేని, రాజభార్యకు రాజుభోగ్యుండై నట్లయిన, వానిభోగమున కనుకూలంబులగు భోగోపకరణము లును, భోగస్థానాదులును ఈమెకున్న అనుకూలంబులయినవి యగునట్లు, ప్రకృతమునను, భగవత్స్వరూపముతో సంబం ధించినవి యన్నియును, భోగ్యములగుటకు బాధకము లేదు.

ఇట్లు చేతనాచేతన శరీరుండగు సర్వేశ్వరుండు భోగ్యమైనట్టివాఁడను విషయము శ్రుతిస్మృతి ప్రసిద్ధంబైనది. ఈ విషయమును శ్రీభాష్యకారులవారు శ్రీభాష్యమున భూమాధికరణమునందు నిరూపించియున్నారు. వీటిలోనన్నింటిని మించినట్టి యానంద మగుటంజేసి, పరమప్రాప్యంబగుటచే భగవత్స్వరూపమును పరమపదంబని చెప్పుదురు. ఇట్టి భగవత్స్వరూపముతోక్క పరిపూర్ణానుభవమును అనుభవించుట యనునది భోగ్యతమంబై, అన్నింటిని మించినదియై యుండునట్టి ఉత్కృష్టస్థానమునకుఁ బోయియే గలుగును గాన, అట్టిస్థానమున్ను పరమపదంబని పేర్కొనఁ బడుచున్నది. భగవద్విభూతియై జ్ఞానానందస్వరూపంబగు తన స్వరూపమున్ను ఇట్టియనుభవమునకు ఆశ్రయంబై అనుభవింపఁబడునట్టిది యగుటంజేసి పరమపదంబని పేర్కొనఁ బడుచున్నది. ఈ మూఁడింటికిన్ని తక్కిన వాటికిన్ని ప్రాప్యత్వముమాత్రము సర్వసాధారణముగా నుండగలదు.

ఇవ్విధముగ, భగవత్స్వరూప, రూప, గుణ, విగ్రహాదులును, శుద్ధసత్వాశ్రయంబగు నిత్యవిభూతియును, స్వస్వరూపమును భోగ్యంబులే యైనప్పటికిన్ని, ప్రతికూలంబులయినట్టివిగాను, ప్రత్యక్షాది ప్రమాణంబుల మూలముగాఁ దెలియవచ్చునవియై ముముక్షువుచేఁ ద్యజింపవలసినట్టివిగాను శాస్త్రములయందుఁ జెప్పఁబడునట్టివియునగు లీలావిభూతి యందుండు పదార్థంబులు ముక్తపురుషునికి భోగ్యములగుట సంభవమా? యని యడిగితివేని, అయినను, కావచ్చును. దృష్టాంతము—పిత్తజాడ్యముగలవానికి ప్రతికూలంబైనట్టి పాలు పిత్తరోగము పోయిన పిమ్మట అనుకూలంబగునట్లును, సార్వభౌముం

డగు తండ్రిచే యేర్పఱుపఁబడినట్టి చెరసాల, అట్టి చెరసాల
లో నున్నప్పుడు రాజకుమారునికి అట్టి సమయమున ప్రతికూ
లంబై, రాజు ఆతనిని చెరలోనుండి విడిపించి సంతోషించిన
వాఁడై తనతో సమానునిగా నుంచుకొనినప్పుడు, చెరసాల
యనెడి ద్వేషము పోవుచున్నను, తండ్రియొక్క సొత్తని తలంచుటచే
ననుకూలంబగునట్లును, "నహి మే జీవితేనార్థో నైవార్థైః నచ
భూషణైః వసన్త్యా రాక్షసీమధ్యే వినా రామం మహారథం"
(మహారథుండగు శ్రీరామచంద్రుని వినాగా, నాకు జీవనముతోను
పయోగము లేదు. ద్రవ్యముతో నుపయోగము లేదు భూషణ
ములతో నుపయోగము లేదు.) అనియు, "వరాళుమొఱైయోని"
అను తిరువాయ్ మొఴియందును చెప్పియున్నట్లు, భగవంతు
నివిడిచి, తాను వొంటరిగా నున్నప్పుడు, కర్మానుగుణముగ తన
కు ప్రతికూలంబులుగాను, కొంచముగ అనుకూలంబులుగాను
ను అనుభవమునకుఁ దోచునట్టి లీలావిభూతిలో నుండు పదార్థ
ములు, మోక్షమును బొంది నిరంతరము భగవంతుని యనుభ
వించునట్టి యాతనికి నిరతిశయభోగ్యము లగువాటిలో నంత
ర్గతంబు లయినవిగా నుండుట సంభవము. ఇవ్విధమున బద్ధు
లకు ప్రతికూలంబులుగానును, కొంచముగ అనుకూలంబు
లయినట్టిగాను నుండుటయనునది ఆయాపదార్థంబులకు భగవ
దిచ్ఛవలన నేర్పడుచున్నది. ఇవ్విధముగ స్వేచ్ఛాధీనంబ
గునట్టి యానుకూల్యమును గలిగియున్నట్టి తనయొక్క శరీర
భూతంబు లగువాటితో నన్నింటితోనును గూడియున్నట్టి శ్రీ
మన్నారాయణుండు ప్రాప్యవస్తువనెడి విషయము తిరుమంత్ర
మునందును, ద్వయమునందును నుండునట్టి చతుర్థీవిభక్త్యంత

ములగుపదముల యర్థముగాను నెఱుంగునది. ముందుచెప్పినట్టి
కైంకర్య మనునది ఇవ్విధమగు పరిపూర్ణానుభవమువలనఁ గలి
గినట్టి యానందాతి శయమువలన నొనర్పంబడునది యని శ్రీ
భాష్యకారులవారు గద్యత్రయమునందు పలుమారు సాయిం
చియున్నారు. ముక్తదశయందుఁ గలుగునట్టివిగాను శ్రుతి
యందుఁ జెప్పఁబడునట్టి జక్షణ క్రీడనాదులును, జ్ఞాతిదర్శన
ము మొదలగునవియును. ఇవి యన్నియును పుణ్యపాపరూప
మగు కర్మనుతో నిమిత్తములేకుండ, భగవదిచ్ఛ కనుగుణము
గు స్వేచ్ఛామూలకంబులగుటం జేసి, యవి కర్మఫలంబులు కాకుం
డ, భగవదనుభవాతి శయమువలన నొనర్పంబడునట్టి కైంకర్య
ములలో నంతర్భూతంబు లయినవి. కావున, ప్రాప్తి యనఁగా
యథాభిమత కైంకర్య పర్యంతమగు పరిపూర్ణ బ్రహ్మానుభవం
బని సిద్ధమగుచున్నది. ఈ యనుభవము కలిగినపిమ్మట యెన్న
టికిని పోనేపోదను విషయము,

శ్లో॥ ప్రాప్యతే పరమం ధామ యతో నావర్తతే యతిః ।

తా॥ భగవద్భక్తుండు పునరావృత్తి లేనట్టి పరమపద
మును బొందుచున్నాడు.

శ్లో॥ మాముపేత్య పునర్జన్మ దుఃఖాలయ మశాశ్వతం ।
నాప్నువంతి మహాత్మానః సంసిద్ధిం పరమాంగతాః ॥

తా॥ గొప్పసిద్ధిని బొందినట్టి మహాత్ములు నన్ను పొం
దినపిమ్మట దుఃఖాకరంబును, అనిత్యంబునగు పునర్జన్మను
బొందరు.

శ్లో॥ ఆబ్రహ్మ భువనాల్లోకాః పునరావర్తినోఽర్జున ।
మాముపేత్యతు కౌంతేయ పునర్జన్మ నవిద్యతే ॥

తా॥ ఓ అర్జునా ! సత్యలోకమువరకు నుండులోకము లలో దేనికిపోయినను, మరల యీలోకమునకు వచ్చి జన్మించు దురు. నన్ను పొందినపిమ్మటనో, మరల యీలోకమునకు రారు.

శ్లో॥ యదాస కేవలీభూత షడ్వింశ మనుపశ్యతి।
తదాస సర్వసిద్ధత్వాత్ పునర్జన్మన విందతి ॥

తా॥ ఎప్పుడీతండు సమాధియుక్తుండై ఇరువదియారవ తత్త్వమగు భగవంతుని సాక్షాత్కరించు చున్నాఁడో, అప్పుడీతండు అన్నివిధములను సిద్ధినిపొందినట్టివాఁడుగాన, ఈతండు పునర్జన్మను పొందడు.

శ్లో॥ గత్వాగత్వానివర్తంతే చంద్రసూర్యాదయోగ్రహాః।
అద్యాపినని వర్తన్తే ద్వాదశాక్షర చింతకాః ॥

తా॥ సూర్యచంద్రాది గ్రహములు పోయిపోయి మరల వచ్చుచున్నవి. ద్వాదశాక్షరీ మంత్రము ననుసంధించుకొనునట్టి వారన్ననో, యిప్పటికిని మరల యీలోకమునకు వచ్చియుండ లేదు.

పా॥ వాయినాల్ నమోనారాయణా వెన్రు।
మత్తకత్తిడైక్కైకూప్పిప్పోయినాల్ ।
పిన్నైయుమ్ త్తిశైక్కన్రుమ్ పుణ్ణైకొండుక్కిలుమ్
పోకవిట్టారే ॥

తా॥ వాక్కుచే "నమోనారాయణాయ" అని చెప్పుచు అంజలిని శిరసావహించి ప్రార్థించుచు పరమపదముకుఁ బోయినపిమ్మట, మగల యీలోకమును వేలోక్కటికి జామీను గానైనను రారు.

ఈ మొదలగు ప్రమాణములయందు ప్రసిద్ధమైనవిషయము.

ఒకవేళ వీరు భగవత్కైంకర్యాంతర్భూతంబగు స్వేచ్ఛావిహారముచే లీలావిభూతిలోఁ బ్రవేశించినను, సంసారానుభవ, జ్ఞానసంకోచాదులు వీరికి గలుగకుండుటంజేసి, వీరికి పునరావృత్తి లేదని చెప్పఁబడినది.

ఇవ్విధమున పునరావృత్తి రహితంబగునట్టి యీ పరిపూర్ణ బ్రహ్మానుభవమును పొందబోవునట్టివారికి అంతిమ శరీరము అట్టి సమయమున దేవమనుష్యాది శరీరంబులలో నెద్దిగా నుండగలదో, తెలియదు. బ్రహ్మాదులకున్ను మోక్షము కలదు. అట్లే, "ధర్మవ్యాధాదయోప్యన్యే పూర్వాభ్యాసాజ్జుగుప్సితే వర్ణావరత్వే సంప్రాప్తాః సంసిద్ధిం శ్రమణీయథా" (ధర్మవ్యాధాదులు పూర్వజన్మ సంస్కారవశమున హీనజన్మమునఁ బుట్టినను, శ్రమణివలెనే సిద్ధిని బొందినారు) అని మహర్షులు చెప్పియున్నారు. కావున, ముముక్షువై యీ లోకమునందున్నప్పుడు ఈతనికిఁ గల ఉత్కర్షాపకర్షంబులనుబట్టి మోక్షావస్థయందును భగవదనుభవ విషయమున తారతమ్యము కలదని చెప్పునట్టి యానంద తీర్థానుయాయులు ముక్తులకందఱికిని సర్వేశ్వరునితో పరమసామ్యమును తెలుపునట్టి శ్రుతిస్మృతులను మరచిపోయినారు కాబోలు.

ఆచారవైకల్యముగల ముముక్షువులకు ఆనందము తక్కువగా నుండగలదని కొందఱు చెప్పునది సమ్మతగినదియే యైనను, అది ముక్తుండగుటకుముందుగ అనఁగా ఈలోకమునందున్నప్పుడు ఈతనికిఁ గలుగునట్టి భగవదనుభవ విషయమునఁ గల సంకోచమును గుఱించి చెప్పినది. అటుపిమ్మట

క్రమముగ ముక్తులయినట్టివారికి మోక్షమును పొందుటలో కాలవ్యత్యాసమే తప్ప ఫలవ్యత్యాసము లేదు.

శ్రీవిష్ణు లోకాదులయందు సాలోక్య సారూప్యాదులను మాత్రము పొందినట్టి వారినిన్ని కొంచము దాదాపుగ ముక్త అని చెప్పుట మాత్రము కద్దు. ఈవిషయము,

శ్లో॥ లోకేషు విష్ణోః నివసన్తి కేచిత్ ।
సమీప మృచ్ఛన్తిచ కేచిదన్యే ।
అన్యేతురూపం సదృశం భజన్తే ।
సాయుజ్యమన్యేసతు మోక్షఉక్తః ॥

తా॥ కొందఱు విష్ణులోకమునందు వసించుదురు. మఱికొందఱు విష్ణువు సమీపమునకుఁ బోదురు. మరి కొందఱు విష్ణువుతో సదృశంబైనట్టి రూపమును పొందుదురు. మరి కొందఱు విష్ణువుతో సాయుజ్యమును బొంద గలరు. అయితే సాయుజ్యమును బొందుటయే మోక్ష మనఁబడుచున్నది.

అని యివ్విధమున నియమించుటచేఁ దెలియుచున్నది. దీనివలన పరమపదమునకుఁ బోయినట్లయిన, అచట పొందునట్టి సాయుజ్యమే మోక్ష మనఁబడుచున్నది, వేయిలో నూఱులున్నట్లు సాలోక్యాది లన్నియును దానిలోనే యంతర్భూతములు. కావున అట్టిదశయం దెవ్వరికిని భగవదనుభమువిషయమున భేదము లేదు.

శ్లో॥ మోక్షం సాలోక్య సారూప్యం ప్రార్థయేనకదాచన ।
ఇచ్ఛామ్యహం మహాబాహో సాయుజ్యంతవసువ్రత ॥

తా॥ సాలోక్య సారూప్యము లనఁబడునట్టి మోక్షము
లలో నెద్దియును నేను కోరియుండలేను. అయితే నేను నీయొ
క్క సాయుజ్యరూపమగు మోక్షమును కోరుచున్నాఁడను.

ఈపైని యుదహరించినట్టి ప్రమాణమువలననున్ను ఈ
యర్థమును తెలిసికొనఁదగును.

సాయుజ్యమనఁగా "సయుక్" యొక్క భావము. "సయు
క్" అనఁగా ఒకభోగ్యవస్తువును కూడయుండి అనుభవించినట్టి
వాఁడు. ప్రకృతమున విశేషణవిశిష్టమగు బ్రహ్మమనెడి భోగ్యవ
స్తువునందు బ్రహ్మమున్ను ముక్తపురుషుండును ఉభయులును
భోక్తలై యన్వయించి యున్నందున ముక్తపురుషుండు సయు
క్ అని వ్యవహరింపఁబడుచున్నాఁడు.

ఇవ్విధముగా నర్థమగు పక్షమున, శ్రుతియందు సాయు
జ్యశబ్దమునున్ను సార్ష్టితా శబ్దమునున్ను రెంటినిగూడ ప్ర
యోగించుట యేల యని యడిగెదవా? చెప్పెదను. "సాయు
జ్యముభయోరత్ర భోక్తృత్వస్య విశిష్టతా। సార్ష్టితాఽత్ర
భోగస్య తారతమ్య విహీనతా" (ఆత్మపరమాత్మలకు రెంటి
కిని భోక్తృత్వమునందు భేదములేకుండుట సాయుజ్యమనఁబడు
చున్నది. వీరికి భోగమునందు భేదములేకుండుట సార్ష్టితయ
నఁబడుచున్నది) అని చెప్పియున్నది.

ముక్తపురుషుండు జగత్సృష్టి నొనర్పకపోయినను, పొ
లమున వ్యవసాయము చేయుచుండినట్టి తండ్రియును ఇంటివద్ద
నూరకుండునట్టి బిడ్డలునుచేరి తండ్రిచేయునట్టి వ్యవసాయ
ఫలము ననుభవించు చందంబున, జగత్సృష్టినొనర్చుటలోన
గు రసమును గలుగఁజేయునట్టి సర్వేశ్వరునికి వాఁడట్లు చేయు

చుండఁగా చూచుచున్నట్టి ముక్తులకును నది సమానమే. బ్ర
హ్మసూత్రకారుండును «జగద్వ్యాపారవర్జం (ముక్తునికి జగత్సృ
ష్టిలేదు) అనిచెప్పిన పిమ్మట, «భోగమాత్ర సామ్యలింగాచ్చ"
(భోగము విషయమున సామ్యము కలదు) అని తెలిపియున్నా
డు «సామరస్యం హి సాయుజ్యం" (సమానమగు రసానుభవము
సాయుజ్యమనఁబడుచున్నది) అని శాకటాయనుండు చెప్పియు
న్నాడు.

శబ్దము అట్టియర్థము గాకపోయినను, భేదశ్రుతులు
విరోధించినను, సాయుజ్యమనఁగా ఆత్మపరమాత్మైక్య మర
మని తలంచునట్టివారు చెప్పునట్టిదానితో ముక్తుండు పరమసా
మ్యమును బొందుననియు, సర్వేశ్వరునివంటి వాఁడగుననియు
ను చెప్పునట్టిశ్రుతులును విరోధించును. «మమసాధర్మ్యమా
గతాః" ముక్తులు నాయొక్క సాధర్మ్యమును బొందుచున్నా
రు) అని గీతాచార్యుండును తెలిపియున్నాఁడు. ఈయర్థమును

శ్లో॥ పరేణ పరధర్మీచ భవత్యేష సమేత్యవై ।
విశుద్ధధర్మా శుద్ధేన బుద్ధేనచ సబుద్ధిమాన్ ॥

తా॥ పరమాత్మను బొందిన జీవుండు పరమాత్మయొ
క్క ధర్మములు కలవాఁడగుచున్నాఁడు. పరిశుద్ధుండగుపరమా
త్మను బొంది పరిశుద్ధుం డగుచున్నాడు. జ్ఞానవంతుండగు
పరమాత్మను బొంది జ్ఞానముగలవాఁ డగుచున్నాఁడు.

శ్లో॥ వియోగధర్మిణాచైవ వియోగాత్మా భవత్యపి ।
విమోక్షిణా విమోక్షీచ సమేత్యేహ తథాభవేత్ ॥

తా॥ వియోగధర్మము గల పరమాత్మను బొంది జీవుఁ
డును వియోగధర్మము గలవాఁడగును. విమోక్షధర్మముగల

యీతనిని బొంది జీవుండును నిమోత్కధర్మము గలవాఁడగును

శ్లో॥ శుచికర్మణా శుచిశ్చైష భవత్యమితదీప్తిమాన్ ।
విమలాత్మాచ భవతి సమేత్య విమలాత్మనా ॥

తా॥ పరిశుద్ధ వృత్తిగల పరమాత్మనుబొంది జీవుండును పరిశుద్ధుండై యమితమైనట్టి తేజస్సు గలవాఁడగుచున్నాడు. విమలుండగు సర్వేశ్వరునిబొంది యీతండును విమలుం డగుచున్నాడు.

శ్లో॥ కేవలాత్మాచ భవతి కేవలేన సమేత్యవై ।
స్వతంత్రశ్చ స్వతంత్రేణ స్వతంత్రత్వముపాశ్నుతే ॥

తా॥ కేవలుండగు పరమాత్మను బొంది యీతండును కేవలుం డగుచున్నాఁడు. స్వతంత్రుండగు పరమాత్మను బొంది యీతండును స్వతంత్రుండై స్వాతంత్ర్యమును (అకర్మవశ్యతను) అనుభవించుచున్నాడు.

శ్లో॥ ఏతావదే తత్కథితం మయా తే ।
పథ్యం మహారాజ యథార్థతత్వం ।
అమత్సరస్త్వం ప్రతిగృహ్యచార్థం !
సనాతనం బ్రహ్మ విశుద్ధమాద్యం ॥

తా॥ ఓరాజా ! ఇంతవరకును నీకు యథార్థంబై హితంబైనట్టి తత్వమును తెలిపియున్నాను, మాత్సర్యములేనివాఁడవై నీవు దీనిని గ్రహించి సనాతనమును, పరిశుద్ధమును, ఆది కారణము నగు బ్రహ్మమును బొందగలవు.

అని యివ్విధమున వసిష్ఠకరాళుల సంవాదమునను శ్చ వివరించి చెప్పి, యిదియే పరమార్థంబని మహర్షి నిర్ధారణచేసి యున్నాడు. ఈ పైశ్లోకములయందు ముక్తపురుషుండు స్వతం

త్రుండనఁగా— కర్మవశ్యుండు కాడనుట. ముక్తుని తెలుపుట కై ప్రయోగింపఁబడినట్టి "స్వరాట్" శబ్దమును అకర్మవశ్యత ను తెలుపునట్టిదానినిగా శ్రీభాష్యకారులవారు వ్యాఖ్యానము చేసియున్నారు.

ఇవ్విధముగ శ్రుతి, స్మృతి, సూత్రములయందు మోక్షావస్థయందీ జీవుండు సర్వేశ్వరునితో సామ్యమును పొందుచున్నాడని నొక్కి చెప్పియున్నందున, మఱి క్కొకచోట ఐక్యము తోచునట్టి వాక్యముల సంతటను, "రామసుగ్రీవయోరైక్యం దేవ్యేవం సమజాయత" అనువాక్యముల జెప్పియున్నట్లు భేదశ్రుతులకు విరోధము తటస్థింపకుండునట్లు అర్థము చేసికొనునది. అట్లుకాకున్న,

శ్లో॥ యదాతు మన్యతే న్యోహమన్య ఏష ఇతి ద్విజః ।
తదాస కేవలీ భూతః షడ్వింశ మనుపశ్యతి ॥

తా॥ ఎప్పుడీతండు నేను వేఱు భగవంతుండు వేఱని తలంచుచున్నాడో, అప్పుడీతండు భగవంతుని సాక్షాత్కరించుచున్నాడు.

శ్లో॥ అన్యశ్చరాజన్ సపరస్తథాన్యః పంచవింశకః ।
తత్స్థత్వాదనుపశ్యంతి ఏకఏవేతి సాధవః ॥

తా॥ ఓ రాజా! భగవంతుండు వేఱు. ఇరువది యైదవ తత్త్వంబగు జీవుండు వేఱు. అయినను, సాధువులు ఎల్లప్పుడు భగవంతునిపై మనస్సు నుంచియున్నందున నొక్కడేయని తలంచుచున్నారు.

శ్లో॥ అన్యశ్చరాజన్ సపర స్తథాన్యః పంచవింశకః ।
తేనైతన్నాభిజానంతి పంచవింశకమచ్యుతం ॥

తా॥ ఓరాజా! భగవంతుండు వేఱు ఇరువది యైదవ తత్వంబగు జీవుండు వేఱు. కావుననే జీవుని భగవంతునిగాఁ దలంపరు.

శ్లో॥ జన్మమృత్యుభయాద్భీతాః సాంఖ్యయోగాశ్చ కాశ్యప।
షడ్వింశమనుపశ్యంతి శుచయస్తత్వదర్శినః॥

తా॥ ఓ కాశ్యప! సాంఖ్యులును, యోగులును, జన్మ మరణములచుండి భయపడినవారును, పరిశుద్ధులైనవారై తత్వద్రష్టలగువారును ఇరువది యారవ తత్వమగు భగవంతుని సాక్షాత్కరించుచున్నారు.

శ్లో॥ ఉత్తమః పురుషస్త్వన్యః॥

తా॥ ఉత్తమ పురుషుండనఁబడు భగవంతుండు జీవుని కంటెను వేరైనవాడు.

శ్లో॥ తత్రయః పరమాత్మాతు సనిత్యోనిర్గుణస్స్మృతః।
సతునారాయణో జ్ఞేయః సర్వాత్మా పురుషోహిసః॥

తా॥ ఆతావున నిత్యుడుగాను దోష గుణరహితుండుగాను చెప్పఁబడినట్టివాఁడు నారాయణుండు. ఆతండు అందఱిలో నంతరాత్మగానుండునట్టి పురుషుండు.

శ్లో॥ నలిప్యతేకర్మఫలైః పద్మపత్రమివాంభసా।
కర్మాత్మాత్వపరో యోసౌ మోక్షబంధైస్సయుజ్యతే॥

తా॥ నారాయణుండనఁబడు పరమాత్మకు తామరాకుకు నీరు అంటని చందంబున కర్మ ఫలములతని నంటవు. కర్మ సంబంధముగలవాఁడు జీవుండు. ఈతండే బంధ మోక్షములు గలవాఁడు.

శ్లో॥ అయఃపిండే యథా వహ్నిర్భిన్నస్తిష్ఠత్యభిన్నవత్ ।
తథావిశ్వమిదం దేవో హ్యావృత్యపరితిష్ఠతి ॥

తా॥ అగ్ని వేఱయినదైనను, ఇనుప గుండులో నంతట వ్యాపించియుండునట్లు, సర్వేశ్వరుండును ఈ జగత్తులో నంతటను వ్యాపించియున్నాడు.

ఈ మొదలగు వేలకొలది ప్రమాణములు విరోధించును. కావున, ముక్తునికి జ్ఞాన, భోగాదులనుబట్టి యుండునట్టి పరమసామ్యమే కలదు. అయితే ఛత్రచామరాదులవంటి లక్షణములుగాఁ జెప్పఁబడినట్టి జగత్కారణత్వము, మోక్షప్రదత్వము, సర్వాధారత్వము, సర్వనియంతృత్వము, సర్వశేషిత్వము, సర్వ శరీరత్వము, సర్వ శబ్దవాచ్యత్వము, సర్వవేదవేద్యత్వము, సర్వలోక శరణ్యత్వము, సర్వ ముముక్షూపాస్యత్వము, సర్వ ఫలప్రదత్వము, సర్వ వ్యాప్తత్వము, జ్ఞానానంద స్వరూపత్వము, లక్ష్మీపతిత్వము మొదలగునవి సర్వేశ్వరునికి మాత్రమే నియతముగా నుండునవి. ముక్తపురుషుని కన్ననో, అధేయత్వము, విధేయత్వము, శేషత్వము, అణుత్వము ఈ మొదలగునవి నియతములుగానుండునవి.

అట్లయిన, «నసంపదాంసమాహారే విపదాం వినివర్తనే । సమర్థోవిద్యతే కశ్చిత్ తం వినా పురుషోత్తమమ్" (సంపత్తును గలుగఁజేయు విషయమునఁగాని, విపత్తును తొలగించు విషయమునఁగాని పురుషోత్తముండగు భగవంతుండు తప్ప వేఱొకండు సమర్థుండుకాడు) అన్నట్టి స్థితిలోనున్నట్టివారై, స్వతంత్రులు కానట్టి ముక్తపురుషులకు యేదైన నొకకారణమువలన మరల యీలోకముకువత్తుమే మోక్షమునె

డీ సంశయము గలుగదా? యంటివేని, అట్టి సంశయమెన్నటికిని కలుగనేరదు, ఏలయనఁగా, "సాయుజ్యం ప్రతిపన్నా యే తీవ్రభక్తాస్తపస్వినః । కింకరా మమ తే నిత్యం భవంతి నిరుపద్రవాః" (నాయెడల మిక్కిలి భక్తిగలవారై, తపోవంతులగు యే ప్రపన్నులు నాతో సాయుజ్యమును పొందినారో, అట్టివారు యెల్లప్పుడును నాయొక్క కింకరులు, వారికెన్నఁడును యెవ్విధమైనట్టి యుపద్రవమును కలుగనేరదు) ఇవి భగవంతుండే స్పష్టముగ చెప్పియున్నాఁడు కదా! ముముక్షుప్వదశయందు అచేతన పదార్థమును మాత్రమే కాని, చేతన పదార్థమును మాత్రమే కాని, అనుభవించుటయనెడి యైశ్వర్య కైవల్యములయెడల వైరాగ్యమును గలుగఁ జేసినట్టి యీయధ్యవసాయము, ముక్త పురుషునికి సర్వము బ్రహ్మాత్మకముగానే కానవచ్చుటం జేసి కేవలానుభవముయొక్క ప్రసక్తియే లేకపోవుటం జేసియును, అట్టి పురుషార్థాంతరములయందుఁగల దోషంబులన్నియును యెల్లప్పుడును ఈతనికి ప్రత్యక్షముగాఁ దెలియవచ్చుటం జేసియును, ఈతని మనస్సున స్థిరముగా నుండగలదు. కావున మరల యీలోకమునకు వచ్చుదునేమో యనెడి సంశయము ఈతనికి బుద్ధిపూర్వకముగ గలుగదు. చిదచిదీశ్వరు లనఁబడునట్టి తత్త్వత్రయము విషయమునను, హేయోపాదేయంబుల విషయమునను, ముందు కలిగినట్టి జ్ఞానము ప్రస్తుతము (మోక్షావస్థయందు) విచ్ఛేదసంకోచంబు లెవ్వియును లేకుండ విశదముగా నున్నది. కావున నీతనికి అజ్ఞానమూలముగ పునరావృత్తి విషయమున అనుమానము గలుగదు. భగవద్విషయమునఁగల వైలక్షణ్యమును గుఱించిన జ్ఞానమువలన

ముంచుకొలిపిన భక్తియనఁబడు ప్రీతిరూపాపన్నంబగు జ్ఞానము మోక్షావస్థయందు శాస్త్రములకున్ను గోచరముకానట్టి భగవద్వైలక్షణ్యమంతయును, ఈతనికి ప్రత్యక్షసిద్ధంబగుటం జేసి, యది నిరతిశయ ప్రీతిరూపాపన్నజ్ఞానంబైనది. ఇట్లుండుటంజేసి, ‹‹సచ మమప్రియః'' (జ్ఞానియైనవాఁడు నాకుప్రియుండు) అన్నట్టి యీశ్వరునియొక్క ప్రీత్యతిశయంబనునదివాని చేతనున్ను అణచిపెట్టుకొనుట కశక్యంబై, పొర్లిపోయి ఈతనితో పరంపరగా సంబంధముగలవారి విషయమునన్ను ప్రవహించునట్లాయెను. కావున నీతండు (మరల యీలోకముకువచ్చునట్లు చేయునట్టి) కర్మము లేకున్నను, స్వాతంత్ర్యుండగు సర్వేశ్వరునియొక్క యిచ్ఛవలననైనను, పునరావృత్తి కలుగకూడదా? యనెడి యనుమానమున్ను కలుగదు. (ఈతండుముక్తుండైనపిమ్మట) శాస్త్రవశ్యుండుగా నుండవలయుననెడి యధికారమున్ను ఉండవలసినది కాదు కాన, అప్పుడు ఈతనికి భగవదాజ్ఞాతిక్రమణరూపమగు దోషమున్ను కలుగదు. సర్వేశ్వరుండు సంతోషించుటయే ఈతని సంతోషమున్ను కావున, ఈశ్వరుని యిష్టముకు వ్యతిరిక్తంబైనట్టి యనుష్ఠానమున్ను ఈతనికుండ జాలదు. కావున కైంకర్యపర్యంత పరిపూర్ణబ్రహ్మానుభవరూపంబై, మోక్షమనఁబడునట్టి పురుషార్థము ఈతనికి ఈతని యాత్మయుండువరకును ఊడునదియని యేర్పడుచున్నది. వీటినన్నింటిని మనస్సులోనుంచుకొనియే బ్రహ్మసూత్రకారులగు శ్రీవేదవ్యాసులవారు ‹‹అనావృత్తిశ్శబ్దాత్ అనావృత్తిశ్శబ్దాత్'' ((శాస్త్రమునుబట్టిచూస్తే యీముక్తపురుషునికి పునరావృత్తిలేదు) అని తెలిపియున్నారు.

పా॥ ఏఱ్ఱియెఱ్ఱిల్పదమెల్లావుయిర్క్కు మిదముగక్కుమ్,
నాఱ్ఱత్తుళాయ్ముడినాథనై నణ్ణి యడిమైయినిల్,
కూఱుకవర్న్దు గురుక్కళ్ కుళాంగళ్ పదాంబుయక్కీళ్,
మాఱుదలిన్ఱి ముఱ్ఱిన్బ మాప్పాకత్తు మన్నువమే॥

టీ॥ ఏఱ్ఱిల్ పదం = పరమపదమును, ఏఱ్ఱి = పొంది, ఎల్లావుయిర్క్కుమ్ = అన్నియాత్మలకును, ఇదముగక్కుమ్ = హితమునుగోరునట్టి, నాఱ్ఱత్తుళాయ్ముడి = సుగంధయుక్తంబగు తులసీమాలతో నలంకరింపఁబడినట్టి కిరీటముగల, నాథనై = భగవంతుని, నణ్ణి = సమీపించి, అడిమైయిల్ = కైంకర్యమునందు, కూఱుకవర్న్దు = తనభాగమును గైకొని, కురుక్కళ్ కుళాంగళ్ = గురుపరంపరయొక్క, పదాంబుయల్ = శబ్దాయమానంబగు చరణములయొక్క, కీళ్ = క్రింద, మాఱుదలన్ఱి = ఎడతెగకుండ, ముఱ్ఱిన్బ మాప్పాకత్తు = ప్రీత్యతిశయయుక్తమగు భోగమునందు, మన్నువమే = స్థిరముగా నుందుము గాక!

తా॥ పరమపదమునకుఁబోయి భగవంతునిపొంది, మావంతు కైంకర్యమును మా యాచార్యుల నియమనప్రకార మొనర్చుకొనుచు అచ్చటనే స్థిరముగా నుందుము గాక!

శ్లో॥ అవిశ్రాంతశ్రద్ధాశతకలహకల్లోలకలుషా
మమావిర్భూయాసుర్మనసి మునిసిద్ధాదిసులభాః।
మధుక్షీరన్యాయస్వగుణవిభవాసంజనక
సన్మహానందబ్రహ్మానుభవపరీవాహాబహువిధాః॥

టీ॥ మునిసిద్ధాదిసులభాః = మునులు, సిద్ధులు మొదలగువారికి సులభములును, అవిశ్రాంతం = అనవరతము, శ్రద్ధాశత = కైంకర్యమునందలి ప్రీత్యతిశయములవలని, కలహకల్లోలకలుషాః = నేను ముందొనర్చెదను నేనుముందొనర్చెదనను యివ్విధములగు కలహములతోఁగూడి యుండునవియు, బహువిధాః = నానావిధంబులైనవియగు, మధుక్షీరన్యాయ = పాలలోతేనె

కలిపినట్లు, స్వగుణవిభవాసంజన = స్వానందాది గుణసంబంధముచే, కనత్ = అత్యంతము భోగ్యంబైనట్టి, యత్ = ఏ, మహోవంకం = నిరతిశయానందముగ, బ్రహ్మానుభవపరీవాహాః = బ్రహ్మానుభవపరంపరలు, మమ = నాయొక్క, మనసి = మనస్సునందు, ఆవిర్భూయాసుః = విశదముగ ప్రకాశించుగాక!

తా॥ మునులు సిద్ధులు మొదలగువారు నేనుముందు నేనుముందు అనుచు కైంకర్యమున త్వరపడునట్లు చేయునట్టి బ్రహ్మానుభవమునఁగల ప్రీతియనునది నామనస్సునం గల్లప్పుడును భాసమానంబగు గాక!

## అర్థానుశాసనభాగ సంగ్రహశ్లోకము

శ్లో॥ సంద్రుష్టస్సారవాగ్విత్స్వపరనిశితధీస్సంగజిన్నైకసంస్థః ।
స్పష్టోపాయోతిఖిన్నస్సపరికరభరన్యాసనిష్పన్నకృత్యః ।
స్వావస్థార్హంసపర్యావిధిమిహనియతంవ్యాగసంక్వాపిబి
భ్రన్నిర్ముక్తస్థూలసూక్ష్మప్రకృతిరనుభవత్యచ్యుతంనిత్యమేకః॥

టీ॥ ఏకః = ఒకానొకండు, సంద్రుష్టః = ఆచార్యునిచే అంగీకరింపఁబడినవాఁడై, సారవాగ్విత్ = రహస్యత్రయసారమును గుర్తెరింగినవాఁడై, స్వపరనిశితధీః = శరీరశరీరి భావాదిరూపమగు స్వస్వరూప పరస్వరూపజ్ఞానము గలవాఁడై, సంగజిత్ = ఐశ్వర్య కైవల్యాదుల విషయమున వైరాగ్యము గలవాఁడై, నైకసంస్థం = అనేకాధికారములు గలవాఁడై, స్పష్టోపాయః = ఉపాయస్వరూపమును బాగుగా నెఱింగినవాఁడై, అతిఖిన్నః = మిక్కిలి దుఃఖపడినవాఁడై, సపరికరభరన్యాస నిష్పన్నకృత్యః = పరికరములతోఁ గూడియుండునట్టి ప్రపత్తిని చేయుటచే, కృతకృత్యుండైనవాఁడై, స్వావస్థార్హం = తనయొక్క నిష్ఠకుఁదగినట్టి, సపర్యావిధిం = కైంకర్యమును, భాగవతులవరకు నొనర్పవలసినట్టి దానినిగా, నియతం = శాస్త్రప్రకార మెఱింగి, వ్యాగసం = పాపరాహిత్యమును బొంది, క్వాపి = ఎచ్చటినైన నొకతావున, బిభ్రత్ =

వసించుచు, నిర్ముక్తస్థూలసూక్ష్మప్రకృతిః = స్థూలప్రకృతినిన్ని సూక్ష్మప్రకృతినిన్ని విడనాడినట్టివాఁడై, నిత్యం = ఎల్లప్పుడును అచ్యుతం=భగవంతుని, అనుభవతి = అనుభవించుచున్నాఁడు.

తా॥ ఒకానొకండు ఆచార్యునిచే నంగీకరింపఁబడి, రహస్యత్రయ సారమును గుర్తెఱిఁగి, శరీర శరీరి భావరూపమగు స్వస్వరూప పరస్వరూప జ్ఞానమును లభించి, ఐశ్వర్య కైవల్యాదుల విషయమున వైరాగ్యముగలిగి, అనేకవిధములుగాఁ జెప్పఁబడినట్టి యధికారము గలిగి, కర్మజ్ఞాన భక్తిరూపములగు ఉపాయంబుల స్వరూపములఁ దెలిసికొని వాటి ననుష్ఠించుట దుష్కరం బగుటంజేసి దుఃఖపడినవాఁడై, తనరక్షణ విషయముగుభారము నంతయును సర్వేశ్వరునిపై నుంచుట యనెడి శరణాగతి నొనర్చుటచే కృతకృత్యుం డైనట్టివాఁడై, ఇఁకమీఁద తానొర్పవలసినట్టి కైంకర్యము భగవంతునినుండి భాగవతులవరకని శాస్త్రప్రకార మెఱింగినవాఁడై భగవదనుగ్రహముచే నపరాధ పరిహారమును బొంది, యెచ్చటనైన నొక నివాసయోగ్యంబైనట్టి తావున వసించుచు భగవంతుని ననుభవించుచున్నాఁడు.

పరిపూర్ణబ్రహ్మానుభవాధికారము
ముగిసెను.



అరానుశాసనభాగః
ప్రథమః సమాప్తః

శ్రీమతే నిగమాంతమహాదేశికాయనమః.



శ్రీమతే నిగమాంతమహాదేశికాయ నమః.







# రహస్యత్రయసారము

## స్థిరీకరణవిభాగః ద్వితీయః

### సిద్ధోపాయశోధనాధికారము.

శ్లో॥ యుగపదఖిలమ్ ప్రత్యక్షేణ స్వతస్సతతమ్ విదన్ ।
న్నిరవధిదయానిత్యోదన్వానశక్యవివర్జితః ।
జలధిసుతయా సార్ధమ్ దేవో జగత్పరిపాలయన్ ।
పరమపురుషస్సిద్ధోపాయః ప్రతీష్టభరస్సతామ్ ॥

టీ॥ యౌగపత్ = ఏకకాలమున, అఖిలం = సమస్తమును, సత తం = ఎల్లప్పుడును, ప్రత్యక్షేణ = ప్రత్యక్షముగ, స్వతః = స్వయము గ, విదన్ = తెలుసుకొనునట్టి వాఁడును, నిరవధి దయానిత్యోద న్వాన్ = అంతములేని దయకలిగి ఎల్లప్పుడును ఉదారస్వభావముగల వాఁడుగ, అశక్యవివర్జితః = తనచేతకాని ఏదియును లేనివాఁడును, జల ధిసుతయాసార్ధం = లక్ష్మీదేవితోఁగూడ జగత్ = నిత్యవిభూతి లీలావి భూతులను, పరిపాలించుచున్నట్టి, దేవః = దేవుండును నగు, పరమ పురు షః = పరమపురుషుండు నగు భగవంతుండు, సతాం = భక్తులయొక్క, ప్రతీష్టభరః = రక్షణవిషయమగు భావమునంతయును తనపై బెట్టుకొని నట్టివాఁడగు, సిద్ధోపాయః = సిద్ధోపాయంబైనట్టివాఁడు.

తా॥ సర్వజ్ఞుండును, సర్వశక్తుండును, పరమ కారుణికుండును, నిరపేక్షతోఁగూడ సర్వమును పాలించునట్టివాఁడును, సర్వనియంతయును నగు పరమపురుషుండు సిద్ధోపాయము.

అనాదికాలముగ సంసారమునఁ బడియుండునట్టి ఈ చేతనుండు, తనను రక్షించుటకొఱకు అవకాశమునకై నిరీక్షించుచున్నట్టి భగవంతుని కృపచేత జన్మించి, సమీచీనంబగు శాస్త్రము ద్వారా తత్త్వహితపురుషార్థములలోఁగల విశేషాంశములఁ దెలిసికొని, సదాచార్యుని పొందుచు, తన యధికారమున కనుగుణంబగునట్టి యొక యుపాయమును స్వీకరించి, కృతకృత్యుండై, తన్నిష్ఠఁ దెలిసికొని, అందుల కనుగుణముగ ఈలోకమున నుండునంతకాలము శాస్త్రానుగుణముగ అపాయరహితముగ నొనర్పంబడునట్టి కైంకర్యరూపమగు పురుషార్థము యొక్క స్థితినిన్ని, శరీరావసానకాలమున అర్చిరాది మార్గముగుండ అప్రాకృతంబగు పరమపదమునకుఁ బోయినట్లయిన, ఆత్మనికిఁ గలుగునట్టి యపరిచ్ఛిన్న భగవదనుభవ మేర్పాటగుటచే గలుగునట్టి పరిపూర్ణకైంకర్యరూపమగు పరమపురుషార్థముండునట్టి స్థితినిన్ని ఇంతకుముందు తెలిపియున్నాము.

ఈయర్థంబులలో, నీతండు తెలిసికొనియుండవలసినట్టి సిద్ధోపాయము విషయమునను, సాధ్యోపాయము విషయమునను ఈ యుపాయము యొక్క ప్రభావము విషయమునను, కర్మవశ్యులగు ఈచేతనులకు శీఘ్రముగా జ్ఞానము గలుగకుండుటకుగాను స్వతంత్రుండగు సర్వేశ్వరుండు వీరు పూర్వమొనర్చినట్టి యపరాధములమూలముగ దలంచినట్టి తలంపు మారిపోవుటకుగాను ప్రధానకారణములు మూఁడు కలవు. అవి యేవి

యనఁగా—తనకిదికావలయునని కోరినట్లయిన, "అట్లేయగు
గాక సర్వమునుకలుగఁగలదు" అనియనుగ్రహపూర్వకమగువా
ర్తయును: సదాచార్యుని యనుగ్రహమును, సత్సంప్రదాయసిద్ధి
యును. వీటిలోసదాచార్యానుగ్రహమునకుఁ గారణంబులును,
దీనివలనఁగలుగునట్టిఫలవిశేషంబులును, పరాశరమైత్రేయ, సం
జయ, అశ్వలాయనాదుల చరిత్రలయందుఁ దెలియవచ్చును.

సత్సంప్రదాయసిద్ధియనగా—తానుసత్వసంపన్నుఁడై,
మంచి మనస్సుకలవాఁడై, శ్రద్ధతో నాశ్రయించినప్పుడు, ఖ్యాతి
లాభ, పూజలను అపేక్షింపక, కారుణ్యపరతంత్రుండగు ఆ
చార్యుండు, అందఱికిని ప్రథమాచార్యుండగు సర్వేశ్వరుండు
మొదలుకొని యొక్కరికొక్కరు ఉపదేశించుకొనుచు వచ్చి
నట్టి తత్వహితంబులను హెచ్చుతగ్గులు లేకుండునట్లు, "సర్వే
షామేవలోకానాం పితామాతా చమాధవః। గచ్ఛధ్వమేనం
శరణంశరణ్యం పురుషర్షభాః" (సమస్తజనులకును తండ్రియును
తల్లియును సర్వేశ్వరుండే గాన, అతనిని శరణుజొచ్చునది) అ
ని చెప్పియున్నప్రకారము, ఉపదేశమును లభించుట. మిక్కిలి
కష్టపడవలసినదియై, మధ్యను బుద్ధిచలించుట కవకాశమిచ్చు
నట్టిదిగానుఅనుమానింపఁబడునట్టి శాస్త్రాభ్యాసమున కధికార
ములేనట్టివారై, పరమాస్తికులయినట్టివారికి యీ యుపదేశ
మే ప్రధానము. తక్కినవారికన్ననో, తాము తెలిసికొనుటకు
గానును కుతర్కములమూలముగ మనస్సుచెడియున్నట్టివారికి
విశదముగ తెలుపుటకుగానును, మంచియుక్తులతోనడిగితెలిసికొ
నవలసియుండును. "ఆర్షంధర్మోపదేశంచ వేదశాస్త్రావిరోధినా
యస్తర్కేణానుసంధత్తే సధర్మం వేదనేతరః" (ఋషిప్రోక్తం

బైనట్టి ధర్మోపదేశమును శాస్త్రానుసారముగ తర్కముచేఁ దెలిసికొనునట్టివాఁడై ధర్మము నెఱింగినట్టివాఁడు, ఇతరుండు ధర్మమును నెఱుంగడు.) అన్నట్లు ఈయర్థములను న్యాయయుక్తములగు తర్కములచే తెలిసికొని యుండనివాడు "కాణాదశాక్యపాషండైః త్రయీధర్మో విలోపితః" (కాణాదులచేతను, శాక్యులచేతను, పాషండులచేతనున్ను వైదికధర్మము లోపింపఁబడినది) అన్నట్లు కుయుక్తులచే వేదవిరుద్ధంబులగు తత్త్వములను బోధించి ప్రామాణికార్థముల నపహరించుదురు.

ఈ యపహరించుట యనునది విభూతినిన్ని విభూతి గలవాఁడగు భగవంతునిన్ని బట్టి రెండువిధములుగా నుండగలదు. వాటిలో సర్వేశ్వరుని అపహరించుట యనఁగా—శ్రియఃపతియగు సర్వేశ్వరుండు మొదటికే లేడనుటకాని, వేఱొక్కనిని సర్వేశ్వరునిగాఁ గొని, సర్వేశ్వరుని విభూతిలో నుండునట్టి వారిలో నొక్కనినిగా భావించుకొనుటకు గాని కాఁగలదు. విభూతిని అపహరించుట యనఁగా— విభూతి మొదటికే లేదని కాని, ఉన్నదనుచు దానికి సర్వేశ్వరునితో సంబంధము లేదనుచు నది స్వతంత్రమైనది యని గాని, అది పరతంత్రమేమైన, తనతోఁగాని,యితరులతోఁగాని సంబధించునది కావచ్చుననుట.

ఈ యపహారములు, స్వరూపవిషయమున సామాన్యజ్ఞానము గలవాఁడై ఆత్మసమర్పణము నొనర్చినట్టివానికి విపరీతసంబంధము మూలముగ సంప్రాప్తంబులయినట్లయిన, ఇచ్చిన దానిఁ గైకొనుటమరలఁచేఁ గలుగునట్టియపరాధముకంటెను క్రూరతమైనదై ఒక్కరుదొంగిలించినదానిని వేరొక్కరుదొంగిలించినట్లుకాఁగలదు. కావుననానావిధములగు మోహకారణములలో నొ

[illegible] కుచ్ఛిత వాదములతో సంబంధమును బొత్తుగ విడనాడవలయును. ఈ యర్థమును «పాషండినో వికర్మస్థాన్ బైడాల వ్రతికాన్ శఠాన్ హైతుకాన్ బకవృత్తీంశ్చ వాఙ్మాత్రేణాపి నార్చయేత్ డంబిహైతుక పాషండ బకవృత్తీంశ్చవర్జయేత్" (పాషండులను, కర్మభ్రష్టులను, పిల్లివ్రతము నాచరించినట్లు పైకిమాత్రము యేదొక దాని నాచరించునట్లు నటించునట్టివారిని, దుర్మార్గులను, కుచ్ఛితవాదములఁ జేయునట్టి వారిని, కొంగజపము చేయువారిని నోటిమాట చేతనైనను, ఆదరింపకూడదు. వారితో సంబంధమును విడనాడునది) అనియు «నాసద్భిః కించిదాచరేత్" (సత్పురుషులు కానివారితో సాంగత్యము చేయకూడదు) అనియు «త్యజదుర్జనసంగమమ్" (దుర్జనులతో సహవాసము చేయవలదు) అనియు «వరం హుతవహజ్వాలా పంజరాంతర్వ్యవస్థితిః। నశౌరిచిన్తావిముఖజనసంవాసవైశసం" (భగవద్భక్తులు కానివారితోఁగూడ సంచరించుటకంటెను అగ్నిజ్వాలలో నుండుట మేలు) అనియును మొదలగు తావుల విస్తృతముగాఁ దెలిపియున్నారు. ఇట్టి కుచ్ఛితవాదముఁ జేయునట్టివారితో సంభాషించుట యనునది «మాయయాపహృతజ్ఞానాః" (మాయచే మోహింపఁబడినట్టివారు) అన్నట్లు బుద్ధిని చెడగొట్టి, «చతుర్విధా మమ జనాః భక్తాఏవ హి తే స్మృతాః" (నావారు నాల్గువిధములయినవారు. వారునాభక్తులుగానె ప్రసిద్ధమైనవారు) అన్నట్లు భగవంతుండు తనవాఁడ నియభిమానించియున్నట్టి నలుగురిలోనున్న చేరక, అయ్యో! నావాఁడేయని యభిమానింపకుండ చేసి, «నమాం దుష్కృతినో మూఢాః ప్రపద్యన్తే" (దుర్మార్గులు నన్ను పొంద

రు) అన్నట్టి భగవదభిమానమునకు పాత్రులుకానట్టి వారితో బాటుగణింపఁబడునట్లు చేయును. అశరణ్యశరణ్యుండగు భగవంతునిశరణముజొచ్చినట్టి పరమాస్తికుండైనట్టి వాఁడువేరేకొందఱితోఁ జేరినంతమాత్రముననతండుభగవదభిమానబహిర్భూతులతోఁ జేరకపోయినను,అందులకుగాను సదాచార్యులు యేదో యొక పరిహారముఁ జేయుచుండునట్లు చూచియున్నాము. మహర్షులును "ఏకం యది భవేచ్ఛాస్త్రం జ్ఞానం నిస్సంశయం భవేత్ బహుత్వాదిహ శాస్త్రాణాం జ్ఞానతత్త్వం సుదుర్లభం" (శాస్త్రమొక్కటియే యైనట్లయిన, సంశయ రహితంబగు జ్ఞానము గలుగఁగలదు. శాస్త్రము లనేకము లగుటంజేసి, సరియైన జ్ఞానము గలుగుట దుర్లభము.) అనియు, "నిస్సంశయేషు సర్వేషు నిత్యం వసతి మాధవః ససంశయాన్ హేతు బలాన్ నాధ్యావసతి మాధవః" (నిస్సంశయంబులగు వాటిలో నన్నింటిలోనును మాధవుండు వసించుచున్నాడు. సంశయ యుక్తంబులగు హేతువులయందు మాధవుండు వసింపడు) అనియును చెప్పియున్నారు కదా! "నక్రోధో నచమాత్సర్యం" (క్రోధముండకూడదు. మాత్సర్య ముండకూడదు) అని యీ మొదలగు నవియును ఆత్మగుణములతో పరిపూర్ణుండగు అధికారి విషయమునఁ జెప్పినవి కాఁగలవు. అయితే ముముక్షువులకు మనోవైకల్యము కలుగఁగలదను విషయము "శ్రూయతే కిల గోవిందే భక్తిముద్వహతాం నృణాం సంసారన్యానతాభీతాః త్రిదశాః పరిపంథినః। సత్యంశతేన విఘ్నానాం సహస్రేణ తథాతపః విఘ్నాయుతేన గోవిందే నృణాం భక్తిర్నివార్యతే" (గోవిందుని విషయమున భక్తి గలుగుటచే వం

సారబంధము చెడిపోవునని వారి విషయమున దేవతలు దొం గలవంటివారు. నూరువిఘ్నములు గలుగుటచే సత్యము చెడి పోవుచున్నది. వేయివిఘ్నములు గలుగుటచే తపస్సు చెడిపోవు చున్నది. కోట్లకొలది విఘ్నములు గలుగుటచే విష్ణువు విషయ మగు భక్తి చెడిపోవుచున్నది) ఇత్యాదితావులఁ దెలుపఁబడినది.

వాటిలో ముందుగ సిద్ధోపాయమునుగుఱించి గలుగు నట్టి సంశయములును, వాటిని పరిహరించుకొనుటకు గానగు మార్గములును తెలుపఁబడును.

అనాదికాలముగ లక్ష్యపెట్టక యున్నట్టి సర్వేశ్వరుండు ఈ రోజుననొక్కనిని యాదరించుట యనునది వానికిఁగలస్వా తంత్ర్యమునుబట్టి కాదా ? అయితే ‹‹ఇన్రైన్రై పొరుళాక్కి తన్నై యెన్నుళ్ వైత్తాన్ అన్రైన్రై ప్పుఱమ్పోక్కప్పనార్త్తె శెయ్ వాన్›› (ఈ రోజున నన్ను ఒకవస్తువునుగాఁ జేసి తనను నాలోనుంచినాడు. అనాదికాలముగనన్ను శబ్దాదివిషయ భోగములలో నుంచినట్టివాఁడు ఈరోజున నిట్లుచేయుటకేమి కారణము;) అని శ్రీనమ్మాళ్వారులు విన్నవింపఁగా, ఆకసము నందు మేఘములు శ్రావ్యముగాఉఱిమినట్లు వినవచ్చినదేకాని (వీరిని వెంటనే పరమపదమునకుఁ గొనిపోయినాడేకాని) సర్వేశ్వ రుండు నేటొక్క యుత్తరము నిచ్చియున్నాఁడా ? కావున మన మొక యుపాయానుష్ఠానముఁ జేయుట యనునది ‹‹నడువన్దు య్య్ కొళ్ కిన్ఱనాథన్›› (జన్మపరంపరలలో మధ్యను వచ్చి ఉజ్జీవింపఁజేయునట్టి నాథుండు) అన్నట్లు దాసులను మిక్కిలి దయతోఁ జూచునట్టి సర్వేశ్వరుండు తానే స్వయముగ రక్షించినప్పుడు కదా ! అనియును ఇట్లు కొందరు అనుమాన

పడుదురు. వీరికి తెలివితేటలఁ గలుగఁజేయుటకుగాను సర్వే
శ్వరుండు స్వతంత్రుండే యైనను, వైషమ్యనైర్ఘృణ్య (పక్ష
పాత) రూపములగు దోషములు తనపై యారోపింపఁబడకుం
డునట్లు ఈచేతనునియందొక వ్యాజమును కల్పించి, దానిఁగొని
తాను రక్షింపఁగలడు. ఈ యర్థమును 'తిరుమాలిరుంజో
లైమలై యెన్నెన్నత్తిరుమాల్ వన్దెన్నెఞ్జునిఱైయప్పుకున్దాన్'
(తిరుమాలిరుంజోలై యన్నంతమాత్రమునసర్వేశ్వరుండువచ్చి
నా మనస్సులోపూర్తిగా ప్రవేశించియున్నాడు) అను తావున
శ్రీనమ్మాళ్వారులు సాయించియున్నారు.

ఈ వ్యాజమును ఈశ్వరుండు తానేస్వయముగ గలుగఁజేసి
నట్లయిన, దీనిని ఇంతకుముందే యేలగలుగఁజేసియుండకూడ
దని యడిగెదవా? చెప్పెదను. ఈ యాత్మలచే అనాదికాలముగ
నొనర్పంబడినట్టి కర్మములు విషమములగు ఫలంబులనొసంగు
నవియై యుండుటంజేసి, యీశ్వరుండు కర్మానుగుణముగ
ఫలముల నొసంగనియెడల యతనికి పక్షపాతమున్నట్లు తోచ
గలదు. కావున నిట్టివ్యాజముఁ గలుగఁజేయుట కీతనికి యింత
కుముందు అవకాశము దొరికి యుండలేదను విషయము ఆ
యా స్థితిగతులను బట్టి యూహింపఁబడుచున్నది. అట్లుకాక
న్న, మోక్షవిషయమగు ఆశ మొదలగునది యింతకుముందు
లేకుండయుండి, యిప్పుడు కలుగుటకు కారణం బెద్దియని యడి
గితివేని, యేమతస్థాపకుండును యింతకంటెను వేఱొకవిధముగ
ప్రత్యుత్తర మిచ్చుటకు వీలులేదు. ఇదియంతయును అనాదికర్మ
ప్రవాహవైచిత్ర్యమునుబట్టి యుండునెడియుత్తరము ఈశ్వరుం
డొక్కండుకలడని యొప్పుకొనునట్టివారికందఱికిన్ని సమానము.

ఈశ్వరుండు తనకుంగల స్వాతంత్ర్యము మూలముగ తాను తలంచినప్పుడే యేదొక కారణమునుబట్టి రక్షించినా, రక్షింపంగలడు. అతనికి అడ్డుపెట్టువా రెవ్వరును లేరు అను మాట పొసగియుండును.

అట్లగునేని, పైనియుదహరించిన «ఇఱ్ఱైన్నై" అను పాశుర మునున్ను, దానికి మూలభూతంబులగు వచనములనున్ను అర్థముచేసికొనుట యెట్లంటివేని, చెప్పెదను.— «స్వామీ! స్వభావసిద్ధంబులగు స్వాతంత్ర్య,కారుణ్యంబులయొక్క ప్రాధాన్యమువలన, వీటికి వ్యాజభూతంబులగు విశేష కారణంబులను అనాదరించి, యింతకుముందు నన్ను పరాఙ్ముఖునిగాం జేయుట కును ఇప్పుడంగీకరించుటకున్ను నీయొక్క స్వాతంత్ర్యమునున్ను కృపనున్ను తప్ప వేఱొక్క ప్రధానంబైనట్టి కారణమును నేను కన్నె ట్టజాలను. ఒకవేళ,నాకు కానంబడక స్వతఃసర్వజ్ఞుండవగు నీవు కన్నెట్టినది యెద్దియైననున్నట్లయిన, తెలుపుమా!" యనియడు గంగా,పర్వేశ్వరుండేమియున్ను ప్రత్యుత్తర మీయనందున, వాని స్వాతంత్ర్య కారుణ్యంబులయొక్క ప్రాధాన్యమును లోకము నకుం దెలుపుచున్నారు. కావున ఈ చేతనుని లీలోపకరణముగ నుపయోగపఱచు కొనుటకు ప్రధానకారణము ఈశ్వరునియొ క్క స్వాతంత్ర్యము. అందులకు సహకారికారణము అనాదికాల ముగ సర్వేశ్వరునియొక్క స్వతంత్రమగు ఆజ్ఞను అతిక్రమించి ప్రవర్తించుట. ఈతనిని భోగోపకరణమునుగా నుపయోగపఱ చుకొనుటకు ప్రధానకారణము సర్వేశ్వరునికి స్వభావసిద్ధము గా నుండునట్టి కారుణ్యము. దీనికి ప్రతిబంధకంబగు ఈశ్వర నిగ్రహమును శమింపంజేసి, సహకారి కారణంబని ప్రసిద్ధిపొం

దినవిధేయుఁడనఁగా — ఈతని సుకృతవిశేషముద్వారా గలిగినట్టిసర్వేశ్వరునికృపచేలభించినట్టివశీకరణహేతువులు. కావున, సర్వేశ్వరునియొక్క స్వభావమును, అతనికిపక్షపాతాదులులేకపోవుటను, బంధమోక్షాది వ్యవస్థయున్ను ప్రమాణములయందుఁ జెప్పియున్న ప్రకారము బాగు సాధించుకొని, స్వతంత్రుండగు సర్వేశ్వరుని కృపను అపేక్షించి ప్రవర్తించుటయుచితంబని భావము. జ్ఞాత్రుగ నిరుణలేనట్టివానికిఁ గల స్వాతంత్ర్యము చెడుపును చేయునది. స్వతంత్రుండు కానివానికిఁ గలుగునట్టి దయవలన నితరుల కుపయోగము లేదు సరియే కదా, అది తనకున్ను మనస్సుకు కష్టముఁ గలుగఁ జేయునట్టిదికాఁగలదు. స్వతంత్రుండైనట్టి వానికిఁగలుగునట్టి దయయనునది తలంచిన దానిని వెంటనే ముగించుటచే తనకున్ను సంతోషకరంబై, తనను ఆశ్రయించినట్టి వారికిన్ని ఆదినముననే వెంటనేఅనిష్టంబులఁదొలగించు కొనుటకు అనుకూలంబైనదిగా నుండగలదు. ఇట్లుండుటంజేసి రామకృష్ణాదులుగా నవతరించి నప్పుడును, "వ్యసనేషు మనుష్యాణాం భృశంభవతి దుఃఖితః" (మనుష్యులకు కష్టములు గలిగినప్పుడు సర్వేశ్వరుండును మిక్కిలి వ్యాకులపడినట్టివాఁడగును) ఇత్యాదివాక్యములఁ జెప్పియున్నట్టి వన్నియును సర్వేశ్వరుని అనుగ్రహమునకు పాత్రులయినట్టివారిని కొందఱిని రంజింపఁజేయుటకును, రాక్షసస్వభావము గల వారిని మోహింపఁ జేయుటకుగానును కాఁగలవు. ఇంతియే ఈ యర్థమును,

శ్లో॥ కాలస్యహిచ మృత్యోశ్చ జంగమస్థావరస్యచ ।
ఈశతే భగవానేక స్సత్యమేతత్ బ్రవీమి తే॥

తా॥ కాలమునున్ను, మృత్యువునున్ను స్థావరజంగమ పదార్థములనున్ను నియమించునట్టివాఁడు భగవంతుం డొక్కండే, ఇది సత్యము.

శ్లో॥ ఈశన్నపి మహాయోగీ సర్వస్య జగతః ప్రభుః ।
కర్మాణ్యారభతే కర్తుం కీనాశ ఇవ దుర్బలః।
యే తమేవ ప్రపద్యన్తే న తే ముహ్యన్తి మానవాః ॥

తా॥ గొప్పయోచన గల సర్వేశ్వరుండు జగత్తును పాలించుచున్నను, ఈ మనుజుండు దుర్బలమైనట్టి కినాశమువలెనే కర్మములను అనుష్ఠించుచున్నాడు. భగవంతుని శరణుజొచ్చినట్టివారు మోహమును బొందరు.

శ్లో॥ కృత్వా భారావతరణం పృథివ్యాః పృథులోచనః ।
మోహయిత్వా జగత్సర్వం గతస్స్వస్థానముత్తమం ॥

తా॥ ఇవ్విధమున భూభారమును తొలగించి పృథులోచనుండగు సర్వేశ్వరుండు జగత్తును మోహింపఁజేసి, తన స్థానమును ప్రవేశించినాడు.

శ్లో॥ మనుష్యదేహినాం చేష్టా మిత్యేవమనువర్తతే ।
లీలా జగత్పతే స్తస్య ఛందత స్సంప్రవర్తతే ॥

తా॥ ఇవ్విధముగ భగవంతుండు జనులయొక్క చేష్టలననువర్తించుచున్నాఁడు. అతనియొక్క క్రీడ యతని యిచ్ఛానుగుణముగ జరుగఁగలదు.

ఈ పైని యుదహరించినతావులమహర్షులున్ను తెలిపియున్నారు. కావున అవతారసమయమునసర్వేశ్వరుండుదుఃఖముగలవాఁడుగ నటించుట మాత్రమే కద్దు.అది కృపామూలము. కదియో స్వతంత్రుండగు తనకు క్రీడగా నుండగలదు. మరు

గుజ్జువాళ్లు మొదలగు అంగహీనులను ఓదార్చి రక్షించుట యనునది నిరపేక్షకులగు రాజులు మొదలగువారికి క్రీడార్థము గానును కృపామూలకముగాను నుండునదిగాను మనకు తెలిసిన విషయమేకదా! ఇట్లుండుటంజేసియేకదా॥"ఉపాదత్తే సత్తాస్థితి నియమనాద్యైశ్చిదచితే స్వముద్దిశ్య శ్రీమాన్" (భగవంతుండు సత్తా, స్థితి, నియమనాదుల మూలముగ చేతనాచేతనవస్తువులను కాపాడుచున్నాడు)అని చెప్పఁబడినది. భగవంతుండివ్విధమున పరులకు హితముఁగలుగఁజేయునట్టి వ్యాపరము కాశ్రయమయినట్టి వాఁడగుటంజేసి ఆశ్రితులకు రక్షకుండై, ఉపాయాంతర స్థానమున నుండుటంజేసి యుపాయముగాను నుండగలడు. వీరలను రక్షించుటలోనగు వ్యాపారముకును, అందువలని ఫలముకును ఆశ్రయమగుటంజేసి, శేషియును, అందుమూలముగ ప్రాప్యుండును కాఁగలడు. ఇట్లుండుట యీతనికి స్వరూపసిద్ధంబని ఈతని స్వరూపమును తెలుపునట్టి ప్రమాణములవలనఁ దెలియఁగలదు.

ఇట్లు రక్షకుండగు సర్వేశ్వరునికి ప్రధానముగా నుండునట్టి జ్ఞాన, శక్తి, కారుణ్యములలో జ్ఞానశక్తులు నిగ్రహానుగ్రహములకు సామాన్యముగాఁ గావలసినవి. కారుణ్యము అనుగ్రహించుటలో నావశ్యకమైనది. ఈ తావున కారుణ్యమనఁగా—పరులకు హితము నొనర్చు విషయమునఁ బ్రీతి.

ఈ కారుణ్యము నిత్యముక్త బద్ధులనఁబడు మూఁడువిధములగు చేతనులయొక్క సత్తాస్థితులకును, అనుకూల ప్రవర్తనలకును, నిత్యులయొక్క నిత్యానుభవమునకును, ముక్తులయొక్క పునరావృత్తి రాహిత్యముకును, లీలావిభూతియందలి

సామాన్యములగు సృష్ట్యాదులకున్ను, తనయొక్క యవతారరూ
పంబగు శుద్ధసృష్టికిని, శాస్త్రప్రవర్తనమునకును, అందుమూల
ముగ తత్త్వహితముల విషయమున జ్ఞానమును గలుగఁజేయుట
కును, మోక్షము విషయమున విశ్వాసముఁ గలుగఁజేయుట
కును, మోక్షము నొసంగుటకుగాను నొకహేతువుగా నెన్నం
బడునట్టి సుకృత విశేషముకును, అధికారాను గుణముగ
నిగ్రహాశమనోపాయంబుల నొసంగుటకును, వీటి విషయమున
నింద్రియములను ప్రేరేపించు విషయమున సహాయభూతుండు
గా నుండుటకును, ఉపాసకునికిన్ని యెద్దియైన విఘ్నము తట
స్థించినట్లయిన, దానిఁ దొలగింపఁజేయుటకును, అకించనులకు
ఉపాయాంతర స్థానమునుండి నిరపాయముగ రక్షించుటకును,
ఈ హేతువులనుబట్టి ప్రసన్నుండై చేతనులు అనాదికాలము
గా నొనర్చుచువచ్చునట్టియనంతమహాపరాధంబులను లక్ష్యపె
ట్టక అనంతసుఖమునందుండి విశ్రమించునట్లు సంసారబంధమును
నివర్తింపఁజేయువాఁడగుటకును, ఆర్త ప్రపన్నులకు వెంటనే
మోక్షమునొసంగుటకును, ఈలోకమున నున్నంతకాలము నిరప
రాధియైయుండవలయుననెడిఫలముఁగోరక మైమరచియున్నట్టి
దృప్తప్రపన్నునకు ప్రారబ్ధకర్మవశమున సంప్రాప్తించినట్టి అప
రాధమునకుగాను పశ్చాత్తాపమును గలుగఁజేసి, అధికారాను
గుణముగ ప్రాయశ్చిత్తమునొనర్చుకొనుటకై యుద్యుక్తునిగాఁ
జేయుటకును, అవ్విధమున మృదుస్వభావము గలవారుకాని
వారికి యమలోక ప్రాప్తియును, కోరినఫలమునకు ప్రతిబంధక
మున్ను గలుగకుండ చేసి, పశ్చాత్తాపాదులచే వారిని శిక్షిం
చుటకును, ప్రధానంబగు సామాన్యకారణముగా నుండగలడు.

ఇవ్విధముగ కృపావిశిష్టుండగు సర్వేశ్వరుండు ‘‘కృష్ణం ధర్మంసనాతనం’’ (ఎప్పటికినిసిద్ధముగానుండునట్టిధర్మముకృష్ణుండు) అన్నట్లు, సిద్ధోపాయము. ఈతనిని సంతోషపెట్టుటకుగాను యేర్పడినవియగు భక్తిప్రపత్తులు సాధ్యోపాయములు. అధికారియొక్క కర్తవ్యముగాను, ‘‘మామేకంశరణంవ్రజ’’ అని విధింపఁబడునట్టి ప్రపత్తిని అధికారి కుండవలసినట్టి యొకవిశేషణమునుగాను కొందఱు చెప్పునది అధికారి విశేషలక్షణముతో పొసగకపోవుటంజేసి, యది యతివాద మనిపించుకొనును. అట్లుకాకున్న, ఈశ్వరుండు ఉపాయముగాన, శాస్త్రవిహితములగు ఉపాసనాదులును అధికారివిశేషణములు కావలసివచ్చును. కావున, ప్రపత్తియున్నుఉపాయముకాదని కొందఱు పిడివాదము చేయుటయును సిద్ధోపాయముయొక్క ప్రాధాన్యమునుబట్టియానియెఱుఁగునది. భగవంతునిసంతోషింపఁజేయుట మొదలగు వాటిచే ప్రతిబంధకంబగు భగవన్నిగ్రహమును శమింపఁజేసి,యందుమూలముఁగ, స్వాభావికమగుఅనుభవమును గలుగఁజేయునది యగుటంజేసి, ప్రపత్తి ప్రధానమైనదిగా నెన్నంబడుచున్నది.అది యెట్లనిన, రత్నముకు పైమురికి పోయినట్లయిన,బయలుపడునట్టి స్వాభావికంబగు ప్రభావికాసమున్ను అందుల కనుగుణమగుభగవత్సంకల్పమాత్రమునేఁగలుగునట్లు, ముక్తపురుషునికిఁ గలుగునట్టి జ్ఞానవికాసాదులున్ను అందుల కనుగుణముగ ఏర్పడియుండునట్టి భగవత్సంకల్పము మూలకములుగా నుండగలవు. నిత్యులవిషయమునన్ను ఇవ్విధముననే యుండునట్లు, ఈ యర్థమును ‘‘ఇచ్ఛాతఏవ తవవిశ్వపదారసత్తా’’ (ఓ భగవంతుడా! నీయిచ్ఛవలననే సమస్తపదార్థ

ములును ఉనికిపట్టుకలవి యగుచున్నవి) అనుతావున పూర్వులైన పూర్వాచార్యులు స్పష్టముగ సాధించి యున్నారు. కావున సిద్ధోపాయము ప్రధానమేయైనప్పటికిన్ని, దానినివశీకరించుకొనుటకుగాను సాధ్యోపాయానుష్ఠానముకు "ఇక్ష్వాకు" ఇత్యాది పూర్వాచార్యుల శ్రీసూక్తితో విరోధము లేదు.

"యో౽సౌ గర్భ గతస్యాపి వృత్తిం కల్పితవాన్ ప్రభుః ।
శేషవృత్తివిధానేపి కింసు ప్తస్సోథవామృతః" (ఈజీవుండుగర్భమునందున్నప్పుడే శేషవృత్తినిగలుగఁజేసినాడు. అట్లు శేషవృత్తిని గలుగఁజేసినప్పటికిన్ని, ఈతండునిద్రబోవుచున్నాడా? లేక మృతుండైనాఁడా?) ఇవ్విధములగు వచనములున్న ఈచేతనుండు వేఱొక్క రక్షకుని కైపాటువడకుండుటకుగాను చెప్పఁబడినవి. ఇంతియే. అట్లు కాకున్న, (ఈతండు దేనినిన్ని చేయకూడదనిచో) భోజనాది వ్యాపారములనున్ను విడనాడి యుండవలసివచ్చును.

శ్లో॥ స్వయంమృత్పిండభూతస్య పరతంత్రస్య దేహినః।
అజ్ఞోజంతురనీశోయం ఆత్మనస్సుఖదుఃఖయోః॥

తా॥ ఈజీవుండు మృత్పిండమువలెనే పరతంత్రుండైనవాఁడు. ఈతండు అజ్ఞుండు తనయొక్క సుఖదుఃఖములకు నియామకుండును కాడు.

శ్లో॥ ఈశ్వరః ప్రేరితోగచ్ఛేత్ స్వర్గంవా శుభ్రమేవవా।
అప్రమేయో౽నియోజ్యశ్చ యత్రకామగమోవశీ॥
మోదతేభగవాన్ భూతైః బాలః క్రీడనకైరివ।

తా॥ ఈజీవుండు భగవంతునిచే ప్రేరితుండై స్వకర్మానుగుణముగ స్వర్గ నరకములను బొందుచున్నాడు. అప్రమేయుండును, వేఱొక్కనిచే నియమింపఁబడనివాఁడును, కామచారుం

ముగను, సర్వమును తనవశమున నుంచుకొని యున్నట్టివాఁడగు సర్వేశ్వరుండు, బాలుండు బొమ్మలతో నాడుకొనునట్లు, ఈభూతములతో క్రీడించుచున్నాఁడు.

ఈపైని యుదహరించిన ప్రమాణములయందు జీవుండు పరతంత్రుండనియు, ఈశ్వరుండన్ననో, ఈతనికర్మానుగుణముగ ఈతనిని ప్రవర్తింపఁజేయుచున్నాఁడనియును చెప్పఁబడినది. ౩౦ తియే. ఈపైని యుదహరించిన పాశురములకును ఈపైవాక్యములకును ఈపైనిచెప్పినప్రకారము అర్థముచేసికొననిపక్షమున, సర్వశాస్త్రములతోను విరోధమున్ను పూర్వాపర విరోధమున్ను సంప్రాప్తింపఁ గలవు.

ఇట్లు సర్వేశ్వరుని స్వాతంత్ర్యము విషయముననును, స్వభావసిద్ధమగు కారుణ్యము విషయముననున్ను గలుగఁగల భిన్నాభిప్రాయంబుల కన్నింటికిన్ని పరిహారములు చెప్పఁబడినవి. సంబంధవిశేషము విషయమున గలుగఁగలభిన్నాభిప్రాయము కుగాను పరిహారము ఇఁకమీఁదు చెప్పఁబడును.

సర్వేశ్వరుండు శేషియైనట్టివాఁడు, మనము వానికి శేషభూతులము. ఇట్లుండ, ‹‹గర్భభూతా స్తపోధనాః'' (తపోధనులు గర్భమువంటివారు) అన్నట్లు, వానికి మనము చంటిబిడ్డలవంటివారమగుటంజేసి, తల్లినిపాలియ్యుమని బిడ్డలు మొఱపెట్టుకొను చందంబున, మనమున్ను ఆర్తులమై మోక్షముకుగాను సర్వేశ్వరునియొద్ద మొఱపెట్టుకొనవలసినంతమట్టుకే కాని, కూలి యిచ్చునట్టి వారివలెనే, మనము ఆత్మసమర్పణము చేయవలయుననియు, రక్షింపవలసినది యని యపేక్షింపవలయుననియును, వాని విషయమున విశ్వాసముంచవలయు ననియును

ఇవ్విధముగ చెప్పియున్నట్టి వన్నియును స్వరూపముతో నను
కూలించి యుండునా? అనుచు నివ్విధముగ కొందఱు (తెంగ
లవారు) ఉపసిద్ధోపాయము మూలముగ సాధ్యోపాయమును
పాడుచేయుటకై తలంచుచున్నారు. ఇట్టివారు విభ్రాంతి పోవు
నట్లు, మహాత్ములును, శ్రీభాష్యకారులవారు మొదలగువారును,
విశ్వాసపూర్వకముగ ప్రార్థన యనబడునట్టి యాత్మసమర్పణ
ము మొదలగువాటిని తాము స్వయముగ అనుష్ఠించియు,
అందులకుగాను శాస్త్రప్రమాణాదుల ననువదించి చూపించి
యు, ఒక్కరికొక్కరు పరంపరగా నుపదేశించి పోయియు
నుండియున్నందున, శేషిత్వాది సంబంధము నిత్యమే యైనను,
పాపాత్ములగు ఈ జీవులను సర్వేశ్వరుండు, యేదైననొక సా
ధ్యోపాయమును పురస్కరించుకొనియే తప్ప, రక్షింపడని
శాస్త్రనిష్ఠు లయినవారు అంగీకరింపవలసినది. శాస్త్రమును
వదులుకొంటిమేని, ఇట్టిసంబంధ మొక్కటి కలదని చెప్పి నిరూ
పించుటకు సర్వేశ్వరుని తరమున్ను కాదు. కావున, ఈ సంబం
ధము మూలముగ సర్వేశ్వరుండు ఈతనిని రక్షించుటకొక బాధ్య
తగలవాఁడనియు, శేషభూతుండగు ఈ జీవుండన్ననో, తనను
తాను రక్షించుకొనుటలో బాధ్యతలేనివాడనియును ముందు
చెప్పినది, లోకమును బట్టిచూచినను, రక్ష్యరక్షకభావము కది
యుచితంబుగాఁ దోచునని తెలుపుటకుగాను, ఇంతియె కాని,
వాఁడు రక్షించుటకుగాను వేఱొక్కటెద్దియు నక్కఱలేకుండ
ఇంతమాత్రమే చాలుననుటకాదు. అట్లగునేని, ఇదివరలోఁగా
నందఱుముక్తులైయే యుండవలసివచ్చునని ప్రసక్తించును. సర్వే
శ్వరుండు స్వతంత్రుడు. కావున, అతండు అంతమాత్రముచేత నేతన

యిష్టము వచ్చినవారిని రక్షించుచున్నాడు. తక్కినవారిని రక్షించుచుండ లేదంటిమేని, పూర్వము చెప్పినట్లు వానికిన్ని పక్షపాతము కలదనుమాట వచ్చును.

యుక్తులచేమాత్రము ఈ యర్థమును నిరూపించునట్టివారు సంబంధజ్ఞానమే కావలసినదనియు, రక్షింపమని కోరుట మొదలగునవి యక్కఱలేదనియును చెప్పకూడదు. ఏలయన, అచేతన పదార్థములును, పశుపక్ష్యాదులును, చంటిబిడ్డలును రక్షింపమని కోరికపోవుటతోఁబాటు, సంబంధజ్ఞానమున్ను లేనట్టివారై యున్నను, వాటిని రక్షించుచున్నట్లు చూచుచున్నాము కదా! వాస్తవమే, లోకమునందు అట్లు గానఁబడుచున్నను, శాస్త్రబలమువలన ఈ సందర్భమున సంబంధజ్ఞానము ఆవశ్యక మనియెదవా? అట్లంటివేని, శాస్త్రమునఁ జెప్పియున్నట్టి విధము ననే యట్టి జ్ఞానవిశేషమును స్వీకరింప వలయును.

తనను సర్వేశ్వరుండు రక్షించునప్పుడు సంబంధముతోఁగూడ నిషేధింప కుండుటయే కావలసినది యనియెదవా? అదియును అనుపపన్నము ఏలయన, అట్లంటివేని, సుషుప్త్యాద్యవస్థలయందు (నిషేధంబెద్దియును లేకుండుటచే) అందఱికిని మోక్షమునిచ్చి యుండవలయునని ప్రసక్తించును. తాను నిషేధించుటకు అవకాశమున్నట్టి సందర్భమున నట్లు నిషేధింపకుండుటయే కావలసినది యనియెదవా? అట్లు చెప్పఁదగదు. ఏలయనఁగా, నిషేధించుటకు యోగ్యతలేనట్టి యచేతన పదార్థములను, అట్టియోగ్యతగల పశ్వాదులనున్ను పుత్రాదులనున్ను రక్షించు చున్నట్లు మనము చూచియున్నాము కదా!

ఇట్లుండగా, "యే నాథవంతోపిహి భవంతి లోకేతే నాత్మ కర్మాణి సమారభన్తే । తేషాంహి కార్యేషు భవంతి నాథా శ్శైబ్యాదయో రామ యథా యయాతేః" అను శ్లోకమునం దును "నాథ" అను శబ్దముయొక్క యుత్పత్తిచేత సర్వేశ్వ రునిపై భారముచుంచి యుండుటకు అనుకూలంబగు సంబంధ విశేషమును తెలుపునట్టి "మతుప్" ప్రత్యయముచేతనున్ను సర్వేశ్వరుని రక్షింపుమని యాచించుటయును, ఆత్మనిక్షేప మున్ను సూచితము లగుచున్నవి. అట్లుకాకున్న, అధికప్రసం గాదిదోషములు సంప్రాప్తింపఁగలవు. "నాథవన్తః" అను శబ్దమునందు ఇంతయర్థము వివక్షితము కాకున్నట్లయిన, లోకమునందున్నది యంతయును మోక్షశాస్త్రమునందును ఊహించుకొనుట వచనవిరుద్ధము. సర్వరక్షకుండుగాను ఈశ్వ రుండుండియుండ, మనకు మనలను రక్షించుకొను విషయ మున బాధ్యతలేదని యాప్తులుచెప్పిన వాక్యమునకు తాత్పర్య మెద్దియో తెలిపెదము. "యదర్థంతు కృతోన్యాసః తదర్థం నపునఃక్రియా పూర్వ్యమప్యపరాధీన ప్రవృత్తావస్య నాన్వయః" (ఎందులకుగాను ఆత్మసమర్పణమును చేసియున్నామో, అం దులకై మరల చేయవలసినది వేఱొక్కటి లేదు. అంతకు ముందును ఈజీవుండు స్వతంత్రుండు కాడుగాన, ఈతనికి తన ను రక్షించుకొనుటలో సంబంధములేదు.) అన్నట్టి ప్రమా ణమునకనుగుణముగ తనరక్షణ విషయమగు భారమును సర్వేశ్వ రునిపై నుంచినట్టి యీతండు అటుపిమ్మట తనరక్షణము విష యమున తాను ప్రయత్నించుట సంభవముకాదు. ముందు తా నును తనరక్షణ విషయమై యొనర్చినట్టి ఆత్మ సమర్పణాది

వ్యాపారమును, సర్వకర్తయగు సర్వేశ్వరుఁడె బీజాంకురన్యాయ ప్రకారము అనాదికాలముగ ప్రవర్తింపఁజేసినట్టి కర్మప్రవాహములో నెద్దియైన నొక సుకృతవిశేషము మూలముగ చేయించినాఁడు గాన, మనమే మనలను రక్షించుకొనగల మనుకొనుటకు అవకాశము లేదు. కావున సర్వరక్షకుండుగాను మూలమంత్రాదులచేఁ దెలుపఁబడునట్టి సర్వేశ్వరుండే మనచే నొక యుపాయము ననుష్ఠింపఁజేసి, అట్టి యనుష్ఠానమువలన సంతోషించినట్టివాఁడై రక్షింపఁగలఁడని తలంచుకొనియుండుటయే కావలసినది.

శ్లో॥ స్వామిస్స్వశేషంస్వవశం స్వభరత్వేననిర్భరం।
స్వదత్తస్వధియాస్వార్థం స్వస్మిన్ న్యస్యతిమాంస్వయం।

తా॥ తనకు శేషభూతుండును, తన యధీనమున నుండువాఁడును, తనయందు భారము నుంచుటచే నిర్భరుండును నగు నన్ను తనచే నీయఁబడినట్టి తన విషయమగు జ్ఞానముచే తనకుగాను తానే స్వయముగ తనయందుంచుకొనుచున్నాఁడు.

ఈపైని చెప్పిన ప్రకారము అనుసంధించుకొనుటయే, ఖ్యాతి, లాభ, పూజా, ఫలసంబంధ, కర్తృత్వ, ఉపాయత్వము అనఁబడు దోషంబులెవ్వియును లేకుండునట్లు భగవంతునియనుసంధించుకొనునట్టి క్రమము. కావున తల్లియొక్క చంటిలోనుండి వచ్చునట్టి పాలవలె వచ్చునట్టి భగవదనుగ్రహమును చంటిబిడ్డ చంటిని చప్పరించుటవంటిని సుమీ! ఈచేతనునికుండవలసినట్టి యపేక్షాదులు. ఇందువలన సిద్ధోపాయ స్వరూపమునకొక్కదోషమున్ను సంభవింపదు.

ఇట్లు నారాయణశబ్దముచేఁ దెలియవచ్చునట్టి గుణవిశేషములు, సంబంధవిశేషములు, వీటివిషయమునఁ గలుగఁగల భిన్నాభిప్రాయంబులకు పరిహారంబులఁ జెప్పియున్నాము.

ఇఁకమీఁదు "లక్ష్మ్యా సహ హృషీకేశో దేవ్యా కారుణ్యరూపయా। రక్షకః సర్వసిద్ధాంతే వేదాంతేషు చ గీయతే" (కారుణ్యరూపియగు లక్ష్మీదేవితోఁ గూడియున్నవాఁడగు నారాయణుఁడు సర్వరక్షకుఁడుగాను సర్వసిద్ధాంతములయందును వేదాంతములయందును చెప్పఁబడుచున్నాఁడు) అన్నట్లు సపత్నీకుండై అందఱిని రక్షింపవలయునని దీక్షను వహించియున్నట్టి సర్వేశ్వరుని కుండుకున్నట్టిదిగాను శ్రీమచ్ఛబ్దమువలనఁ దెలియవచ్చునట్టి పత్నీసంబంధమువిషయమునఁ గలుగఁగలభిన్నాభిప్రాయంబులకుఁ బరిహారము సంగ్రహముగ నిఁకమీఁదు చెప్పఁబడును. ద్వయమందలి పూర్వఖండమునందుండు "శ్రీమత్" అనుశబ్దము (1)ఉపలక్షణపరంబనియు, ఉత్తరఖండమునందుండు "శ్రీమత్" అనుశబ్దము(2) విశేషణపరమనియును ద్వివిధముగ విభజించికొందఱు చెప్పుదురు. అయితే ఈ తావున శబ్దమున్ను ఒక్కటియైయుండ అర్థస్వారస్యమునకున్న బాధకంబెద్దియును లేకుండయుండియుండ,

---

(1) ఉపలక్షణము:—ఏది దేనితో నెల్లప్పుడునుండక, ఏదోకసమయమునమాత్రము తటస్థముగా నుండగలదో, అది దానికి ఉపలక్షణంబనఁబడుచున్నది. దృష్టాంతము—"ఏయింటిమీఁద కాకి వాలియున్నదో, అది దేవదత్తుని గృహము" అనునప్పుడు కాకి గృహమునకు ఉపలక్షణమనఁబడుచున్నది.

(2) విశేషణము:—ఏది దేనితో సర్వకాల సర్వావస్థలయందును ఎన్నటికిని విడువకుండ యుండగలదో, అది దానియొక్క విశేషణము లేక గుణంబగుచున్నది. దృష్టాంతము—లవణమునకు ఉప్పదనము గుణము.

*"స్వరూపంస్వాతంత్ర్యం" ఇత్యాదితావుల ప్రసిద్ధంబై యొక్క
విధముగానుండునట్టి సంప్రదాయమునకు విరుద్ధముగాను చేయఁ
బడినట్టి యీ విభాగము యుక్తమైనదికాదు. అనన్యోపాయత్వ
మునకు విరుద్ధంబుగ రెండుఉపాయంబులు కలవని ప్రసక్తించుట
యీ తావున బాధింపదా? యంటివేని, అనన్య ప్రయోజనత్వ
మునకు విరుద్ధముగ రెండు ప్రాప్యంబులు కలవని ప్రసక్తించుటం
జేసి, ఉత్తరఖండమునందునువిశేషణత్వముకడితప్పక ప్రసక్తిం
చును. అయితే రెండుతావులనున్ను "శ్రీమత్" శబ్దమును
ఉపలక్షణపరముగాఁ గొనుద మనియెదవా? అట్లగునేని, సర్వే
శ్వరునియొక్క గుణ, విగ్రహ, వ్యాపారంబులును ఉపలక్ష
ణంబులని ప్రసక్తించును. ఉపయుక్తంబులగుటం జేసి, యవి విశే
షణంబు లంటివేని, యది పూర్వోత్తరఖండములయందుఁ దెలి
యవచ్చునట్టి పత్నీసంబంధమునకున్ను సమానము.

---

* శ్లో॥ స్వరూపంస్వాతన్త్ర్యం భగవత ఇదం చన్ద్రవదనే!
త్వదాశ్లేషోత్కర్షాద్భవతి ఖలు నిష్కర్షసమయే।
త్వమాసీర్మాతశ్శ్రీః కిమితు రిద మిత్థన్త్వవిభవ
స్తద స్తర్భావాత్త్వాం న పృథగభిధత్తే శ్రుతిరపి॥

తా॥ తల్లీ! భగవంతునిస్వరూపమును నిష్కర్షించునపుడు నీ సం
యోగమునుబట్టి, అతని వైభవము ఇదియని, ఇట్టిదియని నిర్ణయింపవల
యును. అనఁగా, సకలసమృద్ధిస్వరూపవగు నీ వెచటనుందువో, అచట
భగవంతుఁడనియు, భగవంతుఁడు లక్ష్మీవానుఁడనియు భగవత్స్వరూప
మును నిర్ణయింపవలెను. గనుక శ్రుతి నిన్ను భగవంతునికన్న వేఱుగాఁ
జెప్పలేదు.

ఉపయుక్తంబులగు విశేషణములను ఆయావస్తువులను అనురూపం బయినట్టి విధమున ప్రమాణ సంప్రదాయంబులనుబట్టి చూచుకొనునది. వస్తువు కనురూపముగాను కదా! యుపయోగం బుండగలదు. ఉపాయోపేయ పరంబగు వాక్యద్వయమునందును తెలియవచ్చునట్టి యీ విశేషణము ఉపయోగపడునట్టి విధమును ‹‹వేరిమారాత పూమేలిరువ్పాళ్ విన్నైతీర్క్కుమే›› (పరిమళ విశిష్టమగు పద్మమునందు వసించునట్టి లక్ష్మీదేవి పాపములఁ బోగొట్టగలదు) అనియు, ‹‹నిన్తిరువరుళుమ్ పంకయత్తాళ్ తిరువరుళుమ్ కొండు నిన్కోయిల్ శీయ్ త్తెన్నుమ్›› (నీయొక్క కృపనున్ను పిరాట్టియొక్క కృపనున్ను నిరీక్షించుచు నీకోవిలలో సమ్మార్జనమును చేయుచుంటిని) అనియు నీతావుల శ్రీనమ్మాళ్వారులు సాయించినారు. ‹‹ అలమేషాపరిత్రాతుం రాక్షస్యో మహతోభయాత్›› (రాక్షసస్త్రీలను గొప్పభయమునుండి యీమె రక్షింపఁగలదు) ‹‹ అలమేషా పరిత్రాతుం రాఘవాద్రాక్షసీగణం ›› (ఈమె రాక్షసీ సమూహమును శ్రీరామచంద్రునినుండి రక్షింపఁగలదు ) అనుతావుల శ్రీవాల్మీకి మహర్షియును శరణాగతిసారంబగు ఆదికావ్యమునందు ( శ్రీరామాయణమునందు) తెలిపియున్నాడు. ‹‹ సంసారార్ణవ తారిణీం ›› ( పిరాట్టి సంసార సముద్రమును దాటించునది) అను తావున హిరణ్యగర్భకాశ్యపాదులును చెప్పియున్నారు. ‹‹వాచః పరంప్రార్థయితా ప్రపద్యే న్నియతః శ్రియం›› (భగవంతుని ప్రార్థించునట్టివాఁడు పిరాట్టిని శరణుజొచ్చునది) అని శ్రీశౌనక మహర్షియును విధించియున్నాడు. ‹‹ఆత్మవిద్యాచ దేవి త్వమ్ విముక్తిఫల

దాయినీ" (ఓ దేవి నీవు ఆత్మవిద్యవు. మోక్షరూపమగు ఫలము నిచ్చునట్టిదానవు) అని పులస్త్యునియొక్కయును, వసిష్ఠునియొక్కయును వరప్రసాదమువలన లభించినట్టి పరదేవతా పారమార్థ్యజ్ఞానము గలవాఁడగు శ్రీ పరాశర బ్రహ్మర్షియును తెలిపియున్నాఁడు. ఈశ్లోకమున "విముక్తిఫలదాయినీమ్." అనుదానిని ఆత్మవిద్యకు విశేషణముగాఁ గొనినను, అనఁగా "మోక్షముఫలము నిచ్చునట్టి యాత్మవిద్యవు నీవు" అనియర్థముచేసి కొనినను, అట్టి యాత్మవిద్య యీామెయే గాన, అట్టి సామర్థ్యమున్ను యీామెదే కాఁగలదు.

శ్రియః పతియును స్వయముగ "యామాలంబ్య సుఖేనేమం దుస్తరం త్రిగుణోదధిం నిస్తరంత్యచిరేణైవ వ్యక్తధ్యానపరాయణాః" (ధ్యానవంతులైనట్టివారు పిరాట్టిని యాధారముగాఁ గొని సత్వరజస్తమోగుణ సముద్రంబగు ఈ సంసారమును సుఖముగ దాటుచున్నారు) అనిసాత్వతమునందు శ్రియఃపతిరూపధ్యాన సందర్భమునఁ దెలిపియున్నాఁడు. ఈ విషయమును ప్రతిపాదించునట్టి శాస్త్రములే యనేకములుండగా, మధ్యస్థ శాస్త్రములు ఇంకనుమిక్కుటముగానున్నవి. అదియెట్లనిన, శ్రీయాళవందారులు "జగత్సమస్తం యదపాంగసంశ్రయం" (జగత్తంతయునుపిరాట్టికీగంటిచూపు నాశ్రయించియున్నది) అనియు "శ్రేయోనసూరవిందలోచనమనః కాన్తాప్రసాదాదృతే సంసృత్యక్షరవైష్ణవాధ్వసు నృణాంసభావ్యతే కర్హిచిత్" (భగవంతునికిసంతోషముఁగలుగఁజేయునట్టిలక్ష్మీదేవి యొక్క కటాక్షము లేకున్నట్లయిన, ఐశ్వర్యవిషయమునఁ గాని, కైవల్యవిషయమునఁగాని, భగవత్ప్రాప్తి రూపమగు

మోక్షము విషయమునఁగాని మనకు (శ్రేయస్సుకలుగనేరదు) అని సాయించియున్నారు.

శ్రీభాష్యకారులును, శ్రీవైకుంఠ గద్యయందు, "శేష శేషాశనాది సర్వం పరిజనం భగవత స్తత్తదవస్థోచితపరిచర్యాయా మాజ్ఞాపయన్త్యా" (ఆదిశేషుడు గరుత్మంతుడు మొదలుగాఁగల పరిజనమును భగవంతునికి తత్తత్కాలోచితంబులగు కైంకర్యముల యందు నియోగించునది పిరాట్టి) అను తావున భగవత్కైంకర్యరూపంబగు పరమపురుషార్థము ఈమెయొక్క యాజ్ఞప్రకారము జరుగవలసినది యని సాయించియున్నారు.

శ్రీకూరత్తాళ్వారులును "స్వస్తిశ్రీర్దిశతాదశేష జగతాం సర్గోపసర్గ స్థితీ స్స్వర్గం దుర్గతి మాపవర్గిక పదం సర్వంచ కుర్వన్ హరిః । యస్యావీక్ష్య ముఖం తదింగిత పరాధీనో విధత్తే౽ఖిలం క్రీడేయం ఖలు నాన్యథాస్యరసదాస్యాదైకరస్యాత్తయా" (నారాయణుండు జగత్తుయొక్క సృష్టిస్థితి సంహారములనున్ను స్వర్గ నరక మోక్షములనున్ను గలుగఁజేయునప్పుడు, ఏలక్ష్మీదేవియొక్క ముఖము వంకచూచి యామె యభిప్రాయము నెఱింగి, యందుల కనుగుణముగ ఒనర్చుచున్నాడో, అట్టి లక్ష్మీదేవి యందఱికిని క్షేమమును గలుగఁజేయుగాక ? ఇది యంతయును ఆమెయొక్క యిష్టము ననుసరించి యుండునట్టి భగవంతుని విలాసము) అను తావున సంగ్రహముగా సాయించినట్టి యర్థమును "దేవిత్వన్మహిమావధిర్నహరిణా నాపిత్వయాజ్ఞాయతే) (ఓదేవి ! నీయొక్క మహిమ నీకున్ను నీ భర్తయగు నారాయణునికిన్ని తెలియదు) అను తావున విస్తరించి తెలిపియున్నారు,

భట్టరువారును "ఐశ్వర్య మక్షరగతిం పరమం పదం వా కస్మైచిదంజలిభరంవహతే వితీర్య అస్మైనకించిదుచితం కృతమిత్యథాంబ త్వం లజ్జసే కథయ కోయ ముదారభావః" (తల్లీ ! ఎవ్వండైనను నీకు అంజలిచేసినవానికి ఇహలోకైశ్వర్యమునున్ను, కైవల్యమునున్ను, పరమపదమునున్ను ఇచ్చెదవు. ఇట్లు ఇచ్చియు, నీనికి నేనేమి యుపకారము చేయకపోతినిఅని సిగ్గుపడియెదవు. ఇట్టి నీదు ఔదార్యము వర్ణింప నలవిగానిది) అని శ్రుతియందుండు ఉదారశబ్దముయొక్క యర్థమును వివరించి తెలిపియున్నారు.

పెరియ జీయరువారును శ్రీసూక్త భాష్యమునందు అపేక్షితార్థంబుల నన్నింటిని ఉపపాదించియున్నారు.

ఇవ్విధమున శ్రుతులవలనను, స్మృతులవలనను, సంప్రదాయము వలననున్ను తెలియవచ్చునట్టి స్థితిగతులను బట్టి శ్రీమచ్ఛబ్దమువలనఁ దెలియవచ్చునటి విశేషణమునకు విగ్రహాదులకు వలెనే వస్త్వనుగుణంబులగు ఉపయోగంబులను సంప్రదాయమునఁ బ్రీతిగలవారు యెఱుంగఁదగినది.

శ్లో॥ భరస్వీకార రహితం రక్షాసంకల్ప వర్జితః ।
గుణాదిక మిహేష్టంహి శరణ్యస్య విశేషణం ॥

తా ॥ భరస్వీకార మున్ను, రక్షణ విషయమగుసంకల్పము న్నుతప్ప,తక్కినగుణములు మొదలగునవి శరణ్యుండగు సర్వేశ్వరునియొక్క గుణముగాఁ గొనఁబడినవి.

శ్లో॥ ఏకరస్యజుషో శ్శ్రేషిదంపత్యో స్సర్వకర్మసు ।
విశేషణ విశేష్యత్వం శ్రౌతంకస్మాన్న రోచతే॥

తా॥ ఏకాభిప్రాయము గలవారలగు శ్రీశ్రియఃపతుల కుఁగల విశేషణ విశేష్యభావము శ్రుతులయందుఁ జెప్పఁబడు చుండ, అది యేల రుచింపదు?

శ్లో॥ ప్రతర్దనాది విద్యాసు వేద్యేపి పరమాత్మని ।
అచేతనవదిచ్ఛామ చేతనం చ విశేషణం ॥

తా॥ ప్రతర్దనాది విద్యలయందు ఉపాస్య వస్తువు పరమాత్మ యయినప్పటికిన్ని, చేతనమగు విశేషణమును అచేతన తుల్యముగాఁ గోరుచున్నాము.

శ్లో॥ ఇత్థం ప్రపత్తి విద్యాయాంతత్తన్మన్త్రేను సారతః ।
విభుః పత్న్యా గుణాద్యైశ్చ విశిష్టో విషయోత్రనః ॥

తా॥ అట్లే, ప్రపత్తి విద్యయందును, ఆయామంత్రములయందుఁ జెప్పియున్న ప్రకారము, పిరాట్టితోను, గుణాదులతోనను గూడియున్నట్టి నారయణుండే మా యొక్క శరణాగతికి విషయభూతుండు.

ఈ సందర్భమున తర్కములఁగొని ప్రమాణంబులను బాధింపఁగూడదని యింతకుముందే చెప్పియున్నాము. కావున ప్రమాణానుగుణముగ సర్వేశ్వరునియభిప్రాయము ప్రకారము విశిష్టము (పిరాట్టి పెరుమాళ్లు ఉభయులును చేరి) ఉపేయంబగునట్లు, అట్టి విశిష్టమే యుపాయంబగుటలో కొరతలేదు. నారాయణ శబ్దమునందును, చరణశబ్దమునందును, తెలియవచ్చునట్టి గుణవిశేషంబులతోనను, విగ్రహ విశేషంబులతోనను గూడియుండునట్టిది యగు యొక్కటియే వస్తువు (పరమాత్మ) ఉపాయఁబగు చందంబున, అవ్విధమునసే శ్రీమచ్ఛబ్దమువలనఁ దెలియవచ్చునట్టి నిత్యపత్ని సంబంధముతోఁగూ

డియున్నప్పటికిన్ని, ఉపాయం బొక్కటియే యన్నట్లయిన
బాధకము లేదు. ఉపాయ విశేషణముల నన్నింటిని విడిచిపెట్టి
ఉపాయమును మాత్ర మొక్కటిగాఁ జేయవలయు నంటివా ?
అట్లుచేయఁబూనితివేని, దానికి ఉపాయత్వరూపమగు విశే
షణమున్ను లేకపోనలసి వచ్చును.

విశేషణమును బట్టి విశేష్య వస్తువుకుఁ గలుగునట్టి
యొక యతిశయమువలన, విశేష్యవస్తువు కెవ్విధములగు వై
గుణ్యాదులును కలుగఁజాలవని "స్వతః శ్రీస్త్వం విష్ణోఃస్వ
మసి తత ఏవైష భగవాన్ త్వదాయత్తర్ద్ధిత్వేప్య భగవదపరా
ధీన విభవః। స్వయా దీప్త్యా రత్నం భవదపిమహార్ఘం నవిగు
ణం నకుంఠస్వాతంత్ర్యం భవతిచ న చాన్యాహిత గుణం"
(లక్ష్మీ! నీవు పరమపురుషునిసొత్తు గనుక అతని యైశ్వర్యము
నీయధీనమైనను, అతనికి పరాధీనుఁడను లోపము లేదు. ఎట్లనిన,
కాంతినిబట్టి రత్నము శ్రేష్ఠమైనను, ఆకాంతి రత్నమునకు
సొంతము గనుక గుణహీనము గాని అన్యతన్త్రముగాని
కాదు) అను శ్లోకమునందు శ్రీగుణరత్నకోశమున నిర్ణయింపఁ
బడినది. విశేషణము మూలముగ విశేష్యవస్తువుకుఁ గలుగు
నట్టి యతిశయము వంటిదియె విశేష్యవస్తువుకు స్వరూప
సిద్ధంబైనట్టి యతిశయమున్ను. ఈ విషయమును " అనన్యా
రాఘవేణాహం భాస్కరేణ ప్రభాయథా " (సూర్యుని
కాంతి యెన్నఁడును విడిచియుండనట్లు, నేనున్ను శ్రీరామ
చంద్రుని విడిచియుండజాలను ) అను తావున నొసంగినట్టి
దృష్టాంతమువలన నెఱుంగునది. సూర్యునికిని ప్రభకును
స్వతసిద్ధంబగు తేజస్త్వము వలెనే, వీరి యుభయులకును

«అనన్యాధీన కల్యాణం'' అన్నట్లు స్వతస్సిద్ధంబగు కల్యాణత్వమును బట్టి«అప్రమేయం హి తత్తేజో యస్యసా జనకాత్మజా''(సీతాపిరాట్టి ఎవ్వనిదో వాని తేజస్సు అపరిమితమైనది) అనియు, «తవ శ్రియః'' అనియు, «ఉన్తిరు'' అనియు, «శ్రియః శ్రీః'' అనియు, «తిరువుక్కుంతిరు'' అనియును సాయించినట్టి విశేషణ విశేష్యవస్తువులను (పిరాట్టినిన్ని పెరుమాళ్ళనున్ను) పరస్పరముఒక్కరికొక్కరుఅతిశయముఁగలుగఁజేయునట్టి వారినిగాను చెప్పినందున, బాధక మెద్దియునులేదు. శ్రుతిబలమువలన «ద్వేచసదైకశేషి'' (ఇద్దఱును కలసి శేషివస్తువొక్కటియే) అన్నట్లు వీరిద్దరియందుండునట్టిది యగు శేషిత్వ మొక్కటియే యని, శోమాశియాండానుగారు షడర్థ సంక్షేపమను గ్రంధమున నిర్ణయించిన ప్రకారము, వీరు ఉభయులును ఒక్కటియే శేషిత్వముకు ఆశ్రయ మగుటంజేసి, హవిస్సులతో అగ్నివిష్ణు మొదలగుదేవతలు సంబంధించినట్లు, ఆత్మ హవిస్సుతోనును వీరుభయులును సంబంధించి యుండుటలో కొరత లేదు. * «యువత్వాదౌ తుల్యేప్యపరవశతా శత్రుశమన స్థిరత్వాదీన్ కృత్వా భగవతి గుణాన్ పుంస్త్వసులభాన్ త్వయి స్త్రీత్వై కాంతాన్ (మృదిమ పతిపారార్థ్యకరుణాక్షమాదీన్వా భోక్తుం భవతి యువయో రాత్మనిభిదా) అన్నట్లు భార్య భర్తలుగానే యెల్లకాలము పాటుపడ తలసి యుండుటంజేసి, యాగతంత్రము నందువలెనే, ప్రధానముగ శాస్త్రములయందుఁ జెప్పియున్నట్టి వాటికిన్ని ఒక్కండు యజమానుండు అన్నట్లు ఒక్కండని చెప్పినం

* ఈశ్లోకముయొక్కయర్థమును ౨౫౩ వ పేజీలో చూచుకొనునది.

మనమున్ను బాధకము లేదు. "తామరైయాళ్ కేళ్వ నొరువనైయే నోక్కుమునర్వు" (లక్ష్మీపతి యొక్కనియందే లక్ష్యము గల జ్ఞానము) అను దానికిన్ని యిదియే యభిప్రాయము. "తదంతర్భావాత్త్వాం న పృథగభిధత్తే శ్రుతిరపి" (పిరాట్టిసీలో నంతర్భూతం బగుటంజేసి శ్రుతియును ఆమెను ప్రత్యేకముగాఁ జెప్పదు.) అని యీ మొదలగు వాక్యములనున్ను ఈవిషయము నుదాహరణముగాఁ గొనునది. సర్వేశ్వరుని గుఱించి చెప్పినట్టి తావుల నంతటను పిరాట్టినిన్ని చెప్పియున్నామని శ్రీరామానుజులవారు సాయించిన దానిని ఆచ్చాన్ పిళ్లగారి సన్నిధిలో విని శ్రీ నంజీయరుగారు సంగ్రహముగాఁ దెలిపియున్నారు.

కామ్యఫలముల కైయర్చించునట్టి భగవద్విగ్రహమునందును విష్ణుపత్నీత్వము ప్రతిష్ఠితం బగుటంజేసి, భగవదారాధనమునందు ప్రవర్తించునట్టివారై యనన్య ప్రయోజనులగు ముముక్షువులకును కామ్యఫలముల కైయర్చించునట్టిభగవద్విగ్రహమునందువలెనే, మాతృత్వాదిసంబంధమునుబట్టి యొనర్పంబడునట్టి ప్రణామాద్యుపచారంబులకున్ను బాధకము లేదు.

ఇవ్విధమున మధ్యస్థుల యభిప్రాయములను బట్టియును ప్రామాణికంబులగు అర్థములు తెలియవచ్చుచున్నప్పటికిన్ని, తాము అసలంచి యున్నట్టిదానిని విడువక పోయినచో,

శ్లో॥ దృఢపూర్వ శ్రుతో మూఖోః దర్మాణా మవిశారదః।
వృద్ధానపృచ్ఛన్ సందేహాన్ అంధశ్వభ్ర మివర్ఛతి ॥

తా॥ పూర్వము విన్నదానినే విడువకుండ మనస్సునను౦చుకొని నట్టివాఁడై, ధర్మములను బాగుగా గుర్తెఱింగి

యుండనివాఁడై, తనకు సందిగ్ధములగు విషయములను జ్ఞానవృద్ధులయినట్టి వారినడిగితెలిసికొననివాఁడై యుండునట్టి మూర్ఖుఁడు గ్రుడ్డివానివలెనే సంచరించుచున్నాడు.

శ్లో॥ అన్యథా మందబుద్ధీనాం ప్రతిభాతి దురాత్మనాం।
కుతర్కజ్ఞాన దుష్టానాం విభ్రాంతేంద్రియ వాజినాం॥

తా॥ మందమతులును, దురాత్ములును, కుతర్కంబులచే జ్ఞానము చెడిపోయినట్టివారును, భ్రాంతిజ్ఞానవంతులయినట్టివారికి తత్వము యథార్థముగాఁ దెలియరాదు.

అని యీ పైశ్లోకములయందుఁ జెప్పియున్నట్టి స్థితి తటస్థించును. కావున సిద్ధోపాయ శబ్దముయొక్క యర్థమును విమర్శించునప్పుడు, "నానయోర్విద్యతే పరం" (వీరియుభయులకంటెనున్న శ్రేష్ఠమైనది లేదు.) అనియు,

శ్లో॥ యథాసర్వగతో విష్ణుస్తథైవేయం ద్విజోత్తమ।
అస్యాదేవ్యా మనస్తస్మిన్ తస్యచాస్యాం ప్రతిష్ఠితం॥

తా॥ ఓ బ్రాహ్మణశ్రేష్ఠుండా! విష్ణువు సర్వవ్యాపకుండైనట్లు, ఈమెయును సర్వవ్యాపకురాలు. ఈమెయొక్క మనస్సు ఆయనయందును, ఆయన మనస్సు ఈమెయందును లగ్నములై యున్నవి.

శ్లో॥ తేనేయం సచ ధర్మాత్మా ముహూర్తం మపిజీవతి।
వ్యాపకావపి సంశ్లేషా దేకతత్వ మివోదితౌ॥

తా॥ వీరిలో నొక్కతెని విడిచి వేరొక్కరు క్షణకాలమైనను నిలువజాలరు. కావున వీరు ఉభయులును ఒక్కరితో నొక్కరు చేరియుండి యంతటను వ్యాపించియున్నందున, నిద్దఱునుచేరి యొక్కటిగనే తత్త్వముగాఁ దెలియవచ్చుచున్నారు.

పైని తెలిపియున్నట్టి విధమున నొక్కటియే శేషియగుటం జేసియును, ఇద్దఱికిని యొక్కటియే యభిప్రాయముండుటం జేసియును, వీరుపరస్పరము మిక్కిలి ప్రేమించియుండుటం జేసియును స్వరూపరూపాదులవిషయమున అపృథక్ సిద్ధముగ సంబంధించియుండుటంజేసియును, "గాఢోపగూఢాని తే" అన్నట్లు గూఢమైనట్టి యీ విశిష్టత్వము చెడిపోకుండునట్లు, "శ్రీమత్" అను విశేషణముతోఁ గూడియున్నట్టి విధమున అనుసంధించుకొనుట సాత్వికులయినట్టి వారికి ఆవశ్యకము.

శ్లో॥ సమస్తపురుషార్థానాం సాధకస్య దయానిధేః ।
శ్రీమతః పూర్వసిద్ధత్వాత్ సిద్ధోపాయ మిమం విదుః॥

తా॥ సమస్త పురుషార్థంబులనున్ను సాధించునట్టివాఁడును, దయానిధియును, లక్ష్మీపతియునగు నారాయణుండు (సాధించిసంపాదింప నక్కఱలేకుండ) ముందే యుండియున్నందున సిద్ధోపాయంబని చెప్పఁబడుచున్నాడు.

శ్లో॥ భక్తిప్రపత్తిప్రముఖం తద్వశీకారకారణం।
తత్తత్ఫలార్థిసాధ్యత్వాత్ సాధ్యోపాయంవిదుర్బుధాః॥

తా॥ భగవంతుని వశపఱచుకొనుటకు ఉపాయంబులగు భక్తిప్రపత్తులు మొదలగునవి ఆయాఫలంబులఁగోరునట్టివారిచే సాధించి సంపాదింపవలసినవి యగుటంజేసి, వాటిని సాధ్యోపాయంబని చెప్పుదురు.

శ్లో॥ సాధ్యోపాయోత్తరంగేణ సిద్ధోపాయస్య శేషిణః।
లీలాప్రవాహః కారుణ్యప్రవాహేణ నిరుధ్యతే॥

తా॥ సిద్ధోపాయంబగు శేషియొక్క సాధ్యోపాయ రూప ములగు తరంగములుగల కారుణ్యప్రవాహముచే లీలాప్రవాహము నిరోధింపఁ బడుచున్నది. ( సాధ్యోపాయానుష్ఠానము మూలకమగు భగవత్కృపవలన లీలావిభూతిలోనివారు ముక్తు లగుచున్నారు)

శ్లో॥ తేనైవ సర్వే లీయన్తే సికతా సేతుబంధవత్।
స్వతంత్రస్యాపి సంకల్పాః స్వకైంకర్యనిరోధకాః॥

తా॥ అట్టికారుణ్యముచేతనే యిసుక కట్టవలెనే యన్నియు ను లోపింపఁ జేయఁబడుచున్నవి. స్వతంత్రుండైనను సర్వేశ్వ రుని సంకల్పములున్ను స్వవిషయమగు (లీలా) కైంకర్యమును నిరోధించునవి.

శ్లో॥ ప్రసాదనస్యోపాయత్వే శాస్త్రీయేపి ఫలంప్రతి।
కర్తృత్వావ్యవధానాద్యైః సిద్ధోపాయప్రధానతా॥

తా॥ సాధ్యోపాయమే శాస్త్రప్రోక్తంబులగు ఫలముల విషయమున హేతువయినను, కర్తృత్వావ్యవధానాదుల మూలముగ సిద్ధోపాయమే ప్రధానంబైనది కాగలఁడు.

శ్లో॥ స్వతంత్రన్యాసనిష్ఠానాం సిద్ధోపాయేవిభాస్థితిః।
క్షణాత్స్వయత్నవిరతి వ్యక్త్యైప్రోక్తావిశేషతః॥

తా॥ వెంటనే స్వరక్షణ విషయమున స్వప్రయత్నమును వదలుకొనుటకై స్వతంత్రమగు ప్రపత్తినిఅవలంబించినట్టివారు భగవంతునిపై భారమునుంచునదని విశేషించిచెప్పఁబడినది.

శ్లో॥ అతోయదర్థంస్వభర స్సిద్ధోపాయే నివేశితః।
తదర్థం శాంతయత్నోసౌ సిద్ధోపాయంప్రతీక్షతే॥

తా॥ ఏందులకై యీతండు తన భారమునంతయును సిద్ధో

పాయంబగు సర్వేశ్వరునిపై యుంచియున్నాడో, అందులకై యే యీతండు సర్వప్రయత్నములను విడనాడి అట్టి సిద్ధోపాయమునకై నిరీక్షించుచున్నాడు.

శ్లో॥ ప్రపత్తేర్లక్షణే మంత్రే విధౌ వాక్యాంతరేషుచ।
 భాష్యాదౌ సంప్రదాయేచో పాయత్వం బ్రహ్మణి స్థితం॥

తా॥ ప్రపత్తియొక్క లక్షణమందును, మంత్రమునందును, విధియందును, వాక్యాంతరములయందును, భాష్యాదులయందును, సంప్రదాయమునందును బ్రహ్మమే మోక్షోపాయముగాఁ దెలుపఁబడినది.

శ్లో॥ పూర్వసిద్ధస్య దేశాదేః ధర్మత్వం యద్వదిష్యతే।
 ఏవంతత్త్వవిదః ప్రాహుః కృష్ణం ధర్మం సనాతనం॥

తా॥ పూర్వము నుండియున్నట్టి దేశాదులు ధర్మభూతంబులయినట్టివిగాఁ గొనఁబడుచందంబున, తత్త్వవేత్తలును అట్లే శ్రీకృష్ణుని సనాతనంబగు ధర్మమునుగాఁ జెప్పుచున్నారు.

ఈ సిద్ధోపాయము రహస్యత్రయమునందు ప్రథమాక్షరము మొదలగుతావులయందు అనుసంధించుకొనవలసినది.

పా॥ మన్నుమనైత్తుఅవాయ్ మరుణ్మాఱ్ఱిరుళాక్కియుమాయ్, త్తన్నినైవాలనైత్తుఞ్ఱరిత్తోంకు త్తనియిఱైయాయ్,
 ఇన్నముత్తముదాలిరంగు త్తిరునారణనే, మన్నియవణ్
 శరణ్ముఱ్ఱెఙ్గళ్ పఱ్ఱిప్పవర్ క్కే॥

టీ॥ మన్నుమనైత్తుఱైవాయ్ = అందఱికిని అన్నివిధములనుబంధువైనట్టివాఁడును, మరుణ్మాఱ్ఱిరుళాక్కియుమాయ్ = మిక్కిలి దయాళువగుటంజేసి మాయొక్క యజ్ఞానమునంతయునుపోగొట్టినట్టివాడై, నన్నినవాల్ = తనయొక్కసంకల్పముచేత, అనైత్తు = సమస్తప్రపంచమును, తరిత్తు = సత్తగలదై, ఓంగుమ్ = ఉండునట్టి విధమున, తని = అద్వితీ

యుండ్రై, ఉర్రైయాయ్=స్వామియై, ఇన్నముద త్తిము తాల్ =అమృతముకం బైనన్న భోగ్యంబైనట్టి లక్ష్మీదేవిపురుషకారముచే, ఇరంగుమ్ =మమ్ము లనుదయతోఁ జూచునట్టివాఁడగు, తిరునారణ నే= శ్రీమన్నారాయణుండే, మన్నియవన్ శరణ్= నిత్యమును నిరపాయంబగు ఉపాయముకాఁగలడు. ఎరిప్పవర్కు = లక్ష్మీవిశిష్టుండగు భగవంతుని ఉపాయముగాఁ గొనువారికి మర్ఱ్ఱు = తక్కినది, ఓర్ = ఒక్కటియైనను, పర్ఱు = ఆశ్రయము, అన్ఱు = కాదు.

తా॥ సర్వవిధబంధువును, దయాళువునగుటంజేసి యజ్ఞాననివర్తకుండును, తనయొక్క సంకల్పమువలన ప్రపంచమంతయును సత్తనుగలిగి యుండునట్లు చేసినట్టి యద్వితీయుండును, స్వామియును, అమృతముకంబైనన్న ఎక్కువభోగ్యంబైనట్టి పిరాట్టి పురుషకారమువలన మమ్ములను దయతోఁ జూచునట్టి శ్రీమన్నారాయణుండే నిత్యమును, నిరపాయంబునగు ఉపాయము కాఁగలడు. అట్టి నారాయణునియుపాయమునుగా వరించినట్టి వారికి వేఱొక్కటి యుపాయము కాఁజాలదు.

శ్లో॥ విశ్రామ్యద్భిరుపర్యుపర్యపి దివా నక్తం బహిర్దర్శనై
రస్మద్దేశికసంప్రదాయరహితై రద్యాపినాలక్షితః।
స్వప్రాప్తేస్స్వయమేవసాధనతయా జోగుష్యమాణశ్శ్రుతౌ
సత్త్వస్థైస్సుభజేతసన్నిధిమసౌ శాంతావధిశ్శేవధిః॥

టీ॥ దివా = పగటియందును, నక్తం = రాత్రియందును, సతతం=యెల్లప్పుడును, ఉపర్యుపరి = పైపైగా, విశ్రామ్యద్భిరపి= భగవంతుని యందు విశ్రమించునట్టివారయినప్పటికిన్ని, అనఁగా ఎల్లప్పుడునుపరబ్రహ్మముతో నుండువారయినప్పటికిన్ని, అస్మద్దేశిక సంప్రదాయరహితైః= మా యాచార్యుల యుపదేశములనులభింపనట్టివారై, బహిర్దర్శనైః= వేదబాహ్య సిద్ధాంతావలంబులచే, అద్యాపి = ఇప్పటికిన్ని, నాలక్షితః = కనిపెట్ట బడనట్టివాఁడును, స్వప్రాప్తేః=తనను పొందుటకుగాను, స్వయమేవ=తానే

స్వయముగ, సాధనతయా = కారణంబగునట్లు, శ్రుతౌ = శ్రుతులయందు, ఘోఘుష్యమాణః = అతిస్ఫుటముగాఁ దెలుపఁబడునట్టివాఁడును, కాంతా వధిః = అనంతుండును, సత్త్వస్థేషు = సాత్త్వికులవిషయమువ, శేవధిః = నిధివంటివాఁడగు సర్వేశ్వరుండు, సన్నిధింభజేత = ప్రాప్యవస్తువుగాను పొందవలసినట్టి వాఁడు.

తా॥ ఎల్లకాలమును సర్వేశ్వరుని పొందియున్నను, వానిని పొంది యున్నామనెడి జ్ఞానము లేనట్టివారును పూర్వాచార్యుల యుపదేశములను బొందక బాహ్యమతావలంబులయినట్టివారిచే ఇప్పటికిన్ని పొంద నలవి కానట్టివాఁడగు సర్వేశ్వరుండు సాత్త్వికులయినట్టివారిచే విధివలెనే యా శ్రయింపవలసినట్టి వాఁడు.

సిద్ధోపాయ శోధనాధికారము

ము గి సె ను.









# రహస్యత్రయసారము

## సాధ్యోపాయశోధనాధికారము.

శ్లో॥ యథాధికరణంప్రభుర్యజనదానహోమార్చనా
భరన్యసనభావనాప్రభృతిభిస్సమారాధితః।
ఫలందిశతిదేహినామితిహిసంప్రదాయస్థితి
శ్శ్రుతిస్మృతిగురూక్తిభిర్నయవతీభిరాభాతినః॥

టీ॥ యజన = యాగము, దానం = దానము, హోమ = హోమము, అర్చన = పూజ, భరన్యసన = ప్రపత్తిభావనాప్రభృతిభిః నిదిధ్యాసనము యీమొదలగువాటిచేత, సమారాధితః = సంతోష పెట్టబడినట్టి వాఁడగు, ప్రభుః = భగవంతుండు, యథాధికరణం = వారివారి యధికారప్రకారము, దేహినాం = జనులకు, ఫలం = ఫలమును, దిశతి = ఇచ్చుచున్నాడు. ఇతి = ఇవ్విధమున నుండునట్టి, నః = మాయొక్క, సంప్రదాయస్థితిః = సంప్రదాయప్రక్రియ, నయవతీభిః = న్యాయోపేతంబులగు, శ్రుతి, స్మృతి, గురూక్తిభిః = శ్రుతులకును, స్మృతులకును. పూర్వాచార్యులట్టి శ్రీసూక్తులకును అనుగుణముగ, ఆభాతి = ప్రకాశించుచున్నది.

తా॥ యజ్ఞదానాదులచే సంతోషించినవాఁడై భగవంతుండు, వారివారి యధికారము కనుగుణముగ ఫలము నొసంగుచున్నాడనెడి మాసంప్రదాయము శ్రుతిస్మృత్యాదుల కనుగుణమైనది.

ఇట్లు సర్వజ్ఞమును, సర్వశక్తియును, పరమ కారుణికమును, సర్వశేషియును, సపత్నీకమునగు సిద్ధోపాయము తెలిసియున్నను, “ఆరోగ్యమింద్రియాల్బణ్యా మైశ్వర్యం శత్రుశాలితా। వియోగో బాంధవైరాయుః కింతద్యేనాత్రతుష్యతి” (ఆరోగ్యమును, ఇంద్రియపటుత్వమును, ఐశ్వర్యమును, శత్రువులతో నొప్పియుండుటయును, బంధువియోగమును, ఆయుస్సును వీటితో తృప్తిపొందినట్లున్న, యేమున్నది?) అన్నట్లు, వివేకవంతులు కానివారికిమంచివిగాం దోచునట్టివియును దోషయుక్తము లయినట్టివిగాం దెలియవచ్చుటం జేసి, వైరాగ్యము సంపూర్ణముగానున్నను, “పరమాత్మని యోరక్తః” అని తావుం జెప్పియున్నట్లు ప్రాప్యవస్తువునందు (పరమాత్మయందు) ప్రీతియున్నను, “మహతా పుణ్యపణ్యేన క్రీతేయం కాయనౌ స్త్వయా। ప్రాప్తుం దుఃఖోదధేః పారం త్వర యావన్నభిద్యతే” “త్వర యీనునది చెడిపోవుటకు లోగా, దుఃఖసముద్రమును దాటుటకుగాను గొప్పపుణ్యరూపమగు ద్రవ్యముచే శరీరరూపమగు నావ కొనంబడినది) అన్నట్లు త్వరకలిగినను, అనాది కాలముగాం జేయుచు వచ్చుచున్నట్టి భగవదాజ్ఞాతిక్రమణము మూలముగం గలిగినట్టి బంధకమగు భగవన్నిగ్రహము శమించుటకుగాను, “మామేకం శరణం వ్రజ” అని విధివాక్యమునందును, “ప్రపద్యే” అన్నట్టి అనుష్ఠానవాక్యమునందును, చెప్పంబడినట్టి సాధ్యోపాయమును (ప్రపత్తిని) గుఱించి తెలిసియుండకపోయినట్లయిన, సిద్ధోపాయంబగు సర్వేశ్వరుని వశపఱచుకొనుట కవకాశము లేదు. కావున సాధ్యోపాయము (ప్రపత్తి) విషయమగు అధికారమును గుఱించియు, దాని స్వరూపమును గుఱించి

యు, దాని యంగనములను గుఱించియును ఇుతరులు చేయు నట్టి యాక్షేపములు తొలగింపఁ బడుచున్నవి.

ఈ ప్రపత్తియు నొక వైదిక ధర్మము కాదా ? ఇది యును ఒక యోగ విశేషమని కదా ! న్యాసవిద్యయందుఁ జెప్పఁబడుచున్నది. కావున దీని ననుష్ఠించుట కందఱికిన్ని అధికారము కలదని చెప్పఁదగునా ? యని కొందరు ఆక్షేపించుట కద్దు. అయితే సర్వేశ్వరుం డందఱికిన్ని రక్షకుండని తెలుపు నట్టి శ్వేతాశ్వతర శ్రుతిచే ఈ పైయాక్షేపము పరిహరింపఁ బడుచున్నది. ఈ విషయము ‘‘సర్వలోక శరణ్యాయ’’ (సర్వలోక శరణ్యుండగు భగవంతుని శరణుజొచ్చుము) అనియు, ‘‘సర్వయోగ్య మనాయాస మప్రమాద మనూపమం ప్రపన్నార్తిహరం విష్ణుం శరణం గంతుమర్హసి’’ (అందఱిచే నాశ్రయింపఁ దగినట్టివాఁడును, సులభుండును, అజ్ఞానరహితుండును, తనతో సమానుండు లేనివాఁడును, ప్రపన్నుల కష్టంబులను తొలగించునట్టి వాఁడును నగు విష్ణువుకు శరణాగతి చేయుము) ఈ మొదలగు ఉపబృంహణ వాక్యములచేతను, ‘‘త్రయాణాం క్షత్రియాదీనాం’’ (క్షత్రియులు మొదలుకొని మూఁడు వర్ణములవారు) అని యారంభించి శూద్రులవరకును మూఁడు వర్ణములఁ గొని ‘‘ప్రపన్నానాంచ తత్త్వతః’’ (యథార్థముగ ప్రపన్నులయినట్టి వారికిన్ని) అని చెప్పునట్టి సాత్త్వత వచనము చేతను, ‘‘కుయోనిష్వపి సంజాతో యస్సకృచ్ఛరణం గతః తం మాతా పితృహంతార మపి పాతి భవార్తిహా’’(హీనజాతియందుఁ జన్మించినట్టి వాడయినను, భగవంతునికి యొక్కతడవ శరణాగతి చేసినట్లయిన, అట్టివాఁడు మాతాపితృ

ద్రోహి యైనను, వానిని భగవంతుండు రక్షించుచున్నాడు) అను సనత్కుమార సంహితా వచనము చేతను నిర్ణయింప బడుచున్నది. కావున ఉపాసనము ననుష్ఠించుటకు త్రైవర్ణికులకు (మొదటి మూండువర్ణముల వారికి) మాత్రమే యధికారము కలదని శ్రీభాష్యమున అపశూద్రాధికరణమునందు నిరూపింపఁబడినను, వైదికములగు సత్యవచనాదుల యందువలెనే, ప్రపత్తియును సామాన్య ధర్మంబగుటం జేసి, అధికారానుగుణముగ వైదిక మంత్రములచేఁ గాని, తాంత్రిక మంత్రాదులచేఁ గాని అందఱికిన్ని ప్రపత్తి ననుష్ఠించుటలో విరోధం బెద్దియును లేదు. కాకాసురుండు మొదలగువారును ప్రపత్తి నొనర్చినట్లు శాస్త్రములనుండి తెలిసికొనుచున్నాము.

“మాంహి పార్థ వ్యపాశ్రిత్య యేపి స్యుః పాపయోనయః స్త్రియో వైశ్యా స్తథా శూద్రా స్తేపి యాన్తి పరాంగతిం” (ఓ యర్జునా ! నన్ను శరణు జొచ్చినట్టివారు పాపాత్ములయినను, స్త్రీలయినను, వైశ్యులయినను, శూద్రులయినను, పరమపదమును బొందుచున్నారు.) అను తావున భగవంతుని యాయించుట యనునది సర్వసాధారణంబైనట్లు శరణ్యుండగు సర్వేశ్వరుండే స్వయముగ చెప్పియున్నాడు.

ఉపాసనము త్రైవర్ణికులచే మాత్రము అనుష్ఠింపఁదగినది యని మొట్టమొదట చెప్పినను, తుట్టతుదిని, అట్టియుపాసనమును అందఱును అనుష్ఠింపవచ్చునని, “ధర్మవ్యాధాదయోప్యన్యే పూర్వాభ్యాసాత్ జుగుప్సి తేవర్ణావర త్వేసంప్రాప్తాః సంసిద్ధిం శ్రమణీయథా” (ధర్మవ్యాధాదులు మొదలగువారు పూర్వజన్మసంస్కారవశమునహీనకులమున జన్మించినను శ్రమ

ణివలెనే సిద్ధిని బొందనారు) అని శ్రీ విష్ణుధర్మమునఁ జెప్పఁబడి నది. ఇవ్విధమున ఉపాసనము త్రైవర్ణికులచేతను మాత్రమే అనుష్ఠింపఁ దగినది యైనట్లు, ప్రపత్తినిన్ని యివ్విధమున నియమించునట్టి యొకవచన ముండియుండి దానిచే సామాన్య వచనమునకు సంకోచము గలిగియుండకుండుటం జేసియు, విశేష వచనముయొక్క బలమువలననున్ను, ప్రపత్తి యందఱిచేత ను అనుష్ఠింపఁ దగినది. ఇట్లుండ, దీనిని అనుష్ఠించుటలో ము ఖ్యముగానుండి యుండవలసినట్టి యధికారమును ఇంతకుముం దే చెప్పియున్నాము. కావున "అత స్త్రైవర్ణికత్వాదేర్భావో- భావో పికస్యచిత్ నాధికారః ప్రపత్తే స్స్యాదాకించన్యమనా శ్రితః" (త్రైవర్ణికత్వాదు లున్నను, లేకపోయినను, ఆకించన్యము లేనట్టివానికి ప్రపత్తియందధికారము లేదు) అని చెప్పియున్నది. ఈ విషయమును "కులంగళాయ వీరిరండి లొన్నిలుమ్బిఱన్ది లేన్" (ధర్మానుష్ఠానయోగ్యతగల కులద్వయమునందైనను పుట్టియుండకపోతిని) అను పాశురమునందును * "జనిత్వాహం

* శ్లో॥ జనిత్వాహంవంశేమహతిజగతిఖ్యాతయశసాం
శుచీనాంయుక్తానాం గుణపురుషతత్త్వస్థితివిదామ్।
నిసర్గాదేవత్వచ్చరణకమలైకాన్తమనసా
మధోధఃపాపాత్మాశరణద నిమజ్జామితమసి॥

తా॥ లోకమందు భగవద్విషయాకారరూప మహాప్రభావముచే ప్రసిద్ధులై ఈశ్వరవ్యతిరిక్తవిషయభోగ్యతాబుద్ధి సంగరాహిత్యరూపపారి శుద్ధ్యముగలవారై చిదచిత్తులస్వరూప స్వభావయాథాత్మ్యజ్ఞానముచేఁబరి పూర్ణులై అవతరించినది కొండలు దేవరవారి శ్రీపాదసరోజ మకరందానుభవ మే ధారకపోషకభోగ్యములుగాఁగలమహాత్ములయొక్క తిరువంశమందు

వంశే'' అనుశ్లోకమునందును తెలిసికొనునది. కావున శర ణ్యుండగు సర్వేశ్వరుని గుఱించియు, వాని విషయమున నొన ర్పబడునట్టి శరణాగతిని గుఱించియును జ్ఞానమునున్ను ఆకిం చన్యాదులనున్ను వీటిఁ గలిగియున్నట్టి యన్నిజాతుల వారి కిన్ని ప్రపత్తియం దధికారము కలదు.

ఈ యుపాయ స్వరూపమును గుఱించి చెప్పునప్పుడు ''నారాయణం స లక్ష్మీకం ప్రాప్తుం తచ్చరణద్వయం। ఉపా య ఇతి విశ్వాసో ద్వయార్థశ్శరణాగతిః) లక్ష్మీ సహితుండగు నారాయణుని పొందుటకుగాను వానిచరణ ద్వంద్వమే యు పాయంబనెడి విశ్వాసమున్ను ద్వయార్థంబగు శరణాగతియు ను) అని పూర్వాచార్యులు చెప్పినది అధికారిలక్షణము గాను నుండునట్టి విశ్వాసముయొక్క ప్రాధాన్యమును తెలుపుటకు గానని యెఱుంగునది. అస్తే, ''ప్రపత్తి ర్విశ్వాసః సకృత్ప్రా ర్థనా మాత్రేణా పేక్షితం దాస్యతీతి విశ్వాస పూర్వకం ప్రా ర్థన మితియావత్'' (ప్రపత్తి యనఁగా విశ్వాసము. ఒకతడవ ప్రార్థించినంతమాత్రమున ఆపేక్షితము నొసంగఁగలఁడని యిట్లు విశ్వాస పూర్వకమగు ప్రార్థన యని ఫలితార్థము.) అను వా క్యమున్ను ప్రధానమైనట్టి దానిని వివక్షించుటచే మొదట వి శ్వాసమును చెప్పి, ''అనన్యసాధ్యే'' అని భరతముని ప్రణీ తంబగు లక్షణ వాక్యప్రకారము (ప్రపత్తి యనఁగా (విశ్వాస

---

జన్మించియు దుష్కృతములన్నియు నొకశరీరముగాఁ బరిగ్రహించినట్లు కేవలపాపస్వరూపుఁడైనందున నజ్ఞానమను గాఢాంధకారమునఁబడి సర్వ రక్షకుఁడగు దేవరవారిని దెలియనేరక యధోగతి పాలయి అజ్ఞానాంధ కారములో మునిగిపోవుచున్నాను.

పూర్వకముగు ప్రార్థనయునిర్వహించినది. ఈవాక్యమునుబట్టియు ను, ఆత్మనిక్షేప మంగి యనియు, తక్కినవి యంగములనియును చెప్పునట్టి "న్యాసః పంచాంగ సంయుతః" ఇత్యాది వచనముల నుబట్టియును ప్రార్థనయున్న అంగముగుటంజేసి, "రక్ష్యాపేక్షాం ప్రతీక్షతే" అన్నటుల ఈశ్వరుండు ఈచేతనునినుండ తనను రక్షింపవలయు ననెడి కోరికను మాత్ర మపేక్షించునని యిట్లు నీయంగముయొక్క ప్రాధాన్యమును వివక్షించిరో యిట్లు చెప్పుచున్నది. చిన్న గద్యయందును "విశ్వాస పూర్వకముగ ప్రార్థనఁ జేసి "నమోస్తుతే" అని ముగించుటచేతను, ఉపాయవరణముఁ దెలుపునట్టి "శరణ" శబ్దసామర్థ్యము చేతనున్న నిక్షేపము తెలియ వచ్చుచున్నది. "నమః" అనునదియును ఆత్మనిక్షేపముఁ దెలుపునదియగుట "నమస్కారాత్మకం యస్మై విధాయాత్మ నివేదనం" ఇత్యాది తావులయందు సుప్రసిద్ధమైన విషయము. శ్రీవైకుంఠ గద్యయందు ప్రార్థనా పూర్వకమగు ఆత్మనిక్షేపము స్పష్టముగాఁ దెలుపబడినది.

కావున "అనేనైవతు మంత్రేణ స్వాత్మానం మయి నిక్షిపేత్ ఆత్మాత్మీయభరన్యాసః" (ఈ మంత్రముచే తన యాత్మను నా యధీనముచేయునది. ఇదియే తనయొక్కయును తన వాటియొక్కయును భారమును నాపై యుంచుట) ఈ మొదలగు తావుల అంగి (ప్రధానంబగు నిక్షేపము) విధింపఁబడినది. అట్లు కాకున్న, "షడ్విధా శరణాగతిః" (శరణాగతి ఆఱువిధములు గలది) అను వాక్యమునందు, ఏదోక తావునఁ జెప్పియున్నట్టి దానింగాని "స్నానం సప్తవిధం" అను తావునఁ జెప్పియున్నట్టి భిన్న భిన్న స్నానంబుల వలెనే ప్రత్యేక

ప్రత్యేకముగా భిన్న భిన్న ప్రపత్తులు గలవని ప్రసక్తించును. “ప్రపత్తిం తాం ప్రయుంజీత స్వాంగైః పంచభి రావృతామ్” (తన యంగము లయిదింటితోఁ గూడి యున్నట్టి ప్రపత్తిని ప్రయోగించునది) ఇత్యాది వచనాంతర సామర్థ్యము వలన నొక నియమమును యేర్పఱుప దలంచితిరేని, అట్లే, ప్రార్థనా విశ్వాసాదులను ప్రపత్తినిగాఁ దెలుపునట్టి వచనంబులకున్ను ఒక నియమమును యేర్పఱచి “న్యాసః పంచాంగ సంయుతః” ఇత్యాది తావులఁ జెప్పియున్నట్లు నిక్షేపం బనునది యొక్కటి యంగి యనియును, తక్కినవి యంగము లనియును చెప్పుట యుచితము. అనేక విధముల పరిశీలించి చూచినను, సాత్త్వికి తంత్ర, అహిర్బుధ్న్య సంహితాదులయందలి ప్రపత్త్యధ్యాయములయందు నిక్షేపమునకు అంగి యనియే ప్రసిద్ధి కద్దు. “త్వమేవోపాయభూతో మే భవేతి ప్రార్థనామతిః। శరణాగతిరిత్యుక్తా” (నీవే నాకు మోక్షోపాయ మగుదువుగాక యనెడి ప్రార్థనా రూపమగు జ్ఞానము శరణాగతి యనఁబడుచున్నది) అని చెప్పినదిన్ని, ఆ ప్రకరణమునందు ప్రధానముగాఁ జెప్పఁబడినట్టి భరన్యాస పర్యంతం బనెడి విషయము ఈ పైవాక్యము నందుండు “ఏవ” కారము చేతనున్ను, ఉపాయ శబ్దము చేతనున్ను సూచిత మగుచున్నది. యే దొకదానిని ప్రధానముగాఁ గొనుటచే అంగంబులనున్ను ప్రధానములనుగాఁ జెప్పుట లోకమునఁ గలదు. అది యెటువలె ననిన, ఆలంభశబము (హింసను తెలుపునది యైనను, అట్టిహింసను) యాగపర్యంతము తెలుపునట్లు, “శరణం వ్రజ” ఇత్యాది తావుల యందుండు ధాతువులు న్యాస, నిక్షేప, త్యాగాది శబ్దంబులచే చెప్పఁబడునట్టి

యాత్మ యాగముఁ జెలుపుట యనునది వైదిక మర్యాదకు
న్ను ననుగుణముగా నుండగలదు. అది యెట్లనిన, యాగమ
నఁగా— ఈ దేవతకై యీ హవిస్సనెడి యొక విధమైనట్టి
భావనమే గదా! అట్లే నాయాత్మ యనెడి రుచికరంబగు హవి
స్సు శ్రీమానగు నారాయణునికే యనెడి యొకవిధమైనట్టి జ్ఞా
నమే ప్రకృతమునను, ఆత్మయాగ మనఁబడుచున్నది. ఆత్మని
క్షేపము విషయమున, సర్వ ఫలార్థులకున్ను సర్వ సాధారణ
ముగ కర్తవ్యంబైనది తమరక్షణ విషయమగు భారమును సర్వే
శ్వరునిపై యుంచుటయే యని ముందే చెప్పియున్నాము.

శ్లో॥ హవిస్సమర్పణా దత్ర ప్రయోగ విధిశక్తితః ।
ఆత్మరక్షాభరన్యాసోఽకించనస్యాతిరిచ్యతే ॥

తా॥ యాగమునందు ప్రయోగ విధిశక్తిచే హవిస్సును
సమర్పించుటం కంటెను అకించనుండగు అధికారియొనర్చు
నట్టి ఆత్మరక్షా భరన్యాసమే అనఁగా శరణాగతియే యెక్కువ
దనిపించు కొనుచున్నది.

శ్లో॥ అతః శ్రీరామ మిశ్రాద్యైః భరన్యాస వివక్షయా ।
స్వప్రవృత్తి నివృత్త్యంశః ప్రపత్తిరితి లక్షితః ॥

తా॥ ఇవ్విధమగు భరన్యాసమును బట్టియే శ్రీరామ
మిశ్రాది పూర్వాచార్యులచే స్వప్రవృత్తి నివృత్తి (తనరక్షణ
మునకై తానేద్దియును చేయక యుండుట) ప్రపత్తియని చెప్పఁ
బడినది.

శ్లో॥ అకృతేతు భరన్యాసే రక్షాపేక్షణ మాత్రతః ।
పశ్చాత్స్వయత్న విరతిః నప్రసిద్ధ్యతి లోకవత్ ॥

తా ॥ రక్షింపమని సర్వేశ్వరుని ప్రార్థించుచు తన రక్షణ విషయమగు భారమును సర్వేశ్వరునిపైనుంచక, స్వ ప్రయత్నమును మాత్రము వదలుకొనుట లోకమునందు వలెనే యంత యుపయుక్తము కాదు.

శ్లో॥ ఆకించన్య భరన్యాసోపాయత్వ ప్రార్థనాత్మనాం।
త్రయాణాం సౌహృదం సూక్ష్మం యఃపశ్యతిసపశ్యతి॥

తా॥ ఆకించన్యము, భరన్యాసము, ఉపాయత్వ ప్రార్థన, వీటికిఁ గల సూక్ష్మమగు పరస్పరసంబంధమును తెలిసికొనియున్నట్టివాఁడే వాస్తవముకు తత్త్వము నెఱింగినవాఁడు.

ఈ పైని చెప్పిన ప్రకారము అంగ పంచకముతోఁ గూడియున్నట్టి ఆత్మరక్షాభర న్యాసమే ప్రపత్తినిగుఱించినవియగు శాస్త్రములయం దంతటనున్ను ప్రధానముగా విధింపఁబడినది యని శ్రీవిష్ణుచిత్త, వాదిహంసాంబువాహ వరదాచార్యాది పూర్వాచార్యులు సంగ్రహించి తెలిపియున్నారు.

అయితే, శాస్త్రోక్తతత్త్వము తెలిసినప్పుడే యీ చేతనుండు తాను భగవంతునికి శేషభూతుండనని యనుసంధించుకొనలేదా? “స్వోజ్జీవనేచ్ఛా యదితే స్వసత్తాయాం స్పృహా యది. ఆత్మదాస్యం హరేస్స్వామ్యం స్వభావంచ సదాస్మర” (నీకు ఉజ్జీవింప వలయుననెడి యిచ్ఛయున్నను, నీసత్తను కాపాడుకొను విషయమున స్పృహయున్నను, ఆత్మకుదాస్యమున్ను భగవఁతునికి స్వామిత్వమున్ను స్వభావసిద్ధంబులని యెల్లప్పుడును స్మరించుకొనుము) అని చెప్పినదియును నీవు పరమ పురుషార్థమునున్ను అందులకుగాను ఉపాయమునున్ను కోరి యున్నట్టివాఁడ వైతివేని, నీవు దాసుండవై ఈశ్వరుండు

స్వామిగా నుండుట యనెడి తత్త్వము నెఱింగి ప్రవర్తింపుమని చెప్పినట్లుకాదా? ఇట్లుండ, ఆత్మసమర్పణం బనఁబడునది వేఱొక్కటివిధింపవలసినపని యేమున్నది? యనుచుకొందఱు ఈవిషయమునుగుఱించి యాక్షేపించుచున్నారు. వీరు చేయునట్టి వాదము న్ను "తత్త్వమసి" ఇత్యాది వాక్యజన్యజ్ఞానము మాత్రము చేతనే మోక్షము కలుగఁ గలదని (అద్వైతుల చేయునట్టి) వాదము వలెనే ఆదరింపఁ దగినది కాదు.

శ్లో॥ జితకౌస్తుభ చౌర్యస్య సర్వమాజస్సర్వ పాప్మనాం ।
శిష్టం హ్యాత్మాపహారస్య నిష్కృతి స్స్వభరార్పణం॥

తా॥ కౌస్తుభ మణిని దొంగిలించుటను మించినదియును, అన్ని పాపములకంటెను గొప్పదియు నగు ఆత్మాపహారమునకు ప్రాయశ్చిత్తముగా స్వభరార్పణము అనఁగా ప్రపత్తి నియమింపఁ బడినది.

శ్లో॥ పరశేషత్వ ధీమాత్ర మధికారి విశేషణం ।
పశ్చాదాత్మాపహారస్య నిరోధాయచ కల్పతే ॥

తా॥ సర్వేశ్వరునికి శేషభూతుండ ననెడిజ్ఞానమాత్రమే అధికారి విశేషణము. అది పైపైగా ఆత్మాపహారదోషమును పోగొట్టుటకుగానును ఉపయోగ పడుచున్నది.

శేషత్వాది విశిష్టంబగు ఆత్మ తత్త్వమును శాస్త్రముద్వారా తెలిసికొనినట్టివానికి అధికారి విశేషముతోనును, అంగభేదములతోనును, ఫలసంకల్పములతోనును కూడియున్నట్టి శేషత్వానుసంధానము మూలకంబగు స్వరక్షా భరన్యాసమే కదా అనాద్యపరాధ మూలకమగు భగవన్నిగ్రహమును తొలగించుట కుపాయముగాను విధింపఁబడునట్టి ఆత్మసమర్ప

ణము. తత్త్వజ్ఞానమువలన మోక్షము కలుగుటయును ఒక యుపాయానుష్ఠానము మూలకముగానే యని, "భజస్వ" "మామేకం శరణంవ్రజ" అను విధివాక్య బలమువలన నేర్పడుచున్నది. అట్లే, యది "జ్ఞానాన్మోక్షోపదేశే హి తత్పూర్వోపాసనాదినా। ఉపాసనాది రూపాద్వా జ్ఞానా న్మోక్షో వివక్షితః" (జ్ఞానమువలన మోక్షముకలుగునని చెప్పినతావునను పూర్వమొనర్చినట్టి యుపాసనాదుల మూలమునఁ గాని, ఉపాసనా రూపమగు జ్ఞానమువలనఁగాని మోక్షము కలుగునని చెప్పినట్లెఱుంగునది) అను తావున నున్ను చెప్పఁబడినది. కావున శాస్త్రమువలనఁగలుగునట్టి శేషత్వజ్ఞానముమాత్రమునివృత్తి ధర్మంబులగు న్యాసోపాసనాదు లన్నింటివిషయమునను సర్వసాధారణముగా నుండగలదు. శేషవృత్తిరూపంబగు కైంకర్యమే ముముక్షువుకు పురుషార్థకాష్ఠ యగుటం జేసి, శేషత్వము నెఱింగియుండక మోక్షోపాయము ననుష్ఠించుట ఘటింపదు కదా! ఒకవేళ, శేషత్వ జ్ఞానము లేకయే, మోక్షార్థము విధింపఁబడినట్టి ధర్మంబులను అనుష్ఠించినప్పటికిన్ని, ఈ ధర్మము స్వయముగ శేషత్వ జ్ఞానమునున్ను గలుగఁజేసి, పూర్ణానుష్ఠానముద్వారాగానే కదా మోక్షహేతువు కాఁగలదు. కావున ఈ తావున విధింపఁబడునట్టి సమర్పణ మనునది, శేషత్వజ్ఞానము మాత్రమే కాదు. అయితె యది శేషత్వజ్ఞానాది యుక్తమగు స్వరక్షాభర న్యాసము.

అయితే "వాక్యమాత్రేణ సిద్ధత్వాత్ సిద్ధోపాయ ఇహోచ్యతే। ప్రపత్తిరితివాదోఽపి విధినాత్ర విహన్యతే" (వాక్యమాత్రముచేతనే తెలియవచ్చుటంజేసి, యీతావున సిద్ధోపా

యము చెప్పఁబడుచున్నది. (ప్రపత్తియన్నమాటమాత్రముకూడ విధియందు లేదు) అనఁగా "శరణంవ్రజ" అనునది "ఈ ధర్మమును తెలుసుకొనుము" అన్నంతమాత్రమేయై, ఒక కర్తవ్యంబగు ఉపాయమును విధించునది కానిదై యుండకూడదా? యంటివేని, ఈ మాట శబ్దస్వారస్యమునకు విరుద్ధము. ఇంతియె కాక, "ప్రపత్తింతాంప్రయుంజీత" అని అంగములతోఁగూడ స్పష్టముగ ప్రపత్తిని విధించునట్టి వాక్యములతోను విరోధించును. ఈశ్వరుండు మోక్షోపాయంబని తెలుపుటమాత్రమే యీ తావున వివక్షితంబై, అందువలన మోక్షాధికారికి వేఱొక్క కర్తవ్యంబెద్దియును చెప్పియుండక పోయినట్లాయిన, యీశ్లోకము ఈ తావున ప్రస్తుతమగు భక్తియోగమునకుఁ కావలసినట్టి తత్త్వోపదేశముఁ దెలుపు నట్టిది కావచ్చును,

తత్త్వజ్ఞానము గలవానికి తనను రక్షించుకొనుటకై తాను ప్రయత్నింపకుండుటయే ప్రపత్తియై, సర్వధర్మములను స్వరూపతః త్యజించుట మాత్రమే సాధ్యోపాయముగాను ఈ తావున విధింపఁబడుచున్నదని కొందఱువాదించుచున్నారు. సాధ్యముగాను విధింపఁబడునట్టి స్వధర్మత్యాగము, నివృత్తి రూపమేయైనను, అదియును తనరక్షణమునకుగాను తానొనర్చునట్టిప్రయత్నంబగుటంజేసి, ఈసందర్భమున, స్వవచన విరోధమును, సాంగప్రపత్తిని విధించునట్టి వాక్యముతోవిరోధమున్ను సంభవింపగలవు.

ప్రపత్తి మోక్షసాధనమని కాని, సిద్ధసాధనమునకు (భగవంతునికి) సహాయకంబని కాని యంగీకరించు పక్షమున, సిద్ధోపాయంబగు ఈశ్వరునియొక్క ఏకత్వము, సిద్ధత్వము, పరమ

చేతనత్వము, పరమ కారుణికత్వము, సర్వశక్తిత్వము, నిరపేక్షత్వము మొదలుగాఁగలస్వభావ విశేషంబులు విరోధించును. కావున నిర్విధములగు ప్రసంగములు శ్రుతి,స్మృతివిరోధము, వ్యాప్తి శూన్యత్వము మొదలగు దోషముల మూలముగ తర్కాభాసంబు లనిపించు కొనుచున్నవి. వీటిని మంచితర్కంబులనుగాఁ గొనుపక్షమున,ఉపాసనమున కుండునవిగాను ఒప్పుకొనఁ బడినట్టి సాధన బావాదుల విషయముననున్ను ఈ ప్రసంగములు రాఁగలవు.

వారొకవేళ ఉపాసనము సాధనమే కాదనియందురేమో? అట్లనినచో, వారు "సర్వధర్మా పరిత్యజ్య" అను తావున ఉపాసనమునున్ను ధర్మశబ్దార్థమునుగాఁ గొని వ్యాఖ్యానము చేసియున్నందున, తాము చెప్పిన దానితోనే విరోధించును.

గర్వము నణచుటకై తలపై భారమును పెట్టునట్లుకర్మజ్ఞానభక్తుల నుపదేశించుటచేనర్జునునిబుద్ధికి ధర్మంబులని తోచిన వాటిని "సర్వధర్మా" అను తావున అనువదించినాడని యెదవా? అట్లంటివేని,

శ్లో॥ ఇజ్యాచారదమాహింసా దాన స్వాధ్యాయకర్మణాం।
అయంతు పరమోధర్మో యద్యోగేనాత్మదర్శనం ॥

తా॥ యజనము, అచారము, ఇంద్రియ నిగ్రహము, అహింస, దానము, వేదాధ్యయనము, వీటి యన్నింటికంటెను, యోగమార్గముగుండ ఆత్మ సాక్షాత్కారమును లభించుట గొప్ప ధర్మము.

శ్లో॥ సర్వేషామేవ ధర్మాణా ముత్తమో వైష్ణవోవిధిః ।
నవిష్ణ్వారాధనాత్పుణ్యం విద్యతే కర్మ వైదికం॥

తా॥ ధర్మంబు లన్నింటిలోను విష్ణువుతో సంబంధించి నట్టి ధర్మము శ్రేష్ఠమైనది. విష్ణువు నారాధించుట కంటెను న్ను వైదికంబగు పుణ్యకార్యము వేఱొక్కటి లేదు.

ఈ పైశ్లోకముల యందుఁ జెప్పియున్న ప్రకారము పరమ ధర్మంబులుగాను ప్రసిద్ధంబులయినట్టి నివృత్తి ధర్మం బులను ధర్మంబులే కావను పక్షమున, అటుపైని వేఱు చెప్ప నక్కఱ లేకుండ, ప్రవృత్తి ధర్మంబులు సయితము ధర్మంబులే కానివి యగుటం జేసి, సర్వశాస్త్రములును ప్రమాణంబులు కాక పోవును.అందువలన మతాంతరులును,వేదబాహ్యులును, కుదృష్టులును ఈ మొదలగువారు చెప్పినట్లు మనమున్ను చెప్పు నట్టివార మగుదుము.

అయినను, ఉపాసనాదుల వలెనే శరణావరణమున్ను ధర్మ శబ్దవాచ్యం బగుటంజేసి, యీ తావున అనఁగా "సర్వ ధర్మాన్" అను తావున సర్వశబ్దార్థమునకు కొరత లేకుండుట కుగాను, ఇదియును ఒకవిధమైనట్టి సాధనం బగుటంజేసి త్యా జ్యంబైనది కాదా?కావున ప్రపత్తికిన్ని సాధనత్వమునుకాని,సిద్ధ సాధన సహాయకత్వమునుగాని యంగీకరించుపక్షమున ఈపైని చెప్పినదానికి విరోధము కాదా? యంటివేని, ఈ తావున సాక్షాత్సాధనత్వబుద్ధిని త్యజింప వలసినదియని చెప్పునప్పుడు, అది భక్తియోగాదుల విషయమునను్ను సమానము. ప్రసా దనత్వ రూపమును బట్టియును దీనిని ధర్మముగాఁ గొనకూడ దంటవేని, సర్వశబ్దార్థమునకు కొరత లేకుండుటకుగాను, "కృ ష్ణం ధర్మం సనాతనం" ఇత్యాది తావులఁ జెప్పి యున్నట్లు

ధర్మమని చెప్పఁబడినట్టి సిద్ధోపాయము విషయమునను న్న సాధనత్వ బుద్ధిని విడనాడ వలయునని ప్రసక్తించును.

అయితే యీ వాక్యమునందు ప్రతిపాదింపఁ బడునట్టి ధర్మము తప్ప, తక్కిన ధర్మంబులు కావా విడనాడవలసి నవి? యంటివేని, అట్లగుపక్షమున, నది యీతావున విధింపఁ బడునట్టి శరణాగతి విషయమునను సమానమే,

ఉపాసనాదుల వలెనే, తనకు ఉత్పాదముకముగాను కాని, వర్ధకము గాను కాని, సహాయకము గాను కాని, మూలకముగాను కాని. వేఱొక్కదానియపేక్ష లేకుండునట్లు, నిత్యమై యున్నను, వృద్ధిక్షయ రహితంబై సర్వదా పరిపూర్ణంబులగు స్వాభావిక కారుణ్యాదులఁ గలదియై, సంకల్పము గలిగినప్పుడు వేఱొక్కదాని సహాయ మక్కఱ లేకుండ కార్యము సిద్ధించునట్లు, సత్యసంకల్పము కలదియై యుండునట్టి సిద్ధోపాయముకు భక్తిప్రపత్తులు యెవ్విధముగ ఉపకారకంబు లంటివేని, ఇవి యనాదియగు అపచార పరంపర మూలముగా నుత్పన్నంబైనదియై, సంసారహేతువగు భగవన్నిగ్రహమును శమింపఁ జేసి, యందు మూలముగ ఉపకారకము లగుచున్నవి, ఇవి ఫలాంతరంబుల కుపాయంబు లగునప్పుడు, జ్యోతిష్టోమాదుల వలెనే వాటివాటి కనుగుణంబులగు ప్రీతి విశేషముల గలుగఁ జేసి,యందు మూలముగ ఉపకారకములు కాఁగలవు. సాధ్యోపాయంబు లనెడి వ్యాజమాత్రముచే నిగ్రహము శాంతించినట్టి సిద్ధోపాయము (భగవంతుండు) ముముక్షువులకు స్వనిగ్రహము మూలముగఁ గలిగినట్టి జ్ఞానసంకోచాదులను పోఁగొట్టి, పరిపూర్ణ కైంకర్య పర్యంతమగు ఫలము నొసంగి, యీ

నున్ను నియతముగ శాస్త్రములమూలముగాఁ దెలిసికొనునట్లు, ప్రస్తుతముననను, లోకమునందు ప్రపత్తినిన్ని అందువలనఁ గలుగునట్టి ఫలంబులనున్ను మనము చూచుచునేయున్నను, సదాచార్యోపదేశముచే పొందవలసినట్టి మంత్రములతోఁగూడియున్నట్టి ప్రపత్తికిని అందువలని గలుగఁగల ఫలంబులకున్ను సాధ్యసాధకభావము (ఒకటి సాధనమగుటయును, వేఱొక్కటి దాని ఫలంబగుటయును) శాస్త్రముఁగొనియే తెలిసికొనవలసియున్నందున, ఆయాఫలంబులకుగాను ఆయాసేవలను విధించియున్న చందంబున, ప్రపత్తినిన్ని విధించుచున్నది. అట్లుకాకున్న, రాజసేవనువలెనే భగవత్సేవనున్ను శాస్త్రమునందు విధించి యుండకపోవలసివచ్చును. అటుపైని ప్రపత్తికిగాను సదాచార్యోపదేశ పూర్వకములగు మంత్ర స్వీకారాదులున్ను అనావశ్యకములని ప్రసక్తించును. మరియును మంత్రార్థ్యనహూఙనికిన్ని, శరణ్యుండగు భగవంతుని విషయము నను వాఁడొసంగునట్టి ఫలములవిషయముననున్ను, హెచ్చుతక్కువలుకలుగకుండకర్తవ్యముల ననుష్ఠించుటను గుఱించినట్టి యధ్యవసాయమునుగుఱించి సరియైనట్టి యూహాయే యుండజాలదు. కావున ఆయాయంగయుక్తములగు సేవా విశేషంబులనువలెనే ఆయా యంగయుక్తంబగు భరసమర్పణమునున్ను ప్రకృతమున విధించి యుండవలయుననుటకు బాధకంబెద్దియును లేదు.

ఇవ్విధముగ అధికారానుగుణముగ శాస్త్రమునందు విధించియున్నట్టి వాటిలోనును, ఉపాసనాదులు స్వరూపవిరుద్ధంబులని కొందఱు వాదించుదురు. అట్టివారును ప్రపత్తిని స్తుతించుటకుగాను ఇవ్విధమున నతివాదముఁ జేయునట్టి వారుగా

నెన్నఁదగినవారు కాఁగలరు. ఇంతియే. అదియెట్లనిన, నిత్యమగు ఆత్మస్వరూపమును నశింపఁజేయునవి యగుటంజేసి, యివి స్వరూప విరుద్ధంబులని చెప్పఁదగదు. ఏలయనిన ప్రవృత్త్యనుష్ఠానమునందును, కైంకర్యమునందువలెనే భక్త్యాదులయందును “కర్తా శాస్త్రార్థవత్త్వాత్ పరాత్తు తచ్ఛ్రుతేః” (ఆత్మ కర్త కనుకనే శాస్త్రము సార్థకమగుచున్నది. ఈతనికిఁగల కర్తృత్వము భగవత్సంకల్పమునుబట్టి యుండునది) అన్నట్లు ఈతనికి భగవదధీనంబగు కర్తృత్వముండియున్నది. ఇట్లుండ, ఆత్మస్వరూప మెట్టివ్యాపారమున్ను కలది కాదని చెప్పినట్లయిన, సత్వలక్షణంబగు ఆత్మ, క్రియాకారిత్వము లేకపోవుటంజేసి యాత్మ తుచ్ఛంబని ప్రసక్తించును, ఆత్మకు జ్ఞాన, చికీర్షా, ప్రయత్నాశ్రయత్వరూపమగు కర్తృత్వమును లేకుండచేసి, ఆత్మకుసన్నిధిమాత్రమే వ్యాపారంబని చెప్పినట్లయిన, ఈతనికి భోక్తృత్వాదులున్ను లేకుండపోయి, సంసారబంధమున్ను మిథ్యయేయై, ఇఁక మోక్షోపాయము ననుష్ఠించుటయును అనావశ్యకంబని ప్రసక్తించును. కావున సాంఖ్యులు మొదలగువారుచెప్పినట్లు, స్వరూపమునందు కర్తృత్వము లేకపోవుటంజేసి, ఉపాసనాదులు స్వరూపవిరుద్ధంబులని చెప్పఁదగదు. “అచేష్టమానమాసీనం శ్రీఃకంచిదుపతిష్ఠతి । కర్మీకర్మానుసృత్యాన్యోనపాశ్యమధిగచ్ఛతి” (నిర్వ్యాపారిగా నుండువానికి సంపత్తు లభింపదు. ప్రతివాడును తానొనర్చినట్టి కర్మానుగుణమగు ఫలమును అనుభవించుచున్నాఁడు) అని చెప్పినదియును శాస్త్రవిహితంబులగు ఉపాయంబులు నిరర్థకంబులని తెలుపుటకై

కాదు. అయితే యీతావున పూర్వమొనర్చియున్నట్టి కర్మం
బుల ఫలంబులు చెప్పఁబడినవి, ఇంతియే.

మోక్షముకుప్రతికూలంబులగు రాగాదుల నిమిత్తమున అను
ష్ఠింపఁబడనట్టి కామ్యనిషిద్ధ కర్మంబులవలెనే బాధకంబులు కాక
పోవుటం జేసియును ఉపాసనాదులకు శాస్త్రముద్వారా రాగానే అన
ర్థమునుగలుగఁజేయుటయనెడి స్వరూపవిరోధముకలదనియును
చెప్పఁదగదు. కావున ఉపాసనంబులు ఆత్మస్వరూపమునకు
నాశమును కలుగఁజేయునవి కాని, యేదైన నొకవిధమైనట్టి
యనర్థమును గలుగఁజేయునట్టివి కాని కానందున, నవిస్వరూప
విరుద్ధము లెంతమాత్రము కాజాలవు.

అయినను, ఆత్మయనునది దేహాదులకంటెను విలక్షణం
బైనది యగుటం జేసి, దానికి స్వరూపసిద్ధముగ వర్ణాశ్రమాదిభే
దంబులెవ్వియును లేవని యెఱింగినట్టివానికి "నేను బ్రాహ్మ
ణుండను నేను క్షత్రియుండను" ఇవ్విధములగు అభిమానాదుల
మూలముగ కర్తవ్యంబులగు వర్ణాశ్రమాది ధర్మంబులును,
వాటితో సంబంధించినవియగు ఉపాయాంతరంబులును అను
ష్ఠేయంబులు కానందున, నిట్లువర్ణాశ్రమాదులను నిమిత్తీకరిం
చుకొని యుండనట్టిధర్మంబులు స్వరూపవిరుద్ధంబుల న్నట్లయి
న, బాధకంబెద్ది? యని యడిగితివేని, ఇదియును అనుపపన్నము.
అదియెట్లనిన, స్వరూపమునకు బ్రాహ్మణత్వాదులు లేవని తెలి
సికొని యున్నట్టివాఁడేయైనను, కర్మవిశేషవశము మూలముగ
బ్రాహ్మణత్వాది విశిష్టంబగు శరీరముతో సంబంధించియుం
డువాఁడగుటం జేసి, అట్టిశరీరసంబంధమూలముగ ఘటస్థించు
నట్టిక్షుత్పిపాసాదులకు పరిహారముఁ జేయునట్టివిధమున, ఆశ్వర

మును విడుచువరకును ఆయావర్ణాశ్రమాదులనిమిత్తమున త
శక్తికిఅనుకూలముగ అనిష్టనివృత్తి ఇష్టప్రాప్తులకుగాను శాస్త్ర
ములచే విధింపఁబడినట్టి ధర్మంబులను విడనాడకూడదు. కా
వున ఇట్టి ధర్మములను దేహాత్మవివేకమూలకస్వరూప
విరుద్ధంబులనుట్టి వాటినిగాఁగొని, యవి త్యాజ్యంబులని
చెప్పకూడదు. దేహాత్మవివేకమున్నట్టి వానికే పారలౌకికం
బగు భోగమును గలుగఁజేయుటకు సాధనంబగు ధర్మము నను
ష్ఠించుట కధికారముండుటంజేసి, ఈధర్మంబుల ననుష్ఠించుటకు
గాను స్వరూపవిషయమున బ్రాహ్మణత్వాదిరూపమగు భ్రాంతి
జ్ఞానము అధికారముకాదు, బ్రాహ్మణత్వాది విశిష్టంబగు
శరీరముతోఁగల సంబంధమే యధికారము. కావున స్వధ
ర్మానుష్ఠానమునకున్ను ఉపయుక్తంబగు ప్రకృత్యాత్మవివేకము
మూలముగ ఉపాసనాదుల కెద్దియును విరోధమున్నట్లు
గానఁబడదు. ఉపాసనాదులు అహంకారయుక్తంబులనెడి
విషయమును శాస్త్రము వొప్పుకొనకపోయినను, ఆరోపించి
యున్నారింతియే.

కర్మము మూలముగ సంప్రాప్తించినట్టివియగు కరణ
కళేబరంబులనెడి యుపాధులంగొని యనుష్ఠింపఁబడునవియగు
టంజేసి, కర్మయోగాదులు నిరుపాధికంబగు స్వరూపమునకు
విరుద్ధంబులని కొందరు వాదించుదురు. అట్లయితే, స్వరూపజ్ఞా
నము, ద్వయార్థశ్రవణము ఈ మొదలగునవి మనస్సు మొద
లుగాఁగల యింద్రియముల సహాయముఁగొనియే యేర్పఁ
బడునది యగుటంజేసి, వారు కాన్పించిన దోషము వీటివిష
యమునను సమానముగానే ప్రసక్తింపఁగలదు.

అట్లయినను, శేషభూతుండగుటంజేసి తనను తాను రక్షించుకొనుటకు తగినవాఁడుకాక బొత్తుగ పరతంత్రుండగుటంజేసి, తనను తాను రక్షించుకొనుటకు అసమర్థుండైయున్నట్టి ఈజీవునికి తన రక్షణమునకై కర్తవ్యంబని యొకయుపాయమును విధించుటయును, అదియీతనిచే సాధింపవలసిలదియైనందున సాధ్యోపాయంబను పేరుచే ప్రసిద్ధంబైనదియని చెప్పుటయును యుపపన్నమా? అటుపైని, భక్తియోగాదులు శేషత్వము కననుకూలంబులయినవికాకపోవుటంజేసి, స్వరూపముకు అవిష్టముఁగలుగఁజేయునట్టివి యనియును, అత్యంతపారతంత్ర్యముకు విరుద్ధంబులగుటంజేసి, బొత్తుగ దగ్గిరకు చేరకూడనివనియును చెప్పవద్దా? అనియడిగితివేని, అట్లయిన అందఱికిన్ని యెప్పుడో మోక్షమువచ్చియేయుండవలసివచ్చుననియింతకుముందొకతావున మేము చెప్పియున్నట్టి సమాధానమే యిందులకును సమాధానమగుటంజేసి ఈ యాక్షేపమున్ను పరిహరింపఁబడుచున్నది. ఈతం డొనర్చినదానిఁ దేనినయినను నిమిత్తమునుగాఁ గొనకుండ, సర్వేశ్వరుం డీతనిని ముక్తునిగాఁ జేయుపక్షమున, నీతం డెప్పుడో ముక్తుండై యుండవలసివచ్చును. మరియు, సర్వేశ్వరుండు తన స్వాతంత్ర్యమువలన తాను తలంచినప్పుడు ముక్తునిగాఁ చేయునట్లయిన, వానికిన్ని పక్షపాతాది రూపములగు దోషములు కలవని ప్రసక్తించును. అట్లగునేని మోక్షోపాయమును విధించునట్టి శాస్త్రములన్నియును నిరర్థకంబులున్ను కాఁగలవు. కావున ప్రాప్తవిషయమును (సర్వేశ్వరుని) ఆశ్రయించుటలో నౌచిత్యమున్ను, సొంతగాఁడు తన సొత్తును కాపాడుకొనునట్లు, వాఁడు ఈచేతనుని రక్షించుకొనుటలో

నౌచిత్యమున్ను ఇవి శేషత్వమువలన సిద్ధింపఁగలవు, వాఁడొసంగి నట్టిస్వాతంత్ర్యమునువహించి వానికిష్టంబులగు ఉపాయంబుల ననుష్ఠించుటయును,ఫలప్రాప్తికై వాని దయకు నిరీక్షించుచుం డవలసియుండుటయును నివి యత్యంత పారతంత్ర్యమువలన సిద్ధింపఁగలవు. ఈ శేషత్వ పారతంత్ర్యములు రెండును ఫల దశయందు వాని కభిమతంబగు కైంకర్యమును వాఁడు యేర్పఱచినప్రకారము ఒనర్చుట కుపయుక్తంబులు కాఁగలవు. వీటినిబట్టి తన రక్షణమునకు గాను తాను ప్రయత్నింపఁగూడదని చెప్పునట్టివారి మతమున, తాము శాస్త్రప్రకారము భగవత్ప్రీత్యాదిరూపమగు ఫలమును కోరి అనుష్ఠించునట్టి కైంకర్యమునందును,సాధింపవలసినదిగాను విధింపఁబడునట్టి ప్రపత్తియందున్ను, వారుచెప్పునట్టిస్వరూపవిరోధముండుటఁ జేసివారికిన్ని అధికారము లేకపోవును. వాక్యజన్యమగు సంబంధజ్ఞానాది మాత్రముకంటెనున్ను, వేఱుగ "శరణంవ్రజ" అని విధింపఁబడుటంజేసి సాధింపవలసినట్టిదిగా నుండుట ప్రపత్తియొక్క స్వరూపంబని ముందేచెప్పియున్నాము. కావున శేషభూతుండై పరతంత్రుండైనట్టి ఈతనికిఅధికారానుగుణముగ స్వరక్షణముకై స్వయముగ ప్రయత్నించుటలో బాధకం బెద్దియును లేదు.

అయినను, తాను అనన్యార్హ శేషభూతుండని యెఱింగి పరమైకాంతిగానుండునట్టి ఈతనికి దేవతాంతరద్వారకములగు వర్ణాశ్రమధర్మంబులును, వాటినిబట్టి యుండునట్టి భక్తి యోగాదులును ఈతని యైకాంత్యమునకు విరుద్ధంబులుకావా? శుద్ధయాజకులకు కాదా పరమైకాంతిత్వము సరిపడునంటివేని, ఈ యాక్షేపము శ్రీభాష్యాదులయందు నిర్ణయించియున్నట్టి

యర్థంబును తెలిసికొనియుండక పోవుటచేఁ జేసినట్టిది కాఁగలదు.

అదియెట్లనిన, ప్రతర్దనాద్యుపాసనలయందు పరమాత్మ ఇంద్రాది శరీరుండుగాను ముముక్షువుచే ఉపాసింపవలసినట్టి వాఁడని తెలిపియున్నారు. ఉపాసనాంగములగు వర్ణాశ్రమధర్మములయందును ఆయాదేవతలను శరీరముగాఁ గొనియున్నట్టి పరమాత్మయే ఆరాధింపవలసినట్టివాఁడని నిర్ణయించియున్నారు. కావున స్వతంత్రముగానే కొన్ని దేవతలను ఆశ్రయించి నఁగాని, ప్రయోజనాంతరములయందు కోరికవలన తనయొక్క నిత్యనైమిత్తికములకు బాహ్యంబగు దేవతాంతరసంబంధమును సంప్రాప్తించినఁగాని పరమైకాంతిత్వముతో విరోధముఁగలుగఁగలదు ప్రయోజనాంతరములకై యపేక్షింపక, పరమాత్మయొక్క విశేషణములనుగాను దేవతలఁగొని ఆగ్న్యాద్యాది విశేషణములను విశేష్యపర్యంతము అనుసంధించుకొని గాని, "సాక్షాదప్యవిరోధం జైమినిః" అను బ్రహ్మసూత్రమునఁ జెప్పియున్నప్రకారము అగ్నీంద్రాది శబ్దములను సాక్షాత్తుగ భగవంతుని తెలుపునట్టి వాటినిగాను అనుసంధించుకొని గాని స్వధర్మంబుల ననుష్ఠించుకొనినట్లయిన, విధిబలమువలన విరోధం బెద్దియును లేదు.

* అయినను, అభిచారవిద్య మొదలగువాటిని విధించినట్టి

---

* అభిచారవిద్యయనఁగా—విరోధులను హింసించుటకుగాను అథర్వణవేదమునఁ జెప్పఁబడినట్టి మంత్రతంత్రములచే నొనర్పఁబడునట్టి శ్యేనయాగము మొదలగునది. ఇది మారణమనియు, మోహనమనియు, ఉచ్చాటనమనియు, విద్వేషణమనియు, స్తంభనమనియు, వశీకరణమనియును ఆఱువిధములుగ నది.

విధమున శాస్త్రము విరోచనాదుల విషయమున ప్రత్యేకముగ ఒకవిధమైనట్టి యధికారికిగాను ఉపాసనాదులను విధించియున్నది. యింతియే కాదా? ముముక్షువులకు ప్రాప్యప్రాపకములు రెండును ఒక్కటియే వస్తువు ( సర్వేశ్వరుండు ) అగుటంజేసి, ప్రాప్యానుగుణంబగు ఉపాయము సర్వేశ్వరుం డొక్కండే. కావుననే కాదా ? "అథపాతక భీతస్త్వం సర్వభావేన భారత! విముక్తాన్యసమారంభో నారాయణపరో భవ" (ఓయర్జునా! నీవు అన్నివిధములను పాపములనుండి భయపడి యున్నావు. అట్లయిన, వేఱొక్కదాని నెద్దియు నాచరింపక, నారాయణుని శరణుజొచ్చుమా!) అను తావున ధర్మదేవత తన పుత్రునికి ఉపాసనాదులు ప్రాప్యవిరోధులని తలంచి, వాటిని నిందించి యున్నదంటివేని, అదియును ఎంతమాత్రము సంభవము కాదు. అదియెట్లనిన, అభిచారాదివిద్యలు వాటిచేనొసంగఁబడునట్టి ఫలవిశేషములఁబట్టియే కదా అనర్థాపాదకము లనిపించుకొనుచున్నవి. ఉపాసనాదుల విషయమున నన్ననో, వీటిచేనొసంగఁబడునట్టిఫలము మోక్ష మగుటంజేసి, యందుమూలముగ ఇవి యనర్థాపాదకము లెంతమాత్రము కాఁజాలవు.

ఒక్కండే యధికారి విషయమున, ఒక్కటియే ఫలమునకుగాను గురువైనట్టి (అసాధ్యమైనట్టి) యొకదానిని ఉపాయముగాఁ జూపించి, (వానికే అందులకే)లఘువైనట్టి యొకదాని విషయమున రుచి పుట్టించుట యనునది యుద్దేశమునకు వ్యతిరిక్తము. అంగమైనది అంగి యొసంగునట్టి ఫలము నొసంగఁగలదని చెప్పినట్లయ్యు, అట్లయిన, అప్పుడది స్తుతించుటకుగాను చెప్పినట్టిది కాఁగలదు.

ప్రాప్యము కిది యనుగుణంబైనది యను విషయము శాస్త్రమునుండియే తెలిసికొనవలసినది యగుటంజేసి, యుక్తులఁగొని వాటిమూలముగ శాస్త్రమునకు విరుద్ధముగాఁ జెప్పకూడదు. శాస్త్రసిద్ధంబు లయినట్టివాటిలో, నొక్కదానిని విరుద్ధతర్కములఁగొని వాటిమూలముగ బాధించినట్లయిన, అదేవిధముగ సమస్తశాస్త్రములును ప్రపత్తిశాస్త్రము సయితము ప్రమాణంబులు కాకపోవలసివచ్చును. "అధపాతకభీతస్త్వం" అనుతావునను "పాతక" శబ్దముచే ఉపాసనాదులు నిందింపఁబడుచున్నవని చెప్పుటకున్ను ప్రమాణం బెద్దియును లేదు. కావున ముముక్షువులకుగాను విధింపఁబడినవి యగుటంజేసి భక్తిప్రపత్తులు రెండును అధికారానుగుణముగ అనుష్ఠింపవలసినవి.

శాస్త్రముచే విధింపఁబడినవియే యైనను, ఆచార్యరుచిపరిగృహీతంబులు కాకపోవుటంజేసి, అతిథి సత్కారాదులయందు విధింపఁబడినట్టి గోహింసాదులవలెనే, యుపాసనాదులు శిష్టులచే నంగీకరింపఁబడినవి కానందున అనాదరణీయములు కాదా? అనుటయును నిరూపకము కాదు. ఏలయన, ఆచార్యులందఱును అంగీకరింపని పక్షమునఁ గదా! "అస్వర్గ్యం లోకవిద్విష్టం ధర్మమప్యాచరేన్నతు" (స్వర్గాపాదకముకానిదై లోకవిరుద్ధంబైనది ధర్మమేయైనను దానిని అనుష్ఠింపఁగూడదు( అన్నట్లు నిషేధింపవచ్చును. ప్రకృతమునన్నో, "తస్మైనమో మునివరాయ పరాశరాయ" అన్నట్లు పూజ్యులగు పరాశరాది పూర్వాచార్యులు అనుష్ఠించియున్నందున, శిష్టులందఱును బహిష్కరించినారని చెప్పకూడదు.

అయితే యివి యుగాంతరములయందు అనుష్ఠేయంబులే యైనను, కలియుగమునందు శాస్త్రోక్తములగు ఉపాసనాదులకు అధికారులు దుర్లభులగుటంజేసి, యవి యీకాలమునకుతగినట్టి వి కావు. అందుచేతనే కాదా? “కలౌసంకీర్త్యకేశవం” (కలియుగమునందు భగవన్నామ సంకీర్తనముఁ జేయునది ) అనియు, “కలేర్దోషనిధేః రాజన్నస్తి హ్యేకోమహాన్గుణః। కీర్తనాదేవ కృష్ణస్యముక్తబంధఃపరంవ్రజేత్” (కలియుగము దోషాకరంబైనను, దానియందు మంచిగుణంబొక్కటి కలదు. భగవన్నామసంకీర్తనముఁ జేయుటచే మానవుండు సంసారబంధవిముక్తుండై పరాత్పరుని బొందుచున్నాడు) అని చెప్పియున్నది యని వాదింపఁగూడదు. ఏలయన, “కలౌకృతయుగంతస్య కలిస్తస్య కృతేయుగే। యస్యచేతసిగోవిందో హృదయే యస్యనాచ్యుతః”(ఎవ్వని మనస్సునందు గోవిందుండున్నాడో, వానికి కలియుగమునందు కృతయుగము కలదు. ఎవ్వని హృదయమునందు అచ్యుతుండు లేడో, వానికి కృతయుగమునందు కలియుగము కద్దు) అన్నట్లు ఈకాలమునందును ఉపాసనాదుల కధికారులు ఫలాపేక్షలేకుండ యోగనిష్ఠులగు పూర్వాచార్యులవంటివారు యుండియుండవచ్చును కదా! అట్లుకాకున్న, భగవన్నామ సంకీర్తనముకంటెను వేఱయినదియగు ప్రపత్తికిన్ని, “కింనుతస్యచమంత్రస్యకర్మణఃకమలాసన। నలభ్యతేఽధికారీవా శ్రోతుకామోపివానరః” (ఓకమలాసనుండా! ఆమంత్రమునకుగాని, ఆకర్తవ్యంబునకుగాని అధికారియైనట్టివాఁడు లేడు సరియే కదా! చెప్పితే వినేవాఁడున్ను లేడు) ఇత్యాదివాక్యములఁ జెప్పియున్నట్లు, మహా

విశ్వాసాదియుక్తులగు అధికారులుండుట దుర్లభంబగుటంజేసి దానికిన్ని ఈగతియే సంభవింపఁ గలదు.

అటుపైని, ఉపాసనాదులకు వేఱొక విరోధం బెద్దియును లేక పోవుటంజేసి, శాస్త్రప్రకారము, రోగిష్ఠులకు చన్నీటిస్నానము అనుకూలముకానట్లు, ఇవి "అకించనోనన్యగతిః" అన్నట్టిఅధి కారికి తనయధికారమునకు విరుద్ధంబులని మాత్రము చెప్పన చ్చును. ఇట్టి యధికారవిరోధము నెఱుంగకుండ, ఉపాసనా దులయందుఁ బ్రవర్తించునట్టి వానిని గుఱించి "నరస్యబుద్ధి దౌర్బల్యా దుపాయాంతరమిష్యతే" (మనుష్యుని బుద్ధి దుర్బల మగుటంజేసి యుపాయాంతర మనుకూలపడును) అనిచెప్పఁ బడినది. కావున ఈ యుపాసనాదులును తక్కినయధికారులకు వారివారి యధికారములకుఁ దగినట్లు అనుకూలంబులే.

ఇట్టి యుపాసనంబుల ననుష్ఠించుటకు సామర్థ్యము లేక పోవుటంజేసి కాని, ఇట్టి యుపాసనమువలన ఫలము (మోక్ష ము) గలుగుటలో నాలస్యమును సహించి యుండజాలమిచేఁ గాని, ఈ ప్రపత్తిని స్వతంత్రోపాయమునుగాఁ గొని దీని నవలంబించినట్టి వానిని గుఱించి,యజ్ఞంబుల నొనర్చినట్టి వాఁ డస్టియు, కృతకృత్యుండనియు, నూఱుక్రతువుల ననుష్ఠించినట్టి వాఁడనియు, ఈతఁడు శరీరావసానమువరకు నొనర్చునట్టి కా ర్యములన్నియును యజమానుండు దీక్షఁగొనినది మొదలు కొని అవభృథస్నానమువరకు నొనర్చునట్టి క్రియాకలాపంబుల వంటివనియును వివిధముగ స్తుతించియు, క్రత్వంతరము నను ష్ఠించినట్టివానికి అటుపైని రొనర్పవలసిననిత్యనైమిత్తికకర్మం బులవలెనే ఈతనికిన్ని స్వతంత్ర శాస్త్ర విధివలన వర్ణాశ్రమ

ధర్మములు జరుపఁబడుచునే యున్నను, ఈతం డొనర్చియున్న
ట్టి ఆత్మయాగ (ప్రవృత్తి) ఫలమునుబట్టి చూస్తే తక్కినదానిని
దేనినిన్ని ఈతండనుష్ఠింపఁ బనిలేదని మహర్షులును, శ్రీపాంచ
రాత్రాద్యాగమములును, వేదములును ఘోషించుచున్నవి.

కావున, "తపస్విభ్యోధికో యోగీ జ్ఞానిభ్యోపిమతోధికః
కర్మిభ్యశ్చాధికో యోగీ తస్మాద్యోగీభవార్జున" (ఓయర్జునా!
యోగియైనవాఁడు తపోవంతులకంటెనున్ను, జ్ఞానులకంటెను
న్ను, కర్మిష్ఠులకంటెనున్ను గొప్పవాఁడు. కావున నీవున్ను
యోగివగుము) ఇత్యాదిత్రావులఁ జెప్పియున్నట్లు ప్రవృత్తిధర్మం
బులకంటెనున్ను నివృత్తిధర్మంబులు శ్రేష్ఠంబులగు చందంబు
నను, వాటిలోనున్ను, ఆత్మవిషయమగు యోగము శ్రేష్ఠంబైనదగు
చందంబునను, అట్టియాత్మ విషయమగు యోగముకంటెనున్ను
"యోగినామపిసర్వేషాం" అను శ్లోకప్రకారము భగవంతునివిష
యమగు యోగము శ్రేష్ఠంబైనదగుచందంబునను, పరమాత్మవి
షయములగువిద్యావిశేషంబులన్నింటిలోనున్ను న్యాస, నిక్షేపాది
శబ్దంబులచే పేర్కొనఁబడునట్టి విద్యయే(ప్రపత్తియే)సుకరంబగు
టం జేసియు, సకృత్తుగ చేయవలసిది యగుటం జేసియు ను, శీఘ్ర
ముగ ఫలమునొసంగునది యగుటంజేసియును ఈ మొదలగు హే
తువులనుబట్టి శ్రేష్ఠతమంబైనది. న్యాసవిద్యయందు స్పష్టము
గాఁ జెప్పఁబడినట్టి యీయర్థమును,

శ్లో॥ తేషాంతు తపసాంన్యాస మతిరిక్తం తపశ్శ్రుతం।

తా॥ అట్టి తపస్సు లన్నింటికంటెనున్ను న్యాసమును (ప్రప
త్తిని) అధికమైనట్టి తపస్సునుగాను శాస్త్రములుచెప్పుచున్నవి.

శ్లో॥ సత్కర్మనిరతాశ్శుద్ధా స్సాంఖ్యయోగవిద స్తథా।
నార్హన్తి శరణస్థస్య కలాంకోటితమీమపి॥

తా॥ కర్మయోగ నిష్ఠులును, జ్ఞానయోగనిష్ఠులును, ప్రపత్తి నిష్ఠునికిఁగల యోగ్యతలో ఒక కోటివంతునైనను గలిగియుండరు.

అని యివ్విధముగ శ్రీపాంచరాత్ర సంహితయందు నిర్ణయింపఁబడినది. స్నానాదుల నొనర్చుటకు శక్తిలేనివానికి "మానసం విష్ణుచింతనం" అన్నట్లు, భగవచ్చింతనను స్నానముగా విధించినట్లయిన, అది స్నానాంతరము లొనర్పఁగలపారిశుద్ధ్యమునున్ను గలుగఁజేసి, పాపాంతరములనున్ను శమింపఁజేసి, వెంటనే భగవదనుభవరసమును గలుగఁజేయునట్లు, ఉపాసనాదుల ననుష్ఠించుటకు శక్తిలేనివానికి ప్రపత్తిని విధించినను, ఈ ప్రపత్తియే యట్టియుపాసనములొసంగఁగల ఫలమునున్ను అట్టియుపాసనము ఫలనున్ను ఒసంగఁగలదియై అకించనునికి ఉత్తారకంబై వాఁడు కోరిన కాలమున ఫలమును ( మోక్షమును ) తప్పకయిచ్చునదియగుటంజేసి, అధికమైనట్టి ప్రభావముగలదై యుండగలదు.

ఇవ్విధమున ఈ యుపాయము (ప్రపత్తి)యొక్క యధికారము విషయమునను, స్వరూపము విషయమునన్ను రాఁగల యాక్షేపంబులనన్నింటిని పరిహరించినాము. ఇఁక మీఁదు ఉపాయ పరికరముల (అంగముల) విషయమున రాఁగల ఆక్షేపంబులను పరిహరించెదము.

ఈ యుపాయమునకు ఆనుకూల్యసంకల్పాదులుండవలయునా? "ఆర్తో వా యదివాదృప్తః" (ఆర్తుండుకాని దృప్తుండుకాని శరణాగతునిని రక్షించెదరు) అనియు, "మిత్రభావేనసం

ప్రాప్తం నత్యజేయంకథంచన। దోషోయద్యపితస్యస్యాత్"(నా
తో మైత్రిని యపేక్షించి నన్ను శరణుజొచ్చినట్టివాఁడు దోషి
యైనను, వానిని విడనాడను) అనియు "యదివా రావణస్స్వ
యం" (రావణుండే స్వయముగావచ్చి శరణుజొచ్చినను, కాపా
డెదను) అనియును చెప్పియున్నట్లు, శత్రువుల విషయమున
నున్న దయాళువుచు, శరణ్యుండునునగు సర్వేశ్వరుండు శర
ణాగతుండైనట్టి వానియొక్క దోషములను గమనించునా? "అ
నాలోచిత విశేషాశేషలోక శరణ్య= ఎట్టి విశేషములనున్న
యోచింపకయే సమస్తజీవరాశులనున్ను రక్షించునట్టివాడా!"
అని కదా పూర్వాచార్యులున్ను సాయించియున్నారు. కావున
ఆనుకూల్యసంకల్పాదులన్నియును (విధింపఁబనిలేకుండ) స్వతస్సి
ద్ధముగానేయేర్పడునవియని కొందఱు వాదించుచున్నారు. ప్రప
త్తినిచేసినపిమ్మట ఆనుకూల్యాదులు లేకపోయినను, నిరాటంక
ముగ ప్రపత్తిఫలమునిచ్చుటలో కొరత యెద్దియునుండదని వీరు
అభిప్రాయపడవచ్చును. అట్లుకాకున్న, "షడ్విధాశరణాగతిః"
అనియు, "న్యాసఃపంచాగసంయుతః" అనియు, "స్వాంగైఃపం
చభిరావృతాం" అనియు నిట్లు అంగములనున్ను అంగినిన్ని
విభజించిచెప్పునట్టివియగు అనేకప్రమాణములు విరోధించును.
లోకమునందు రత్న్యవస్తువును సమర్పించుటలోనగు మర్యాద
కున్ను తగియుండదనియును చెప్పుచు, ఈ యంగములయొక్క
సకృత్కరణాది ప్రకారంబులనున్ను ముందేచెప్పియున్నాము.
బ్రహ్మాస్త్రమున్ను తనయంగముల సహాయము నపేక్షించియే
కదా యుండగలదు? కావున "ప్రపత్తేఃక్వచిదప్యేవం పరాపే
క్షా నవిద్యతే।సాహిసర్వత్రసర్వేషాం సర్వకామ ఫలప్రదా"

(ప్రపత్తి వేఱొకదాని సహాయము నపేక్షించియుండదు అది యన్నితావులను అందఱికిన్ని అన్నిఫలముల నొసంగునది) అని చెప్పినదియును ప్రపత్తి ధర్మాంతరములయొక్క సహాయము నపేక్షింపదని చెప్పుటలో తాత్పర్యము. అట్లుకాకున్న, వీరు వొప్పుకొనియున్నట్టి మహావిశ్వాసమున్ను ఇగేవిధముగ స్వత స్సిద్ధముగానే యేర్పడునట్టిది కావలసి వచ్చును.

ఈ పైవాదము నాధారముగాఁ గొని మరికొందఱు ఆస్తికుండైనట్టివానికి శాస్త్రార్థమునందువిశ్వాసముతప్పకకలుగును. దానికిపైగా మహా విశ్వాస మనఁబడునది వేఱొకటి మరియేమున్నది? కావున నిదియును సర్వశాస్త్రములకుసర్వసాధారణముగా నుండునది. ఇంతియెకాని, ప్రపత్తికిగాను ప్రత్యేకముగ అంగమై యుండునా? యని తలంచుచున్నారు. ఇదియును «నవిశ్వసేదవిశ్వస్తేవిశ్వస్తేనాతివిశ్వసేత్'' (విశ్వశనీయుఁడుకాని వానియందు విశ్వాసము నుంచకూడదు. విశ్వసనీయునియందు మితిమీరినవిశ్వాసము నుఁచకూడదు) ఈమొదలగువాటివలన విశ్వాసమునకు తారతమ్య ముండియుండుట ప్రసిద్ధం బగుటం జేసియు, ఈతావున మిక్కిలి గొప్ప విశ్వాసమే యంగభూతంబైనది యని చెప్పియుండుటంజేసియును పరివారింపఁబడుచున్నది.

ఇవ్విధముగ వారివారికిఁగల విశ్వాసములోను తారతమ్య ముండవచ్చునని శ్రీమదపాక్షుర బ్రహ్మవిద్యయందు «యస్యయావాంశ్చవిశ్వాస స్తస్యసిద్ధిశ్చతావతీ ఏతావానితివైతస్య ప్రభావఃపరిమీయతే'' (ఎవ్వనికి విశ్వాస మెంతయుండునో, సిద్ధియును దానికనుగుణముగానే యుండగలదు. కావున విశ్వా

స మింతమాత్రమనునది దానిప్రభావమునుబట్టి యేర్పడుచు న్నది) అనుతావున శ్రీ నారదమహర్షి తెలిపియున్నాడు.

విశ్వాసము మందముగా నుండియుండుటచే సరియైన ప్రపన్నులు కానివారినిన్ని తుదకు సర్వేశ్వరుండు రక్షించును. అదియెట్లనిన, “సకృదుచ్చారితంయేన హరిరిత్యక్షరద్వయం। బద్ధఃపరికరస్తేన మోక్షాయ గమనంప్రతి”(హరి యని రెండు అక్షరములను ఒక్కతడవ యుచ్చరించినంతమాత్రముననతండు మోక్షమును బొందుటకుగాను సాధనములను సిద్ధపఱచుకొని యున్నట్టివాఁడు) ఇత్యాది శ్లోకములయందును, వీటి కనుగుణ ముగానుండునట్టి (1)“త్వదంఘ్రిముద్దిశ్య”(2)“ఉదీర్ణసంసార”

---

(1)శ్లో॥త్వదంఘ్రిముద్దిశ్యకదాపికేనచిద్యథాతథావాపిసకృత్కృతోఞ్జలిః
తదైవముష్ణాత్యశుభాన్యశేషతః శుభానిపుష్ణాతినజాతుహీయతే॥

తా॥ స్వామీ దేవరవారి శ్రీపాదములను నుద్దేశించి ఎప్పుడైనను, ఎవ నిచేతనైనను, ఏప్రకారముగానయినను, ఒకానొకప్పుడు చేయఁబడినట్టి యంజలి వెంటనే పురుషార్థ ప్రతిబంధకములగు సమస్తఅశుభములనున్ను నశింపఁజేయుచున్నది. శుభంబులను చేకూర్చుచున్నది. ఎన్నటికిని నిష్ఫల ముకాకున్నది.

(2)శ్లో॥ఉదీర్ణసంసారదవాశుశుక్షణింక్షణేననిర్వాప్యపరాంచనిర్వృతిమ్।
ప్రయచ్ఛతిత్వచ్చరణారుణాంబుజద్వయానురాగామృతసిన్ధుశీకరః॥

తా॥నిరుపాధికశేషియై సర్వములకుండనైన దేవరవారియొక్క సౌం దర్యభూమియై నిరతిశయభోగ్యంబైన శ్రీపాదములయందుఁ బ్రేమయనే క్షీరసముద్రముయొక్క యొక తుంపురుఁ బ్రవేశించినదై యదావ్యమైనట్టి నాయాత్మద్రవ్యమును దహింపఁజేయు దానివలెనున్న సంసారమను కారుచిచ్చును చల్లార్చి,పరమపదమందు నిరవధికానంద నిర్భరంబగు స్థితిని నొసఁగుచున్నది.

అను శ్లోకములయందును "మొయ్ త్తవల్ పిన్నైయుళ్ నిన్ఱు" (ఘనీ
భూతంబైనట్టి పాపములోపడి యున్నట్టివాఁడైనను గోవిందఅని
మూఁడు అక్షరముల నుచ్చరించినమాత్రమున పాపవిముక్తుం
డగుచున్నాఁడు) అని యీ మొదలగు పాశురములయందును సా
యించియున్న ప్రకారము, ఈతనికి ఫలసిద్ధికిగాను ఈతండు కోరిన
కాలము లోఁగానె యుపాయపూర్తిని గలుగఁజేసి, సర్వేశ్వరుండు
రక్షింగ సని తలంచి, "వృథైవ భవతో యాతా భూయసీ జన్మసం
తతిః। తస్యామన్యతమం జన్మ సంచింత్య శరణం వ్రజ" (వృథాగా
అనేకజన్మములనుగడిపినావు. వాటిలో నొక్కజన్మమునైననుతలం
చుకొని (పశ్చాత్తాపపడి) భగవంతునికి శరణుజొచ్చుము) అని దేవ
లునికి శాండిల్యమహర్షి యుపదేశించియున్నాఁడు కదా!

"శరణ్యం శరణం చ త్వా మాహుర్దివ్యా మహర్షయః"
(నిన్ను శరణ్యునిగానును శరణముగానును పూజ్యులగు మహ
ర్షులు చెప్పెదరు) అని చెప్పుటచే మహర్షులకే విశ్వాసముం
డగలదు కావున, వీరివచనముఁగొనియే విశ్వాసము తక్కువ
గానున్నట్టివారికి తెలివి తేటలఁగలుగఁజేయవలయును. కావున
నిట్లు విశ్వాసమునందు తారతమ్యముండుటంజేసి, శాస్త్రము
లందుఁ జెప్పియున్న ప్రకారము మహావిశ్వాసము ప్రపత్త్యంగ
మగుట కెద్దియును బాధకము లేదు.

కొందఱు యీ విషయమున విశ్వాసము లేకపోవుట
చేఁ జేయునట్టి యాక్షేపములున్న, అందులకు పరిహారములున్న
యిఁకవిరాదు చెప్పఁబడును. భక్తిప్రపత్తులు సంకల్పభేదమును
బట్టి ఐశ్వర్యమోక్షంబులనెడి పరస్పర విరుద్ధంబులగు ఫలం
బుల నొసంగుట సంభవమా? విత్తనము వేయువాని యుద్దేశ

భేదమువలన ఒక్కవిస్తనము వేఱొక్కఫలము నిచ్చుచుండుటఁ జూచియున్నామా? (విత్తొకటివేస్తే చెట్టొకటి మొలుచునా?) అని కొందఱు ఆక్షేపించుచున్నారు. ఈ యాక్షేపమునకు పరిహారమేమనఁగా — యుక్తులచే నాక్షేపించుట కలవికానట్లు, ప్రత్యక్షాదులవలెనే స్వవిషయమునఁ బ్రమాణంబైనట్టి శాస్త్రము చెప్పుచున్నందున నట్లుండుట పొసఁగును. ధర్మశీలుండై, యుదారుండగు రాజుకు క్రయమునకుగాను న్కృష్టమైన నొసంగినట్లయిన, గొప్ప ధరనిచ్చుటను, అట్టి వస్తువునే బహుమానముగా నొసంగినట్లయిన, కానుసినది యంశముచ్చుటయున్న మనము లోకమునఁ జూచియున్నాము.

ఈ భక్తి ప్రపత్తులు ప్రయోజనాంతరపరుని విషయమున ప్రవృత్తిధర్మములుగా నుండగలవు. భగవచ్చరణార్థుల (మోక్షార్థుల) విషయమున, నివృత్తి ధర్మములుగా నుండగలవు. ఇట్లుండుట నిత్యకర్మాదుల విషయమునను సమానమే.

ఒక్కటి(భక్తి) పదేపదే యనుష్ఠింపవలసినది యగుటంజేసియు, వేఱొక్కటి (ప్రపత్తి) ఒక్కతూరిమాత్ర మనుష్ఠింపవలసినది యగుటంజేసియు నిట్లు విరుద్ధస్వభావంబులగు భక్తిప్రపత్తులు ఒక్కటియే ఫలమునొసంగునవి యగుట పొసగునా? యని కొందఱు ఆక్షేపించుచున్నారు. ఈ యాక్షేపమునకున్ను పరిహారమును లోకవేదములయందువలెనే యా యా యధికారి భేదమునుబట్టి యెఱుంగునది.

ముముక్షువులై స్వతంత్రమగు ప్రపత్తిని చేసినవారికి ఉపాయమున్ను మోక్షమున్ను ఏకరూపంబైయున్నను, సంసారమునందలి పరితాపమువలనఁ గలుగునట్టి త్వరయొక్క తార

తమ్యావము కనుగుణముగ తమతమయిచ్ఛావలన కాలమునునిశ్చ యించుకొనుటలోఁగలహెచ్చుతక్కువలనుబట్టి మోక్షము గలుగుటలోనును విళంబా విళంబములు గలుగవచ్చును. శ్రీనమ్మాళ్వారులు శ్రీమన్నాథమునులు వీరికి భగవత్సాక్షాత్కారాదులున్నప్పటికిన్ని, కొందఱికి ఇవిలేకపోవుటకుఁ గారణముప్రపత్తి చేయునట్టి సమయమున ఫలవిషయమగు సంకల్పమునఁగల భేదము, అథవా అది ప్రారబ్ధ సుకృత విశేషంబైనను కావచ్చును. ముందు కోరియున్నట్టి ఫలము ఒక్కతూరి ప్రపత్తి చేయుటచే లభించినను, కోరియుండని ఫలమునకై యాతురత గలవాగు మరల ప్రపత్తిని చేయవలయును.

దృష్టఫలములకై ప్రపత్తిచేసిన వారికి వాటిలో గొన్ని ఫలింపనందున ప్రపత్తి సకల ఫల సాధనంబను విషయమును గుఱించి కొందఱు ఆక్షేపించుచున్నారు. వారికి తక్కిన శాస్త్రములయందుఁ జెప్పియున్నప్రకారము కర్మకర్తృ సాధనములకుఁగల వైగుణ్యములఁగొని వారి కీవిషయము బాగుగాఁ దెలియునట్లు చేయునది. ఈసందర్భమున కర్మవైగుణ్యమనఁగా— మహా విశ్వాసాదులలో కొరత యుండుట. కర్తృవైగుణ్యమనఁగా— ప్రపత్తికిగాను చెప్పఁబడియున్నట్ట యధికారము తక్కువగానుండుట. సాధనవైగుణ్యమనఁగా— శాస్త్రప్రకారము ప్రపత్త్యనుష్ఠానమునకు మూలభూతంబులగు సదుపదేశాదులులేకపోవుట. ఈ వైగుణ్యంబు లెవ్వియును లేకుండియుండఁగా, ప్రపత్తిచేసినప్పుడు అట్టి ప్రపత్తికి ఫలములుగాఁ గోరబడినట్టి దృష్టఫలములు సిద్ధించునట్లు చూచియున్నాము.

ప్రపత్తిశాస్త్రమునున్ను తక్కిన శాస్త్రములనున్ను సర్వసాధారణముగ అన్ని శాస్త్రములనున్ను ప్రవర్తింపఁజేసి నట్టివారగు శ్రీ వేదవ్యాసాదులు. "ఆలోడ్యసర్వశాస్త్రాణివిచార్య చ పునఃపునః। ఇదమేకంసునిష్పన్నంధ్యేయోనారాయణస్సదా" (సమస్తశాస్త్రములను పరిశీలించినపిమ్మట సర్వదా నారాయణుని ధ్యానింపవలయునని యేర్పడుచున్నది) అనియు, "హరిరేకస్సదాధ్యేయో భవద్భిస్సత్వసంస్థితైః" (సాత్వికులగుమీచే సర్వదా హరి యొక్కండే ధ్యానింపవలసినవాఁడు) అనియు, "స్మర్తవ్యస్సతతంవిష్ణుః" (ఎల్లప్పుడును విష్ణువును స్మరించుకొనునది) అనియును ఇవ్విధమున నిశ్చయించియుండఁగా, ఎప్పుడో యొకతడవ ప్రపత్తి చేసినంతమాత్రమున మోక్షము కలుగుట సంభవమా?" "మామేవయేప్రపద్యన్తే" ఇత్యాదులు అంగప్రపత్తి విషయములగు చందంబున, చరమశ్లోకాదులును అంగములతోసహా ప్రపత్తిని భక్తికంగముగ విధించుచున్నవనిచెప్ప కూడదా? యని కొందఱు వాదించుచున్నారు. వీరు చేయునట్టి వాదము ఉపపన్నము కాదు. ఎట్లనిన,

శ్లో॥ శరణంత్వాంప్రపన్నా యే ధ్యానయోగవివర్జితాః।
తేఽపి మృత్యుమతిక్రమ్య యాంతి తద్వైష్ణవంపదం॥

తా॥ ఎవ్వరు భక్తియోగమునువిడిచి నిన్ను శరణుజొచ్చినారో, వారును సంసారమునుండి కడతేరి పరమపదమును బొందుచున్నారు.

శ్లో॥ యద్వేనకామకామేన నసాధ్యంసాధనాంతరైః।
ముముక్షుణా యత్సాంఖ్యేన యోగేనచభక్తితః ః
ప్రాప్యతేపరమంధామ యతోనావర్తతే యతిః॥

తా ॥ అట్టి పరమపదము సాధనాంతరములఁగొని పొంద శక్యముకాదు. ఈ పరమపదము ముముక్షువుచే సాంఖ్యయోగముచేతను భక్తియోగముచేతనున్ను పొందతగినదికాదు. ఇట్టి పరమపదమునకుఁబోయినవారుమరలయీలోకమునజన్మింపరు

శ్లో॥ తేన తేనాప్య తేతత్ర న్యాసేనైవ మహామునే।
పరమాత్మాచ తేనైవ సాధ్యతే పురుషోత్తమః॥

తా ॥ ఓ మహామునే! వాఁడువాఁడు దానినిదానిని న్యాసముచేతనే పొందుచున్నాఁడు. పరము పురుషుండగు పరమాత్మయును అట్టిన్యాసము(ప్రపత్తి)చేతనే పొందబడుచున్నాఁడు.

ఈ పైశ్లోకములయందుఁ జెప్పియున్నప్రకారము స్వతంత్రమగు ప్రపత్తి సిద్ధించినందున దానియందు నిష్ఠగలవానికి శ్రీవైకుంఠగద్యయందుఁ జెప్పియున్నప్రకారము స్వయంఫలముగ "ధ్యేయో నారాయణ స్సదా" అన్నట్టి ధ్యానమున్ను తసంతట నేసిద్ధించుటలోవిరోధము లేదు. ఇదియారోగ్యవంతునికిన్ని రోగికిన్ని ఉభయులకును పాలు యుపయుక్తంబైనట్టివిధమున నెఱుంగఁదగినది. అంగయుక్తమగు ధ్యానముసర్వాధికారంబైనట్టిది కాకపోయినను, భగద్విషయమునందు అధికారానుగుణముగ తెలిసికొనఁదగినంతవరకు, "నిరన్తరమ్ నినష్పతాక నీ నిస్తైక్కవేంమమే" ( నిరంతరము నిన్నే నేను స్మరించుకొనుచుండునట్లు నీవే సంకల్పింపుమా ) ఇత్యాది తావులయందువలెనే అనుసంధించుకొనిన నట్లయిన, బాధకం బెద్దియును లేదు. శ్రీ భాష్యకారులవారును ఈ యుపాయనిష్ఠను చిన్న గద్యయందును, పెద్దగద్యయందును సాయించి, శ్రీ వైకుంఠగద్యయందును ఈనిష్ఠను సంగ్రహముగాఁ దెలిపి, ఈ

శరీరముతో నున్నంతకాలము ప్రాప్యవిషయమగు ప్రీతిచెడిపో
కుండ, వృద్ధిపొందుటకు ననుకూలంబగు ననుసంధానమును "తతశ్చ
ప్రత్యహమాత్మోజ్జీవనాయైవమనుస్మరేత్" (అటుపిమ్మట
ఆత్మోజ్జీవనమునకుగాను ప్రతిదినము ఇట్లనుస్మరించు
కొనునది) అని యారంభించి, సాయించినారు. ఈ ప్రశ్నకి
"పూశిత్తుమ్ పోక్కినేన్ పోదు" (నిన్ను పూజించుచు కాలమును
గడిపితిని) అన్నట్లు ఫలాంతరము నపేక్షింపక భగవంతుని ఆరా
ధించునట్టి పద్ధతిని "అథపరమైకాంతినో భగవదారాధన ప్ర
యోగం వక్ష్యే భగవత్కైంకర్యైకరతిః పరమైకాంతీభూత్వా"
(పరమైకాంతియైనట్టివాడు భగవంతుని యారాధించునట్టి విధిని
తెలుపుచున్నాను భగవత్కైంకర్యపరుడై పరమైకాంతియై) అని
యారంభించి తిరువారాధనక్రమమునందు "అత్యర్థప్రియావిరత
విశదతమప్రత్యక్షరూపానుధ్యానేన ధ్యాయన్నాసీత" (మిక్కిలి
ప్రియంబును, ఎల్లప్పుడును విశదముగానుండునట్టి ప్రత్యక్షరూప
మగు నిధిధ్యాసనమునందుండి ధ్యానించుచునుండునది) అని
సాయించియున్నారు.

ఇవ్విధముగ అనన్యప్రయోజనముగ నిరంతరము భగ
వంతుని యనుసంధించుకొనుటచే గలిగిన ప్రీతిమూలముగా
నొనర్పంబడునట్టి కైంకర్యము విషయమున శ్రీపాంచరాత్రసం
హితయందుఁ జెప్పియున్నట్టిదై, వ్యాస దక్షాది మహర్షులున్ను
ఒప్పుకొనినదై, "మరన్తిక్కళుమ్" అను పాశురమునందును "ఇరు
ముప్పొళుదేత్తి" (పంచకాలములయందును స్తుతించి) అను
పాశురమునందును వివక్షితమైనట్టిదిగాను పూర్వాచార్యులు
వ్యాఖ్యానమునఁ జెప్పియున్నట్టి కాల విభాగమును,

శ్లో॥ అభిగచ్ఛేత్ హరింప్రాతః పశ్చాద్ద్రవ్యాణిచార్జయేత్।
అర్చయంశ్చతతో దేవం తతో మంత్రాన్ స్మరన్నపి।
ధ్యాయన్నపిపరందేవం కాలేష్వాక్తేషుపంచసు।
వర్తమానస్సదాహ్యేవం పాంచకాలికవర్త్మనా॥

తా॥ బ్రాహ్మ్యముహూర్తమున నిద్రలేచి, భగవంతుని ధ్యానించుకొని, అటుపిమ్మట భోజన సామగ్రులను సంపాదించి, భగవంతుని కారాధనముచేసి, పంచకాలములయందును మంత్రములను జపించుచు, భగవంతుని ధ్యానించుచు నివ్విధమున పాంచకాలికమార్గమున ప్రవర్తించునది.

శ్లో॥ స్వార్జితైఃగంధపుష్పాద్యైః శుభైఃశక్త్యనురూపతః।
ఆరాధయన్హరింభక్త్యా గమయిష్యామి వాసరాన్॥

తా॥ శక్త్యనుసారము నాచే స్వయముగ సంపాదింపఁబడినట్టివియును, మంగళకరములునగు గంధపుష్పాదులచే భగవంతునిభక్తితో నారాధించుచు కాలము గడుపుచున్నాడను.

అని యీపైని చెప్పినప్రకారము శ్రీభాష్యకారులవారు సాయింపఁగా, శ్రీవంగిపురపు నంబిగారు విని, యీవిషయమును తిరువారాధన క్రమమునందు సాయించి యున్నారు. అట్లే పెరియజీయరు మొదలగువారు సాయించినట్టి తిరువారాధన క్రమ గ్రంథములయందును చూచుకొనునది. ఈ తిరువారాధనక్రమ గ్రంథములలోఁ జెప్పినట్టి పద్ధతులకు బేద ముండవచ్చును. అది యాయాసంహితలయందుఁ జెప్పియున్నట్టి వికల్పములనుబట్టి యుండునదియని యెఱుంగునది.

కావున ‘‘నదేవలోకాక్రమణం’’ (నాకు నీయారాధనమునువిడిచి స్వర్గమునకుఁబోవుట కిచ్ఛలేదు) అనియు ‘‘భవాం

స్తు సహానైదేహ్యా" (నీవు సీతాపిరాట్టితోఁగూడ నున్నప్పుడు
నీకు కైంకర్యముఁ జేయుకోరుచున్నాను) అనియు, "యత్ర కుత్ర
కులేవాసో యేషు కేషు భవోస్తు మే । తవపదాస్యైకభోగేస్యాత్
సదాసర్వత్ర మేరతిః" (నేను యేకులమున పుట్టినను, యేదేశమున
పుట్టినను, నాకు యెల్లప్పుడును నీ కైంకర్యమునఁ బ్రీతి యుండు
గాక) అనియు, "కర్మణా మనసా వాచా శిరసా వాకథంచన ।
త్వాంవినా నాన్యముద్దిశ్య కరిష్యే కించిదప్యహం" (మనోవా
క్కాయములచేఁగాని, శిరస్సుతోఁగాని నేను ఏపనిని చేసినను
నీకుగానే చేయగలను) అనియు "తనక్కేయాక వెనైక్కొళ్ళ
మీతే" (తనకుగానే అనఁగా తన కైంకర్యమునకుగానే భగవం
తుండు నన్ను అంగీకరించునది) అనియును నాయించినట్లు భగవ
త్ప్రీతికిగాను నొనర్పంబడునట్టి కైంకర్యము విషయమున తన
యాచార్యునిచే నుపదేశింపఁబడినట్టి యొకవిధమైనట్టి శాస్త్రీ
యపద్ధతిఁగొని, కాలానుగుణముగ ప్ర[illegible]టు అనఁగా నట్టి
కైంకర్యము నొనర్చుచు నుండుట మంచిది.

ఇట్లు నిత్యముగ అనుష్ఠింపవలసినవిగాను విధింపఁబడు
నట్టి భగవదారాధనాదులను, లోకాయతికులవలెనే ఖ్యాతి,
లాభ, గౌరవములకుగాను కాని, తత్త్వజ్ఞాన వైరాగ్యములు
లేనివారివలెనే ప్రయోజనాంతరమునకుగాను కాని, ఉపా
యపూర్తి లేనివారివలెనే మోక్షార్థముగాను కాని తలంచి
యుండక, భగవంతుని కభిమతంబైనట్టిదానిని యనుష్ఠించుటలోఁ
గల ప్రీతివలన శాస్త్రప్రకారము స్వయంప్రయోజనముగాఁద
లంచి అవలంబించినచో, ఈ యారాధనాదులు అన్యాభిగమన అ
న్యార్థప్రవృత్తి, అన్యయాజన, అన్యశబ్ద, (అన్యకీర్తన) అన్యచింతన

ము లనఁబడునట్టి దోషంబు లెవ్వియును ప్రవేశించుట కవ కాశ మీయనవిగా యుండఁగలవు.

అన్యాభి గమనము కూడదను విషయమును ‹‹ యిని ప్పోయొరువర్ తనక్కుకణ్ణు కట్టెత్తలెవిట్కనిఱ్ శాయై యత్తివుకండాయ్'' (నీ కైంకర్యము కుపయుక్తంబగు నీకృపకు విషయభూతుండనగు నేను దేవతాంతరములనన్నిధిఁ బొందియుండి వారి కృప నపేక్షించుట నిన్ను అవమానపఱచినట్లు కాదా)అను తావున శ్రీపెరియాళ్వారులు సాయించియున్నారు.

అన్యార్థప్రవృత్తి కూడదను విషయమునున్ను ‹‹కూ ఱైశోఱివై వేండునత్తె'' (నీకైంకర్యమును ఫలముగా అన్నము కూర మొదలగు వాటిని నేను కోరియుండలేను) అను తావున సాయించి యున్నారు.

అన్యయజనము (దేవతాంతరపూజ) కూడదనువిషయ మును‹‹ఉన్నిత్తుమత్ఱొరు తెయ్వన్తొళావనై యల్లాల్'' (నిన్నుతప్ప వేఱొక్క దానిని దేనినిన్ని భజింపను) అని యు, ‹‹తేవనెంబురుమానుక్కల్లా ల్పూవుమ్పూశై నైయుం తకుమే'' (పరదేవతగా నొప్పుచున్నట్టి శ్రియఃపతికంటెను ఇతరులను పుష్పములతోఁ బూజింపఁదగునా!) అనియు‹‹ఈన్ఱో ళిరుక్క మఱ్ఱైనీరాట్టి'' (మాతయగు పిరాట్టినివిడిచి తక్కిన వారికి పరిచర్యచేసి చాలును) అనియు, ‹‹మఱ్ఱొజ్ఞోర్ పుతుత్తె య్వజ్ఞాండాడుం తొండీర్ పెఱ్ఱ తాయిరుక్కమఱ్ఱైవె న్నీరాట్టులిరో మాట్టా తతకవత్తీరే'' (కర్మవశ్యులయినట్టి దేవతాంతర ము ల నారాధించునట్టి భగవద్దాసులారా! మాతయగు పిరాట్టి విషయమున పరిచర్యనువదలి కృతఘ్నులై దేవతాంతరములను

పరిచర్యనొనర్చుట మీకుతగునా?) అనియును ఈ మొదలగు తావుల సాయించియున్నారు.

శ్లో॥ విష్ణుంబ్రహ్మాణ్యదేవేశం సర్వదేవనమస్కృతం
త్రైలోక్యస్థితిసంహార సృష్టిహేతుంనరీశ్వరం॥

శ్లో॥ ఆధాతారం విధాతారం సంధాతారం జగద్గురుం।
విహాయసభజత్యన్యం బిసస్తైన్యంకరోతియః॥

తా॥ చతుర్ముఖబ్రహ్మకును దేవతలకును ప్రభువైనవాఁడును, దేవతలందఱిచేతను నమస్కరింపఁబడువాఁడును త్రిలోకములయొక్కయును సృష్టిస్థితి సంహారములకు హేతువైనవాఁడును, తనకుపైగా ప్రభువులేనివాఁడును, ఆధాతయును, విధాతయును, సంధాతయును జగద్గురువునగు భగవంతునివిడిచి దేవతాంతరములను పూజించునట్టివాఁడు బిసస్తైన్యమునొనర్చినట్టివాఁడు (పద్మాదిపూజా ద్రవ్యములను దొంగిలించినట్టివాఁడు)

శ్లో॥ విష్ణుధర్మపరోనస్యాత్ విష్ణుధర్మపరాఙ్ముఖః
కుధర్మవ్రతశీలఃస్యాత్ బిసస్తైన్యం కరోతియః

తా॥ అట్లు బిసస్తైన్యము నొనర్చునట్టివాఁడు విష్ణుధర్మపరుండుకాఁడు. విష్ణుధర్మముకు పరాఙ్ముఖుండు, అతండు కుటిలములగుధర్మములనున్ను వ్రతములనున్ను అవలంబించునట్టివాఁడు

అని యివ్విధముగ చెప్పఁబడియున్నది,

అన్యకీర్తనము కూడదను విషయము “శొన్నాల్ విరోధమ్” (ఓజనులారా! మీకు చెప్పితేనచ్చదు, అయితే నేయీ మధురమైనవాక్కుతో భగవంతునితప్ప వేరొక్కనిని కీర్తించి యుండలేదు) ఇత్యాది పాశురములయందు సాయించియున్నారు,

అన్యచింతనము కూడదనువిషయమును «శింబైమత్త్ ఒన్ఱు ఇఱై ఉత్తత్తల్లా తత్తెన్నైతేవ పిఱానఱియుమ్" (నా మనస్సునందు నేను వేఱొక్కదానిని స్మరించుచుండలేదనువిషయము నాలో నంతరాత్మగానుండునట్టి భగవంతునకే తెలియును), అనియు, «అఱునైవమగ్ మన్నగ్ ... ఱెన్నై మనస్తిత్తు యుళ్ కరుతేన్" (ప్రళయకాలమున రక్షించునట్టి భగవంతునితప్ప దేవతాంతరములను పూజ్యులనుగా దలపంపను) అనియును ఈతావుల నాయించి యున్నారు.

ఈపైని కనుపఱచిన సమారాధన ప్రక్రియలయందు అధికారములేనివారికిన్ని ఈ కాలము లన్నింటియందును తమకు అధికారముగల నిత్యనైమిత్తికకర్మములచేతను, సంకీర్తనాదుల చేతను, పూజ్యులగు పరమభాగవతులకు పరతంత్రులై తమ యధికారానుగుణముగ తమశక్తికొలది సేవచేసి, ఈ కైంకర్యము ను కోల్పోకుండయుండవచ్చును. ఈ యర్థమును «ఆరాధితా నాం సర్వేషాం విష్ణోరారాధనం పరం । తస్మాత్పరతరం ప్రోక్తం తదీయారాధనం నృప" (దేవతాంతరములన్నింటిని ఆరాధించుటకంటెను విష్ణువు నారాధించుట శ్రేష్ఠము. అంతకంటెను వాని భక్తుల నారాధించుట (శ్రేష్ఠము) అనియు «తుప్పుమెడుత్త పిరానడియార్కళ్ మెయ్యినిల్ల శడకోపన్ శెయ్యల్" (గోవర్ధన పర్వతమునెత్తిన శ్రీకృష్ణుని భక్తులతో నేభవించినట్టి శ్రీ నమ్మాళ్వారులు) అనియు «వర్ ఱాయిరుప్పారై వెల్లుమే మత్తవర్కు ఆళాయిరుప్పార్ తవమ్" (విరోధిని సంహరించినట్టివాడగు నారసింహునికి దాసులుగానుండుట గొప్పది) అనియును ఈతావుల నాయించినారు.

ఈపైని చెప్పినట్టి కైంకర్యములను తాము స్వయముగ అనుష్ఠించి సంతోషపడునట్టివారికిని అట్లు, వారిం జూచి సంతోషించునట్టివారికిన్ని, జగత్స్రష్ట [illegible] సర్వేశ్వరునికిని సూక్తులకువలెనే భోగము ఒక్కవిధమైనదిగానే యుండగలదు. “ధర్మశ్శ్రుతో వా దృష్టో వా స్మృతో వా కథితోపి వా। అనుమోదితో వా రాజేంద్ర పునాతి పురుషం సదా” (ఇట్టి ధర్మము శాస్త్రమునుండి వినబడినను, అనుష్ఠించునట్టి వారిని చూచినను, అట్టి ధర్మమును స్మరించుకొనినను, బోధించినను, అనుమోదించినను, అట్టి పురుషుని పవిత్రునిగాం జేయుచున్నది) అను తావునం జెప్పియున్నట్టి పావనత్వమునవలెనే భోగ్యత్వమున్ను ఒక్కవిధమైనది **యగుటకు** బాధకము లేదు.

ఆట్లే “తస్మాత్ప్రణవం శూద్రో మన్నామాని నకీర్తయేత్” (కావున శూద్రుండు ప్రణవయుక్తముగ నా నామములను ఉచ్చరింపంగూడదు) అని మహాభారతమునందును, “అష్టాక్షరజపః స్త్రీణాం ప్రకృత్యైవ విధీయతే। నస్వరః ప్రణవోంగాని నాప్యన్యవిధయస్తథా। స్త్రీణాంతు శూద్రజాతీనాం మంత్రమాత్రోక్తిరిష్యతే” (స్వభావసిద్ధముగానే స్త్రీలు అష్టాక్షరీ మంత్రమును జపింపవచ్చును. అయితే స్వరమునందుగాని, ప్రణవోచ్చారణమునందుగాని, ఇంకను తక్కిన విధులయందుగాని స్త్రీలకు అధికారములేదు. స్త్రీలకును శూద్రులకును మంత్రోచ్చారణమునందుమాత్రమే యధికారముకలదు) అని నారదీయమునందును, “నమోనారాయణేత్యుక్త్వా శ్వపాకః పునరాగమత్” (నమోనారాయణాయ అని చెప్పుచు ఛండాలుండు వచ్చెను) అని వరాహ పురాణమునందును, “వాయినాల్

నమోనారాయణా వెన్ఱుమత్తికై క్కీడక్కై-కళైక్కూ-ప్పి" (వా
క్కుతో నమోనారాయణాయ అని చెప్పుచు అంజలిని శిర
ముపై నుంచుకొని) అనిగా, "నామమ్ శొల్లిల్ నమోనారా
యణమే" (నమోనారాయణాయ అని నామమును చెప్పి)
అనియును చెప్పియున్నట్లు తిరుమంత్రంబనెడి మేసివాడి గణు
పులు (అక్షతములు) గల చెఱకుగడయొక్క *ఆద్యంతములను
(ప్రణవములను) తీసివేసినట్లయిన, మాధ్యసందుభాగము అందఱి
కిన్ని అనుభవయోగ్యంబగుచందంబున, ప్రపత్తినిష్ఠులకందఱికిని
సర్వకాలములయందును భగవదనుభవరసానుభవంబునకువిరో
ధములేదు అంగయుక్తంబై విలక్షణంబగుభక్తియోగమునందు
కదా కొంతమందికే విరోధముండగలదు. క్షణమాత్ర సాధ్యంబ
గుప్రపత్తిసిద్ధమైనప్పుడునుద్వయమును అర్థయుక్తముగ అనుసం
ధించుకొనవలసినదియనిశరణ్యుండగు సర్వేశ్వరుండే చెప్పియు
న్నాడు.

కావున "ధ్యేయోనారాయణస్సదా" అని చెప్పినది
యును అధికారానుగుణముగ కొందఱిచే ఉపాయముగానును,
మఱికొందఱిచే ఫలముగానును గొనంబడుటచే నిది స్వతంత్ర
ప్రపత్తికి విరుద్ధముకాదు. ప్రపత్తి అంగమగుటను గుఱించి
భాష్యాదులయందుఁ దెలిపియున్నారు. స్వతంత్రోపాయమగు
టను గుఱించి గద్యయందుఁ దెలిపియున్నారు. మఱియు,

శ్లో॥ క్లేశానాంచక్షయకరం యోగాదన్యన్నవిద్యతే।
నకర్మణాంక్షయోభూప జన్మనామయుతైరపి,

తా॥కష్టములనుతొలగించునది యోగముకంటెను వేఱొక్క

* "ఓమ్ నమోనారాయణాయ ఓమ్" అని అనుసంధించుకొనుట గలదు.

టిలేదు. ఎన్ని జన్మములనెత్తినను కర్మములు తమంతటశమింపవు.

శ్లో॥ ఋతే యోగాన్న కర్మక్షయం యోగాగ్నిః దహతే తర్వం

తా॥ యోగము లేకుండ కర్మ క్షయించదు. యోగరూపమగు అగ్ని యెట్టికర్మమునైనను నశింపఁజేయగలదు.

ఈ మొదలగు శ్లోకములును, స్వాతంత్ర్యప్రపత్తివిధియొక్క బలమువలన వేఱొక్కయధికారినిగుఱించి చెప్పఁబడినవి కానచ్చును. ఇవ్విధమున సాధ్యోపాయము విషయమున రాఁగల తక్కిన యాక్షేపముల కన్నింటికిని పరిహారంబులను నిక్షేపరక్షా యను గ్రంధమునఁ జూచుకొనునది. ఈ తావున పరిశీలించిన విధమున ఈ సాధ్యోపాయమును రహస్యత్రయమునందు అయాప్రదేశములయందు అనుసంధించుకొనునది.

వరిక్కిన్ఱనన్ పరన్ యావనైయెన్ను మఱైయతనిల్
విరిక్కిన్ఱతుజ్యుఱరుమొన్ఱాల్ విన్నైయరై యాతలినామ్,
ఉరైక్కిన్ఱనన్నెఱి యోరుమ్పడికళిలొర్న్దులకమ్,
తరిక్కిన్ఱతారకనార్ తకవాల్ తరిక్కిన్ఱనమే॥

టీ॥ పరన్ = పరమపురుషుండు, యావనైయుమ్ = యెవ్వరినైనను. వరిక్కిన్ఱనన్ = వరించుచున్నాడు, ఎన్నుమ్= అని చెప్పుచున్నట్టి, మఱైయతనిల్ =శ్రుతియందు, విరిక్కిన్ఱతుమ్ = ప్రకాశమై యున్నప్పటికిన్ని, ఱరిమొన్ఱాల్ =యెవ్వనిచేతనైన నొక్కనిచేతనొనర్పఁబడినభక్తిప్రపత్తిరూపమగు చిహ్నముచే, విన్నైయరై = పాపాత్ములను రక్షించుచున్నాడు, ఆతలిల్ = అందువలన, నామ్ = మనము, ఉరైక్కిన్ఱ = చెప్పఁబడునట్టి, నన్నెఱి = భక్తిప్రపత్తిరూపమగు మార్గమును, ఒరుపడికళికళిలొర్న్దు = యేదొకవిధముగ తెలిసికొని, ఉలకంతరిక్కిన్ఱ = సర్వాధారుండును, తారకనార్ = సంసారమునుండి తిరింపఁజేయునట్టివాఁడునగు సర్వేశ్వరునియొక్క, తకవాల్ = కృపచేత, తరిక్కిన్ఱమే= కైంకర్యమునందు స్థిరముగానుండునట్టి వారమగు గాక!

తా॥ సర్వేశ్వరుఁడు స్వాభావికముగానే యుండి తానే నిర్హేతుకముగా క్షమించి రక్షిం
చుచున్నాడని శ్రుతులందుఁ జెప్పియున్నది. భక్తిప్రపత్తిరూపమగు వేదో
క్త వ్యాజముఁగొనియే రక్షించుచున్నాడని యెఱుంగదగును. కావున భక్తి
ప్రపత్తిరూపమగు సాధనములను అనేకవిధముల నెఱింగియున్నట్టి మేము
లోకాధారభూతుఁడుగాను సంసారోద్ధారకుఁడుగాను భగవంతుని కృపవలన
వాని కైంకర్యమునందు స్థిరముగా నుందుము గాక!

తత్తద్ధేతుకహేతుకైః కృతధియస్తర్కేంద్రజాలక్రమే
బిభ్రాణాః కథకప్రధానగణనే నిష్ఠాం కనిష్ఠాశ్రయాం।
అధ్యాత్మశ్రుతిసంప్రదాయకతకైరద్ధా విశుద్ధాశయా
స్సిద్ధోపాయవశీక్రియామితిహిన స్స్వాధ్యాయమధ్యాపయన్।

టీ॥ తత్తద్ధేతుకహేతుకైః = ఆయా కుతార్కికులచే కల్పింపఁ
బడినటి. తర్కేంద్రజాలక్రమే = తర్కములనెడి యింద్రజాలవిద్యయందుఁగు,
కృతధియః = నేర్పుగలయినట్టివారును, కథకప్రధానగణనే = కథకులలో
ప్రధానులను లెక్కపెట్టుటలో, కనిష్ఠాశ్రయాం = చిటికనవ్రేలినియాశ్ర
యించియుండునట్టి, నిష్ఠాం = స్థితిని బిభ్రాణాః = భరించియుండునట్టి
వారు అనఁగా కథకులలో నగ్రగణ్యులుగా నెన్నఁబడునట్టివారును, అధ్యాత్మ
శ్రుతిసంప్రదాయకతకైః = ఉపనిషత్తులును సంప్రదాయమును అనెడి బీజముల
చేత, అద్ధా = యథార్థముగ, విశుద్ధాశయాః = పరిశుద్ధమనస్కులైనట్టి మా
యాచార్యులు, స్వాధ్యాయమ్ = అనుష్ఠింపవలసినదియగు, సిద్ధోపాయవశీక్రియాం =
భగవంతుని వశపఱచుకొనుటకు సాధనభూతమైనట్టి శరణాగతిని, సమ
ధ్యాపయన్ = మాకు బాగుగ నేర్పించి యిచ్చినారు.

తా॥ కుతర్కరూపమగు ఇంద్రజాలవిద్యయందు నిపుణులై కథ
కాగ్రేసరులుగా నెన్నఁబడునట్టి వారయినను, ఉపనిషదర్థములచేతను సంప్ర
దాయముచేతను పరిశుద్ధమైనట్టి మనస్సుగలవారగు మా యాచార్యులు
సర్వేశ్వరుని వశపఱచుకొనుటకు సాధనముగాను అనుష్ఠింపవలసినదియగు
శరణాగతిని మాకు బాగుగ నుపదేశించి యున్నారు.

సాధ్యోపాయశోధనాధికారము ముగిసెను.



శ్రీమతే నిగమాంతమహాదేశికాయనమః.







# రహస్యత్రయసారము



## ప్రస్తావ వ్యవస్థాధికారము.

శ్లో. స్వరూపంయద్యాదృగ్గుణ విభవలీలాదిచవిభో
స్తదాజ్ఞాసేతుశ్చశ్రుతిభిరవసేయంతదఖిలం।
తథాతద్భక్తానాంతదుపసదనాదేశ్చమహిమా
యథాధీతంసద్భిర్యతిపతిముఖైరధ్యవసితః॥

టీ॥ విభోః = భగవంతునియొక్క, స్వరూపం = స్వరూపమును, యత్ = ఎట్టిదో, గుణవిభవలీలాదిచ = జ్ఞానాది గుణములును, విభూతులును, విగ్రహాదులును, తదాజ్ఞాసేతుశ్చ = భగవదాజ్ఞారూపమగు ధర్మాధర్మములున్ను యాదృక్ = ఎవ్విధములైనవో. తదఖిలం = అదియంతయును, శ్రుతిభిః = శ్రుతులచేతనే, అవసేయం = ఎట్లు నిశ్చయింపఁదగినదో, తథా = అట్లే, తద్భక్తానాం = భగవద్భక్తులయొక్కయును, తదుపసదనాదేశ్చ = వారినాశ్రయించుటయొక్కయును వారికైంకర్యముయొక్కయును, మహిమా = ప్రభావము, యథాధీతం = శాస్త్రము నతిక్రమింపకుండ, యతిపతిప్రముఖైః = శ్రీభాష్యకారులు మొదలుగాఁగల, సద్భిః = సత్పురుషులచేత, అధ్యవసితః = నిశ్చయింపఁబడినది.

తా॥ భగవత్స్వరూప రూపగుణ విభూతి విగ్రహాదులను శాస్త్రములఁ గొనియే నిశ్చయింపవలసియున్నట్లు, భాగవతులయొక్కయును వారినాశ్రయించుటయొక్కయును మహిమయనునదియును అట్టి శాస్త్రములఁగొనియే శ్రీభాష్యకారులవారు మొదలగు పూర్వాచార్యులచేతను నిర్ణయింపఁ బడు చున్నది.

ఇవ్విధమున ద్వయమునందుండు ద్వితీయావిభక్త్యంత పదముచేఁ దెలుపఁబడునట్టి సిద్ధోపాయము విషయమునను, క్రియాపదముచేఁ దెలుపఁబడునట్టి సాధ్యోపాయము విషయమునను గలుగఁగల యాక్షేపములకు పరిహారములఁ జెప్ప వలసినవిధమును జూపించినాము. ఈ యుపాయముయొక్క ప్రభావమునుగుఱించి యుదహరించిన ప్రమాణములను యథార్థరీతిగ అర్థముచేసికొని గ్రహింపనందునఁ గలుగఁగల యాక్షేపములను ఇఁకమీఁదు పరిహరించెదము.

“ఆస్ఫోటయన్తి పితరః ప్రనృత్యన్తి పితామహాః వైష్ణవో నః కులే జాతః స నః సన్తారయిష్యతి” (విష్ణుభక్తుండు మావంశమునందు జన్మించినాఁడని పితరులు సంతోషవశమున కోలాహలముచేయుచున్నారు పితామహులు నృత్యముచేయుచున్నారు) అనియు, “కేశవన్ తమర్ కీழ் మేలెమ రేழேழுపిరప్పుమ్ మాశదిరిదు పెఱ్ఱు” (పూర్వపు యేడుతరములవారును రాఁబోవు యేడుతరములవారును ఉజ్జీవించునట్లు భగవత్కృపను లభించి) అనియు సాయించినట్లు తనతో సంబంధించినట్టివారికెల్ల ఉద్ధారకుండుగాను కదా! ఈయుపాయము ననుష్ఠించునట్టివాఁ డుండ గలఁడు “యోహ్యేనం పురుషం వేద దేవా అపి న తం విదుః” అను తావున భగవంతునిగుఱించి జ్ఞానముగలవానియొక్క ప్రభావము

జీవశంకున్ను తెలిసికొనుటకు దుర్లభంబని తెలిపియున్నారు కదా! అయినను, యిందులకు విరుద్ధముకానట్టి ప్రమాణముయొక్క బలమువలనముందుగ జాతివ్యవస్థనుగుఱించి చెప్పఁబడును

" నశూద్రా భగవద్భక్తాః విప్రాభాగవతాస్స్మృతాః।
సర్వవర్ణేషు తేశూద్రాః యేహ్యభక్తాజనార్దనే " (భగవద్భక్తులయినట్టివారు శూద్రులుకారు. వారు విప్రులుగాను భాగవతులుగాను నెన్నఁబడుచున్నారు. అన్ని వర్ణములయందును భగవద్భక్తులుకానివారు శూద్రులుగా నెన్నఁబడుచున్నారు) అనుతావున, భగవద్భక్తియనఁబడు గుణవిశేషముండుటంజేసి నికృష్టజాతివారిని, ఉత్కృష్టజాతివారిని పేరొకొనునట్టి శబ్దముచేతను, అట్టి గుణవిశేషము లేకపోవుటనుబట్టి ఉత్కృష్టజాతివారిని, నికృష్టజాతివారి పేరొకొనునట్టి శబ్దముచేతనున్ను పేర్కొనియున్నారు. దీని నాధారముగాఁజేసికొని, భగవద్భక్తులందఱును ఒక్కకులమువారుకారా! యని సామాన్యజ్ఞానము కలవారు కొందఱు వాదించుచున్నారు. అట్లగునేని, 'భాగవతుండగు బ్రాహ్మణుం డివ్విధముగ ప్రవర్తించునది. భాగవతుండగు శూద్రుం డివ్విధముగ ప్రవర్తించునది." అనియిట్లు ఆచారనియమములఁ జెప్పునట్టి శాస్త్రములతోనును విరోధము గలుగును. సామాన్యబ్రాహ్మణునికిని సామాన్యశూద్రునికిన్ని యెంత తారతమ్యము కలదో, అంత తారతమ్యము భాగవతుండగు బ్రాహ్మణునికిని భాగవతుండగు శూద్రునికిన్ని గలదని యెఱుంగునది యనియు, వీరు సమానులనిచెప్పునట్టి శాస్త్రవాక్యములున్ను పరమపురుషార్థాది సామ్యమునుబట్టి యట్లు చెప్పుచున్నవనియు నిట్లు కిడాంబి అప్పళ్ళారు సాయించుదురు. " కులం

తరమ్" అను పాశురమునకు వ్యాఖ్యానము చేసినట్టి పరమాప్తు
లగు పూర్వాచార్యులును జన్మనుబట్టియు, ఆచరణనుబట్టియు
ను తక్కువవాఁడగు నొకనికి భగవత్సంబంధము గలిగినట్లు
యిన, అట్టివానిని వీటఁగలవాఁ డొకఁడును నీచునుగాఁ దలం
చినట్లయిన, అది తప్పని చెప్పవలసినట్లు కదా భగవత్ప్రభావ
ముండగలదు ?

అయితే అట్టివారితో వివాహాది సంబంధములఁ జేసికొ
నటలేదే? యని యడిగెదవ ? అది జాతిని (కులమును) బట్టి
యుండునది. ప్రకృతమున నిట్లు శ్లాఘించిచెప్పుట యనునది
గుణమునుబట్టియని పూర్వాచార్యులు నిరూపించియున్నారు.
"కులంతరుమ్" అను పాశురమును "పండైక్కులత్తై త్తవిర్న్దు"
అను పాశురమున్ను భగవద్భాగవత దాసత్వరూపమగు కుల
మునకుఁగలఁ ఉత్కర్షమును తెలుపునవి.

దేవతాంతరముల సంబంధముచే సంకరమైనట్టి కులము
ఈతనిది కాదుగదా! "మాజనిష్ట సనోవంశే జాతో వా ద్రాగ్విప
ద్యతాం । ఆజన్మమరణం యస్య వాసుదేవో న దైవతం" (పుట్టి
నది మొదలు చనిపోవువరకును యెవ్వండు వాసుదేవుని దేవత
నుగా నమ్మియుండడో, అట్టివాఁడు మా వంశమునందు జన్మిం
పకూడదు, జన్మించినను వెంటనే మృతినొందునుగాక!) అనికదా?
యేకాంతుల కులమును గురించి చెప్పియున్నారు.

ఇట్లు వేఱొక్క కులమైనను, జాతిశబ్దమును కులశబ్దమును
భిన్నార్థములుకలవిగానును ప్రయోగింపఁబడుటం జేసి, జాతి భేదిం
పదు. తిరుమరభిన్నమైనను, గోత్రజాతికి బాధకములేదుకదా! మ
హర్షులును "నశూద్ర ఇతి మంతవ్యః" ఇత్యాది తావులయందు

వలెనే జ్ఞానాధిక్యాదులనుబట్టి ఉత్కృష్టులనియు వయమున నికృష్టులఁ దెలుపునట్టి శబ్దములును ప్రయోగింపఁబడియున్నవి. ఇంతియే. కావున భగవద్భక్తులుకానట్టి బ్రాహ్మణులు శూద్రులవలెనే అనాదరింపవలసినవారనియు, భగవద్భక్తులగు శూద్రులు బ్రాహ్మణులవలె నాదరింపఁదగినట్టివారనియు చెప్పుటయే శాస్త్రముయొక్క యుద్దేశము, అట్లుకాకున్న,

శ్లో॥ చండాలమపి వృత్తస్థం తందేవా బ్రాహ్మణం విదుః ।
ఛండాలాఃప్రత్యవసితాః పరిబ్రాజకతాపసాః॥

తా॥ చండాలుండైనను, మంచి ప్రవర్తనగలవానిని బ్రాహ్మణునిగాను దేవతలు తలంతురు. భగవద్భక్తిగల చండాలులు సన్న్యాసులుగాను, తపోవంతులుగాను నెన్నఁబడుచున్నారు.

శ్లో॥ నతేన స్థవిరో భాతి యేనాస్య ఫలితం శిరః।
బాలోపి యః ప్రజానాతి తందేవాః స్థవిరం విదుః॥

తా॥ వెంట్రుకలు నెరిసినంతమాత్రమున, వృద్ధుండని గౌరవింపఁ గూడదు, బాలుండైనను, వివేకవంతునే వృద్ధునిగాను దేవతలు తలంచుదురు.

ఈపైని యుదహరించినతావుల నిందాప్రశంసలఁజేయునట్టి వాక్యములఁగొని సర్వమర్యాదలును చెడిపోవలసివచ్చును కావున,

శ్లో॥ ప్రతిపత్తివిశేషార్థ మన్యత్రాన్యత్వకీర్తనం।
విశేషవిధిసాకాంక్షాస్తత్రతత్ర ప్రవృత్తయః॥

తా॥ ఇట్లు ఒక్కకులమువారిని వేఱొక కులమువారినిగాను స్తుతించిచెప్పుటయనునది వారివారికిఁగల జ్ఞానాధిక్యమునుబట్టి

యని యెఱుంగునది. ఇవి యన్నియును శాస్త్రమునఁ జెప్పఁబడినట్టి విశేష విధులనుబట్టి యుండునవి.

ఈపైని యుదహరించినదానిని అన్నింటికిని సమాధానమునుగాఁగొనునది. శ్రీ విదురుండును తనయొక్క కులమునకు అనుసారముగానే వివాహముఁ జేసికొని యున్నాఁడు.

“భుక్తవత్సుద్విజాగ్ర్యేషు నిషణ్ణః పరమాసనే। విదురాన్నానిబుభుజే శుచీని గుణవంతిచ” (బ్రాహ్మణశ్రేష్ఠులందఱును భుజించిన పిదప శ్రీకృష్ణుండు ఉన్నతాసనముపై కూర్చుండి పరిశుద్ధములును, రసవంతములగు విదురుండొసంగిన భక్ష్యములను భుజించెను) అని దుర్యోధనుండు విని, “భీష్మద్రోణావతిక్రమ్య మాంచైవ మధుసూదన। కిమర్థం పుండరీకాక్ష భుక్తంవృషలభోజనం” (ఓ కృష్ణా! భీష్మాచార్యులును, ద్రోణాచార్యులును, నేనును ఉండఁగా, మమ్ములనువిడిచి శూద్రుని యింట భుజించితి వేల?) అని యడుగఁగా, “ద్విషదన్నంనభోక్తవ్యంద్విషన్తంనైవ భోజయేత్। పాండవాన్ ద్విషసేరాజన్ మమప్రాణాహిపాండవాః” (ఓరాజా! శత్రునియింట భుజింపఁగూడదు. శత్రువుకుభోజనము పెట్టకూడదు. పాండవులనునీవుద్వేషించుచున్నావు. పాండవులన్ననో, నాకు ప్రాణభూతులు) అని శ్రీకృష్ణుండు ప్రత్యుత్తరమిచ్చి యుండుటంజేసి, దుర్యోధనుండు చెప్పినట్టి విదురునిజాతిని భగవంతుండు వొప్పుకొనినట్లు యిందువలన తెలియుచున్నది.

అయితే బ్రాహ్మణులకున్ను క్షత్రియులకున్ను శూద్రుని యింట పక్వాన్నములను భుజించుట నిషిద్ధముకాదా? యని యడుగవచ్చును. అయినను, “ఆర్యాధిష్ఠితావాశూద్రాఅన్న

సంస్కర్తారః స్యుః" అని ఆపస్తంబాదులు చెప్పినప్రకారము
యుగాంతరములయందు ఆర్యులకు పరతంత్రులైనట్టివారై గుణ
వంతులగు శూద్రులు ఆర్యులకు అన్నము వండిపెట్టుటకుఁ దగి
నట్టివారుగను అనుజ్ఞాతులైనందున, ఈ విషయమున నిషేధం
బెద్దియును లేదు. ఈ విషయము "శుచిస్సుప్రయతోభూత్వా విదు
రోన్నముపాహరత్" (పరిశుద్ధుండును, ఇంద్రియ నిగ్రహము
గలవాఁడునై, విదురుం డన్నము గొనివచ్చెను) అను తావున
శ్రీ విదురునియొక్క గుణవిశేషంబులఁ జెప్పుటచే సూచితము గు
చున్నది. బ్రహ్మవేత్తయగు విదురుండు యోగప్రభావముచే
దేహమును త్యజించినపిమ్మట, అంతిమసంస్కారాధికారముగల
ధర్మరాజు ఒనర్చినట్టి సంస్కారమున్ను తాంత్రికముగ చేసినదిగాని,
ఎవ్వఁడో యొక యధికారికిగాను ప్రత్యేకముగా నొనర్చినట్టి
దిగానుగాని కాఁగలదు. దీనిఁ గొని, తక్కినవారి యందటివిషయ
మునను అట్లే యొనర్పవలయునని చెప్పఁదగదు. అట్లుకాకున్న,
ధర్మనిష్ఠులగు పంచపాండవులకు యేదొక హేతువువలన ద్రౌప
ది యొక్కతియే భార్యయైనట్లు, అందఱికిని యివ్విధముగా నుండ
వచ్చునంటిమేని, లోకులందఱును వ్యాకులపడవలసి వచ్చును.
కావున, తమతమ కులాచారములను విడువకుండ యున్నట్టి
ఆయాకులములవారు తమతమ కులములకుఁ దగినట్టి విధమున
భగవత్కైంకర్యములఁ జేయవచ్చును.

జనులను మోహింపఁ జేయుటకై ప్రవర్తింపఁ జేసినట్టి
శాస్త్రములయందుఁ జెప్పియున్నట్టి జాత్యుత్కర్షలను ప్రామా
ణికులు నమ్మకూడదు. చరువ్యత్యాసాదులగు కొన్ని విశేష
హేతువుల మూలముగఁ గలుగునట్టి విశ్వామిత్రాదుల స్థితి

వేతేమురికొండ జకిన్ని తగియుండుననుట వచనవిరుద్ధము. వీరు
రామలకంటెమిన్న ఉత్కృష్టమైనట్టి ప్రభావముగల ఆళ్వారుల
యొక్క చరిత్రలను మనబోటివారి యనుష్ఠానము విషయమున
దృష్టాంతముగా గొనకూడదు. వారియొక్క చరిత్రలను పరిశీ
లించి చూచితిమేని, వారు ఎన్నడును తమతమ కులనియమ
ములను విడనాడి యుండలేదు

“విష్ణుర్నిత్యంవిద్యయా తాత ఈడ్యః తస్మాత్ జ్ఞానం ని
త్యరూపం వరేణ్యం ప్రాప్యం జ్ఞానం బ్రాహ్మణాత్ క్షత్రియాద్వా
వైశ్యాచ్ఛూద్రాద్వాపినీచాదభీక్ష్ణం” (విష్ణువు యెప్పటికిని జ్ఞాన
ముచేతనే స్తుతింపదగినవాడు. కావున మంచి నిత్యమైనట్టి
జ్ఞానము బ్రాహ్మణునినుండికాని, క్షత్రియునినుండికాని, వైశ్యు
నినుండికాని, శూద్రునినుండికాని వానికంటెనున్న నీచుండై
నట్టివానినుండికాని సంపాదింపవలసినది) అను శ్లోకమునందు
భగవద్విషయమగు జ్ఞానము అవశ్యముగ సంపాదింపవలసినది
గాన, అట్టి జ్ఞానము నొసంగగలవారు బ్రాహ్మణాదులు లభింపక
పోయినట్లయిన, తక్కువజాతివారి వద్దనుండియైనను, జ్ఞానమును
తప్పక సంపాదింప వలసినది యని యింతమాత్రమె చెప్పబడి
నది. అట్లున్నను, యుపాసనమును గాని, మంత్రమును
గాని యీ మొదలగువాటిని మాత్రము బ్రాహ్మణులవద్దనుం
డియే గ్రహింపవలయునని “శూద్రయోనావహంజాతో నాతో
న్యద్వక్తుముత్సహే” (నేను శూద్రవర్ణమునఁ బుట్టినందున నిం
తకుపైగా చెప్పుట కిచ్ఛయింపను) అన్నట్టి శ్రీవిదురుని వాక్య
మువలన సిద్ధమగుచున్నది. తులాధార, ధర్మవ్యాధాదులును
సందేహములను నివర్తించుకొనుటకై తమవద్దకువచ్చినట్టి బ్రా

హ్మణులను గౌరవించి, తీర్థయాత్రసను ముఖున, దారితప్పిన
వారికి దారిచూపించునట్లు, వారికి తెలివితేటలఁ గలుగఁ జేసిపంపి
నారు. ఇంతియేకాని, ముఖ్యమగు ఆచార్యత్వమును వహించి ప్రవ
ర్తించి యుండలేదు వీటిననన్నింటిని ఈ పురాణేతిహాసములయందుఁ
జూచుకొనునది. "భక్తిరష్టవిధా హ్యేషా యస్మిన్ మ్లేచ్ఛే
పివర్తతే। తస్మై దేయం తతో గ్రాహ్యం సచ పూజ్యో యథాహ్య
హం" (ఇట్లు యెనిమిది విధములుగల భక్తి మ్లేచ్ఛునియందున్నను,
వానికీయవచ్చును వానినుండి గైకొనవచ్చును నేను ఎట్లుపూ
జ్యుండనో వాఁడున్ను అట్లే పూజ్యుండు) అని చెప్పినదిన్ని వా
నికి పిల్ల నియ్యవచ్చును వానిపిల్లను చేసుకొనవచ్చునని యర్థ
ముకాదు. అయితే వానికి జ్ఞానము నియ్యవచ్చును. వానివద్ద
నుండి జ్ఞానమును గైకొనవచ్చుననుటలో నభిప్రాయమని పూ
ర్వాచార్యులు వ్యాఖ్యానము చేసియున్నారు. పైశ్లోకమునందు
"పూజ్య" అను శబ్దమున్ను సాధారణమైనది యగుటంజేసి,
భాగవతత్వ మున్నట్లయిన, సర్వజనులును శాస్త్రమునందుఁ
జెప్పియున్న ప్రకారము, ఆదరణయోగ్యులు. ఇట్లు భాగవతులయి
నట్టివారిని వారిజాతివారితోఁ బాటుచూచి అనాదరణచేసినట్ల
యిన, నరకప్రాప్తియే కలుగఁగలదని యభిప్రాయము. ఈయర్థ
మును "యశ్శూద్రం భగవద్భక్తం" అని యారంభించి, మహ
ర్షులు సంగ్రహముగాఁ దెలిపియున్నారు. కావున కులకట్టుబాట్లు
చెడిపోకుండ యుండి యుండగా, భాగవత ప్రభావము కనుగు
ణముగా ప్రవర్తించునది.

శ్లో॥ అతో జాతేర్నికృష్టాయా స్సర్వస్యావా వినాశితః।
సాజాత్యం విష్ణుభక్తానా మితిమందమిదంవచః॥

తా॥ నికృష్టజాతికాని, జాతియనునది మోక్షమునకు గాని నశించుటవలన విష్ణుభక్తులందఱును సమానజాతీయులగుదురని చెప్పుట చాలతెలివితక్కువమాట.

శ్లో॥ వైష్ణవత్వేన మాన్యత్వం సమానం మునిసమ్మతం।
జాత్యాదిధ్వంస సామ్యం ముక్తికాలే భవిష్యతి॥

తా॥ వైష్ణవత్వమునుబట్టి ఆదరణీయులగుట అందఱికిని సమానమే. జాత్యాదులు నశించుటచే గలుగునట్టి సామ్యము ముక్తికాలమునం గలుగం గలదు.

భగవద్గీతాదులయందును,

శ్లో॥ స్త్రియో వైశ్యాస్తథా శూద్రాః తేపి యాంతి పరాం గతిం।
స్వే స్వే కర్మణ్యభిరతః సంసిద్ధిం లభతే నరః॥

తా॥ స్త్రీలును, వైశ్యులును, శూద్రులును పరమపదమును బొందుచున్నారు. మనుష్యులు తనుతమ కృత్యములను తప్పక ఆచరించువారయినట్లయిన, సిద్ధిని పొందగలరు.

శ్లో॥ స్వకర్మణా తమభ్యర్చ్య సిద్ధిం విందతి మానవః।
స్వకర్మనిరతస్సిద్ధిం యథా విందతి తచ్ఛృణు॥

తా॥ మానవుండు స్వధర్మానుష్ఠానముచే భగవంతుని పూజించి సిద్ధిని బొందుచున్నాడు, స్వకృత్యమునందు ఉద్యుక్తుండైనట్టి వాడు ముక్తిని పొందునట్టి విధమును తెలిపెదను. వినుము.

శ్లో॥ తస్మాత్ప్రణవం శూద్రో నామ్నా మాని నకీర్తయేత్।
వర్ణాశ్రమాచారవతా పురుషేణ పరః పుమాన్॥
విష్ణురారాధ్యతే పంథా నాన్యస్తత్తోషకారకః।

తా॥ కావున శూద్రుండు ప్రణవయుక్తముగ నానామము లను స్మరింపకూడదు. వర్ణాశ్రమ ధర్మనిష్ఠుండగు పురుషునిచే

పరమపురుషుండగు విష్ణువు ఆరాధింపఁబడుచున్నాఁడు. ఇంతకంటెను విష్ణువును సంతోషపెట్టునట్టి మార్గ మెద్దియును లేదు.

శ్లో॥ నచలతినిజవర్ణ ధర్మతో యః।

తా॥ ఎవ్వఁడు తనయొక్క వర్ణాశ్రమధర్మాచరణమునుండి చలింపకయున్నాఁడో,

ఈపైని యుదహరించినట్టి శ్లోకములు మొదలగు వాటి యందు భాగవతునికే పూర్వమున్న ప్రకారము జాతివ్యవస్థయును, అందుల కనుగుణంబగు ఆచరణమును ఉండియుండవలయునని తెలుపఁబడినది. ఇవ్విధముగ భాగవతత్వరూపమగు గుణమును, అందుమూలకమగు పురుషార్థమున్ను సమానములుగానుండ, కులభేదములును, ఆచరణభేదములును నిత్యములు నియతములై యుండునవి యను విషయము "శూద్రస్సాధుః కలి స్సాధుః" ఇత్యాది తావులయందును సుప్రసిద్ధము.

"తమశ్శూద్రే రజః క్షత్రే బ్రాహ్మణే సత్త్వముత్కటం" (శూద్రునియందు తమోగుణమును, క్షత్రియునియందు రజోగుణమును, బ్రాహ్మణునియందు సత్త్వగుణమును మిక్కుటముగా నుండును) అని చెప్పియున్నట్లు, సత్త్వాదిగుణతారతమ్యముతోఁ గూడియున్నట్టి శరీరమును బట్టియుండునట్టి బ్రాహ్మణాదులు వేఱు. మనస్సునందుండు సత్త్వాదిగుణముల మూలముగ అన్ని కులములవారినిన్ని శ్లాఘించి చెప్పుటకు హేతువులగు బ్రాహ్మణాదులు వేరు. వీటిలో, శరీరసంబంధమగు గుణవిశేషములమూలముగ నేర్పడియుండునట్టి జాతిభేదములు జన్మసిద్ధంబులై మరణించువరకును స్థిరముగా నుండగలవు. మానసికమగు సత్త్వాది గుణోత్పత్తిమూలముగ చెప్పఁబడునట్టి బ్రాహ్మణాదులు

అన్నిజాతులవారికిన్ని యుండదగినవియై, ప్రహ్లాదాదుల విషయ
మున ఆచార్యకటాక్షాదుల మూలముగాఁ గలుగునవి యగుటం
జేసి ఆగంతుకములుగా నుండగలవు. వీటిలో శరీర సంబంధము
లగు జాతివిశేషముల ననుబట్టి కొన్ని శాస్త్రములు నియతంబులు
కాఁగలవు. మానసికములగు బ్రాహ్మణాదులనుబట్టి, వాటికను
గుణములగు పురుషార్థములున్ను, అందులకు ఉపాయములున్ను,
ప్రశంసాదులును అన్నికులముల వారి విషయమునను స్వాభా
వికముగానే యుండఁగలవు. వీటిలో బ్రాహ్మణాదులకు మానసిక
ములగు విపరీతాకారములు, (దురాచారములు) సంభవించినట్లు
యిన, శమదమాది యోగ్యంబైనట్టిదిగాను శాస్త్రసిద్ధంబైనట్టి
కులమునఁబుట్టియును, అందులకు వ్యతిరిక్తముగాఁ బ్రవర్తించు
చున్నాఁడని లోకులునిందించుదురు. తక్కినకుల మందు దేని
యందైనను పుట్టియుండి, గుణవంతుండైనట్లయిన, "ఏవంహైష్యమైత్రే
శూద్రోపి చార్థకే మానమర్హతి" (అట్టి గుణములుగలవాఁడు
శూద్రుండైనను, గౌరవనీయుఁడు) ఇత్యాదివాక్యములఁ జెప్పియు
న్నట్లు మిక్కిలి కొనియాడఁబడును. వీటిలో జన్మసిద్ధంబైనట్టిది
కాని, తరువాత వచ్చినట్టిదికానియగు ఉత్కర్షమనునది గర్వ
హేతువైనట్లయిన, అది యనర్థకము కాఁగలదు. ఇట్లు రెండు
విధములుగా నుండునట్టి యపకర్షమనునది "కులంగళాయ వీర
రెండిల్" అను పాశురమునందును, *"జనిత్వాహంవంశే" అను
శ్లోకమునందును చెప్పియున్న ప్రకారము తానుండియున్నట్టి
స్థితిఁ దెలిసికొని దైన్యము వహించి, అకించనుల కధికారము
గల యుపాయమున (ప్రపత్తియందుఁ) బ్రవేశపెట్టినేని, యది

* ఈ శ్లోకార్థమును ౩౫౬ వ పేజీలో చూచుకొనేది.

పురుషార్థమునకు హేతువగుటఁ జేసి యిక్కిని శ్లాఘింపఁబడుచున్నది
ఇవ్విధముగ కాలనియతియును, కాలాకాలనియమములను వృత్తి
నియతియును ఉన్నప్పటికిని, అట్టిదానికిని సాధనత్వమూలక
ముగ ముందుఁ జెప్పఁబడినట్టి ఉద్దేశ్యత్వ ప్రతిపత్తికి విరోధము
లేదు.

ఇట్టి భాగవతులకు వారిలో, "ఏకాంత్యం భగవత్యేషాం
సమానమధికారిణాం" (వీరికందఱికిని భగవంతుని విషయ
మగు ఐకాంత్యము సమానము) అన్నట్లు, దేవతాంతరసంబం
ధము లేనట్టివారు ఏకాంతు లనఁబడుచున్నారు. వారిలోనను,
"జ్ఞానీతు పరమైకాంతీ" (జ్ఞానియైనవాఁడు పరమైకాంతి) అన్న
ట్లు ప్రయోజనాంతర సంబంధములేనట్టివారు పరమైకాంతు ల
నఁబడుచున్నారు. వారిలోను, మోక్షము గలుగుటలో నాల
స్యమును సహించి యుండజాలనివారై, సర్వశక్తుండగు శేషికి
(సర్వేశ్వరునికి) శరణాగతిచేసి యొనర్చునట్టి కైంకర్యంబునకు
ఫలాంతరముఁ గోరుటయనునది వడ్డికియాశపడి డబ్బిచ్చుటవంటిది
అనెడి శ్రుత్యర్థము నెఱింగి, అట్టికైంకర్యమునకు మోక్షమునున్న
ఫలమునుగాఁ గోరక, కైంకర్యమే ఫలంబునని తలంచియుండు
నట్టివారి పరమైకాంతిత్వము పదునాఱు వన్నెలుగల బంగార
ముతో తుల్లతూగుచుండగలదు. ఈ విషయమును బాగుగా నెఱ్ఱిం
గియున్నట్టి మహాత్ములు మహాభారతాది గ్రంథములయందు
పరమైకాంతులయొక్క మహిమను విస్తరించి తెలిపియున్నారు.
ఇట్టి పరమైకాంతియొక్క ప్రభావమునుగుఱించి చెప్పునప్పుడు,

శ్లో॥ నారాయణైకనిష్ఠస్య యాయావృత్తి స్తదర్చనం।
యో యో జల్పస్సజపః తద్ధ్యానం యన్నిరీక్షణం॥

తా॥ నారాయణైక నిష్ఠుండైనట్టివాఁడు యేయేవృత్తినవలంబించునో, అదియును భగవదర్చనముగా నెన్నఁబడు చున్నది. వాఁడు దేని నుచ్చరించునో, అది జపముగా నెన్నఁబడుచున్నది. వాఁడు దేనిని నిరీక్షించియుండునో, అదియే ధ్యానముగానెన్నఁబడుచున్నది.

శ్లో॥ తత్పాదాంబ్వతులం తీర్థం । తదుచ్ఛిష్టం సుపావనం ।
తదుక్తిమాత్రం మంత్రాగ్ర్యం తత్ స్పృష్టమఖిలం శుచిః

తా॥ వాని శ్రీపాదతీర్థముతో సమానమైనట్టి తీర్థము లేదు. వాని తినఁగా ప్రసాదము పవిత్రమైనది, వాఁడు మాట్లాడినట్టిమాట మాత్రము మంత్రముగా నెన్నఁబడుచున్నది. వానిచే స్పృశింపఁబడిన దంతయును పవిత్రమగుచున్నది.

ఈపైని యుదహరింపఁ బడినట్టి శ్లోకములు ప్రమాణంబులే యైనను, వీటిలో "యాయావృత్తిః తదర్చనం" (వాఁడు యేయేవృత్తి నవలంబించినను, అది భగవదర్చనము) అను తావున శాస్త్రవిరుద్ధంబైనట్టి వృత్తినిన్ని భగవదర్చనమునుగాఁ గొనఁదగదు. దేశకాలాది వైషమ్యమువలన "ఆపత్స్వనంతరావృత్తిః" అన్నట్టి స్థితిలో నున్నప్పటికిన్ని, అది భగవదారాధనమున కుపయుక్తంబయినట్టిదిగాఁ గొనఁదగినది యని యెఱుంగునది, "మన్నిమిత్త కృతం పాప మపిధర్మాయ కల్పతే" (నాకొరకై యొనర్చినట్టిది పాపంబైనను, ధర్మముగాఁ గొనఁబడుచున్నది) అనుదానికిన్ని ఇదియేయభిప్రాయము. అట్లుకాకున్న, అతి ప్రసంగము వచ్చును. పై శ్లోకమునందు "యాయాచేష్టా" అనిపాఠభేదమున్నను, అర్థప్రాప్తంబులును, శాస్త్రప్రాప్తంబులనువలెనే, స్వభావప్రాప్తంబు లయినట్టి, నిమేషోన్మేషాదులును

సమర్పణీయంబులుగాను రహస్యశాస్త్రములందుఁ దెలియవచ్చు
చుండుటచే వాటినిన్ని భగవద్వచనముగాఁ గొనవచ్చును. అ
యితే యిది నిషిద్ధంబైనట్టిది యన్నమాట రాదు. ఎలయనఁగా,
ప్రతిషిద్ధంబులు కానట్టివైన్ని భావప్రాప్తంబులున్ను, స్వభావప్రాప్తంబు
లును శాస్త్రప్రాప్తంబులును కదా సమర్పణీయంబులుగాను
చెప్పఁబడినవి, ఈ శ్లోకముయొక్క యర్థమును వివరించునట్టిది
యగు "యత్కరోషి యదశ్నాసి" అను శ్లోకమునకును ఇట్టి
శాస్త్రవిరుద్ధము కానట్టి విషయమును తెలుపుటయే యభి
ప్రాయము. వీటిలో, శాస్త్రవిరుద్ధములైనవి సంప్రాప్తంబులైన
ట్లయిన, అధికారానురూపముగ నైమిత్తిక కర్మము, అట్టి భగ
వన్నిగ్రహమును శమింపఁ జేయుటకు గాను, చేయవలసినట్టి కైంక
ర్యము.

"యో యోజల్ప స్స జపః" (వాఁడు దేనిని ఉచ్చరించు
నో, అది జపమనిపించుకొనుచున్నది.) అని చెప్పినదిన్ని "పా
రుష్య మతివాదంచ పైశున్యంచైవ సర్వశః అసంబద్ధ ప్రలాప
శ్చ వాఙ్మయస్స్యాత్ చతుర్విధం" (పరుషముగా మాట్లాడు
టయును, పిడివాదము చేయుటయును, అన్ని విషయముల
లోనుసు లుబ్ధత్వమును తెలుపుచు మాట్లాడుటయును ఇట్లు వా
చా అపరాధము నాల్గువిధములు గలదు) అన్నట్లు శాస్త్రనిషి
ద్ధంబగు వృథాజల్పమును జపముగాఁ జెప్పియుండలేదు అ
యితే, తత్వహితంబుల విషయమున, శిష్యులు, ఆచార్యులు, స
బ్రహ్మచారులు, శిష్టులు, హితముఁగోరి యుండునట్టివారు ఈ
మొదలగు వారితో తెలియనివాటిఁ దెలిసికొనుటకై గాని,
తెలిసికొనియున్నట్టి దానిని ధ్రువపరచుకొనుటకై కాని, సంశ

యుంబులను నివర్తింపఁ జేసికొనుటకై కాని, చేయునట్టి ప్రశ్నో
త్తర రూపమగు సంభాషణ మట్టిదిగాను చెప్పఁబడినది. "నవి
గృహ్య కథాంకుర్యాత్" అని సామాన్యముగాఁ జెప్పియున్న
ను, "యథాశక్తి నిగృహ్ణీయాత్ దేవతా గురునిందకాన్"
(దేవతా దూషణముఁ జేయునట్టివారినిన్ని, గురుదూషణముఁ
జేయునట్టివారినిన్ని యథాశక్తి నిగ్రహింపవలసినది) అని విశే
షించి ధర్మశాస్త్రమునఁ జెప్పియుండుటచే వేదబాహ్యులనున్న
కుదృష్టులనున్న ఉద్దేశించి, జయేచ్ఛతోఁ జెప్పినది జల్పంబని
చెప్పవచ్చును.

"తద్ధ్యానం యన్నిరీక్షణం" (వాని నిరీక్షణము ధ్యాన
మనఁబడుచున్నది.) అని చెప్పినదియును శాస్త్ర నిషిద్ధంబులగు
చగ్రత్రాసుల దర్శనము విషయమునఁ జెప్పినట్టిది కాదు. అయితే
కైంకర్యార్థము ప్రవర్తించునప్పుడు, పీఠికంటికిఁ గానవచ్చునట్టి
పదార్థంబు లన్నియును, "అహంహరి స్సర్వమిదం జనార్దనః"
(నేను సర్వేశ్వరునికి శరీరభూతుండను, ఇది యంతయును వానికి
శరీర భూతంబైనది) అని యీ మొదలగు తావులఁ జెప్పియు
న్నట్లును "నిఱ్కిన్రదెల్లామ్ నెడుమాల్" (కానవచ్చునది యం
తయును సర్వేశ్వరుండె) అనియును పాడినట్లు అంతయు
ను బ్రహ్మాత్మకంబై తెలియవచ్చుట యనునది యీ తావునఁ
దెలుపఁబడినది.

"తత్పాదాం బ్వతులంతీర్థం" (వాని పాదోదకము ని
రుపమానమగు తీర్థము) అని చెప్పినదిన్ని, ప్రాప్తవిషయమునఁ
గల గుణాధిక్యముఁ దెలుపుటకు గానని యెఱుంగునది. ఇంతి
యె కాని, భాగవతుని పాదములపై యకస్మాత్తుగ పడినట్టి మురికి

నీళ్లు మొదలగునది నిరుపమానమగు తీర్థంబని యీ తావునఁ జెప్పియుండలేదు.

"తదుచ్ఛిష్టం సుపావనం" (వాని యుచ్ఛిష్టము మిక్కిలి పావనమైనది) అని చెప్పినదియును, ధర్మశాస్త్రములయందు పునరుపనయనాది ప్రకరణములయందు పవిత్రమైనట్టిదిగాను శాస్త్రసిద్ధంబైనట్టి యుచ్ఛిష్టంబునకు ఈగుణ విశేషము మూలముగ పావనత్వాతిశయమును చెప్పుటకుగానని యెఱుంగునది. ఇంతియె కాని, శిష్యపుత్రాదులకు నారాయణైక నిష్ఠత్వమున్నట్లయిన, వారి యుచ్ఛిష్టమును ఆచార్యు లంగీకరించుట పావనంబని ఈతావునఁ దెలిపియుండలేదు. అయితే, "నిర్మాల్యంభక్షయిత్వైవ ముచ్ఛిష్ట మగురోరపి । మాసంపయోవ్రతో భూత్వాజపన్నష్టాక్షరంసదా బ్రహ్మకూర్చం తతః పీత్వాపూతో భవతిమానవః" (గురువు కాని వానియొక్కయును మాలిన్యయుక్తంబగు ఉచ్ఛిష్టమును భుజించినట్టివాఁడు ఒకమాసమువరకు పాలుమాత్రము త్రాగుచు ఎల్లప్పుడును తిరుమంత్రము ననుసంధించుకొనుచునుండి, అటుపిమ్మట పంచగవ్యమునుపుచ్చుకొని పవిత్రుండు కాఁగలడు) అని భగవద్ధర్మనిష్ఠుండు ఆచరింపవలసినట్టి విధముఁ దెలుపునట్టి సనత్కుమార వచనమును ఆగమప్రామాణ్యమను గ్రంథమున శ్రీయాళవందారులు ఉదహరించియున్నారు. కావున "పోనకంశెయ్ త శేడన్తరువరేల్ పునితమన్ఱే" (ఆరగింపఁగా, మిగిలిన శేషము నొసంగినచో, పవిత్రుండగును) అని యాళ్వారులు సాయించినదియును, ఆచార్యుని తళిగై ప్రసాదమును గుఱించి చెప్పినది కావచ్చును. సామాన్యముగ భుక్తశేషంబని చెప్పియున్నను, భగవత్సంకీర్తన పరులయినట్టి

వారు దేశకాల వైషమ్యమువలన తక్కువ స్థితిలోనుండి త
క్కువ వృత్తిలో నున్నను, వారు ఆరగించిన పిమ్మట మిగిలిన
శేషము నొసంగిరేని, యట్టి శేషము పవిత్రమైనది యని చెప్పఁ
బడినది. యింతియే. ఈతావున "శేషమనఁగా, (తిరువధ్యయ
న సమయమున స్వాములు ఆరగింపఁగా) "భుక్తశేషః కింక్రి
యతాం ఇష్టైస్సహ భుజ్యతాం" (శేషించిన పదార్థములనేమి
చేయవలసినది) అని కర్త యడిగితే (ఇష్టులతోఁ గలిసి భుజిం
చునది) యని, స్వాములు ప్రత్యుత్తరమిచ్చినట్టి తావు నందువలె
నే శేషమనఁగా పాత్రలలో మిగిలియున్నట్టి భక్ష్యపదార్థము
లనెడి యర్థముఁ గొనినట్లయిన, బాధకములేదు. ఉచ్ఛిష్ట శబ్ద
ము నయితము బుజింపఁగా మిగిలిన పాత్రలలో నున్నట్టిదానిఁ
దెలుపునట్టిది గాను శ్రుత్యాదులయందుఁ బ్రయోగింపఁ బడి
నది. "పరిత్యజేదర్థ కామే యేస్యాతాం ధర్మవర్జితే । ధర్మం
చాప్య సుఖోదర్కం లోకసంరుష్టమేవచ" (ధర్మాను గుణం
బులు కానట్టి అర్థకామములను త్యజించునది. ధర్మంబైనప్పటి
కిన్ని, సుఖరముకానిది గాని, లోకవిరుద్ధంబైనట్టిది కాని యైనట్ల
యిన, దానినిన్ని త్యజించునది) అని చెప్పియున్నది.

"తదుక్తి మాత్రం మంత్రాగ్ర్యం" (వానియొక్క సం
భాషణము తిరుమంత్రము) అని చెప్పినదిన్ని, యాతండు హిత
కరంబులని యుపదేశించినట్టి దేశభాషా వాక్యములనున్ను తిరు
మంత్రమును వలెనే యాదరించి అనుసంధింప వలసినది యని
తెలుపుటకు గానని మెఱుంగునది. ఇంతియే కాని, యాతండు
లౌకిక వ్యవహారములను గుఱించి మాట్లాడునట్టి మాటలన్ని
యును జపాది యోగ్యంబులని తెలుపుటకుగాను కాదు.

‘శ్లోల్లుమ విరుశుగతియాం’ (మూర్ఛనుసట్టిమాటలు శ్రుతివై) అని సాయించినదియును ఇట్లు హిత విషయంబగు వాక్యము విషమైయే యని యెఱుంగునది.

“తత్స్పృష్ట మంగళంశుచి” (వాడు ముట్టినది యంత యును పరిశుద్ధమైనది) అని చెప్పినదియును శరీరస్వస్థత లేని వాని విషయమున స్పర్శన్నానముపలెనున్న, శీతకాలము నందు విష్ణుహస్త ప్రదాన మనఁబడు స్పర్శముపలెనున్న, తిరు ప్రతిష్ఠయందు మహాభాగవత స్పర్శముపలెనున్న, ఇాకను స్ప ర్శమును విధించి యున్నట్టి విషయముల యెడల ఈతని స్పర్శ ము లభించినట్లయిన, అట్లు స్పృశింపఁబడినవి యన్నియును పరిశుద్ధములు కాఁగలవని చెప్పుటకు గానని యెఱుంగునది. అట్లు కాకున్న, ‘ఉదుంబరం నభాదేత్తు’ (మేడికాయలను భు జింపఁగూడదు) అనియును.

శ్లో॥ కాలింగోదుంబరాలాబు బింబాని పరివర్జయేత్ ।
తాన్యశ్నతస్తు సతతం । నిత్యందూరతరోహరిః ॥

తా॥ కొడిశకాయలు, మేడికాయలు, బీరకాయలు, దొండ కాయలు వీటిని భుజింపఁగూడదు. వీటిని భుజించునట్టి వాఁడు ఎల్లప్పుడును భగవద్విముఖుండు కాఁగలడు.

శ్లో॥ వృన్తాక కత కాలింగ బిల్వోదుంబర భిస్సటాః।
యోభక్షయతి సంమోహా త్తస్య దూరతరోహరిః॥

తా॥ వృన్తాక, కాచు, కొడిశకాయలు, మారేడుకాయలు, మేడికాయలు వీటిని మోహవశమున భక్షించునట్టివాఁడు భగ వంతునినుండి దూరీకృతుండు కాఁగలడు.

శ్లో॥ కాలింగీం క్షుద్రవార్తాంచ దగ్ధాన్నం మాసలీంతథా॥
తుంబికాఫలమశ్నీయా త్తస్య దూరతరోహరిః॥

తా॥ కోడిశపండు, క్షుద్రవార్త, మాడినఅన్నము, నేల తాడు, సొరకాయ వీటిఁదినునట్టివానిని భగవంతుండు విడనాడి దూరముగానుండును.

శ్లో॥ యోత్రవార్తాక కాలింగ మసూర బిసకాస్యపి॥
అంత్యకాలే జగన్నాథం గోవిందం నస్మరిష్యతి॥

తా॥ వంకాయలు, నేలతాడు చిరుసెంగ గనుసుగెడ్డలు వీటిఁదినునట్టివాఁడు అంత్యకాలమున భగవంతుని స్మరింపఁడు.

శ్లో॥ తుంబంకోశాతకంచైవ పలండం గృంజనంతథా।
ఛత్రాకంవిడ్వరాహంచ భుక్త్వాచాంద్రాయణంచరేత్॥

తా॥ సొరకాయ, బీరకాయ, నీరుల్లిగెడ్డలు, తెల్లవుల్లిగెడ్డలు, కుక్కగొడుగులు, విడ్వరాహము వీటిని భుజించినట్టివాఁడు చాంద్రాయణము నాచరించునది.

శ్లో॥ నాళికాచణఛత్రాక కుసంబాలాబు విడ్భవాన్।
కుంభీకంచిక వృన్తాక కోవిదారాంశ్చ వర్జయేత్॥

తా॥ వూచ, కాచణ కుక్కగొడుగులు, కుసుమపువ్వు, బీరకాయ, విడ్భవములు, టేకుపండ్లు, చిక, వృంతాక, ఎఱ్ఱకాంచనపుచెట్టుకాయలు వీటిని త్యజింపవలసినది.

శ్లో॥ క్షీరంలవణసంయుక్త ముచ్ఛిష్టేపిచ యత్ఘృతం।
పానంరజక తీర్థేచ సురాపానసమం విదుః॥

తా॥ ఉప్పువేసినట్టి పాలుత్రాగుటయు, ఉచ్ఛిష్టమునందుండు నేతినిత్రాగుటయు, రజకతీర్థమునందు దుదకముఁద్రాగుటయును సురాపానసమంబులని పెద్దలు చెప్పుదురు.

శ్లో॥ ఆరనాళంనసేవేత, కదాచిద్భగవత్పరః।
సురాకల్పం హితద్జ్ఞేయం తస్మాద్యత్నేన వర్జయేత్॥

తా॥ భగవత్పరుండైనట్టివాఁడు ఎన్నటికిని ఆరనాళమును త్రాగకూడదు. దానిఁద్రాగుట సారాయిని త్రాగినట్లని తలంచి దానిని వర్జించునది.

శ్లో॥ ప్రమాదాదపికీలాలం యస్స్పృశేత్ వైష్ణవోనరః।
ఉపచారశతేనాపి నక్షమామి వసుంధరే॥

తా॥ ప్రమాదవశమున నైనను, విష్ణుభక్తుండైనట్టివాఁడు రక్తమును స్పృశించెనేని, ఓభూదేవి! వాఁడు అనేకోపచారములఁ జేసినను, వానిని నేను క్షమింపను.

శ్లో॥ ఏకాదశ్యాం సురశ్రేష్ఠ యో భుంక్తే ద్విజ జన్మవాన్।
ప్రతిగ్రాసమయంభుంక్తే కిల్బిషం శ్వానవిట్సమం॥

తా॥ ద్విజుండైనట్టివాఁడు ఏకాదశినాడు భుజించెనేని, వాడు ఒక్కొక్కముద్దకు కుక్కమలముతో సమానంబైనట్టి పాపమును భుజించుచున్నాడు.

శ్లో॥ ఏకాదశ్యాంతు యోభుంక్తే శక్తస్సన్నిరుపద్రవః।
సురాపానసమం పాపం భవేత్తస్య న సంశయః॥

తా॥ శక్తియుండియు, ఉపద్రవ మొద్దియును లేకుండియుండఁగా, ఏకాదశిరోజున భుజించినట్టివానికి సురాపానముతో సమానమైన పాపము గల్గును.

శ్లో॥ మద్యపానాత్సురశ్రేష్ఠ పాత్రైవనరకంవ్రజేత్।
ఏకాదశ్యన్నకామస్తు పితృభిస్సహమజ్జతి॥

తా॥ మద్యపానముఁజేయుటచే త్రాగినవాఁడు మాత్రమే నరకమును బొందును, ఏకాదశినాడు భుజించినట్లయిన

అట్లు భుజించినట్టివాఁడు తనపితృవులతో సహా నరకమును బొందును.

శ్లో॥ అన్నదోషాదశమనా న్నానావిషయదర్శనాత్।
దేహశౌచాదివిరహాత్ స్సమలంజాయతేమనః॥

తా॥ అన్నదోషము వలనను, ఇంద్రియ నిగ్రహము లేకపోవుటవలనను, నానా-విధములగు విషయాంతరముల దర్శనములవలనను, స్నానాదుల నొనర్పక పోవుటవలననున్ను మనస్సు మలినమగుచున్నది.

శ్లో॥ ఆలస్యాదన్నదోషాచ్చ మృత్యుర్విప్రాన్ జిఘాంసతి।

తా॥ బద్ధకము వలనను, అన్నదోషము వలననున్ను అజ్ఞానము జనులను హింసించుచున్నది.

ఈ పైని చెప్పియున్నప్రకారము నిషిద్ధంబులైనట్టివి యన్నియును, ఈతంబు స్పృశించిన మాత్రమున, పవిత్రము లగుచున్నవని చెప్పుటకుగాను కాదు. ఇవ్విధముగ ఈ విషయము పవిత్రంబగుచున్నది, ఈవిషయము పవిత్రముకాదనెడి యొకవ్యవస్థను యేర్పఱుపక పోయినట్లయిన, అకదటిచేతను అంగీకరింపఁబడినట్టివియగు అనేక శాస్త్ర వాక్యములతోను, శిష్టులయినట్టి వారి యనుష్ఠానంబులతోనును విరోధము సంప్రాప్తింపఁగలదు అందువలన నిది యెంతయును మితిమీరిన వాదంబనిపించుకొనును. మహనీయులగు పరమైకాంతులకున్ను ఇట్టి శాస్త్రీయ నియమము విడనాడకూడదనిదను విషయమును శ్రీ మన్నాథమునులు, శ్రీయాళవందారులు, శ్రీభాష్యకారులవారు మొదలగు పరమాచార్యులు యావజ్జీవము అనుష్ఠించి పోయినట్టి యనుష్ఠానములవలనఁ దెలియఁదగును.

వేదములయందును, తదనుగుణములగు శాస్త్రములయందును చెప్పఁబడునట్టి నియమంబులను వేదబాహ్యులును కుదృష్టులును భ్రాంతిమూలముగ విడనాడుట తామసత్యాగం బనిపించుకొనుచున్నదని "నియతస్య తు సన్న్యాసః కర్మణో నోపపద్యతే। మోహాత్తస్య పరిత్యాగః తామసః పరికీర్తితః" (శాస్త్రనియమితంబైనట్టి దానిని విడనాడుట యుక్తముకాదు. అజ్ఞానము మూలముగ అట్టిదానిని విడనాడుట తామసత్యాగ మనిపించుకొనుచున్నది) అను శ్లోకమునఁ దెలిపియున్నాఁడు. కుటుంబకష్టములవలన మనస్సు వ్యాకులమైనందున సన్న్యాసమును పుచ్చుకొనునట్టి వారివలెనే, దుఃఖోపాదకంబులనెడి తలంపుతో బద్ధగించి త్యజించుట యనునది రాజసత్యాగం బనిపించుకొనుచున్నదని "దుఃఖమిత్యేవ యః కర్మ కాయక్లేశభయాత్ త్యజేత్ సకృత్వా రాజసం త్యాగం నైవ త్యాగఫలం లభేత్" (ఏదైన నొకకర్మము కష్టసాధ్యంబనుకొని శరీరకష్టముకై భయపడి దానిని విడనాడినట్లయిన, అట్టిత్యాగము రాజసత్యాగం బనిపించుకొనుచున్నది. అందువలని ఫలమునీతండు పొందనేరడు) అను శ్లోకమునఁ జెప్పియున్నాఁడు. తన యధికారమునకనుగుణముగ త్యజింపవలసిన వాటిని త్యజించి, అనుష్ఠింపవలసిన వాటిని అనుష్ఠించునప్పుడు నేను స్వతంత్రుండనై చేయుచున్నానని కాని, నాకు యీకర్మము శేషభూతంబైనది యని కాని, నేను యీ ఫలమును బొందుటకిది సాధనంబని కాని, యివ్విధములగు తలంపులను బొత్తుగ విడనాడి, సర్వేశ్వరుండు చేయింపఁగా వానికి శేషభూతంబైనట్టి కైంకర్యమును వానిని సంతోషపెట్టుటకు గానని యనుసంధించుకొని, యను

ష్ఠించుట యనునది సాత్త్వికత్యాగం బనిపించు కొనుచున్నదని "కార్యమిత్యేవ యత్కర్మ నియతం క్రియతేఽర్జున సంగం త్యక్త్వా ఫలంచైవ సత్యాగస్సాత్త్వికోమతః" (ఓయర్జునా ఈ కర్మమును తప్పక చేయవలయు ననుకొని ఫలాపేక్షకాని కర్తృత్వాది సంబంధముగాని లేకుండ యొనర్చుట యనునది సాత్త్వికత్యాగమనఁబడుచున్నది) అను తావునఁ జెప్పియున్నాడు.

ఇట్లు భగవంతుని సంతోషపెట్టుటకుగాను దేనినైన ననుష్ఠించునప్పుడు, అట్టి సంతోషమువలని ఫలమునుగాను మోక్షముఁగోరక, యింతకు ముందొనర్చినట్టి ప్రపత్తివలన పరమకారుణికుండగు సర్వేశ్వరునికిఁ గలిగినట్టియనుగ్రహమువలన మోక్షము సిద్ధంబని తలంచి, ముక్తునియొక్క కైంకర్యమువలెనున్న ఆరోగ్యవంతుండు పాలుపోసుకొని భుజించునట్లును, అనుష్ఠించుట యనునది సాత్త్వికత్యాగముయొక్క పరిపాకావస్థగా నుండగలదు. ఇట్లు అనుష్ఠించుటయనునది మిక్కిలి యాకలిగొన్నవాఁడు అన్నము తినునట్లుండును, అటుకాకున్న, భుజించుటకిచ్ఛ లేకున్నను, నిర్బంధముకుగాను భుజించినట్లుండగలదు.

"సర్వధర్మాన్ పరిత్యజ్య" అను తావున ప్రథమయోజనయందు జ్ఞానవిశేష రూపమగు సాత్త్వికత్యాగము తెలుపఁబడుచున్నదని శ్రీభాష్యకారులవారు నాయించియున్నారు. ఈజ్ఞానవిశేషం బనునది స్వతంత్ర ప్రపత్తియందు నిష్ఠగలవానికి ప్రపత్త్యనుష్ఠానకాలమునందును పిమ్మటనున్ను స్వయం ప్రయోజనమై, ఉపాయముతో సంబంధము లేనట్టి ఉత్తరకృత్యమునందును ఆధారభూతంబైనది కాఁగలదు.

ద్వితీయ యోజనయందు, శక్తి తక్కువవాఁడై, మో

క్షము గలుగుటలో నాలస్యమును సహింపఁ జాలనివానికి దుష్కరంబై, చిరకాల సాధ్యంబగు ఉపాయాంతరముఁ జూచుటచే దుఃఖము కలుగఁగా, అట్టి దుఃఖమును పోగొట్టుటకుగాను, సుకరంబై, యొక్క తూరి మాత్రమే చేయువలసినది యగు ఉపాయాంతరమును విధింపఁదలచి «నీవు ఉపాయాంతరములనవలంబించి కష్టపడవలదు" అని సాయించినారు.

ఈప్రపత్తిని యనుష్ఠించుటకు పూర్వము ఈతనికిఁగల యుపాయాంతర సంబంధ రాహిత్య మనునది దైవయోగము వలననుండియున్నదై, ప్రకృతమున నది ప్రపత్త్యధికారములో (ఆకించనత్వములో) నుపయోగపడుచున్నది. ప్రపత్తి చేసిన పిమ్మట, అట్టి యుపాయాంతర సంబంధ రాహిత్యం బనునది శాస్త్రమువలనఁ బ్రాప్తంబై, ప్రపత్తి ఫలము నిచ్చుటలో వేఱొక్కదాని సహాయము నపేక్షించునట్టిది కాకపోవుట కుపోద్బలక మగుచున్నది.

« పరిత్యజ్య " అనునది యనువాదమనువారికి అది యధికారముఁ దెలుపునది యని యభిప్రాయము. అది విధియనువారికి ప్రపత్తి యనఁబడు నట్టి యుపాయముయొక్క నైరపేక్ష్యముఁ దెలుపునది యని యభిప్రాయము. ఇవ్విధమున, «పరిత్యజ్య" అను తావున అధికారము వివక్షితంబగు పక్షమున, «మామేకం" అనుతావున నైరపేక్ష్యమును అనుసంధించు కొనవలసి[illegible]మును. «పరిత్యజ్య" అనుతావున, నైరపేక్ష్యము వివక్షితం బగునేని, «మాశుచః" (దుఃఖింపకుము) అని దుఃఖమును నిషేధించుటచే అకించనుండుగా నున్నట్టిస్థితి తెలియవచ్చుటంజేసి అధికారమున్ను అర్థాసిద్ధ మగుచున్నది.

అస్మిన్ స్థితిలోను, "ప్రకృతోపాసనస్యాయమాత్త దంగానాం చ సంస్థితౌ అన్యేషాం త్వైతదంగత్వ త్యాగో ఽత్ర ప్రతిపాద్యతే" (ప్రకృతమగు ఉపాసనముతోఁ బాటు దాని యంగములుకూడ ఉపస్థితములు కాఁగా, తక్కినవన్నియును దీనికంగములు కావనెడి త్యాగము యీ తావున ప్రతిపాదింపఁ బడుచున్నది) అన్నట్లు కాగలదు.

"ఏక" శబ్దము, సాత్త్వికత్యాగమువలన తనవిషయమున పరాధీనములగు కర్తృత్వాదులను వివక్షించునది కాని, ఫలోపాయంబుల నైక్యమును వివక్షించునది కాని, ఒక్కటియే అన్ని యుపాయముల స్థానమున నుండునది యని వివక్షించునది కాని కాఁగలదు. ప్రవృత్తికిగాను, ఈతం డేదియును చేయవలసినది లేకపోయినప్పటికిన్ని, కింకరుండైనట్టి యీతనికి, స్వతంత్రాధికారమువలన స్వామియొక్క యాజ్ఞను (శాస్త్రమును) అతిక్రమించి ప్రవర్తింపఁగూడదని సమర్థించినారు. అట్లే,

శ్లో॥ ఆజ్ఞావిరోధిభిస్స్వైర్హా ప్రాయశ్చిత్తపరాఙ్ముఖైః।
స్వాధికారోచితస్సర్వైః ప్రత్యవాయో దురత్యయః ॥

తా॥ భగవదాజ్ఞను అతిక్రమించి తమ యధికారానుగుణముగ ప్రాయశ్చిత్త మొనర్చుకొనని వారి కందఱకిని తమ యధికారానుగుణముగ విపత్తు సంభవింపక మానదు.

శ్లో॥ ఆజ్ఞానుపాలనే తత్తత్ప్రత్యవాయనివారిణాం।
స్వామిసంతోషతః ప్రీతిరికిలాభద్వయం స్థిరం ॥

తా॥ భగవదాజ్ఞారూపములగు శాస్త్రవిధులను అనువర్తించితి ప్రవర్తించితిమేని, ఆయా యాపత్తు తొలఁగియును నంప్రాప్తింపవు సరియే కదా, స్వామికి సంతోషమునున్ను కలుగఁ

జేసినట్టివారమగుదుము. ఇట్లు రెండు ఫలములు తప్పక కలుగఁ
గలవు.

శ్లో॥ అనిచ్ఛాత్ఫలసంన్యాసే కర్తురిచ్ఛాతుపూర్వకం ।
అమర్యాదస్య దుస్స్వార్థః ప్రత్యవాయో న సంశయః ॥

తా॥ కర్మఫలములగు స్వర్గాదులు కర్తకు యిచ్ఛలేకున్న
విడచిపోగలవు. శాస్త్రాతిక్రమణమువలనఁ గలుగునట్టి దోషము
లన్ననో తప్పని సరి.

అని శాస్త్రములయందు చెప్పబడినది.

ఇట్టి ప్రపత్తిని భక్తియోగము కంగముగాఁ జెప్పు
ట కభిప్రాయ మేమనఁగా ప్రపత్తి స్వఫలసాధనమగుటయు
ప్రస్తుతమగు భక్తియోగముయొక్క ఫలమును ఉదాహరించి
తెలుపుటకు గానని యెఱుంగునది.

ఈతాత్పర్య ద్వితీయయోజనయందు, దుష్కరంబు
లగు భక్తియోగపర్యంతము ఉపాయముల స్థానమునఁనుండు
నట్టియుపాయ విశేషమున్ను (ప్రపత్తియును), ప్రథమయోజన
యందు, జ్ఞానపూర్వకమగు ప్రపత్త్యనుష్ఠానమున్ను ఉపాయ
ము ననుష్ఠించినట్టి వానికి స్వయం ప్రయోజనమగు కైంకర్య
మున్ను ఇవి యను సంధించు కొనవలసినవి. ఇంకేయు గాక,

శ్లో॥ సుదుష్కరేణ శోచేద్యో యేనయేనేష్టహేతునా ।
సనత్స్యాహ మే వేతి చరమశ్లోక సంగ్రహః ॥

తా॥ తనకభీష్టంబైనట్టి దానిని సాధించునట్టిది యగు
సాధనము ననుష్ఠించుట దుర్లభంబే యని దుఃఖపడునట్టి వానికి
అట్టిసాధనము నేనేయని భగవంతుండు చరమశ్లోకమున సంగ్ర
హముగాఁ జెప్పియున్నాడు.

శ్లో॥ భావాభావౌన ధర్మాణాం ప్రపత్తేరంగ మిష్యతే ॥
స్వతంత్ర శిష్ట్యాశక్త్యోహి శేషాభావోధికారగః ॥

తా॥ ధర్మములను అనుష్ఠించుట కాని, త్యజించుట కాని ప్రపత్తి కంగము కాదు. అయితే, స్వతంత్రవిధివలనను, అశక్తివలనను ఒకటిదానినిన్ని చేయకుండుటయే ప్రపత్తి కంగము కాఁగలదు.

శ్లో॥ క్రత్వనంగతయాయేతు తదానీమననుష్ఠితాః ।
స్వకాలే స్వవిధేరేవ కార్యాస్తేతద్వదత్రనః ॥

తా॥ ఉపాసనముకు అంగములు కానందున యేవి ఆ కాలమున ననుష్ఠింపఁ బడలేదో, అవి వాటికాలమున వాటి విధినిబట్టి యనుష్ఠింప వలసినవి యగునట్లు, మనకున్ను అనుష్ఠేయంబులు.

అని శాస్త్రమునఁ జెప్పఁబడియున్నది.

«త్యజతధర్మమధర్మంచ” (ధర్మాధర్మంబులను రెంటినిన్ని త్యజింపవలసినది) అని చెప్పినదిన్ని, కామ్యకర్మములనున్న శాస్త్రనిషిద్ధంబు లయినవాటినిన్ని త్యజింపవలసినదియని తెలుపుటకుగానని యెఱుంగునది. «త్యజసత్యానృతే” (సత్యమునున్ను అనృతమునున్ను విడువుము) అని చెప్పినదిన్ని ఆత్మానుభవమునున్ను (కైవల్యమునున్ను), ఐశ్వర్యమునున్ను ఫలమునుగాఁ గొనవలదని తెలుపుటకుగానని యెఱుంగునది. అథవా, ఈతావున వాచికము లగువాటిని విశేషించి చెప్పియున్నను ఉండవచ్చును. దీనియొక్క యపరూపతను తెలుపుటకుగాను «ఉభే సత్యానృతే” అనుతావునదీనిని అనువదించియున్నారు. త్యాగము విషయమున కర్తృత్వమున్ను పరాధీనంబని తెలు

పుటకుగాను "యేన త్యజసి తత్త్యజ" (దేనిమూలముగా త్యజించుచున్నావో దానిన్ని త్యజింపుము) అని చెప్పబడినది.

ఇవ్విధముగ అర్థము చేసికొంటిమేని, ఆజ్ఞాతిక్రమణ మూలకమగు దోషము ప్రవేశించుట కెట్టి యవకాశమున్ను లేకుండియుండగా, కొందఱు,

శ్లో॥ తస్మాత్త్వముద్ధరోత్సృజ్య చోదనాం ప్రతిచోదనాం ।
ప్రవృత్తించనివృత్తించ శ్రోతవ్యం శ్రుతమేవచ ।
మామేక మేవ శరణ మాత్మానం సర్వదేహినాం ।
యాహి సర్వాత్మ భావేన యాస్యసిహ్యా కుతోభయం॥

తా॥ కావున నీవు శాస్త్రవిధినిన్ని శాస్త్రవిధికానిదానిన్ని, ప్రవృత్తినిన్ని నివృత్తినిన్ని, శ్రోతవ్యమునున్ను శ్రుతమునున్ను వీటినన్నింటినిన్ని విడనాడి అందఱిలో నంతరాత్మగానున్నట్టి నన్నే శరణుజొచ్చుమా! అట్లొనర్చితివేని, అన్నింటిలో నేనే యున్నందున నీకెవ్విధమునను భయము లేదు.

అనుతావున నివృత్తినిన్ని విడనాడమని చెప్పియున్నందునసున్ను, "సర్వధర్మాన్" "పరిత్యజ్య" అనుతావున "సర్వ" శబ్దార్థముకు సంకోచము లేకుండుటకుగానును నివృత్తిరూపములగు ధర్మంబులను సయితమునిత్యజింపవలయును. వాటినిత్యజించుటయనగా, విరుద్ధంబులైనట్టి వాటినన్నింటిని యథాశక్తి యనుష్ఠించుట కదా! కావున ఈ నిషిద్ధానుష్ఠానము శాస్త్రబలముచేతనే సిద్ధమగుచున్నది. కావున, ప్రపన్నుండైనట్టి వానికి బుద్ధి పూర్వకమగు ఆగామి పాపకర్మముతోనున్ను సంబంధము లేదని వాదించుచున్నారు.

ఈపైవాదము మిక్కిలి పరిహాసింపదగినది. ... యె ట్లనిన, జ్ఞానియగువానికి పాపకర్మఫలము లంటవని ... వేదాంతులు పాపము చేసినప్పటికిన్ని, అది యంటదని చెప్పుచున్నారు. వీరో, పాపకార్యములను అవశ్యము చేయవలసినది యనియే చెప్పుచున్నారు వీరు చెప్పునది చూస్తే,

శ్లో॥ భక్ష్యోత్తమ ప్రతిచ్ఛన్నం మత్స్యోబడిశమాయసం ।
అన్నాభిలాషీగ్రసతే నానుబంధమవేక్షతే ॥

తా॥ ఆకలిగొనియున్నట్టి మత్స్యము ... అనిష్టమును గమనింపక, భక్ష్యపదార్థముతో గూడియున్నట్టి యినుప గాలమును తినుచున్నది.

అని చెప్పినట్లుగా నున్నది.

దీని నంతయును తలంచుకొనియే, "అహో బత మహత్కష్టం విపరీత మిదం జగత్ యేనాపత్రపతే సాధుః అసాధు స్తేన తుష్యతి" (అయ్యో! ఎంత పాపము! జగత్తంతయును వైపరీత్యమును పొందుచున్నది. దేని నాచరించుటకు సజ్జనులు లజ్జ పడుచున్నారో, దానిని ఆచరించుటచే దుర్జనులు సంతోషపడుచున్నారు) అని మహర్షియును చెప్పి దుఃఖపడి యున్నాడు. వీరు చెప్పునట్లు అర్థము చేసికొని నట్లయిన, బ్రతికియున్నవరకును అనుష్ఠింపబడినట్టి నిషిద్ధాచారమాత్రమును, ప్రపత్తికి అంగముగా జేసి, సాంగప్రపత్తి యేదొకసారి మాత్రము చేయవలసినది యనెడి నియమము తప్పిపోగలదు. ప్రపత్తిని చేయబోవునట్టి సమయమున, నిషిద్ధ ధర్మంబుల నన్నింటిని అప్పుడే యనుష్ఠించుట యసంభవము. అప్పుడే యథాశక్తి నిషిద్ధానుష్ఠానము ననుష్ఠించి ప్రపత్తిని చేయుచున్న

ట్లైన్ను జూచియుండలేదు. వీరి మతప్రకారము పాపము లను నవి అగ్నీషోమీయాది క్రతువులయం దాచరింపఁబడునట్టి జీ వహింసాదు లకర్మంబులుగా నెన్నంబడని చందంబున, పాపశబ్దవా చ్యములు అనఁగా పాపములని వ్యవహరింపఁబడునవి కావవో వుటంజేసి, ‘‘సర్వపాపేభ్యో మోక్షయిష్యామి’’ అను దానికి, బుద్ధిపూర్వకముగ నాగామి పాపకర్మనున్ను జేర్చి, తాము వ్యా ఖ్యానము చేసినదియు విరోధించును. వారివారి శక్త్యనుసార ము విధాపచారములున్ను తప్పక చేయవలసినవి యని ప్ర సక్తించును, ఇది పూర్వాచార్యుల యనుష్ఠానముతోనున్ను పూర్వాచార్యుల సంప్రదాయముతోనున్ను, తన యనుష్ఠాన ముతోనున్ను, ప్రస్తుతము మనకుఁ గానవచ్చుచుండెడి ముము క్షువుల యనుష్ఠానంబులతోనున్ను విరోధించును. ఇవ్విధముగ వాదించునట్టి వీరు, తమను ఒక ప్రపన్నుండు అర్థకామముల మూలముగ బాధించునప్పుడు, అట్లుచేయుట ప్రపన్నధర్మం బనుకొని వారియెడల ఎక్కువ ప్రీతితో ప్రవర్తింపవలసి వచ్చు నే?. ఇది లెక్కలేని ప్రమాణములకు విరుద్ధంబగుటయే కాక, ప్రస్తుతము ఉదహరించినట్టి వాక్యములయందు వివక్షితంబైన ట్టిదియును కాదు.

నిషిద్ధ నివృత్తిరూపంబున్నియును ‘‘సర్వధర్మ’’ శబ్ద ముచే వివక్షితంబులనెడివిషయము ధర్మశబ్దముయొక్క యర్థ మును తెలియక చెప్పినదియని మరికొందఱు ఆచార్యులునిర్వహిం చుచున్నారు. అది యెట్లనిన, నివృత్తులలో, ఒక ఫలము కుసాధనము గానునియమవిశేషంబులతోఁగూడ యేర్పఱుపఁబడినట్టివిధర్మ ములనిపించుకొనుచున్నవి. సామాన్యమగుఅహింసాదిమాత్రము

పాపాభావమగునింతియె కాని, యీ ధర్మశబ్దముచేతను ఖ్యాత్యర్థము కాఁదగదు. కావున, ఫలభేదములతోను నియమ విశేషములు మొదలగు వాటితోఁ గూడియుండునట్టి అహింసాదులను విడనాడుట యనఁగా ఫలంబులనున్న విడనాడుట. ఇంతియె కాని, తక్కిన నివృత్తిశాస్త్ర ప్రోక్తంబులగు నివృత్తులను విడనాడుటకు వీలులేదు.

నియమ విశేషములతోఁ గూడియుండనిది యగు అహింస మొదలగునది మాత్రమే ధర్మశబ్దార్థమను పక్షము విషయమునఁ జెప్పెదము.

శ్లో॥ అధర్మపరిహారేపి ధర్మత్వేన వివక్షితే ।
స్యాత్స్వతంత్ర విధేరేవ స్స్యాంతవ్య పరిగ్రహః ॥

తా॥ ధర్మముకాని దానిని త్యజించుటయే ధర్మంబగు పక్షమున, స్వతంత్రవిధివలన దాని నెప్పుడును స్వీకరించుటయే ఫలించును.

శ్లో॥ ఆనుకూల్య పరిత్యాగం ప్రాతికూల్య పరిగ్రహం ।
ప్రపత్త్యంగం ప్రతిజ్ఞాతుం నశక్యం సాధుసంసది ॥

తా॥ అనుకూలంబయినట్టి దానిని త్యజించుటయును, ప్రతికూలంబైనట్టి దానిని స్వీకరించుటయును ప్రపత్త్యంగంబని బుద్ధిమంతుల యెదుట ప్రతిజ్ఞచేయుట యశక్యము.

శ్లో॥ ప్రపన్నమధ్యేత్యైవ సదాచారా నతిక్రమః ।
ప్రపత్త్యధ్యాయ పఠితః ప్రతిసంధీయతామిహ ॥

తా॥ ప్రపన్నుడు సదాచారము నతిక్రమించి ప్రవర్తింపఁగూడదని ప్రపత్త్యధ్యాయమునఁ జెప్పియున్నట్టి విషయము నిచ్చట తెలియవలయునని.

ఇవ్విధముగా నున్న పిమ్మట, ‘‘చోదనాం ప్రతిచోదనాం’’ అను తావునను, ‘‘ప్రవృత్తించ నివృత్తించ’’ అను తావునను ప్రపత్తి కంగముగాను నొక్కదానినిన్ని స్వీకరింపఁ బని లేదని చెప్పినట్లయినది. ఇంతియే. మఱియు ముముక్షుత్వ మాత్రమునుబట్టి ‘‘త్రైవర్గికాంస్త్యజేద్ధర్మాన్’’ (ధర్మార్థ కామసాధనము లగు ధర్మములను విడనాడునది) అని చెప్పియున్న ప్రకారము ఫలాంతరములకు సాధనములు గాను విధింపఁ బడునట్టి ప్రవృత్తి నివృత్తులనున్ను వాటి కనుగుణంబులగు శాస్త్రవిధులనున్ను విడనాడునదియని చెప్పినట్లయినది. అట్లు కాకున్న, నిత్యనైమిత్తికాది కర్మములను బొత్తుగానే విడనాడ వలసినది యని చెప్పినట్లయిన, ముందు గాన్పించినట్టి విరోధము లన్నియును ప్రసక్తింపఁగలవు. ఈ పైని యొనర్చినట్టి నిర్ణయమును సాత్వికులై, వివేక వంతులగు వారు తెలిసికొని యంగీకరింపఁ గలరు.

ఈ విషయమును ‘‘శెయ్యాతన శెయ్యోమ్ తీక్కుఱళై చ్చెన్నోదోమ్’’ (చేయకూడని వాటిని చేయము. పరుషముగా మాట్లాడము. లుబ్ధులుగాఁ బ్రవర్తింపము) అనియు, ‘‘శెయ్యేల్ తీవినైయెన్ఱరుళ్ శెయ్యుమ్’’ (క్రూరకృత్యముల నాచరింపని పక్షమునఁ భగవంతుండు కనికరించును) అనియు నీ తావుల సాయించియున్నారు. ‘‘నాయినేన్ శెయ్దకుఱ్ఱమ్ నఱ్ఱమాకవే కొళ్ శౌలనాథనే’’ (అజ్ఞుండగు దాసుండొనర్చినట్టి పాపకృత్యమును ఉపచారముగాఁ గొనునట్టి దయాళువగు నా స్వామీ!) అను దాని యభిప్రాయమునున్ను పరిశీలించి చూచితిమేని, క్షమింపవలయునని ప్రార్థించుటయే వివ

త్తిత్తము కాఁగలదు. కావున, ప్రపన్నునికి అపరాధంబులు సం
ప్రాప్తంబు అయినట్లయిన,

శ్లో॥ అజ్ఞానాదథ వాజ్ఞానా దపరాధేషు సత్స్వపి।
ప్రాయశ్చిత్తం క్షమస్వేతి ప్రార్థనైకైవ కేవలం॥

తా॥ ప్రమాదవశముననే గాని, బుద్ధిపూర్వకముగాను గాని అపరాధంబుల నొనర్చితిని, స్వామీ! క్షమింపవలయును అని భగవంతుని ప్రార్థించితే చాలును.

అని చెప్పియున్నట్లు క్షమాపణముఁ గోరుకొనుట యావశ్యకము.

శ్లో॥ ప్రాయశ్చిత్తాంతరాశక్తః కాలక్షేపాక్షమోపివా ।
పునః ప్రపద్యతే వాథ మభిందన్ లోకసంగ్రహం॥

తా॥ వేఱొక్క ప్రాయశ్చిత్తముఁ జేసికొనుట కశక్తుండైనట్టివాఁడు కాని, పశ్చాత్కాలక్షేపము నొనర్చుటకు శక్తిలేని వాఁడు కాని, లోకసంగ్రహార్థము మరల ప్రపత్తిని చేయుచున్నాడు.

అనియును చెప్పియున్నది. ముముక్షువులైనందున బుద్ధిపూర్వకముగ అపరాధంబుల నొరన్పరని చెప్పినదియును 'విద్యతే బ్రాహ్మణేనమః'' (బ్రాహ్మణునికి ఇంద్రియ నిగ్రహము కలదు) అని చెప్పినట్లు ఔచిత్యముఁబట్టి చెప్పినమాట. ఇంతియే. ముముక్షువులైనట్టివారే బుద్ధిపూర్వకముగ అపరాధంబుల నొనర్చి, పరిహారములఁ జేసికొనినట్లు, మహర్షుల విషయమునను ఋషులవంటి వారి విషయమునను పూర్తిగాఁ జూచియున్నాము కదా? అట్లుకామన్న, ఉపాసకులును ముముక్షువులగుటంజేసి, వారును ఆగామికాలమున బుద్ధిపూర్వకముగ

ఱవగాఢంబుల నొనర్చుట యసంభవము గాన, వారికి ఆగా
మి కర్మఫలము లంటవని శ్రుతియందుఁ జెప్పనది. వారు ప్రా
మాదికముగా నొనర్చినట్టి కర్మముల విషయమై చెప్పనది కా
వలసివచ్చును. అట్లగునేని, బుద్ధిపూర్వకముగా నొనర్చినట్టి
యాగామి కర్మములు క్షమింప సాధ్యములు కావని యిట్టి
యొక నియమమును చేసియుండక పోవలసివచ్చును.

ఉపాసకుని॥చ్ని, ప్రపన్నుని గుఱించి వర్ణ, ఆశ్రమ, జా
తి, గోత్ర, ప్రవర, చరణ, కుల, దేశ, కాల, అవస్థా, గుణ,
ఆచారాదులను నిమిత్తీకరించుకొని, చెప్పియున్నట్టి నిషిద్ధాను
ష్ఠానములలో స్ఖాలిత్యము కలిగినను, విశేషమెట్లయనుచో కు
ఒకవేళ నిషిద్ధానుష్ఠానము తటస్థించి నట్లయిన, ప్రాయ
శ్చిత్తము అధికారాను గుణముగా నుండునది యగుటం
జేసి, భేదము కలదు. ‹‹ ఎన్నడి యారను శెయ్యార్,
శెయ్ తారేల్ నన్రుశెయ్ తార్'' (నాదాసులు అపరాధముల
నొనర్చరు, ఒకవేళ ఒనర్చినను, నాకది యిష్టమే) అని చెప్పిన
దియును,అపరాధంబులు తటస్థింప వచ్చుననుటకు సూచకము.
ఈతావున ‹‹ శెయిదారేల్ నన్రుశెయ్ తార్'' (ఒకవేళ చేసిన
ను, నాకది యిష్టమే) అనఁగా ‹‹ప్రామాదికముగ అపరాధ
ములఁ జేసినట్లయిన, మేము వాటిని క్షమింపఁ గలము. బుద్ధి
పూర్వకముగా నొనర్చి నట్లయిన, వారు క్షమాపణముఁగోరు
కొనకపోయినను, శిక్షావిశేషంబులచే మేమేవాటినిశమింపఁజే
సెదము. ఎవ్విధమునను మాదాసులను మేము విడనాడము'' అని
యభిప్రాయము. చేసినపని బాగుగా లేనప్పుడు దానిఁజూచిన
వారు‹‹చాలాబాగావున్నది'' అనిపరిహాసించి చెప్పినతావునందు

వలెనే ప్రకృతమునను "నాకది యిష్టమే" అని చెప్పినప్పుడే
వారు చేసినది వాస్తవమునకు మంచిదికాదని సూచితమగుచు
న్నది. మరియు "అపాయసంప్లవే సద్యః ప్రాయశ్చిత్తంసమా
చరేత్ ప్రాయశ్చిత్తిరియం సాత్ర యత్పునశ్శరణంప్రజేత్"
(అపరాధములు తటస్థించినప్పుడు వెంటనే ప్రాయశ్చిత్తము
నాచరింప వలసినది అందులకు తగు ప్రాయశ్చిత్తము మరల
శరణాగతినొనర్చుటయే) అని చెప్పియున్నందునను, బుద్ధిపూ
ర్వకముగ ఈతండు అపరాధంబుల నొనర్చినప్పుడు, సర్వేశ్వ
రుని మనస్సుకు కష్టము కలుగదని చెప్పకూడదు. సర్వశక్తుం
డగు వాని మనస్సుకు కష్టము కలిగినప్పుడు, క్షమాపణముం
గోరుకొనక పోయినట్లయిన, ఫలము కలుగదనియును చెప్పం
దగదు. అందువలన ఈశ్వరునకు మనయెడల ప్రీతి కలుగదు
ఇంతియే కదా! యంటివేని, అందువలన నీతనికి యెవ్విధమై
న విపత్తున్ను సంభవింపనియెడల, యీతండుపునఃపవిత్రరూప
మగుప్రాయశిత్తముం జేసికొననక్కఱలేదు. అందుచేతనకున్న
వానివిషయమున ప్రీతికలుగదింతియేయంటివేని, అందువలనను
విపత్తుసంభవించుటసిద్ధము. అందులోను, గడచినదానికిగాను ప్రా
యశ్చిత్తమును చేసికొననక్కఱలేకుండ, ఇకమీదనుఅనువర్తిం
చునట్టిప్రీత్యభావమునకుగాను ప్రాయశ్చిత్తమునుచేసికొనవలయు
నంటివేని, దీనివంటిదియే యదియును (గడచినదియును) గాన,
చాలావరకు శ్రుత్యాది సిద్ధంబులగు కష్టంబులు సంభవించు
నని భయపడినవాఁడై ప్రాయశ్చిత్తముం జేసికొనవలసియు
న్నది. కావున ఇట్టి కష్టములను ఈలోకమునను న్నప్పుడు భగ
వంతునియనుభవించుటకుగాను ఇంద్రియ సౌఖ్యము లేకపోవుట

యు, జ్ఞానసంకోచమును, దుఃఖాదులును, వీటి మూలముగఁ
గలుగునట్టి విచ్ఛేద సంకోచములును, నియతా యుర్ద్దాయవం
తులు కానివారికి ఆయుర్వృద్ధిచే మోక్షము గలుగుటలో నాల
స్యమున్నఇవిప్రవర్తింపకుండుటకుగానున్న పునఃప్రపత్తినిచేఁయు
నది. పునఃప్రపత్తి యక్కఱలేదను వారి మతమునను, నిషిద్ధా
ములనుక్షమింపవలసినదితప్ప నిసరిగాన, ఇదియును క్షమకుగాను
ఏర్పడినదై నందునను దీనినొనర్పుటయే యుచితము.

బుద్ధిపూర్వకముగా నొనర్పఁబోవునట్టి యాగామిపాపక
ర్మముకుగానును ముందుగానే ప్రపత్తి చేయకూడదనియు
ను, మునుపు కోరియున్నట్టి ఫలమునకు తప్ప, ఫలాంతరము
కుగాను పునః ప్రపత్తిని చేయుటలో విరోధము లేదనియును
ఇంతకుముందే సమర్థించి యున్నాము. ఇవ్విధముననే భగ
వదాజ్ఞా సిద్ధంబగు సదాచారమును పాలించుటలోనను
విరోధము లేకుండుటను తెలిసికొనునది.

శ్లో॥ ప్రపన్నస్య నిషిద్ధైరప్యలేశ ముపపాదయన్।
యథాభిమత సద్వృత్తినిష్ఠేభ్యః కిమసూయతి॥

తా॥ ప్రసన్నుండు శాస్త్రనిషిద్ధంబు లయినట్టి వాటిని
అనుష్ఠించినను, వాటితో ఈతనికి సంబంధము లేదని యుప
పాదించునప్పుడు, వారివారి యిష్టప్రకారము సద్వృత్తిలోను
న్నట్టి వారినిజూచి యేల యసూయ పడవలయును ?

శ్లో॥ ఆజ్ఞాతిలంఘనే యస్య రక్షకత్వం నభజ్యతే।
ఆజ్ఞానుపాలనే తస్య కథం తదుపరుధ్యతే॥

తా॥ భగవంతుని యాజ్ఞను అతిక్రమించి ప్రవర్తించు
నట్టి వారినిన్ని భగవంతుఁడు రక్షించునప్పుడు. వానియాజ్ఞ

ప్రకారము ప్రవర్తింపనట్టి వారిని వాడు రక్షించుటలో కొదవ యేమున్నది ?

శ్లో॥ నచాచారం వినాకి చిత్ కైంకర్య ముపపద్యతే ।
నహిశౌచ మకృత్వైవ సమారాధన మర్హతి ॥

తా॥ ఆచారము లేకుండ ఎట్టి కైంకర్యమున్ను సంభవము కాదు. శౌచము చేసికొనకుండ, తిరువారాధనమొనర్చుట కర్హుండగునా ?

శ్లో॥ ఆచారప్రభవోధర్మః ధర్మస్య ప్రభురచ్యుతః ।
ఇతిపంచమ వేదేపి సర్వశాస్త్రేర్ష ఈరితః ॥

తా॥ ఆచారమువలన ధర్మము ఉత్పన్నమగుచున్నది. ధర్మముకు ప్రభువు నారాయణుండు, ఈ విషయము శ్రీమహాభారతమునందును చెప్పబడినది.

శ్లో॥ ప్రపత్తి ప్రతిసంధాన మాప్తై ర్యదుపదిశ్యతే ।
తత్స్వాధికారనియత హానోపాదానసిద్ధయే॥

తా॥ ఆప్తులగు ఆచార్యులు దేనిని ప్రపత్తివిషయమగుజ్ఞానముగాను ఉపదేశించుదురో, అది తనతని యధికారానుగుణములగు త్యాజ్యోపాదేయంబులు సిద్ధించుటకుగానని యెఱుంగునది.

శ్లో॥ ప్రతిసంధానతోహ్యస్య దధీపూర్వేష్వ లేపధీః ।
బుద్ధి పూర్వేష్వపి పునః ప్రపత్తేరేవ సంగ్రహః ॥

తా॥ ఇట్టి జ్ఞానమును బట్టియే అబుద్ధి పూర్వకాపచారములు తనకు నంటవనెడి జ్ఞానము కలుగుచున్నది. బుద్ధిపూర్వకములగు అపచారముల విషయముననో, ప్రపత్తియే సమాసాధనము.

శ్లో॥ అతోఽనపరాధేన ప్రపత్తవ్యం కృతాత్మనా।
అపరాధ ప్రసంగేచ పునః ప్రపదనం క్షమం॥

తా॥ కావున బుద్ధిమంతుండైనట్టివాడు అపరాధముల నొనర్పకుండుటయే మేలు. అపరాధములు తటస్థించినట్లయిన, మరల ప్రపత్తిని చేయుటయే తగినది.

అని యివ్విధముగ చెప్పఁబడినది,

మొట్టమొదటనే నిరపరాధిగా నుండఁగలయునని కోరి ప్రపత్తిచేసియున్నట్టివానికిన్ని, అందులకుగాను తరువాత పునః ప్రపత్తి చేసినట్టి వానికిన్ని, ఉత్తరకృత్యము నిరపరాధమైనదిగానేయుండ గలదు.

ఇతిహాసపురాణముల వలనఁ దెలియనచ్చునట్టి కొన్ని వృత్తాంతములనుమాత్రము ఆధారముగ గొని, శాస్త్రవచనములతోఁ గల విరోధమునంత గమనింపక, భాగవతులందు బుద్ధిపూర్వకముగా నొనర్చియున్నట్టి యపరాధములు క్షమింపవలసినవి యని కొందఱు వాదించుచున్నారు. ఈవాదమున్ను ఆయాప్రకరణములయొక్క యభిప్రాయమును బాగుగా గుర్తెఱుంగక చేయబడినది. ఎట్లనిన, తానుపెట్టినట్టి గడువునుతప్పినంతమాత్రమున సుగ్రీవుండొనర్చినట్టిఅపరాధము శ్రీరామచంద్రునిమనస్సుకు తట్టగా నతండు దుఃఖపడినవాఁడై, "నచసంకుచితః పంథాః యేన వాలీహతో గతః సమయే తిష్ఠ సుగ్రీవ మావాలిపథమన్వగాః" (వాలిహతుఁడై యేమార్గమున పోయినాఁడో అది యింకను ధారాళముగానేయున్నది. ఓసుగ్రీవుఁడా! నీవుపెట్టినగడువుప్రకారముప్రవర్తింపుము. వాలిపోయినమార్గమునఁబోకుము) అనిచెప్పఁగా విని శ్రీలక్ష్మణస్వామివారు

శ్రీరామ చంద్రుండే స్వయముగ క్షమాపణముఁ గోరు
కొనవలసి నట్లు కోపగించు కొని, కిష్కింధా పట్టణమునకు
పోఁగా, "కృతాపరాధస్యహితే నాన్యత్పశ్యా మ్యహం
క్షమం । అంతరేణాం జలింబధ్వా లక్ష్మణస్య ప్రసాద
నాత్" (నీవు అపరాధపడియున్నావు అంజలి బద్ధుండవై శ్రీల
క్ష్మణస్వామి వారిని బ్రతిమాలికొనుట కంటెనున్న వేఱొక్క
యుపాయములేదు) అని శ్రీయాంజనేయులవారు సుగ్రీవునికుపదే
శించినారుకదా? అట్టిసమయమున సుగ్రీవుండున్న దానినిఒప్పు
కొని "యదికించిదతిక్రాంతం విశ్వాసాత్ప్రణయేనవా। ప్రేష్యస్య
క్షమితవ్యం మే నకశ్చిన్నాపరాధ్యతి" (విశ్వాసము వలనఁగాని
ప్రీతివలనఁగాని నేను యెవ్విధముగానైనను అతిక్రమించి ప్రవ
ర్తించి యున్నటయిన, దాసుండ నగు నన్ను దేవరవారు క్ష
మింపఁగోరెదను. లోకమున సామాన్యముగ అపచారపడని
వాఁ డెవ్వండు నుండడు.) అని విన్నవించుకొనవలసివచ్చెను.
ఆమాటను వినగానే, శ్రీలక్ష్మణస్వామివారును తాముకొంచ
ము హెచ్చుతక్కువగా మాట్లాడినట్టిమాటలకుగాను. "యచ్చ
శోకాభిభూతస్య శ్రుత్వారామస్య భాషితం। మయాత్వంపరుషా
ణ్యుక్తః తచ్చత్వంక్షంతు మర్హసి" (ఓసుగ్రీవా! దుఃఖితుండైన
నట్టి శ్రీరామచంద్రుని వార్తలను విని నీతో నేను పరుషము
గా మాట్లాడినదానికై నన్ను క్షమింపఁ గోరుచున్నాడను) అ
ని యివ్విధముగ క్షమాపణమును కోరుకొనవలసి వచ్చెను.

ఇవ్విధముగ ప్రపన్నునికిన్ని ప్రారబ్ధకర్మ భేదంబుల
మూలముగ బుద్ధి పూర్వకమగు అపరాధము తటస్థించుట
సంభవము. అది తటస్థించినట్లయిన, పశ్చాత్తాపపడి, క్షమాప

ణముఁ గోరుకొనవలయును. *“నధర్మనిష్ఠోస్మి” అనియు “కులి త్తు మూన్ఱనలై యోమ్బుమ్ కుఱికొళ్ అన్దణ్మై తన్నై యొళిత్తిట్టేన్” (బ్రాహ్మముహూర్తమున నిద్రలేచి స్నానముచేసి యొనర్పఁబడు త్రేతాగ్నిహోమరూపము లగు బ్రాహ్మణకృత్యములను సలుపఁ జేసినాఁడను) ఈ మొదలగునవి యన్నియును కర్మయోగాదుల ననుష్ఠించుటలో శక్తిలేక పోయినదని విన్నవించుకొనుట మాత్రమే కాని, యథాశక్తి భగవదాజ్ఞను అతిక్రమించి ప్రవర్తింప వలయునని చెప్పియుండుట కాదు. కావున ప్రపన్నుఁడును, బ్రాహ్మణ్యాది విశిష్టంబగు ఈశరీరమును విడనాడువరకును (యావజ్జీవము), ఆయా వర్ణాశ్రమములకుఁ దగినట్లు భగవదాజ్ఞను (శాస్త్రమును) అనువర్తించుచునే ప్రవర్తింప వలసినది

శ్లో॥ ఆహారగ్రహ, మంత్రార్థ జాత్యాది నియమైర్యుతః।
కుర్యాల్లక్ష్మీశ కైంకర్యం । శక్త్యాచన్యప్రయోజనః ॥

---

* శ్లో॥ నధర్మనిష్ఠోస్మి నచాత్మవేదీ నభక్తిమాం స్త్వచ్చరణారవిన్దే
అకిఞ్చనోనన్యగతిశ్శరణ్య త్వత్పాదమూలంశరణంప్రపద్యే॥

తా॥ ఏవరికని స్వాశక్తిఁగొని యాశ్రయింపఁదగిన విషయముగావు. ఆకించన్యమును ముందుంచుకొని యాశ్రయింపఁదగినవాఁడవు కావున నేను కొన్ని సత్కార్యములుగలవాఁడనై యుంటినేని తనకు కావలసినవి తానే చేసికొనుచున్నాఁడని నీవు విడువవచ్చును. అట్టి సత్కార్యములనొకటియు లేనివాఁడనై భగవదనార్హశేషభూతాత్మస్వరూపజ్ఞానము లేనివాఁడనై నిరతిశయభోగ్యమయిన దేవరవారి శ్రీపాదములందు భక్తిలేనివాఁడనై స్వరూపయాథాత్మ్యజ్ఞాన సంపత్తిలేనందున దరిద్రుఁడనైనను వరణీయమైన రక్షకాంతరములేనందున నిరుపాధిక సర్వశేషియైన దేవరవారి శ్రీపాదములనే విరోధినివృత్తిపూర్వకమైన కైంకర్యసిద్ధికి నుపాయముగా నిన్ను బొందుచున్నాను.

తా॥ ఆచార, కృపా, మంత్రార్థ, జాత్యాది నియమం బుల కనుగుణముగ ప్రవర్తించునట్టివాఁడు, అనన్యప్రయో జనుండై భగవంతుని కైంకర్యము నొనర్చునది.

శ్లో॥ ఆచారాత్మ గుణోపాయ పురుషార్థ విశేషతః ।
అధికారిణి శిష్యం ప్రకృష్యేతోత్తరోత్తరం ॥

తా ॥ ఆచారము, శమదమాద్యాత్మ గుణములు, ఉపాయానుష్ఠానము, పురుషార్థము, వీటి మూలముగ అధికారి యందు ప్రకర్షను ఉత్తరోత్తరము వృద్ధిపఱచునది.

ఇట్టి ప్రభావ నియమమును రహస్య త్రయమునందు సర్వేశ్వరుని ప్రశాసితృత్వాది గుణములతోఁ బాటు అను సంధించుకొనునది.

శ్లో॥ తకవాల్ తరిక్కొన్ఱడియార్ కళై తన్ని ఱత్తిల్ ।
మికవాతరమ్ శెయ్యుమెయ్యరుళ్ విత్తకన్ మెయ్యురైయిన్
అకవాయఱిన్దనరాణ నీతినెఱికులైతల్ ।
ఉకవారెన వెఙ్గళ్ దేశికరుణ్ మైయురైత్తనరే ॥

టీ॥ తకవాల్ = భగవత్కృపచేత, తరిక్కొన్ఱ = సత్తను లభించిన వారగు, తన్నడియార్ కళై = తనదాసులను, తన్నిఱత్తిల్ = స్వామిత్వముకంటె, మికవు = అధికముగా, ఆతరమ్ = ఆదరణను, శెయ్యుమ్ = చేయునట్టి, మెయ్యరుళ్ విత్తకన్ = తప్పక ఫలమునిచ్చునట్టి కృపచే విస్మయనీయుండైనట్టి భగవంతునియొక్క, మెయ్యురైయిన్ = సత్యవాక్యమగు చరమశ్లోకముయొక్క, అకవాయఱిన్దనర్ = తాత్పర్యమును బాగుగా గుర్తెఱింగియున్నట్టివారు, ఆరణనీతినెఱికులైతల్ = అరణ్యకము అయందుఁ జెప్పియున్నట్టి మోక్షమార్గమును చెడగొట్టుటను, ఉకవార్ = ఒప్పుకొనరని, ఎంగళ్ = మాయొక్క, తేశికర్ = ఆచార్యులు, ఉణ్మై = తత్త్వమును, ఉరైత్తనరే = సాధించియున్నారు.

తా॥ భగవద్వాక్యమగు చరమశ్లోకముయొక్క యర్థమును బాగుగాఁ దెలిసికొనియున్నట్టివారు వేదాంత ప్రతిపాద్యంబగు మోక్షమార్గమును గొడగొట్టుట కొప్పుకొనరని మాయాచార్యులు మాకు సత్యమైనట్టి యర్థమును ఉపదేశించినవారు ఋరి.

శ్లో॥ చాతుర్వర్ణ్య చతుర్విధాశ్రమముఖభేదే యథావస్థితే।
వృత్తం తన్నియతం గుణానుగుణయా వృత్త్యా విశిష్టం శ్రితాః ॥
త్యాగోపప్లవనిత్యదూర శరణప్రజ్యావిధౌ కోవిదాః।
చ్చింతామభ్యుపగంతుమంతిమయుగే ప్యేకాంతినస్సంతినః ॥

టి ॥ చాతుర్వర్ణ్య = బ్రహ్మక్షత్రియాది నాల్గు వర్ణములనియు, చతుర్విధాశ్రమముఖే = బ్రహ్మచర్యాది నాల్గు ఆశ్రమములనియు నివ్విధమగు, భేదే = భేదము, యథావస్థితే = ఉండియుండఁగా, తన్నియతం = జాత్యాదినియతంబగు, వృత్తం = ధర్మమును, గుణానుగుణయా = గుణానుగుణంబగు, వృత్త్యా = కైంకర్యవృత్తిచేత, విశిష్టం = పెరుమాళ్లనున్న పిరాట్టినిన్ని ఉభయులను, శ్రితాః = ఆశ్రయించియున్నట్టివారును, త్యాగోపప్లవనిత్యదూర = స్వరూప త్యాగరూపంబగు ఉపద్రవమెంతమాత్రము లేనిదియగు, శరణప్రజ్యావిధౌ = శరణాగతిశాస్త్రమునందు, (చరమశ్లోకార్థమునందు) కోవిదాః = మర్మజ్ఞులైనట్టివారును, ఏకాంతినః = ఏకాంతులయినట్టివారు, నః = మాయొక్క, చింతాం = స్మరణకు, అభ్యుపగంతుం = వచ్చుటకుగాను, సంతి = కలరు.

తా॥ కలియుగంబైనను, యిక్కాలమునను, వర్ణాశ్రమధర్మనిష్ఠులై భగవత్కైంకర్యపరులయినట్టివారును, చరమశ్లోకార్థమును బాగుగాఁ దెలిసియున్నట్టి పరమైకాంతులు కొందరు కలరు.

ప్రభావవ్యవస్థాధికారము ముగిసెను.



శ్రీమతే నిగమాన్తమహాదేశికాయనమః.

    

# రహస్యత్రయసారము



## ప్రభావ రక్షాధికారము

శ్లో॥ శిలాదేః స్త్రీత్వాదిర్విపరిణతిరస్త్వద్భుతమిదం ।
తతో ప్యేతచ్చిత్రం యదుతదహనస్యైవహిమతా ।
తృణస్యైవాస్త్రత్వం రిపుషు నిహతే రేవ హితతా ।
పదత్రేణైవేహ త్రిభువన పరిత్రాణమితిచ ॥

టీ॥ శిలాదేః = రాయి, స్త్రీత్వాదిః = స్త్రీరూపము గాను, విపరిణతిః = పరిణమించుటయనెడి, ఇదం = ఇది, అద్భుతం = ఆశ్చర్యము, అస్తు = అవుగాక, దహనస్యైవ = (ప్రహ్లాదునివిషయమున ప్రయోగింపబడినట్టి) యగ్నియే, హిమతా = మంచుగడ్డవలె చల్లనిదియగుటయును, తృణస్యైవ = (కాకాసురునివైపుకు వేసినట్టి) తృణము, అస్త్రత్వం = అస్త్రంబగుటయును, రిపుషు = శత్రువులను, నిహతేరేవ = హింసించుటయే, హితతా = హితంబగుటయును, ఇహ = ఈలోకమున, పదత్రేణ = పదత్రయముచే కొలుచుటచె, త్రిభువనపరిత్రాణం = మూడులోకములను రక్షించుటయును, యత్ = ఏది కలదో, ఏతత్ = ఇది, తతోపి = దానికంటెను, చిత్రం = మిక్కిలి విచిత్రంబైనది.

తా॥ రాయిగాపడియున్నట్టి అహల్యను స్త్రీగాఁజేయుటయుండుగాక! ప్రహ్లాదునివిషయమున అగ్నిని మంచుగడ్డవలెనే చల్లనిదానినిగా జేసినట్టి

వాడును కాకాసురునిపైఁ జేసినతృణమును బ్రహ్మాస్త్రమునుగాఁ జేసిన
వాఁడును, తనకువిరోధులై తనచే హింసింపఁబడినట్టివారికి సద్గతి నొసంగి
నట్టివాఁడును త్రివిక్రమావతారమున ఈలోకమును గొలుచుటచే మూఁడు
లోకములనున్ను రక్షించినట్టి అఘటితఘటనాసమర్థుండగు భగవంతుని
కశక్యంబేమున్నది.

ఉపాయ ప్రభావవ్యవస్థను గుఱించి చెప్పియున్నాము.
ఉపాయ ప్రభావమును గుఱించి బాగుగాఁ దెలిసికొనియుం
డక పోవుటచే రాఁగల యాక్షేపములను పరిహరించెదము.
"అత్యుత్కటైః పుణ్యపాపైరిహైవ ఫలమశ్నుతే" (అతి తీవ్ర
ములగు పుణ్యపాపముల ఫలంబులను ఇచ్చటనే యనుభవించు
చున్నాఁడు.) అని చెప్పియున్నట్టి విధమున, "ఉపాయభక్తిః
ప్రారబ్ధ వ్యతిరిక్తాఘ నాశినీ సాధ్యభక్తిస్తు సాహంత్రీ ప్రారబ్ధ
స్యాపి భూయసీ" (ఉపాయరూపమగు భక్తి ప్రారబ్ధేతరంబుల
గు పాపకర్మంబులను నశింపఁ జేయునది. సాధ్యభక్తియన్ననో
ప్రారబ్ధమునున్ను నశింపఁజేయునదియగుటచే గొప్పది) అని
చెప్పియున్నందున, ప్రారబ్ధకర్మములనుసయితముఅణఁగద్రొక్కి
తనఫలమునున్ను ఒసంగునట్టిదియగుప్రపత్తినొనర్చినట్టివానికి,
తక్కిన విద్యల ననుష్ఠించినవారికి వలెనే, సంచితాగామికర్మం
బులును, ఈవిద్యకుఁ (ప్రపత్తికిఁ) గల యాధిక్యమువలన ప్రార
బ్ధకర్మము నిమిత్తమునఁ గలుగునట్టి యార్తి కవధిభూత
మగు క్షణాంతర, దివసాంతర, జన్మాంతరాద్యనువృత్తియును
ఇవి నివర్తింపఁగలవని "మాశుచః" అను వాక్యముయొక్క య
భిప్రాయము. ఈ యర్థము వాస్తవంబై నట్లయిన ప్రారబ్ధ కర్మ
ఫలముగాను తటస్థించునట్టి దుఃఖంబులును, దుఃఖకారణంబు

లగు కర్మంబుల నార్జించుటయును, ఇవి లేకపోవద్దా? అర్థాం
డై యీ పురుషుండు యాచింపంగా, ఈయవలసినవి యంటి
వేసి, ఆనుషంగికములగు పంక్తి పావనత్వాదుల వలెనే ఈ
తండు కోరియుండని వాటివిచ్చి, హితైషియగు సర్వేశ్వరుండు
తానే స్వయముగ ఈయఁగలడు అయితే ఇవ్విధముగ చేసియు
న్నట్లు చూచియుండక పోవుటం జేసి, శోకవిషయమగు అంశ
మంతయును ప్రపత్తిచే నిశ్శేషముగాను పోగొట్టబడుననెడి విష
యము। ప్రపత్తియొక్క ప్రభావము స్తుతించుటకు మాత్రము
చెప్పినది యనికొందఱు దీనియొక్క ప్రభావమును విమర్శించు
చున్నారు.

ఇందులకు సమాధాన మేమనఁగా—అనుగ్రహశీలుం
డును, ఆశ్రితులు ప్రపత్తి వాక్యము నుచ్చరించుట కారంభిం
చినప్పుడే, శీఘ్రముగ మోక్షము నిచ్చుటకై త్వరపడునట్టివాఁ
డునగు సర్వేశ్వరుండు ఈతనియిష్టముచొప్పుననీతనినికొంతకాల
మిచ్చటనే యుంచుట కిష్టపడినప్పుడు, ఈతండు ఈలోకమునఁ
గల యల్పభోగములుదుఃఖావహంబులని తలంపకవాటిననుభ
వించుచున్నట్లయిన, ఈతనికి ఈ భోగములయెడలఁగల రుచి
యెన్నటికినిపోఁజాలదు సరియేకదా భగవదనుభవము భోగ్యం
బనెడి బుద్ధియును పెంపొందదు. కావున "యస్యానుగ్రహ మి
చ్ఛామి తస్య విత్తం హరామ్యహం బాంధవైశ్చ వియోగేన
సదాభవతి దుఃఖితః। తేదుఃఖేన సంతప్తో యదిమాం నపరి
త్యజేత్। తంప్రసాదం కరిష్యామి యస్సురైరపి దుర్లభః"
(ఎవ్వనిని నేను అనుగ్రహింపఁ దలంచుచున్నానో, వానిద్రవ్య
మును అపహరించుచున్నాను, వాడు బంధు వియోగాదుల

మూలముగ మిక్కిలి దుఃఖితుండు కాఁగలఁడు. అట్టి దుఃఖము చే కష్టపడుచున్నవానిని విడనాడకుండెనేని, దేవతలకు సయితము దుర్లభంబైనట్టి యనుగ్రహమును వానియెడలఁజూపగలఁడు) అని చెప్పియున్నట్లు, దుఃఖాదులకుఁ గారణభూతంబగు ప్రారబ్ధకర్మమును చేతిలోనుండు బెత్తమును వలెనే సహాయకమునుగాఁ గొని, తల్లితండ్రులవలెనే శిక్షకుండగు సర్వేశ్వరుండు కఠిన స్వభావులగు కొందఱి విషయమున నొసర్చునట్టి యనుగ్రహ విశేషం బిట్టిదియని యాతు సంధించుకొనుట యుచితము. ఒక దినమున, ఒకరాజు భట్టరువారి సన్నిధికి వెళ్లివ్యాధియనునదియును ఒక్కటికలదా? యని విన్నవింపఁగా, వారున్ను ఒక యుపాధ్యాయులు (శిక్షకులు) కలరని భట్టరువారు సాయించినారు. ఆయుస్సును వృద్ధిపఱచుకొనుటకు వీలు లేకుండునట్లు నియతాయుర్దాయవంతుండైనట్టి వానిమనస్సునందు ఆతురత గలుగుటకుగానును, నియతముకానట్టి యాయుర్దాయము కలవారు ఆయుష్కామీష్ట్యాది క్రతువులఁగొని యాయుర్దాయమును వృద్ధిపఱచుకొనుటకై తలంపకుండుటకు గానును దుఃఖాదులు ఈతనికి ఉపాధ్యాయులు (శిక్షకులు)గా నెన్నఁబడుచున్నవి. ఈ విషయము శ్రీ కూరత్తాళ్వారులు మొదలగు వారి యనుష్ఠానములయందు ప్రసిద్ధముగాఁ దెలియఁగలదు. అపచారంబులనున్ను వాటిఫలంబులనున్ను కొందఱికిఁ జూపించి మరుగుపెట్టుటయును « పామ్బోడొరు కూరైయిలే పయిన్ఱాఱ్పోలేతాంకాదుళ్ళమ్ఎతుళ్ళుమెన్ఱామాఱైక్కణ్ణా » (పాముతోఁగూడ ఒక్కతావున నున్నట్టి వానిమనస్సువలెనే నామనస్సున్ను స్థైర్యమును పొందకయున్నది. ఓ నాపుండరీ

కాకుండా !) అన్నట్లు వైరాగ్యపూర్తిని శీఘ్రముగాఁగలుగఁ జేసి, తాను ఇష్టపడియున్నట్టి సంసార నివృత్తిని శీఘ్రముగా సీతనిన్ని ఇష్టపడునట్లుచేయుటకుగాను మాత్రమే యని యెఱుం గునది. ఈ సందర్భమున ప్రతికూలంబులు అనుభవమునకు వచ్చుట యనునది ముందొనర్చి యున్నట్టి దుష్కర్మముల ఫలము. దీనిచే నతని కొక విధమైనట్టి శిక్ష నొసంగు టయును, ప్రాయశ్చిత్తముఁ జేసుకొను విషయమున నుద్యుక్తునిగాఁ జేయుటయును ఉపాయఫలము. వీటిలో శిక్షణాదులు ప్రారబ్ధ సుకృత ఫలముగానును సంప్రాపింపఁ గలవు. ప్రాణములను రక్షింపుమని కాళ్ళమీద పడినట్టి కాకాసురునికి ప్రాణముల నొసంగినందున నావిషయమునను ప్రపత్తిఫలము సంపూర్ణముగాఁ గలదు. గుర్వపరాధుండగు ఈ కాకాసురునికి శిక్షగాను ఒక కంటిని పోగొట్టి విడిచిపెట్టినదియును భగవన్నిగ్రహము కాదు, అదియును ఒకవిధమైన యనుగ్రహమే. కావున క్షణమాత్రములో నొనర్చినట్టి పాప కర్మంబుల ప్రభావం బగు భగవన్నిగ్రహమును శాశ్వతముగా నరకములోఁ బడి యుండునట్లుచేయునట్టిదిగాను ఒప్పికొనియున్నట్టిచందంబునను,

శ్లో॥ దుర్గసంసార కాంతార మపారమభిధావతాం ।
ఏకః కృష్ణ నమస్కారో ముక్తితీరస్య దేశికః ॥

తా॥ అపారంబును, దుర్గమంబు నగు సంసార సముద్రమునఁగొట్టుకొని పోవునట్టివారికి ఒక్కతూరి కృష్ణా! యనినమస్కరించుటమాత్రము ముక్తిరూపమగుతీరము నొసంగఁగలదు.

శ్లో॥ ఏకోపి కృష్ణే సుకృతః ప్రణామో ।
దశాశ్వమేధావభృథేన తుల్యః ।

దశాశ్వమేధీ పునరేతి జన్మ।
కృష్ణప్రణామీ న పునర్భవాయ॥

తా॥ శ్రీకృష్ణుని యొక్కసారి నమస్కరించుట యనునది నూఱు అశ్వమేధ యాగముల నొనర్చి, నూఱు అవభృథస్నానములఁ జేసి యుండుటతో సమానము. అయితే నూఱు అశ్వమేధయాగముల నొనర్చినట్టి వానికిన్ని (తత్పుణ్యఫలానుభవముకుగాను) పునర్జన్మము కలదు శ్రీకృష్ణునికి నమస్కరించినట్టివాడన్ననో మరల జన్మింపడు.

అని యివ్విధముగ సుకృతంబగు నమస్కారముయొక్క ప్రభావమును ఒప్పుకొని యున్నట్లును, "సకృదేవ ప్రపన్నాయ" అనియు "అఘపాతక భీత స్త్వం" అనియు "కుయోనిష్వపి సంజాతో యస్స కృచ్ఛరణం గతః" అనియును ఈ మొదలగు తావులఁ జెప్పియున్నట్లు, ప్రపత్తియొక్క ప్రభావమునున్ను, శాస్త్రోక్తముతో విరోధము ప్రసక్తింపనట్టి విషయమున సంకోచింపక అను సంధానము చేయుట యావశ్యకము. "తంమాతాపితృ హంతారమపిపాతి భవార్తిహా" (మాతాపితృ హింసకుండైనను ప్రపన్నుండైనట్టివానిని భగవంతుండు రక్షించుచున్నా(డు) అని చెప్పినదియును ఆగామి పాపకర్మము విషయమైనది కాక పోయినచో, బాధకము లేదు. ఆగామి పాపకర్మముల విషయమున నివృత్తిమార్గములను ముందే చెప్పియున్నాము. "శరణంచ ప్రపన్నానాం తవాస్మీతిచయాచతాం ప్రసాదం పితృహంతౄణా మపి కుర్వన్తి సాధవః" (నీవే రక్షకుండవని శరణు జొచ్చినట్టివారు మాతాపితృ హింసకులైనను, వారిని సత్పురుషు లయినట్టివారు కరుణించి రక్షింప

చున్నారు) ఈ మొదలగు నవియున్ను పైనిచెప్పిన ప్రకారము అర్థము చేసికొనినచో, పొసగి యుండగలవు.

మన సిద్ధాంతమునందు స్థిరముగా నున్నట్టివారై, ముముక్షువులై, కర్మజ్ఞానభక్తి ప్రపత్తులలో నెద్దియైన నొక శాస్త్రీయపద్ధతి నవలంబించుటచే భగవంతుని యెడల ప్రీతిగల వారై యుండువారికి, యతమాన సంజ్ఞాద్యవస్థలలో ద్రవ్యసంబంధ రూపములగు కొన్ని వ్యాధులు నిశ్శేషముగా శమింపక పోయినంతమాత్రమున వారిని సంసారులనువలెనే భావించి వారితో సంభాషింప కూడదని వైరాగ్యమును మాత్రమే ప్రధానముగాఁ దలంచునట్టివారు కొందఱు వాదించుచున్నారు. ఈ వాదమున్ను పాంచరాత్రాది సంహితలయందలి భిన్న వృత్త్యాది ప్రకరణములఁ గొని పరిహరింపఁదగినది.

"డంబిహైతుక పాషండి బకవృత్తీంశ్చ వర్జయేత్" (డంబాచారులను, పిడివాదులను, పాషండులను, వంచకులను విడనాడునది) అనియు, "యేతుంసామాన్యభావేన మన్యంతే పురుషోత్తమం। తేవైపాషండినోజ్ఞేయాః సర్వకర్మబహిష్కృతాః" (ఎవ్వారలు నారాయణుని దేవతాంతరములతోఁ బాటుసామాన్యునిగాఁ దలంచుదురో వారు పాషండులును సర్వకర్మ బహిష్కృతులును). అనియు "పుంసాం జటాభరణ మౌండ్యవతాం వృథైవ" (జడలు తాల్చుకొని యుండుటయు, బోడిచేసికొని యుండుటయునను యీ బాహ్యాలంకారములువ్యర్థములు) అనియు. ఈ మొదలగు తావులయందు తప్పుదారిన ప్రవర్తించునట్టి వారివిషయమై నన చెప్పినట్టిదానినిమించి మార్గమునఁ బ్రవర్తించుచు, కొంచము లోటుపడునట్టి వారివిషయమునను నన్ని చెప్ప

కూడదు కదా? భాగవతులలోను అంగలోప,అంగహీనతాదు లనుబట్టి వారియెడల ప్రవర్తించుటలో తారతమ్యము విధింపఁ బడి యున్నను, ఐకాంత్యము చెడిపోకుండ యున్నట్లయిన,తుట్ట తుదినియేదోరకదానిమూలముగ వారును ఈ సంసారమునుండి కడతేర గలరు. కావున నట్టివారి విషయమునను న్న అపచార పడకూడదని కదా శాస్త్రమునందు విధించి యున్నది.మఱియు ‟ నేహాభి క్రమనాశో స్తి ప్రత్యవాయోన విద్యతే స్వల్పమ ప్యస్య ధర్మస్య త్రాయతే మహతో భయాత్ ” ( అనుష్ఠిం చినదానికి ఎన్నటికిన్ని నాశము గలుగ నేరదు. అందుమూల ముగ నెవ్విధమైనట్టి యాపత్తున్ను రాజాలదు. దీనియొక్క స్వల్పాంశ మైనను గొప్పదియగు సంసార భయమునుండి రక్షింపఁ గలదు) అనియు ‟పార్థనైవేహ నాముత్ర వినాశ స్త స్య విద్యతే। నహికల్యాణకృత్కశ్చిత్ దుర్గతింతాతగచ్ఛతి” (ఈకర్మయోగము ననుష్ఠించి నట్టివానికి ఈలోకమునఁగాని, పరలోకమునఁగాని, వినాశము లేదు. మంచి కార్యము నొన ర్చినట్టివాఁ డెన్నటికిని దుర్గతిని బొందడు కదా) అనియును కర్మయోగముకే యిట్టిప్రభావ మున్నట్లు చెప్పియుండఁగా, భక్తి ప్రపత్తుల విషయమున నిఁక చెప్పవలసది యేమున్నది?

శ్లో॥ అపిచేత్సు దురాచారో భజతే మామనన్యభాక్ ।
సాధురేవ సమంతవ్య స్సమ్యగ్వ్యవసితోహిసః॥

తా॥ ఎక్కువ దురాచార వంతుండైనను, ఎవ్వండు నన్ను శరణు జొచ్చుచున్నాడో, అట్టివాఁడు సాధువుగాను మంచి యింద్రియ నిగ్రహము గలవాఁడుగాను నెన్నఁదగినట్టి వాడు.

శ్లో॥ అపిపాపే ష్వభిరతాః మద్భక్తాః పాండునందన।
ముచ్యన్తే తే తతస్సర్వైః పద్మపత్రమివాంభసా ॥

తా॥ పాపాత్ములయినను, నాకు భక్తులయినట్టివారు సర్వపాపముక్తులగుచున్నారు. పద్మపత్రమునకు ఉదకము అంటనట్లు వారిని పాపము అంటదు.

అని యివ్విధమైన సర్వేశ్వరుండే స్వయముగా అర్జునునికిన్ని, ధర్మరాజునకున్ను ఉపదేశించి యున్నాడు. అట్లే పుండరీక నారద సంవాదమునందును,

శ్లో॥ చీరవాసాః జటీ వాస్యాత్ త్రిదండీ ముండ ఏనవా।
భూషితో వాద్విజశ్రేష్ఠ నలింగం ధర్మకారణం॥

తా॥ చీరవస్త్రములను ధరించుకొని యుండుట కాని, జడలు తాల్చుకొని యుండుట కాని, త్రిదండమును ధరించి యుండుట కాని, మంచి యలంకారము చేసికొని యుండుట కాని, యిది యెద్దియును ధర్మానుష్ఠానపరుండగుటలో చిహ్నము కాజాలదు.

శ్లో॥ యేనృశంసా దురాత్మానః పాపాచారరతాస్సదా।
తేపి యాంతి పరంస్థానం నరా నారాయణాశ్రయాః॥

తా॥ పాపాత్ములుకాని, దుర్మార్గులు కాని, దురాచారపరులు కాని, వారు శ్రీమన్నారాయణునిశరణుజొచ్చినవారయినట్లయిన, పరమపదమును బొందుచున్నారు.

శ్లో॥ లిప్యంతే న పాపేన వైష్ణవా వీతకల్మషాః।
పునంతి సకలాన్ లోకాన్ సహస్రాంశురివోదితః॥

తా॥ నిర్మలులై, విష్ణుభక్తులై నట్టివారు పాపములతో

సంబంధించినవారు సాన్నిధ్యనివలెనే లోకమును పవిత్రము చేయుచున్నారు.

శ్లో॥ జన్మాంతర సహస్రేషు యస్యస్యాన్మతిరీదృశీ ।
దాసోఽహం వాసుదేవస్య సర్వాలోకాన్ సముద్ధరేత్ ॥

శ్లో॥ స యాతి విష్ణుసాలోక్యం పురుషో నాత్ర సంశయః ।
కిం పున స్తద్గత ప్రాణాః పురుషాః సంయతేంద్రియాః ॥

తా॥ వేలకొలది జన్మములుగా వాసుదేవునికి దాసుడ ననెడి బుద్ధి యెవ్వనికి కలుగునో, అట్టి పురుషుండు భగవంతునితో సాలోక్యమును బొందుచున్నాడు. విష్ణువునందు వారిపై ప్రాణములుంచిన ఇంద్రియ నిగ్రహము గలవారి విషయమున నింక చెప్పవలసిన దేమున్నది!

అని చెప్పియున్నట్లు భగవంతునియందు భక్తిగలవారు దోషము గలవారైనను, అధికారానుగుణమగు ప్రాయశ్చితముద్వారా మోక్షము గలుగుటలో సంశయము లేదనియును, నిర్దోషు లయినట్టి వారికి శీఘ్రముగా మోక్షము గలుగు విషయమున నింక చెప్పవలసిది లేదనియును తెలిపి,

శ్లో॥ అశ్వమేధశతై రిష్ట్వా వాజపేయశతైరపి।
న ప్రాప్నువంతి సుగతిం నారాయణ పరాఙ్ముఖాః॥

తా॥ నారాయణునికి పరాఙ్ముఖు లయినట్టివారు నూరులకొలది యశ్వమేధయాగముల నొనర్చినను, నూరుల కొలది వాజపేయయాగముల నొనర్చినను, సద్గతిని పొందజాలరు.

అని తావుర పరాఙ్ముఖు లయినట్టివారు అనంతములగు పుణ్యకార్యములు చేసినను సద్గతిని బొంద

జాలరని ఈ యర్థమును మహర్షి తెలిపి యున్నాడు, "యో హ్యేనం పురుషం వేద దేవా అపినతంపిదుః" (ఎవ్వండు భగవంతుని గుర్తెఱింగియున్నాడో, అట్టి పురుషుని నిత్యులున్న యెఱుంగరు) అని చెప్పియున్నందున భగవంతుని విషయమగు జ్ఞానము గలవానియొక్క ప్రభావము నిత్యసూరుల చేతనున్న యింతమాత్రం బని పరిచ్ఛేదింపం దగినట్టిది కాదు కదా! కావున, బుద్ధిపూర్వకములగు పూర్వపు దోషములు అనువర్తించుటచే భాగవతులకు కొన్నిదుర్వాదుక లున్నప్పటికిన్ని వారిని అవమానపరచ కూడదు. ఏలయనంగా,

శ్లో॥ అవైష్ణవ నమస్కారా దవమానాచ్చ కేశవే ।
వైష్ణవే పరివాదాచ్చ పతత్యేవ న సంశయః॥

తా॥ విష్ణుభక్తులు కానివారిని నమస్కరించుట చేతను, విష్ణుభక్తులను అవమానపఱచుట చేతను, వారిని నిందించుట చేతన్ను మనుజుండు నిస్సంశయముగ నరకముల పాలగును.

శ్లో॥ యతినిందాపరో నిత్యం వైష్ణవా నవమన్యతే ।
అధ్యాత్మ విముఖస్సోస్తు బిసస్తైన్యం కరోతియః॥

తా॥ యతులను నిందిచునట్టివాండును విష్ణుభక్తులను నిందించునట్టివాండును, భగవద్విముఖుండైనట్టివాండు బిసస్తైన్యము నొనర్చినట్టివాండు కాంగలడు.

శ్లో॥ అంతర్దుష్టో బహిః శాంతో బ్రహ్మవిద్వేష తత్పరః
కర్మనిందాపరస్సోస్తు బిసస్తైన్యం కరోతియః॥

తా॥ లోపల దుష్టుండై పైకి మాత్రము శాంతమూర్తిగా నుండువాండును, బ్రహ్మద్వేష పరుండును, కర్మయోగమును నిందించునట్టివాండును బిసస్తైన్యము నొనర్చునట్టివాండు.

శ్లో॥ నిత్యానుష్ఠాన సంసక్తా సద్భ్యాత్మజ్ఞాన దుర్బలాన్ ।
వ్యామోహయేత్తు దుర్బుద్ధిః బిసస్తైన్యం కరోతి యః॥

తా॥ నిత్యానుష్ఠాన పరులై బ్రహ్మవిషయం దంతజ్ఞానము లేనివారిని మోహింపఁ జేయునట్టివాఁడు దుష్టుండు. వాఁడు బిసస్తైన్యము గావర్చునట్టివాఁడు.

అనియును శాస్త్రమునందు చెప్పఁబడినది కదా !

శ్రీభాష్యకారులవారు అకృత్యకరణ కృత్యాకరణములతోఁ గూడ భగవదపచారాదులను న్న మొత్తముగాఁ, గోని, గోబలీవర్ద న్యాయప్రకారము అవియన్నియును భగవదపచారంబులై యే యుండఁగా, వాటివాటి హేతువులను బట్టి వాటిలోఁ గొన్నింటిని ఈసందర్భమున భాగవతాపచారములనుగాఁ దెలిపియున్నారు, యేయే యపచారములను తక్కిన విషయములయం దొనర్చుచున్నాఁడో, అట్టివాటినే భగవద్భాగవత విషయముల యెడల యొనర్చినట్లయిన, అవియావిషయములయొక్క యతిశయమును బట్టి, రాజద్రోహాదుల వలెనే, మిక్కుటముగ దండహేతువు లగునని వాటినివారు విశేషించి చెప్పుటలో నభిప్రాయము.

నరకప్రాప్తికి అనుకూలంబయినట్టి సంసారమండలము నందు మంచిమార్గమునఁ బ్రవర్తించునట్టివారు దుర్లభులైయుండ, భగవద్విషయమునుబట్టి అధికారానురూపముగ ముక్తి మార్గమునకు మొదటి పడికట్టగు కర్మయోగా ద్యనుష్ఠానము నందు స్థిరముగానున్నట్టి వారినిన్ని నీచముగాఁ దలంచుట భాగవతాపచారమనిపించుకొనుచున్నది. (నశబ్ధశాస్త్రాభిరతస్య మోక్షో. భోజనాచ్ఛాదన తత్పరస్య। నచైవ రమ్యావసథప్రియస్య నలోకచిత్తగ్రహణే రతస్య’ (వ్యాకరణశాస్త్రమునందే

య్యెల్లప్పుడు అభిరుచికల వానికిన్ని, కూటికి గుడ్డకు ఉంటె చా
లు ననుకొని యెల్లప్పుడును అందులకై యే పాటుబడునట్టివానికిన్ని,
సుందరమైన గృహమునందే యపేక్షకలవానికిన్ని, లోకులను
రంజింపఁజేయుటయందే ప్రీతిగలవానికిన్ని మోక్షము గలుగదు)
అని చెప్పియున్నట్లు భగవంతునియెడల ప్రీతిలేకుండ, "శిశ్నో
దరే యేభిరతాః స్వదైవ స్తేయానృతా వాక్పరుషాశ్చనిత్యం
వ్యపేతధర్మా ఇతి తాన్ విదిత్వా దూరాద్దేవాస్సంపరివర్జయం
తి' (సర్వదా శిశ్నోదరపరాయణులై చౌర్యము, అసత్యసంభా
షణము, పరుషసంభాషణ .. వీటినొనర్చునట్టివారు ధర్మమా
ర్గమునుతప్పి ప్రవర్తించునట్టి వారనుకొని, వారిని దేవతలు విడ
నాడుదురు) అన్నట్లు బాహ్యవిషయములే ప్రధానములని
తలంచి ప్రవర్తించునట్టివారికి మోక్షము లేదనుట. "పరాఙ్ము
ఖానాం గోవిందే విషయాసక్తచేతసాం తేషాం తత్పరమం
బ్రహ్మ దూరాద్దూరతరే స్థితం" (భగవంతునికి అభిముఖులు
కాకుండ, శబ్దాదివిషయప్రవణులయినట్టివారికి బ్రహ్మము దూర
మైయుండగలదు) ఈ మొదలగు వాటియందును ఈపైని చెప్పి
న యర్థము తెలియఁగలదు. "తన్మయా తేన గోవిందే యేనరా
న్యస్తచేతసః విషయత్యాగిన స్తేషాం విజ్ఞేయం చ తదంతికే"
(సర్వదా భగవద్ధ్యానపరులగుటచే ఎల్లప్పుడును వానియందే మ
నస్సునుంచియున్నట్టివారై శబ్దాది విషయములను బొత్తిగ
విడనాడి యుండునట్టివారు పరమపదము నందు భగవత్సన్నిధి
యందుందురు) ఇత్యాది వాక్యములు భగవత్పరులై
శబ్దాదివిషయములను బొత్తిగ త్యజించియున్నట్టివారికి భగవ
త్ప్రాప్తి గలుగుటలో విళంబము గలుగదని తెలుపుచున్నవి.

ఎట్టియోగ్యతయును లేనివారై ఆవుతోలుకప్పుకొనినట్టి పులివలెనే శాంతిస్వరూపులుగా నటించుచు, మేము భాగవతులమనుకొని సంచరించుచున్నట్టి వారినిన్ని, వారియంతఃకరణము తెలిసేవరకును, ఉచితరాములు అసురాయుల నాటకించినట్లు, నామరూపములనుబట్టి యాదరింపవలయును. ఇట్టి కపటవేషమునుబట్టియే 'నలింగం ధర్మకారణం' (వైవేషము స్వధర్మానుష్ఠానముకు హేతువు కాజాలదు) అనియు, 'ఫలం కతకవృక్షస్య యద్యప్యంబుప్రసాదనం నవామ గ్రహణాదేవ తస్య వారిప్రసీదతి' (చిల్లగింజ ఉదకమును పరిశుద్ధముచేయునదైయైనను, దానిపేరు నుచ్చరించినంత మాత్రమున ఉదకము పరిశుద్ధమగునా?) అనియును చెప్పియున్నారు.

శ్లో॥ ఆర్తా విషణ్ణా శ్శిథిలాశ్చ భీతాః।
ఘోరేషుచ వ్యాధిము వర్తమానాః।
సంకీర్త్య నారాయణ శబ్దమాత్రం
విముక్తదుఃఖా స్సుఖినో భవన్తి॥

తా॥ ఆర్తులును, దుఃఖితులును, శిథిలేంద్రియులును, భీతాహము గలవారును, భయంకరంబుగ వ్యాధిగ్రస్తులయినట్టి వారును నారాయణాయని భగవన్నామము నుచ్చరించినంత మాత్రమున దుఃఖరహితులై సుఖవంతులగుచున్నారు.

శ్లో॥ అవశేనాపి యన్నామ్ని కీర్తితే సర్వపాతకైః।
పుమాన్విముచ్యతే సద్య స్సింహత్రస్తైర్మృగైరివ॥

తా॥ పరవశుండైయ్యును, భగవన్నామము నుచ్చరించినట్లయిన, సింహమునకుభయపడి మృగములు పారిపోవునట్లు, పాతకంబులన్నియును ఆతనిని విడనాడి పోవుచున్నవి.

శ్లో॥ సాంకేత్యం పారిహాస్యంవా స్తోభం హేళనమేవవా
వైకుంఠనామగ్రహణం అశేషాఘవినాశనం॥

తా॥ సంకేతముకు గాని, పరిహాసముకు గాని, స్తోభముకుగాని హేళనకుగాను గాని సర్వేశ్వరుని నామము నుచ్చరించినట్లయిన, సర్వపాపములును నశిపోవుచున్నవి.

శ్లో॥ హరిర్హరతిపాపాని దుష్టచిత్తైరపిస్మృతః।
అనిచ్ఛయాపి సంస్పృష్టో దహత్యేవహి పావకః॥

తా॥ దుర్మార్గులచేతనైనను భగవంతుండు స్మరింపఁబడినట్లయిన, పాపములను హరించుచున్నాడు. అగ్ని పరధ్యానముతో నంటబడినను, దహించును కదా!

శ్లో॥ ఏతావతాలమఘనిర్హరణాయ పుంసాం
సంకీర్తనంభగవతో గుణకర్మనామ్నాం।
విక్రుశ్య పుత్రమఘవాన్ యదజామిళోపి
నారాయణేతి మ్రియమాణ ఉపైతి ముక్తిం॥

తా॥ భగవంతుని కల్యాణగుణములయొక్కయును, చేష్టితములయొక్కయును, తిరునామముల యొక్కయున్ను సంకీర్తనముఁ జేయుటమాత్రమే పాపనివృత్తికిచాలును. పాపాత్ముండగు అజామీళుండు నారాయణా! అని మరణకాలమున తనకొడుకును పిలిచినంతమాత్రముచే ముక్తిని పొందినాడు కదా!

పా॥ మొయ్త్తవల్వినైయుళ్ నిన్రుమూన్రెళుత్తుడైయ పేరాల్
కత్తిరబన్దుమన్రేపరాంగతి కండుకొండాన్। ఇత్తనైయడి
యరానార్క్కిరంగునమరంగనాయ పిత్తనై పెత్ర్ ఱుం॥

తా॥ నిబిడంబైనట్టి పాపములోనున్నను, గోవిందా! అని మూఁడక్షరముల పేరును ఉచ్చరించినంతమాత్రముచే క్షత్రబం

ఘువు మోక్షమును పొందనేవా? ఇంతదయాళువగు రంగనా థుండు రక్షించుటకై సంసిద్ధుండై యుండ, ఏల సంసారములోఁ బడి యుండవలయును?

ఈ పైని చెప్పియున్నదంతయును, భగవంతుని విషయమున ద్వేషములేనివానికి ఆస్తిక్యము కొంచము తక్కువగానున్నను, బాలులు మొదలగువారికి అర్థజ్ఞానము లేకున్నను, నోరూరుసంతప్రీతిలేకపోయినను, సంకేత పరిహాసాదుల సంబంధము మూలముగ వేఱొక్కదానియందు ప్రీతియున్నను, ప్రయోజనాంతర సంబంధమున్నను, దోషాంతరములున్నను, భగవన్నామసంకీర్తనము పవిత్రంబని తెలుపుటకు గానని యెఱుంగునది. ఇంతియెకాని, భగవంతుని నిందించుటకుగాను భగవంతుని పేర్కొనినంత మాత్రముచే పాపములు తొలగిపోవునని చెప్పుటకుగాను కాదు. భగవన్నింద పాతకంబని కదా! శాస్త్రములయందుఁ జెప్పఁబడినది. ఎట్లనిన,

శ్లో॥ యేద్విషన్తిమహాత్మానం నస్మరంతిచ కేశవం।
న తేషాంపుణ్యతీర్థేషు గతిస్సంసర్గిణామపి॥

తా॥ ఎవ్వారలుభగవంతుని నిందించుచు వానినిస్మరింపరో, సంస్కారులైనప్పటికిన్ని వారికి పుణ్యతీర్థప్రాప్తి గలుగనేరదు.

శ్లో॥ యఃపుత్రః పితరంద్వేష్టితంవిద్యాదన్యరేతసం।
యోవిష్ణుంసతతంద్వేష్టితంవిద్యాదన్త్యరేతసం॥

తా॥ సర్వదాతండ్రినినిందించునట్టివానిని వేఱొక్కనిరేతస్సునకుఁ బుట్టినవానినిగా నెఱుంగునది. భగవంతుని నిందించునట్టివానిని చండాలరేతస్సునకుఁ బుట్టినట్టి వానినిగాఁ నెఱుంగునది.

అని శాస్త్రమునఁ జెప్పియున్నది కదా!

శ్లో॥ గోప్యః కామాద్భయాత్కంసః
ద్వేషాచ్చైద్యాదయో నృపాః।
సంబంధా ద్వృష్ణయో యూయం
స్నేహాద్భక్త్యా వయం ప్రభో॥

**తా॥** కామమువలన గోపికలును, భయముచే కంసుండును, **ద్వేష**మువలన చైద్యాదినృపతులును, సంబంధమువలన గోపాలు **రగు** మీరును, స్నేహమువలన మేమున్ను శ్రీకృష్ణునికి భక్తులము.

అని చెప్పియున్నట్లు, యేదొక విధముగ సంబంధము గలవారు కడతేర గలరని చెప్పినదియును, 'యయాకయాచ విధయా సంబంధస్తదుపాసనం' (ఏదొకవిధముగ సంబంధము ను గలిగియుండుటయే పవిత్రమైనది) అని చెప్పినదియును పూర్వమొనర్చియున్నట్టి సుకృతంబుల మూలముగ నియతులగు అధికారులను గుఱించి చెప్పినదియని వీరియొక్క పూర్వాపర చరిత్రలను తెలుపునట్టి పురాణములయందు ప్రసిద్ధము.

అట్లే, భగవత్ క్షేత్రములయందు మరణించుట మొదలగునవి మోక్షోపకారకంబులని చెప్పినదియును పశ్వాదుల వలెనైనను ప్రాతికూల్యము లేనట్టివారికి ఉపకారకంబగునని తెలుపుటకుగానని యెఱుంగునది. అట్లుగాకున్న, అట్టి క్షేత్రముల యందుండి భగవత్ప్రాతికూల్యము నొనర్చునట్టివారికిన్ని మోక్షము కలుగునని ప్రసక్తించును.

'దుష్టేంద్రియవశాచ్చిత్తం నృణాం యస్య కల్మషైర్వృతం తదంతకాలే సంశుద్ధిం యాతి నారాయణాలయే' (ఎవ్వరి యొక్క మనస్సు దుష్టములగు ఇంద్రియముల మూలముగ కల్మషయుక్తమైనదో, అది అంత్యకాలమున భగవత్ క్షేత్రమునందు

పరిశుద్ధంబైనది యగుచున్నది,) అనునట్టి సాత్త్వతవచనమును
పుణ్యక్షేత్ర వాసాదులయందుఁ బ్రీతిగలవారికి శాస్త్రవిరోధ
ములేనట్టి శబ్దాదివిషయాంతరముల యెడఁగల ప్రీతివలననింత
దుష్ఫలముభగవత్సాక్షాత్కారములు లేకపోయినను, అంత్య
కాలమున వారికిన్ని జ్ఞానము కలుగఁగలదని యింతమాత్రమే తె
లుపునదిగాను ప్రకరణముపలనఁ దెలియుచున్నది. 'యం యోగి
నః ప్రాణవియోగకాలే యత్నేన చిత్తే వినివేశయంతి' (పరమా
త్మను యోగులు అంత్యకాలమున ప్రయత్నముచే మనస్సునందుం
చుకొనుచున్నారో) అని చెప్పియున్నట్టి స్వప్రయత్నముతో నిమి
త్తములేకుండ, అంత్యకాలమున వీరికి జ్ఞానము గలుగుటయే వీరి
కిఁగల విశేషము. ఇది 'కేవలం మదీయయైవ దయయా' అను
దావున ప్రపన్నుల విషయమునను కలదని తెలుపఁబడినది.

కావున భగవత్ప్రతికూలులట్టి ప్రాతికూల్యము కొనర్చు
టకుగాను నుంచుకొనినట్టి రూప, క్షేత్రనామ, వాస, సంకీర్త
నాదులురక్షకములుకావు. మరియు పుణ్యక్షేత్రాదులయందా
చరింపఁబడునట్టి ప్రతికూలకార్యములు మిక్కిలి బాధకంబులను
విషయము అనేక శాస్త్రములయందుఁ దెలుపఁబడినది. ఇది
యును భగవత్ప్రభావము. భగవద్భక్తులకు, *వృత్రాసురుం
డు, క్షత్రబంధువు మొదలగు వారికివలెనే యున్నట్టి యాను
కూల్యములు దోషంబుల నన్నింటిని పోగొట్టి యుత్తార
కంబులు కాఁగలవు. కావున, తనసంకల్పములో నున్నట్టి
యేదొక వ్యాజము మూలముగ సర్వేశ్వరుండు స్వాసాఁప్రా

* వృత్రాసురుండు భగవంతునిచే వధింపఁబడెను. క్షత్రబంధువు 'గో
వింద' అని యుపదేశమును లభించెను. ఇవియే వీరికిఁగల అనుకూల్యములు.

స్తంబగునట్టి ముక్త్యైశ్వర్యము నొసంగదలంచినట్టి యధికారికిఁ గల దోషములకు పరిహారముఁ జేయఁగలవాఁడు, 'ఏక శ్శాస్తా నద్వితీయోస్తి శాస్తా' (అన్నింటిని నియమించునట్టివాఁడు భగవంతుండొక్కండే వేఱొక్కండు లేడు) అనియు, 'ప్రశాసితారం సర్వేషాం' (అందఱినిన్ని శాసించునట్టివానిని) అనియు, 'శాస్తావిష్ణురశేషస్య' (సమస్తమును శాసించునట్టివాఁడు విష్ణువు) అను తావుల చెప్పఁబడునట్టివాఁడేయని తెలిసికొని 'రాగాదిదూషితేచిత్తే నాస్పదీమధుసూదనః।నబధ్నాతి రతింహంసః కదాచిత్కర్దమాంభసి' (కామక్రోధాది యుక్తంబగునట్టి హృదయమునందు మధుసూదనుండు వసింపనొల్లఁడు. బురదనీళ్ళవద్ద హంస వసించుట కిచ్ఛయించునా?) ఇత్యాది వచనములనువిని వెనుదీయక, ఈయధికారులయందుఁగల గుణాంశమును చూచి, మరుభూమియందుమంచితీర్థమునులభించినట్లు, సంతోషించి, 'కర్మణా మనసా వాచా యదభీష్టం నిషేవతే తదేవాపహరత్యేనం తస్మాత్కల్యాణ మాచరేత్' (మనోవాక్కాయంబులచే భగవదిష్టంబైనట్టిదానిని దేని నాచరించుచున్నాడో, అది యీతని పాపమును హరించుచున్నది అందువలన కల్యాణకరంబయినట్టి దానిని ఆదరించునది) అన్నట్లు కరణత్రయము చేతను తాను మంచిమార్గమును విడనాడకుండ, 'సంసారవిషవృక్షస్య ద్వేఫలేహ్యమృతోపమే కదాచిత్కేశవేభక్తిస్తద్భక్తైర్వాసమాగమః' (సంసారరూపమగు విషవృక్షమునకు రెండుఫలములుగలవు అవి యమృతముల్యాములువాటిలో నొక్కటి కేశవుని విషయమున భక్తి వేఱొక్కటి వానిభక్తులతో సమాగమము) అని యీలోకమునను న్నప్పుడు ప్రయోజనముగాఁగొ

నంబడినట్టి బాల్యము నుండి భగవదను సంధానరూపమగు నిర వధిక సంపత్తుతోఁ గూడియున్నట్టి పరమైకాంతులతో సహవాసము గలవారమగుట యనెడి భగవత్కృపను పొందినామను కొని కృతార్థుండై, 'తిరుమాల్ తన్నైక్కొండ సంకెప్పంగే వరుం తీవినైయే' (లక్ష్మీపతిని సర్వదా అనుసంధించుచుండునట్టి వారమగు మాకు పాపము లెచ్చటనుండి రాగలవు?) అనుకొని స్థిరమనస్కుండై, 'ఆళ్ కిన్ఱా నాళ్ తిరియానారాల్ మత్తైయుణ్డైయం' (సముద్రమువలెనే పరిపూర్ణుండగు మాస్వామి యుండియుండఁగా మాకు తక్కువేమి?) అన్నట్లు పరమపదమునందు పొందబోవునట్టి పరిపూర్ణకైంకర్య సామ్రాజ్యమునందు యిక్కడనే పట్టాభిషిక్తుండై యుండునది.

ఇవ్విధమున ఏర్పడియుండునట్టి ప్రభావమును రహస్య త్రయమునందు ఫలముఁ దెలుపునట్టి సందర్భములయందు అనుషంగికముగానను సంధించుకొనునది.

పా॥ ఉణ్మైయురైక్కుమ్మఱైకళిలోంగియవుత్తమనార్
వణ్మైయళప్పరితాతలిల్ వందుకళ్‌పణివార్
తణ్మైకిడందిడత్తర(త్తా)మళవెన్న వియప్పిలతామ్
ఉణ్మైయురైత్తనరోరంతవిరవుయరందనరే॥

టీ॥ ఉణ్మై = యథార్థమును, ఉరైక్కుమ్ = చెప్పునట్టివియగు, మఱైకళ్ = శ్రుతులయందు, ఓంగియ = గొప్పవాఁడుగాఁ బ్రతిపాదింపఁ బడినట్టి, ఉత్తమనార్ = పురుషోత్తమునియొక్క. వణ్మై = ప్రభావము, అళప్పరితు = ఇంతమాత్రమని చెప్పుటకు శక్యముకాదు. అతలిల్ = దానికంటెను, వందు = వచ్చి, కళల్ = చరణములను, పణివార్ = ఆశ్రయించునట్టివారికి, తణ్మై = అపకర్షత, కిడందిడ = ఉన్నప్పటికిన్ని, తామ్ = తాను స్వయముగ, అళవు = ఉపమా, ఎన్ను = అనిచెప్పవప్పటికిన్ని

విస్మయప్యే = విస్మయమును, ఇలతాన్ = కలుగసుంచనట్లు, ఉపైత్ర = సర్వ్య ముసు, ఉరైత్తనర్ = చెప్పినట్టివారు, ఓగం = పక్షపాతము, తవిర = లే కున్నట్టి, ఉయర్న్దనరే = మహాత్ములు కదా!

తా॥ ప్రపన్నుల మాహాత్మ్యము విషయమున భగవంతుండే సమానుండని చెప్పినట్లయిన, విస్మయము పడకూడదు. ఇది సాత్త్వికమని పక్షపాతరహితులగు మహాత్ములు చెప్పియున్నారు.

శ్లో॥ రాగద్వేషమదాదిభిరిహ మహారక్షోభిరక్షోభితం
నిత్యైరక్షితరిస్థితే నిజభరన్యాసాభిధానం తపః
యత్కక్షీకృతమత్యశేత వివిధాన్ ధర్మానధర్మద్రుహ
స్తద్భూమార్ణవలేశవర్ణనమపి ప్రాచాంనవాచాం పదం॥

టీ॥ నిత్యే = నిత్యుండగు, రక్షితరి = రక్షకుండు, స్థితే = ఉండుగాక, నిజభరన్యాసాభిధానం = భరన్యాసంబని ప్రసిద్ధమైనట్టి, తపః = ప్రపత్తిరూపమగు తపస్సు, రాగద్వేషమదాదిభిః = రాగము, ద్వేషము, మదము మొదలగునవియనెడి, మహారక్షోభిః = రాక్షసులచేత, ఇహ = ఈ ప్రపన్నునియందు, అక్షోభితం = క్షోభపెట్టబడనట్టిది. యత్కక్షీకృతం = ఏ ప్రపన్నునిచే నంగీకరింపఁబడినదియగుచు, అధర్మద్రుహః = అధర్మమును నశింపఁజేయునట్టి, వివిధధర్మాన్ = సత్యదమాదిరూపములగు నానావిధ ధర్మములను, అత్యశేత = అతిక్రమించినదియయినో, తద్భూమార్ణవలేశవర్ణనమపి = తత్ = ఆ ప్రపన్నునియొక్క, భూమార్ణవ = మహిమాసముద్రముయొక్క, లేశవర్ణనమపి = స్వల్పభాగముయొక్క వర్ణనమున్ను, ప్రాచాంవాచాం = వేదవాక్యములకు, నపదం = విషయము కాదు.

తా ॥ నిత్యుండగు రక్షకునియందు భారమునుంచుటయనెడి ప్రపత్తిని యేప్రపన్నుండు అంగీకరించియున్నాడో. ఆట్టిప్రపన్నునియొక్క మహిమను వర్ణించుటకు వేదవాక్యములకున్ను గోచరము కాదు.

ప్రభావరక్షాధికారము ముగిసెను.

స్థిరీకరణవిభాగో ద్వితీయ స్సమాప్తః.









# రహస్యత్రయసారము



## పదవాక్యయోజనావిభాగస్తృతీయః

### మూలమన్త్రాధికారము.

శ్లో॥ తారంపూర్వంతదనుహృదయంతచ్చనారాయణాయేత్యా
మ్నాయోక్తంపదమవయతాం సార్థమాచార్యదత్తం।
అంగీకుర్వన్నలసమనసాం మాత్మరక్షాభరంనః
క్షిప్రందేవఃక్షపతునిఖిలాన్ కింకరైశ్వర్యవిఘ్నాన్॥

టి॥ ఆచార్యదత్తం= ఆచార్యునిచే ఉపదేశింపఁబడినట్టి, తారం= ప్రణవమును, పూర్వం=ముందుగను, తదను = అటుపిమ్మట, హృదయం = నమఃపదమును, తత్ = అనంతరము, నారాయణాయేతి= నారాయణాయ అని, ఇతి = ఇట్లు, ఆమ్నాయోక్తం = వేదప్రోక్తంబగు, పదం=మంత్రమును, సార్థం = అర్థయుక్తముగ, అవయతాం = అనుసంధించుకొనునట్టివారును, అలసమనసాం = శరణాగతినిష్ఠులగు, నః = మాయొక్క, ఆత్మరక్షాభరం = ఆత్మరక్షణము విషయమగుభారమును, అంగీకుర్వన్ = తనపైబెట్టుకొనుట కంగీకరించునట్టి, దేవః= శ్రీమన్నారాయణుండు, కింకరైశ్వర్యవిఘ్నాన్ =కైంకర్యరూపమగు ఐశ్వర్యమునకుఁ గలుగఁగలవిఘ్నములను, క్షిప్రం = శీఘ్రముగా, క్షపతి = నివర్తింపఁ జేయుచున్నాడు.

తా॥ తిరుమంత్రమును అర్థయుక్తముగ అనుసంధించుకొనుచు శరణాగతులయినట్టివారియొక్క యోగక్షేమభరమును తనపై బెట్టుకొనునట్టి సర్వేశ్వరుండు వారొనర్పవలసిన కైంకర్యమునకు గలుగఁగల విఘ్నములన్నింటిని యీ దేహావసానమునకే నివర్తింపఁ జేయుచున్నాఁడు.

శ్లో॥ కల్యాణమావహతు కార్తయుగం స్వధర్మం
ప్రఖ్యాపయన్ ప్రణిహితేషు నరాదికేషు।
అద్యంకమస్యధిగతో ఽథ మష్టచక్రం
బంధుస్సతాం బదరికాశ్రమతాపసో నః॥

టీ॥ ప్రణిహితేషు=సావధానులగు, నరాదికేషు=నరుండు మొదలగు వారివిషయమున, కార్తయుగం=కృతయుగమునను ష్ఠింపఁడునట్టి, స్వధర్మం=నివృత్తిలక్షణమగు ధర్మమును ప్రఖ్యాపయన్ = ప్రసిద్ధిపఱచుచు, అష్టచక్రం = ఎనిమిది చక్రములుగల, అద్యంకమపి = అనాదియును శ్లాఘ్యమగు, రథం = రథమును, అధిగతః = ఎక్కియున్నట్టివాఁడును, సతాం= సత్పురుషులకు, బంధుః = బంధువునగు, బదరికాశ్రమతాపసః=బదరికాశ్రమమునందు ఋషిగా నవతరించినట్టి శ్రీమన్నారాయణుండు, అస్మాకం= మాకు, కల్యాణం = తిరుమంత్రార్థ జ్ఞానరూపమగు మంగళమును, ఆవహతు = కలుగఁజేయుగాక!

తా॥ కృతయుగధర్మమనఁబడు నివృత్తిధర్మమును నరాది శిష్యుల కుపదేశించునట్టివాఁడును, అష్టచక్రరథము నధిష్ఠించి యుండువాడును, బదరికాశ్రమమునందు ఋషిగా నవతరించినట్టి శ్రీమన్నారాయణుండు, తిరుమంత్రార్థజ్ఞానరూపమగు మంగళమును మాకు గలుగఁజేయుగాక!

శ్లో॥ యదంతస్థ్సమశేషేణ వాఙ్మయం వేదవైదికం।
తస్మై వ్యాపకముఖ్యాయ మంత్రాయ మహతే నమః॥

టీ॥ వేదవైదికం = వేదములు, ఉపబృంహణములు మొదలుగాఁగల, వాఙ్మయం = వాఙ్మాలమంతయును, అశేషేణ = మొత్తముగ, యి

త్రస్థం = దేనిలోనవసించియున్నదో, తస్మై - అట్టిదియును, మహతే = గొప్పదియును, వ్యాపకముఖ్యాయ = వ్యాపకమంత్రములలో ముఖ్యమైనది యైనట్టి, మంత్రాయ = తిరుమంత్రమునకు, నమః = నమస్కారము.

తా॥ వేదవైదిక శబ్దజాలమంతయును దేనిలో నంతర్గతంబై యున్నదో, అట్టి తిరుమంత్రమునకు దండము సమర్పించుచున్నాడను.

శ్లో॥ ఇహమూలమంత్రసంవృతమర్థమశేషేణకశ్చిదనుభవతి।
స్ఫాటికతలనిహితనిధిమివ దేశికదత్తేనచక్షుషాజంతుః॥

టీ॥ ఇహ= ఈ కలియుగమునందు, కశ్చిత్ =ఎవ్వండో యొక్కండు, మూలమంత్రసంవృతం = తిరుమంత్రమునందు గోప్యముగా నుంచబడినట్టి, అర్థం = అర్థమును, దేశికదత్తేన = ఆచార్యునిచే నొసంగబడినట్టి, చక్షుషా = జ్ఞానదృష్టిచేత, స్ఫటికతలనిహితం = స్ఫటికమణి నిర్మితమగు ప్రదేశమునమున్నట్టి, నిధిమివ = ధనరాశినివలెనే, అశేషేణ = పూర్తిగా, అనుభవతి = అనుభవించుచున్నాడు.

తా॥ పాపభూయిష్టంబగునట్టి యీకలియుగమునందు ఎవ్వండో ఒక్కండు ఆచార్యునిచే నొసంగఁబడినట్టి జ్ఞానదృష్టిచే తిరుమంత్రార్థమును గుర్తెఱింగి యనుభవించుచున్నాడు.

సత్వగుణనిష్ఠులయినట్టివారిచే అనుసంధించుకొనవలసినట్టి వియగు సారతమంబులగు అర్థంబులనున్ను వాటిని స్థిరపఱచుకొనవలసినట్టి విధంబులనున్ను ప్రతిపాదించినాము. వీటినన్నింటిని విశదముగాఁ బ్రకాశింపఁజేయునట్టివియగు తిరుమంత్ర, ద్వయ, చరమశ్లోకములయొక్క పదవాక్యముల నన్వయించుకొని యర్థము జేసికొనవలసినట్టి విధంబులను ఇఁకమీఁదు చెప్పెదము.

వాటిలో తిరుమంత్రము ముందుగ సర్వేశ్వరునిస్వరూపమున్ను, వానికి శేషభూతుండుగా నుండుటయే రసపంతం

బగు స్వరూపంబని యిట్లు జీవునిస్వరూపమునున్ను యీ మొద
లగువాటిని తెలియఁజేసి, అందుమూలముగ నమస్తప్రతిబంధక
నివృత్తిపూర్వకముగ పరమపురుషార్థమును (మోక్షమును)
లభించుటలో రుచినిన్ని త్వరనున్ను కలుగఁజేసి, ఉపాయాధికా
రపూర్తిని గలుగఁజేయును.

ఇవ్విధముగ అధికారియైనట్టివాడు ఫలాపేక్షా రహిత
ముగ ఉపాయవిశేషమును(ప్రపత్తిని) అనుష్ఠించునట్టి పద్ధతిని
ద్వయము విశదముగాఁ దెలుపఁగలదు.

ఇట్టియుపాయ విశేషమును విధించునట్టిది చరమశ్లోకము.

వీటిమూడింటియందును ప్రత్యేకప్రత్యేకముగా ఈయర్థము
లన్నియును శబ్దప్రోక్తములుగానును, అర్థసిద్ధములు గానును
తెలియవచ్చునవియే యైనను ఒక్కొక్కదానిచే, నొక్కొక్క
యర్థము మాత్రమే ముఖ్యముగాఁ దెలుపఁబడును.

తిరుమంత్రమునందుండు ప్రథమపదము(ఓంకారము=
అ+ఉ+మ్)నందుండు ప్రథమాక్షరము (అకారము)చే సంగ్ర
హముగాఁ దెలుపఁబడునట్టి శరణ్యపరతత్త్వమునున్ను (భగవ
త్స్వరూపమునున్ను) దీనియందలి మధ్యమ తృతీయ పద
ములచే (నమఃనారాయణాయ అనువాటిచే) తెలుపఁబడు
నట్టి యుపాయోపేయంబులనున్ను ద్వయము క్రమముగ విశద
పఱచి తెలుపుచున్నది.

ఇందులోను, 'ప్రపద్యే' అను క్రియాపదమునందుండు
ఉత్తమపురుషయందు వివక్షితంబైనట్టి అధికారి విశేషమును
న్ను, అర్థసిద్ధంబగు ఉపాయ నైరపేక్ష్యతనున్ను, (ఉపాయము
వేఱొక్కదాని సహాయము నపేక్షించునది కాకపోవుటనున్ను(

ఉపేయము విషయమున 'నమః' శబ్దముచే సంగ్రహముగాఁ దె లుపఁబడునట్టి విరోధిని వృత్తినిన్ని చరమశ్లోకము విశదపఱిచి తెలుపుచున్నది.

ఈమూఁడును మనకు జ్ఞాన, అనుష్ఠాన, ఫలహేతువులై ధారక పోషకభోగ్యంబులు కాఁగలవు. అదియెట్లనిన, 'వ్యక్తం హి భగవాన్ దేవః సాక్షాన్నారాయణ స్స్వయం। అష్టాక్షర స్వరూపేణ ముఖేషు పరివర్తతే' (నారాయణుండే స్వయముగ భగవంతుండను విషయము స్పష్టము అగుండే అష్టాక్షరమంత్ర స్వరూపుండుగా అందఱివాక్కులయందును వసించియున్నాడు) అని చెప్పియున్నట్లు ఆచార్య తిరువాక్కునుండి బయలువెడలి శిష్యుల హృదయమునందుండు అజ్ఞానాంధకారమును పోగొట్టి భగవంతునికి శేషభూతుల మనెడి పరిశుద్ధ స్వరూపమును బయలుపఱిచి, సత్తను లభించునట్లుచేయుటచే తిరుమంత్రము ధారకంబనిపించుకొనుచున్నది.

చరమోపాయముచే ప్రవర్తింపఁజేయఁబడునట్టి జ్ఞాన విశేషమును వృద్ధిపఱచునది యగుటచే నిఁక తెలిసికొనవ లసినది యొద్దియును లేకుండునట్లు ఉపాయవిశేషమును (ప్రవ త్తిని) యుపదేశించి ముగించునట్టిదియగు చరమశ్లోకము పోషకం బనిపించుకొనుచున్నది.

ఒక్కతూరి యుచ్చరించినంత మాత్రమున పరమపురు షార్థము నొసంగునదియై సర్వదా అనుసంధించుకొనుటచే నీత నిని కృతార్థునిగాఁ జేయునదియగుటం జేసి ద్వయము భోగ్యం బనిపించుకొనుచున్నది.

తిరుమంత్రముయొక్క ఋషి, ఛందస్సు, దేవతా, బీజ

శక్తి, వర్ణ,వినియోగ, స్థానన్యాసాదులను కల్పగ్రంథములయం దుఁ జెప్పియున్నట్లు వారివారి సంప్రదాయంబుల కనుగుణము గాఁ దెలిసికొనవలసినది. అథర్వణ కఠాద్యుపనిషత్తులయందును, తక్కిన మన్వాది సర్వశాస్త్రములయందును నారాయణాష్టక హైరణ్యగర్భ నారదీయ, బోధాయనీ కూడి బహువిధకల్పగ్రంథములయందును తిరుమంత్రముయొక్క వైభవము ప్రసిద్ధంబైయున్నది.

మంత్రాంతరములకంటెను భగవన్మంత్రము లధికంబులయినచందంబునను, అనంతంబులగు భగవన్మంత్రంబులకంటెనున్ను వ్యాపకంబులగు మూఁడు మంత్రములు అధికంబులయిన చందంబునను, "మంత్రాణాం పరమోమంత్రో గుహ్యానాంగుహ్యముత్తమం। పవిత్రంచపవిత్రాణాం మూలమంత్రస్సనాతనః" (సనాతనంబగు తిరుమంత్రము మంత్రములలో నుత్కృష్టంబైనది రహస్యంబులలో నుత్తమంబైన రహస్యము. పవిత్రంబులలో పవిత్రంబైనది.) అని చెప్పియున్నందున వ్యాపకములగు మూఁడుమంత్రములకంటెనున్ను అధికంబై, సర్వవేదములయొక్కయును సారంబై,సర్వానిష్టములనున్ను తొలగించునట్టిదియై, సర్వపురుషార్థములకును సాధకంబై, సర్వోపాయంబులకును ఉపకారకంబై, సర్వవర్ణముల వారిచేతనున్ను తమతమఅధికారము కనుగుణముగ వైదికరూపముచేతను, తాంత్రికరూపముచేతనున్ను ఆధారభూతంబై, వ్యాప్యవ్యాపకములగు సర్వతత్త్వములనున్ను కంఠోక్తముగాఁ దెలుపునట్టిదియై, సర్వమంత్రవైరవేత్యకరమై,సర్వభగవన్మూర్తులకున్ను సాధారణంబైన

ట్టిదియగుటంజేసి, ఆచార్యులందఱును తిరుమంత్రమునుమిక్కిలి ప్రేమించి యుండిరి.

ఆళ్వారులును 'నిన్ తిరువెట్టెళుత్తుమ్ కట్రు' (నీయొక్క అష్టాక్షరమంత్రము నభ్యసించి) అనియు, 'ఎట్టెళుత్తుమోదువార్ కళ్ వలర్ వాసమాళివే' (అష్టాక్షరమంత్రము నభ్యసించి అందుల కనుగుణముగ అనుష్ఠించునట్టివారు పరమపద నిర్వాహకులు) అనియు, 'నాడునకరముమ్ నన్గఱియ నమోనారాయణాయ' (గ్రామములలోనుండువారును, నగరములలో నుండు వారును ఈతండు వైష్ణవుండనుకొనునట్లు నమోనారాయణాయ అని యనుసంధించుకొనుచు) అనియు, 'నల్వకైయాల్ నమోనారాయణాయ' (మంచిమార్గమున నమోనారాయణాయ అని యనుసంధించుచు) అనియును, ఇట్లు ఈ తిరుమంత్రము నే మిక్కిలి ప్రేమించియున్నారు.

ఋషులును,

శ్లో॥ బహవోపిమహాత్మానో మునయస్సనకాదయః।
అష్టాక్షరంసమాశ్రిత్య తేజగ్ముర్వైష్ణవంపదం॥

తా॥ మహాత్ములగు అనేక సనకాదిమహర్షులు అష్టాక్షరమంత్రము నాధారముగాఁగొని పరమపదమునుబొందిరి.

శ్లో॥ యథాసర్వేషుదేవేషు నాస్తినారాయణాత్పరః।
తథాసర్వేషుమంత్రేషు నాస్తిచాష్టాక్షరాత్పరః॥

తా॥ దేవతలందఱిలో నారాయణునికంటెను గొప్పవాఁడులేనట్లు, మంత్రములలోనను అష్టాక్షర మంత్రముకంటెనున్న గొప్పమంత్రము లేదు.

శ్లో॥ భూత్వోర్ధ్వబాహురత్రాద్య సత్యపూర్వం బ్రవీమివః।
హే పుత్ర శిష్యాః శృణుత నమంత్రోష్టాక్షరాత్పరః॥

తా॥ ఓపుత్రులారా! శిష్యులారా! వినుడు. చేతులను పైకెత్తి ప్రమాణపూర్తిగాఁ జెప్పుచున్నాను, అష్టాక్షరమంత్రముకంటెను గొప్పది లేదు.

శ్లో॥ తదర్చనపరో నిత్యం తద్భక్తస్తం నమస్కురు।
తద్భక్తా న వినశ్యంతి హ్యష్టాక్షరపరాయణాః॥

తా॥ కావున విష్ణువును పూజించుచు వానిని నమస్కరించుచు వానిభక్తుండవగుము. అష్టాక్షరమంత్ర పరాయణులగు విష్ణుభక్తు లెన్నటికిని నశింపరు.

శ్లో॥ ఆసీనా వా శయానా వా తిష్ఠంతో యత్ర కుత్ర వా।
నమో నారాయణాయేతి మంత్రైకశరణా వయం॥

తా॥ మేము కూర్చుండియున్నను, పరుండియున్నను, నిలువబడియున్నను ఎలప్పుడును అష్టాక్షరమంత్రమునే రక్షకముగా నమ్మియున్నట్టివారము.

అని యివ్విధముగ చెప్పియున్నారు. సర్వేశ్వరుండు ఈ తిరుమంత్రమును శ్రీనారదమహర్షి మూలముగ శ్రీపుండరీకుని కుపదేశింపఁగా, నతండును దీనినే పరమహితమునుగాఁ గొని వినుటచే "పుండరీకోఽపి ధర్మాత్మా నారాయణ పరాయణః। నమో నారాయణాయేతి మంత్రమష్టాక్షరం జపన్" (ధర్మాత్ముండగు పుండరీకుండు నమోనారాయణాయ అనఁబడునట్టి తిరుమంత్రమును జపించుచున్నందున నతండు నారాయణపరాయణుండగు మహాత్ముండు) అని చెప్పియున్నట్లు ఈమంత్రమునందు నిష్ఠగలవాఁడై మోక్షమును బొందినాడు. భగవంతుండే

స్వయముగ ఈ మంత్రమును శ్రీ తిరుమంగైయాళ్వారులకు ఉప
దేశించినాడు. ఈమంత్రమును, దీనియందలి ప్రణవచతుర్థులను
మాత్రము విడిచిపెట్టి, యనుసంధించుకొనుటలో నంపటికిన్ని
అధికారము కలదని శ్రీవరాహ పురాణమునందలి కైశికద్వా
దశీ మాహాత్మ్యమునందు, *"న మోనారాయణేత్యుక్త్వా శ్వపా
కః పునరాగమత్" (అనువచనముచేఁ దెలుపఁబడినది. ఈయర్థము
ను "నామంశొల్లిల్ న మోనారణమే" "నన్మాలైకొండున మో
నారణా" "నావాయిలుండేన మోనారణా వెన్ఱె తువాళై కుక్కము
ళ్ళైయుండే" అనుపాశురములున్ను తెలుపుచున్నవి. బ్రాహ్మణా
దులు అనుసంధించుకొనునట్టి క్రమమునుబట్టిచూస్తే యిది ప్రణ
వముతోఁగూడ ఎనిమిది అక్షరములు కలదై యుండ గలదు.

శ్లో॥ వైదికం తాంత్రికం చైవ తథా వైదికతాంత్రికం।
త్రివిధం కర్మసంప్రోక్తం పంచరాత్రామృతార్ణవే॥

తా॥ వైదికమనియు, తాంత్రికమనియు, వైదిక తాంత్రిక
మనియును ఇవ్విధముగ కర్మము త్రివిధముగాను పంచరాత్రా
మృతార్ణవమునఁ జెప్పఁబడినది.

శ్లో॥ వైదికం బ్రాహ్మణానాంతు రాజ్ఞాం వైదికతాంత్రికం।
తాంత్రికం వైశ్యశూద్రాణాం సర్వేషాం తాంత్రికం తు వా॥

తా॥ వైదికముగ బ్రాహ్మణు లనుసంధించుకొనునది, వైదిక
తాంత్రికముగ క్షత్రియు లనుసంధించుకొనునది. వైశ్యులును
శూద్రులును తాంత్రికముగా ననుసంధించుకొనునది. అథవా
అందఱును తాంత్రికముగానైనను అనుసంధించుకొనవచ్చును.

* ప్రణవచతుర్థులను విడిచి 'నారాయణ' అనిమాత్రమే యీతావుఁ
చెప్పినయున్నందున, నిట్లు తెలియుచున్నదని యభిప్రాయము.

శ్లో॥ అష్టాక్షరశ్చ యోమంత్రో ద్వాదశాక్షర ఏవచ।
షడక్షరశ్చ యోమంత్రో విష్ణోరమిత తేజసః॥

తా॥ అష్టాక్షర మంత్రమనియు, ద్వాదశాక్షర మంత్రమనియు, షడక్షర మంత్రమనియు నివి తేజోవంతుండగు విష్ణువుతో సంబంధించినవి.

శ్లో॥ ఏతే మంత్రాః ప్రధానాస్తు వైదికాః ప్రణవైర్యుతాః।
ప్రణవేనవిహీనాస్తు తాంత్రికా ఏవ కీర్తితాః॥

తా॥ ప్రధానములగు ఈ మంత్రములు ప్రణవముతోఁ గూడియున్నప్పుడు వైదికము లనఁబడుచున్నవి. ప్రణవముతోఁ గూడియుండనివి యగునప్పుడు తాంత్రికములనఁబడుచున్నవి.

శ్లో॥ నస్వరః ప్రణవోంగాని నాప్యన్యవిధయ స్తథా।
స్త్రీణాంతు శూద్రజాతీనాం మంత్రమాత్రోక్తిరిష్యతే॥

తా॥ స్వరముగాని, ప్రణవముగాని అంగములుకాని తక్కిన విధు లెవ్వియును స్త్రీలకును, శూద్రులకున్ను కూడనివి. కావున వారికి మంత్రమాత్రము నుచ్చరించుట కూడును.

ఈ పైని చెప్పియున్న శ్లో, ప్రణవమును విడిచిపెట్టినప్పుడు "తత్రాష్టాక్షరాయణస్యాదిః బిందుమార్క విష్టరంతతః। బీజమష్టాక్షరస్యాస్యాత్ నాష్టాక్షరతాభవేత్" (అయన శబ్దము యొక్క ఆద్యక్షరమునకు (అకారమునకు) ఒక బిందువును (సున్నను) అంతమునఁ జేర్చితిమేని "అం" అనునది బీజాక్షరముగా నుండగలదు. అందువలన అష్టాక్షరత్వము వపన్న మగుచున్నది) అన్నట్టి విధమున ఎనిమిది యక్షరములున్ను అనుసంధించుకొనవలసినవిగా నువిధింపఁబడినవి. ప్రణవమును విడిచిపెట్టినను, అదియున్నందునఁ గలుగఁగల ఫలము ఈయధికారికిఁ గలదని "కింతత్ర బహుభిర్మంత్రైః

కిం తత్రబహుభిః మన్త్రైః। నమోనారాయణాయేతి మన్త్రః సర్వార్థసాధకః'' (అనేక మంత్రములతో నుపయోగమేమి? అనేక మంత్రములతో నుపయోగమేమి? నమోనారాయణాయ అను మంత్రము సర్వము నీయఁగలదు) ఇత్యాది వాక్యములనుండి తెలియవచ్చు చున్నది.

పైని చెప్పిన విధమున ప్రణవములేకుండనే యిది యష్టాక్షరం బగునప్పుడు, ప్రణవముచేఁ దెలుపఁబడునట్టి యర్థమంతయును, ప్రణవము ప్రత్యామ్నాయముగాను శాస్త్రముచే నంగీకరింపఁబడినట్టి యక్షరములో మొదటియక్షరమును సర్వమును సంగ్రహముగాఁ దెలుపునట్టి విధమున సంక్షిప్తముగ ననుసంధించుకొనునది. ద్వితీయాక్షరముచేఁ దెలుపఁబడునట్టి యర్థమున్ను అతిసిద్ధము కాఁగలదు. తృతీయాక్షరముచేఁ దెలుపఁ బడునట్టి జ్ఞాతృత్వాదులును 'నమః' అను తావున నుండు ద్వితీయాక్షరముయొక్క ధాత్వర్థమునం దనుసంధించుకొన వలసినవి.

ప్రణవము ప్రత్యక్షముగా నుచ్చరింపఁబడునప్పుడు అది ఏకమాత్రము, ద్విమాత్రము, త్రిమాత్రము, సార్ధమాత్రమనియివ్విధమున నానావిధములుగలదియై, కార్య కారణావస్థలుగలదియగు పరమాత్మను తెలుపునదియైనందున దానియర్థములును అట్లే నానావిధములై యుండగలవు.

వ్యాపక మంత్రములయందును ప్రణవమును పరమాత్మనే ప్రధానముగాఁ దెలుపునట్టి దానినిగాను కొన్ని శాస్త్రములు తెలుపఁగలవు. । దీనియొక్క ప్రభావము 'ఆద్యం తు త్ర్యక్షరం బ్రహ్మ త్రయీయత్ర ప్రతిష్ఠితా । స గుహ్యోన్య

త్రివృద్వేదో యస్తం వేద స వేదవిత్' (త్ర్యక్షరాత్మకమగు మొద
టియక్షరము (ప్రణవము) బ్రహ్మము, దీనిలో వేదములంతర్గతములై
నిలిచియున్నవి. ఇది గుహ్యమైన వేదము. ఋగాది వేదము వేఱు.
దీనిం దెలిసికొనియున్నట్టివాం డెవ్వండో వాడే వేదమును తెలిసికొ
నియున్నట్టివాండు) ఇత్యాది శ్రుతులప్రసిద్ధము. ఇది "హవిర్గృహీ
త్వాత్మరూపం వసురణ్యేతి మంత్రితః। జుహుయాత్ప్రణవేనాగ్నా
వచ్యుతాఖ్యే సనాతనే' (ఆత్మయనంబడు హవిస్సును వసురణ్యే
త్యాదిమంత్రముచే ప్రణవముతో అచ్యుతండనంబడునట్టియగ్ని
యందు హోమము చేయందగును) అన్నట్లు న్యాసవిద్యయందు
ప్రత్యక్షముగానుండునదై ఆత్మసమర్పణముం దెలుపునది కాంగల
దు. ఆ ప్రకారముగానే ప్రకృతముననున్న, దీని ఆత్మసమర్పణ
ముం దెలుపునట్టిదానినిగానును అర్థము చేసికొనుట కద్దు. ఈ తావున
స్వరూపజ్ఞానము ప్రధానంబగుటం జేసి, శేషత్వానుసంధానము
మాత్రమే ముఖ్యముగ వివక్షింపం దగినదియనియును అర్థము
చేసికొనుట కద్దు. అట్టి సందర్భమున, ఈ శేషత్వానుసంధా
నము అధికారముతోం జేరును. "క్షేత్రజ్ఞస్యేశ్వరజ్ఞానాద్విశుద్ధిః
పరమా మతా" (జీవునికి సర్వేశ్వరుని తెలుసుకొనుటచే మంచి
పరిశుద్ధి కలుగంగలదు) అని చెప్పినది శేషివిషయమగు తత్త్వజ్ఞా
నము విషయమైనది మాత్రమేయగునప్పుడు, అది ఉపాసా
నర్హతానివృత్తిం దెలుపునది కాంగలదు. ఉపాయ రూపమగు
జ్ఞానాంతరవిషయమైనదియగునప్పుడు, మోక్షపరము కాంగలదు.
ఈ ప్రణవార్థానుసంధానక్రమమును "ఈదృశః పరమాత్మాయం
ప్రత్యగాత్మా తథేదృశః। తత్సంబంధానుసంధాన మితి యోగః
ప్రకీర్తితః' (పరమాత్మ స్వరూపం బిట్టిదియనియు, ఆత్మస్వరూ

సంబంధిదియనియు, వీరి యుభయులకుఁగల సంబంధం బిట్టిది యనియు నిప్పిధమగు యోగము ప్రణవముచేఁ దెలుపఁబడి నది) అని శాండిల్యమహర్షి చెప్పియున్నాడు.

ఈ యర్థమును 'అకారార్థో విష్ణుర్జగదుదయరక్షాప్రళయకృన్మకారార్థో జీవ స్తదుపకరణం వైష్ణవమిదం । ఉకారోఽనన్యార్హంనియమయతిసంబంధమనయో స్త్రయీసారస్త్ర్యాత్మా ప్రణవఇమమర్థంసమడిశత్' (అకారము జగత్తుయొక్క సృష్టి స్థితి లయంబులకు కారణభూతుండగు విష్ణువును తెలుపు నది. మకారము జీవుని తెలుపుచున్నది. విష్ణుసంబంధియగు ఈ యాత్మవస్తువు విష్ణువుకు శేషభూతంబైనది. ఉకారము వీరి కుభయులకుఁగల అనన్యార్హ సంబంధమును తెలుపునది. మూఁడు అక్షరములుకలదై వేదసారంబగు ప్రణవము ఈయర్థములఁ దెలుపునది) అను తావున భట్టరువారు వివరించియున్నారు. 'కణ్ణపుర మొన్రుడైయానుక్కడియేనొరువర్కుఆ యేనో' (తిరుక్కణ్ణపురమున వేంచేసియున్నట్టి స్వామికి దాసుండనైనట్టి నేను వేఱొక్కనికి దాసుండ నగుదునా?) అను తావున ఆళ్వారులు ఈ యర్థమును వివరించియున్నారు. ప్రణవమునందుండు మూఁడు అక్షరములును మూఁడు వేదములయొక్క సారంబు లని శ్రుతులును వివరించి తెలిపియున్నవి. ఈ యక్షరములు ఈ యర్థమును తెలుపుట యెట్లనిన,

శ్లో॥ అష్టాక్షరశరీరాంగ ప్రణవాద్యక్షరేణ తు।
అకారేణాఖిలాధారః పరమాత్మాభిధీయతే॥

తా॥ అష్టాక్షరమంత్రమునందుండు ప్రణవమునందలి అకారముచే సర్వాధారుండగు పరమాత్మ తెలుపఁబడుచున్నాడు.

శ్లో॥ సమస్తశబ్దమూలత్వా దకారస్య స్వభావతః।
సమస్తవాచ్యమూలత్వాత్ బ్రహ్మణోపి స్వభావతః॥
వాచ్యవాచకసంబంధ స్తయో రర్థాత్ప్రతీయతే॥

తా॥ అకారము స్వభావసిద్ధముగానే సర్వశబ్దములకును మూలమగుటం జేసియును, బ్రహ్మమున్ను స్వభావసిద్ధముగానే సమస్తపదార్థములకును మూలమగుట జేసియును, ఈ రెంటికిని వాచ్యవాచక సంబంధము అర్థసిద్ధము.

అని శ్రీవామనపురాణమునం జెప్పియున్నట్లు, సర్వశబ్దంబులకును మూలభూతంబగు ప్రథమాక్షరముచే సర్వపదార్థములకును మూలభూతుండగు నారాయణుండు తెలుపంబడుచున్నాడనెడి యీ యర్థమును శ్రీ భాష్యకారులవారును వేదార్థసంగ్రహమను గ్రంధమున సాయించియున్నారు. ఇందువలన ఉపనిషత్తులయందు జగత్కారణత్వ ప్రతిపాదక వాక్యముచేఁ దెలుపఁబడునట్టి సకలజగన్నిమిత్తోపాదాన కారణత్వమున్ను, అందు మూలముగ సూచితంబగునట్టి సర్వజ్ఞత్వ సర్వశక్తిత్వాదిగుణవర్గమున్ను ఈ యక్షరముచేఁ దెలుపఁబడినవి యగుచున్నవి.

ఈ యక్షరము భగవంతుని తెలుపునదియనెడి విషయము 'అ నిషేధే పుమాన్ విష్ణౌ' అను నిఘంటువునందును, 'అకారో విష్ణువాచకః' అనియు, 'అ ఇతి భగవతో నారాయణస్య ప్రథమాభిధాన మభిదధతా కిన్నామ మంగళం నకృతం' అనియును ఇవ్విధములగు ప్రయోగములయందును ప్రసిద్ధమైనట్టి విషయము.

ఈ అకారము వ్యాకరణ శాస్త్రప్రకారము వ్యుత్పత్తినిబట్టి సర్వేశ్వరుని తెలుపునప్పుడు, రక్షణ, ప్రీణనాదులఁ

దెలుపునట్టిదియగు 'అవరక్షణే' అనుధాతుతో కర్తృవాచక
మగు క్విప్ప్రత్యయముం జేర్పగా, నందువలన నిష్పన్నంబైనట్టి
పదమ్మె, సర్వరక్షకుండైనట్టి వానిం దెలుపఁగలదు. ఈ ధాతువు
అనేకార్థములు గలదియైనను, రక్షణార్థమునందు మిక్కిలి పసి
ద్ధంబైనందునను, ఇట్టి యర్థము ఈతావున ఆవశ్యకమైయుండుచు
నున్న, ఈతావున ననేకయర్థము లనుసంధేయంబులగుటలో
నియామకం బెద్దియును లేకపోవుటం జేసియును, మొదట
చెప్పినట్టి రక్షణార్థము అనఁగా సర్వరక్షకుండనెడి యర్థము
శబ్దవేద్యంబైనది గాను, అట్టి రక్షణము కావశ్యకములగు శక్తి
నవియన్నియును అర్థసిద్ధము లయినవి గానును అనుసంధించు
కొనుట యుచితంబని తలంచి, పూర్వాచార్యులు ఇట్టి యర్థ
మునే వ్యాఖ్యానములయందు సాయించియున్నారు.

ఈ రక్షకత్వమనునది యీయాపదార్థముల విషయమున
మాత్రమనుటకు నియామకంబెద్దియును లేనందున, నదియన్నిం
టివిషయముననవియెఉంగునది. రక్షించునట్టివిధములు, ఆయా
విషయముల కనుగుణముగ ప్రమాణములు చూపించినట్టి విధ
మున, నానా ప్రకారములుగా నుండగలవు. సర్వేశ్వరుండు
దీనిం బట్టియే రక్షించునని యిట్లు దేనినిన్ని హేతువునుగా
నిర్దేశించి చెప్పియుండనందున, నతండు నిర్హేతుకముగా
రక్షించుచునని తెలియవచ్చినను, అపరాధ భూయిష్ఠులగు
ఈ సంసారులకు మోక్షాదుల నొసంగుటలో స్వతంత్రుండగు
సర్వేశ్వరుండు, తానే కల్పించినట్టియేదొక హేతునుబట్టియే
క్షింపఁగలడు. నిత్యుల విషయమునను, ముక్తులవిషయము
నను్న నిరుపాధికంబగు సహజకారుణ్యముచేతనే స్థిరమైనట్టి

రక్షణము సంపూర్ణముగాఁ గలుగఁగలదు. ఇట్లు స్వాభావికం ముగానే యొసర్పఁబడునట్టి రక్షణము, ప్రాతికూల్యములుతట స్థించినప్పుడు అనాదులగు అపరాధముల మూలముగ గలిగినట్టి భగవన్నిగ్రహమువలన ఆటంకపఱుపఁబడినది కాఁగలదు.ఇట్లు ఆటంక పఱచునట్టిదియగు యీ హేతువును తొలగించుటకు గానే ప్రపత్తి మొదలుగాఁగల సాధనములు శాస్త్రముచే తెలుపఁ బడుచున్నవి.

శ్లో॥ త్రాణేస్వామిత్వమాచిత్యం వ్యాసాద్యాస్సహకారిణః।
ప్రధానహేతు స్స్వాతంత్ర్యవిశిష్టా కరుణా విభోః॥

తా॥ రక్షణవిషయమున స్వామిత్వమావశ్యకము. అందుల కు వ్యాసాద్యాచార్యులు సహకారులు. ప్రధానహేతువు స్వా తంత్ర్య విశిష్టంబగు భగవత్కారుణయే.

అన్నట్లు, సర్వరక్షకుండగు సర్వేశ్వరుండు,

శ్లో॥ లక్ష్మ్యాసహహృషీకేశో దేవ్యాకారణ్యరూపయా।
రక్షకస్సర్వసిద్ధాంతే వేదాంతేషుచ గీయతే॥

తా॥ భగవంతుండు కారుణ్యరూపిణియగు లక్ష్మీదేవితోఁ గూడియున్నట్టివాఁడై రక్షకుండుగాను సర్వ సిద్ధాంతముల యందును, ఉపనిషత్తులయందును తెలియవచ్చుచున్నాడు.

ఇత్యాదితావులఁ జెప్పియున్నట్లు, సపత్నీకుండుగాను తెలియవచ్చుటవలన ప్రకృతమునకుప్రమాణసిద్ధంబైనట్టి యుప యోగ విశేషంబగు పత్నీసంబంధము ఈ అకారమునందు అర్థాత్సిద్ధము. ఇట్లు వీరుభయులు నొక్కరితోనొక్కరు ఎల్లప్పు డును చేరియుండుటనుబట్టి సర్వేశ్వరుని వేరొకానినట్టి తావుల సంతటనున్ను పిరాట్టి నిన్ని వేరొకాని (యున్నామని «తదం

తర్భావాన్త్వం నపృథగ దభిధత్తే శ్రుతిరపి" (ఓలక్ష్మి నీవు సర్వదా భగవంతునితోఁ జేరియుండుటంజేసి శ్రుతియును నిన్ను ప్రత్యేకముగా పేర్కొనుచుండలేదు) అనుటచే పూర్వాచార్యులు సమర్థించియున్నారు. కావున స్వరూపనిరూపకధర్మములు సమస్త విద్యలయందును చెప్పియున్నట్టి విధమున, వాటిలో ప్రధానంబైనట్టి యీ విశేషణము (పిరాట్టి) సమస్తవిద్యలయందును అనుసంధించుకొనవలసినది. కావుననిది దేవతాంతరములనుండి సర్వేశ్వరునికిఁగల భేదముఁ దెలుపుట నన్నింటిని మించియున్నట్టివాఁడగు సర్వేశ్వరునియొక్క స్వరూపమును నిరూపించునది (నిష్కృష్టముగాఁ దెలుపునట్టిది) కాఁగలదు. సర్వేశ్వరునియొక్క స్వతస్సిద్ధముగ గొప్పవియగు స్వరూపవిగ్రహ, విభూతులు «భాస్కరేణప్రభాయథా" సూర్యుతో ప్రకాశమువలెనే సర్వేశ్వరుని విడువక యుండునట్టియీమెయొక్క స్వరూప, విగ్రహ విభూతులచేతను ఇంకను గొప్పవియై వృద్ధిపొంది యుండగలవని దేవతాపారమార్థ్యమును బాగుగా గుర్తెఱింగియున్నట్టి మహర్షులు విశదముగాఁ దెలిపియున్నారు. ఇవ్విధముననే నారాయణశబ్దమునందును పత్నీసంబంధమును సంధించుకొనవలసినది. ఈ పత్నీసంబంధము ద్వయమునందు కంఠోక్తము. ద్వయార్థమును వివరించునదియగు శరణాగతిగద్యయందు మొట్టమొదట «భగవన్నారాయణా" అని యారంభించి, చెప్పుకొని పోవునప్పుడు, ఈ నారవర్గములో (ఆత్మలసమూహములో) మధ్యను ఈమెను పేర్కొనినదియును పత్నీత్వనిబంధనమగు పతిపారార్థ్యమును (భర్తకుగానేయుండుటను) బట్టియును 'నరసంబంధినో నారాః' అనువ్యుత్పత్తినిబట్టియును కావచ్చును.

ఈ తావున ప్రథమాక్షరము చతుర్థ్యేకవచనాంతమై విభక్తి లోపించియున్నది. అది యెట్లనిన, పరమాత్మకు స్వాత్మను సమర్పింపుమని విధించినప్పుడు, ప్రణవమును మంత్రముగా విధించుటం జేసియును, ఇది యనుష్ఠేయంబగు అర్థమును తెలుపునదియగుట యుచితంబగుటం జేసియును, సమర్పింపఁబడునట్టి యాత్మ తృతీయాక్షరముచేఁ దెలుపఁబడుటం జేసియును, దీనికి ఉద్దేశ్యంబగు పరబ్రహ్మము ప్రథమాక్షరమునందు ధాతువుచేఁ దెలుపఁబడుటం జేసియును, ఉద్దేశ్య వస్తువునున్ను సమర్పణీయంబగు వస్తువనున్ను సమానాధికరణమునఁ బ్రయోగించుట యుచితము కాకపోవుటం జేసియును, ఉద్దేశ్యవస్తువాచకశబ్దమునకు అనురూపంబగు చతుర్థీవిభక్తిని యీ తావున గొనుట అవశ్యకము. ప్రథమ తృతీయాక్షరములను సమానాధికరణమున నుండునట్టి వాటినిగాఁగొని, అవి జీవాత్మపరమాత్మల కైక్యముఁ దెలుపునవి యని చెప్పునట్టి యద్వైతులయొక్క మతమున అనేక ప్రమాణములతో విరోధమున్ను, మంత్రమునఁ జెప్పబడినట్టి "నమః" అను శబ్దము, "నారాయణ" అను శబ్దము "ఆయ" అను చతుర్థీవిభక్తులయొక్క స్వరసంబగు అర్థముతో విరోధమున్ను రాఁగలవు. మరియు ఉపనిషత్తులయందు ఆత్మను బాణమునుగాను, బ్రహ్మమునులక్ష్యమునుగాను, ఆత్మసమర్పణమును లక్ష్యమును గురిపెట్టి కొట్టుటనుగానును వర్ణించి చెప్పినట్టి వాక్యమువలననున్ను ఈ యర్థము తెలియఁగలదు. ఈ తావున భరసమర్పణము అర్థమగుపక్షమున, సాక్షాత్తుగ ఉచ్చరింపఁ బడునప్పుడు ప్రణవమునందుండునట్టి చతుర్థికి అర్థముచేసికొనినట్లు యీ

చతుర్థికిన్ని అర్థము చేసికొనవచ్చును. ఈతాత్పునప్రణవము శేష త్వస్వరూప ప్రతిపాదన పరమగునప్పుడు ఈ చతుర్థి తాదర్థ్య మును వివక్షించుటంజేసి,ఆత్మ పరమాత్మలయొక్క శేష శేషి భావము తెలుపఁబడుచున్నది. కావున నిరుపాధిక సర్వశేషి యగు ఈశ్వరునిబట్టి ఈజీవుండు తానున్న నిరుపాధిక శేషభూ తుండని యనుసంధించుకొనునది. ‚‚త్వంమే=నీవు నాకుదాసుం డవు '' అని భగవంతుండు, స్వయముగా నంగీకరించినచో, ‚‚అహంమే=నేనుస్వతంత్రుండను'' అని యెదిరించి మాట్లాడు నట్లుచేయునట్టి, యహంకారముమూలముగ అసత్కల్పుండగు ఈజీవాత్మను శేషత్వానుసంధానము ఉజ్జీవింపఁ జేయునట్టిది యగుటంజేసి, దీనియొక్క ప్రాముఖ్యత తెలియవచ్చుటకు గాను ధర్మిని (పరమాత్మను) తెలుపుటకు ముందుగా అట్టిపరమాత్మ తోఁగలసంబంధము (శేషత్వము) తెలియబడినది.

శ్లో॥ నిశ్చితే పరశేషత్వే శేషం సంపరిపూర్యతే।
అనిశ్చితే పునస్తస్మిన్నన్యత్సర్వ మసత్సమం॥

తా ॥ సర్వమును సర్వేశ్వరునికి శేషభూతంబైనదియని నిశ్చితంబగునేని,తక్కినదంతయును సమాధానపఱచి చెప్పఁద గియుండును. శేషభూతంబనెడి విషయము నిశ్చితము కాని యెడల, తక్కినదంతయును అసత్కల్పముగా నెన్నఁదగియుండు ను. అనిచెప్పియున్నది.

ఇట్లు సర్వేశ్వరుండు సర్వమునకును శేషి యగున ప్పుడు, ‚‚అస్యామమచ శేషాహి విభూతి రుభయాత్మికా ఇతి శ్రుతిశిరసిద్ధం మచ్ఛాస్త్రేప్యపిమానద''(చేతనాచేతనాత్మక బగు ఈ విభూతినాకున్ను లక్ష్మీదేవికిన్ని శేషభూతం బైన

ఈవిషయము వేదాంతములయందును, పాంచరాత్రాది శాస్త్ర
ములయందును తెలియఁగలదు" అనియు, "ఉభయాధిష్ఠానం
చైకం శేషిత్వం" (శేషిత్వమొక్కటి యిద్దఱియందునుండునది)
అనియును చెప్పియున్నట్లు సపత్నీకుండు గానుండును; అగ్ని
షోమీయాదిక్రతువులయందువలెనే ఆత్మరూపమగుహవిస్సును
సమర్పించుట కుద్దేశింపఁబడునట్టి దేవతాత్వము ఉభయులకును
కలదని తెలుపుటకుగాను శేషియైనట్టివారు ఇద్దరుగానుండ,
శేషిత్వ మొక్కటిగానున్నదని చెప్పఁబడినది. మధ్యమాక్షర
మును (ఉకారమును) లక్ష్మీవాచకమును గాను తెలుపునట్టి
దియగు కఠవల్లీ శ్రుతిని పరిశీలించితిమేని, యిచ్చట ఉభయుల
కును ఈయాత్మ శేషభూతం బైనదియనెడి విషయము
స్పష్టముగా శబ్దము చేతనే చెప్పబడినట్లు తెలియగలదు.

శేషత్వమనఁగా తనకొక యుపకారమునుద్దేశించియా
శ్రయింపక, పరునకొక యుపకారము నొనర్చుటకుఁ దగినదై
యుండుట. ఈవిషయమును "పరగతాతిశయాధానేచ్ఛయా
ఉపాదేయత్వమేవ యస్య స్వరూపం స శేషః పరశ్శేషీ" (పరు
నికొక యతిశయముఁ గలుగఁజేయువలయు ననెడి యిచ్ఛను
బట్టి యుపాదేయంబగుటయే దేని స్వరూపమో, అది శేషము
పరుండు శేషి.) అని వేదార్థసంగ్రహమునందు శ్రీభాష్యకారుల
వారు తెలిపియున్నారు. (కఠ) శ్రుతియందుఁ గానబడునట్టి షష్ఠీ
విభక్తి ద్వివచనము ఈతావున లోపించియున్నది. ఈతావున
సంబంధ సామాన్యమును తెలుపుటకై ప్రవర్తించినట్టి షష్ఠీ
విభక్తి ప్రమాణసిద్ధంబై, యపేక్షితంబగు అర్థమును తెలుపు
టలో నుపయోగపడుచున్నది. తాదర్థ్య(రక్ష్యరక్షకభావ)రూప

మఱి ఉపయుక్తంబైనట్టిసంబంధవిశేషము తెలియవచ్చుటకు
గాను చతుర్థీవిభక్తి ద్వివచనము వచ్చి లోపించినదని కాని చె
ప్పవచ్చును. ఇవ్విధముగఁ గొనునప్పుడు, ఈయాత్మ పిరాట్టికిని,
పెరుమాళ్లకున్ను ఉభయులకును శేషభూతంబైనదనియని తెలు
పునట్టి(కర)శ్రుతి అట్లు లుప్తమైనట్టిచతుర్థీద్వివచనముయొక్క
యర్థమును వివరించునది కాఁగలదు. ఇట్లు హవిస్సునిచ్చుటకై
యుద్దేశింపఁబడినట్టి దేవతాద్వంద్వమునకు హవిస్సువలెనే వీరిద్ద
ఱికిన్ని యీ యాత్మ శేషభూతంబైనది యని చెప్పునప్పుడు,
(ఉకారమునకు) అవధారణము అర్థము. అందువలన ఈయాత్మ
వీరిద్దఱికిన్ని అనన్యార్హశేషభూతంబైనదియనిసిద్ధమగుచున్నది.

ఈ మధ్యమాక్షరము, శ్రుతియందు లోపించియు
న్న ప్రకారము, అవధారణార్థముకలది యగునప్పుడు, ఈదం
పతులకుతప్ప తక్కిన వారికి యీయాత్మ శేషభూతంబైనది
యని యాక్షేపింప కుండుటకుగాను అన్యయోగవ్యవచ్ఛేదము
(అతివ్యాప్తి రాహిత్యము) ఈతావున శబ్దముచేతనే తెలుపఁ
బడుచున్నది. ఇందువలన ఈ యాత్మ యితరులకు శేషభూతం
బగుట స్వరూపానుగుణంబైనది కాదని తెలుపుటచే నరియై
నట్టి యాత్మజ్ఞానము కలవానికి, భాగవతుల పర్యంతము అన్య
శేషత్వము నివర్తించినదాయెను. భగవంతునికి మిక్కిలి యి
ష్టంబగునట్టిభాగవతశేషత్వమునుబట్టి యన్యశేషత్వదోషము
రాఁజాలదని పురుషార్థకాష్ఠాధికారమునఁ జెప్పియున్నాము.
ఇట్లు అన్యయోగ వ్యవచ్ఛేదము శబ్దముచేతనే తెలుపఁబడునట్టి
దియైనట్లయినను, అయోగవ్యవచ్ఛేదమున్ను (అవ్యాప్తిరాహి

దోష రాహిత్యమున్ను) *కాలసంకోచము లేక పోవుటం జేసిసిద్ధ మగుచున్నది. ఇట్టి శేషత్వముయొక్క యీయయోగవ్యవచ్ఛేదముచే సర్వేశ్వరునికి వానినుండి వేఱుగానుండనట్టి విశేషణముగాను తెలియవచ్చునట్టి యీచేతనవస్తువున్ను అచేతనవస్తువువలెనే శరీరభూతమైనది గాను తెలుపఁబడినది.

తృతీయాక్షరము (మకారము) ఈతావున అవశ్యముముగా అనుసంధించుకొనవలసినట్టి జీవుని పురస్కరించుకొని ముందుచెప్పినట్టి శేషత్వము కాశ్రయంబైనట్టి సర్వమును సూచింపుచున్నది. ఇది జీవాత్మ వాచకంబనెడి విషయము 'మకారం జీవభూతంతు శరీరే వ్యాపకం న్యసేత్' (మకారమును శరీరమునందు వ్యాపించియున్నట్టి జీవుని తెలుపునట్టి దానినిగా నెఱుంగునది) అనియు,

శ్లో॥ పంచార్ణానాంతుపంచానాం వర్గాణాంపరమేశ్వరః।
సంస్థితః కాదిమాంతానాం సర్వాత్మత్వేనసర్వదా॥

తా॥ కకారము మొదలు మకారమువరకు నుండునవియును, అయిదయిదు అక్షరములు గలవియునునగు అయిదు వర్గల చేతనున్ను తెలుపఁబడునట్టి తత్త్వములలో నంతరాత్మగాను సర్వదా భగవంతుం డుండియున్నాడు.

శ్లో॥ భూతానిచ కవర్గేణ చవర్గేణేంద్రియాణిచ।
టవర్గేణ తవర్గేణ జ్ఞానగంధాదయ స్తథా॥

తా॥ కవర్గచే పంచభూతములు తెలుపఁబడుచున్నవి. చవర్గచే ఇంద్రియములు తెలుపఁబడుచున్నవి. టవర్గచేతనున్ను తవర్గచేతనున్ను జ్ఞానగంధాదులు తెలుపఁబడుచున్నవి.

2 * ఇక్కాలమున శేషభూతుండుకాడని యిట్లు శేషభూతుండుగా నుండునట్టి కాలమునకు కొరతలేనందున నని యర్థము.

శ్లో॥ మనః పకారేణైవోక్తం ఫకారేణత్వహంకృతిః॥
బకారేణ భకారేణ మహాన్ ప్రకృతిరుచ్యతే॥
ఆత్మాతుస మకారోయం పంచవింశః ప్రకీర్తితః॥

తా॥ పకారముచే మనస్సు తెలుపఁబడుచున్నది. ఫకారముచే అహంకారము తెలుపఁబడుచున్నది. బకారముచేతనున్ను భకారముచేతనున్ను మహత్తున్ను ప్రకృతిన్ని తెలుపఁబడుచున్నవి. ఆత్మ మకారముచేఁ దెలుపఁబడుచున్నది. కావుననది ఇరువదియైదవ తత్త్వముగా చెప్పఁబడినది.

అని యిట్లు తత్త్వసాగర సంహితాదులయందు ఇరువదియైదు తత్త్వములకును కకారము మొదలుకొని యిరువదియైదు అక్షరములున్ను వాచకములుగాను బాగుగాఁ జెప్పియున్నందున, సిద్ధమగుచున్నది. కావున జడత్వాచేతనత్వాది దోషాశ్రయంబులగు ఇరువదినాల్గుతత్త్వములకంటెనున్ను, సర్వకారణముగానును, సర్వరక్షకుండుగానును, సర్వశేషిగాను ప్రథమాక్షరముచేఁ దెలుపఁబడునట్టి యిరువదియాఱవ వాఁడగు సర్వేశ్వరునికంటెను జీవాత్మ వేఱయినవాడని సిద్ధించుచున్నది.

ఈ తిరుమంత్రమునందుండునట్టి మకారములును, నారశబ్దమున్ను సప్పర్ణను వివక్షించుటంజేసి, విశేషణమాత్రములుగాఁ గొనఁదగినవి. ఈ యక్షరము (మకారము)యొక్క వ్యుత్పత్తిని వ్యాకరణశాస్త్రప్రకారము విచారించితిమేని, యిది 'మనజ్ఞానే' అను ధాతువునుండి నిష్పన్నమైనట్టి పదమగుటంజేసి, 'జ్ఞోఽత ఏవ' అను అధికరణమునఁ జెప్పియున్న ప్రకారము జ్ఞానస్వరూపుండై, జ్ఞానగుణకుండై, అణువైనట్టి జీవా

త్మను దెలుపునది. ఆత్మ జ్ఞానస్వరూపుండని సామాన్యముగాఁ జెప్పినను, ఈతని స్వరూపము అనుకూల(సుఖ) మైనదిగాను ప్రమాణములవలనఁ దెలియవచ్చుటంజేసి, యిది యానందరూపమనియును సిద్ధించును. జ్ఞానగుణకుండని చెప్పినట్లయిన, ప్రమాణానుసారముగ, ముక్తదశయందు నిరుపాధికముగ ప్రసరించునదియై, సంకోచరహితంబగు జ్ఞానము గుణమని తెలియఁగలదు. ఇట్లు పరిశుద్ధంబగు స్వాభావికస్వరూపమును పరిశీలించి చూచినట్లయిన, అచేతన వస్తువులకుఁగల జడత్వాదులున్ను, సంసారదశయందుఁగల క్లేశాదులున్ను ఇవి యేవియును లేనిదియగుటంజేసి స్వరూపధర్మములకు రెంటికిఁగల నిర్మలత్వము ఈ తావున గ్రహింపఁబడినది యగుచున్నది. ఇట్లు పరమాత్మకు శేషభూతుండుగా నుండుటయనెడి పరిశుద్ధ స్వరూపమే ముక్తదశయందు అనుసంధించుకొనవలసినదని 'వ్యతిరేకస్త ద్భావభావిత్వాన్న తూపలబ్ధివత్' అను బ్రహ్మసూత్రముచేఁ దెలుపఁబడినది. ఈతనికి ముముక్షుదశయందు ఫలదశానుసంధానము అనఁగా మోక్షదశయందు తనకుఁ గలుగఁగల స్వరూపము ననుసంధించుకొనుట ఫలాపేక్షకు అనుకూలంబైయుండగలదు. ఆయా పురుషార్థముల కనుగుణముగ అనుసంధాన విధములును వెవ్వేఱుగా నుండగలవని శ్రీ భగవద్గీతలయందు అష్టమాధ్యాయమునందును, భాష్యాదులయందును స్పష్టముగాఁ దెలియఁగలదు.

జీవభేదము ప్రమాణసిద్ధంబగుటంజేసి ఈ తృతీయాక్షరము(మకారము) "నాత్మా శ్రుతేః" ఇత్యాది తావులయందు వలెనే జాత్యేక వచనముగాఁ గొనఁదగినది.

ఇట్లు ఈతావున జీవతత్త్వము నంతయును 'దాసభూతాస్స్వతస్సర్వే హ్యాత్మానః పరమాత్మనః' (ఆత్మలన్నియును పరమాత్మకు దాసులు) అన్నట్లు సామాన్యముగ భగవచ్ఛేషభూతమని చెప్పియున్నను, అందులో తానున్ను అంతర్భూతుండగుటంజేసి, 'అతోహ మపి తేదాసః' (అందువలన నేనున్ను నీకుదాసుండను) అనుయనుసంధానమున్ను సిద్ధించును.

ఈతావున శేషత్వజ్ఞానమున్ను స్వస్వాతంత్ర్యాభిమాననివృత్త్యాదులును, ప్రపత్తి నవలంబించుటయును, ఫలమగు కైంకర్యముకై ప్రార్థించుటయును ఇవి తనకు కలుగంగలవి యగుటంజేసి, తనను ఈతావున ప్రధానముగాఁ దెలుపవలయును కావున తృతీయాక్షరమునకు విశేష్యముగాను 'అహం = నేను' అను పదమును ఈతావునఁ గొని తెచ్చిపెట్టుకొని యర్థముచేసికొనునది యని కొందఱు ఆచార్యులు చెప్పుచున్నారు.

అవ్విధముగా అర్థముచేసికొనినప్పుడున్ను, "మమ నాథ యదస్తి యోస్మ్యహం" ఇత్యాది తావునఁ జెప్పియున్నట్లు గుణములు ప్రధానవస్తువుతోఁ గూడనే యుండునని యెడి న్యాయప్రకారము తనకు శేషములగు (తనకుఁగల) గుణములున్ను ఈతావున గ్రహింపఁబడుచున్నవి.

అస్మత్ (అ + స్ + మ్ + అ + త్) శబ్దమునందు వ్యంజనమాత్రముగా నుండునట్టి మకారముఁగొని *ఛాందసప్రక్రియచే పూర్వోత్తర భాగములు (అస్ + అత్) లోపింపఁగా మిగిలియున్నట్టి తృతీయాక్షరమే (మకారమే) 'అహం=నేను' అను అర్థమును తెలుపునని మఱికొందఱు ఆచార్యులు అర్థముచేయు

* ఇట్టిప్రక్రియను నిరుక్తమునందు యాస్కాచార్యులవారు అవలంబించిరి.

చేయుచున్నారు. పరమాత్మకు ఆత్మరూపమగు హవిస్సమర్ప
ణను విధించునట్టి న్యాసవిద్యయందు ప్రణవమును మంత్రము
నుగాను చెప్పియున్నందుననను, ఇది యనుష్ఠేయార్థముఁ దెలు
పుటకుగాను దీనిలో పరావరాత్మలను దెలుపునట్టి శబ్దము
కావలసియున్నట్లయిన, ప్రమాణానుసారముగ ప్రథమాక్షర
ము ఉద్దేశ్యవస్తువుయొక్క స్వరూపముఁ దెలుపుట చేతనున్ను,
మధ్యమాక్షరము యొక్క యర్థము వేఱొక్కటియైనందునను
న్ను, తుదకు తృతీయాక్షరము సమర్పింపవలసినట్టి ప్రత్యగాత్మ
రూపమగు హవిస్సును తెలుపవలసి యుండుటం జేసియును యీ
యక్షరమునకు 'అహం=నేను' అని యర్థమగుట చాలబాగుగా
నుండగలదు. కావుననే కదా భట్టరువారును ఈతావుననుండు
ప్రణవమును 'అకారార్థాయైవస్వం' (నేను అకారవాచ్యుం
డగు భగవంతునికే శేషభూతుండననుట ప్రణవార్థము) అని
వ్యాఖ్యానము చేసియున్నారు.

ఇవ్విధముననే 'నమః' అను తావుననుండు మకారము
మూటిలో నొక్కవిధముగ ప్రత్యగాత్మను తెలుపుచున్నది.
ఇది షష్ఠీవిభక్త్యంతమైనందునను, నకారము నిషేధమును
తెలుపునది యైనందునను, 'నమమ=నాదికాదు' అనిసిద్ధమగు
చున్నది. నిషేధమునందొకవిధమైనట్టి యాదరమును సూచిం
పఁజేయుటకుగాను, నకారము ముందుగ ప్రయోగింపఁబడినది.
* 'దృష్టాసీతా' అనుతావునందువలెనే ప్రకృతమున ననుట,

ఈమకారమునందుండు షష్ఠీవిభక్తి సంబంధమును
సామాన్యముగ తెలుపుచు అందుమూలముగ ఉచితంబగునట్టి

---

* దర్శనమును ప్రధానముగాఁగొనుటచే 'దృష్టా' అను శబ్దమును
నిచట ప్రయోగించినట్లనుట.

సంబంధవిశేషముఁ దెలుపుచున్నది. ఈ యభిప్రాయమును బట్టియే భట్టరువారును «అథమహ్యాం న» (నాకు నేను శేషభూతుండనుకాను) అని [illegible]చినారు, వాక్యములకు అవధారణార్థమున తాత్పర్యముఁ గొనుట యుచితంబగుటం జేసి [illegible] ప్రణవమునందు మధ్యమాక్షరముచేఁ దెలుపఁబడున [illegible] ర్యార్థముయొక్క యర్థమే అన్నింటియొక్కయును సారంబ[illegible],

శ్లో॥ ద్వ్యక్షరస్తు భవేన్మృత్యుః త్ర్యక్షరం బ్రహ్మ శాశ్వ[illegible]
మమేతిద్వ్యక్షరోమృత్యుః నమమేతిచ శాశ్వతం॥

తా॥ రెండు అక్షరముల పదము సంసారము. మూడు అక్షరముల పదము బ్రహ్మము. అనఁగా [illegible] = నాది అనెడి యభిమానము సంసారహేతువు (నమమ= [illegible]ది [illegible]దు) అను జ్ఞానము మోక్షహేతువు. ఇ[illegible] తాపులఁ జెప్పఁబడినది.

శ్లో॥ సర్వంజిహ్మం మృత్యుపదం ఆర్జవంబ్రహ్మణఃపదం।
ఏతావాన్ జ్ఞానవిషయః ప్రలాపః కింకరిష్యతి॥

తా॥ కుటిలప్రవర్తనమంతయును సంసారహేతువు. సరళప్రవర్తనము మోక్షహేతువు. జ్ఞానమనఁగా సిద్ధియే. వృథాప్రలాపమువలననేమి ప్రయోజనము?

ఈపైని యుదహరించినట్టి శ్లోకమున్ను ఈనమశ్శబ్దముయొక్క యర్థమునే ప్రధానముగాఁ గొని యిట్లు చెప్పుచున్నది.

ఈ తాపున (నమమ=నాదికాదు) అని చెప్పినది దేని నంటివేని, ప్రణవమునందుండు తృతీయాక్షరమును అనువర్తింపఁ జేసికొని నేను నాకు శేషభూతుండను కాననియర్థము చేసికొనునది. అధ్యాహారము (లేనిదానిఁ దెచ్చిపెట్టుకొనుట) కంటెను న్న అనుషంగము (ముందున్నట్టిదానిని అనువర్తించుకొనుట) ఉచితంబని అనుషంగాధికరణమునఁ దెలుపఁబడినది. ఈతాపున

'నమమాహం=నేను నాకు దాసుండను కాను' అని ప్రత్యేకించి నిషేధించినందున ముందు అన్యశేషత్వమును నిషేధించినట్టిది యగు మధ్యమాక్షరము గోబలీవర్దన్యాయ ప్రకారము, తనవిష యమున తప్ప తక్కినవాటివిషయము ననే నిషేధించునదియగును. 'అహం నమమ' అనువాక్యమువలన తన స్వరూపమున్ను తనకు శేషమైనట్టిది కానందున ప్రధానవస్తువుతోఁ బాటు గుణములన్నట్లు, (గుణవిగ్రహాదిరూపము గు) వేఱొక్కదాని విషయమునను్ను తనకు నిరుపాధిక స్వామిత్వము లేదని విశేషానుసంధానము సిద్ధించును. ఇది విశేష నిర్దేశముయొక్క యుపయోగము. ఇవ్విధమున అనువర్తించుకొనని పక్షమున, సామాన్యముగ తనతో సంబంధించినవి గాను తెలియువన్నవియన్నియును తనవికావనుకొనునట్లు తనతోఁగల సంబంధము ఛేదింపఁబడును. కావున నిట్లనువర్తించుకొనుటచే తన విషయమునను్ను తనయొక్క గుణవిగ్రహాదుల విషయమునను్ను, తనకుఁగల యభిమానము పోఁగొట్టబడుచున్నందున విపరీతంబులగు అహంకారమమకారంబులు ఛేదింపఁబడుచున్నవి.

ఈతావున నిషేధింపఁబడునట్టి యహంకారము భ్రమరూపంబగు జ్ఞానవిశేషము. తత్త్వంబులలో నొక్కటియగు అహంకారము వివేకమాత్రముచే పోఁగొట్టబడునది కాదు. అది సూక్ష్మశరీరము విడుచువరకును ఈతనితోఁగూడయుండగలదు. ఈతనికిఁగల యీయచిత్సంబంధము పోకుండ యుండియుండఁగా, దీనియొక్క ఫలితంబులై, భ్రమరూపంబులగు అహంకారాది వ్యాధులు మూలమంత్రాదులవలనఁ గలిగినట్టి వివేకమనఁబడు శేషజమువలన తొలగింపఁబడుచున్నవి. తనకు అన్య

శేషత్వము కూడదని ప్రణవమునందుండు మధ్యమాక్షరము తెలుపుచున్నందున, అన్యుండగు తన విషయముననున్న తనకు శేషత్వము లేదని ప్రత్యేకించిచెప్ప నక్కఱలేదు గాన, వేఱొక్కదానికి శేషిగాను భావించుకొనినట్టి తనకు ఏదైన నొకదాని విషయమునఁగల నిరుపాధిక స్వామిత్వమును పోగొట్టుటయే యట్లు ప్రత్యేకించి చెప్పుటలో ముఖ్యోద్దేశమనియును చెప్పవచ్చును. అయితే ఈ లోకమున జీవునికి శేషభూతము లుగానుండునవి యన్నియును, నిరుపాధికముగ సర్వశేషియగు సర్వేశ్వరుండు తనకుగాను నొసంగినట్టివియే కదా! జీవులకు నిత్యముగా నుండునట్టి గుణాదులు సర్వేశ్వరుని కవి నిత్యము గా నుండవలయునని యనెడి సంకల్పమునుబట్టి యుండునవి. అశుద్ధ దశయందును శుద్ధదశయందునున్ను ఉండుచున్నట్టి అనిత్యా ములగు విగ్రహాదులు వీరియొక్క కర్మజన్యమును, కర్మనిరపే క్ష్యమునగు అనిత్యేచ్ఛవలన నేర్పడునవి. ప్రణవమునందు అన్య శేషత్వము నిషేధింపఁబడినందున పరమాత్మకంటెనున్ను వే ఱైనవాఁడగు తనకుతాను శేషభూతుండుకాడని సిద్ధించుటం జేసియును, తాను వేఱొక్కనికి శేషభూతుండు కానిచందం బున, వేఱొక్కటియును తనకు నిరుపాధిక శేషంబైనది కాదను విషయమున్ను అచ్చటనే తెలుపఁబడియున్నందునను ప్రణవమునందు తెలుపఁబడని స్వస్వాతంత్ర్య నివృత్తిని 'నమః' అనుపదము తెలుపుచున్నదనియును అర్థము చేసికొనవచ్చును అట్లర్థము చేసికొనినచో, పూర్వపదము(ప్రణవము)నందుండు మకారమును (నమః అనుతావున) అనువర్తించుకొనుటచే "నేను నాకు శేషభూతుండను కాను" అని సిద్ధమగుచున్నది.

ఈ తావున "స్వ స్వాతంత్ర్య" పదమును అధ్యాహారముచేసికొని "న మమ స్వాతంత్ర్యం" = నాకు స్వాతంత్ర్యములేదు. అని యొక అర్థము చేసికొనవచ్చును. ఈ చేతనునికి స్వ స్వాతంత్ర్య నివృత్తి యనఁగా — సర్వేశ్వరుని సంకల్పముతో నిమిత్తములేకుండ తనకు తానే యొకదానిని నొనర్చుట కవాఁడు కాకపోవుట. దీనిమూలముగ ఈజీవుండు బద్ధదశ యందును ముక్తావస్థయందును బుద్ధిపూర్వకముగ ప్రవర్తించినను, ఈశ్వరుండొసంగినట్టి దేహేంద్రియాదులఁ గొని, వానిచే ప్రేరేపింపఁబడుచు సహకారియుగానై ప్రవర్తించునది.

ఈ అకారముయొక్క ధాతువుచేఁ దెలుపఁబడినట్టి సర్వరక్షకత్వమనునది ఉపాయాధికారుల నెద్దియైన నొక యుపాయమున ప్రేరేపించుకొనియుండుటచేతనే యది యీశ్వరునికి రాఁగలదు. జీవుండు తన రక్షణముకుఁగాను ఉపాయానుష్ఠానము నొనర్చునప్పుడును, తనకుఁగల కర్తృత్వము సర్వేశ్వరుని యధీనములో నున్నట్టి దైనందునను, ఈ యుపాయము ననుష్ఠించినను,ఫలమగు రక్షణము నొనర్చునట్టివాఁడు అట్టి యనుష్ఠానమువలన ప్రసన్నుండైనట్టి సర్వేశ్వరుండే యైనందుననున్ను, ప్రథమాక్షరముయొక్క ధాత్వర్థముచేఁ దెలుపఁబడినట్టి వానియొక్క సర్వరక్షకత్వమే ఈ 'నమః' అను శబ్దముచేతనున్ను స్థిరపఱుపఁబడుచున్నది. ఇట్లు ప్రథ చతుర్థీవిభక్తిచేఁ దెలుపఁబడినదై ఈశ్వరునికిఁగలదియగు నిరుపాధిక సర్వశేషిత్వమున్ను, జీవునికి యెద్దియైన నొకదానివిషయమునఁగల నిరుపాధిక శేషిత్వమును నిషేధించునట్టి మొదటి యోజనవలన స్థిరపఱుపఁబడినది యగుచున్నది. ఈజీవునికిఁ

గల స్వాతంత్ర్యమున్ను 'పరాత్తు తచ్ఛ్రుతేః' అను బ్రహ్మ సూత్రమునఁ జెప్పియున్న ప్రకారము నిరుపాధిక స్వతంత్రుండై స్వార్థముగ ప్రవర్తించినట్టిపరమాత్మనుబట్టి వచ్చినదియే అట్లే తక్కినవస్తువుల విషయమున ఈ జీవునికిఁగల శేషిత్వమున్ను నిరుపాధిక శేషియగు సర్వేశ్వరుండొసంగఁగా, వచ్చినది.

శ్లో॥ శ్రీమాన్ స్వతంత్రస్స్వామీచ సర్వాత్మాన్యానపేక్షకః।
నిరపేక్షస్వతంత్రత్వం స్వామ్యంచాన్యస్యనక్వచిత్॥

తా॥ లక్ష్మీపతియును, వేఱొక్కదానితో నిమిత్తము లేకుండ స్వతంత్రుండును, స్వామియును సర్వేశ్వరుండొక్కండే. అట్టి నిరుపాధికమగు స్వాతంత్ర్యమున్ను, స్వామిత్వమున్ను వానికితప్ప వేఱొక్కనికి లేదు.

శ్లో॥ తారస్య నమసశ్చైవ సారౌదేశికదర్శితౌ।
అనన్యశరణత్వాదేరధికారస్య సిద్ధయే॥

తా॥ ఈరెండు అర్థములును ప్రణవముయొక్కయును నమస్సుయొక్కయును సారభూతంబులుగాను అనన్యశరణత్వాద్యధికారము సిద్ధించుటకై పూర్వాచార్యులచే యుపదేశింపఁబడినవి.

లోకమునందు స్వామిత్వమున్ను, స్వాతంత్ర్యమున్ను ఇవి యిష్టములైనవి గానును, దాసత్వమున్ను, పారతంత్ర్యమున్ను ఇవి ఇష్టములు కానివి గానున్ను యెన్నఁబడుటయును నది యివి యెద్దియైన నొకకర్మమును నిమిత్తీకరించుకొనివచ్చినప్పుడు మాత్రమే. ఈ తావున ప్రణవముచేతను నమః అను దానిచేతనున్ను క్రమముగ తెలుపఁబడునట్టివియగు దాసత్వ పారతంత్ర్యములన్ననో, 'దాసభూతాస్స్వతస్సర్వే' ఇత్యాది తావులఁ జెప్పియున్నట్లు స్వరూపప్రాప్తంబులగుటంజేసి, తత్త్వ

వేత్తల కనుకూలములుగా నుండగలవు. ఇవ్విధముగ అత్యంత పారార్థ్య (పరునికిగానే తానుండుట) పారతంత్ర్యములు సిద్ధించుటంజేసి, ""అడియార్కెన్నైయాట్పడుత్తవిమలన్" (భగవద్దాసులకు నన్ను దాసునిగాఁ జేసినట్టి విమలుండగు స్వామి) అన్నట్లు ఈజీవుండు స్వతంత్రుండగు శేషికి ఇష్టమువచ్చినట్లు ఉపయోగపఱచుకొనఁదగినట్టి వాఁడగుటచే భాగవతశేషత్వమున్ను ఈతావున సిద్ధమగుచున్నది. శేషియున్నై, స్వతంత్రుండున్నైనందున సర్వేశ్వరుండు -ఆత్మను తనకు ఇష్టులయినట్టి వారికి తన యిష్టముమీద దాసులనుగాఁ జేసినట్లయిన, అది సరికాదని చెప్పకూడదు. అందులకు వెనుదీయుటయున్ను కూడదు. సర్వేశ్వరుండు శేషియగుటచే ఈతనిని తనయిష్టము వచ్చినట్లు ఉపయోగపఱచుకొనుటకుఁ దగిన వాఁడు. స్వతంత్రుండగుటంజేసి, యందులకు సమర్థుండు. ""మన్ ప్ర మోర్ త్తైవముళ్తెన్నిరుప్పారోడో ట్రిలేన్ ప్రతుమున్నడి యార్కాడిమై" (వేఱొక్క దైవమును కొలుచునట్టి వారితో నేను చేరను. నేను యిష్టపడినది నీదాసుల కైంకర్యము) అను పాశురమునను్ను ఈయర్థము తెలియఁగలదు.

శ్లో॥ స్వేచ్ఛయైవ పరేశస్య తాదధీన్యబలాత్తునః।
భగవద్భక్తశేషత్వం స్వేచ్ఛయాపిక్వచిద్భవేత్॥

తా॥ మనము భగవదధీనులమగుటచే వాని యిచ్ఛవలన భగవద్భక్తులకున్ను శేషభూతులము. ఒకప్పుడు స్వేచ్ఛవలననున్ను అట్టివారల మగుదుము.

శ్లో॥ గుణాధిక్యేహివిషయే గుణసారస్యవేదినః
రామేరామానుజస్యేవ దాస్యం గుణకృతంభవేత్॥

తా॥ గుణాధికుండగు వాని విషయమున గుణస్వార
స్యవేత్తలగు వారికి శ్రీరామచంద్రుని విషయమున శ్రీలక్ష్మణ
స్వామివారికివలెనే గుణమూలకమగు దాస్యముండగలదు.

శ్లో॥ దాస్యమైశ్వర్యయోగేన జ్ఞాతీనాంచ కరోమ్యహం
అర్థభోక్తాచ భోగానాం వాగ్దురుక్తానిచ క్షమే॥

తా॥ ఐశ్వర్యమునుబట్టి జ్ఞాతులకున్ను దాస్యము నొ
నర్చుచు, వారిద్రవ్యము ననుభవించుచు, వారు మాట్లాడునట్టి
దుర్భాషలను సహించియున్నాడను.

శ్లో॥ ఇతి స్వోక్తినయాదేవ స్వభక్తవిషయే విభుః।
ఆత్మాత్మీయస్య సర్వస్య సంకల్పయతి శేషతాం॥

తా॥ ఇట్లు తాను స్వీయముగాఁ జెప్పుచున్నందుననే
సర్వేశ్వరుండు ఆత్మాత్మీయంబులయినట్టి వాటినన్నింటిని
తనకు శేషభూతంబులయినట్టి వాటినిగా సంకల్పించుకొని
యున్నాడు.

శ్లో॥ అన్యోన్యశేషభావోపి పరస్వాతంత్ర్యసంభవః।
తత్తదాకారభేదేనయుక్త ఇత్యుపపాదితః॥

తా॥ సర్వేశ్వరుని స్వాతంత్ర్యమునుబట్టి యుండునట్టి
పరస్పరము శేషత్వమున్ను ఆ యా యాకారభేదములనుబట్టి
యుక్తమే యని యుపపాదింపఁబడినది.

ఇవ్విధముగ శేషియగు సర్వేశ్వరునిచే సత్తగలవాఁ
డై, యకించనుండగు । ఈచేతనునికి అట్టి సర్వేశ్వరునివలననే
పురుషార్థము లభింపవలయునుగాన, వానిని వశపఱచుకొనుట
కై ద్వయమునందును చరమశ్లోకమునందును విశదముగాఁ
దెలుపఁబడునట్టి శరణవరణము యీతావున సూచింపఁబడును.

ఆత్మసమర్పణమున్ను శరణవరణమున్ను, ఒక్కదానిని
డిచి వేఱొక్కటి యుండకపోవుటంజేసి వీటిలో నొక్కదానిం
ప్పునట్టి శబ్దములయందును ఈరెండును వివక్షితంబులగును.
శ్లో॥ యస్సదేవోమయాదృష్టః పురాపద్మాయతేక్షణః।
సఏష పురుషవ్యాఘ్రస్సంబంధీ తే జనార్దనః॥
తా॥ ఇంతకుముందు పద్మాయతేక్షణుండుగాను నా
చే ఎవ్వండు సాక్షాత్కరింపంబడినాడో, అతండే యీ పురు
షోత్తముండును సంబంధియునగు జనార్దనుండు.
శ్లో॥ సర్వేషామేవ లోకానాం పితా మాతాచమాధవః।
గచ్ఛధ్వమేనం శరణం శరణ్యం పురుషర్షభాః॥
తా॥ అందఱికిన్ని తండ్రియును తల్లియున్ను మాధ
వుండే. ఓ పురుషశ్రేష్ఠులారా! మీరందఱును ఈతనిని శర
ణుజొచ్చుడు.
అని యివ్విధముగ ఉపదేశింపంగా,
శ్లో॥ ఏవముక్తాస్త్రయః పార్థాః యమౌచభరతర్షభ।
ద్రౌపద్యాసహితాస్సర్వే నమశ్చక్రుర్జనార్దనం॥
తా॥ ఇవ్విధముగ పంచపాండవులు ఉపదేశింపంబడినవారై
ద్రౌపదితోంగూడ శ్రీకృష్ణునికి నమస్కరించిరి, (శరణుజొచ్చిరి)
అని చెప్పియున్నందునను, దమయంతీ వృత్తాంతము
న, "శరణంప్రతిదేవానాం ప్రాప్తకాలమమన్యత" (దేవతలను
శరణుజొచ్చుటకు మంచి సమయమని తలంచెను) అని యూ
లోచించి "వాచాచ మనసాచైవ నమస్కారం ప్రయుజ్యసా"
(వాఙ్మనస్సులతో నామె నమస్కారమును (శరణాగతిని) ప్ర
యోగించెను) అనుటచేతనున్ను నమశ్శబ్దము శరణాగతి శబ్ద

స్థానమున పఠింపఁబడినందున ఇది (నమశ్శబ్దము) తనతో సంబంధమునుచ్ఛేదించుచు తనయర్థమును (వదలుకొనుచు) సపరికరంబగు స్వరక్షాభరసమర్పణమును తెలుపునట్టిదియగు కానవచ్చును. మఱియు, "నమః" అనునది ఆత్మసమర్పణమును దెలుపునది యనెడి విషయము,

శ్లో॥ సమిత్సాధనకాదీనాం యజ్ఞానాం న్యాసమాత్మనః।
నమసా యోఽకరోద్దేవే స స్వధ్వరఇతీరితః॥

తా॥ సమిత్తులు మొదలగు సాధనములుగల యజ్ఞ... అన్నింటిలోనును శరణాగతిపూర్వకమగు ఆత్మభరన్యాస... నదియేది కలదో, అదియేగొప్పయజ్ఞమనిపించుకొనుచున్న...

శ్లో॥ నమస్కారాత్మకంయస్మై విధాయాత్మనివేదనం ।

తా॥ నమస్కారాత్మకంబగు ఆత్మసమర్పణము నొనర్చిన వాఁడాయెను.

ఇత్యాది వాక్యములచేతనున్ను తెలుపఁబడినది.

ప్రణవము ఒక యక్షరమై, యొక పదముగా నుండఁగా, దానిని మూఁడు అక్షరములనుగాఁ జేసి, ఈ యక్షరములనున్ను ప్రత్యేకముగపదములనుగాఁ గొని, ఒకవాక్యార్థమునను సంధించుకొనుటయును, "నమః" అనునది ప్రణామముఁ దెలుపునట్టి యొక యవ్యయముగానుండఁగా, దీనిని విభజించి, వాక్యార్థముఁ జేయుటయును ఇది యంతయును నిరుక్తబలమువలన లభించినది. "నేను నాకు శేషభూతుండనుకాను" "నాయొక్క వ్యాపారాదులున్ను నాకు శేషములుకావు" "ఇవియన్నియును సర్వేశ్వరునికే శేషభూతములు" ఇవ్విధములగు అర్థంబులన్నియును "నమః" శబ్దమునందు వివక్షితంబులనెడి విషయ

ము నిరుక్తిగ్రంథమునందు నమస్కారప్రకరణమునందు చెప్ప బడినది.

ఈ "నమః" శబ్దముకు స్థూలార్థమనియు, సూక్ష్మార్థమనియు, పరార్థమనియును మూఁడు అర్థములఁగొని అహిర్బుధ్న్యమహర్షి వ్యాఖ్యానముచేసి యున్నాఁడు. అది యెట్లనిన,

శ్లో॥ ప్రేక్షావతః ప్రవృత్తిర్యా ప్రహ్వీభావాత్మికా స్వతః।
ఉత్కృష్టం పరముద్దిశ్య తన్నమః పరిగీయతే॥

తా॥ తన కంటెను గొప్పవాని విషయమున వానికంటెను తక్కువవాఁడొనర్చునట్టి నమ్రీభావరూపంబగు ప్రవర్తనము "నమః" అనఁబడుచున్నది.

శ్లో॥ లోకే చేతనవర్గస్తు ద్విధైవ పరికీర్త్యతే।
జ్యాయాంశ్చైవతథాజ్యాయాన్నైవాభ్యాం విద్యతేపరః॥

తా॥ లోకమునందు చేతనులు గొప్పవారనియు, తక్కువవారనియును రెండువిధములు కలరు. ఇంతకంటెను వేఱొక్కండు లేడు.

శ్లో॥ కాలతోగుణతశ్చైవ ప్రకర్షో యత్రతిష్ఠతి।
శబ్దస్తం ముఖ్యయావృత్త్యా జ్యాయానిత్యవలంబతే॥

తా॥ ఎవ్వనియందు వయస్సునుబట్టికాని, గుణమునుబట్టికాని యొకవిధమైనట్టి యాధిక్యము కలదో, వాని విషయముననే జ్యాయాన్ (గొప్పఁవాఁడు) అను శబ్దము ముఖ్యార్థము గలది యగుచున్నది.

శ్లో॥ అతశ్చేతనవర్గోన్యః స్మృతఃప్రత్యపరోబుధైః।
అజ్యాయాంశ్చానయోర్యోగః శేష శేషితయేష్యతే॥

తా॥ కావున ఈచేతనవర్గమంతయును గొప్పవారని యును. కొద్దివారనియు నివ్విధముగ విభజింపఁబడియున్నది. వీరి యుభయులకుఁగల సంబంధము శేషశేషిభావము.

శ్లో॥ ఆజ్యాయాంసోపరేసర్వే జ్యాయానేకోమతః పరః।
సంత్రృసంతవ్యభావేన తేషాంతేన సమన్వయః॥

తా॥ వీరిలో నొక్కండుగొప్పవాఁడుగాను తక్కినవారం దఱును తక్కువ వారుగాను నెన్నఁబడుచున్నారు. గొప్పవాఁడు నమస్కరింపఁబడునట్టి వాఁడుగాను, తక్కిన వారు నమస్కరించునట్టివారుగాను నివ్విధమగు సంబంధము వీరికిఁగలదు.

శ్లో॥ సంతవ్యః పరమశ్శేషీ శేషా సంతార ఈరితాః
సన్నసన్తవ్యభావోయం సప్రయోజనపూర్వకః॥
నీచోచ్చయోః స్వభావోయం సంత్రృసంతవ్యతాత్మకః॥

తా॥ గొప్పవాఁడును, నమస్కరింపదగినవాఁడు శేషియైనట్టివాఁడు. నమస్కరించువారు శేషభూతులు. ఇట్లు నమస్కరింపఁబడువాఁడనియు, నమస్కరించువారనియును ఇది యేదొక ప్రయోజనమునుబట్టి యుండునది కాదు. అయితే యిట్లొనర్చుటయనునది గొప్పవాని యెడల కొద్దివారికి స్వభావసిద్ధముగానుండవలసిన క్రమము.

శ్లో॥ ఉపాధిరహితేనాయం యేనభావేన చేతనః।
నమతి జ్యాయసే తస్మై తద్వానమనముచ్యతే॥

తా॥ స్వభావసిద్ధముగానే యీచేతనులలో గొప్పవానికి తక్కువవారు నమస్కరించుట యనునది నమస్కారమనఁబడుచున్నది.

శ్లో॥ భగవాన్మే౽రోఽగత్యం మహాం ప్రత్యవరస్సదా।
ఇతి భావో నమః ప్రోక్తో నమసః కారణం హి సః॥
నామయత్యపివా దేహం ప్రహ్వీభావయతి ధ్రువం

తా॥ భగవంతుండు నా కంటెను ఎక్కువవాఁడు. నేను తక్కువవాఁడను దాసుండను. ఇట్టి భావనతో నొప్పునది నమస్కారమనంబడుచున్నది. ఇట్టి భావనయే సదా నమస్కారముకు హేతువు. భగవంతుని గుఱించి నమః అని చెప్పుచు శరీరమును వంచుటచే నమ్రుండగుచున్నాఁడు.

శ్లో॥ ప్రహ్వీభవతి నిచేహే పరో నైచ్యం విలోకయన్।
అతో వా నమ ఉద్దిష్టం యత్తన్నామయతి స్వయం॥

తా॥ నా ధారణముగ గొప్పవాఁడను నీచుని విషయమున నైచ్యమును నటించుచు నమ్రుండగుట కద్దు. కావున "నమః" అని చెప్పుచు నమ్రుండగుటయే నమస్కారము.

శ్లో॥ వాచా నమ ఇతి ప్రోచ్య మనసా వపుషా చ యత్।
తన్నమః పూర్ణముద్దిష్టమతోఽన్యన్న్యూనముచ్యతే॥
ఇయం కర్ణపూర్తిస్స్యాదంగపూర్తిమిమాం శృణుః

తా॥ వాక్కుతో "నమః" అని చెప్పుచు, మనస్సున భావనుంచి శరీరముతో నమ్రుండగుటయే పూర్ణంబగు నమస్కారంబని చెప్పఁబడుచున్నది. తక్కిన దెద్దియును పూర్ణనమస్కారముకాదు. ఇది కర్ణపూర్తియనంబడుచున్నది. అంగపూర్తిని గుఱించి చెప్పెదను వినుము.

శ్లో॥ శాశ్వతీ మమ సంసిద్ధిరియం ప్రహ్వీభవామియత్।
పురుషం పరముద్దిశ్య న మే సిద్ధిరితోఽన్యథా॥
ఇత్యంగముదితం శ్రేష్ఠం ఫలేష్వాతత్త్వరోధినీ॥

తా॥ ఇట్లు నమస్కరించుటయే నాకు శాశ్వతంబగు సిద్ధి. పరమపురుషుని విషయమున నాకింకొకంటెను సిద్ధియగు నది వేఱొక్కటి లేదు. ఇట్టి భావనయే శ్రేష్ఠమైనట్టియంగ ము. ఫలాపేక్ష యనునది దీనితో విరోధించును.

శ్లో॥ అనాదివాసనారోహాదనైశ్వర్యాత్స్వభావజాత్।
మలావకుంఠితాచ్చైవదృక్క్రియానివృత్తిహేతుయా
సత్కార్పణ్యంతదుద్బోధో ద్వితీయంహ్యంగమిష్యతే।
స్వస్వాతంత్ర్యావబోధస్తు తద్విరోధ ఉదీర్యతే॥

తా॥ అనాదియగు వాసనవలనను, స్వాభావికమగు ఆ కించన్యమువలనను, అజ్ఞానమువలననున్ను దర్శనముచేయు టకున్ను వెనుదీయుట కార్పణ్యమనఁబడుచున్నది. అట్టి జ్ఞాన ము ద్వితీయాంగముగా నెన్నఁబడుచున్నది. నేను స్వతం త్రుండననెడి భావన దీనితో విరోధించునది.

శ్లో॥ పరత్వేసతి దేవోయం భూతానామనుకంపనః।
అనుగ్రహైకధీర్నిత్యమిత్యేతత్తు తృతీయకం॥
ఉపేక్షకోయథాకర్మఫలదాయీతియామతిః।
విశ్వాసాత్మకమేతత్తుతృతీయంహన్తివై సదా॥

తా॥ పరత్వముండియుండుగాక. భగవంతుండు ఈజం తువులవిషయమున కరుణగలవాఁడు. ఎల్లప్పుడును అనుగ్రహిం చునట్టి తలంపుగలవాఁడు. ఇట్టి భావన మూఁడవయంగమనఁ బడుచున్నది. భగవంతుండు మనలను ఉపేక్షించియుండి కర్మాను గుణముగ ఫలము నొసంగునట్టి వాఁడనెడి తలంపు విశ్వాసాత్మకమగు యాయంగమును నశింపఁజేయును.

శ్లో॥ ఏవంభూతోప్యశక్తస్సన్ త్రాణంభవితుంక్షమః
ఇతిబుద్ధ్యాస్య దేవస్యగోప్తృత్వశక్తినిరూపణం॥
చతుర్థమంగముద్దిష్టమముష్యవ్యాహృతిః పునః।
ఉదాసీనో గుణాభావాదిత్యుక్తిస్త్వనిమిత్తజా॥

తా॥ ఇట్లు దయాళువైనప్పటికిన్ని, అశక్తుని వలెనే నన్ను రక్షింపలేదేమా? యని యతని రక్షకత్వశక్తిని నిరూపించుట నాల్గవ అంగముగా నెన్నంబడుచున్నది. అతనికట్టి వాత్సల్యసౌశీల్యాదిగుణములు వాస్తవముకు లేనందున ఉదాసీనుండయియున్నాడని భావించుకొనుట యిట్టి యంగముతో విరోధించును.

శ్లో॥ స్వస్యస్వామినివృత్తిర్యా ప్రాతికూల్యస్యవర్జనం।
తదంగంపంచమం ప్రోక్తం అజ్ఞావ్యాఘాతవర్జనం
అశాస్త్రీయోపసేవాతు తద్వ్యాఘాత ఉదీర్యతే॥

తా॥ స్వస్వాతంత్ర్యనివృత్తియును, ప్రాతికూల్యవర్జనమున్ను, భగవదాజ్ఞను అతిక్రమింపకుండుటయును అయిదవ అంగమనిపించుకొనుచున్నది. శాస్త్రీయములుకాని వాటిని అనుష్ఠించుట యనునది దీనితో విరోధించును.

శ్లో॥ చరాచరాణిభూతాని సర్వాణి భగవద్వపుః।
అతస్తదానుకూల్యంమే కార్యమిత్యేవ నిశ్చయః
షష్ఠమంగంసముద్దిష్టం తద్వ్యాఘాతో నిరాకృతిః॥

తా॥ స్థావరజంగమంబులన్నియును భగవంతునికి శరీరంబులు. కావున వాటికనుకూలముగ ప్రవర్తింపవలయు ననెడి నిశ్చయము ఆఱవయంగమనిపించుకొనుచున్నది. ఇట్టి నిశ్చయముకు వ్యతిరిక్తముగా ప్రవర్తించుట దీనితో విరోధించును.

శ్లో॥ పూర్ణమంగై రుపాంగైశ్చనమనం తే ప్రకీర్తితం।
స్థూలోఽయం నమస స్త్వర్థస్సూక్ష్మమన్య న్నిశామయ॥

తా॥ అంగములతోను, ఉపాంగములతోను పూర్ణంబైనట్టి నమస్కారమును గుఱించి చెప్పియున్నాము. ఇది నమః శబ్దముయొక్క స్థూలమైన యర్థము. సూక్ష్మమైనట్టి యర్థమును గుఱించి చెప్పెదను.

శ్లో॥ చేతనస్యయదామమ్యం స్వస్మిన్ స్వీయేచవస్తుని।
మమ ఇత్యక్షరద్వంద్వం తదా మమ్యస్యవాచకం॥

తా॥ ఈచేతనునికి తన విషయమున కాని, తనతో సంబంధించినట్టి వాటివిషయమునఁగాని యుండు చున్నట్టి మమకారమెద్దికలదో, అది ‘‘మమ’’ అను శబ్దముచేఁ దెలుపఁబడుచున్నది.

శ్లో॥ అనాదివాసనారూఢ మిథ్యాజ్ఞాన నిబంధనా।
ఆత్మాత్మీయపదార్థేయా స్వాతంత్ర్యస్వతామతిః।
మేనేత్యేవంసమీచీనబుద్ధ్యాసాత్రనివార్యతే।
నాహంమమస్వతంత్రోఽహం నాస్మీత్యస్యార్థ ఉచ్యతే॥

తా॥ అనాదివాసనామూలకమగు మిథ్యాజ్ఞానమువలన ఆత్మాత్మీయపదార్థముల విషయమున స్వస్వాతంత్ర్యబుద్ధి యెద్దికలదో, అది నాకు లేదని యిట్టి యదార్థజ్ఞానముచే నట్టి మిథ్యాజ్ఞానము నివర్తింపఁబడుచున్నది. నేను నాకు స్వతంత్రుండనుకాననుకొనుట దీనియొక్క యర్థము.

శ్లో॥ నమేదేహాదికంవస్తుశేషః పరమాత్మనః।
ఇతిబుద్ధ్యానివర్తన్తేతాస్తాస్స్వీయామనీషికాః॥

తా॥ దేహము మొదలగువస్తువులు నాకు శేషభూతములు కావు. అవి పరమాత్మకు శేషభూతములు. ఇట్టి నిశ్చయజ్ఞానముచే ఆ యా భావనలన్నియును నివర్తించుచున్నవి.

శ్లో॥ అనాదివాసనాజాతైః బోధైస్తైస్తైర్వికల్పితైః।
రోపితం యద్దృఢం చిత్తం స్వాతంత్ర్యస్వత్వధీమయం॥
తత్త్ద్వైష్ణవసార్వాత్మ్యప్రతిబోధసముత్థయా।
నమ ఇత్యేతయా వాచా సంత్రాస్వాదపోహ్యతే॥
ఇతి తే సూక్ష్మ ఉద్దిష్టః పరమన్యం నిశామయ।

తా॥ అనాదివాసనవలనఁ గలిగినట్టి యజ్ఞానములచేతను, వికల్పములచేతనున్ను ఎవ్వని నిశ్చలమైనట్టిమనస్సు వికారయుక్తమై స్వాతంత్ర్యజ్ఞానవిశిష్టంబైనదో, అది భగవంతుండు అన్నింటిలో నంతరాత్మగాఁగల డనెడి జ్ఞానమువలన నమస్కారముచే తననుండి నివర్తింపఁబడుచున్నది. ఇట్లు సూక్ష్మమగు అర్థమును చెప్పియున్నాను. ఇఁక పరమంబగు అర్థమును వినుము

శ్లో॥ పంథా నకార ఉద్దిష్టో మః ప్రధాన ఉదీర్యతే।
విసర్గః పరమేశస్తు తత్రార్థోయం నిరుచ్యతే।
అనాదిః పరమేశోయం శక్తిమాన్ పురుషోత్తమః।
తత్ప్రాప్తౌ ప్రధానోయం పంథా నమననామవాన్।
ఇతి తే త్రివిధః ప్రోక్తో నమశ్శబ్దార్థ ఈదృశః॥

తా॥ నకారమునకు మార్గమని యర్థము. మకారమునకు ప్రధానమని యర్థము. విసర్గమునకు పరమాత్మయని యర్థము. దీని తాత్పర్యమేమనఁగా—భగవంతుని బొందుటకు నమస్కారంబనునది ప్రధానమైనట్టి మార్గమనుట. ఇట్లు మూడువిధములుగల నమశ్శబ్దార్థము నీకు ఉపదేశింపఁబడినది.

ఈతావున "నంతవ్యః పరమః శేషీ" (పరము శేషి నమస్కరింపవలసినవాఁడు) అని చెప్పినందున పరమ శేషియైనట్టివాఁడే. "నమః" అను దానికి విషయభూతుండని వ్యుత్పన్నమైనట్టి విషయము. పరమ శేషి. యు[illegible] [illegible] తెలుపుటకు గాను ఈ తావున విశేషనామము పేర్కొనఁ[illegible]

ఈ తావున "అశాస్త్రీయోపసేవాతుంతద్వ్యఘాత ఉదీర్యతే" అనియు "తద్వ్యఘాతో నిరాకృత [illegible] చెప్పియున్నట్టి వచనములకు తాత్పర్యమేమనఁగా—ప్రపత్తి నొనర్చునట్టిసమయమున బుద్ధిపూర్వకముగ ప్రతికూలముల నొనర్చినట్లయిన, ఆనుకూల్య సంకల్పము, ప్రాతికూల్యవర్జనము మొదలగునవి లేకుండపోవుననుట. ప్రపత్తి నొనర్చిన పిమ్మటనున్ను బుద్ధిపూర్వకముగ ప్రతికూలముల నాచరించినట్లయిన, ఈతని రుచితో పొసగియుండిన స్వతంత్రభగవదాజ్ఞకు విరుద్ధమగును.

ఈ సందర్భమున స్థూలార్థమనఁగా—వ్యాకరణశాస్త్రప్రకారము విశదమైనట్టి శబ్దవ్యుత్పత్తినిబట్టి తెలియునది. సూక్ష్మార్థమనఁగా—వర్ణసామ్యాదులనుబట్టి కనుపెట్టబడినట్టిదై, నిరుక్తిబలమువలనఁ దెలియవచ్చునది. పరమార్థమనఁగా—రహస్యశాస్త్రములయందుఁ జెప్పియున్నట్టి అక్షరనిఘంటువువలనఁ దెలియునది.

ఈతావున మొట్టమొదట శేషభూతునికిస్వతఃప్రాప్తమగు కైంకర్యస్వరూపమునున్ను, సాంగన్యాసరూపమగుసాధ్యోపాయస్వరూపమునున్ను తెలిపి, మోక్షోపాయాధికారికి అవశ్యముగ కావలసినదియైనందున నిరపేక్షస్వాతంత్ర్యాదినివృ

త్తిపూర్వకముగ స్వరూప నిరూపణము చేయఁబడినది. అటుపిమ్మ
ట సాధ్యోపాయానుష్ఠానము చే (ప్రపత్తిచే) వశపఱచుకొనఁదగి
నట్టిదియును ప్రాప్యమును నగు సిద్ధోపాయముయొక్క (భగవంతు
నియొక్క) స్వరూపము చెప్పఁబడినది. అథవా ఉపాయాంతర
ములకంటెనున్న సమర్పణము (ప్రపత్తి)యొక్క ప్రధానోపా
యత్వము తెలుపఁబడినదియనియును చెప్పవచ్చును. ఇవి యా
న్నియును ఇఁకమీఁదు చెప్పఁబోవునట్టి వాక్యార్థములయందు
సాధ్యమైనంతవఱకు అనుసంధించుకొన వలసినవి.

శ్లో॥ ఏవం శిక్షితనానార్థ నమశ్శబ్దసమన్వితాః।
సర్వేకరణతాం యాంతి మంత్రాః స్వాత్మసమర్పణే.

తా॥ ఇట్లు నానావిధములగు అర్థములుగల నమశ్శబ్దము
తోఁగూడియున్నట్టి సమస్తమంత్రములును ఆత్మసమర్పణము
విషయమున సాధనములు కాఁగలవు.

శ్లో॥ జీవసామాన్యముఖతః శృంగగ్రాహికయాపివా।
మకారాతారనమసోస్స్వానుసంధానదావిహ॥

తా॥ జీవస్వరూపమును సామాన్యముగ తెలుపుచుటచేఁ
గాని, స్వస్వాతంత్ర్యనివృతిచేఁగాని మకారములు రెండును, ప్రణ
వనమస్సుల యర్థమగు స్వస్వరూపానుసంధానముఁ దెలుపునవి.

శ్లో॥ ఇహయాస్వానుసంధాన ప్రక్రియైకస్యదర్శితా।
అన్యేషామపితత్సామ్యాన్నాన్యోన్యశరణా ఇమే॥

తా॥ ఈ తావున నొక్కని విషయమున స్వస్వరూపానుసం
ధానప్రక్రియ యెవ్విధంబైనట్టిదిగాఁ జూపింపఁబడినదో, అవ్వి
ధముగానే తక్కిన వారి యందఱి విషయమున నెఱిం

గునది. ఈజీవాత్మలు ఒక్కరినొక్కరురక్షించుకొనుటకు సమ
ర్థులు కాఁజాలరు.

శ్లో॥ అతస్స్వపరరక్షాయాంపరాధీనేషు జంతుషు।
నిరపేక్ష్యశరణ్యత్వం నియతంకమలాపతౌ॥

తా॥ తమనుకాని యితరులనుకాని రక్షించుటకు సమ
ర్థులు కానట్టియీ జీవాత్మలను రక్షించుటయనునది వేఱొక్క
సహకారినపేక్షింపకరక్షకుండగు సర్వేశ్వరునికేవలియతమైనది.

శబ్దము ఉండియుండి కాని, అర్థసందర్భముచేఁ గాని
"నమః" అనుతావునఁ దెలుపఁబడినట్టి శరణాగతియనఁబడు
నట్టి సాధ్యోపాయానుష్ఠానముచే సంతోషింపఁబడునట్టి వాఁ
డై పైశబ్దమునందుండు (నారాయణాయ అనుతావుననుడుం
ఆయ అను) చతుర్థిచేఁ దెలుపఁబడునట్టి కైంకర్యమునకు విష
యభూతుండై, సర్వరక్షకుండుగాను, సర్వశేషిగానును ప్రథ
మాక్షరముచేఁదెలుపఁబడునట్టి శరణ్యుని(సర్వేశ్వరుని)స్వరూప
మును వివరించునది యోగరూఢంబగు నారాయణశబ్దము. సం
గ్రహముగాఁ జెప్పఁబడినట్టి యర్థమునే అజ్ఞాన సంశయవిపర్య
యములు లేకుండునట్లు వేఱొక్కవిధముగ తెలుపుటయనునది
వివరణమనఁబడుచున్నది. ఇట్లు ఒక్కతావున సంగ్రముగాఁ
జెప్పినదానిని వేఱొక్కతావున వివరముగాఁ జెప్పుటను ప్రథ
మాక్షరము మొదలుకొని యన్ని తావులనున్న సాధ్యమై
నంతవరకు చూచుకొనునది.

ఈ నారాయణశబ్దము శేష శేషిత్వములను రెంటినిన్ని
విశదముగాఁ దెలియపఱచుట యనెడి యుపకారాతిశయము
నుబట్టి విష్ణుగాయత్రియందును, తిరునారాయణీయమునందు

ఈనామముయొక్క యవయవార్థమును విమర్శించుసందర్భము
ననున్ను తక్కిన వ్యాపకనామంబులకున్ను ముంగుగ పరింపఁ
బడినది. పరవిద్యలన్నింటియందునుఁ ఉపాస్యవస్తువును నిర్ణ
యించునట్టిదియగు నారాయణానువా[illegible]కతత్త్వముగాను
అనుమానింపఁబడినట్టి బ్రహ్మశివాదుల[illegible], సామానాధి
కరణ్యముచే నచ్చట పేర్కొనంబడి[illegible]శ్వముపలెనే, సర్వే
శ్వరుని విభూతియనియును, వీరును [illegible] వాచ్యులని తెలి
యపఱచుటకుగాను ఈనారాయణశబ్దమును, దీని విషయమునఁ
గల యాదరణ సూచితంబగునట్లు, పలుమాఱు పేర్కొని
యున్నది.

ఈ శబ్దముయొక్క ప్రభావము "సంకీర్త్య నారా
యణశబ్దమాత్రం" అనియు, "నారాయణేతి యస్యాస్యే"
అనియు, "నారాయణేతి శబ్దోఽస్తి" అనియు, ఇత్యాది తావుల
యందును, 'కులందరుంశెల్వంతందిడుమ్" "నారణన్నమమ్మన్నైన
రకమ్బు కాళ్" ఈమొదలగు ఆళ్వారులపాశురములయందును
స్పష్టముగాఁ దెలియఁగలదు. నారదీయ కల్పమునందును,
"రోగాపద్భయదుఃఖేభ్యో ముచ్యంతే నాత్రసంశయః। అపి
నారాయణేత్యే తచ్ఛబ్దమాత్రప్రలాపినః"? (నారాయణశబ్ద
మును ఉచ్చరించినంత మాత్రమున రోగములకును, ఆపదల
కును, దుఃఖములకున్ను ఎంతమాత్రము భయపడరు.) అనిచెప్పి
యున్నది. దీనియందుండు అచ్చులను హల్లులనున్ను చేర్చి
లెక్కపెట్టుకొనినచో, "నారాయణ" అనునదియే యెనిమిది
యక్షరములుగల తిరుమంత్రముకాదగునని తక్కినపురాణముల
యందుఁ జెప్పియున్నది. సర్వేశ్వరుని విడిచి ప్రత్యేకముగా

నుండుట. వీనికి నారములకు “నారాః అయనం యస్య” అనియు “నారాణాం అయనం” అనియు సమాసమును వివక్షించుటంజేసి వైయధికరణ్యమున్నట్టిదాయెను. శ్రీనమ్మాళ్వారులవారు ఈ శబ్దమును “ఎన్ పెరుక్కున్నలత్తోన్ పొరుళీరిలవన్ పుకళ్ నారణన్” (జ్ఞానానంద స్వరూపులగు జీవులును అనంత జ్ఞానానందాదికల్యాణగుణములునుగలవాఁడు నారాయణుండు) అనియు “నారణన్ ముళ్లువేళ్లులకుక్కుమ్ నాథన్” (నారాయణుండు సమస్తలోకములకును నాథుండు) అను పూర్వాపరములయందు రెండు సమాసములయొక్కయును అర్థములను సాయించియున్నారు. దీనిలో హేయప్రత్యనీకత్వ,కల్యాణైక తానత్వరూపమగు ఉభయలింగత్వమున్ను, విభూతిద్వయయోగమున్ను అంతర్గతంబై యున్నది. భూషణ, ఆయుధ, పరిజన, పరిచ్ఛద, ద్వారపాల, పార్షదాది భేదంబులున్న ఈ తావున అనుసంధించుకొనవలసినవి.

శ్లో॥ కారణత్వమబాధ్యత్వము పాయత్వముపేయతా।
ఇతి శారీరకస్థాప్యమిహాచాపివ్యవస్థితం॥

తా॥ కారణత్వము, అబాధ్యత్వము, ఉపాయత్వము, ఉపేయత్వము, సర్వేశ్వరునివియగు ఇవి యన్నియును ఈ తావున అనుసంధేయములు.

వీటి నన్నింటిని “జ్ఞానానందామలత్వాది” అని యారంభించి భట్టరు వారు తాము సాయించిన తిరువారాధన క్రమమునందు సాయించియున్నారు. ఈ తావున,

శ్లో॥ సృష్ట్వానారం తోయమంతస్థితోఽహం।
యేనస్యాన్మే నామ నారాయణేతి॥

తా॥ నారమనఁబడునట్టి యుదకమును సృజించి, నేను దానిలో నంతరాత్మగానుండియున్నాడను. అందువలననే నాకు నారాయణుండని (ఉదకములోనుండు వాఁడని) పేరు.

శ్లో॥ ఆపోనారా ఇతిప్రోక్తాః ఆపోవై నరసూనవః।
తాయదస్యాయనంపూర్వం తేన నారాయణఃస్మృతః॥

తా॥ నరుడనఁబడు భగవంతునివలనఁ గలిగినందున ఉదకములు నారములనఁబడుచున్నవి. వాటిలోనుండుటంజేసి భగవంతుండును నారాయణుండని పిలువఁబడుచున్నాడు.

ఈ పైనియుదహరించిన శ్లోకములయందు ఉదకమును పేర్కొనినందున దానితోఁబాటు తక్కిన భూతములనున్ను పేర్కొనినట్లుగుంగునది. ఈ విషయము,

శ్లో॥ నరాజ్జాతాని తత్త్వాని నారాణీతితతోవిదుః।
తాన్యేవచాయనంతస్య తేన నారాయణఃస్మృతః॥

తా॥ పృధివ్యాదిభూతములు నరుడను భగవంతుని నుండికలిగినవి. కావున నవి నారములనఁబడుచున్నవి. అవి భగవంతునికి వాసస్థానములగుటంజేసి భగవంతుండును నారాయణుండనఁబడుచున్నాడు.

ఈ వాక్యములవలన సిద్ధమగుచున్నది.

ఈ బహుబ్రీహి సమాసముయొక్క అర్థమును వివరించునప్పుడు "నరాజ్జాతాని తత్త్వాని" అని నారశబ్దార్థముఁ జెప్పుటచే మహోపనిషత్తు మొదలగు వాటియందుఁ జెప్పియున్నప్రకారము బ్రహ్మేశానాదులందఱికిన్ని నారాయణుండే సర్వవిధములనున్ను కారణుండగుటయును, అయనశబ్దము యొక్క "ఈయత ఇత్యయనం" అను కర్మణివ్యుత్పత్తిచే వీటి

లో వ్యాపించియుండునట్టి వానియొక్క సర్వవ్యాపకత్వమును, అందుల కుపయుక్తంబగు నిరతిశయ సూక్ష్మత్వమున్ను చెప్పఁబడినవి.

ఈ యర్థములు "ఈయతే అస్మిన్" అను అధికరణ వ్యుత్పత్తిచేతనున్ను తెలియఁగలవు.

శ్లో॥ నారాణామయనత్వాచ్చ నారాయణ ఇతి స్మృతః।
నారస్త్వితి సర్వపుంసాం సమూహః పరికీర్తితః॥
గతిరాలంబనంతస్య తేన నారాయణఃస్మృత॥

తా॥ నారముల కాశ్రయమగుటంజేసి నారాయణుండని చెప్పఁబడుచున్నాడు. నారమనఁగా జీవరాశులన్నింటియొక్కయును సమూహము. దాని కాశ్రయమున్ను, ఆధారమున్ను అగుటంజేసి, నారాయణుండను పేరువచ్చినది.

శ్లో॥ నారోనరాణాం సంఘాతః తస్యాహమయనం గతిః।
తేనాస్మిమునిభిర్నిత్యం నారాయణ ఇతీరితః।

తా॥ జీవులయొక్క సమూహమునకు నారమనిపేరు, దానికి ఆయనమనఁగా గతి యనుట. అందువలననే నేను మునులచే నారాయణుండని పేర్కొనఁబడుచున్నాడను.

శ్లో॥ నారశబ్దేనజీవానాం సమూహః ప్రోచ్యతే బుధైః।
తేషామయనభూతత్వాన్నారాయణ ఇహోచ్యతే॥

తా॥ జ్ఞానులు జీవసముదాయమును నారమని పేర్కొనుచున్నారు. దాని కయనంబగుటంజేసి భగవంతుని నారాయణుండని పేర్కొనుచున్నారు.

శ్లో॥ తస్మాన్నారాయణం బంధుం మాతరం పితరం గురుం।
నివాసం శరణం చాహుర్వేదవేదాంగపారగాః॥

తా॥ కావుననే వేద వేదాంగపారంగతులయిన వారు నారాయణుని బంధువుని గాను, మాతాపితృలను గాను, ఆచార్యుని గాను, నివాసమును గాను, శరణమును గానును చెప్పుచున్నారు.

ఈ పై శ్లోకములయందుఁ జెప్పియున్న ప్రకారము నారాయణశబ్దము తత్పురుష సమాసంబైనను, నిర్వచన బల మువలన అయనశబ్దము పుల్లింగము కాఁగలదు.

ఈ తావున "రీఙ్ క్షయే" అను ధాతువునుండి 'ర' అను శబ్దము వ్యుత్పన్నమగుచున్నది. అది స్వరూపవికారముచే నశించునట్టి అచేతనవస్తువును తెలుపునది. అది "నగ" 'నైక' అను శబ్దములవలెనే నకారముతో సంయుక్తంబగుటచే 'నర' అని నిష్పన్నంబైనద్దై, అట్టి యచేతన వస్తువుకంటెనున్ను వేఱయినదియగుచు, స్వరూపవికారరహితంబగునట్టి చేతనవర్గ ముఁ దెలుపుచున్నది. అది "నార" అను రూపాంతరముచే నట్టి చేతన వస్తువులయొక్క సమూహమును తెలుపుచున్నది. ఈ నరసమూహములకు అయనమన్నందున, త్రివిధ చేతనా చేతనంబుల స్వరూప,స్థితి, ప్రవృత్తులన్నియును తన యధీనము ననున్నట్టివాఁడు నరులనఁబడు వివిధాత్మలయొక్క సమూ హంబులకున్ను అపేక్షితంబుల నొసంగునట్టి హేతువై, తాను స్వయముగ భోగ్యంబగుటంజేసి ఉపేయంబై, 'విష్ణ్వాధారం యథా చైతత్త్రైలోక్యం సమవస్థితం యోలోకత్రయమావిశ్యబి భర్త్యవ్యయ ఈశ్వరః" (ఈ మూఁడులోకములును విష్ణువుపై యాధారపడియున్నవి. నాశరహితుండగు విష్ణువు వాటిలో నంతరాత్మగానుండి వాటిని ధరించియున్నాడు) ఇత్యాది తావు

లఁ జెప్పియున్నట్లు ఆధారభూతుండుగానునుండుట తెలుపఁబడినది. అది యెట్లనిన, 'అయన' శబ్దము 'ఇణ్ గతౌ' అను ధాతువునుండియుత్పన్నమగుచున్నది. అట్టి "అయన" శబ్దము యొక్క "ఈయతే అనేన" అను కర్మణివ్యుత్పత్తివలన ఈశ్వరుండు ఉపాయముగాను, "ఈయతే అసౌ" అను కర్తరివ్యుత్పత్తివలన ఉపేయముగాను, "ఈయతే అస్మిన్" అను అధికరణవ్యుత్పత్తివలన ఆధారభూతుండుగాను తెలియవచ్చుచున్నాడు.

'అయ పయ గతౌ' అను ధాతువునుండియును ఈ 'అయన' శబ్దము ఉత్పన్నంబైనది కావచ్చును. ఈ యుపాయత్వ, ఉపేయత్వాదుల కుపయుక్తంబైనట్టి సౌలభ్యమున్ను పరత్వమున్ను ఈతావునఁ దెలియఁగలవు.

అయన మనఁగా వాసస్థాన మనియు, అట్లర్థమగునప్పుడు, బహువ్రీహి సమాసముచే అంతర్వ్యాప్తియును, తత్పురుషసమాసముచే బహిర్వ్యాప్తియును తెలియవచ్చుచున్నవనియును అనుసంధించుకొనుట కద్దు. ఈ రెండును శ్రుతిప్రతిపాదితములు. అంతర్వ్యాప్తియనఁగా— ఈ పదార్థములున్నట్టి తావున తాను లేడనిపించుకొనకుండ వాటితోఁ గలిసిమెలిసి యుండుట. బహిర్వ్యాప్తియనఁగా— ఈ పదార్థములు లేనితావులనున్ను అంతటనున్ను తానుండియుండుట. విభుస్వరూపములుగాను తెలియవచ్చునట్టివియగు కాలాదులకు బహిర్వ్యాప్తిగలదనిచెప్పఁదగదు. 'నారాయణ మణీయాంస మశేషాణామణీయసాం' (సూక్ష్మములయినట్టి వాటిలోనును సూక్ష్మముగానుండునట్టి నారాయణుని) అని చెప్పినదియును అంతర్వ్యాప్తికనుగుణ

మగు ఆనుకూల్యముగలదియగుట. ఇంతియెకాని, అణుపరిమాణ
మేయని చెప్పుటకాదు. భగవత్స్వరూపము ఇట్లుసూక్ష్మమయి
నదిగాను చెప్పియుండుట యనునది యా యా యుపాధులయొ
క్క యావరణమునుబట్టి యని శ్రీభాష్యాదులయందుఁ దెలు
పఁబడినది.

వ్యాపకుండైనట్టి వాడు ప్రతివస్తువునందును పూర్ణము
గానుండుట యనఁగా, ఒక్కొక్క యుపాధ్యవచ్ఛిన్నంబైనట్టి
ప్రదేశమే సర్వమునున్ను నిర్వహించునట్టి శక్తికలదిగానుం
డుట. ఇంతియెకాని, ఆయావస్తువులలోనుండియున్నంతమాత్రమే
యాతని స్వరూపమునని యర్థముకాదు. ఒకవేళ అవ్విధముగ
యర్థము చేసికొనినట్లయిన, బాహ్యమునందును వ్యాపించి
యుండునదగుట విరుద్ధముకాఁగలదు. దానిని అఘటితఘటనా
శక్తినిబట్టి నిర్వహించెదమనియెదవా? ఒకటికి రెండు విరుద్ధం
బులఁ జెప్పినట్టి వారమగుదుము. అందువలన మతాంతరులు
చెప్పినట్లే మనమున్ను చెప్పినట్టి వారము కాఁగలము.

ఈ తావున ప్రథమాక్షరముచేతనున్ను, ‘నార’ శబ్దము
యొక్క ప్రకృతియగు నరశబ్దము చేతనున్ను, అయనశబ్ద
ముచేతనున్ను సర్వేశ్వరుని తెలుపునప్పుడు రక్షకత్వ, కార
ణత్వ, నిత్యత్వ, నేతృత్వ, ఆధారత్వ, అంతర్యామిత్వ, ఉపా
యత్వ, ఉపేయత్వరూపములగు ఆకారభేదములనుబట్టి మూఁ
డును (మూఁడు అర్థములును) ఉపయోగకరంబులు,

ప్రణవముయొక్క తృతీయాక్షరము చేతనుని తెలుపు
చుండ, ఈ తావున నారశబ్దము చేతనున్ను మరల చేతనుని
చెప్పవలసిన పనియేమున్నదంటివేని, ‘‘నాసునై ౨ యస్థియి

లేన్ కండాయ్ నారణనే నీయెన్నైయన్నియిలై" (ఓ నారాయణా నేను ఎన్నఁడును నిన్ను విడిచియుండలేదు నీవున్ను నన్నెన్నండును విడిచియున్నవాఁడవు కావు సుమీ!) "రామానుజం లక్ష్మణపూర్వజం చ" (రామునితమ్ముఁడు లక్ష్మణుండు లక్ష్మణునిఅన్నరాముఁడు) అన్నట్లు ఒక్కదాని సంబంధమును బట్టి వేఱొక్కదానిని నిరూపించునట్లయిన అర్జునరథము అనుతావునవలెనే*ప్రణవము శేషభూతుండగుజీవుని ప్రధానముగాఁ దెలుపునదియైనందునను, రాసమండలమునందువలెనే నారాయణశబ్దము శేషిని ప్రధానముగాఁ దెలుపునదియైనందుననున్ను ఈతావునపునరుక్తిదోషములేదు. ప్రణవమునందున్నశబ్దమును బట్టియుండునట్టి ప్రాధాన్యము జీవునిదైనను, అర్థమునుబట్టి యుండునట్టి యుండునట్టిప్రధాన్యము శేషిదే కాఁగలదు.

ప్రణవమునందు స్వరూపమునుబట్టియును, గుణములను బట్టియును జ్ఞానాకారుండుగాను, ప్రత్యక్కుగాను,అణువుగానును తెలియవచ్చునట్టి జీవునిగుఱించి నరశబ్దము నాశములేనివాఁడనుచు నిత్యత్వముఁ దెలుపుటంజేసియును, నరులయొక్క సమూహమనుటచే జీవులకు పరస్పరముండుకున్నట్టి భేదమును వెలిదపఱచుటంజేసియును, నరునివలనఁ గలిగినవిగాన నారములనఁబడుచున్నవని యర్థము చేసికొనినప్పుడు,విశిష్టస్వరూపముచే బ్రహ్మసృష్టత్వము తెలియవచ్చుటంజేసియును, ఈ రెండు

* అర్జునుని రథమునందు శ్రీకృష్ణుండున్ను (భగవంతుడును) అర్జునుండును (జీవుండును) ఉభయులున్నను, అర్జునుండే ప్రధానుండైనట్లును, రాసక్రీడయందు శ్రీకృష్ణుండును (భగవంతుడును) గోపికలును (జీవులును) ఉన్నను, శ్రీకృష్ణుండే ప్రధానుండైనట్లని యెఱుంగునది.

పదముల యొక్కయున్ను ఉపయోగములకు భేదము కద్దు. నారశబ్దముతో సామానాధికరణ్యముననుండునట్టి అయనశబ్దముచే వీటి విషయమున వ్యాప్యత్వాదులనున్ను తెలిసికొనునది. నిత్యులును, అనేకులును నగు చేతనుల కందఱికిన్ని ఒక్క నిత్యుండగు చేతనుండు (సర్వేశ్వరుండు) వారి యభీష్టములఁ జేకూర్చువాఁడని తెలుపునట్టి శ్రుతియొక్కయర్థమునున్ను ఈ తావునఁ జూచుకొనునది. నిత్యుండుగాను ప్రమాణములనుండి తెలియవచ్చునట్టివాఁడగు జీవుఁడు బ్రహ్మముచే సృజింపబడినట్టివాఁడనుట శరీరోత్పత్తిని బట్టి జెప్పినది. ఇవ్విధముగ నారాయణాత్మకాది కల్పములయందుఁ జెప్పియున్నట్టి ఆయా వ్యుత్పత్తులన్నియును ఈ పైని గనబఱచిన వ్యుత్పత్తులతో సమానములే.

శ్లో॥ చేతనాచేతనం సర్వం విష్ణోర్య దతిరిచ్యతే।
నారంతదయనంచేదం యస్య నారాయణస్తు సః॥

తా॥ విష్ణువుకంటెను వేఱయినదగు చేతానాచేతనాత్మకమగు సర్వమును నారమనఁబడుచున్నది. దీని కయనంబగుటంజేసి భగవంతుండు నారాయణుం డనఁబడుచున్నాఁడు.

అని చెప్పియున్నందున, నారమనఁగా సమస్త జీవుల యొక్కయును సమూహంబని చెప్పినదియును ఉపలక్షణంబగుటంజేసి, బొత్తుగ నశించునట్టివి కానందున స్వరూపముచేఁ గాని, ప్రవాహరీతిగానుగాని నిత్యంబులై నరశబ్దవాచ్యంబులగు సమస్తతత్త్వముల యొక్కయును సమూహములు నారము లనఁబడుచున్నవి.

సమస్తపదార్థములలోనును వ్యాపించియున్నను, అట్టి పదార్థములకుఁగల దోషములనున్ను, వాటి హేతువులనున్ను పోఁగొట్టునట్టి నాశరహితుండని తెలుపునట్టి శబ్ద వ్యుత్పత్తిచేతనున్ను, "నృనయే" ఇత్యాది ధాతువులచేతనున్ను "జహ్నుర్నారాయణో నరః" అను తావున "నరః" అనునది నామధేయము గాను జెప్పియుండుటంజేసియును, "ఆపో నారాయణోద్భూతాః తాఏవాస్యాయనం పునః (ఉదకము నారాయణుని నుండి పుట్టినది.అదియే యీతనికి వాసస్థానము) అను వ్యాసస్మృతి వాక్యముచేతను "ఆపోవై నరసూనవః" ఇత్యాదితావులనుండు "నర"శబ్దము నిత్యుండై సర్వనియంతయగు సర్వేశ్వరునియొక్క తిరునామము కాఁగలదు. కావున,

శ్లో॥ నరసంబంధినోనారాః నరస్సపురుషోత్తమః॥

తా॥ నరునితో సంబంధము గలవిగాన నారములనఁబడుచున్నవి. నరుండనఁగా పురుషోత్తముండు.

శ్లో॥ నయత్యఖిల పజ్ఞానం నాశయత్యఖిలం తమః।
నరిష్యతిచ సర్వత్ర నరస్తస్మాత్సనాతనః।

తా॥ విజ్ఞానమును గలుగంజేయుచున్నందునను, అజ్ఞానమును పోఁగొట్టుచున్నందునను. అంతటను వ్యాపించి యున్నందుననున్ను నరుండు సనాతనుండు.

శ్లో॥ నరసంబంధిన స్సర్వే చేతనాచేతనాత్మకాః।
ఈ శితవ్యతయానారాః ధార్యపోష్యతయాతథా।
నియామ్యత్వేన సృజ్యత్వ ప్రవేశ భరణైస్తథా॥

తా॥ నరుండనఁబడునట్టి భగవంతునిచే శాసింపబడునవి యైనందునను, ధార్యములును, పోష్యములునైనందునను,

నియమింపఁబడినవియైనందునను,సృజింపబడునవియైనందునను, వ్యాపింపఁబడునవియైనందును, నిర్వహింపబడునవియైనందున నున్ను నారములు నరుండను భగవంతునితో సంబంధించినవి.

శ్లో॥ అయతే నిఖిలాన్నారాన్ వ్యాప్తిక్రియయాతయా।
నారాశ్చాప్యయనంతస్య తైస్తద్భావ నిరూపణాత్॥

తా॥ నారముల నన్నింటిని రక్షించుచు అంతర్యామిగ వాటిలో నంతర్యామిగానుండి, వాటితో నెల్లప్పుడును కలిసిమెలిసియున్నందున నవియే సర్వేశ్వరునికి వాసస్థానమని పించుకొనుచున్నవి.

శ్లో॥ నారాణామయనంవాసః తేచతస్యాయనం సదా।
పరమాంచగతిస్తేషాం నారాణామాత్మనాం సదా॥

తా॥ భగవంతుండు నారములనఁబడునట్టి యాత్మలకు అయన మనఁగా వాసస్థానము. అట్టి నారములును ఎల్లకాలము సర్వేశ్వరునికి వాస స్థానములు. మరియు సర్వేశ్వరుండు ఆత్మ లన్నింటికిని పరమగతియైనట్టివాఁడు.

ఈపైని యుదహరించినట్టి యహిర్బుధ్న్యాది సంహితల యందు నారాయణ శబ్దార్థమునువివరించియున్న ప్రకారము, 'నరసంబంధి నారం' అను వ్యుత్పత్తిచే సర్వేశ్వరునియొక్క స్వరూప నిరూపక ధర్మములును, నిరూపిత స్వరూప విశేషణ ధర్మములును, వ్యాపారంబులును, దివ్యమంగళ విగ్రహాదులు ను తక్కిన త్రివిధ చేతనాచేతనంబులును ఇవియన్నియును నారశబ్దముచేఁ దెలుపఁబడునవి యగునప్పుడు, స్వవ్యతిరిక్తంబగు నట్టివమస్తముకును ఆశ్రయముగానుండునట్టి విధము దెలుపఁబడుటంజేసి,యది స్వనిష్ఠత్వాదులఁ దెలుపునది కాఁగలదు,

ఇట్లు వ్యాపన, భరణ, నియమన, స్వామ్యాదుల మూలముగ విలక్షణుండైనట్టి పురుషోత్తమునికిన్ని, వానితో సంబంధించి యుండునట్టి వాటికిన్ని, అద్వైతులు చెప్పునట్టి స్వరూపైక్యాదిరూపమగు భ్రమము బొత్తుగనశించి పోవునట్లు, సర్వశరీరిత్వ, సర్వశబ్దవాచ్యత్వరూపమగు వైభవము ఈ తావున సిద్ధించుచున్నది.

నరశబ్దముచే 'సత్యం జ్ఞానం' ఇత్యాది శోధకవాక్యార్థమును, 'నరాజ్జాతాని తత్వాని నారాణి' అనుటచే 'యతోవా ఇమాని భూతాని' ఇత్యాది కారణవాక్యార్థమును, అయనశబ్దముచే ఆయా యుపాసన వాక్యార్థములును ఈతావున తెలుపఁబడుచున్నవి.

సుబాలోపనిషత్తు మొదలగు వాటియందు సర్వాంతర్యామిగానును, సర్వవిధ బంధువుగాను చెప్పఁబడినట్టి సర్వేశ్వరుండు నారాయణశబ్దముచే దేవతాంతర విలక్షణుండుగాను ప్రతిపాదింపఁబడియున్నాఁడు. లోకమునందుండు సమస్తబంధువులును భగవత్సంకల్పముచేతనే బంధువులైనారు. 'త్వమేవ మాతాచ పితాత్వమేవ' (నీవే తల్లివి తండ్రివి) అనియు 'ఎమ్బిరానెన్దై' (నాయుపకారకుండు నాతండ్రి) అనియు 'పితాత్వం మాతాత్వం' (నీవే తండ్రివి నీవేతల్లివి) అనియును ఈతావుఁ జెప్పియున్నట్లు, స్వాభావసిద్ధముగ అన్నివిధములనున్ను బంధువైనట్టివాఁడు సర్వేశ్వరుం డొక్కండే. 'యస్యప్రసాదే సకలాః ప్రసీదేయురిమాః ప్రజాః' (ఏవ్వాని యనుగ్రహము గలిగినట్లయిన, ప్రజలందఱికిని అనుగ్రహము గలుగఁగలదో) అనియు 'ప్రసన్నమభవత్తస్మై ప్రసన్నాయ చరాచరం' (భగవంతునిచే నను

గ్రహింపఁబడినట్టి వానివిషయమున స్థావరజంగమపదార్థముల న్నియును ప్రసన్నములాయెను) అనియు 'ప్రసన్నే దేవదేవేశే' (దేవతలకున్ను ఈశ్వరుండగు భగవంతుండు ప్రసన్నుండుకాఁగా) అనియును చెప్పియున్నట్లు సర్వేశ్వరుం డనుగ్రహించిన ట్లాయిన, మనకు ప్రతికూలులగు వారెవ్వరును లేరు. సర్వేశ్వరునికి 'సుహృదం సర్వభూతానాం' (సమస్త జీవరాశులను న్ను ప్రేమించునట్టివాఁడు)అన్నట్టి యీయాకారము స్వభావసిద్ధము. (దండధరత్వాది) ఆకారాంతర మన్ననో, యీచేతను లాచరించునట్టి యాజ్ఞాతిక్రమణము (శాస్త్రవ్యతిరిక్తమగు ప్రవర్తనము) నిమిత్తమున వచ్చునది. అదియును యేదొక స్వల్పహేతువువలన నే మాఱిపోగలదు. 'ఇత్తనైయడి యారానార్క్కరంగు నమ్మరంగనాయపిత్తనై' (దాసులమన్నంతమాత్రమున మమ్ములనున్ను రక్షించుటకై శ్రీరంగమునవచ్చి వేంచేసియున్నాఁడు భగవంతుండు మాయెడల యెంతప్రీతి పరవశుఁడో) అని యాళ్వారులు పాయించియున్నారు కదా!

ఈనారాయణ శబ్దమునందుండునట్టి చతుర్థీవిభక్తిచేఁ దెలుపఁబడునట్టి వాక్యార్థంబుల కనుగుణంబులగు సంబంధాదులు తెలుపఁబడుచున్నవి.

స్థూలానుసంధానమునందు (సామాన్యముగ లోకవాడుకయందు) నమః శబ్దముతో సంబంధముండుటం జేసియే అట్టి సంబంధముగల శబ్దముపై (నమస్స్వస్తి స్వాహేత్యాదివ్యాకరణసూత్రమునుబట్టి) చతుర్థీవిభక్తి యున్నట్లే యనుకొనవచ్చును. అట్టి సందర్భమున చతుర్థీవిభక్తికి విశేషోపయోగం బెద్దియు నుండజాలదు.

(షష్ఠపంచ దశాద్వర్ణాత్ కేవలవ్యంజనీ కృతాత్ ఉత్తరో మంత్రశేషస్తుశక్తిరిత్యస్యకథ్యతే" (*వ్యంజనముగాఁ గొనఁబడినట్టి యాఱవ, అయిదవ, పదిమిదవ యక్షరములవలన మంత్రశేషముయొక్క యుత్తరభాగము (నారాయణ శబ్దము) దీనియొక్క బీజశక్తిగాను చెప్పఁబడుచున్నది) అని చెప్పియున్నం దున నిది తిరుమంత్రమునందు ఫలసిద్ధికి హేతుభూతంబగు ప్రదేశము. భిన్నభిన్న యోజనలయందును ఫలప్రార్థనయును దీనియందే యొనర్పఁబడుచున్నది. "అర్థాత్ ప్రకరణాల్లింగా దౌచిత్యాద్దేశకాలతః శబ్దార్థాః ప్రవిభజ్యన్తే నశబ్దాదేవకేవ లాత్' (అర్థసందర్భమునుబట్టియును, ప్రకరణ, సందర్భమును బట్టియును, లింగమునుబట్టియును, దేశకాలముల యౌచిత్య ములను బట్టియుఁ శబ్దార్థములు విభజింపఁబడుచున్నవి. ఇంతి యేకాని, కేవలము శబ్దము మున్నంతమాత్రముచే కాదు) అన్నట్లు ఒక్క శబ్దముకే ప్రకరణాదులకనుగుణముగ భిన్నభిన్నా ర్థములఁ గొనుటయనునదియందఱున్ను ఒప్పుకొన్నట్టి విషయమే

* ప్రణవము నందుండు మూఁడు అక్షరములనున్ను చేర్చి లెక్కపె ట్టుకొనినట్లయిన, తిరుమంత్రమునందు పదియక్షరము లుండఁగ అవు, వాటి లో ఆరవయక్షరము నకారము అయిదవయక్షరము మకారము, పదియవ యక్షరము యకారము. వీటిలో నకారమునకు 'నాయకత్వంచ సర్వేషాం నామనత్వం పరేపదే నాశకత్వం విరుద్ధానాం। నకారార్థః ప్రకీర్తితః' అని చెప్పియున్న ప్రకారము నారాయణపదముయొక్క తత్పురుష సమా సార్థమును తెలుపునది, మకారము 'మంగళత్వం మహత్త్వంచ మహానంచ కరోతియత్ ఆశ్రితానాం తతోజ్ఞేయో మకారార్థస్తతోబుధైః' అని చె ప్పియున్నప్రకారము నారాయణ శబ్దముయొక్క బహువ్రీహి సమాసార్థ మును తెలుపునది. యకారము 'యోగోద్యోగ ఫలంచాను యకారాత్ప్రా ప్యతేబుధైః' అని చెప్పియున్నప్రకారము 'అయ' అను చతుర్థీవిభక్త్యర్థ

కావున 'దీయమానార్థ శేషిత్వం సంప్రదానత్వమిష్య
తే' (ఈయఁబడునట్టి వస్తువుకు ప్రతిగ్రహీతగా నుండుట సం
ప్రదాన మనఁబడుచున్నది) ఇత్యాదితావులఁ జెప్పియున్నట్లు
పరులొసంగిన దానిఁ గైకొనుటఁ దెలుపుట యుచితంబు కాకపో
యినను, సర్వేశ్వరుండు తనకు శేషభూతంబైనట్టి వస్తువును
తానే రక్షించుకొనునట్లు, సమర్పించి నంతమాత్రమును బట్టి
వ్యాపకమంత్రములయందుఁగల చతుర్థీవిభక్తిని సంప్రదానార్థ
పరముగ అహిర్బుధ్న్యమహర్షి వ్యాఖ్యానము చేసియున్నాడు.

శ్లో॥ నీచీ భావేన సంద్యోత్య మాత్మనో యత్సమర్పణం
విష్ణ్వాదిషు చతుర్థీ తత్ సంప్రదాన ప్రదర్శినీ॥

తా॥ దీనుండై యీయాత్మను సమర్పించునప్పుడు
విష్ణ్వాదిశబ్దములయందుండు చతుర్థీవిభక్తి సంప్రదానార్థము
కలది కాఁగలదు!

శ్లో॥ నీచీభూతోహ్యసావాత్మా యత్సంరక్ష్యత యూర్థ్యతే।
తత్కస్మాదిత్యపేక్షాయాం విష్ణవే స ఇతీర్యతే॥

తా॥ ఈయాత్మ దీనుండై రక్షింపమని ప్రార్థించుట
యెవ్వనిని గుఱించి యని యడిగితే విష్ణువునుగుఱించియని చె
ప్పఁబడుచున్నది.

ఈ పైవాక్యమునందు 'విష్ణ్వాదిషు' అని చెప్పియున్నం
దున నారాయణాది శబ్దములయందుండు చతుర్థీవిభక్తియును
అట్టియర్థము కలదిగానే వ్యాఖ్యానము చేయఁబడినది.

---

మగు ఫలమును తెలుపునది ఈమూఁడు అక్షరములె "నారాయణాయ"
అను దానియొక్క యావదర్థమును తెలుపుటచే వీటిమూలము గం, నారా
యణశబ్దము మంత్రశేషముయొక్క శక్తిగాను చెప్పఁబడుచున్నది.

ఈ తిరుమంత్రమునందుండు నకారము మొదలుకొని యేడు అక్షరములకును ప్రత్యేక ప్రత్యేకముగా మంత్రస్మృతుల యందుఁ జెప్పఁబడినట్టి యర్థములను.—

శ్లో॥ నాయకత్వంచసర్వేషాం నామనత్వంపరేపదే।
నాశకత్వంవిరుద్ధానాం నకారార్థఃప్రకీర్తితః॥

తా॥ అందఱికిన్ని నాయకుండుగా నుండుటను, పరమపదముకుఁ గొనిపోవు వాఁడగుటను, విరుద్ధములను నశింపఁజేయువాఁడగుటయున్ను నకారము తెలుపుచున్నది.

శ్లో॥ మంగళత్వంమహత్త్వంచ మహానంచకరోతియత్।
ఆశ్రితానాంతణోజ్ఞేయో మకారార్థస్తతోబుధైః॥

తా॥ ఆశ్రితులకు మంగళత్వమును, మహత్త్వమును మహిమనున్ను గలుగఁజేయుట యేది కలదో, అది మకారముయొక్క యర్థమని యెఱుంగునది.

శ్లో॥ నాస్తిక్యహానిర్నిత్యత్వంనేతృత్వంచపరేఃపదే।
నాకారసేవినాం నృణాం మంత్రవిద్భిఃప్రకీర్తితః॥

తా॥ నాస్తిక్యమును పోఁగొట్టుటయును, నిత్యత్వమును, తనను సేవించునట్టివారిని పరమపదముకుఁగొనిపోవుటయును, ఇవి నాకారముయొక్క యర్థములని మంత్రవేత్తలు తెలుపుచున్నారు.

శ్లో॥ రంజనంభగవత్యాశు రాగహానిస్తతోన్యతః।
రాష్ట్రత్రాణాదికంచాపి ప్రాప్యతే రేఫసేవయా॥

తా॥ రేఫను సేవించుటచే భగవత్ప్రీతినిన్ని, వైరాగ్యమునున్ను, రాష్ట్రరక్షణమునున్ను బొందుచున్నాడు.

శ్లో॥ యోగోద్యోగఫలంచాశు యకారాత్ప్రాప్యతేబుధైః।

తా॥ యకారమువలన యోగానుష్ఠానముయొక్క ఫలమును బొందుచున్నాడు.

శ్లో॥ వర్ణనంచ తథా విష్ణో ర్వాణీసిద్ధిర్ణకారతః।

తా॥ ణకారమువలన విష్ణువును వర్ణించువిషయమున వాక్సిద్ధిగలవాఁ డగుచున్నాడు,

శ్లో॥ యక్షరాక్షసవేతాళ భూతాదీనాంభయాంయయః॥

తా॥ యకారము యక్ష, రాక్షస, భేతాళ, భూతాదులనుండి భయములేని వాఁడగుచున్నాడని తెలుపుచున్నది.

ఈ పైవాక్యములచే కొందఱు ఆచార్యులు తెలుపుచున్నారు.

ఇవ్విధమున పదములయొక్క వ్యాకరణ నిరుక్తాది సిద్ధంబగు వ్యుత్పత్తిని పరామర్శించుటచే, మతాంతరులారోపించునట్టి దోషము లెవ్వియును లేనట్టిదియగు తిరుమంత్రంబనెడి యద్దము పరస్వరూపమునందు తెలియరాని యర్థంబులనన్నింటిని స్పష్టముగాఁ దెలుపఁగలదు. దీనిచేఁ బ్రతిపాదింపఁబడినట్టి దేవతయై, ప్రాప్యమునునగు పరస్వరూపమును ఈతిరుమంత్రమునందు శబ్దములమూలముగను అర్థసిద్ధముగానుక్రమమాణాను గుణముగ అనుసంధించుకొనునప్పుడు రక్షకత్వమును, అది స్వభావసిద్ధంబగుటను, అది సర్వవిషయమగుటను, రక్ష్యవస్తువుల భేదమునుబట్టి రక్షించునట్టి విధములును వెవ్వేఱైయుండుటను, సర్వదా రక్షకుండగుటను, అన్నితావులను రక్షకుండగుటను, అన్నివిధములను రక్షకుండగుటను, స్వార్థము రక్షకుండగుటను, సర్వరక్షకత్వము కావశ్యకమగు సర్వజ్ఞత్వమును, సర్వశక్తిత్వమును, తనయిచ్ఛచే తప్ప వేఱొక్కవిధ

ముగ నివారింపఁదగినవాఁడు కాకపోవుటను,రక్షించుటకుగానగు నాతురత వేఱొక్కఁడానిచే నతిక్రమింపఁబడునది కాకపోవుటను, పరమకారుణికత్వమును, అవసర ప్రతీక్షత్వమును, వ్యాజమాత్ర సాపేక్షత్వమును, ఆశ్రిత సులభత్వమును, విశ్వసనీయత్వమును, సాపరాధులనున్ను రక్షించునట్టి వాత్సల్యమును గలిగియుండుటను, శేషిత్వమును, అది నిరుపాధికమును, నిత్యమును, సర్వవిషయము నగుటను, వేఱొక్కని కతండు శేషభూతుండు కాకపోవుటను, గుణములనుబట్టి యొకప్పుడు భర్తలకుగాను శేషభూతుండగుటను, సపత్నీక శేషిత్వమును, సమాభ్యధిక రాహిత్యమును, ఆత్మరూపమగు హవిస్సు నర్పించుటకై యుద్దేశింపఁబడుట కర్హుండగుటను, అచిత్తుకంటెను, బద్ధ, ముక్త, నిత్యులకంటెనున్ను విలక్షణుండగుటను, పరులకును శేషిత్వమును (తన సంకల్పముచేఁ) గలుగఁజేయుటలో హేతువగుటను, స్వతస్సిద్ధముగ కర్తయగుటను, శక్త్యాధాయకత్వమును,ప్రేరకత్వమును, వేఱొక్కనిచే ప్రేరింపఁబడునట్టివాఁడు కాకపోవుటను, అనుమంతృత్వమును, కర్మసాక్షిత్వమును, సహకారిత్వమును, ప్రియ ప్రవర్తకత్వమును, హితప్రవర్తకత్వమును, వశీకార్యత్వమును, సిద్ధోపాయత్వమును, సాధ్యోపాయ హేతుత్వమును, శ్రుతిస్మృతిరూపంబగు ఆజ్ఞను గలిగియుండుటను, దండధరత్వమును, సర్వసమత్వమును, ఆశ్రిత పక్షపాతిత్వమును, అవిద్యాది హేతుత్వమును, అవిద్యాద్యనర్హత్వమును, ఆశ్రితుల యవిద్యాదులను నివర్తింపఁజేయువాఁడగుటను, స్వరూపమునందు మార్పును బొందునట్టివాఁడు కాకపోవుటను, స్వభావమునందు మార్పును బొందు

నట్టివాఁడు కాకపోవుటను, సర్వనేతృత్వమును, సర్వజగద్వ్యాపార లీలత్వమును, సర్వవేదాంత ప్రధానప్రతిపాద్యత్వమును, సర్వోపాదానత్వమును, సర్వనిమిత్తత్వమును, సత్యసంకల్పత్వమును, సర్వశరీరిత్వమును, సర్వశబ్దవాచ్యత్వమును, సర్వకర్మసమారాధ్యత్వమును, సర్వఫలప్రదత్వమును, సర్వవిధ బంధుత్వమును, సర్వవ్యాపకత్వమును, నిరతిశయ సూక్ష్మత్వమును, సర్వాధారత్వమును, స్వనిష్ఠత్వమును, సత్యత్వమును, జ్ఞానత్వమును, ఆనందత్వమును, అనంతత్వమును, అమలత్వమును, నిరూపిత స్వరూపవిశేషణములు మొదలగునవియును, ఇంకను యీ తావునఁ జెప్పియుండనివియగు అనేకగుణములనున్ను గలిగియుండుటను, నిత్య దివ్యమంగళ విగ్రహవత్త్వమును, పరవ్యూహాద్యవస్థావత్త్వమును, సత్యావతారత్వమును, తనస్వభావము నెన్నటికిన్ని విడనాడియుండక పోవుటను, అప్రాకృతావతారత్వమును, అకర్మవశ్యావతారత్వమును, అకాలనియమావతారత్వమును, ఆశ్రితార్థ గుణపరివాహావతారత్వమును, సర్వావస్థ లక్ష్మీసహచరత్వమును, దివ్యభూషణ, ఆయుధ, మహిషీ, స్థాన, పరిజన, పరిచ్ఛద ద్వారపాల పార్షదాదులఁ గలిగియుండుటను, స్థూలశరీర విశ్లేషకత్వమును, విశ్రమస్థానత్వమును, అనుగ్రహవిశేషవత్త్వమును, బ్రహ్మనాడీద్వారప్రకాశకత్వమును, బ్రహ్మనాడిలో ప్రవేశింపఁజేయు వాడగుటను, బ్రహ్మరంధ్రోత్క్రాంతి హేతుత్వమును, అర్చిరాదిమార్గమున ఆతివాహికులకు నియోక్తయగుటను, సూర్యద్వారాది నేతృత్వమును, అండావరణ, ప్రకృతి మండలాతిక్రమణమునకు హేతువగుటను, విరజాతీర ప్రాపకత్వమును, సూక్ష్మశరీరవిశ్లే

షకత్వమును, అప్రాకృత దేహప్రదత్వమును, దివ్యాప్సరస్స త్కారాదులఁ గలుగఁజేయునట్టి వాఁడగుటను, బ్రహ్మరంధ్రాది ప్రవేశకత్వమును, నిత్యముక్త సత్కారవిశేషహేతుత్వమును, పర్యంకారోహణ పర్యంతమగు ఆదరముగలవాఁడగుటను, పరిపూర్ణానుభవమునకు హేతువగుటను, ప్రధానప్రాప్యత్వమును, శరీరసహితులుగాను శరీర రహితులుగాను నానావిధ శరీరవంతులుగాను నై యొనర్చునట్టి కైంకర్యములకు విషయభూతుఁడగుటను, అవాప్తసమస్తకామత్వమును, నిరతిశయానందవత్త్వమును, నిరతిశయ భోగ్యత్వమును, సర్వదా అనుకూలస్వభావత్వమును, అత్యంత తుల్యభోగప్రదత్వమును, ఆశ్రిత విశ్లేషాసహత్వమును, అపునరావృత్తిహేతుత్వమును, వీటినిన్ని వీటినాధారముగాఁగొని వీటితో సంబంధించియున్నట్టి తక్కిన ప్రభావంబులనున్ను క్రమముగ అనుసంధించుకొనువది.

శ్లో॥ ఇహసంగ్రహాత శ్శ్రీమాన్ గోప్తా శేషీ సమాధికదరిద్రః
శరణంసర్వశరీరీ ప్రాప్యస్సేవ్యశ్చ సాధుభిర్భావ్యః॥

తా॥ లక్ష్మీపతియును, రక్షకుండును, శేషియును, తనతో సమానుండుగాని, తనకంటెను గొప్పవాఁడుగాని లేనివాడును, శరణమును, సర్వపదార్థములును శరీరముగాఁగలవాఁడునునగు భగవంతుండు సాధువులచేప్రాప్యుండుగాను సేవ్యుండుగానును ఈతిరుమంత్రమునఁ దెలుపఁబడుచున్నాడు.

ఈపైని చెప్పియున్నప్రకారము ప్రాప్యుండగు పరమాత్మను పొందునట్టివాఁడగు ఈజీవుండును ఈ తిరుమంత్రముచే ననుసంధింపఁబడునప్పుడు, శ్రీమద్రక్ష్యత్వమును, అనన్య రక్ష్యత్వమును, అంతటను, అన్నివేళలను, అన్నివిధములను రక్ష్య

త్వమును, సుశీలరక్షకత్వమును, పురుషకారవత్త్వమును
మహావిశ్వాసయోగిత్వమును, సలక్ష్మీకదాసత్వమును, నిత్య
దాసత్వమును, నిరుపాధికదాసత్వమును, అనన్యార్హదాసత్వ
మును, జ్ఞానత్వమును, ఆనందత్వమును, స్వయంప్రకాశత్వమును
స్వస్మైభాసమానత్వమును, అహంశబ్దవాచ్యత్వమును, అణుపరి
మాణత్వమును, సూక్ష్మత్వమును, ఛేదనాద్యసర్హత్వమును, చతు
ర్వింశతితత్త్వవిలక్షణత్వమును, అమలత్వమును, ఈశ్వరాన్యత్వ
మును, జ్ఞాతృత్వమును, ఆనుకూల్యాదియోగ్యత్వమును, పర
మపురుషార్థాపేక్షార్హత్వమును, నియోగయోగ్యత్వమును,
కైంకర్యయోగ్యత్వమును, సర్వసాక్షాత్కారయోగ్యత్వమును
నిరతిశయానందయోగ్యత్వమును, పరాపేక్షకర్తృత్వమును,
సోపాధికస్వామిత్వమును, భాగవతశేషత్వమును, భాగవత
కింకరత్వమును, అనన్యోపాయత్వమును, అవిద్యాదిమత్త్వమును,
శరణాదినాపేక్షజ్ఞానవికాసవత్త్వమును, సంసారభయాక్రాంతత్వ
మును, అవిద్యాదినివృత్తిసాపేక్షత్వమును, అకించనత్వమును, ఈ
శ్వరసౌహార్దాదిమత్త్వమును, సాధ్యోపాయానుష్ఠానార్హత్వము
ను, ఉపాయనిష్ఠత్వమును, మహాప్రభావత్వమును, (శరీర) విశిష్ట
స్వరూపముచే సృష్టిసంహారవిషయమగుటను, అక్షయత్వమును
స్వతోబహుళత్వమును, అసంఖ్యాతత్వమును, ఈశ్వరనియా
మ్యత్వమును, ఈశ్వరధార్యత్వమును, వీటి మూలకముగా
వచ్చినట్టి యీశ్వరశరీరత్వమును, ఈశ్వరలీలారసహేతు
త్వమును, ఈశ్వరభోగోపకరణార్హత్వమును, తదధీనగతి
త్వమును, తదధీనతత్ప్రాప్తిత్వమును, సర్వావిద్యోన్ముక్త
త్వమును, ఆవిర్భూతస్వరూపత్వమును, సర్వద్రష్టృత్వమును,

సర్వప్రకారభగవదనుభ వైకభోగత్వమును, నిరతిశయానంద వత్త్వమును, భగవద్భోగార్థ భోక్తృత్వమును, ఇచ్ఛావిషయాంతరహిత త్వమును. ఈశ్వరలక్షణవ్యతిరిక్తమగు పరమ సామ్యవత్త్వమును, అశేష కైంకర్యైకరతిత్వమును, అపునరావృత్తిమత్త్వమును. వీటినిన్ని వీటిని ఆధారముగాఁ గొని వచ్చునట్టి ప్రామాణికంబులగు అర్థంబుల నన్నింటిని యీ పదముల యందు క్రమముగ శబ్దసామర్థ్యమువలనను అర్థస్వభావము వలనను, అనుసంధించుకొనవలసినది.

శ్లో॥ పదత్రయే త్రిసంక్షేపాద్వ్యాఖ్యా సన్యార్హ శేషతా।
అనన్యోపాయతా స్వస్య తదానన్యపుమర్థతా॥

తా॥ తిరుమంత్రమునందుండు మూఁడు పదములచేతనున్ను అనన్యార్హ శేషత్వమున్ను. అనన్యోపాయత్వమున్ను అనన్యప్రయోజనత్వమును, సంగ్రహముగాఁ దెలుపఁబడినవి.

ఇవ్విధమున సర్వమును తిరుమంత్రమునందే చెప్పఁబడినది యనఁదగినట్లున్నట్టి యీ మంత్రమునందు చిదచిదీశ్వరుల స్వరూపములున్ను, జీవులకుఁగల పరస్పరము భేదమున్ను, నిఖిలజగన్నిమిత్తోపాదాన కారణంబగు పరదేవతావిశేషనిర్ధారణాదులున్ను సిద్ధించుటంజేసి యివ్విధముగ తిరుమంత్రార్థమును అనుసంధించుకొనునట్టి మహానుభావులు వేంచేసియున్నట్టి గ్రామమునందువసించునట్టివారికి సర్వేశ్వరుండు లేనేలేడనియు, ఉన్నను, నిర్విశేషుండనియు, అత్యంతోదాసీనుండనియు, ప్రతిఫలనతుల్యైశ్వర్యుండనియు, కర్మవిశేషమువలనసిద్ధించినట్టి యైశ్వర్యము గలవాఁడనియు, లోకవ్యాకు కర్మాదివరవశుండనియు, త్రిమూర్తులు సమానులనియు,

త్రిమూర్తులొక్కటియేయనియు, త్రిమూర్తులకంటెను వేఱయిన వాఁడు పరతత్త్వంబనియు, బ్రహ్మాదులలో నొక్కండు ఈశ్వరుండనియు, స్వరూపమునందు మార్పును బొందునట్టి వాఁడనియు, నిమిత్తోపాదానకారణములు రెండునుఒక్కటియేవస్తువగుటపొసగదనియు, జీవేశ్వరు లుభయులును ఒక్కటియేయాత్మ అయితే వారికిఉపాధిమూలకముగ భేదము గలదనియు, నిత్యముగ భిన్నులును అభిన్నులుననియు. జీవుండు కర్మమాత్రాధిన శేషభూతుండనియు, అనియతశేషభావనగలవాఁడనియు, జడుండనియు, జ్ఞానమాత్రస్వరూపుండనియు, నిత్యముక్తుండనియు, ఆరోపితభోగుండనియు, కర్త కాడనియు, ఈశ్వరునితో నిమిత్తములేకుండ కర్తయనియు, ప్రళయమువరకుండువాఁడనియు, మోక్షమువరకుండువాఁడనియు. ఒక్కండనియు స్వనిష్ఠుండనియు, కర్మమాత్రోపాయుండనియు, ముక్తదశయందు పాషాణతుల్యుండనియు, స్వాత్మానందమాత్ర తృప్తుండనియు, అత్యంత స్వతంత్రుండగుననియు, ఈశ్వరునితో నైక్యమును బొందుననియు, వ్యాపారాదిరహితుండనియు, విభాగావిభాగాది శక్తిగలవాడనియు, ఆనందతారతమ్యముగలవాఁడనియు నియతముగ సాలోక్యాదిభేదములుకలవాఁడనియు, ఇంకనునివ్విధముగ వేదబాహ్యులయొక్కయును, కుదృష్టులయొక్కయును, మనస్సునఁగల దుష్టతలంపు లెవ్వియును ఈతనికి కలుగనేరవు.

ఇవ్విధముననే రక్షకుండగు శ్రియఃపతి విషయమున, విశ్వాసముమందమైయుండుటయును, వేఱొక్కరక్షకునికై వెదకుటయును, "త్వంమేహాం మే" అని యెదిరించునట్లు నిరుపాధికానన్య శేషత్వశాంతియును, దేవతాంతరప్రావణ్యమును,

దేవతాంతరభక్తులతో సంబంధమును, ఇంకను అసేవ్యులగు వారిని సేవించుటలో నభిరుచియును, దేహాత్మభ్రమాదులును, ఆత్మస్వతంత్రుఁడనియును యివ్విధముల భ్రమలును, స్వార్థముగ భగవంతుని ఆశ్రయించుటయును, భాగవతాపచారమును, ఆకించన్యమును మరచిపోవుటయును, సంసారము ననువర్తించుటలో నభిరుచియును, ఆత్మనాశాదిభయమును, సదాచారముకానట్టి దాని విషయమున నభిరుచియును, శత్రుమిత్రాది విభాగనిరూపణమును, బాంధవాంతరపరిగ్రహమును, ప్రయోజనాంతరరుచియును, పరమప్రయోజనము (భగవత్కైంకర్యము లేక మోక్షము) విషయమున వైముఖ్యమును, ఇంకను తనకుండవలసినట్టి నిష్ఠకు విరుద్ధంబులైనవి యెవ్వియును ఈతనికి సంభవింపవు.

శ్లో॥ ఇహ నిజపతి నిరుద్ధైరీదృశనిష్టా విరోధిభిశ్చాన్యైః
ద్విచతుష్కసారవేదీ గంగాహ్రద ఇవనగచ్ఛతి క్షోభం॥

తా॥ తిరుమంత్రముయొక్క సారభూతంబగు అర్థముఁ దెలిసికొని యున్నట్టి వాని యొక్కయును మనస్సు తన నిష్ఠతో విరోధించునట్టి వాటిచే గంగమడుగువలెనే క్షోభమును పొందదు

ఈ తిరుమంత్రముయొక్క వాక్యములను గురించియును వాక్యార్థములను గురించియును ఇఁక మీఁద తెలుపఁబడును. దీనిని ఏకవాక్యంబని కొందఱు చెప్పుదురు. వాక్యద్వయమని మరికొందఱు చెప్పుదురు. ఇట్లు వారువారు వారివారి సంప్రదాయప్రకారము అనుసంధించుకొనుట కద్దు. ఇట్లు వాక్యా

ర్థమునున్ను అనేకవిధములు,గా నిర్వహించి అనుసంధించు కొందురు.

దీనిని ఏకవాక్యముగాఁ గొనునప్పుడు, "తస్య వాచకః ప్రణవః"(భగవంతుని తెలుపునది ప్రణవము) ఇత్యాది తావులఁ జెప్పియున్నట్లు "ప్రణవ ప్రతిపాద్యస్వభావ విశిష్టాయ నారాయణాయ నమః" (ప్రణవప్రతిపాద్యంబగు స్వభావముతోఁ గూడియున్నట్టి నారాయణునికి శేషభూతుండను) అని యన్వయము కాఁగలదు.

ప్రణవమే తిరునామంబై యుండఁగా, "అవ్యక్తార్థత యోంకారః కేవలం నైవసాధకః" (ఓంకారము స్పష్టముగా నర్థమిచ్చునది కానందున, నది సాధకము కాఁజాలదు) అని శాండిల్యామ్యుక్త పద్ధతి ప్రకారము వ్యాపకమంత్రములయందు నామాంతరమును ప్రత్యేకముగా పఠించియుండుట స్పష్టతకు గాను. ఈ యోజన అహిర్బుధ్న్యాదులు చెప్పినట్టి స్థూలానుసంధానమునుబట్టి చూస్తే, ఉపాయపరము కాఁగలదు. ఇట్లు న్నప్పటికిన్ని, స్వరూపపురుషార్థములు దీనిలోనే యంతర్గతంబులు.

"బద్ధాంజలిపుటా హృష్టాః నమ ఇత్యేవ వాదినః" (అంజలిచేయుచు సంతుష్టులై "నమః" అని చెప్పునట్టి వారు" ఇత్యాదులనుబట్టి ప్రాప్యాంతర్గతంబగునట్టి శేషవృత్తిని దెలుపునట్టి దానినిగాను అనుసంధించుకొందురు.

ఈ శేషవృత్తి (కైంకర్యము) స్వరూపానుసంధాన పూర్వకముగా నొనర్పంబడునది. ఇదియును ఉపాయానుష్ఠానము నొనర్చినట్టి వారికి ఇంతవరకు రుచించునప్పుడును ఆధారభూతము

గాఁ గొనఁదగినది. ఈ రెండువిధములగు అనుష్ఠానములును స్థిరముగా నుండుటకుగాను స్వరూపవివేకము కావలసియున్నది, అందులకుగాను వాక్యద్వయముగా ననుసంధించుకొనునప్పుడు, "అకార, నారాయణాశబ్ద వాచ్యంబగు సర్వరక్షకత్వము, సర్వాధారత్వము, ఈ మొదలగు వాటితోఁ గూడియున్నట్టి వానికే నేను నిరుపాధికానన్యార్హ శేష భూతుండను, నాకు నేను శేషమున్ను కాను, వేఱొక్కదానికి స్వామియున్ను కాను. సర్వేశ్వరుని సంకల్పముతో నిమిత్తములేకుండ స్వతంత్రుండ నున్ను కాను" అని చెప్పినట్లగును

అకారమున్ను నారాయణశబ్దమున్ను భగవన్నామము లగుటంజేసి (చెప్పినదానినే మరల చెప్పినందున) పునరుక్తిదోషము రాదా? యంటివేని, అప్పుడు వ్యుత్పత్తిభేదమువలనఁ దెలియవచ్చునట్టి అర్థభేదమును వివక్షించుటచే వాటిలో నొక్కటి విశేషణముగాఁ గొనఁబడుచున్నది. "అకార వాచ్యుండగు నారాయణునికి" అని యర్థము చేసికొనుటచే పునరుక్తి దోషము పరిహరింపవచ్చును.

"ఓంనమో భగవతే వాసుదేవాయ" అను తావున భగవచ్ఛబ్దమున్ను నామధేయంబైనప్పటికిన్ని "వాసుదేవ శబ్దముతో సమానాధికరణమున నుండియున్నది కదా! సమస్త బీజాక్షరములచేతనున్ను తెలుపఁబడునట్టి సర్వకారణ వస్తువు దేవతాంతరమా? యని శకింపకుండునట్లు "నారాయణ" అని విశేషించి చెప్పుటచేతనున్ను, దీనికి ఉపయోగము కద్దు.

మంత్రములకు పదక్రమము అధ్యయనమునుబట్టి యుండునది. అన్వయమన్ననో, అర్థానుగుణముగా నుండునది.

ఇట్లు తిరుమంత్రము వాక్య ద్వయంబైనట్లయిన, ఇది సంపూర్ణ ముగ స్వరూపమును తెలుపునది కాఁగలదు. ఇట్లు ఇది స్వరూప పరంబగుటను బట్టియే "తిరుమంత్రములోఁ బుట్టి ద్వయము లో పెరిగి ద్వయానుసంధాన నిష్ఠుండనైనావు" అని పూర్వాచార్యులు సాయించియున్నారు. ఈతావున "పుట్టుట" యనఁగా స్వరూపజ్ఞానము కలుగుటచే "అన్ఱునాన్ పిఱన్దిలేన్" (ఆ రోజున అనఁగా జ్ఞానము గలుగుటకు పూర్వము నేను పుట్టియున్నట్లుతలంచలేదు) అన్నట్లు పూర్వపు స్థితిని నిషేధించుట, అనఁగా తన యిచ్ఛచేతనున్ను, అనన్య శేషభూతుండై అనన్యాధీనుండై అందుమూలముగ అనన్యప్రయోజనుండై, అనన్య శరణుండై యుండుట. ద్వయమునం బెరుగుట యనఁగా అయాయధికారికి కర్తవ్యంగు దానిని గుఱించిన జ్ఞానముచే ఉపాయమును నంగీకరించుట. ద్వయైకనిష్ఠుండగుట యనఁగా, ద్వయాను సంధానముచేఉపాయాంతరముతోను ప్రయోజనాంతరముతోనున్ను, సంబంధములేనివాఁడై దీనిచేఁ దెలుపఁబడినట్టి యుపాయము నందును, ఫలమునందును నిష్ఠగలవాఁడగుట. ఇవ్విధముగ తిరుమంత్రమున్ను ద్వయమున్ను స్వరూపోపాయ పురుషార్థములఁ దెలుపునవి యగుచున్నవి. ఇట్లు రెండు వాక్యములనుగాను యోజించుకొనునప్పుడు, తిరుమంత్రము మొత్తముఁను సపరికరముగు ఆత్మ సమర్పణను తెలుపునదియనియును అనుసంధించుకొనుట కద్దు. ఆట్లర్థము చేసికొనునప్పుడు, ప్రణవమునందుండునట్టి మకారము ప్రథమాంతమేయైనను సరిపోవును. ఇందువలన హవిస్సును సమర్పించునట్టి విధమున, నిరుపాధికంబగు ఆత్మ హవిసు

నిరుపాధిక దేవతయై అకారవాచ్యుండగు నారాయణునికే వాని భారముగాను సమర్పింపబడినదియని యర్థమగుచున్నది.

ఇట్లు నిరుపాధికమగు ఆత్మయాగమునందు «నమః” అనునదియీయాత్మతనరక్షణమువిషయముననుసంబంధములేనిదై ందువిషయమగుబాధ్యతయునుతనకులేనిదని తెలుపునదియగు చున్నది. «ఇదమింద్రాయ నమమ”అనుతావునవలెనే ఈతావున పరసంబంధమును విధించుటలోను, స్వసంబంధమును నిషేధించు టలోనుసు ప్రవృత్తంబగుటంజేసి, వాక్యద్వయమునున్ను ఉప యోగము కద్దు. ఈ«నమః”అనునది ఈయాత్మనుసర్వేశ్వరునికి సమర్పించుటలోనును పరనిరపేక్ష (స్వతంత్ర) కర్తృత్వాదులను నిషేధించునదియనియును చెప్పవచ్చును. «ఈయాత్మ వేఱొక్కని భారమున్నుకాదు. నాభారమున్ను కాదు” అని తెలుపుటయును నది రెండువాక్యములయొక్కయును అభిప్రాయముకావచ్చును.

తిరుమంత్రము ఆత్మనివేదనమును తెలుపునది యను విషయమును శ్రీభాష్యకారులవారు తిరువారాధన క్రమము నందు ‘‘మూలమంత్రేణ స్వాత్మానం దేవాయ నివేద్య’’ అను తావునఁ దెలిపియున్నారు. అట్లే యీ యర్థమును శ్రీ వైకుంఠ గద్యయందును «శ్రీమతా మూలమంత్రేణ మామైకాంతి కా త్యంతిక పరిచర్యాకరణాయ పరిగృహ్ణీష్వేతి యాచమానః ప్రణమ్యాత్మానం భగవతే నివేదయేత్ ’’ (తిరుమంత్రము నను సంధించుకొనుచు, స్వామీ! దేవరవారి కైంకర్యమునకై దాసుని యంగీకరింపుము! అని ప్రార్థించి దండము సమర్పించి, యాత్మ నివేదము నొనర్చునది) అను తావున సాయించియున్నారు.

ప్రతివాక్యమునందును "ప్రార్థయే" అనుక్రియాపదమును తెచ్చిపెట్టుకొని, తిరుమంత్రమును సంపూర్ణముగ ద్వయము నందుండు ఉత్తరఖండమును వలెనే ఇష్టప్రాప్తిరూపమును, అనిష్ట నివృత్తిరూపమునగు పురుషార్థము విషయముగు ప్రార్థనను తెలుపునట్టిదానినిగాను అనుసంధించుకొనుటకద్దు. అట్లనుసంధించుకొనునప్పుడును స్వరూపానుసంధానము దీనిలో నంతర్గతంబై యున్నది.

ఒకవేళ, యిది స్వరూపమాత్రమును తెలుపునదియైనను, పురుషార్థమున్ను సూచితమగుచున్నది. దానికిగానగు ఉపాయమున్ను ప్రార్థనయును ఆయా ప్రమాణములను బట్టి రాఁగలవు.

ఈ మంత్రముచేఁ గలుగఁజేయఁగల శేషత్వ జ్ఞానాదులు ముందు లేకుండ యుండుటంజేసి, యీ మంత్రము పూర్తిగ ప్రాప్యపరంబని చెప్పినమాట వేఱు. అది యెట్లనిన ప్రాప్య పరమనఁగా ప్రాప్యమును ప్రతిపాదించునది యనుట కాదు. శబ్దముచేఁ గలుగఁజేయఁబడునట్టి జ్ఞానము శబ్దమునకు ప్రతిపాద్యము కాదు గదా!

తిరుమంత్రమును మూఁడు వాక్యములుగాను యోజించుకొనినప్పుడు, స్వరూపమున్ను, పురుషార్థమున్ను శబ్దప్రోక్తములైనట్లయిన, ఉపాయము అర్థసిద్ధము కాఁగలదు.

స్వరూపమున్ను ఉపాయమున్ను శబ్దప్రోక్తము లయినట్లయిన, పురుషార్థము అర్థసిద్ధము కాఁగలదు. ఉపాయమున్ను పురుషార్థమున్ను శబ్దప్రోక్తము లయినట్లయిన, స్వరూపము అర్థసిద్ధము కాఁగలదు. ఇవ్విధముగ స్వరూపోపాయ పురుషార్థములు క్రమముగ శబ్దప్రోక్తములు కాఁగలవు. అదియెట్లనిన,

శ్లో॥ అకారార్థాయైవ స్వమహ మథ మహ్యం నవివహాః।
నరాణాం నిత్యానామయనమితినారాయణపదం।
యమాహాస్మైకాలం సకలమథ సర్వత్రసకలా।
స్వవస్థాస్వావిస్స్యుర్మమ సహజకైంకర్య విధయః॥

తా॥ నేను అకార వాచ్యుండైనట్టి విష్ణువుకే శేషభూతుండను నాకు నేను శేషభూతుండను కాను. చేతనాచేతనముల యొక్క సమూహములైనట్టి నిత్యులకు ప్రాప్య ప్రాపకాధారంబై యుండునని చెప్పునట్టి నారాయణపదము ఎవ్వనిని తెలుపుచున్నదో, అట్టి విష్ణువుకొఱకు సర్వదేశ సర్వకాల సర్వావస్థల యందును నాయొక్క సహజ కైంకర్యములొనర్పఁబడుచున్నవి.

ఈపైని వాయించినట్లు ప్రణవమున్ను నమస్సున్ను స్వరూపమును విమర్శించి తెలుపుచున్నవి. మూఁడవపదము ప్రణవమునఁ జెప్పియున్నట్టి తాదర్థ్యమును (శేషత్వరూప సంబంధమును) పురస్కరించుకొని, అధ్యాహారముగాఁగొనఁబడినట్టి, "ప్రార్థయే" అను క్రియాపదముతోఁ గూడినదై పురుషార్థముకుగానగు ప్రార్థనను తెలుపునది యగుచున్నది. అట్లర్థమగునప్పుడు, అనిష్ట నివృత్తికి గానగు ప్రార్థన అర్థస్వభావమును బట్టి రాఁగలదు.

ద్వయమునందును, "భవాంస్తు సహ వైదేహ్యా" ఇత్యాది తావులయందును చెప్పియున్నట్లు, కైంకర్యముకు విషయమైనట్టి వాడున్ను, సపత్నీకుండగుటంజేసి శ్రీమద్విశిష్టుండగు నారాయణునికొరకే దాసుండననుటు ఈ తావుననున్ను "నారాయణాయ" అను దానికి క్రియాపదము కావలసియుండుటం జేసి ఔచిత్యమునుబట్టి "భవేయం" అను పదమును అధ్యాహారము చేసికొనునది. "వఴువిలావడిమై శెయ్య వేండుమ్. (విడనాడ

కుండ కైంకర్యముఁజేయవలసినది) అనియు “అడియేనై యా ట్కొండరుళే” (దాసుని కింకరునిగా పరిగ్రహింపుమా!) అని యును “కింకరతాం ప్రార్థయే” (నిత్యకింకరత్వముకై ప్రార్థించు చున్నాడను) అనియు, “నిత్య కింకరోభవాని” (నిత్య కింకరుం డనగుచున్నాను) అనియును సాయించియున్నట్లు ప్రార్థనసే ప్రయోగించియున్నారు కదా.

సంబంధము ఎప్పటికిన్నియుండియేయున్నదిగాన, దానిని ఇప్పుడు విధింప నక్కఱలేనందునను, ఈ సంబంధముయొక్క స్వరూపము ప్రణవమునఁజెప్పియుండుటంజేసియును, దీని ఫలంబై సముద్రములో గోష్పాదమన్నట్లు పురుషార్థాంతరములనన్నిం టిని అతి స్వల్పములుగాఁ దెలియవచ్చునట్లు చేసినట్టి పరిపూర్ణ బ్రహ్మానుభవపరీవాహంబగు కైంకర్యము “ఒழிவிలావడిమై” అను తిరువాయ్ మొழியందు సాయించియున్నప్రకారము ఈతావున అపేక్షింపబడుచున్నది.

శ్లో॥ అత్ర స్వలాభాపేక్షాపి స్వామిలాభావసాయినీ।
స్వామిప్రయోజనాపేక్షా వ్యతస్వానంద హేతుకా॥

తా॥ స్వామీ! నిన్ను సంతోషపెట్టునట్టి కైంకర్యమును నేనుపొందవలయునని కోరియున్నను, నన్నుదానునిగాఁగొని నీవు సుఖపడవలయునని కోరియున్నను,ఉభయులకును ప్రయోజనము సిద్ధమగు చున్నది.

శ్లో॥ త్రైగుణ్యం షడ్గుణాఢ్యం ద్వేధాన్నం పరికీర్తితం।
త్రైగుణ్యమన్నం బద్ధానాం ఇతరేషామతేతరత్॥

తా॥ త్రైగుణ్యమనియు,షాడ్గుణ్యమనియును అన్నము ద్వివి ధము.త్రైగుణ్యమగుఅన్నముబద్ధాత్మలది.తక్కినదితక్కినవారిది.

ఈ పైని చెప్పియున్నట్టి షాడ్గుణ్యమగు అన్నమనఁగా భగవద్గుణానుభవము. అందుమూలముగ లభించునట్టి భోగ్యతమంబులగు కైంకర్యములనియును చెప్పవచ్చును. "భోగమాత్ర సామ్య లింగాచ్చ" అను బ్రహ్మసూత్రమునఁ జెప్పియున్నట్లు, మోక్షదశయందుఁ గలుగఁ గల పరమసామ్యము భోగము విషయమునను జ్ఞానమువిషయమునను, ఉండునది యగుటంజేసి, అట్టి సమయముననున్ను, స్వరూపానుగతంబగు శేషత్వమునకున్ను దాని ఫలంబగునట్టి కైంకర్యమునకున్ను విరోధము లేదు. ముముక్షుదశయందును, మోక్షదశయందును నుండునట్టి "అహం=నేను" అనునది శరీరాత్మభావమును బట్టియుండునది యని శ్రీభాష్యాదులయందు సమర్థించియుండుటంజేసి, ఈ "అహం=నేను" అనునది పరమార్థంబైనట్టి దానిని నిమిత్తీకరించుకొని వచ్చినదియే కదా!

ఇట్లు ముక్తదశయందు సంప్రాప్తించునట్టి కైంకర్యము స్వతఃప్రాప్తంబై, (శీతోష్ణాది) ద్వంద్వదుఃఖరహితంబై, నిరంతరమై, అపరిమితమగు రసము గలదియై యుండగలదు. ముముక్షుదశయందు స్వయం ప్రయోజనముగా నొనర్పంబడునట్టి కైంకర్యము సుకృత విశేషము మూలముగా నుండునదియై, శీతోష్ణాదిద్వంద్వములనుసహించియుండవలసినదియై, నిద్రాది సమయములయందంతరించునదియై, పరిమితరసము గలదియై యుండగలదు. ఈ లోకమున, కైంకర్యము కాకుండ, ఈతం డొనర్చునట్టి వ్యాపారములలో భగవదాజ్ఞకు అనుకూలించనవి యన్నియును ఏదైన నొక ప్రతికూలఫలము నొసంగఁ గలవు. భగవదననుజ్ఞాతంబులగు కామ్యకర్మంబులలో, స్వర్గ

పశ్వాది ఫలంబులకుఁగాను అనుష్ఠింపబడునట్టికర్మలన్నియును అనేక దోషదుష్టంబులై, అనుకూలంబులైనట్టివాటివలెనే పైకి మాత్రము తెలియవచ్చునట్టి ఫలముల నొసంగి,యుందుమూలముగ బాధకంబులు కాఁగలవు. కావున ముముక్షువులు “త్రైవర్గికాం స్త్యజే ద్ధర్మాన్” అన్నట్లు, ప్రయోజనాంతర హేతువులగు వాటిని విడనాడి, భక్తి తత్త్వజ్ఞానంబులను, భగవద్భాగవ సమృద్ధినిన్ని యుద్దేశించి చేయునట్టి కార్యంబులగు భగవద్ధర్మంబులను సాధనబుద్ధితో ననుష్ఠించినను, అవి బంధకములు కానందున నుచితంబగు కైంకర్యములోనంతర్గతంబులు కాఁగలవు.

ప్రణవముచేఁ దెలుపఁబడినట్టి భగవచ్ఛేషత్వము నమశ్శబ్దమునందు ఔచిత్యరూపమగు అత్యంత పారతంత్ర్య పారార్థ్యముల మూలముగ ప్రమాణానుగుణముగ భాగవతుల పర్యంత ముండవలసినదియగుటంజేసి, “నారాయణాయ” అను తావునఁ దెలుపఁబడునట్టి భగవత్కైంకర్యమున్ను, భాగవతుల వరకును అనుష్ఠింపవలసినది కాఁగలదు.

శ్లో॥ మమ మద్భక్త భక్తేషు ప్రీతిరభ్యధికా భవేత్।
తస్మాన్మద్భక్తభక్తాశ్చ పూజనీయా విశేషతః॥

తా॥ నాభక్తుల విషయమున భక్తిగలవారి యెడల నాకెక్కువ ప్రీతి గలదు. కావున నా భక్తులకు భక్తులైనట్టి వారు విశేషముగ పూజింపవలసినట్టి వారు.

శ్లో॥ తస్మాద్విష్ణు ప్రసాదాయ వైష్ణవాన్ పరితోషయేత్।
ప్రసాద సుముఖో విష్ణుస్తే నైవస్యాన్న సంశయః॥

తా॥ కావున విష్ణువుయొక్క యనుగ్రహమును సంపాదించు కొనుటకుగాను విష్ణుభక్తులను సంతోషపెట్టునది. అందు మూలమం గ విష్ణువు ప్రసన్నుండు కాఁగలఁడు.

ఈ పై శ్లోకములయందును ఈ యర్థము తెలుపఁబడినది.

“సర్వం పరవశం దుఃఖం” (పరతంత్రుండుగా నుండుట కష్టతరము) ఇత్యాది వాక్యములు తనకు స్వరూప ప్రాప్తములు కానట్టి క్షుద్రవిషయములయెడల కర్మవశ్యత మూలముగ సంభవించునట్టి పారతంత్ర్యము కష్టతరంబైనది యని తెలుపుచున్నవి. ఇంతియే. భగవంతునియెడలను, భాగవతులయెడలను గల పారతంత్ర్యమన్ననో, అత్మాభిమానానుగుణమగు పురుషార్థవ్యవస్థనుబట్టి అధికమగు ప్రీతిఁ గలుగఁజేయునది. ఈ తావున భాగవతులని చెప్పినది భగవంతునియెడల మిక్కుటముగ భక్తిరసము గలవారిని గుఱించియని యెఱుంగునది.

నారములతోఁగూడియున్నట్టి వాఁడగు నారాయణుని విషయమున కైంకర్యము నపేక్షించునప్పుడు, దానితోఁ బాటు వానితోఁ జేరియుండునట్టి నారముల యెడలనున్న కైంకర్యము అపేక్షింపఁబడినది యగుట న్యాయసిద్ధము గాన, ఈ తావున భాగవత కైంకర్యము తనంతనే సిద్ధించుచున్నదని కొందఱు తలంచుచున్నారు

ఇట్లు నారములు సర్వేశ్వరునితోఁ జేరియున్నంత మాత్రమున, వాటి విషయమునను కైంకర్యము ప్రాప్తంబగునట్లయిన, ఈ తావున నారశబ్దముచేఁ దెలుపఁబడునట్టివిగాను, వివక్షింపబడునట్టి చతుర్ముఖబ్రహ్మాదిదేవతాంతరముల

విషయమునను, భగవంతుని ద్వేషించునట్టివారి విషయమునను
న్ను, కైంకర్యము నొనర్పవలయునని యపేక్షించునట్లు కాఁ
గలదు. నరపతి విషయమున కైంకర్యము నొనర్చుట కిష్టపడి
నంత మాత్రముచే నరులవిషయమునను న్న కైంకర్యము నొ
నర్పవలయునని సిద్ధింపనట్లు, ప్రకృతమునను న్నకైంకర్యాపేక్ష
సిద్ధింపదు. అయితే స్వామి కభీష్టంబైన దాని నొర్చుట కిచ్ఛ
యించునట్టి వాఁడైనందున, వానికెక్కువ ప్రియులును, శేషత్వ
జ్ఞానముగల వారును, అనన్యప్రయోజనులైనట్టి వారి విషయ
మున కైంకర్యము అపేక్షింపఁబడినది యగుచున్నది. ఇంతియే.

ఈ పైని చెప్పిన విధమున తిరుమంత్రమునందలి
మూఁడు వాక్యములలో, రెండు వాక్యములు స్వరూపముఁ దెలు
పునవియై, ఒక్కవాక్యము పురుషార్థముఁ దెలుపునది కాఁగ
లదు. అథవా, ప్రణవము స్వరూపముఁ దెలుపునది యనియు,
నమస్సునందు అనిష్ట నివృత్తికి గానగు ప్రార్థన తెలుపఁబడు
చున్నదనియు, అనిష్టము నివర్తించినతోఁడనే గలుగఁగల పురు
షార్థమును "నారాయణాయస్యాం" అనునది తెలుపుచున్నదని
యును అర్థము చేసికొనవచ్చును. ఈ తావున నుండునట్టి
"నమః" శబ్దమునకున్ను ద్వయమునందుండు "నమః" శబ్దమునకు
వలెనే విరోధి నివృత్తికిగానగు ప్రార్థనను తెలుపుటయందే
తాత్పర్యమనెడి యోజనయును

శ్లో॥ ప్రణవోదితతచ్ఛేషభావోఽహం నిజకర్మభిః।
అహంకారమమత్వాభ్యా మభి భూతోప్యతః పరం
తచ్ఛేషత్వానుసంధాన పూర్వతచ్ఛేష వృత్తికః।
భూయాసమిత్యముం భావం వ్యనక్తి నమ ఇత్యదః॥

తా॥ ‘‘స్వామీ! ప్రణవమునందుఁ జెప్పియున్నట్టి శేషత్వముగల వాఁడనగు నేను కర్మవశమున అహంకార మమకారములను గలవాఁడనైతిని. కావున శేషత్వము ననుసంధించుకొనుచు, కైంకర్యము నొనర్చుచు, శేషభూతుండననెడి నిశ్చయము గలవాఁడను కావలయుననెడి ప్రార్థనను’’ ‘‘నమః’’ అనుపదము తెలుపుచున్నది.

అని భట్టరువారు తిరువారాధన క్రమమునందు సాయించియున్నారు, కావున ‘‘అహం న మమ స్వాం (నేను నాకు శేషభూతుండను కాకపోదును గాక) అని కాని, ‘‘న మమ కించిత్స్వాత్’’ (నాది యనఁబడునది యొక్కటియును లేదు) అని కాని, వాక్యంబై, యందువలన ఈ జీవునికి అనాద్యవిద్యాసంచిత పుణ్య పాపకార్మమూలకమగు బ్రహ్మాది సురనర తిర్యక్ స్థావరాత్మక చతుర్విధ శరీరములతో జన్మించుటంజేసి, గలుగునట్టి ఆయా యాత్మాభిమానమువలనఁ గలుగఁ జేయఁ బడినదియు, అని వార్యమునగు సంసారభయమును నివర్తింపజేయునట్టి వానికై’’ అనియు ‘‘పోయ్ నిన్ఱజ్ఞానముమ్ పొల్లా వొఴుక్కు మఴుక్కుడమ్బుమ్’’ (దేహాత్మాభిమానమును, దుష్కర్మవాసనయును, కుత్సిత దేహ సంబంధమును) అనియును చెప్పఁబడినట్టి అజ్ఞానమును, కర్మమును, వాటిరెంటివిషయమువఁ బ్రీతియును, అందుమూలమునఁ గలుగఁగల ప్రకృతి సంబంధాదిరూపములగు సర్వానిష్టములను నివర్తింపవలయు నని ప్రార్థించినట్లు అర్థముచేసికొనునది.

ఇవ్విధమున అనిష్టనివృత్తికై ప్రార్థించినట్లయిన, ఇష్టప్రాప్తిని ప్రత్యేకించి కోరవలయునా?

శ్లో॥ యథానక్రియతే జ్యోత్స్నా మలప్రక్షాళ నాన్మణేః॥
దోషప్రహాణాన్న జ్ఞానమాత్మనః క్రియతే తథా॥
తా॥ పై మురికిని తుడిచి వేసినంతమాత్రమున మణియొక్క ప్రకాశము క్రొత్తగా సృజింపఁబడనిది యగు చందంబున, దోషములను పోగొట్టినంత మాత్రమున ఆత్మయందు ప్రకాశించునట్టి జ్ఞానమున్ను సృజింపఁబడుచుండలేదు.
శ్లో॥ యథోద పానకరణాత్ క్రియతే నజలాంబరం
సదేవ నీయతేవ్యక్తి మసతస్సంభవః కుతః।
తా॥ భావినిత్రోవ్వి నంతమాత్రముచే ఉదకము సృజింపఁబడుచుండలేదు. ముందున్నట్టిదే ప్రస్తుతము బయలుపడుచున్నది. అట్లుకాకున్న, లేనిది క్రొత్తగా నెట్లు గలుగఁగలదు?
శ్లో॥ తథాహేయగుణధ్వంసాదవబోధాదయో గుణాః।
ప్రకాశ్యంతే నజన్యంతే నిత్యా ఏవాత్మ నోహితే॥
తా॥ అట్లేహేయగుణములను నశింపఁజేయుటచే ఆత్మయొక్క జ్ఞానానందాది గుణములు బయలుపడుచున్నవి, ఇంతియెకాని, అవి క్రొత్తగా సృజింపఁబడుచుండలేదు. అవి యాత్మకు నిత్యముగా నుండునవి కదా?

ఈ పై వాక్యములయందుఁ జెప్పియున్నట్లు ఇష్టప్రాప్తి అనంతటనే కలుగదా? యంటివేని, “స్వతస్స్వార్థం యథాభాగం పుత్రః పితురపేక్షతే। పాపరాథ స్తథా దాసః కైంకర్యం పరమాత్మనః” అనఁగా తనకు స్వతసిద్ధముగ నుండునట్టివాటిని తన యపరాధముల మూలముగ కోల్పోయినట్టి యీ జీవుండు, నా భాగము నాకు లభింపవలయుననియు, అందులకు

గాను నా యపరాధములను క్షమింపవలయుననియును అపే క్షించుటలో బాధకం బెద్దియును లేదు. కావున ప్రతిబంధక ములు నివర్తించినట్లయిన, మాణిక్యముయొక్క ప్రకాశమున్ను "ఇచ్ఛాత ఏవ తవ విశ్వపదార్థ సత్తా" (స్వామీ! దేవరవారి సంకల్పముచేతనే కదా సమస్తపదార్థములును ఉనికిపట్టు కల వియగుచున్నవి) అన్నట్లు నియతమగు ఈశ్వరేచ్ఛవలన ప్రకా శించునట్లు, ప్రకృతమునను, స్వాభావికంబులగు జ్ఞానవికా సాదులును సహజకారుణ్యరూపియగు ఈశ్వరసంకల్పమువలన సంప్రాప్తించునవియని తెలియవచ్చుచున్నది.

అయినను, వేదోక్తలక్షణము లేకున్నట్లయిన, సర్వా నిష్టనివృత్తియే యిష్టప్రాప్తియైయుండ, మరల దానినే ప్రత్యే కించి చెప్పినట్లయిన, పునరుక్తిదోషము రాదా! అవిద్యా నివృత్తియే మోక్షంబని శ్రీభాష్యకారులవారును సాధించి యుండలేదా? యంటివేని, "ఏకమేవస్వరూపేణ పరేణచ నిరూ పితం ఇష్టప్రాప్తిరనిష్టస్య నివృత్తిశ్చేతికథ్యతే" అనఁగా ఒక దానినే దానిస్వరూపముఁగొనియు, దానిప్రతియోగిఁగొనియును నిరూపించి, ఉపయోగాంతరమునకై యది ప్రత్యేకముగాఁజెప్ప వలసినదిగా నుండగలదు. సంసారావస్థయందు ఒక్క ప్రతి కూల నివృత్తియనునది ప్రతికూలాంతరము గాను, అనుకూల ప్రతికూల, ఉభయ నివృత్తిగాను నుండగలదు. ప్రకృత మునఁ, సర్వప్రతికూలనివృత్తియగుటంజేసి, ముందుముందుపూ ర్తిగ అనుకూలంబైయే యుండగలదు, కావున ముందున్న స్థి యవస్థ మిక్కిలి యనిష్టంబైనదియగుటను, కేవలము అనుకూ లంబైనట్టిదియగు రాబోవు అవస్థ మిక్కిలియిష్టంబగుటయున్ను

తెలుపుటకుగాను ఆదరవశమున ప్రత్యేకించి పేర్కొనవలసినది యగుచున్నది. భగవన్నిగ్రహాదినివృత్తియును, నిగ్రహ ఫలమగు జ్ఞాన సంకోచాదులయొక్క నివృత్తియనఁబడు జ్ఞానవికాస కైంకర్యాదులును వెవ్వేరైనవి యగుటంజేసి, వాటిని ప్రత్యేకించి చెప్పుటలో బాధకము లేదు కదా! సర్వానిష్టంబులును తొలఁగిపోయినట్లయిన, ఆత్మ పాషాణతుల్యముగా నుండగలదని యివ్విధమున మతాంతరులు చేయునట్టివాదము కవకాశము లేకుండుటకుగాను, భగవత్ప్రాప్తిగలిగినప్పుడు, ఇంద్రాది ప్రాప్తి గలిగినప్పుడువలెనే దుఃఖసంబంధమెంతమాత్ర ముండజాలదని తెలుపువలయుననెడి యుద్దేశముచేతనున్ను ప్రత్యేకించి చెప్పినారనియును చెప్పవచ్చును.

ఇవ్విధమున స్వరూపమును, పురుషార్థముకుగాను ప్రార్థనయును శబ్దప్రతిపాద్యంబులైనట్లయిన,ఇట్టి పురుషార్థ ప్రార్థన ఇచ్ఛామాత్రంబైయుండుటంజేసిమాత్రమే కాకుండ,గోప్తృత్వవరణరూపముగానునుండుటంజేసి,తక్కినయంగములును ఈ తావున సూచింపఁబడునవి కాఁగలవనియును చెప్పవచ్చును. అప్పుడుతిరుమంత్రము ప్రధానముగ స్వరూపోపాయములను తెలుపునది కాఁగలదు. అయనశబ్దమునందు కరణ వ్యుత్పత్తిచే ఈశ్వరునియొక్క యుపాయత్వమున్ను సిద్ధిపఁగలదు. "కేచిత్తుచరమశ్లోకే ద్వయేచోక్తక్రమాదిహ భరన్యాసపరం తారం శేషంఫలపరం విదుః" అనగా ఈతిరుమంత్రమునందుస్వరూపోపాయపురుషార్థములు మూఁడునుక్రమముగ శబ్దప్రతిపాద్యంబులగునప్పుడు, ప్రణవము స్వరూపపరమును, నమస్సు ఉపాయపరమును, తక్కినది పురుషార్థప్రార్థనాపరమునూ కాఁగలదు. ఈ మూఁడింటియొక్కయును

అర్థములనన్నింటిని వేదాంతశాస్త్రముఁ గొని తెలిసికొని యీ
తావున అనుసంధించుకొనునది. ఈ యోజన వేదాంతశాస్త్రము
నందు తత్త్వోపాయపురుషార్థములను నిరూపించునట్టి క్రమము
తో ననుగుణముగా నుండగలదు. అది యెట్లనిన, బ్రహ్మసూత్ర
ములయందు మొదటి రెండు అధ్యాయములచేతను పరా
పరతత్త్వములఁ దెలిపి మూఁడవ అధ్యాయమున అధికార పరి
కరంబులతోఁగూడిన ఉపాయముఁ దెలిపి, నాల్గవ అధ్యాయ
ముచే ఫలముఁ దెలుపుచు ఇవ్విధమునను కదా శారీరకమీ
మాంసాశాస్త్రము ముగించుచున్నది. ఈ తావున మొదటి
రెండు అధ్యాయములయందుఁ జెప్పియున్నట్టి పరావర తత్త్వ
స్వరూపమును, నాల్గవ అధ్యాయమునఁ జెప్పియున్నట్టి ఫల
మున్ను స్వతంత్రోపాయముగ ప్రపత్తి ననుష్ఠించునట్టి యధి
కారికిన్ని సమానములే. మూఁడవఅధ్యాయమునందు వైరాగ్య
పాదమునందును, ఉభయలింగపాదమునందును చెప్పియున్నట్టి
సాంసారిక దోషమును, శరణ్యుండగు సర్వేశ్వరునియొక్క
హేయప్రత్యనీక కల్యాణైకతానత్వమును, ముముక్షువగు
ఈతనిచే అవశ్యముగ తెలిసికొనవలసి యున్నది. మూఁడవ
పాదమునందు మోక్షోపాయముగాను చెప్పఁబడినట్టి భిన్న
భిన్నోపాసనములను వాటి కధికారులయినట్టి వారు అనుష్ఠింప
సమర్థులు. అకించనుండగు అధికారి తాను వాటిననుష్ఠించుట
లో నసమర్థుండగుటం గని, „నానాశబ్దాదిభేదాత్" „వికల్పో
విశిష్టఫలత్వాత్" అను అధికరణములయందుఁ జెప్పియున్న
ప్రకారము, ఉపాసనాంతరములకంటెనున్ను విలక్షణంబై,
వాటివలనఁగలుగఁగల మోక్షము నొసంగుటలో వేఱొక్క

పరికరము నపేక్షింపనదియగు న్యాసమునే యవలంబింపఁ గలఁడు. ఉపాసన నిష్ఠుండు నాల్గవపాదమునఁ జెప్పఁబనట్టి వర్ణాశ్రమధర్మములను "సహకారిత్వేనచ" అను సూత్రమునఁ జెప్పియున్నప్రకారము ఉపాసనాంగములనుగాను అనుష్ఠించును. ప్రపత్తిని స్వతంత్రోపాయమునుగాఁగొని యనుష్ఠించు నట్టివాఁడు "విహితత్వాచ్చాశ్రమకర్మాపి" అను బ్రహ్మసూత్రమునఁ జెప్పియున్నప్రకారము భగవదాజ్ఞచే నేర్పఱుపఁ బడినవనుకొని వానినే స్వయం ప్రయోజనముగా ననుష్ఠించును. ఇట్లుండి యుండుటంజేసి శారీరక మీమాంసా శాస్త్రమునఁ జెప్పియున్నట్టి స్వరూప, ఉపాయ, పురుషార్థంబులన్నియును తిరుమంత్రమునఁ దెలుపఁబడినవి కాఁగలవు. దీనియందు అర్థపంచకాదులు తెలుపఁబడియుండుటను గుఱించి యింతకుముందు చెప్పియున్నాము.

ఇట్లు తిరుమంత్రము ఏకవాక్యముగాఁ గొనఁబడునప్పుడు ఉపాయమును దెలుపునదియనియు, కైంకర్యముఁ దెలుపునది యనియును, వాక్యద్వయముగాఁగొనఁబడునప్పుడు, స్వరూపముఁ దెలుపునదియనియు, అన్వయవ్యతిరేకముఖముగ ఆత్మసమర్పణముఁ దెలుపునదియనియు, పురుషార్థ(కైంకర్య)ప్రార్థనఁ దెలుపు నది యనియును, వాక్యత్రయముగాఁగొనఁబడునప్పుడు మొదటి రెండు పదములును స్వరూపముఁ దెలుపునవియై పైనుండు కడపటిపదము పురుషార్థము విషయమగు ప్రార్థనఁ దెలుపునది యనియు, ప్రణవము స్వరూపముఁ దెలుపునదియై, పై రెండు పదములు ఇష్టప్రాప్త్యనిష్ట నివృత్తుల విషయమగు ప్రార్థనను తెలుపునవి యనియు, ఈ ప్రకారముగ ప్రథమపదము స్వరూ

పముఁ దెలుపునదియై, పై రెండు పదములును ఉపాయముఁ దెలుపునవి యనియు, ప్రథమ పదము ఆత్మ సమర్పణముఁ దెలుపునదియై పైరెండు పదములున్ను ఫల (కైంకర్య) ప్రార్థనఁ దెలుపునవియనియు, మూడు పదములును క్రమముగ తత్వ, ఉపాయ, పురుషార్థ ప్రార్థనలఁ దెలుపునవియనియు నిట్లు అనంతములగు అర్థములఁ గలిగియున్నట్టిది యగు తిరుమంత్రము నందు వాక్యార్థములను ఈ పైని గనఁబఱచిన ప్రకారము పది విధములుగ వారి వారి సంప్రదాయప్రకారము అనుసంధించు కొందురు. ఇవ్విధముగ కొన్నింటిని ప్రధానముగా ననుసంధించుకొనునప్పుడు శక్యానవియును దీనియందు అర్థ సిద్ధములు కాఁగలవు.

శ్లో॥ తదేవంపదవాక్యార్థైః తత్త్వవిద్గురుదర్శితైః।

తత్తత్కుదృష్టి కథితం నిరస్తం యోజనాంతరం॥

తా॥ ఇవ్విధముగ తత్త్వవేత్తలగు పూర్వాచార్యులు ఉపదేశించినట్టి పదవాక్యార్థములచే కుదృష్టులు చేయునట్టి యన్వయమంతయును నిరసింపఁబడినది యగుచున్నది.

ఈ తిరుమంత్రార్థమునందు వేదబాహ్యుల చేతనున్ను కుదృష్టులచేతనున్ను చలింప శక్యముకానట్లు తెలివి తేటలు గల వానిని గుఱించి,

శ్లో॥ ప్రజ్ఞాప్రసాదమారుహ్యాహ్యశోచ్యశ్శోచతోజనాన్

భూమిస్థానివశైలస్థోహ్యజ్ఞాన్ ప్రాజ్ఞః ప్రపశ్యతి॥

తా॥ ప్రజ్ఞారూపంబగు మేడ పై నెక్కియున్నట్టి జ్ఞాని పురుషుండు అజ్ఞానములోఁబడి సంసారమునఁ గష్టపడు చున్నట్టి

యీ జనులను కొండపై నెక్కియున్నట్టి వాఁడు భూమిపై సంచరించు జంతువులను వలెనే జూచుచున్నాడు.

అని చెప్పియున్నది “జ్ఞానేన హీనాః పశుభిస్సమానాః” అను తావునఁ జెప్పియున్నట్టి జ్ఞానమనునది యివ్విధమైనట్టి తెలివియే. ఇవ్విధంబైనట్టి జ్ఞానము గలవాఁడు.

శ్లో॥ నప్రహృష్యతి సంమానే నావమానేనుతప్యతే।
గంగాహ్రద ఇవాక్షోభ్యో యస్సపండిత ఉచ్యతే॥

తా॥ సన్మానముచే అత్యంతము సంతుష్టుండు కాడు. అవమానముచే మనస్సున నొచ్చుకొనడు. గంగా నదిలోని మడుగువలెనే అతని మనస్సు యెంతమాత్రము క్షోభమును పొందదు, అతండు పండితుండనఁబడుచున్నాడు.

ఈపైని చెప్పియున్నట్లు అట్టివాఁడు అవమానాదులమూలముగ మనస్సునందు వికారమును పొందడు. ఈతిరుమంత్రమునందు యదార్థంబగు జ్ఞానమునున్ను నిష్ఠనున్ను గలవానిని ఆదరించునట్టి దేశమునందును,

శ్లో॥ యత్రాష్టాక్షరసంసిద్ధో మహాభాగోమహీయతే।
సతత్రసంచరిష్యంతి వ్యాధి దుర్భిక్ష తస్కరాః

తా॥ ఏదేశమునందు అష్టాక్షరమంత్రసిద్ధిగల మహానుభావుండు గౌరవింపఁబడుచున్నాడో, ఆదేశమునందు వ్యాధులుండవో, కరువురాదో. ఆదేశమునందుదొంగలుసంచరింపరు.

ఈ పైని చెప్పియున్నట్లు ఒక్కవిధమైనట్టిదోషమున్ను సంక్రమింపదు. ఈశ్లోకమునుబట్టిచూస్తే “రాగాదిదోషాః సతతానుషక్తాః అశేషకాయప్రసృతా నశేషాః ఔత్సుక్యమోహారతిదాః జఘాన యోఽపూర్వవైద్యాయ నమోస్తుతస్మై” అనుతావున

ఆయుర్వేదవేత్తలు ప్రధానవ్యాధులనుగాఁ గొనినట్టి రాగాదులును జంతువులకు శ్రీయని చెప్పఁబడినట్టి జ్ఞానసంపత్తుయొక్క సంకోచమున్ను, బాహ్యవుదొంగల కలవికానట్టి యాత్మాపహారము నొనర్చునట్టి గొప్పదొంగలగు అహంకారాదులును, ఇట్టి ప్రదేశమున నుండజాలవని చెప్పఁ బడినట్లు తెలియుచున్నది.

ఈ తిరుమంత్రముచేఁ దెలుపఁబడినట్టి యర్థమే విష్ణు, వాసుదేవ శబ్దవిశిష్టంబులగు తక్కిన వ్యాపక మంత్రముల కును అర్థము. అదెట్లనిన,

శ్లో॥ వ్యాప్తికాంతిప్రవేశేచ్ఛా స్తత్తద్ధాతు నిబంధనాః।
పరత్వేభ్యధికా విష్ణోః దేవస్య పరమాత్మనః॥

అని అహిర్బుధ్న్య మహర్షి మొదలగువారు అర్థముచేసిన విధమున 'విషౌవ్యాప్తౌ' 'వశకాన్తౌ' 'విశప్రవేశనే' 'ఇషు ఇచ్ఛాయామ్' అను ధాతువులనుండి నిష్పన్నంబైనట్టి విష్ణుశబ్దమునఁ దెలియవచ్చునట్టి యర్థములున్ను, వాసుదేవ శబ్దమునందును 'వసతి, వాసయతి, దీవ్యతి' అను వ్యుత్పత్తులవలనఁ దెలియవచ్చునట్టి సర్వవ్యాపకత్వమును, సర్వాధారత్వమును, తద్గతదోషరహితత్త్వమును, క్రీడా విజిగీషాది మత్త్వమును అనఁబడునవి యన్నియును నారాయణ శబ్దార్థములో నంతర్గతములు. 'ఋచో యజూంషిసామాని తథైవా థర్వణానిచ సర్వమష్టాక్షరాంతస్థం యచ్చాన్య దపివాఙ్మయం' (ఋగ్యజుస్సామాథర్వణవేదములు ఇఁకను తక్కిన శబ్దజాల మంతయును తిరుమంత్రములో నంతర్గతంబైయున్నది) అనిచెప్పియున్నందున ఈ తిరుమంత్రమే ముముక్షువులకు తత్త్వహితంబుల విషయమునఁగావలసినట్టి వాటినన్నింటిని తెలుపునది.

'ఋచో యజూంషి సామాని యోధీతే సకృదంజసా। సకృదష్టాక్షరం జప్త్వా స తస్య ఫలమశ్నుతే' అను తావున ఈతిరుమంత్రమును ఒక్కతూరి యుచ్చరించినంతమాత్రమున సర్వదా సర్వవేదములనున్ను జపించుటచేఁ గలుగఁగల ఫలము గలుగుననియును తెలుపఁబడినది.

'యస్య యావాంశ్చ విశ్వాసస్తస్య సిద్ధిశ్చ తావతీ। ఏతావానితి నైతస్య ప్రభావః పరిమీయతే' అన్నట్లు తమతమ విశ్వాసములకుఁగల తారతమ్యమునకనుగుణముగ సిద్ధియందును తారతమ్యముండుటంజేసి మహావిశ్వాసముగలవారి విషయమున ఈతిరుమంత్రము అపరిమిత ప్రభావము గలదియై యుండగలదు. ఈపై శ్లోకమునందు ఈ మంత్రముయొక్క ప్రభావము పలానివారిచే మాత్రమే పరిచ్ఛేదించి తెలిసికొనుట దుర్లభంబనియిట్లు నిర్దేశించి చెప్పియుండనందున, 'నరనారాయణ నాయులకత్తరనూల్ శిందామై విరిత్తవన్' (నరనారాయణుండై యవతరించి యీ లోకమునందు సనాతన ధర్మమును ప్రవర్తింపఁజేసిన వాఁడు) అని పాయించినట్లు తిరుమంత్రమును ప్రవర్తింపఁజేసినవాఁడై, దీనిచే ప్రతిపాద్యుండున్నై, స్వతః సర్వజ్ఞుండగు నారాయణునిచేతనున్ను ఈమంత్రముయొక్క ప్రభావం బింతమాత్రమని పరిచ్ఛేదించి చెప్పుట కలవికానిదైయుండును. ఇంతియే,

ఈ మంత్రమును గన్పెట్టినట్టివాఁడును, దీనిచే ప్రతిపాద్యదేవతయు నగు భగవంతుని నుండియే దీనిని అర్థయుక్తముగ గ్రహించినట్టివారగు శ్రీ తిరుమంగైయాళ్వారులవారు 'అందణర్ మాట్టందిప్పైక్కుమ్ మందిరత్తై మందిరత్తాల్ మఱవాతెన్నుంవాళతినేల్ వాళలామ్'' (స్వానుభవమునొసంగి రక్షిం

మునట్టివాఁడగు భగవంతుని తిరుమంత్రముచే ననుసంధించుకొ
నుచు మరువకుండయుండి సుఖపడవలయునంటే సుఖపడవచ్చు
ను) అని సాయించియున్నారు.

సర్వకారణభూతుండై, అఖిలహేయప్రత్యనీకకల్యాణైక
స్వరూపుండగు సర్వేశ్వరుని ప్రతిపాదించునట్టి తిరుమంత్రము
ననుసంధించుకొనునట్టి గొప్ప జ్ఞానవంతులకు శమదమాద్యా
త్మ గుణములలోనను అష్టైశ్వర్యాదులలోనను వారు కోరు
నది యెద్దియును వారికిదుర్లభమైనది కాఁజాలదని యీక్రిందు
ఉదహరించిన పాశురమువలనఁ దెలియఁగలదు.

పా॥ ఎట్టుమామూర్త్తియెణ్ కణ్ణనెండిక్కెట్టిత్తైయెణ్ పిరకిరుతి
ఎట్టుమావరైకళీన్ఱవెణ్ కుణత్తోనెట్టెణ్ణుమెణ్ కుణమతియోర్
క్కెట్టుమామలరెణ్ శిత్తియెణ్పత్తి యెట్టుయోకాంగ
మెణ్ శెల్వమ్ ఎణ్ణుమాకుణ మెట్టెట్టెణ్ణుంగలై యెట్టిగతమేల
తువు మెట్టినవే॥

టీ. ఎట్టుమూర్త్తి=ఆకాశాదిపంచభూతములును, సూర్యచంద్రులును
యజమానుండును తనయొక్కమూర్త్తిగాను వరమును బొంది అష్టమూర్తి
యని ప్రసిద్ధికెక్కిన రుద్రుండును, ఎణ్ కణ్ణన్=నాల్గుముఖములుగల వాఁ
డగుటచే ఎనిమిది నేత్రములుగల హిరణ్యగర్భుండును, ఎండిక్కు=ఎనిమిది
దిక్కులును, ఎట్టికై=ఇంద్రాదులగు ఎనిమిదిమంది దిక్పాలకులును, ఎణ్పి
రకిరుతి=అవ్యక్తమహదహంకారములనఁబడు ఎనిమిది తత్వములును, ఎట్టు
మావరైకళ్=ఎనిమిది కులపర్వతములును, ఈన్ఱవెణ్గుణత్తోన్=వీటి నన్నిం
టిని సృజించినవాఁడై గుణాష్టక విశిష్టుండగు పరమాత్మ, ఈతనికిఁ గల
యెనిదిగుణములనఁగా—కర్మవశ్యత్వ, జరా, మరణ, శోక, క్షుత్పిపాసలు
లేనివాఁడైయుండటయు, నిత్యములగు భోగములఁ గలిగియుండుటయు,

తలపెట్టినదానిని నెరవేర్చునట్టి వాఁడగుటయును. ఎట్టెణ్ణు మెణ్ణుక్కుణమత్తి యోర్క్క=ఇట్టివాఁడగు సర్వేశ్వరుని విషయమున ప్రధానమంత్రమగు తిరుమంత్రమును అర్థయుక్తముగాఁ దెలిసికొని, అనుసంధించుకొనునట్టివారును అష్టాంగమగు బుద్ధిగలవారును, అనన్యులగు జ్ఞానులకు. బుద్ధికిఁగల యెనిమిది యంగములనఁగా "గ్రహణం ధారణంచైవ స్మరణం ప్రతిపాదనం" ఊహాపోహార్థవిజ్ఞానం తత్త్వజ్ఞానంచధీగుణాః అని చెప్పఁబడినవి, ఎట్టుమామలర్ = "అహింసా ప్రథమం పుష్పం పుష్పమింద్రియనిగ్రహః సర్వభూతదయాపుష్పం క్షమాపుష్పం విశేషతః, జ్ఞానం పుష్పంతపః పుష్పంధ్యానంపుష్పంతథైవచ। సత్యమష్టవిధంపుష్పం విష్ణోఃప్రీతికరం భవేత్" అన్నట్టి యెనిమిది పుష్పములు, ఎణ్పిత్తి="ఊహాస్తర్కోఽధ్యయనందుఃఖవిఘాతాస్త్రయః సుహృత్ప్రాప్తిః దానంచ సిద్ధయోఽష్టౌ" అని చెప్పఁబడినట్టి యెనిమిది సిద్ధులును, ఎణ్పత్తి="మద్భక్తజన వాత్సల్యం పూజాయాంచానుమోదనం మత్కథాశ్రవణేభక్తిః స్వరనేత్రాంగ విక్రియా। స్వయమారాధనేయత్నో మమార్థేడంభవర్జనం మమానుస్మరణంనిత్యం యచ్చమాంనోపజీవతి" అని చెప్పియున్నట్లు ఎనిమిదివిధములగు భక్తులును, ఎట్టుయోగాంగమ్=యోగాంగములుగాఁ జెప్పబడినట్టియమనియమాదులును, ఎణ్మైశ్వర్యమ్=అణిమా మహిమాచతథా' లఘిమా గరిమా వశిత్వ మైశ్వర్యం ప్రాప్తిః ప్రాకామ్యంచేత్యష్టైశ్వర్యాణియోగయుక్తస్య', అనఁబడునట్టి యెనిమిది విభూతులును, ఎట్టుమాకుణం=పరాత్మావస్థయందు ఆవిర్భూతము అగు ఎనిమిదిగుణములును, "అష్టౌగుణాః పురుషం దీపయంతి" ఇత్యాది తావులఁ జెప్పియున్నట్టి గుణము అనియును అర్థముచేసికొనవచ్చును. ఎట్టెట్టెణ్ణుమ్కలై=అరువది నాలుగు విద్యలును, ఎట్టిరతమేఱువుమ్="శృంగార వీరకరుణాద్భుతహాస్యభయానకాః భీభత్సరౌద్రౌచ రసాః" అని చెప్పఁబడినట్టి రసములు ఎనిమిదింటికిన్ని పైదియగుశాంతిరసమును ఇవైయెల్లామట్టినక్=వీటిలో దేని విషయముననైనను ఈతనికి యిచ్ఛయున్నట్లయినను, లభింపక మానదు. అయితే ప్రస్తుతము ఆత్మగుణాగాలు ఆవిర్భూతములు

కాకుండుట అనుసంధానమునఁ బ్రీతి చాలకుండుటవలననని యెఱుంగునది. అష్టైశ్వర్యములు కలుగకయుండునది వాటి యెడను ఉపేక్షించి యుండుటంజేసియని యెఱుంగునది. శీఘ్రముగ సంసారము నివర్తింపకుండుట యనునది ఆర్తికొరతగానున్నందునని యెఱుంగునది. కావుననే కదా నమో నారాయణాయేతి మంత్రస్సర్వార్థసాధకః (తిరుమంత్రము సర్వమును సాధించి యిచ్చునది) అని అవిద్యాపూతనోన్ముక్తైః అనవజ్ఞాతసత్పథైః అసహాస్వాద సత్ప్రవృత్తైరాదిష్టమితి దర్శితం అనఁగా అవిద్యారహితులై సన్మార్గ ప్రవర్తకులై అసత్కార్యములఁ జేయుటలో వెనుతీయునట్టివారిచే దెలుపఁబడినది.

ఉయర్ందనఙ్కావలనల్లార్క్కురిమై తులఙ్గుయిరాయ్ మ
యర్ందమైతీర్ందుమఱ్ఱోర్వళియిన్ఱియడైక్కలమాయ్
ప్పయందపన్నారణన్ పాదంగళ్ శేర్ందపళవడియార్
నయందకైఙ్కర్యవెల్లా నాడునన్మనువోదినమే॥

టీ. ఉయర్ంద = అందరికంటెను గొప్పవాఁడగు, నఙ్కావల్ = మా రక్షకునికంటెను, అల్లార్క్కు = వ్యతిరిక్తులైన వారికి, ఉరిమై = దాస్యము తులఙ్గు = విడవాడి. ఉయిరాయ్ = సత్తగలవారమై, మయర్ందమై = అజ్ఞానమును, తీర్ందు = పోగొట్టుకొని, మఱ్ఱు = వేఱు = ఓర్ = ఒక, వళి = మార్గము, ఇన్ఱి = లేకుండుటచే, అడైక్కలమాయ్ = రక్షింపుమని శరణుజొచ్చినవారమై, పయంద = సృష్టికర్తయగు, అన్నారణన్ = ప్రసిద్ధుండగు నారాయణుని యొక్క, పాదంగళ్ = శ్రీపాదములను, శేర్ందు = పొంది, పళవడియార్ = పురాతన దాసులగు నిత్యసూరులు, నయంద = ప్రీతితో స్వీకరించిన, తొత్తేవల్ = కైంకర్యము, ఎల్లామ్ = అంతయును, నాడి = తెలుపునట్టి నన్మను = మంచి మంత్రమగు తిరుమంత్రమును, ఓదినమే = అర్థయుక్తముగ అభ్యసించినారము.

తా॥ దేవతాన్తర విషయములగు కైంకర్యములను విడనాడుటచే మాయజ్ఞానము పోగానే, వేఱొక్కగతిలేని వారమగుటంజేసి, రక్షింపుమని

సర్వేశ్వరుని శరణుజొచ్చి వాని శ్రీపాదములను పొంది నిత్యసూరు లంగీక
రించినట్టి కైంకర్యమునంతయును విశదముగా తెలుపునట్టిదియగు తిరుమం
త్రమును అర్థయుక్తముగాఁ దెలిసికొనునట్టివార మైతిమి.

శ్లో॥ ఇత్థంసంఘటితఃపదైస్త్రిభిరసావేకద్విపంచాక్షరై
రర్థైః స్త్వహితప్రయోజనమయైరధ్యాత్మసారైస్త్రిభిః-
ఆద్యస్త్ర్య(త్ర్య)క్షరవేదసూతిరజహత్ స్థూలాదివృత్తిత్రయ
స్త్రైగుణ్యప్రశమంప్రయచ్ఛతిసతాంత్రయ్యంతసారోమనుః॥

టీ॥ ఏక, ద్వి, పంచాక్షరైః=ఒకటి, రెండు, అయిదు అక్షరములు గల, త్రిభిః=మూఁడు, పదైః=పదములచేతను, అర్థైశ్చ=మూఁడువాక్యార్థముల చేతనున్ను, ఇత్థం=ఇవ్విధముగ, సంఘటితః=చేర్పఁబడినట్టిదియు, ఆద్యః=ఆదిదైనదియు, త్ర్యక్షరవేదసూతిః = మూఁడుఅక్షరములు గలదియును, వేదకారణమునగు ఓంకారముతోఁ గూడియుండునట్టిదియు, అజహత్స్థూలాది వృత్తిత్రయః=స్థూల, సూక్ష్మ, పరమప్రయోజనారూపమగు వృత్తిని విడువనిదై, త్రయ్యంతసారః=ఉపనిషత్సారంబగునట్టి, అసౌ=ఈ మనుః=తిరుమంత్రము, సతాం=సత్పురుషులకు, త్రైగుణ్య ప్రశమం = సంసారనాశమును, ప్రయచ్ఛతి=కలుగఁజేయుచున్నది.

తా॥ తిరుమంత్రార్థ జ్ఞానమువలన సజ్జనులు సంసారసంబంధ విముక్తులగుచున్నారు.

మూలమంత్రాధికారము

ముగిసెను.



శ్రీమతే నిగమాంతమహాదేశికాయనమః.

    

# రహస్యత్రయసారము

## ద్వయాధికారము,

శ్లో॥ ఆకర్ణితోవితనుతే కృతకృత్యకత్వ
మామ్రేడితోదిశతియశ్చకృతార్థభావం
ప్రత్యూషతాంభజతి సంసృతికాళరాత్రేః
పద్మాసహాయశరణాగతి మంత్రఏషః॥

టీ॥ పద్మసహాయశరణాగతి మంత్రః=శ్రియఃపతికిశరణాగతిచేయుటలోనగు మంత్రమగు, ఏషః=ఈద్వయమనఁబడునట్టి మంత్రము, ఆకర్ణితః=ఆచార్యునివలన వినబడినంతమాత్రమున, కృత కృత్యకత్వం=కృతకృత్యతను, వితనుతే=కలుగఁజేయుచున్నది, ఆమ్రేడితః=రెండుమూడు పర్యాయములు ఉచ్చరింపఁబడినదై, కృతార్థతాం=కృతార్థతను, ఆదిశతి=కలుగఁజేయుచున్నది. సంసృతికాలరాత్రేః=సంసారరూపమగు దుష్టమైనరాత్రికి ప్రత్యూషతాం=ప్రభాతకాలస్థితిని అనఁగా నాశమును, భజతి = కలుగఁజేయుచున్నది.

తా॥ ఈ ద్వయము సర్వేశ్వరుని విషయమునశరణాగతిమంత్రము. దీనిని వినినంతమాత్రమున కృతకృత్యుండగుచున్నాడు. రెండుమూఁడు పర్యాయము లుచ్చరించినంతమాత్రమున కృతార్థుండగుచున్నాడు. అట్టివానికి సంసారసంబంధమును నశింపఁజేయుచున్నది.

తిరుమంత్రముయొక్క మధ్యమపదమునందు అర్థసిద్ధముగాను గాని, శబ్ద ప్రతిపాదితముగాను గాని, తెలుపఁబడినట్టి యుపాయ విశేషమునున్ను, దీనివలనఁ గలుగఁగల ఫలముగాను తృతీయ పదమునందుఁ జెప్పఁబడినట్టి పురుషార్థ విశేషమునున్ను విశదముగాఁ దెలుపునది ద్వయము.

ఇది కఠవల్లియందు ప్రత్యేకముగ పఠింపఁబడి చేర్చి అనుసంధించుకొనవలయునని విధించియున్నందునను, భగవచ్ఛాస్త్రమునందలి శ్రీప్రశ్నసంహితాదులయందు మన్త్రోద్ధారాదులఁ జేసి ప్రతిపాదింపఁ బడినందునను ఇది శ్రుతిమూలమగు తాంత్రిక మంత్రము. అయితే యిది పూర్వాచార్యుల శ్రీసూక్తియని కొందరు చెప్పినదియును ఆప్తులు ఉపదేశించినది యనుకొని జనులు దీనినిఆదరించుటకుగాను గాని, పరమాచార్యుండగు సర్వేశ్వరుండు భగవచ్ఛాస్త్రమునందు దీనిని సాయించియుండుటంజేసికాని కావచ్చును. ఇంతియే.దీనియొక్క ఋష్యాదులను తిరుమంత్రము మొదలగు వాటివిషయమునందు వలెనే తెలియఁగోరువారు మంత్రవ్యాకరణాదుల యందుఁ జెప్పియున్న ప్రకారము తెలియఁదగును.

ఈ మంత్రము 'సభాగితు శ్చరణాగాథం' 'భవాంస్తుసహవైదేహ్యా' అను శ్లోకద్వయమునందు వివక్షింపఁబడినట్టి యుపాయోపేయ రూపంబగునట్టి యర్థద్వయమును ప్రతిపాదించునది యగుటంజేసి దీనికి ద్వయమని పేరువచ్చినది.

ఇట్లుండుటంజేసియును, ఉపాయాంతరములతోను ఉపేయాంతరములతోను నువిద్విధమైనట్టి సంబంధమున్న లేనివాఁడు ఈమంత్రమునకు పూర్ణాధికారి. ఉపాయ వరణమునును

ఆత్మ సమర్పణనున్ను క్రమముగ ప్రతిపాదించుటంజేసి ద్వయ మని పిలువఁబడుచున్నదనియును కొందఱు చెప్పుదురు. ఇట్లు "శ్రీమన్నారాయణ స్వామిన్" ఇత్యాది మంత్రాంతరములను న్ను ద్వయమని పేర్కొనుట కిదియే హేతువు.

శ్లో॥ మంత్రరాజ మిమంవిద్యా ద్గురువందన పూర్వకం।
గురురేవ పరంబ్రహ్మ గురురేవ పరాగతిః
గురురేవ పరావిద్యా గురురేవ పరాయణం
గురురేవ పరఃకామో గురురేవ పరంధనం
యస్మాత్తదుప దేష్టాఽసౌత స్మాద్గురుతరోగురుః॥

తా॥ ఆచార్యునికి దండము సమర్పించి యీమంత్రోప దేశమును పొందునది. ఏలయనఁగా, ఆచార్యుండే పరబ్రహ్మ ము, పరగతి, పరవిద్య, పరాయణము, గొప్పగా కోరబడునట్టి వస్తువు, గొప్పధనము. మంత్రము నుపదేశించుటచే ఆచార్యు డు అందఱికంటెను గొప్పవాఁడుగా నెన్నఁబడుచున్నాడు.

శ్లో॥ నానుకూల్యం ననక్షత్రం నతీర్థాదినిషేవణం।
నపునశ్చరణంనిత్యం జపంవా పేక్షతేహ్యయం॥

తా॥ ఈ మంత్రము అనుకూల్యమునుగాని, నక్షత్రము నుగాని తీర్థాది సేవననుగాని పునశ్చరణనుగాని. నిత్యము జప మునుగాని యపేక్షింపదు.

శ్లో॥ నమస్కృత్య గురుందీర్ఘ ప్రణామై స్త్రిభిరాదితః।
తత్పాదాగృహ్యమూర్ధ్ని న్యస్వే నిధాయ వినయాన్వితః॥
గృహీయాన్మంత్రరాజానం నిధికాంక్షీవ నిర్ధనః।

తా॥ మూడు పర్యాయములు ఆచార్యునికి సాష్టాంగ ముగ దండము సమర్పించి వాని శ్రీపాదములను శిరసావహిం

చి, వినయ సమేతుండై దరిద్రుండు ధనముఁ గొనునట్లువారి నుండి మంత్రోపదేశమును లభించునది.

శ్లో॥ లబ్ధ్వైవం మంత్రరాజానం మామేకం శరణం వ్రజేత్।
అనేనైవతుమంత్రేణ స్వాత్మానంమయినిక్షిపేత్।
మయినిక్షిప్తకర్తవ్యః కృతకృత్యోభవిష్యతి॥

తా॥ ఇవ్విధముగ మంత్రోపదేశమునులభించినవాఁడై నాకు శరణాగతినిచేసి, తన యాత్మరక్షణ భారమును నాపై యుంచునది. ఇట్లు నాపై భారమునుంచియున్నట్టివాఁడు కృతకృత్యుండు కాఁగలడు.

ఇవ్విధముగ ప్రపత్తివిషయములగు తక్కినమంత్రముల యందుఁ జెప్పియున్నట్టి ఆచార్యాశ్రయణాది విధులు దీనివిషయమునను అనుష్ఠేయములు కాఁగలవు. ఆస్తికుండైనవానికి ఈమంత్రముయొక్క యర్థమును పూర్తిగాఁ దెలిసికొని, దీని నొక్కతూరి యుచ్చరించుట మాత్రమే మోక్షోపాదకమగున నువిషయము శాస్త్రసిద్ధము. ఈమంత్రముయొక్క ప్రభావము ను 'పదోకవిధముగ నీవు ద్వయాను సంధాన పరుండవై నావు' అనుచు తక్కినమంత్రములకంటెనున్న దీనికిఁగల వైలక్షణ్యముఁ దెలియవచ్చునట్లు తెలిపియున్నారు.

శ్లో॥ అవశేనాపియన్నామ్ని కీర్తితే సర్వపాతకైః।
పుమాన్ విముచ్యతేసద్యః సింహత్రస్తైఃమృగైరివ॥

తా॥ పరవంశుండుగానుండి యైనను నారాయణా అని భగవన్నామమును ఉచ్చరించి నంతమాత్రమున, వానియొక్క సమస్తపాపములును సింహమునుజూచి మృగములు పారిపోవు నట్లు ఈతనిని విడిచిపోఁగలవు.

శ్లో॥ నామ్నస్తేయావతీశక్తిః పాపనిర్హరణేహరేః।
శ్వపచో౽పినరఃకర్తుం క్షమస్తావన్నకిల్బిషం॥

తా॥ ఓహరీ! ఛండాలుండును ఇంచుకైనను పాపముఁ జేయజాలనట్లు పాపంబులను పోగొట్టునట్టి శక్తి యీ తిరునామోచ్చారణముకుఁ గలదు

ఈ పై వాక్యములయందుఁ జెప్పియున్నప్రకారము తిరునామసంకీర్తనమురెయొక్క ప్రభావమునుబట్టి చూసే శరణ్యుండగు సర్వేశ్వరుని సన్నిధియుం దొనర్చునట్టి శరణాగతినిన్ని దానిఫలమునున్ను వీటిని సంపూర్ణముగా ప్రతిపాదించునట్టి యీ మంత్రమురెయొక్క సకృదుచ్చారణ మాత్రముకుఁగల ప్రభావము శ్రుత్యాది ప్రమాణబలమువలన సులభముగాఁ దెలియగలదు. ఇట్టిప్రభావము దీనికుండుట లోనగు హేతువులనున్న ఈ తావున ప్రమాణసంప్రదాయములనుండియెఱుంగఁదగును.

ఇవ్విధముగ రహస్యములగు అర్థముల విషయమున హేతువులనుగుఱించి విచారింపఁదగదు. శాస్త్రమునుబట్టియే నమ్మవలసినది యను విషయము మహాభారతము నందు,

శ్లో॥ దేవగుహ్యేషుచాన్యేషు హేతురేవనిరర్థకః।
బధిరాంధవదేవాత్ర వర్తితవ్యం హితైషిణా॥

తా॥భగవంతునిగుఱించినవియగురహస్యార్థములవిషయమున హేతువిమర్శనమునిరర్థకము. హితముఁగోరునాఁడు వీటి విషయమున వినివినకయు చూచిచూడకముఁప్రవర్తించునది.

అని చెప్పఁబడినది. ఈమంత్రమునందు వివక్షింపఁబడినట్టి ఆత్మ సమర్పణము,

శ్లో॥ సర్వోపాధివినిర్ముక్తం క్షేత్రజ్ఞం బ్రహ్మణిన్యసేత్ ।
ఏతద్ధ్యానంచయోగశ్చ శేషోన్యోగ్రంధ విస్తరః॥

తా॥ అన్ని సంబంధములను విడనాడి ఆత్మనుపరమాత్మ కు ఒప్పచెప్పునది. ఇదియే ధ్యానము. ఇదియే యోగము. తక్కినదంతయును నిరర్థకము.

ఇత్యాది వాక్యములచే ప్రమాణాంతరముల యందును స్తుతింపఁబడినది. పై శ్లోకముకు 'ఏతద్ధ్యానంచధ్యేయంచ' అను పాఠాంతరమున్ను కలదు. ఈశ్లోకము స్వరూప సమర్పణముఁ దెలుపునదియైనను, ఈ తావునఁ జెప్పఁబడునట్టి భరసమర్పణ ము దానిలో నంతర్భూతంబైయున్నది. ఈయాత్మ సమర్పణ మును 'నివేదయీత స్వాత్మానం విష్ణావమలతేజసి తదాత్మా తన్మనా శ్శాంత స్తద్విష్ణోః పరమంపదం' (విష్ణుని ధ్యానించుచు వానియందే మనస్సుగలవాఁడై శాంతుండై నిర్మలుండగువిష్ణు వుకు తనయాత్మను 'తద్విష్ణోః' ఇత్యాది మంత్రము చేనర్పించు నది) అనివ్యాస స్మృత్యాదులయందును శ్వేతాశ్వతరాద్యు పనిషత్తులయందును జెప్పియున్నట్లు మంత్రాంతరములు ఇవ్వి ధముగ శరణ్యునిన్ని శరణాగతినిన్ని విశదముగాఁ దెలుపవు. ఈ మూఁడును తిరుమంత్రమునందున్న సంక్షిప్తములు. కావున ప్రాప్య ప్రాపకముల స్వరూపములను సంపూర్ణముగాఁ దెలుపు నట్టిదియగు ఈద్వయమే ప్రపత్తిని దెలుపునట్టివియగుతక్కిన మంత్రంబుల న్నింటిలోఁ బ్రధానంబైనది.

ఈవిధ్యర్థమును, శ్రుతి స్మృతీతిహాస పురాణములయం దును శ్రీ పాంచరాత్ర సంహితయందును చెప్పియున్నట్టి విధ మున,సదాచార్య సంప్రదాయ క్రమప్రకారము. శ్రీభాష్యకా

రులవారు శరణాగతిగద్యయందు వివరించియున్నారు. అదియె ట్లనిన, 'భగవన్నారాయణాభిమతానురూప స్వరూప, రూప' అని యారంభించి శ్రీమచ్ఛబ్దార్థమును సాయించి యున్నారు, 'అఖిలహేయ ప్రత్యనీక' ఇత్యాది వాక్యమున 'స్వరూప, రూప గుణ, విభూతులను విస్తృతముగ సాయించినందున 'నారాయణ శబ్దార్థమును వివరించి యున్నారు. ముందుగానే పిరాట్టిని పేర్కొనియున్నను, పురుషకారత్వమును నిర్వహించుటకై విభూతులమధ్యనున్న ఆమె యుండియున్నదని తెలుపుటకు గాను, మరల నారాయణ పదార్థమును వివరించునప్పుడును ఆమెను గురించి తెలిపియున్నారు. అటుపిమ్మట. 'శ్రీమన్నా రాయణా' అని ఫలోపాయ (పూర్వోత్తర) వాక్యముల యందు ప్రయోగింపబడినట్టి 'నారాయణ' శబ్దమునున్ను ఉదహరించియున్నారు. 'ప్రపద్యే' అను క్రియాపదమునందలి యుత్తమపురుషచే దెలుపబడునట్టి యధికారి స్వరూపము 'అనన్యశరణోఽహం' అనుటచే వివరింపబడినది. 'త్వత్పాదా రవిందయుగళంశరణమహంప్రపద్యే' అను తావున 'చరణౌ' అనుశబ్దమును 'శరణ' శబ్దమును 'ప్రపద్యే' అను క్రియాప దమును జూపింపబడినవి. అనంతరము 'ద్వయమ్' అనియారం భించి ద్వయమును సంపూర్ణముగా జూపించి యున్నారు. మొదటగాని, తుదినిగాని, 'ద్వయం' అని పేరును చెప్ప కుండ ఇంతదూరము యేల చెప్పియుండ వలయునంటివేని, ఉ పాయత్వ, ప్రాప్యత్వముల విషయమున పరిశృతమున ప్ర ధానభూతుండు శ్రీమన్నారాయణుం డగుటంజేసి, రెండుతావుల నుండునట్టి సవిశేషణమగు నారాయణశబ్దముయొక్క యర్థము

వివరింపఁబడునప్పుడు ఈ మంత్రముచే ప్రతిపాద్యంబగుసాధ్యో పాయముతోఁగూడ ప్రధానోపాయమున్ను పరిధానప్రాప్యము న్ను వివరింపఁబడినవి యని తెలుపుటకుగాను ఈతావునఁద్వ యము' అని సాయించినారు. అటుపిమ్మట 'పితరంమాతరం' అని యారంభించి జితంతా స్తోత్రాదులయందుఁ జెప్పియున్న ట్లు సంపాదకవాక్యములద్వారా 'అనన్యప్రయోజనుండై యున్న ను అనన్యోపాయుండైయ్యును ఉపాయ పరిగ్రహముఁజేసిన విధమున్ను, శరణ్యుండగు సర్వేశ్వరుని స్వభావము ననుసంధిం చుకొనుచు, అందుమూలముగ అపరాధ క్షమాపణముఁ జేసి కొనునట్టి విధమును వీటిని ద్వయమునఁ దెలుపఁబడినట్టియర్థ ములనుగాను సాయించియున్నారు. అర్థక్రమమునుబట్టిముందుగ నమస్సుచేతను ప్రార్థింపఁబడునట్టి అనిష్టనివృత్తినివివరించి తెలిపి, అటుపిమ్మట ఈలోకమునందున్నప్పు డుండవలసినవి యగు ప రభక్త్యాదిపురుషార్థములతోఁ బాటుచతుర్థ్యంతపదములయం దు అట్టివిభక్తిచేఁ దెలుపఁబడునట్టి పరమ పురుషార్థప్రాప్తిని విశదముగాఁ దెలిపియున్నారు. ఇట్లు ఉపాయానుష్ఠానమునొన ర్చియున్నట్టి యధికారి విషయమున ఈలోకముననూ పరలోక మునమున్ను గలుగఁగల సిద్ధినిగురించి చరమశ్లోకమునందలి యుత్తరార్థమునందు అవిధముననే స్వాభావికముగ దయావిశి ష్టంబగు భగవదభిప్రాయమున్నట్టి విధమును దానిఁ దెలుపున ట్టి భగవద్వాక్యముల ప్రక్రియచేఁ దెలిపియున్నారు. కావున గద్యయందు సాయించినదంతయును ద్వయమునందు వివక్షిం పఁబడినది యని యెఱుంగునది. ఈ విషయము 'ద్వయమర్థా

నుసంధానేన సహాసైవం వక్తా' అను శ్రీసూక్తిచేతనున్నసూచింపఁబడినది.

శ్లో॥ పరభక్త్యాదిమూలత్వం కైంకర్యస్యయదుచ్యతే।
గద్యాదిషుతదప్యాహూ రపవర్గ దశాశ్రయం॥

తా॥ కైంకర్యము పరభక్త్యాది మూలకంబని చెప్ప పది యేది కలదో, అది మోక్షావస్థ కాధార భూతంబైనది గాను గద్యాదులయందుఁ జెప్పఁబడుచున్నది.

శ్లో॥ ఉత్తరోత్తరయోః స్వామిసాక్షాత్కారణభోగయోః।
పూర్వపూర్వక్షణేష్టత్వాత్తన్మూలత్వ ముదీరితం॥

తా॥ ముందు ముందు కలుగఁగల భగవత్సాక్షాత్కారము, భోగము ఇవి ముందు ముందుండునట్టి క్షణమున యెక్కువ యిష్టంబైనవి యైనందున నవి మోక్షహేతువులు గాను చెప్పఁబడినని.

శ్లో॥ శరీరపాతకాలేచహార్దస్యానుగ్రహాస్స్వయం।
పరిపాకంప్రపన్నానాం ప్రయచ్ఛతి తథావిధం॥

తా॥ శరీరావసానకాలమున హృదయమునను౦డు పరమాత్మయొక్క యనుగ్రహామే స్వయముగ ప్రపన్నుల కట్టి పరిపాకము నొసంగుచున్నది.

శ్లో॥ అంకోల తైలసిక్తానాం బీజానామచిరాద్యథా।
విపాకః ఫలపర్యంతః తథా త్రేతి నిదర్శితం॥

తా॥ అంకోల తైలముచేతదుపఁబడినట్టి బీజములు ఫలపర్యంతమగు విపాకమును శీఘ్రముగ బొందుటను ప్రకృతమున నిదర్శనమునుగాఁ, గొనునది.

శ్లో॥ దుష్టేంద్రియవశాచ్చిత్తం నృణాంయత్కల్మషైఃవృతం ।
తదంతకాలే సంశుద్ధిం యాతి నారాయణాలయే ॥

తా॥ దుష్టములగు ఇంద్రియముల మూలముగ కల్మష యుక్తంబైనట్టి మనస్సు శరీరవియోగకాలమున నారాయణాలమున పరిశుద్ధంబైనది కాఁగలదు.

శ్లో॥ ఇతివ్రతవిశేషేయత్ సాత్వతాదిషు శిష్యతే।
తద్వదత్రోపపద్యేత గద్యోక్తాంత్య దశాగమః॥

తా॥ సాత్వతాదులయందు వ్రతవిశేషాదులనుగుఱించి చెప్పినది యుపపన్నంబగునట్లు ప్రకృతమునను, గద్యయందుఁ విధింపఁబడినట్టి మోక్షావస్థయును గలుగుట యుపపన్నము.

శ్లో॥ అనుగ్రహవిశేషేణ కేనచిత్పరమాత్మనః
శఠరుకాధీశనాథాద్యాః ప్రాగప్యన్వభవన్ప్రభుం॥

తా॥ పూర్వమునందును భగవంతుని యొక్క యేదొక విధమగు అనుగ్రహముచే శ్రీనమ్మాళ్వారులు, శ్రీమన్నాథమునులు మొదలగు వారును భగవంతుని యనుభవించి యుండిరి.

శ్రీనమ్మాళ్వారులు ద్వయముయొక్క యర్థమును, «తిరు నారణన్దాళ్ కాలమ్పెఱ శిన్దిత్తుయ్ మినో" (శ్రియఃపతియొక్క శ్రీపాదంబులను సర్వదా అనుసంధించుచు ఉజ్జీవింపుము) అని యు «ముకిల్వణ్ణనడియైయడైన్దరుళ్ శూడియుయ్న్దవన్" (నీలమేఘశ్యాముండగుభగవంతునియొక్క శ్రీపాదములను మోక్షోపాయముగా నెఱింగి వానికి కైంకర్యము నొనర్చుటచేస్వరూపము గలవాఁడను) అనియు «అకలకిల్లేన్" (వేఱొక్కగతిలేని

వారు అరిసియును ఈ మొదలగు తావులయందు సాయించి యున్నారు.

దీనియందు ముందుగ "శ్రీమన్నారాయణా" అనుటచే సర్వశరణ్యుండగు పరత్వము చెప్పఁబడినది. "శ్రియఃపతిత్వరూపమగు చిహ్నమునుబట్టియును, నారాయణశబ్దమును బట్టియును కదా శ్రుతులయందు పరతత్వ మిద్ధియని నిర్ణయింపఁబడినది. నారాయణుండు శరణ్యుండగునప్పుడు, (చేతనులచే రక్షణార్థము ఆశ్రయింపఁబడునప్పుడు) లక్ష్మీవిశిష్టుండు గానేయుండునని తెలుపునది పూర్వఖండమునందుండు శ్రీమచ్ఛబ్దము. "ఆకారిణస్తు విజ్ఞానమాకారజ్ఞానపూర్వకం। తేనాకార శ్రియం జ్ఞాత్వా జ్ఞాతవ్యో భగవాన్ హరిః" (ఏదైననొక యాకారముగల వస్తువును తెలిసికొనుట దాని యాకారమునుబట్టియే కాన, ఆకారభూతురాలగు పిరాట్టిని తెలిసికొని, యందు లముగా భగవంతుని తెలిసికొనునది) అని శ్రీఅరుళాళప్పెరుమాళ్ ఎమ్బెరుమానారుగారు సాయించియున్నారు. ఇది ఉత్తరఖండమునందువలెనే పూర్వఖండమునందును విశేషణమగుటను, ఉపాయమునకుఁగల విశేషణములనుబట్టి యుపాయ ద్విత్వము కలుగకుండుటనున్ను సిద్ధోపాయశోధనాధికారమునఁ జెప్పియున్నాము.

'శ్రీః' అను శబ్దము "శ్రీయతే, శ్రయతే, శృణోతి, శ్రావయతి, శృణాతి, శ్రీణాతి" అని ఆఱు విధములుగాను భగవచ్ఛాస్త్రములయందు నిర్వచనము చేయఁబడినది. ఈ తావున కావలసిన పదాంతరములను ఔచిత్యమువలనను, ఆయా ప్రమాణముల బలమువలననున్ను విశేషించి తెలిసి

వచ్చుచున్నది. ఈ విషయమును “సీతాము వాచాతియ శాః” ఇత్యాదితావులయందును జూచుకొనునది.

లోకదృష్టియనఁగా:—రాజు తన యంతఃపురమునందుండువారు ఏదైననొకగొప్పయపరాధమునొనర్చినను, యేదొకస్వల్పదండనముమూలముగ క్షమించుచున్నట్లు జూచియున్నాము. ఈ యర్థము ‘మాతర్లక్ష్మ్యయాధైవమైథిలజనః’ ఇత్యాదిశ్లోకమునందును వివరింపఁబడినది.

గురూక్తియనఁగా—శ్రీ నమ్మాళ్వారులు మొదలగు పూర్వాచార్యులయొక్క ‘అకలకిల్లేన్’ ఇత్యాది శ్రీ సూక్తులు. వీటికి మూలభూతంబులైనట్టి సూక్తివిశేషంబులగు శ్రుతులనున్న ఈ తావునఁ జూచుకొనునది. వీటి నాధారముగాఁ గొనివచ్చినట్టి స్మృతులనఁగా—“వాచః పరంప్రార్థయితా ప్రపద్యేన్నియతః శ్రియం’ ఇత్యాదులగు శౌనకాదిమహర్షుల వాక్యములు. ఇవ్విధముగ పిరాట్టి సర్వేశ్వరుని శ్రీపాదములను పొందించుటలో ఘటకురాలగుట అనేక ప్రమాణములనుండి తెలియవచ్చుటంజేసి, ఈ తావుననున్న ఆమెను పురుషకారభూతురాలినిగాఁ జెప్పుట యుచితము. ఇట్లు ఈమె పురుషకారభూతురాలైయ్యును, సిద్ధోపాయవిశేషణంబైయ్యును ఆశ్రయింపఁబడును. “స్వరూపం స్వాతంత్ర్యం” అనియు, “స్వతః శ్రీ స్త్వం విష్ణోస్స్వమసి” అను శ్లోకములయందుఁ జెప్పియున్నట్లు, ఆదిత్యాదులకు కాంతి మొదలగునవివలెనే సర్వేశ్వరునికొక యతిశయముఁ గలుగఁజేయునదియై; సిద్ధోపాయంబగు సర్వేశ్వరుని ఆశ్రయించియుండ గలదు.

‘అందఱిచేతను సేవింపఁబడునదియై, సర్వేశ్వరుని సేవించుచుండునది’ యని యర్థముచేసికొనునప్పుడు, అందఱికిని స్వామినియై “కాంతస్తే పురుషోత్తమః” అనియు, “శేషితేఽపరమఃపుమాఙ్” అనియును ఈతావులఁ జెప్పియున్నట్లు సర్వేశ్వరునికి శేషభూతురాలై యుండునట్టి స్థితి తెలుపఁబడినది కాఁగలదు.

“జగత్సమస్తం యదపాంగ సంశ్రయం” ఇత్యాది తావులయందుఁ జెప్పియున్నట్లు, ‘అన్నింటిచేతను ఆశ్రయింపఁబడి అన్నింటిని తాను ఆశ్రయించియుండునది’ యని యర్థముచేసికొనునప్పుడు, నారాయణాది శబ్దా[illegible] శ్రియఃపతినిగుఱించి చెప్పునట్టి విశేషములన్నియును విష్ణుపత్నియగు ఈమెనుగుఱించియును చెప్పినట్టివి కాఁగలవు. శ్రీభాష్యకారులవారును “భగవన్నారాయణా!” అని భగవంతుని పేర్కొనినట్లు “భగవతీం శ్రియః” అని ఈమెనున్ను పేర్కొనియున్నారు.

“శృణోతి=వినుచున్నది, శ్రావయతి=వినిపించుచున్నది.’ అనువ్యుత్పత్తులఁగొని యర్థము చేసికొనునప్పుడు, ‘పాపబాధులగు దాసులను సర్వేశ్వరుని శ్రీపాదములయందు జేర్పుమా!’ అని యివ్విధమగు ఆశ్రితుల యార్తధ్వనిని విని సర్వేశ్వరుని సన్నిధియందువిన్నవించి వీరి కష్టములఁబోగొట్టునదనియరము కాఁగలదు. ఇట్లు పురుషకార కృత్యముఁ దెలుపునట్టి దీనికిన్ని పురుషకారభావముఁ దెలుపుటయందే తాత్పర్యము. ‘మత్పదద్వంద్వమేకం యే ప్రపద్యంతే పరాయణం ఉద్ధరిష్యామ్యహం దేవిసంసారాత్స్వయమేవతాఙ్। ఆనృశంస్యం పరోధర్మః’ (ఓ దేవినాపాదములనునమ్మియుండినన్ను శరణుజొచ్చినట్టి

వారిని నేను రక్షింపఁగలను. ఆనృశంస్యము గొప్ప ధర్మము)
ఇత్యాది విషయములను వానివద్దనే విని, 'శృణుచావహితా'
కాంతయుత్తే వక్ష్యామ్యహంహితం ప్రాణైరపి త్వయా నిత్యం
సంరక్ష్యశ్శరణాగతః" "నాథ! నేను చెప్పబోవునట్టి దానిని
శ్రద్ధతోవినుము ప్రాణములను కోల్పోయియైనను, శరణాగతుని
తప్పక రక్షింపవలయును' అని * మొగ కపోతపక్షికి ఆడ
కపోతపక్షి బోధించినట్లు, అవసరమువచ్చినప్పుడు సర్వేశ్వరుని
కిన్ని బోధించి యొప్పించుననియును అర్థముచేసికొనవచ్చును.
సర్వేశ్వరుని సన్నిధియందు లోకహితమునుగుఱించి
వినినదై 'మిత్రమౌపయికం కర్తుం' ఇత్యాదివాపులఁ జెప్పి

---

* ఒకదినమున నొక కిరాతుండొక్కండు పక్షులఁబట్టుకొనుటకై యర
ణ్యముకేఁగి, అప్పుడొక గొప్ప గాలివానరాఁగా, నందుచే రెక్కలు
విఱిగిపడియున్నట్టి యొక్క యాడ కపోతపక్షిని బట్టుకొని, తన సంచిలో
నుంచుకొని తానును వానచే చలిగొని యొక వృక్షముచెంతఁ జేరెను. ఈ
యాడుపక్షి వృక్షముపై తనరాక కెదురుచూచుచుండునట్టి మొగపక్షిఁ
జూచి, అతిథిగావచ్చినట్టి యీకిరాతుని కాతిథ్యము నొసంగుమని వేడు
కొనెను. తన భార్యమాటలనువిని యామొగపక్షి తన ముక్కుతో కొన్ని
పుల్లలను ఏరుకొనివచ్చి కుప్పవేసి యెక్కడనుండియో తనముక్కుతో
నొక్క కొఱవిఁగొనివచ్చి దానిపైవేయఁగా నది రగులుకొని మండుకొనెను.
దానిచెంత నాకిరాతుండు చలికాచుకొని ఆకలిగొని యున్నందున కష్ట
పడుటంజూచి, యామొగపక్షి వాని క్షుద్బాధఁ దీర్చుటకై తాను అమం
టలో పడుటచే తన మాంసము నతని కొసంగెను. పతివ్రతాశిరోమణి
యగు ఆపక్షియును తన భర్తపోయినదారినే పోయెను. శరణాగతరక్ష
ణమును గుఱించినదియగు నీకథ శ్రీమహాభారతమునందు విపులముగాఁ
దెలుపఁబడినది.

యున్నట్లు విపరీతముగాఁ బ్రవర్తించునట్టి వారికిన్ని బోధించునని యును అర్థముచేసికొనవచ్చును.

“శృణాతి నిఖిలాన్ దోషాన్” అను వ్యుత్పత్తియగు నప్పుడు ‘అస్మిన్నయనహావ్యాప్తీ కేశో దేవ్యా కారుణ్య రూపయా రక్షకః సర్వసిద్ధాంతేవేదాంతేపిచగీయతే’ (కారుణ్యరూపిణి యగు లక్ష్మీదేవితోఁగూడ చేరియున్నట్టి భగవంతుండు రక్షకుండుగా నెఱుంగఁదగినట్టివాఁడు ఇట్లే సర్వసిద్ధాంతములయందును వేదాంతమునందును తెలుపఁబడుచున్నది) అనియు ‘వేరి మాఱాత పూమేలిరుప్పాళ్ విన్నైతీర్క్కుం” (పరిమళయుక్తమగు పుష్పమునవసించునదియగు పిరాట్టి పాపములఁ బోఁగొట్టునది) అనియును సాయించినట్లు ఉపాయాధికారులకు విరోధులగు కర్మాదులను నశింపఁజేయునది యనియును అర్థముచేసికొనవచ్చును.

“శీణాతిచగుణైర్జగత్” అను వ్యుత్పత్తినిగొనునప్పుడు తనయొక్క కారుణ్యాదిగుణముల మూలముగ “నిన్నిరువరుళుమ్ పంగయత్తాళ్ తిరువరుళుమ్ కొణ్డు” (నీయొక్క కృపవలనను పిరాట్టియొక్క కృపవలనను) అని సాయించినట్లు, ఆశ్రితులకు కైంకర్యపర్యంతము గుణపరిపాకముఁ గలుగఁజేయునది యని యర్థము కావచ్చును.

ఈ వ్యుత్పత్తు లన్నింటివలనఁ దెలియవచ్చునట్టి వైభవమును విచారించియే, ‘శ్రీరిత్యేవచనామతేభగవతి బ్రూమఃకథంత్వాంవయం’ (ఓతల్లీ ఇట్టివైభవముగలదానవగునిన్ను ‘శ్రీః’ అని యొక యక్షరముతో మేము ఎట్లు పిలువఁగలము) అని శ్రీయాళవందారులు సాయించియున్నారు. భట్టరువారును ఈ

వా॥ నిరుపాధిక, మంగళత్వమునుబట్టియే 'శ్రీరసియశ్శ' (నీవే స్వతః మంగళము) అని సాయించియున్నారు.

ఈ యర్థములలో, సర్వేశ్వరునియొక్క యుపాయత్వము ఉపయుక్తంబులైనవి పూర్వఖండమునందును, ప్రాప్యత్వము ఉపయుక్తంబులైనవి ఉత్తరఖండమునందును అనుసంధించుకొనవలసినవి.

'స్వామ్యే యఉపేయత్వస్వరూపాదిసమర్పణే। ప్రథితః ప్రతిసంబంధీ శ్రీమాన్ నిగమచక్షుషాం' ఈశ్లోకమునందు ఆత్మసమర్పణమునకు ప్రతిగృహీతయైనవాఁడు శ్రీమాన్ (లక్ష్మీకళత్రుఁడు) అని సామాన్యముగ చెప్పియున్నను, ప్రమాణములనుబట్టి ఈసందర్భమున 'శ్రీమాన్' అనఁగా 'శ్రియఃపతి' యని యర్థము జేసికొనునది. సామాన్యముగ తెలియవచ్చునట్టిసంబంధము శ్రుతిబలముచే ప్రత్యేకించి తెలుపఁబడినది. అంతటిచే ఆశ్రయింపఁబడునదియై జగన్మాతయగు ఈమెకు పతియని చెప్పినందున సర్వేశ్వరునికిపరత్వమున్ను, సౌలభ్యమున్ను ఉన్నట్లు తెలియఁగలవు. ఈ తావునపిరాట్టిని ప్రత్యేకించి చెప్పినందున నారశబ్దముచేఁ దెలుపఁబడునట్టివియగు తక్కిన వాటికంటెను ఈమెకుఁగల వైలక్షణ్యమును, ఈమెను సర్వేశ్వరునికిఁగల విశేషణమునుగాఁ దెలిపినందువ ప్రమాణానుగుణముగ పతిపారతంత్ర్యమున్ను సూచింపఁబడుచున్నవి.

''భూమ నిందా, ప్రశంసాను నిత్యయోగేతిశాయనే। సంసర్గేస్తి వివక్షాయాం భవన్తిమతుపాదయః'' అన్నట్లు 'మతుప్'' ప్రత్యయమునకు అనేకార్థములున్నను, ప్రకృతమున నది విశేషోపయోగమునుబట్టి ప్రమాణసిద్ధంబగు నిత్యయోగమును

అనఁగా నిత్యసంబంధమును తెలుపునది. వామనావతారమున బ్రహ్మచర్యాద్యవస్థయందుసయితము ‹‹కృష్ణాజినేనసంవృణ్వ‌న్ వధూంవక్షస్థలాలయాం'' (వక్షస్థలమునయుండునట్టి భార్యను కృష్ణాజినముతోఁ గప్పిపెట్టి) అని చెప్పియున్నట్లు కదా శరీరము నందు నిత్యయోగ ముండకలదు.

ఎన్నటికిని విడనాడియుండని వస్తువుగు ‹‹శ్రీమా‌న్'' అని మత్వర్థీయప్రత్యయసాపేక్షముగ సామానాధికరణ్యము తగునా? అనియు, ఒకవేళ అది ప్రత్యేకముగ నుండతగినట్టి వస్తువై నట్లయిన, ‹‹కీర్తిః శ్రీమాంశ్చనారీణాం'' అనియుఁ ‹వూవిల్వాళ్ మకళాయ్'' అనియును ఈ తావులయందువలెనే మత్వర్థీయప్రత్యయ నిరపేక్షముగ సామానాధికారణ్యము తగునా? యని యును కొందఱు చేయునట్టి యాయాక్షేపములు రెండును అంత సరియైనవి కావు. అదియెట్లనిన, ‹‹తద్గుణసారత్వాత్తద్వ్యపదేశః ప్రాజ్ఞవత్'' అను బ్రహ్మసూత్రమునఁ జెప్పియున్న ప్రకారము జ్ఞానరూపమగు గుణమునుబట్టి యాత్మను జ్ఞానమని వ్యవహరించుచున్నను, ‹జ్ఞానవా‌న్' అనియును మత్వర్థీయ ప్రత్యయము తో సామానాధికరణ్యముండుటం జేసి యువ్విధముననే ప్రకృతముననున్న బాధకము లేదు. కావున మత్వర్థీయప్రత్యయ మున్నంతమాత్రమున శ్రీదేవి పెరుమాళ్లను విడిచి ప్రత్యేకము గానుండునట్టి వస్తువని నిశ్చయింపఁదగదు. ‹‹నరపతిరేన సర్వలోకాః'' ఇత్యాది తావులయందువలెనే వివక్షాంతరముకు వీలున్నట్టి తావున ఈ ప్రత్యయములేనట్టి సామానాధికరణ్యమాత్రమునుబట్టి యట్టి వస్తువు పృథక్స్థితంబనియును చెప్పఁదగదు. అయితే విశదముగాఁ బ్రతిపాదించునట్టి ప్రమాణాంతర

ములఁ గొని దీనియొక్క యథార్థస్థితిఁ దెలిసికొనవలసియుం డును. ప్రకృతమున ఉపాయదశయందును, ఫలదశయందును ప్రమాణములు నిత్యసంబంధమున్నట్లు తెలుపుటం జేసియును, ఈమంత్రముచే నిట్టి యర్థము తెలుపఁబడుట యావశ్యకం బగుటం జేసియును, పూర్వోత్తర ఖండములయందుండు 'మతుప్' ప్రత్యయముచేత 'సభ్రాతుశ్చరణౌ గాఢం' అనియు 'భవాంస్తు సహవైదేహ్యా' అనియుఁ జెప్పియున్నట్లొక్కరి నొక్కరు యెన్నఁడును యెడబాయకుండుట తెలుపఁబడినది.

శ్రీనమ్మాళ్వారులవారును 'అకలకిల్లేనిఱైయు మెన్ఱలర్ మేల్ మంగైయురైమార్పా' అనియు, 'ఒండొడియాళ్ తిరుమకళుమ్నీయుమే నిలానిర్ప' అనియు 'ఇఙ్గుమఙ్గుం తిరుమాల్ట్రిక్ నైక్కణ్డు' అనియును ఈతావుల ఉపాయదశయందును, శ్రీమచ్ఛబ్దముచేఁ దెలుపఁబడినట్టి నిత్యయోగమును అనుసంధించుకొని యున్నారు. ఇవ్విధమైనట్టి యనుసంధానము సాపరాధులగు ఈచేతనులు వెనుదీయకుండ వెంటనే సర్వేశ్వరుని ఆశ్రయించుట కనుకూలముగా నుండగలదు.

ఇట్లు ముఖ్యముగాఁ గావలసినట్టిదియగు పురుషకారత్వము సర్వేశ్వరునికొకయతిశయముగానుండగలదు. నారాయణశబ్దమువలనఁ దెలియవచ్చునట్టి సంబంధమును, గుణములును ఇదియంతయును 'తన్నడియార్' అను పాశురమునఁ దెలియఁ గలదు.

'శ్రీధరశ్శ్రీకరశ్శ్రేయః శ్రీమాఀల్లోకత్రయాశ్రయః' ఇత్యాదితావుల భగవన్నామముగాను ప్రసిద్ధమైనట్టి 'శ్రీమాన్' అనుశబ్దము చాలదా? యంటివేని, పూర్వఖండమునందు

పాయత్వము కావశ్యకములగు గుణములను ననుసంధించుకొను టకుగాను, ఉత్తరఖండమునందు సర్వాతిశిష్టుండగు శేషి ప్రాప్యవస్తువుగాను తెలియవచ్చుటకుగాను, నారాయణశబ్దము ఆవశ్యకమగుటం జేసి, యీ తావున 'శ్రీమత్' అను శబ్దము విశేషణముగాఁ గొనఁబడుచున్నది. ఈ ద్వయమందుండు నారాయణశబ్దమువిషయమగు మూలమంత్రాధికారమునందు అనేక వ్యుత్పత్తులఁ గొని దెలుపఁబడినట్టి యర్థములన్నియును వివక్షితంబులైనను, పూర్వఖండమునందుండు నారాయణశబ్దము శరణ్యత్వమునందే యుద్దేశమగుటం జేసి, 'నికరిల్ పుకల్ఫ్రాయ్' ఇత్యాదితావులఁ జెప్పఁబడినట్టి వాత్సల్య, స్వామిత్వ, సౌశీల్య సౌలభ్య, సర్వజ్ఞత్వ, సర్వశక్తిత్వ, సత్యసంకల్పత్వ, పరమకారుణికత్వ, కృతజ్ఞత్వ, స్థిరత్వ, పరిపూర్ణత్వ, పరమోదారత్వాదులు ఈ తావున అనుసంధించుకొనవలసిన వాటిలోఁ బ్రధానభూతములు. వీటిలో,

వాత్సల్యమనఁగా:— 'దోషోయద్యపితస్యస్యాత్' (దోషమున్నప్పటికిన్నసరే) అన్నట్లు, ఆశ్రితుల దోషములనంత లక్ష్యపెట్టక అంగీకరించుటకుఁ గావలసిన కృప. ఇది యీ చేతనుండు తనదోషములఁ దలంచుకొని సర్వేశ్వరుని ఆశ్రయించుటలో వెనుదీయకుండుట కనుకూలముగాఁ నుండగలదు.

స్వామిత్వ మనఁగా.—ప్రణవాదులయందుఁ దెలుపఁబడినట్టి సంబంధ విశేషము. ఇది సర్వేశ్వరుండు ఈచేతనుని రక్షణము తన పనియనుకొని రక్షింపఁగలడనెడి యొకవిధమైనట్ట యతిశయముకుఁ దగియుండును.

సౌశీల్య మనఁగా.—తాను సర్వాధికుం డైయ్యును, తక్కువ స్థితిలోనుండువారగు నిషాద, వానర, గోపాలురతోఁ గలసిమెలసియుండుట. ఇది ‹‹చక్రధరుండగు స్వామి యెక్కడ? సంసారములో పడియుండునట్టి క్షుద్రజంతువుల మగు మనమెక్కడ? అనుకొని వెనుదీయక, సారథ్యదూత్యాదులనున్ను యొనర్చుటకై కోరతగినంత విశ్వాసనీయుండని తలంచుకొనుట కుఁదగియుండును.

సౌలభ్యమనఁగా.—సనక సనందనాది మహాయోగులకున్ను సమీపించుట కలవిగానట్టి తనను అందఱి కంటికిన్ని కానవచ్చునట్టి వానినిగాఁ జేయుట. ఇది సర్వేశ్వరుని బొందుట దుర్లభంబనుకొని వానియందు స్పృహ లేకుండయుండకుండుట కనుకూలంబు కాఁగలదు,

సర్వజ్ఞత్వ మనఁగా.—‹‹ అజ్ఞాతం నాస్తి తేకించిత్ ›› ‹‹ యో వేత్తియుగపత్సర్వం ప్రత్యక్షేణ సదాస్వతః›› అన్నట్లు సర్వమును సాక్షాత్కరించియుండుట. ఇది, ఆశ్రితుల కొసంగవలసిన మంచిస్థితులలోనును, నివర్తింపవలసినట్టి చెడ్డస్థితులలోనును సర్వేశ్వరునికి తెలియనివి యెవ్వియును లేవని యిూతం డనుసంధించుకొనుట కుపయుక్తము కాఁగలదు.

సర్వశక్తిత్వమనఁగా.—అఘటితఘటనా సామర్థ్యము. ఇది, సంసారులగు మనలను సర్వేశ్వరుండు తాను తలంచినప్పుడు నిత్యసూరుల గోష్ఠిలోనికిఁ జేర్పఁగలడని నిశ్చయించుకొనుట కనుకూలముగానుండగలదు.

సత్యసంకల్పత్వమనఁగా.—తన సంకల్పమును నితరునిచేత నున్ను వేఱొకవిధముగ మార్చుటకు అలవికానట్టిదిగానుండు

ట. ఇది. "అహంత్వాసర్వపాపేభ్యో మోక్షయిష్యామి" అను శ్రీసూక్తి అసత్యముకాదని నమ్మియుండుట కనుకూలముగాఁ నుండగలదు.

పరమకారుణికత్వమనఁగా.—ప్రతి ఫలాపేక్ష లేకుండ, పరులదుఃఖములను నివర్తింపఁజేయవలయుననెడి యిచ్ఛ. ఇది యనంతాపరాధములుగలవారికిన్ని „మిత్రభావేనసంప్రాప్తం" „యదివా రావణస్స్వయం" అన్నట్లు యేదోక వ్యాజమాత్రమున రక్షించుననెడి జ్ఞానము గలుగుట కనుకూలించును.

కృతజ్ఞత్వమనఁగా.—"నస్మరత్యపకారాణాం శతమప్యాత్మవత్తయా। కదంచిదుపకారేణ కృతేనైకేనతుష్యతి" (దయాళువగుటచే నూరులకొలది యపకారంబులలో నొక్కదానినైనను మనస్సున నుంచుకొనడు. యేదోక యుపకారము నొనర్చినంతమాత్రమున సంతోషించును) అనియు „ఋణంప్రవృద్ధమివమే హృదయాన్నాపసర్పతి" (ఇతరు లొనర్చినట్టి యుపకారము ఇతరులకు చెల్లింపవలసినట్టి ఋణమువలెనే నాకు మరుపుతట్టదు) అన్నట్లు నేదోక స్వల్పోపకారము నొనర్చినంతమాత్రమున పరమోపకారము నొనర్చినట్టివారిని వలె మరువకయుండుట, ఇది మనయం దెద్దియైన నొకమంచి ని గన్పెట్టినట్లయిన, యింక మనల నెన్నటికిని విడనాడడని నిశ్చయించుకొనుట కనుకూలించును.

స్థిరత్వమనఁగా.—ఆశ్రితులనురక్షించువిషయమునస్థిరుండైనిలువఁబడుట. ఇది, మిక్కిలియంతరంగతైనట్టి మనవారు విడనాడినను, „నత్యజేయం కథంచన" అన్నట్లు భగవంతుండుమనల నెన్నటికినివిడనాడడనినమ్మియుండుటలో ననుకూలపడును.

పరిపూర్ణత్వమనఁగా.—అవాప్త సమస్త కామత్వము, ఇది ‘‘అణ్వప్యుపహృతంభక్తైః మమభోగాయజాయతే’’ (భక్తులద్దిమైన నొకస్వల్పవస్తువును సమర్పించినను, అది భగవంతుకి భోగములో నుపయోగపడగలదు) అనియు ‘‘శ్రేష్ఠాంభూర్యపజాయతే’’ (అట్టి స్వల్పవస్తువు ప్రీతి మూలముగ గొప్పదిగా నెన్నఁబడుచున్నది) అనియు ‘‘పత్రం పుష్పం ఫలంతోయం యోమేభక్త్యాప్రయచ్ఛతి’’ (ఒక్క తులసీదళమునుగాని, పుష్పమునుగాని ఫలమునుగాని తీర్థమునుగాని నాకు భక్తితో నెవ్వండు సమర్పించుచున్నాడో) అను తావులఁ జెప్పియున్నట్లు భావబంధమును (ప్రీతిని) మాత్రము గమనించునేతప్ప, మనము సమర్పించునట్టి వస్తువుయొక్క హెచ్చుతక్కువలను అంతగా గమనింపడనుకొని తమచేతనైనట్టి కించిత్కారమును విడువకుండ యొనర్చుచుండుటలో ననుకూలించును.

పరమోదారత్వమనఁగా.—ఉపాయలాఘవమునున్ను ఉపేయగౌరవమునున్ను, పాత్రాపకర్షతనున్ను చూడక, సర్వస్వము నొసంగియున్నను నేను జేసినదియేమున్న దనుకొనునట్టి దాతృత్వము. ఇది దధిభాండాదులవలెనే నిర్బంధపెట్టినైనను, తన సంబంధులకు సయితము మోక్షము నొసంగవలయునని యపేక్షించుటలో ననుకూలించును.

ఇవ్విధముగ శరణ్యత కుపయుక్తంబులగు తక్కిన గుణములనున్ను, వాటి యుపయోగంబులనున్ను ఈతావున ననుసంధించుకొనునది.

ఉపాయానుష్ఠానదశయందు, ఆయావిద్యల కుపయుక్తంబులగు కొన్ని గుణములతోఁగూడియున్నట్టివానుఁగాను సర్వే

శ్వరుండు అనుసంధించుకొనబడినవాఁడై, ప్రాప్తిదశయందును సమ
స్తగుణవిభూతి విశిష్టుండుగాను దెలియవచ్చినను, ప్రకృతమున
ఉత్తరఖండమునందుండు నారాయణపదమునకు స్వరూపమును
బట్టియును, గుణములనుబట్టియును కైంకర్యప్రతిగ్రహీతయగు
వానిని తెలుపుటయందే ముఖ్యోద్దేశమగుటంజేసి, అంగుల
కుక్కవ యుపయుక్తంబులగు శేషిత్వ, నిరతిశయభోగ్యత్వా
దులు మిక్కిలి ప్రధానములు. ఈతావున సంబంధవిశేషాదుల
ద్వారా ఆనుకూల్యసంకల్పమున్ను, ప్రాతికూల్యవర్జనమున్ను
సూచితంబులగు నని వేఱొక్క యధికారమునఁ దెలిపియు
న్నాము.

ఈతావుల "శ్రీమన్నారాయణ చరణౌ" అని సమస్త
పదమునుగాఁగొనియును అర్థము చేసికొందురు. "కమలనయ
న వాసుదేవ భవ శరణం" అను ప్రయోగమును, "త్వమేవో
పాయభూతో మే భవ' అను వాక్యమును, 'అకలకిల్లేన్' అను
పాశురమును, 'అకించనోఽనన్యగతిశ్శరణ్యః' అను స్తోత్రరత్న
వాక్యమును, 'శ్రీమన్నారాయణాన్వాఽపుద్' ఇత్యాది మంత్రాం
తరములనున్ను, ద్వయార్థవివరణంబగు గద్యమున్ను వీటినిబట్టి
'శ్రీమన్ నారాయణ' అని రెండు సంబోధన ప్రథమావిభ
క్త్యంతములగు, పదములనుగాఁగొని, 'తవ' అను వేఱొక్క పద
మును తెచ్చిపెట్టుకొనియును అర్థము చేసికొనుట కద్దు. ఈపైని
చెప్పిన ప్రకారము 'శ్రీమన్నారాయణ' అనుదానిని వ్యస్తప
దమునుగాఁగొనినను, సమస్తపదమునుగాఁ గొనినను, విశేషణ
విశేష్యపదముల యునికిపట్టు కెద్దియును వైషమ్యము లేదు. ఇట్టి
స్థితి పూర్వోత్తరఖండముల విషయమునన్ను సమానమే,

'చరణౌ' అని చెప్పుటచే నిత్యమగు దివ్యమంగళవిగ్రహమున్ను సూచిత మగుచున్నది. శ్రియఃపతియగు సర్వేశ్వరునికిఁగల సర్వపరత్వమున్ను, నిత్యమగు దివ్యమంగళ విగ్రహముఁ గలిగియుండుటయును ఇవి ఈచేతనునిచే ముఖ్యముగాఁ దెలియవలసినవియగు విషయము 'నిత్యసిద్ధేతదాకారే తత్పరత్వేచ పౌష్కర । యస్యాస్తిసత్తాహృదయే తస్యాసౌసన్నిధింవ్రజేత్' ఇత్యాదివాక్యములయందు ప్రసిద్ధముగాఁ దెలుపఁబడినది. కావున 'శ్రీమన్నారాయణ' అనుపదమునందు సౌలభ్యాన్వితంబగు పరత్వమును, 'చరణౌ' అనుపదమునందు నిత్యమగు దివ్యమంగళ విగ్రహముయొక్క సంబంధమున్ను అనుసంధించుకొనవలసినవి. దివ్యాత్మస్వరూపము విషయమునను, ముందుచెప్పినట్టి గుణాదుల విషయమునను న్ను అంతగా జ్ఞానములేనివారికిన్ని శుద్ధసత్త్వద్రవ్యమై స్వవిషయమగు జ్ఞానముచే జ్ఞానసంకోచమున్ను నివర్తింపఁజేయునదియై, పరత్వ సౌలభ్యంబులను ప్రకాశింపఁ జేయునదియగు దివ్యమంగళవిగ్రహమే మనోవిషయము కాఁగలదు. దీనికిఁగల యిట్టి ప్రాధాన్యమునుబట్టియే శ్రీభాష్యకారులవారు ద్వయమునందు గుణములఁ జేర్చుటకు ముందుగ దివ్యమంగళ విగ్రహముఁ జేర్చియున్నారు. దివ్యాత్మస్వరూప విషయమగు జ్ఞానముగలవారేమైనను, 'మూర్తం బ్రహ్మ తతోపి తత్ప్రియతరం రూపం యదత్యద్భుతం' (మూర్తమగు బ్రహ్మము ప్రియమైనది వానియొక్క దివ్యమంగళ విగ్రహము అంతకంటెను ప్రియంబైనది) అని చెప్పఁదగినట్లు సర్వేశ్వరునికిన్ని తనకున్ను మిక్కిలి భోగ్యంబైనట్టి నిత్యదివ్యమంగళ విగ్రహమును సే

వించి అట్టి యనుభవమునఁగల ప్రీత్యతిశయమునుబట్టి శ్రీ తిరు మంగైయాళ్వారులు తమను భగవంతుని విషయమున దేహాత్మవాదులనుగాను తెలిపియున్నారు.

సర్వేశ్వరునియొక్క దివ్యమంగళ విగ్రహమును,

శ్లో॥ పాపంహరతియత్పుంసాం స్మృతంసంకల్పనామయం
తత్పుండరీకనయనం విష్ణోర్ద్రక్ష్యామ్యహంముఖం॥

తా॥ స్మరించినంతమాత్రమున పాపములనన్నింటిని పోఁగొట్టునదియు, కమలములవంటి నేత్రములుగలదియగు విష్ణువుయొక్క తిరుముఖమండలమును సేవించుచున్నాను. అట్టితిరుముఖమండలము సౌందర్యముచేతను ఔదార్యాదిగుణములచేతనున్ను పురుషుల చిత్తము నాకర్షించునట్టిది.

ఈ పైవాక్యములయందుఁ జెప్పియున్నట్లు శుభత్వమున్ను ఆశ్రయత్వమున్ను (ఆశ్రయింపఁదగియుండుట) కలవు. బద్ధులకుఆశ్రయత్వమున్నను, శుభత్వము లేదు. భగవత్స్వరూపమునకు శుభత్వమున్నను ఆశ్రయత్వము లేదు. సంసారసంబంధరహితంబగుపరిశుద్ధాత్మ స్వరూపమునకు సంసారమును బొందుటకుపహాకారియోగ్యత లేకపోయినను, పరతంత్రమగు చేతనవస్తువగుటంజేసి, సంసారమును బొందుటకు స్వరూపయోగ్యతగలవస్తువైనందున, దానికి హేయప్రత్యనీకత్వ రూపమగు శుభత్వమున్ను లేదు. ఆశ్రయత్వమున్ను లేదు. అమానుష దేహమును ధరించినప్పుడు ముక్తపురుషులకున్ను, నిత్యమైన శరీరముగలవారలగు నిత్యులకున్ను ఆశ్రయత్వమున్నప్పటికిన్ని, సంసారమును నివర్తింపఁజేయఁగల శుభత్వము లేదు. కావున ముముక్షువుల కుపయుక్తంబగు శుభత్వమున్ను, ఆశ్రయత్వమున్ను

ఉండియున్నది, భగవంతునియొక్క దివ్యమంగళ విగ్రహముకే యని యెఱుంగునది. కావుననే ‹పరావరసుఖగ్రాహ్యాం ప్రేమ బోధప్రసాదకం। స్వరూపాత్స్వామినోరూప ముపాదేయతమం విదుః’ (ఇహలోక పరలోక వాసులచే సులభముగ గ్రహింపఁ దగినదియు, జ్ఞానభక్తులను గలుగఁజేయునదియు నగుటం జేసి భగవంతునియొక్క దివ్యమంగళ విగ్రహము వాని స్వరూపముకంటెనున్ను ఎక్కువ (యుపాదేయంబైనది) అనిచెప్పఁబడినది.

శరణాగతిని విధించునట్టి వాక్యము (చరమశ్లోకము) నందును ‹మామేకంశరణంవ్రజ’ అను తావున శరీరవిశిష్టుం డైనట్టివాఁడె తెలియవచ్చున్నాఁడు. ఈ దివ్యవిగ్రహము పర వ్యూహాదు లనఁబడు అయిదు అవస్థలయందును శుభాశ్రయం బైనది యను విషయము శాస్త్రసిద్ధము.

‹చిత్తాలంఘనసౌకర్య కృపోత్తంభకతాదిభిః। ఉపాయత్వ మిహస్వామి పాదయోరనుసంహితం’ (గ్రహించుటకనుకరం బగుటంజేసియును, కృపోద్బలకంబగుటంజేసియును, స్వామియొక్క శ్రీపాదంబులకే యుపాయత్వముతగును) అనఁగాదాసభూతుండు ఔచిత్యాతిశయమువలనను, ‹అనతిక్రమణీయంహిచరణగ్రహణం’ అన్నట్లు, కృపోద్బలకం బగుటంజేసియును ‹తవామృతస్యందిని’ ఇత్యాదితావులఁజెప్పియున్నట్లుభోగ్యతాతిశయమువలననున్ను, భగవంతుని శ్రీపాదముల నాశ్రయించుచున్నాఁడు. ఈయర్థము ‹సర్వదా చరణద్వంద్వం’ అనియు ‹త్వత్పాదకమలాదన్య న్మమతే పాదయోఃస్థితం’ ‹లోకవిక్రాంతచరణౌ శరణంతేవ్రజంవిభో’ అనియు ‹సభార్యితుశ్చరణౌ

గాఢం' అనియు, 'తస్యతౌ ప్రమతలౌ తాత చరణౌ సుప్రతిష్ఠితౌ। సుజాతమృదురక్తాభి రంగులీభిరలంకృతౌ' అనియు, 'ప్రయతేన మయా మూర్ధ్నా గృహీత్వా హ్యభివందితౌ । చరణౌ శరణం యాతః' అనియు, 'ప్రపన్నాఘౌఘవిధ్వంసి చరణౌ శరణం గతః' అనియును ఈ మొదలగు వాక్యములచేతనున్ను తెలుపఁబడుచున్నది.

ఈ వాక్యముల కనుగుణముగ ప్రబంధములను సాయించినట్టి వారలగు ఆళ్వారాచార్యులును 'ఉన్న డిక్కీழ் అమర్న్దుపుకున్దేనే' (నీ శ్రీపాదముల క్రింద చేరియున్నాను) అనియు, 'త్వత్పాద మూలం శరణం ప్రపద్యే' (నీ శ్రీపాదములను శరణుజొచ్చినాడను) అనియును సాయించి యున్నారు.

'సౌగంధ్యసౌకుమార్యాది గుణవిగ్రహవాన్ హరిః। తస్య స్వాత్మప్రదానేతు సాధనం స్వపదద్వయం' (శ్రీమన్నారాయణుండు సౌగంధ్యసౌకుమార్యాది గుణములనున్ను దివ్యమంగళ విగ్రహమునున్ను గలిగియున్నట్టివాఁడు. వానికి మన యాత్మను అర్పించుటలో వాని శ్రీపాదములే సాధనభూతములు) అని అభియుక్తులగువారున్ను సాయించియున్నారు.

'చరణౌ' అనుతావున 'తమేవశరణంగచ్ఛ' (వానినే శరణుజొచ్చుము) అనియు, 'కడల్ కడైన్దు ముదల్వన్ ఉన్నై కాణ వేణ్డి మిన్నై మిఴైన్దు శరణే శరణ్' (పాలసముద్రమున శేషశాయియైయున్నట్టి వాఁడును మాస్వామియును ఉపకారకుండునగు శ్రీమన్నారాయణునియొక్క (శ్రీపాదంబులే శరణము) ఇత్యాదితావులయందువలెనే యవధారణార్థము వివక్షితము.

శ్లో॥ చరణావితినిర్దేశః పత్నీవైశిష్ట్యబాధకః।
ఇతిమందేరితంప్రోక్తం శ్రీమచ్ఛబ్దవిరోధతః॥

తా॥ చరణౌ అని ద్వివచనప్రయోగము పత్నీవిశిష్టత్వమును బాధించుననుట మందమతులు చెప్పునట్టి మాట. వారుచెప్పునది శ్రీమచ్ఛబ్దార్థముతో విరోధించును.

శ్లో॥ శబ్దస్వరసతఃప్రాప్తం వైశిష్ట్యంప్రథమంశ్రుతం।
విశేష్యచరణద్విత్వం నహిబాధితుమర్హతి॥

తా॥ శబ్దస్వారస్యమునుబట్టి మొదటతెలియఁబడినట్టిలక్ష్మీవైశిష్ట్యమువిశేష్యమగుచరణద్విత్వమును బాధింపఁజాలదు.

శ్లో॥ చరణానితివక్తవ్యమితియచ్చప్రసంజితం।
గ్రంథజ్ఞైరపహాస్యంతత్ పత్నీప్రాధాన్యతోన్వయాత్॥

తా॥ ద్వయమునందు "చరణౌ" అను ద్వివచనమునకు బదులుగా "చరణాన్" అని బహువచన ముండవలయునని యంటివేని, గ్రంథతాత్పర్యవేత్తలుపరిహసించుదురు. పత్నీప్రాధాన్యమునుబట్టి ద్వివచనము ప్రయోగింపఁబడినది యనుట.

శ్లో॥ నసంమ్రాజి సపత్నీకే సద్వితీయోక్తిసాహసం!
తథాత్రైత్యపరామృశ్య దర్శితంగురుసాహసం॥

తా॥ సపత్నీకుండగు సార్వభౌమునివిషయమున సద్వితీయుండనుట తగనిదగునట్లు,ప్రకృతమునను,అట్లే యని విచారింపక చెప్పినదైనఁదున చరణశబ్దము బహువచనమునందుండవలయుననుటయును సాహసమాత్రము.

సర్వశక్తుండైనవాఁడు ఉపాయంబగుపక్షమున, ఈవిశేషము తో నతని కవసర మేమున్నది?దీనితో నతని కవసరము న్నట్లయిన, అతని సర్వశక్తిత్వమునకు లోపము వచ్చునే ? అని

యడిగెదవా? ఈయాక్షేపమును నారాయణ శబ్దముచేతను, చరణశబ్దముచేతనున్ను తెలుపఁబడినట్టి శరీరసంబంధము విషయముననున్ను చేసియుండవచ్చును? అయితే యవి యీతనికి విశేషణంబు లగుటంజేసియు, వాటికి వస్త్వనుగుణముగ ఉపయోగము లుండుటంజేసియును, వాటినిబట్టి యీతని సర్వశక్తిత్వము కెద్దియును విరోధము కలుగఁజాలదని ప్రమాణానుగుణముగ అర్థము చేసికొంటిమేని,యీవిషయము అనేకప్రమాణములనుండి తెలియవచ్చునట్టిది కాఁగలదు. ఈసమాధానమును శ్రీమచ్ఛబ్దమున స్వారస్యమునుబట్టి విశేషణముగాఁ దెలియవచ్చునట్టి పత్నీసంబంధము విషయముననున్ను యోజించుకొనునది.

ఇట్లుండ, 'చరణౌ' అనుతావుననుండు ద్వివచనమాత్రమునుబట్టి శ్రీసంబంధము ఉపలక్షణము (ఎప్పుడో యొకప్పుడుండునది) యంటివేని, దానితోఁబాటు గుణాదులతోఁగల సంబంధమున్ను ఉపలక్షణంబని ప్రసక్తించునే? 'చరణ' శబ్దముకు ఉపాయవాచిశబ్దముతో (శరణశబ్దముతో) సహపాఠముండుటంజేసి, ఉపయుక్తంబులగు గుణములతోను దివ్యమంగళవిగ్రహముతోనును గూడియున్నట్టివాఁడు ఉపాయముకాఁగలడని యెదవేమో, అది ప్రకృతముననున్ను సమానమే.

ఇట్లుండ, ఈమెను విశేషణమునుగాఁ గొనినట్లయిన, సర్వేశ్వరుని సర్వశక్తిత్వముకు విరోధము ప్రసక్తించునని వాదించునట్టి వారిపక్షమున, ఈమెను పురుషకారమునుగాఁ గొనునప్పుడును అట్లే సర్వేశ్వరుని సర్వశక్తిత్వముకువిరోధము ప్రసక్తింపఁగలదు.

'యువత్వాదౌతుల్యే' అను శ్లోకమునఁ జెప్పియున్నట్టి గుణవిభాగముప్రకారము పుంస్త్వ, పితృత్వ, ప్రశాసితృత్వాదుల మూలములగు గ్రహవంతుఁడై దండధరుండైనట్టి సర్వేశ్వరుని విషయమున విముఖులై పోవునట్టివారికి స్త్రీత్వమాతృత్వాదుల మూలకములగు మార్దవ వాత్సల్యాది గుణాతిశయమువలన, ఈమె వానివిషయమున మనకు పురుషకారంబగుటయును, సర్వేశ్వరుని స్వాతంత్ర్యముచే నేర్పఱుపఁబడినదియంటివేని, 'అస్మై, సహధర్మచారిణియగు ఆమెతోఁ గూడియున్నట్టివాఁడై శరణ్యుండగుటయును ఈశ్వరస్వాతంత్ర్యముచే నేర్పఱుపఁబడినది యనుకొనినట్లయిన, ఒక ప్రమాణముతోనను విరోధము ప్రసక్తింపదు.

ఈతావున 'శరణ' శబ్దము 'ఉపాయే గృహరక్షిత్రోః శ్శబ్దశ్శరణమిత్యయం। వర్తతేసాంప్రతంత్వేష ఉపాయార్థైకవాచకః' (శరణశబ్దము ఉపాయమును, గృహమును, రక్షకునిన్ని తెలుపునదియైనను, ప్రకృతమున నది ఉపాయవాచకముగానేగొనఁబడుచున్నది)అని ప్రత్యేకించిచెప్పియున్నందున అదియీతావు ఉపాయవాచకము. 'భరన్యాసబలాదేవస్వయత్నవినివృత్తయే। అతోఽపాయాంతరస్థానే రక్షకోపి నివేశితః' (భరన్యాసబలమునుబట్టియే స్వరక్షణమున స్వప్రయత్నమును వదలుకొనుటకుగాను రక్షకుండగు సర్వేశ్వరుండుప్రకృతమున నుపాయాంతరస్థానమునఁ గొనఁబడుచున్నాఁడు) అనఁగాఅధికారులందఱికిన్ని। ఆయాశాస్త్రములయందుఁ జెప్పియున్నట్లు ఆరాధింపఁబడునట్టి సర్వేశ్వరుండు, ఫలోపాయముగానుండఁగా, ఈతావున ప్రత్యేకముగా ఉపాయంబని చెప్పవలసినదియెందు

ంకనఁగా, సహజకారుణ్యాది విశిష్టుండగు సర్వేశ్వరుని ఉపాయాంతర స్థానమున నుంచునట్టిదియగు ప్రపత్తియొక్క స్వరూపము తెలియవచ్చుటకు గానని యెఱుంగునది.

ఈతావున భక్తియోగముయొక్క స్థానమున అనఁగా భక్తియోగమునకు బదులుగా ప్రపత్తియుండియుండఁగా, ఈశ్వరుండు ఉపాయాంతరస్థానమున (భక్తియోగస్థానమున) నుండియుండుట యనఁగా నర్థమేమని యంటివేని చెప్పెదను. అంగమునుగాను ప్రపత్తినిచేసి, ఉపాయముగాను ఉపాసనమునున్ను (భక్తియోగమునున్ను) అనుష్ఠించి, లభింపవలసినట్టి ఫలమును, ఆయుపాయము మూలముగాఁ గానప్పుడు, ప్రపత్తిమూలముగా లభించుటకు హేతువు సర్వేశ్వరునియొక్క సహజకారుణ్యాదిస్వభావవిశేషము. దీనినిబట్టి యకించనుని విషయమున సర్వేశ్వరుండు ఉపాయాంతరస్థానమున నుంచబడి యున్నాడని చెప్పఁబడినది. అభిమత ఫలమునకుగాను ఉపాయముగాను విధింపఁబడినట్టి భారము భరింపశక్యము కాదు. కావున, అకించనుండగు ఈ చేతనుండు రక్షకుండగు సర్వేశ్వరుని 'నీవు నాకు ఉపాయముగా నుండువలయును' అనికోరి, యుపాయాంతరస్థానమున నుంచుట యనఁగా—'స్వామీ! నాతలపై యుపాయాంతరభారమునుంచకుము, దానిని నాపైయుంచితివేని, ఇఁక మీఁదు అభిమతంబుల నన్నింటిని నోసంగుటలో భారమును సమర్థుండును, కారుణికుండునునగు నీపై బెట్టుకొనవలసియుండును' అనుట. ఈ యంశమును నిష్కర్షించి నిక్షేపమును అంగియని చెప్పుచున్నారు. ఇది తనపై భారము పేకుండువర కుండునది. ఈ నిష్కర్షనుబట్టి 'సాంప్రతం త్వేష ఉపాయార్థైకవాచకః' అని చెప్పఁబడినది.

ఉపాయప్రార్థనమున్ను, నిక్షేపమున్ను వెవ్వేఱుగ చెప్పునట్టితావుల, ఉపాయశబ్దమునం దీవివక్షను వదలుకొని యుండవచ్చును! భరసమర్పణాదులు సుస్పష్టంబు లగుటకుగాను వెవ్వేరుగాఁ జెప్పినప్పుడు ఈతావున స్వరూపమును, భరమును, ఫలమున్ను సమర్పణీయంబులగుటంజేసి, అనేకాంశవిశిష్టంబగు సమర్పణమునందు అంశాంతరముఁ దెలుపునట్టిదిగా నైనను కాగలదు. ఈ మూఁడు విధములగు అర్థములకున్ను పునరుక్తిదోషములేదు. ఈ యుపాయత్వమనునది న్యాసవిద్యయందు (ప్రపత్తియందు) విశేషించి వేద్యవస్తువుయొక్క (భగవంతునియొక్క) యాకారము. దీనికి ఆవశ్యకములగుచు జ్ఞానశక్త్యాదులును తమంతనే దీనిలో నంతర్గతము లగుచున్నవి.

'ప్రపద్యే' అనుపదమందలి గతివాచకమగు దాతువు, గతివాచకములు బుద్ధివాచకము లగుటంజేసి, యీతావున నపేక్షితంబగు బుద్ధివిశేషముఁ దెలుపునది. బుద్ధియనఁగా 'రక్షిష్యతీతి విశ్వాసః' అనుతావునఁ జెప్పఁబడినట్టి యధ్యవసాయము. అంగంబులలో సారభూతంబగునట్టి విశ్వాసమును పురస్కరించుకొని సపరికరంబగు సాధ్యోపాయము ఈతావునఁ దెలియవచ్చుచున్నది. అది యెట్లనిన, ఈతావున 'ప్ర' అను ఉపసర్గము విశ్వాసముయొక్క ప్రకర్షరూపమగు మహత్త్వమును తెలుపునది. ఈవిశ్వాసాతిశయంబనునది 'శ్రీమత్' శబ్దమునందును 'నారాయణ' శబ్దమునందునుగల పురుషకార, సంబంధ, గుణాదుల ననుసంధించుకొనినతోడనే కలుగఁగలదు. ఇందుమూలముగ తనకుఁగల యపచారాతిశయమువలనఁ గలుగునట్టి శంకలన్నియును తొలంగిపోఁగలవు.

ఇట్లు దృఢమైనట్టి విశ్వాసము తప్పకయుండి యుండవలయు ననెడి విషయము,

శ్లో॥ రాక్షసానామవిస్రంభా దాంజనేయస్యబంధనే।
యథావిగలితాసద్య స్తద్వమోఘాప్యస్త్రబంధనా॥

తా॥ రాక్షసులకు ఆంజనేయుని బంధించువిషయమున దృఢమైనట్టి విశ్వాసము లేకపోవుటంజేసి, యమోఘంబైనట్టి యస్త్రబంధము శిథిలమై పోయెను.

శ్లో॥ తథాపుంసామవిస్రంభాత్ ప్రపత్తిఃప్రచ్యుతాభవేత్।
తస్మాద్విస్రంభయుక్తానాం ముక్తిందాస్యతిసాచిరాత్॥

తా॥ అట్లె మనుష్యులకును దృఢంబైనట్టి యధ్యవసాయము లేకపోయినట్లయిన, ప్రపత్తి వ్యర్థముకాఁగలదు. కావున నట్టి దృఢాధ్యవసాయముగల వారికది శీఘ్రముగా ఫలము నొసంగఁగలదు.

అని చెప్పఁబడినది. ఈ యధ్యవసాయముయొక్క ప్రభావము,

శ్లో॥ వ్యవసాయాదృతేబ్రహ్మ నాసాదయతితత్పరం।
నిస్సంశయేష్వసర్వేషు నిత్యంవసతివైహరిః॥
ససంశయాన్‌హేతుబలా న్నాధ్యావసతిమాధవః।

తా॥ అధ్యవసాయము లేనివానియందు బ్రహ్మముండదు. నిస్సంశయంబులగు వాటి యన్నింటియందును బ్రహ్మముండగలదు. సంశయ విశిష్టంబులగు హేతువులయందు బ్రహ్మముండదు కదా!

ఈ మొదలగు తావులయందును ఈ విషయము స్పష్టముగాఁ దెలుపఁబడినది. ఇట్టి మహా విశ్వాస మున్నట్లయిన,

పిమ్మట విమర్శన సమయమునం దొకప్పుడును సంశయము కలుగనేరదు. కావున పిమ్మట ఒకప్పుడును ఈ విషయమున సంశయముకలుగనట్టిదియగు ప్రథమ క్షణమందలి మహావిశ్వాసము ప్రపత్తికి అంగము. ఇది కొంచెము కొరతగానున్నను, విశేషించి కటాక్షింపం బూనినట్టి సర్వేశ్వరుండు ఆకొరతను పూర్తిచేయును. «మిత్రభావేనసంప్రాప్తం నత్యజేయంకథంచన' (నాతో మైత్రినిగోరి నన్ను శరణుజొచ్చినట్టివాని నెన్నండును విడనాడను) అని భగవంతుండే స్వయముగ చెప్పియున్నాడు కదా! అంజలి చేసినంతమాత్రముననున్ను దాసులనెన్నటి కిన్ని విడనాడనట్లు కదా! వాని ప్రభావం బుండగలదు. కావున విశ్వాసము మొదటతక్కువగానున్నట్టిదై యదిక్రమముగ మహావిశ్వాసము కాంగలదు. ఇట్లు «ఉపాయమనెడి నిశ్చయ బుద్ధిగలవాండని మహా విశ్వాసమును గురించి చెప్పినప్పుడు,

శ్లో॥ అనన్యసాధ్యేస్వాభీష్టే మహావిశ్వాసపూర్వకం।
తదేకోపాయతాయాచ్ఞా ప్రపత్తిశ్శరణాగతిః॥

తా॥ తన యభీష్టము వేఱొక్కదానిచే సాధింప నలవి కానిదగునప్పుడు, మహావిశ్వాసపూర్వకముగ భగవంతుని యుపాయమునుగాం బ్రార్థించుట యనునది ప్రపత్తి యనంబడు శరణాగతి.

శ్లో॥ త్వమేవోపాయభూతోమే భవేతిప్రార్థనామతిః।

తా॥ నీవే యుపాయభూతుండవు కమ్మని ప్రార్థించుట శరణాగతి యనిపించు కొనుచున్నది.

శ్లో॥ భవశరణం=ఉపాయంబగుము.

ఈ మొదలగు ప్రమాణముల కనుగుణముగ ప్రార్థన

యును ఈ తావునఁ జెప్పఁబడినది. ఈయుపాయ విషయమగు ప్రార్థనలో గోప్తృత్వవరణము అంతర్గతంబైయున్నది కాని, యది వేఱుగా నుండునది కాదు.

ఇష్టప్రాప్త్యనిష్ట నివృత్తిరూపంబగు ఫలమును గుఱించినట్టి ప్రార్థనను ఉత్తరఖండమునఁ జేయఁబోవుచుండఁగా, ఇచ్చటనున్న ఫలవిషయమగు ప్రార్థన నొనర్చినట్లయిన,పునరుక్తిదోషము రాగలదే? ప్రపత్తియొక్క ఫలమునుగాను భక్తిరూపోపాయమును ప్రార్థించునట్లు, స్వతంత్రప్రపత్తి నిష్ఠునికి ఈ తావున సాధింపవలసినదియును, ప్రార్థింపవలసినదియునునగు ఉపాయంబొక్కటియును లేదుగదా! ఇట్లుండ ఈ తావునప్రార్థన నేలచెప్పియుండవలయునంటివేని, సర్వేశ్వరుండుఫలమునొసంగుటయనునది యధికారులందఱివిషయమునను,సర్వసాధారణంబైనదియై యుండఁగా, అకించనుండై సమస్తమైనభారమును సర్వేశ్వరునిపై యుంచినట్టి యీతని విషయమున, ప్రపత్తి వేఱొక్క యుపాయమున కంగముగా నుండకుండునట్లు, శరణ్యుండు (సర్వేశ్వరుండు) తాను స్వయముగ ఉపాయాంతర స్థానమునసుండి, ఫలము నొసంగుట యనునది యొకవిధమైనట్టి యాధిక్యంబగుటంజేసి, అట్లు అధిక్యంబైనట్టి భరస్వీకారాంశము ఈ తావున ప్రార్థింపఁబడుచున్నది.

అయినను, ఇట్లు ఉపాయముగా నుండవలయునని ప్రార్థించినచో, నది అభిమత ఫలమును వేఱొక్కయుపాయము ననుష్ఠించుటలో నగు కాలవిళంబములేకుండ దయచేయుమని ప్రార్థించినట్లు కాదా? కావున నుత్తరఖండమునందలి ప్రార్థన పునరుక్తి కాదా! యంటివేని, పైనిచెప్పినప్రకా

రము ప్రార్థన విషయమున నంశభేదము తెలియవచ్చుటకు
గాను ప్రత్యేకించి చెప్పవలసిన యావశ్యకత యున్నందున,
పునరుక్తి లేదు. ఉత్తరఖండమునందు ఈతం డపేక్షించు
నట్టి ఫలస్వరూపముఁ దెలుపునట్టి వాక్యముయొక్క ఇచ్చ
ట యన్వయ మాత్రమునకుగాను 'ప్రార్థనా' పదమును
కొనినను, దానికి ఫలస్వరూపముఁ దెలుపుటలో తాత్పర్యం
బనుకొని పునరుక్తిని పరిహరించుకొనవచ్చును. పూర్వోత్తర
ఖండములరెంటియొక్కయును సముదాయార్థమును నిర్ణయించు
నప్పుడు అది 'అకించనుండనగు నాకు నీవు ఉపాయాంతరస్థాన
మునను౦డి, ఫలము నొసంగుటకుగాను శాస్త్రమునఁ జెప్పియు
న్నట్లు నాయొక్క యాత్మను రక్షించుటలోనగు భారమును నీపై
యుంచుచున్నాడను' అని యిట్లు ఒక విశిష్టమగు ప్రార్థన
తోఁగూడియున్నట్టి భర సమర్పణము కాఁగలదు. ఇట్టి సమ
ర్పణము అధ్యవసాయశబ్దార్థమున్ను కాఁగలదు. ఇట్టిసాంగమ
గు భరసమర్పణమే ప్రపత్తి శాస్త్రార్థంబను విషయమును ప్ర
మాణ సంప్రదాయంబులఁగొని యనేక తావులయందు సమ
ర్థించియున్నాము. 'అనేనైవతుమంత్రేణ స్వాత్మానంమయి
నిక్షిపేత్ । మయినిక్షిప్తకర్తవ్యః కృతకృత్యో భవిష్యతి' అని
ప్రపత్తిమన్త్రాంతరమునఁ జెప్పియున్నట్టి కర్తవ్యంబగు నిక్షేపము
ప్రధానంబగుట ఈ తావుననున్న సమానము. ముముక్షువుకుఁ
గల శాస్త్రీయంబగు నాచరణమనునది మోక్షప్రదంబగు సిద్ధో
పాయమును వశపఱచుకొనునట్టి సాధనమను విషయము తనను
కర్తనుగాఁ దెలుపునట్టి క్రియాపదముయొక్క యుత్తమపురు
షచేఁ దెలుపఁబడుచున్నది. దీనియందు 'పుకలొన్జిల్లావడియేన్'

‹అహమస్మ్యపరాధానా మాలయోఽకించనోఽగతిః। నధర్మని ష్ఠోఽస్మి నచాత్మవేదీ' ఇత్యాదితావులఁ జెప్పినట్లు, అధికారి విశేషణమును కార్పణ్య మనఁబడు పరికరమున్ను సూచింపఁ బడినవి. ఈవిషయము గద్యయందు ‹అనన్యశరణః' అనుపద మునందును, చిన్నగద్యయందు ‹స్వాత్మనిత్యనియామ్య' అను చూర్ణికయందును, శ్రీవైకుంఠగద్యయందు ‹తత్ప్రాప్తయే చత త్పాదాంబుజద్వయప్రపత్తే రన్యన్నమే కల్పకోటిసహస్రేణాపి సాధనమస్తీతిమన్వానః' అను చూర్ణికయందును తెలుపఁబడి నది. శ్రీ అరుళాళప్పెరుమాళ్ ఎమ్బెరుమానారును ‹స్వాభీష్టేపర సంబంధే స్వాశక్త్యాహీనసాధనః। తత్ప్రాప్త్యుపాయంతత్పా దాకృత్వావిశ్వాసపూర్వకం' (పరమాత్మతో సంబంధమును గోరినవాఁడై, తనకు శక్తిలేనందున నందులకుగానగు సాధనం బెద్దియును లేనివాఁడై యట్టి భగవత్ప్రాప్తికిగానగు ఉపాయ ముగ విశ్వాస పూర్వకముగ వాని శ్రీపాదంబులను నమ్మి యుండునట్టివాడు) అని యీయర్థముఁ దెలిపియున్నారు.

ఇట్లు అకించనాధికారంబై, భరసమర్పణరూపంబగు ఉపాయ ముఁదెలుపుటచే దుష్కరంబగునట్టి వేఱొక్క కర్మానుష్ఠానము అనావశ్యకంబను విషయము అర్థసిద్ధము. ఇట్లు ‹శరణ' శబ్దము తో నన్వయించి యుండునట్టి ‹ప్రపద్యే' అను పదమునందు ‹రక్షిష్యతీతివిశ్వాసో గోప్తృత్వవరణంతథా। ఆత్మనిక్షేపకా ర్పణ్యే' అనుతావునఁ జూపింపఁబడినట్టి నాల్గు అంగములును చెప్పఁబడినవి. ‹చరాచరాణిభూతాని సర్వాణిభగవద్వపుః। అతస్తదానుకూల్యంమేకార్యమిత్యేవనిశ్చయః। స్వస్యస్వామిని వృత్తిర్వాప్రాతికూల్యవివర్జనం' (స్థావరజంగమపదార్థంబులన్ని

యును భగవంతుని శరీరము కావున వాటితో ననుకూలము
నకుఁ గలుగవలయును స్వస్వాతంత్ర్య నివృత్తి యనఁబడు
(ప్రాతికూల్య వర్జనమున్ను కలుగవలయును) ఇత్యాదిప్ర
మాణవాక్యములయందుఁ జెపియున్నప్రకారము స్వామిత్వాది
నిబంధనలఁ దెలుపునట్టిదియు, విశేషణయుక్తంబగు నారా
యణశబ్దమునందు అనుకూల్యసంకల్పమును ప్రాతికూల్యవర్జన
మున్ను సూచింపఁబడుచున్నవనెడి విషయమును ముందే చెప్పి
యున్నాము. ఈ పరికరంబులున్ను ఉపాయమునకుగా నుండు
నవియై, సకృత్కర్తవ్యంబులను విషయమును వేఱొక్క యధి
కారమునఁ దెలిపియున్నాము.

ఈ క్రియాపదమునఁగల వర్తమానకాలము బహిర్ణ్లవ
నాదిమంత్రములయందువలెనే అనుష్ఠానకాలమును తెలుపుటకు
గాను కావచ్చును. అట్లు కాకున్న, ఇట్టి వర్తమానకాలముఁ జెప్పి
యుండుట ప్రస్తుతముననుండునట్టి శరీరముండువరకును ప్రపత్తి
ననుష్ఠింప వలయునని తెలుపుటకుగానని. కాని, ఫలము గలుగు
వరకును ప్రపత్తియొక్క యంగమగు విశ్వాసముయొక్కయను
వృత్తిని తెలుపుటకుగానని కాని, ప్రపత్తికాలమునందు తాను
సంకల్పించుకొనినప్రకారము అనుకూల్యాదులు ప్రపత్త్యంగ
ములుగానే యికమీఁదనున్ను అనువర్తింప వలయుననెడివిష
యముఁ దెలుపుటకు గానని కాని యర్థము చేసికొనినట్లయిన,
ఈ యుపాయము అంగములతో సహా సకృత్కర్తవ్యంబని తెలు
పునట్టి ప్రమాణములతో విరోధించును. త్వరాతిశయమువల
నఁగాని, భోగ్యతాతిశయమువలనఁగాని, యొనర్పఁ బడునట్టి
యావృత్తికిన్ని, పూర్వఖండమునఁ జెప్పియున్నప్రకారము, అను

క్షింపఁబడునట్టి ఉపాయస్వరూపముతో సంబంధములేదు. కా
వున ఉపాయ వాక్యమునందుండు (క్రియాపదమునఁగల వర్త
మానకాల నిర్దేశము ‘ద్వయ మర్థానుసంధానేన సహైవం
క్తా’ (అర్థజ్ఞానముతో సర్వదా ద్వయమునను సంధించుకొను
నది) అన్నట్టి రాగప్రాప్తంబగు భోగరూపానువృత్తిని తెలుపు
నదియును కాదు. కావున నివ్విధముగ సర్వశరణ్యత్వమును,
శరణాగతిస్వరూపమును, దీని యంగములును, అధికారివిశేష
మును (అధికారి కుండవలసిన యోగ్యతయును) ఇవి పూర్వ
ఖండమునఁ దెలుపఁబడినవి. ఇందువలన అనన్యోపాయత్వము
సిద్ధించుచున్నది.

ఇవ్విధముగ తెలియవచ్చునట్టి శరణాగతి ‘తావదా
ర్తి స్తథా వాంఛా’ ఇత్యాదితావులఁ జెప్పియున్నట్లు, సకలఫల
సాధనంబగుటం జేసియును, ‘తదన్యః కో మహోదారః’ అన్నట్లు
పరమోదారుండగు శరణ్యుండు (సర్వేశ్వరుండు) ఆశ్రితుల
సమస్తకోరికలను నెరవేర్చుటకై నడుముకట్టుకొని, ‘కొళ్లక్కు
త్తైవిల్లా వేండిత్తెల్లాంతరుం’ (అధిక గుణవంతుండగు సర్వేశ్వ
రుండు కోరినదంతయు నీయఁగలఁడు) అని సాయించినట్లుండు
టం జేసియును, ఈ తావుననే ఫలముకుగాను ప్రపత్తిచేయఁబడు
చున్నదనెడి విపత్తి గలుగఁగా, మహోదారుండగు శరణ్యునికి
ని, సర్వోత్కృష్ట విషయంబగు ఈ వశీకరణమునకును (ప్రపత్తి
కిని) శేషత్వమునందే రుచిగల తన స్వరూపమునకును అనురూ
పంబగు ఫలము ఉత్తరఖండమునందు ‘తనక్కేయాక వెనైక్కొ
ళ్లమీతే’ (తనకుగాను నన్ను అంగీకరించునది) అని సాయించి
సమస్త విరోధినివృత్తిపర్యంతము ప్రార్థింపఁబడుచున్నది. ఇందు

వలన అనన్య ప్రయోజనత్వమున్ను సిద్ధించుచున్నది. ఈతావున విశేణ విశిష్టంబగు నారాయణశబ్దము ప్రాప్యత్వమును, అనురూపంబులగు స్వామిత్వాదులనున్ను, అనంతగుణవిభూతి విశిష్టుండగు స్వామియొక్క సర్వప్రకార నిరతిశయ భోగ్యతనున్ను యీ యాకారములను ప్రమాణానుసారముగ ప్రధానముగాఁ దెలుపుచున్నది.

౩ ఉభయ విభూతి విశిష్టమైనది ప్రాప్యవస్తువుగానున్నను, ఆత్మరూపమగు హవిస్సు నొసంగుటకై యుద్దేశింపఁబడినవారును, శేషత్వమునకు విషయభూతులును, అందు ముఖ్యముగ నొసర్పంబడునట్టి కైంకర్యమును స్వీకరించునట్టి వారున్నై ప్రధానమగు ప్రాప్యవస్తువైనట్టి వారు ఈ గుణములతోఁ గూడియుండునట్టి వారలగు దంపతులని (పిరాట్టియును పెరుమాళ్లును అని) అని తెలియవచ్చుటకుగాను ఈతావున 'శ్రీమత్' అను శబ్దము ప్రయుక్తము. ఈ యర్థము 'వైకుంఠేతుపరేలోకే శ్రియాసార్ధం జగత్పతిః' అనియు, 'తయాసహాసీన మనంతభోగిని' అనియు, 'ఆత్మానురూపయా శ్రియాసహాసీనం' అనియు, 'ఒండొళియాళ్ తిరుమకళుమ్ నీయుమేనిలానిర్ప' అనియు, 'కోలత్తిరుమామకళోడున్నై' అనియును ఈ మొదలగు తావులయందును తెలుపఁబడినది.

ఈతావున 'శ్రీ' అను శబ్దమునకు 'శృణాతి నిఖిలాన్దోషాన్ శ్రీణాతిచగుణైర్జగత్। శ్రీయతేచాఖిలైర్నిత్యం శ్రయతేచ పరంపదం। శ్రయంతీం శ్రీయమాణాంచ శృణ్వంతీం శృణ్వతీమపి' ఇత్యాది తావులఁ జెప్పియున్నట్లు అనేకార్థము లున్నప్పటికిన్ని, ఈతావుననుండు శ్రీమచ్ఛబ్దము 'శ్రిఞ్ సేవాయాం' అను

ధాతువునుబట్టి సేవ్యత్వాదులఁ దెలుపుచు నందు మూలముగ
కైంకర్య ప్రతిగృహీతను తెలుపునది కాఁగలదు. 'శ్రీమతే' అను
శబ్దము లక్ష్మీవిశిష్టంబగు కైంకర్య ప్రతిగృహీతను తెలుపు
చున్నను, సర్వవిధ కైంకర్యములకు మూలభూతంబగు ప్రీతిని
గలుగఁజేయునవియగు సంబంధ, గుణ, విభూత్యాదుల విషయ
మున పరిపూర్ణానుభవము సిద్ధించుటకుగాను ఈ తావున 'నా
రాయణ' శబ్దము ప్రయోగింపఁబడినది. ఈ శబ్దమునందుండు
చతుర్థీవిభక్తి తాదర్థ్యమును (శేషశేషిభావ సంబంధమును)
తెలుపుచు, అందుమూలముగ కైంకర్యమును తెలుపుచున్నది.
తాదర్థ్య (సంబంధ) మాత్రము నిత్యమగుటం జేసి, 'తచ్ఛేష
త్వానుసంధాన పూర్వతచ్ఛేషవృత్తికః। అహం సర్వం కరిష్యా
మి' ఇత్యాది తావులఁ జెప్పియున్నట్లు, పరిపూర్ణానుభవపూ
ర్వకమగు కైంకర్యము ప్రార్థింపఁబడినది. శరణాగతుండగు
నప్పుడు, అభిమతసిద్ధికిగాను శరణ్యుని (భగవంతుని) ప్రార్థించు
నట్టివాఁడైనందున, ఈ తావున 'భవేయం' అను ఒకపదమును
తెచ్చిపెట్టుకొనునది, ఇట్లు ప్రధానంబైనదియైనందున ముందు
గ ఇష్టప్రాప్తికై ప్రార్థించి, ఇందులకుగాను అనంతరము 'నమః'
అను పదముచే సర్వానిష్ట నివృత్తికిగాను ప్రార్థించునది. కా
వున 'అప్రాప్తితః పరిహరన్ స్వపరైస్స్వరక్షాం తాదర్థ్యధీ
పరిహృత స్వపరార్థభావః। అనన్యభోగవిరహాదనఘః ప్రపన్నో
భుంక్తే స్వభోగమఖిలం పతిభోగశేషం' (స్వరూపప్రాప్తము
కానందున తనయొక్క రక్షణను తననుండికాని యితరులనుండి
కాని యపేక్షింపనివాఁడై, భగవంతునికే శేషభూతుండననెడి
జ్ఞానమువలన తనకుగాని యితరులకుగాని శేషభూతుండు కా

నివాఁడై వేఱొక్క భోగ్యవస్తు వెద్దియునులేనివాఁడైనందున పాపరహితుండగు ప్రపన్నుండు భగవద్భోగములకు శేషమైనట్టి దానినంతయును అనుభవించుచున్నాఁడు) అని చెప్పియున్నది ఈ 'నమః' అను శబ్దమునకును క్రియాపదము నొకదానిని తెచ్చిపెట్టికొనవలయును. అందుచే 'నమమస్యాం = నేను నాకు శేషభూతుండను కాను' అని యర్థము కాఁగలదు. 'నాది యనఁదగినది యెద్దియును లేదు' అని స్వవిషయమగు మమకారమును నివర్తింపఁజేయుట చేనందుమూలముగ సర్వాపన్నివృత్తికిగాను ప్రార్థించుట యనియును అర్థము చేసికొనవచ్చును. తిరుమంత్రమునందు ఇష్టప్రాప్త్య నిష్టనివృత్తుల విషయమునఁ జెప్పఁబడినట్టి ఆక్షేప పరిహారంబులను ఈ తావునను అనుసంధించుకొనునది.

ఈ 'నమః' శబ్దముచే అవిద్యయు, కర్మమును, ఈ రెంటికి విషయమగు వాసనా, రుచి, ప్రకృతి సంబంధాది రూపములగు సర్వవిరోధులును నివర్తింపబడుచున్నను, దీని యర్థమును వివరించునట్టి శ్రుతియందుఁ జెప్పియున్న ప్రకారము పరపూర్ణకైంకర్యరూపమగు ఫలదశయందు, తక్కిన ఫలములననుభవించునప్పుడు వలెనే, అనుమానింపఁదగినట్టి స్వాధీన స్వార్థ కర్తృత్వము, స్వాధీనస్వార్థ భోక్తృత్వము ఈ దోషములను నివర్తింపఁజేయుటయే దీనికి ముఖ్యార్థంబని కొందఱు అనుసంధింతురు. ఇందువలన ఫలాంతరానుభవ దశయందుండునట్టి స్వాధీనస్వార్థ కర్తృత్వ భోక్తృత్వ భ్రమలు మోక్షావస్థయందలి కైంకర్యదశయందు లేకుండుటంగని, అవ్విధముననే యుండవలయునని ప్రార్థించుచున్నాఁడని యేర్పడు

చున్నది. 'పరమాత్మని నారాణాం సర్వభారసమర్పణాత్ । సంజాతం నైరపేక్ష్యం తు నమ ఇత్యుచ్యతే బుధైః' (నారములనఁబడునట్టి యాత్మలు సమస్తభారముగ పరమాత్మయం దుంచుటం జేసి గలిగిననైరపేక్ష్యమును 'నమః' అను పదము తెలుపుచున్నది. అనియు 'నమః' శబ్దముయొక్క యర్థమును శ్రీ యరులాళప్పెరుమా ళెంబెరుమానారుగారుసాయించియున్నారు. ఈపై శ్లోకమున 'నైరపేక్ష్యమనఁగా—తన రక్షణమువిషయమున నిర్భరుండుగానుండుట. ఇట్టి నిర్భరత్వమువలనభరసమర్పణము ఈతావున సూచితంబైనదికాని, స్వనిర్భరత్వ పర్యంతమగు భరసమర్పణము వివక్షింపఁబడినదిగాని కావచ్చును.

హవిస్సును సమర్పించునప్పుడు 'ఇదమింద్రాయనమమ' అని యివ్విధముగఁ జెప్పునట్లు 'అహంశ్రీమతే నారాయణాయ' అని ఈతావున భరగర్భముగ సమర్పించి 'నమః' అని తన సంబంధమును వదలుకొనుచున్నాడని చెప్పినట్లయిన ఈసమర్పణము అన్వయమునకు స్వరసముగానుండును. ఇట్లు అన్వయించుకొనునప్పుడు పూర్వఖండము అంగపంచకముఁ దెలుపునదిగాను, ఉత్తరఖండము అంగిని ప్రతిపాదించునట్టిదిగానును కాఁగలదు. 'అహమద్యైవమయాసమర్పితః' అని సాయించినట్లు, యీతావున 'నేను శ్రీమానగు నారాయణునికే' అని సమర్పింపఁగా, 'యత్సంరక్ష్యతయార్ప్యతే తవైవాస్మిహిభరః' ఇత్యాదితావులయందుఁ జెప్పియున్నట్లు, స్వరక్షణము విషయమగు భారమును అందువలని ఫలమును వానిదేయనియును అర్థము చేసికొన వచ్చును. కావున 'నమః' అనుపదము ఈ చేతనునికి ఆత్మాత్మీయంబులతోనును, స్వరక్షణ తత్ఫలంబులతో

నును ఎంతమాత్రము సంబంధములేకుండుటం దెలుపుచున్నది. చతుర్థీవిభక్తియును 'నమః' అను శబ్దమున్ను క్రమముగ పర సంబంధమునున్ను స్వ సంబంధ నిషేధమునున్ను తెలుపునవి యగుటంజేసి వీటికి యుపయోగము కద్దు. ఈ సమర్పణము విషయమునను న్ను పరనిరపేక్ష (స్వతంత్ర) కర్తృత్వాదులను నిషేధించుటకుగాను 'నమః' అను పదము ప్రయోగింపంబడి నదియును కానవచ్చును. స్థూలప్రక్రియం గొనినను, 'నమామి' అను పదము ఆత్మ సమర్పణముం దెలుపునదియని వ్యాఖ్యానముచేసినట్టి పదస్తోత్రప్రక్రియచే ఈ 'నమః' శబ్దము సమర్పణముం దెలుపునదియనుట సంగతము. ఇట్లు ఉత్తరఖండమును ఆత్మ సమర్పణముం దెలుపునట్టి దానినిగాను అనుసంధించుకొనునట్టివారికి, ఇందుల కనురూపంబై, స్వరూపానురూపంబగు ఫలము ఈతావుననే స్వతఃప్రాప్తము. పైని చెప్పిన ప్రకారము ఫలముం దెలుపునట్టి దానినిగాను ఉత్తరఖండమును అనుసంధించుకొనునట్టివారికి ఈ యాత్మరక్షాభరసమర్పణము ఉపాయముం దెలుపునట్టిదియగు పూర్వఖండమునందు శరణ శబ్దముతో సంబంధముగల క్రియాపదమునం దనుసంధించుకొనవలసినది.

ఇవ్విధముగ ద్వయమునందుండు పదములు క్రమముగ శబ్దార్థ స్వభావముల మూలముగ పురుషకారయోగమును, దాని నిత్యత్వమును, ఉపాయవైశిష్ట్యమును, శరణ్యగుణపూర్ణత్వమును, సంబంధ విశేషమును, దివ్యమంగళ విగ్రహయోగమును, దానియందు శేషభూతుండగు ఈ చేతనుండు ప్రీతిగలవాండగుటకు మూలము అది యుపాయమగుటను, వశీ

కరణ విశేషమును (ప్రపత్తిని) దాని కంగములగు అధికారి విశేషములను, ప్రాప్యవైశిష్ట్యమును - గుణవిభూతివిశిష్టంబగు వస్తువు (పరమాత్మ) ప్రాప్యంబగుటకు కైంకర్య ప్రతిసంబంధిత్వమును, కైంకర్యప్రార్థనను, సర్వవిధకైంకర్యలాభమును, సర్వానిష్ట నివృత్తిని, అది యాత్యంతికం బగుటను, పరాధీన పరార్థకర్తృత్వమును, అట్టిదియగు భోక్తృత్వమును, ఇవి యన్నియును ప్రధానంబులై వీటికి కావలసినవి యన్నియును, సిద్ధమనియు సాధ్యమనియును విభజింపఁబడినట్టి యుపాయంబనియు ఉపేయంబనియును నిటు యీ రెండు ప్రధాన ప్రతిపాద్యంబులగు వాటితో సంబంధముగలవిగాను ప్రతిపాదింపఁబడినవి.

ఇవ్విధముగ ఉత్తర మీమాంసా శాస్త్రమునందువలెనే, తత్త్వవిశేషమును, ఉపాయవిశేషమును, ఫలవిశేషమును ఈ మంత్రరత్నమునందు ప్రతిపాదింపఁబడినవి. ఇది శ్వేతాశ్వతరమంత్రమువలెనే ఫలాపేక్షాపూర్వకమగు ఉపాయానుష్ఠానము ప్రధానం బగుటం జేసి యుపాయఫలములయొక్క యుత్పత్తి క్రమముతోఁ జేరియున్నట్టి పాఠక్రమమువలన ఫలమును ప్రతిపాదించునట్టి వాక్యము తరువాత పఠింపఁబడినను, అర్థసంబంధమునుబట్టి దానిని ముందుగ అనుసంధించుకొనవలసినది అని పూర్వాచార్యులు సాయించుదురు. ఏలయనఁగా ఈ పురుషుండు పురుషార్థమును గుఱించి విచారించుకొనకుండ, ఉపాయవిమర్శనున్ను ఉపాయానుష్ఠానమునున్ను చేయఁడు కదా! ఇవ్విధముననే తిరుమంత్రమునందును, ఉపాయఫల ప్రతిపాదకంబులగు అంశములయొక్క అనుసంధానక్ర

మములను చూచుకొనునది. ఫలమునకై యాశపడి అధికారి యైనచో కదా! ఈతని కీయుపాయానుష్ఠానముగలుగఁగలదు.

'ద్వయేన శరణంవ్రజేత్' 'ద్వయార్థస్శరణాగతిః' అను పెద్దలయొక్క శ్రీసూక్తులనుబట్టియును ద్వయము ఉపాయానుష్ఠానమును ప్రధానముగా ప్రతిపాదించునది. ఈతావున పూర్వఖండమును, చతుర్థీవిభక్త్యంతములగు పదములును, 'నమః' అను శబ్దమున్ను, ఇవి మూడు అవాంతర వాక్యంబులైనను, మొత్తము కవి యుపాయ ప్రధానంబగు ఒక్కటియే వాక్యము కాఁగలవు. అది యెట్లనిన, 'సర్వస్వామియై సర్వవిధములను నిరతిశయభోగ్యుండై ఎప్పుడును పెరియపిరాట్టితోఁగూడియుండునట్టి నారాయణుని శ్రీపాదసన్నిధియందుస్వరూపప్రాప్తంబగు సర్వదేశ, సర్వకాల, సర్వావస్థోచిత, సర్వవిధ కైంకర్యమునకు విరోధియగు సమస్తమున్నువిడిచిపోయి, సంపూర్ణకైంకర్యమును లభించుటకు అకించనుండును దాసుండనగు నేను స్వరక్షణ భారము మొదలగు వాటితో నాకు సంబంధమెంతమాత్రము లేకుండునట్లు శ్రీమానగు నారాయణునియొక్క శ్రీపాదములయందు అంగపంచకయుక్తంబగు ఆత్మ రక్షాభరసమర్పణమునొనర్చుచున్నానను టద్వయముయొక్క సముదాయార్థము

శ్లో॥ వైరాగ్యవిజితస్వాంతైః ప్రపత్తివిజితేశ్వరైః।
అనుక్రోశైకవిజితై రిత్యుపాదేశి దేశికైః॥

టీ॥ వైరాగ్యవిజితస్వాంతైః = వైరాగ్యముచే వశపఱచుకొనఁబడినట్టి యన్తఃకరణముగలవారును, ప్రపత్తివిజితేశ్వరైః = ప్రపత్తిచే వశపఱచుకొనబడినట్టి సర్వేశ్వరుండు కలవారును, అనుక్రోశైకవిజితైః = భూతహితముచే వశపఱచుకొనఁబడిన వారును నగు, దేశికైః —

మాయాచార్యులచేత, ఇతి = ఇవ్విధముగ, ఉపాదేశి = ఉపదేశింపఁ బడినది.

తా॥ వైరాగ్యముచే మనస్సును వశపఱచుకొనినట్టివారును, ప్రపత్తిచే సర్వేశ్వరుని వశపఱచుకొనునట్టివారును, భూతహితపరులగు మా యాచార్యులు యిట్లు ఉపదేశించియున్నారు.

శ్లో॥ ఇదమష్టపదంవ్యాసే సమాసేషట్పదంవిదుః।
వాక్యంపంచపదైర్యుక్త మిత్యాఖ్యాతప్రధానకమ్॥

టీ॥ ఇదం=ఈద్వయము, వ్యాసే= వ్యస్తపదములఁ గొనునప్పుడు, అష్టపదం= ఎనిమిది పదములు గలదియు, సమాసే=సమాసమున. షట్పదం= ఆరుపదములు గలదియును, పంచపదైః= అయిదు పదములతోఁ గూడియున్నట్టి, వాక్యం = వాక్యంబై, ఆఖ్యాతప్రధానకం = క్రియాపదముచేఁ దెలుపఁబడునట్టి శరణాగతియే ప్రధానముగాఁగలది యనియును, విదుః= తెలిసికొందురు.

తా॥ ఈద్వయము ఎనిమిది వ్యస్తపదములు గలది. సమాసమున ఆరు పదములుగలది. అయిదుపదములుగల వాక్యమై శరణాగతిని ప్రధానముగాఁ దెలుపునది.

శ్లో॥ ఏకంద్వయంత్ర్యవయవం సుఖలభ్యతుర్యం
వ్యక్తార్థపంచకముపాత్త షడంగయోగం
సప్తార్ణవీమహిమవద్వ్యృతాష్టపర్ణం
రంగేసతామిహరసంనవమంప్రసూతే॥

టీ॥ ఏకం = మంత్రములలో ముఖ్యమంత్రంబగు, ద్వయం=ద్వయము, త్ర్యవయవం = మూఁడువాక్యములుగలదియు, సుఖలభ్యతుర్యం=చతుర్థవిభక్తి ప్రతిపాద్యంబగు పరమపురుషార్థమును సులభముగా సాధించునదియు, వ్యక్తార్థపంచకం = అర్థపంచకమును స్పష్టముగా ప్రతిపాదించునదియు, ఉపాత్తషడంగయోగం = షడంగయుక్తమును, సప్తార్ణవీమ

హిమవత్ = ఏడుసముద్రములవరకును వ్యాపించియున్నట్టి మహిమగలదియునై, విపృతాష్ణనర్ణం = తిరుమంత్రమును వివరించునట్టిదియు, ఇహ = ఈలోకమున, రంగే = శ్రీరంగాది దివ్యదేశమునందు, సతాం = వసించునట్టివారికి, నవమం = తొమ్మిదవదగు, రసం = శాంతిరసమును, ప్రసూతే = కలుగఁజేయుచున్నది.

తా॥ మంత్రంబులలోఁ బ్రధానంబైనదియు, మూఁడువాక్యములు కలదియు, పరమపురుషార్థమును సులభముగా సాధించునదియు, అర్థపంచకమును విశదపఱచునదియు, మహావిశ్వాసాది ఆరుఅంగములుగల శరణాగతిని ప్రతిపాదించునదియు, ఏడుసముద్రములవరకు వ్యాపించినట్టి మహిమగలదియు, అష్టాక్షరమంత్రమును వివరించునదియునగు ద్వయము శ్రీరంగాది దివ్యదేశములయందు వసించునట్టివారికి స్వానుసంధానముచే శాంతిరసము నొసంగఁగలదు.

పా॥ ఓతియిరండైయిశైన్దరుళాలుతవుందిరుమాల్
పాతమిరండుంశరణానప్పత్తినప్పంగయత్తాళ్
నాతనైనణ్ణినలంకళ్తినాట్టిలడిమైయెల్లామ్
కోతిలుణర్తియుడన్కొళ్ళుమారుకురుత్తనమే.

టీ॥ ఓతి = చదివి, ఇరండై = ద్వయమును, ఇశైన్దు = ఆదరించి, అరుళాల్ = కృపచేత, ఉదవుమ్ = అవసరపడినప్పుడు రక్షించునట్టి, తిరుమాల్ = లక్ష్మీవ్యామోహితుండగు సర్వేశ్వరునియొక్క, పాదమిరండుం = శ్రీపాదద్వయము, శరణాన = ఉపాయమనట్లు, పత్తి = ఆశ్రయించి, పంగయత్తాళ్ = లక్ష్మీదేవికి, నాథనై = నాథుండగుసర్వేశ్వరుని, నణ్ణి = పొంది, నలంతికళ్ = ఆనందభరితంబగు, నాట్టిల్ = లోకమునందు, అడిమైయెల్లామ్ = కైంకర్యసర్వస్వమును, కోతిల్ = దోషరహితముగ, ఉణర్తియుడన్ = బుద్ధితోగూడ, కొళ్ళుమారు = అనుష్ఠించునట్టివిధమును, కురిత్తనమే = తెలిసికొనుచున్నాము.

తా॥ ద్వయమును ఆదరముతో అనుసంధించుకొనుచు, లక్ష్మీ విశిష్టుండగు శ్రీమన్నారాయణుని శ్రీపాదములను శరణుజొచ్చినట్టివారలై, వాని శ్రీపాదములసన్నిధిని అహంకార మమకారాది దోషరహితులై సర్వకాల సర్వావస్థోచితంబులగు కైంకర్యముల నొనర్పవలయునని మా యాచార్యులవలనఁ దెలిసికొనుచున్నాము.

శ్లో॥ నవేదాంతాచ్ఛాస్త్రంనమధుమథనాత్తత్త్వమధికం
నతద్భక్తాత్తీర్థంనతదభిమతాత్సాత్త్వికపదం
ననత్త్వాదారోగ్యంనబుధభజనాద్బోధజనకం
నముక్తేస్సౌఖ్యంనద్వయవచనతఃక్షేమకరణమ్॥

టీ॥ వేదాంతాత్ = వేదాంతముకంటెను, శాస్త్రం = మోక్షోపయుక్తంబగు శాస్త్రము, న = లేనట్లును, మధుమథనాత్ = భగవంతుని కంటెను, అధికం = గొప్పదియగు, తత్త్వం = తత్త్వము, న = లేనట్లును, తద్భక్తాత్ = భగవద్భక్తునికంటెను, తీర్థం = పావనంబైనట్టిది, న = లేనట్లును, తదభిమతాత్ = అట్టి భగవద్భక్తు లభిమానించినట్టివాని కంటెను, సాత్త్వికపదం = సత్త్వగుణోపపన్నకంబగు స్థానము, న = లేనట్లును, సత్త్వాత్ = సాత్త్వికస్వభావముకంటెను, ఆరోగ్యం = ఆరోగ్యము, న = లేనట్లును, బుధజనాత్ = ఆచార్యునికంటెను. బోధజనకం = జ్ఞానముఁగలుగఁజేయునది, న = లేనట్లును, ముక్తేః = మోక్షముకంటెను సౌఖ్యం = ఆనందము, న = లేనట్లును, ద్వయవచనతః = ద్వయార్థానుసంధానముకంటెను, క్షేమకరణం = అనుకూలంబగు మోక్షసాధనము, న = వేఱొక్కటిలేదు.

తా॥ ద్వయార్థానుసంధానముకంటెను స్వరూపానురూపంబగు మోక్షసాధనము వేఱొక్కటిలేదు.

ద్వయాధికారము ముగిసెను.



శ్రీమతే నిగమాంతమహాదేశికాయనమః.







# రహస్యత్రయసారము

## చరమశ్లోకాధికారము.

శ్లో॥ య ఉపనిషదామంతే యస్మాదనంతదయాంబుధే
స్త్రుటితజనతాశోకశ్లోకస్స్వయంసమజాయత।
తమిహవిధినాకృష్ణంధర్మంప్రపద్యసనాతనం
శమితదురితాశ్శంకాతంకత్యజస్సుఖమాస్మహే॥

టి॥ యః = ఏచరమశ్లోకము, ఉపనిషదాం = గీతోపనిషత్తుల యొక్క, అంతే = అంతమునందు, అనంతదయాంబుధేః = అనంతదయా సముద్రంబగు, యస్మాత్ = ఎవ్వనినుండి, త్రుటితజనతాశోకశ్లోకః = జన సముదాయముయొక్క సంసారకష్టమును నశింపఁజేయునట్టిశ్లోకముగాను, సమజాయత = ఆవిర్భూతంబైయ్యెనో, తం = అట్టి, సనాతనంధర్మం = సనాతనధర్మంబగు, కృష్ణం = శ్రీకృష్ణుని, ఇహ = ఈలోకమునందు, విధినా = శరణాగతి విధిచేత, ప్రపద్య = శరణుజొచ్చి, శమితదురితాః = పాపంబులన్నియును నశించినట్టివారమై, శంకాతంకత్యజః = సంశయముగాని పాపభయముగాని లేనివారమై, సుఖమ్ = సుఖముగాను, ఆస్మహే = వసించుచున్నారము.

తా॥ వేదాంత ప్రతిపాద్యుండగు భగవంతుండు శ్రీకృష్ణుండుగా నవతరించి, అర్జునుని నిమిత్తమున లోకహితార్థము శరణాగతి ధర్మమును పదేశించుటచే లోకులదుఃఖములఁబోఁగొట్టినందున మేమున్నూ అట్లే సుఖముగా వసించుచున్నారము.

శ్లో॥ దుర్విజ్ఞానైర్నియమగహనైర్దూరవిశ్రాంతిదేశై
ర్బాలానర్హైర్బహుభిరయనైశ్శోచతాంనస్సుపంథాః।
నిష్ప్రత్యూహంనిజపదమసౌనేతుకామఃస్వభూమ్నా
సత్పాథేయంకిమపివిదధేసారథిస్సర్వనేతా॥

టీ॥ దుర్విజ్ఞానైః = తెలిసికొనుట కశక్యంబులును, నియమగహనైః = చాంద్రాయణాది నియమములవలన దురవగాహములును, దూరవిశ్రాంతదేశైః = ఆలస్యముగ ఫలమునిచ్చునవియును, బాలానర్హైః = శాస్త్రజ్ఞానము లేనివారికి పొందుట కశక్యంబులును, బహుభిః = అనేకములగు, అయనైః = కర్మయోగాద్యుపాయములచే, శోచతాం = కష్టపడుచుండునట్టి, నః = మాకు, సుపంథాః = మంచిమార్గమును [illegible] యున్నట్టివాఁడును, సర్వనేతా = అట్టిమార్గమున నందఱిని గొనిపోవునట్టివాఁడును, సారథిః = సార్థసారథియైనగు భగవంతుండు, స్వభూమ్నా = స్వశక్తిచే, నిజపదం = ప్రాప్యస్థానమునకు, నేతుకామః = గొనిపోదలంచినవాఁడై, నిష్ప్రత్యూహం = నిరాటంకమైనదియు, కిమపి = అత్యంతసులభంబైనట్టి, సత్పాథేయం = అర్చిరాదిమార్గయోగ్యంబగు శరణాగతిని, విదధే = విధించియున్నాఁడు.

తా॥ దురవగాహంబులగు కర్మజ్ఞానభక్తులలో దేని ననుష్ఠింప వలయునోయని యేమిగానుతోచక కష్టపడుచుండునట్టి మమ్ములను తానే స్వయముగ ప్రాప్యస్థానమునకుఁ గొనిపోదలంచినవాఁడై భగవంతుండు సులభోపాయంబగు శరణాగతిని విధించియున్నాఁడు.

పా॥ఒణ్డొడియాళ్ తిరుమకళున్దానుమాకియొరునినైవాలీన్ఱవుయి
రెల్లాముయ్య, వణ్డువరైనకర్ వాళ్ వసుతేవర్క్కాయ్ మ
న్నవర్క్కుత్తేర్ ప్పాకనాకినిన్ఱు, తణ్డుళవముఁర్మార్పన్ఱానే
శొన్నతని త్తిరుమన్ఱానెమక్కాయ్ త్తన్నైయెన్ఱుమ్, కంపు
కళి త్తడిశూడవిలక్కాయ్ నిన్ఱకణ్పుతైయల్ విళైయూర్పైక్క
ళిక్కిన్ఱానే॥

టీ॥ ఒండొడియాళ్ = దివ్యాభరణ భూషితురాలగు, తిరుమక
ళుమ్ = లక్ష్మీదేవియును, తానుమాకి = తామున్ను; ఒరునినైవాల్ = ఒక్క
సంకల్పముతో, ఉయిర్కళ్లాం = జీవరాశియంతయును, ఉయ్య = ఉజ్జీ
వించునట్లు, తండువరై నకర్ = రత్నరాజ్యంబగు ద్వారకానగరమునందు,
వాళ్న్దరుళేశహ్యాయ్ = సుఖముగా వసించునట్టి వసుదేవునికుమారుండై,
మున్నవర్కు = పాండవులకు, తేర్పాకనాకి = సారధియై, నిన్ర = ఉన్న
ట్టివాఁడును, తణ్ = శీతలమైన, తుళవమలర్ మార్పన్ = తులసీమాలా
లంకృత వక్షస్థలముగల, తానే = తానే స్వయముగ, శొన్న = ఉపదే
శించినట్టి, ఒరు = అద్వితీయంబగు, శరణం = ధర్మము, తాన్ = తాను
స్వయముగ, ఎనక్కు = మాకుగాను, ఆయ్ = అయి, తన్నై = తనను,
ఎన్నుం = సర్వదా, కండు = సేవించి, కళిత్తు = సంతోషించి, అడి = శ్రీ
పాదములను, కూడుమ్ = శిరసాధరించుటకు, విలక్కాయ్ = ప్రతిబం
ధకముగా, నిన్ర = ఉన్నట్టి, కణ్ = చక్షుస్సు, పులియత్ = అజ్ఞా
నము, వైయోట్టు = లీలా, వీటిని, కట్టిక్కిన్హానే = నివర్తింపఁజేయు
చున్నాఁడు.

తా॥ శ్రియఃపతియగు సర్వేశ్వరుండు ఈచేతనులను రక్షించుటకై
సంకల్పించుకొని శ్రీద్వారకానగరమున వసుదేవునియింట యవతరించి,
పాండవులకు సారధియై తానే స్వయముగ అద్వితీయ ధర్మంబగు శరణా
గతిని యుపదేశించి, తనను సర్వదా సేవించి యనుభవించుట కొఱకై
యున్న సంసారబంధమును తొలఁగొట్టుచున్నాఁడు,

'ఏషనారాయణశ్శ్రీమాన్ క్షీరార్ణవనికేతనః। నాగప
ర్యంకముత్సృజ్య హ్యాగతో మధురాపురీం' అన్నట్లు, శ్రియః
పతియగు సర్వేశ్వరుండు దుష్టశిక్షణ శిష్టరక్షణ ధర్మసం
స్థాపనములకుగాను, ద్వారకాధిపతిగావచ్చి యవతరించి
సర్వసులభుండై 'ద్రౌపద్యాసహితాస్సర్వే నమశ్చక్రుర్జ

వార్ధనం' అన్నట్లు, శరణుజొచ్చినట్టి పాండవులకు దూతగానుండి
అర్జునుని రథినిగాఁజేసి, తాను సారథియై, వానికి విధేయుం
డైయున్నప్పుడు, ఈ యర్జునుని నిమిత్తమాత్రముగాఁగొని,
సర్వేశ్వరుండు వాని విరోధులను నిరసింపఁ బూనుకొనియుం
డుటఁగని బంధునాశము తప్పని సరియని నిశ్చయించుకొని,
సందర్భానుకూలముకానట్టి ప్రీతివలనఁ గలిగిన దుఃఖమువలనను,
సందర్భానుకూలముగానట్టి కృపవలనను, ఆచార్యాదులు యు
న్ముఖులైనను, వారిని వధించుటచే పాపమువచ్చుననుభయము
వలనను న్ను వ్యాకులచిత్తుండై హితఁబెద్దియో తెలియఁగోరి,
'యచ్ఛ్రేయస్స్యాన్నిశ్చితం బ్రూహి తన్మే శిష్యస్తేహం శాధి
మాం త్వాం ప్రపన్నం' (స్వామీ! నీకు శిష్యుండనై నిన్ను శర
ణుజొచ్చినాడను. ఈ సందర్భమున నాకెద్ది శ్రేయస్కరంబో
దానిని నిశ్చయించి తెలుపుమా!) అని విన్నవింపఁగా, వాని
దుఃఖమును పోగొట్టుటకుగాను దేహాది విలక్షణంబై, సర్వేశ్వ
రునికి శేషభూతముగా నుండుటయే ప్రధానముగాఁ గలిగియు
న్నట్టి నిత్యాత్మస్వరూపమునున్ను, ఈ స్వరూపమును గుర్తె
రింగియున్నట్టివానికి పరమ పురుషార్థప్రాప్తికిగాను, పరంపర
గా కారణభూతంబులగు కర్మయోగ, జ్ఞానయోగంబులను, సా
క్షాదుపాయముగ విధింపఁబడినట్టి భక్తియోగమునున్ను అం
గములతోసహా ఉపదేశింపఁగా, అట్టి పరమపురుషార్థమును
వెంటనే లభించుటకుగాను ఆతురత యున్నప్పటికిన్ని, అంగ
ములతోఁగూడ ఈ యుపాయము ననుష్ఠించుట దుష్కరం
బగుటం జేసియున్ను, ఈ యుపాయానుష్ఠానమునకుఁ గావలసిన
జ్ఞానశక్తు లున్నప్పటికిన్ని, మధ్యమధ్యను అనేకములు నాచరిం

వలసినందున చిరకాల సాధ్యంబగు ఉపాయ స్వభావమును బట్టి శీఘ్రముగ ఇష్టప్రాప్తి గలుగనందునను మిక్కుటముగ దుఃఖితుండైనట్టి యర్జునుని నిమిత్తీకరించుకొని పరమకారుణికుండగు గీతోపనిషదాచార్యుండు (శ్రీకృష్ణుండు)

శ్లో॥ భక్త్యాపరమయా వాపి ప్రపత్త్యా వా మహామతే।
ప్రాప్యోహం నాన్యథా ప్రాప్యో మమ కైంకర్యలిప్సుభిః॥

తా॥ నా కైంకర్యముఁ గోరునట్టి నా భక్తులచే నేను పరభక్తిచేఁగాని ప్రపత్తిచేఁగాని పొంద శక్యుండను. వేఱొక్కదాని మూలముగ పొంద శక్యుండను కాను

అను తావున తాను నిశ్చయించి విధించినట్టి యుపాయంబులలో, 'తావదార్తిస్తథా వాంఛా' అన్నట్లు గనను పొందుటకును, ఇంకను తక్కిన యభీష్టంబులకున్ను సర్వసాధారణంబగునట్టి సాధనంబై ఆనుకూల్య సంకల్పాదులను తప్ప తక్కిన యంగముల నపేక్షింపనిదై సులభంబై క్షణమాత్రసాధ్యంబై గొప్ప రహస్యంబగునట్టి యుపాయమును, ఇఁకను చదివి తెలిసికొనవలసినది యేదియును నక్కఱ లేకుండ ఉపదేశమాత్రముచే లభించునట్టి చరమశ్లోకముచే సమస్త జనులయొక్కయును హితార్థము సాయించియున్నాడు.

శ్రుతిసిద్ధంబగునట్టి యీ యర్థమును శరణ్యుండగు సర్వేశ్వరుండు తానే యుపదేశింపఁగా, నది 'సంత్యజ్య విధినా నిత్యం షడ్విధాం శరణాగతిం। ఆచార్యానుజ్ఞయా కుర్యాత్ శాస్త్రదృష్టేన వర్త్మనా' (శాస్త్రమునఁ జెప్పియున్నట్టి యాఱు అంగములుగల శరణాగతిని ఆచార్యానుజ్ఞచే నొనర్చునది) అని

శ్రీవిష్ణుత[illegible]త్వాది గ్రంథములయందుఁ జెప్పియున్నట్లు, ఆచార్యానుజ్ఞయు నై యున్నది.

శ్లో॥ సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ।
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః॥

ఈ శ్లోకమునకు శంకరులు మొదలుగాఁగల అద్వైతులు చెప్పినట్టి యర్థంబుల నన్నింటిని, తాత్పర్యచంద్రికయందును, నిక్షేపరక్షయందును విస్తృతముగ నిరసించియున్నాము. ప్రకృతమున, సారభూతంబులగు అర్థములను సత్సంప్రదాయము ద్వారా తెలియవచ్చునట్టి విధమునఁ దెలుపుచున్నాము. దీని యొక్క పూర్వార్థము ఉపాయమును విధించునది. ఉత్తరార్థము. ఫలముఁ దెలుపుచు నందుమూలముగ అట్టి విధికి శేషంబైనది. కావున ఉపాయమును విధించుటయే యీ శ్లోకము యొక్క ప్రధాన విషయము.

ధర్మమనఁగా—శాస్త్రము మూలముగానే తెలిసికొనవలసినట్టి పురుషార్థ సాధనము. 'ధర్మాన్' అను బహువచనము ఇష్టసాధనముగాను శాస్త్రముచే విధింపఁబడినట్టి ధర్మములయొక్క బాహుళ్యమును తెలుపుచున్నది. సర్వశబ్దముచే సాంగమగు స్థితి వివక్షింపఁ బడుచున్నది. ధర్మంబుల యంగములను సయితము ధర్మంబులని పేర్కొనుటలో బాధకములేమి కదా! ఈ సర్వశబ్దమును ఏకశబ్ద ప్రతిసంబంధినిగాఁ (ప్రతికోటినిగాఁ) గొనునప్పుడది అంగిభూతములగు నానావిధ ధర్మములయొక్క కార్త్స్న్యమును తెలుపుచున్నది.

ఇట్లు సామాన్యముగ సర్వధర్మశబ్దముయొక్క యర్థమున్నను, ప్రకృతమున నది ప్రకరణవశమున మోక్షార్థము

శాస్త్రముచే విధింపఁ బడినవియై సాంగములై, నానావిధంబు లగు ఉపాసనంబులనన్నింటిని ముఖ్యముగాఁ దెలుపునది.

పురుషోత్తమతత్త్వజ్ఞానము ఉపాసనంబులన్నింటికిని ఉపకారకంబైనట్టి తత్త్వజ్ఞానము మాత్రము గానును, అవతార రహస్యాను సంధానము అనుష్ఠింపఁబడునట్టి ఉపాసనాదులు శీఘ్రముగా నిష్పన్నంబు లగుటలో హేతువు గానును, దివ్యదేశవాసాదులు ఉపాయ విరోధియగు పాపమును నశింపజేయుటలో హేతువులై ఉపాయనిష్పాదకంబులు గానును శ్రీగీతాభాష్యాదులయందు సమర్థించి యుండుటంజేసి, వీటిని సాక్షాత్తుగ మోక్షోపాయములనుగాఁగాని, అంగిబహుత్వముఁ దెలుపునట్టి బహువచనముచే నివివివక్షింపఁబడుచున్నవనుట యుచితము కాదు.

'నానాశబ్దాదిభేదాత్' అను బ్రహ్మసూత్రమునఁ జెప్పియున్నట్లు ఇవికాకున్నను, సద్విద్యా దహరవిద్యాది భేదమునుబట్టి అంగిబహుత్వ ముండుటంజేసి, ఈ బహువచనము సార్థకము. అంగిబహుత్వమునున్న అంగ బహుత్వమునున్న వివక్షించుకొనినను, విరోధము లేదు.

'పరిత్యజ్య' అనుతావున త్యాగమనఁగా—'అనయాచ ప్రపత్త్యా మా మాకించన్యైకపూర్వకం' ఇత్యాదితావులయందుఁ జెప్పియున్నట్లు, అకించనుండగు తనయొక్క స్థితిఁగని, ఉపాయాంతరముల విషయమునఁగలిగినట్టి నైరాశ్యము (ఆశవదలుకొనుట) ఆశచే దేనినైన నవలంబించినట్లయిన అట్టి ఆశను వదలుకొనుట త్యాగంబనుట యుచితము కదా!

'పరి' అను ఉపసర్గచే "అనాగతానంత కాలసమీక్షయాప్యదృష్ట సంతారోపాయః । త్వత్పాదకమలాదన్యన్న మే జన్మాంతరేష్వపి" (ఎంత కాలము నిరీక్షించినను, మోక్షోపాయము నెద్దియును గన్పట్టజాలనట్టి నేను జన్మజన్మాంతరముల యందును నీ శ్రీపాదములనే తప్ప వేఱొక్కదానిని నమ్మియుండునట్టివాఁడను కాను) అన్నట్లు మిక్కిలి యకించనుండైనట్టి వానికి సర్వకాలముల యందును, సర్వవిధములను, యోగ్యత లేకుండుట యనునది తెలియుటచే గలిగినట్టి నైరాశ్యము (నిరాశగలుగుట) యొక్క యాధిక్యము తెలుపఁబడుచున్నది.

అన్ని విధములను త్యాగమనఁగా — పరిపూర్ణానుష్ఠానమునకు శక్తిలేనప్పుడు, యథాశక్తి యనుష్ఠానము నొనర్చెదమనియు, అందులకున్ను శక్తిలేనప్పుడు, వేఱే కొన్ని *యనుకల్పములను కాని, ఉపాయోపాయంబులను కాని అనుష్ఠించెదమనియును ఇట్లు తనకు దుష్కరంబులగు వాటికై యాశపడుచుండెడి దురాశ లేకుండ యుండుట. ఇట్టియనువాదముకు అధికారి విశేషముఁజూపించుట ప్రయోజనము. అందులోను 'పరి' అను ఉపసర్గము అధికారపౌష్కల్యమును వివక్షించుచున్నది.

"అనిత్యమసుఖం లోకమిమం ప్రాప్య భజస్వ మామ్" అను తావున 'ప్రాప్య' అనునది యొక విధికాకుండునట్లు. 'ఈ లోకమున ఉన్నట్టి నీవు' అని యర్థము చేసికొనినట్లు ప్రకృతమునను, 'పరిత్యజ్య' అనుదానికిన్ని "పరిత్యజించియున్నట్టి నీవు" అను అర్థము వివక్షింపఁబడుచున్నది. ఇట్లు అర్థాంతర విషయముననున్ను

* ఒకదానికి ప్రత్యామ్నాయముగా ననుష్ఠింపఁబడునట్టి దానిని అనుకల్పమందురు.

ప్రయోగముండుటం జేసి, త్వాప్రత్యయ మాత్రముచే, త్యాగమును అంగమని చెప్పఁ దగదు.

"పరిత్యజ్య" అనునది (త్యజింపవలసినది) అని యిట్లువిధిని గొనుపక్షమున, ప్రపత్త్యధ్యాయాదులయందు విధించియున్న ప్రకారముఆకించన్యానుసంధానాది రూపమగు కార్పణ్యమనెడి ప్రపత్త్యంగమును విధించునది యన్నట్లయిన, అర్థమునందు విరోధముండదు. అట్టి సందర్భమున, 'సర్వధర్మాన్ పరిత్యజ్య' అనునది "అహ మస్మ్యపరాధానాం" (నేను అపరాధములకు పుట్టిల్లును) అనియు, "నధర్మనిష్ఠోస్మి" (ధర్మానుష్ఠానపరుండను కాను) అనియును పూర్వాచార్యు లనుసంధించుకొనినట్లు సర్వ ధర్మములును వాటివిషయమున తనకు యోగ్యత యున్ను లేనందున నవి తనను విడనాడి యుండుటను పురస్కరించుకొని యనియర్థము. ఈ యర్థము చప్పున మనస్సుకుతట్టనిదై నప్పటికిన్ని, అనేక ప్రమాణముల కనుగుణంబైనదైనందున నిది ప్రమాణవిరుద్ధముగ శంకరాదులచేఁజెప్పఁబడినట్టి సర్వధర్మస్వరూపత్యాగార్థంబులకంటెను యెక్కువ యుపాదేయంబు కాఁగలదు.

ప్రపత్తికిగాను ఒక్క ధర్మమునున్ను అనుష్ఠింప నక్కఱలేదని యిట్లు ప్రపత్తియొక్క యుపాయాంతర నైరపేక్ష్యమును తెలుపునట్టిదియని దీనినిఅర్థముచేసికొనుట త్యాగమువిధి యనుపక్షమును అనుకూలముగా నుండగలదు. అట్టి సందర్భమున "పరి" అను ఉపసర్గముచే "ఆచమనముచేసి యనుష్ఠించునది. శుచిగా ననుష్ఠించునది" ఇత్యాదితావులఁజెప్పఁబడునట్లు సర్వసామాన్యంబగు యోగ్యతను గలుగఁజేయునట్టి

యాచమనాదులును దీనికంగములుగాను స్వీకరింప తలసినది కావనుట వివక్షింపఁ బడుచున్నది.

అట్లు కాకున్న, కర్మయోగము, జ్ఞానయోగము, భక్తి యోగము అను ధర్మంబులను స్వరూపతః విడనాడుట ప్రపత్తి కంగంబను పక్షమున, [1]ప్రపత్తి సర్వాధికారము కాకపోవును. ఏలయనఁగా ధర్మానుష్ఠానమున సమర్థుఁడైనట్టి వానికి గదా వాటిని విడనాడ వలయునని విధింపవలయును? ఇది బహు ప్రమాణ సిద్ధంబగు కార్పణ్యాఖ్యమనఁబడు అంగమునకును ‟పుకలొన్రిల్లా పడియేన్” (వేఱొక్క గతిలేని దాసుండను) అనియు, ‟కులంగళాయ కళిత్తుమూన్రు” (ధర్మానుష్ఠాన యోగ్యములగు మూఁడు కులములలోనును పుట్టకపోతిని) అనియు, ‟నధర్మనిష్ఠోస్మి” (ధర్మానుష్ఠాన పరుండను కాకపోతిని) అనియును ఈమొదలగు తావులఁ దెలుపఁబడునట్టి ఆకించన్యాధికారం బనెడి సంప్రదాయమునకున్ను విరుద్ధంబగును.

ఈచేతనుండు సర్వేశ్వరునికి సర్వదా పరతంత్రుం డగుటంజేసి, ఉపాయాంతరముల ననుష్ఠించుట కశక్తుండని

---

1 కర్మయోగాదులను త్యజించుట ప్రపత్తికంగంబను పక్షమున, వట్టియంగము వాటికధికారంబుండియుండి, వాటిననుష్ఠింపగలవారి కుండఁగలదు కాని, వాటివిషయము బొత్తుగ అధికారములేక వాటిననుష్ఠించుటకసమర్థులగు స్త్రీశూద్రాదులకట్టి యంగముండజాలదు గాన ప్రపత్తి విషయమున వారి కధికారములేదని ప్రసక్తించుటచే ప్రపత్తి సర్వాధికారంబనుట బాధించును.

2. ఉపాయాంతరముల ననుష్ఠించుటలో శక్తిలేనివాఁడు వాటిని మొదటికి అనుష్ఠింపనే అనుష్ఠింపడుగాన, వానివిషయమున వాటిని త్యజింపవలయునని విధించుట పరిహాసాస్పదమని భావము.

తెలిపి, ఈతనికవి త్యాజ్యంబులని యీ శాఖన విధింపఁబడుచున్నదనుట సర్వశాస్త్రములతోను, స్వవచనములతోను, స్వప్రవృత్త్యాదులతోనును విరోధించుటచే నది మిక్కిలి పరిహసింపవలసిన విషయము. 1అట్లగు పక్షమున, నవ్విధముననే *"వ్రజ" అనుటయును ఘటింపదు. జీవాత్మ యుపాయాంతరములను ఆనుష్ఠించుటలో నెప్పటికిన్ని అశక్తుండనుట తనకు అనిష్టంబైనట్టి అనువాద పక్షమును స్థిరపఱచినట్లగును. ఇంతియే,

ఏదోకశబ్దము ఒక్కతావుననే అశక్తునిగుఱించి త్యాగము ననువదించునదై, తక్కిన వానిని గుఱించి త్యాగమును విధించునది యగుట ఒక్కటియే వాక్యమున ఘటింపదు. ఫలమునందు భేదంబెద్దియును లేకుండ యుండి, అధికారియున్ను ఒక్కండే యైయుండ, (కొందఱికి) గురూపాయంబనియు, (మఱికొందఱికి) అఘూపాయంబనియు నిట్టి వికల్పమునున్ను చెప్పఁదగదు. ఏలయనిన, గురూపాయమును అనుష్ఠించుటకు సమర్థుండైనట్టి వానిచే దానిని త్యజించి అఘూపాయము ననుష్ఠించునది యని విధించినట్లయిన, గురూపాయముననుష్ఠించునట్టి వారొక్కరును లేకపోవుటం జేసియును, వేఱొక్క విధముగ అధికార భేదముఁ జెప్పుట కవకాశము లేనందునను.

* అట్లు పరతంత్రుండగుటచే వొత్తుగ అశక్తుండైనట్టి జీవాత్ముడు 'వ్రజ' అను పదమునఁ దెలుపఁబడునట్లు సర్వేశ్వరుని ఆశ్రయించి వానిని శరణుజొచ్చుటకును అశక్తుండై నందున నదియును ఘటింపక పోవలసి వచ్చును.

గురూపాయమును విధించునట్టి శాస్త్రంబు లన్నియును ప్రమాణంబులు కాకపోవలసివచ్చును.

అఘూపాయమునందు రుచిని పుట్టించుటకుగాను ముందు గురూపాయమును విధించి, అటుపిమ్మట అట్టి గురూపాయము నిషేధింపఁ బడుచున్న దనుటయును మిక్కిలి యనుచితము. ఉపాయంబులు కానివాటిని ఉపాయంబులనుగా విధించుచున్న వంటివేని, శ్రుతిస్మృతులు మోహన (వంచక) శాస్త్రంబులని ప్రసక్తించుటంజేసి శరణ్యుండగు సర్వేశ్వరునియొక్క స్వరూప స్వభావాదులును సిద్ధింపకపోవలసివచ్చును, కఠినములగు కృష్యాదివ్యాపారములను, సులభంబులగు రత్నవాణిజ్యాదులనున్ను ద్రవ్యార్జనపరులగు వారివిషయమున వికల్పించుట యనునది అధికారి విశేష వ్యవస్థనుబట్టి యుండునది యనెడి విషయము లోకప్రసిద్ధము. శ్రీ కూరత్తాళ్వారులు సాయించినట్టి చరమశ్లోక వ్యాఖ్యానమునందును ఇంతవరకే వివక్షించి యున్నందున ను విరోధము లేదు. *సమావర్తనాదులయందలి గురుఅఘు వికల్పమున్ను అవస్థాభేదమును బట్టి నియమింపబడినది యని యంగీకరింపని పక్షమున, గురూపాయమును విధించియుండుట వ్యర్థంబని ప్రసక్తించును, జ్ఞానపూర్తి కాని, విశ్వాసపూర్తి కాని యున్నట్టివాడు ప్రపత్తికిఅధికారి యనియు, జ్ఞానమాంద్య

---

* సమావర్తనంబులను నవి ఉపనయనాది పూర్వమాచరింపఁబడు నట్టివియగు కొన్ని వ్రతములు. వాటికి అఘసమావర్తనమనియు గురుసమావర్తనమనియును వికల్పమున్నదే యంటివేని, యది యవస్థాభేదమునుబట్టి నియమింపఁబడినది యని తెలిపియున్నారు.

ము కాని, విశ్వాసమాంద్యము కాని యున్నట్టివాఁడు ఉపాసనా
దుల కధికారి యనియును చెప్పినట్లయిన, ఈ చరమశ్లోకా
దుల నుపదేశించినట్టివారై, పరమాస్తికు లగుటచే సంపూ
ర్ణజ్ఞాన విశ్వాసవంతులగు వ్యాసాదులకు ఉపాసనాదులయం
దధికారము లేకపోవలసి వచ్చును? ఒకవేళ, వారు ఉపదేశకా
లమున జ్ఞాన విశ్వాసంబులు కలవారై, అటుపిమ్మట మనో
వికారాదుల మూలముగ ఉపాసకులైనారనుట కెద్దియును
ప్రమాణము లేదు. వారు ప్రపన్నులై యుండియును, లోకసం
గ్రహార్థము ఉపాసనాదుల ననుష్ఠించినారని చెప్పునట్టి యొక
మాటయున్ను గ్రంథములయందుఁ గానఁబడదు, ఒకవేళ
అట్లు కల్పింపఁబూనినను, అధికారమునకు విరుద్ధంబులైనట్టి
వాటిని లోకసంగ్రహార్థము అనుష్ఠింపఁ బూనినట్లయిన, అది
యాతనికి పాపంబగును. మరియు అధికార విరుద్ధంబైనట్టి
దానిని అనుష్ఠించుటం జేసి, తన యనుష్ఠానమునువిడిచి లోక
సంగ్రహము నొనర్చుటయును సమకూడదు, ఏలయన, రెండు
విధములుగా ననుష్ఠించుట శాస్త్రీను గుణంబగునప్పుడు,
లౌకికులకు శక్యంబై వారికి హితంబైనట్టి విధమున వాటిలో
నొకదానిని తాను అనుష్ఠించి చూపించి, లౌకికులను అట్టి
యనుష్ఠానమునందు స్థిరముగా నుండునట్టి వారినిగాఁ జేయుట
యే లోకసంగ్రహంబని శ్రీగీతాభాష్యమునందు వాయించి
యున్నారు. ఇంతియేకాని, సన్న్యాసి స్వాశ్రమనిషిద్ధంబైనట్టి
గార్హస్థ్యధర్మమును అనుష్ఠించి చూపించుటయును లోక
సంగ్రహార్థము కాఁజాలదు. అది భగవదాజ్ఞను అతిక్రమించి
ప్రవర్తించుట మాత్రమే కాఁగలదు. ఇంతియే. అట్లే ప్రపత్త్యై

ధికారికి నిషిద్ధంబైనదానిని ప్రపన్నుండు కైంకర్యబుద్ధితో అనుష్ఠిం
చుటయును తనయధికారముతో విరోధించును. ప్రపత్తికి అనా
వశ్యకంబులై శాస్త్రీయంబులైనట్టి వాటిని కైంకర్యబుద్ధితో
అనుష్ఠించినచో, విరోధము లేదు. తమతమ వర్ణాశ్రమాదుల
కనురూపంబులై తమకుతమకు శక్యంబులైనట్టిసర్వధర్మంబులను
స్వరూపతః త్యజించుట యనునది యంగముగానువిధింపఁ బడు
చున్నదని చెప్పునట్టివారి పక్షమునను, ప్రపత్తిని చేసినపిమ్మట
ఈయధికారి తన వర్ణాశ్రమా ద్యధికారంబులకు అనురూపము
గ లభించినట్టి కైంకర్య ఫలమునున్ను పోగొట్టుకొని, అహిం
సా, సత్యవచనాది సామాన్య ధర్మంబులనున్ను ఆచార్యవంద
నాదులనున్ను విడనాడి, పశు,పక్షి, మృగాదులవలెనే సంచరింప
వలసి వచ్చును.

*నిషేధవాక్యములచేఁ దెలుపఁబడునట్టి నిషిద్ధధర్మంబు
లలో స్వరక్షణార్థం బగునట్టి స్వవ్యాపారం బొక్కటియును
కాకపోవుటంజేసి, యవి శరణాగతితో విరోధించునవి కా
నందున, ఈ తావున (సర్వధర్మాన్ పరిత్యజ్య అను తావున) ప్రవృ
త్తిరూపములగు ధర్మంబులను త్యజించుటయే వివక్షింపఁబడు

* "నసురాంపిబేత్" "నానృతంవదేత్"! అను నవి నిషేధవాక్యము
లు. వీటిచేఁ దెలుపఁబడినట్టి సురాపానాదికర్మలతో స్వరక్షణమున స్వా
న్వయరూపంబైనదిలేదు కదా, అట్టిస్వరక్షణమునస్వాన్వయరూపంబైనట్టి
కర్మముకదా ప్రపత్తితో విరోధించునది, కావున సురాపానాది నివృత్తి
ధర్మములు త్యాజ్యంబులు కావనియును, కర్మయోగాది ప్రవృత్తిధర్మములు
మాత్రమే యీ తావున త్యాజ్యంబులుగాను విధింపఁబడు చున్నవనియును
కొందఱు వాదించుటకద్దు. అట్టివాదము యీ తావున నిరసింపబడుచున్నది.

చున్నదని చెప్పుటయును అంతయుక్తమైనది కాదు. * పలయనంగా నివృత్తియును ఇక వ్యాపారంబే యైనియును ఆదియును స్వరక్షణార్థము ఉపయోగపడునది యైనియును ఈ విషయము లోకవేదసిద్ధము కదా!

ఈవిధి బలమువలన ప్రవృత్తి నివృత్తి రూపంబులగు సమస్త ధర్మంబులనున్ను విడనాడి సంచరించుటయే ప్రపన్నునికి శాస్త్రసిద్ధమైనది యంటివేని, అట్లగు పక్షమున, ప్రపన్నులైనట్టి పూర్వాచార్యులును ప్రస్తుతముందువారును సావధానులై యొనర్చునట్టి కైంకర్యంబులును, అపచార పరిహారంబులును విరుద్ధానుష్ఠానంబులు కావలసివచ్చునే! ప్రమాణానుగుణముగ ప్రపత్తి సంప్రదాయంబులను ప్రవర్తింపఁజేయునట్టివారై పరమకారుణికులైనట్టివారికి భ్రమ విప్రలంభాదులు గలుగునట్లు ఊహించుకొనుటకును అవకాశము లేదు.

యావజ్జీవమును సర్వధర్మములను స్వరూపతః త్యజింపవలసినది యని విధించినట్లాయనఁ గదా? విరోధంబుండగను ప్రపత్త్యనుష్ఠానక్షణమునందు వర్ణాశ్రమ సర్వధర్మంబులనున్ను స్వరూపతః త్యజించుట యనునది యంగమైనట్లయిన, విరోధం బెద్దియును లేదే? యంటివేని, అట్టిసందర్భమున, ఆవశ్యకములు కానట్టి వాటిని స్వరూపతః త్యజించుటను గుఱించి విధింప నక్కఱలేదు. ఆవశ్యకంబులైనట్టి వాటిని స్వరూపతః త్యజించుట యనునది యేతావున విధింపఁబడుచున్నదంటివేని, అప్పు

* సురాపానాది నివృత్తి స్వదేహారోగ్యములను కాపాడుకొనుటలో నుపయోగపడుచున్నందున వానికి స్వరక్షణమున ప్రాధాన్యము కద్దు. అవి స్వరక్షణమున స్వవ్యాపారమున్ను కాఁగలదని భావము.

చుండి యున్నట్టి దివ్యక్షేత్రవాస, శిఖా, యజ్ఞోపవీత, ఊర్ధ్వ పుండ్ర ధారణాదులను విడనాడి, ప్రపత్తి నొనర్పవలయునని ప్రసక్తించునే?

కావున ఉపాసనమున కావశ్యకంబులగు కర్మాద్యంగ ములతో నెట్టిసంబంధమున్ను లేనట్టిదియగునట్టి యీ ప్రపత్తి కంగముగాను ఒక్కధర్మమునైనను ఆచరింప నక్కఱ లేదనుట యే త్యాగము విధియను పక్షమునకు ఉచితము. ఇట్లు త్యాగము విధియనెడి పక్షమునందును, ఉపాయాంతరముల ననుష్ఠించుట లో సామర్థ్యమున్నప్పటికిన్ని, మోక్షము గలుగుటలో కాల విళంబమును సహింపఁజాలని వారికిన్ని ప్రపత్తియం దధికార ముకలదు. ఇట్లు అర్థము చేసికొనినట్లయిన, ఒక్కప్రమాణముతో నునువిరోధముండజాలదు. పూర్వాచార్యులును ఈవిషయమున సర్వధర్మములనున్ను స్వరూపతః (మొదటికే) త్యజించుట ప్రపత్తి కంగంబనియు అట్లుకాదనియు నిర్విధముగ వివాదపడియుం డలేదు. అయితే ప్రపత్తికి అధికారభూతంబగు ఆకించన్యము నున్ను నైరపేక్ష్యమునున్ను (కర్మాదుల నపేక్షింపని దగుట యును) ఈ చరమశ్లోకమునందలి యేయేపదములచేఁ దెలుపఁ బడునవి యనుట యుచితంబని విమర్శించినారు. ఇంతియే.

అది యెట్లనిన,

శ్లో॥ అధికారం పురస్కృత్యోపాయనిరపేక్షతాం।
ఏకశబ్దేన వక్తీతి కేచిద్వాక్యవిదో విదుః॥

తా ॥ అధికారమును పురస్కరించుకొని ప్రపత్త్యుపా యము వేఱొక్కదాని సహాయము నపేక్షింపనిదియగుటచర

మశ్లోకమునందలి 'ఏక' శబ్దముచే తెలుపఁబడు చున్నదని కొందరు వాక్యార్థవేత్తలు చెప్పుదురు.

శ్లో॥ నైరపేక్ష్యం పురస్కృత్య విహితస్య లఘీయసః।
ఉపాయస్యాధికారం తు శోకద్యోత్యం విదుః పరే॥

తా॥ సాధనాంతర నైరపేక్ష్యమును పురస్కరించుకొని విధింపఁబడినట్టి సులభోపాయము (ప్రపత్తి) విషయమున నీతని కుండవలసినట్టి యధికారమును "శుచః" అను శోకవాచకమగు శబ్దముచే చరమశ్లోకము తెలుపుచున్నదని మరికొందఱు చెప్పుదురు.

శ్లో॥ ఇత్థమర్థావిశేషేపి యోజనాభేదమాత్రతః।
ప్రాచాం విపర్యస్సంవృత్తో భాష్యకారైరవారితః॥

తా॥ ఇట్లు పూర్వులకు యీ విషయమున విమర్శ గలిగినను, అర్థమునందు భేదము లేనప్పటికిన్ని, యోజనయందుమాత్రము భేదమున్నందున దీనిని భాష్యకారులంత గమనింపలేదు.

శ్లో॥ అజ్ఞాతపూర్వవృత్తాంతైః యత్రతారోపితం పరైః।
తత్తు శ్రీవిష్ణుచిత్తాద్యైః నిర్మూలమితి దర్శితం॥

తా॥ పూర్వాపర సందర్భము నెఱుంగక, యితరులచే నారోపింపఁబడిన దంశయును నిరాధారంబని ఎంగళాళ్వాను మొదలగు పూర్వాచార్యులు సాధించియున్నారు.

అయితే, "ఇదం శరణమజ్ఞానామిదమేవ విజానతాం। ఇదం తితీర్షతాం పారమిదమానన్త్యమిచ్ఛతాం" (అజ్ఞులకిదియే యుపాయము. జ్ఞానవంతులకిదియే యుపాయము. సంసారమును దాటఁ గోరువారికిదియే యుపాయం. మోక్షార్థులకిదియే యుపాయం) అనియు "అవిద్యాతో దేవే పరిబృఢతయా వా విదితయా స్వభక్తే

ర్భాగ్యమ్నా వా జగతి గతిమన్యా మవిదుషాం'' (భగవంతుని విషయమునఁగల యజ్ఞానమువలనఁగాని, అతండు సర్వవ్యాపకుండనెడి జ్ఞానమువలనఁగాని, భక్త్యతిశయమువలనఁగాని యీ జగంబున వేఱొక్క మోక్షసాధనము నెఱింగియుండనివారికి ప్రాప్య ప్రాపకములు రెండును శ్రీమన్నారాయణుండు) అనియును చెప్పియున్నట్టి * యధికారివిభాగ మెవ్విధముగానుండ గలదని యడిగితివేని, చెప్పెదను. ఈ తావున చెప్పఁబడినట్టి యజ్ఞాన మనునది పశ్వాదులవలెనే శాస్త్రీయంబైనట్టి విషయము నెంతమాత్ర మెఱింగియుండకపోవుట కాదు. అయితే యది యెట్టిది? యనఁగా ఉపాసనాదుల విషయమున జ్ఞానము లేకుండుట కాని, ప్రపత్తి విషయమున గూఢములైనట్టి సంగతులు తెలియకయుండుట కాని కావచ్చును. ఇంతియే.

ఈ తావున "విజానతాం" అనియు "దేవే పరిబృఢతయా వా విదితయా" అనియును ఈ తావుల తెలుపఁబడినట్టి జ్ఞానాధిక్యమనునదియును ప్రపత్తికి యుపయుక్తంబగు శరణ్య

---

* శ్రీవచనభూషణమునందు ప్రపన్నులు అజ్ఞులనియు, జ్ఞానాధికులనియు, భక్తిపరవశులనియును మూడు తెగలవారుగా విభజింపఁబడియున్నారు. అజ్ఞుఁడనఁగా — భగవంతుని పొందుటకుగాను జ్ఞానశక్తులు లేనివాఁడు. జ్ఞానాధికుండనఁగా — భగవంతుండు దేశకాలపరిచ్ఛేదము లేనివాఁడనెడి యధ్యవసాయముగలవాఁడగుటంజేసి యతండు వేఱొక్క సాధనముఁగొని స్వాధీనపఱచుకొనఁ దగినవాఁడు కాఁడనెడి తలంపుగలవాఁడు. భక్తిపరవశుండనఁగా — జ్ఞానశక్తులున్నప్పటికిన్ని, సరిగా (సాంగోపాంగముగ) కర్మజ్ఞానభక్తులను అనుష్ఠించుట యసాధ్యమనెడి తలంపుతో నుండువాడు. ఇవ్విధముగ వారి స్వరూపములనున్ను తెలిపియున్నారు. ఆంధ్రి శ్రీవచనభూషణము (౯౭-౧౦౩ పేజీలను చూడుము.

(భగవంతుని) గుణాదులవిషయమగు జ్ఞానము కావచ్చును. ఇట్టిదియె కాని, యిందులకు, అనుపయుక్తంబగు సర్వవిషయజ్ఞానము కాదు, పరిబృఢత్వ (సర్వాంతర్యామిత్వ) రూపమగు శరణ్యగుణ విశేషవిషయమగు జ్ఞానము కదా యీతావునఁ జెప్పఁబడినది. ఇట్టి యుపయుక్తంబైనట్టి జ్ఞానంబున్నట్లైనను, ఉపాయాంతరముల ననుష్ఠించుటకు శక్తిలేనప్పుడు, అకించనుండై ప్రపత్తికి అధికారి కాఁగలడు.

శక్తియున్నప్పటికిన్ని, "శరైస్తు సంకులాం కృత్వా లంకాం పరబలార్దనః। మాం నయేద్యది కాకుత్స్థః తత్తస్యసదృశం భవేత్" (శత్రువులను నశింపఁజేయువాఁడగు శ్రీరామచంద్రుండు వచ్చి లంకను చిల్లాచెదరుగ పాడుచేసి నన్నుగొనిపోయి నట్లయిన, అది వానికి తగియుండును) అని సీతాపిరాట్టి తలంచి యున్నట్లు రక్షకుండు తానే స్వయముగవచ్చి రక్షించువరకును నిరీక్షించియుండుట గదా! యుచితంబంటివేని, వాస్తవమే. అయితే యిది ప్రపన్నునికి ప్రపత్త్యుత్తర కాలముననుండవలసిన యధ్యవసాయమునకు ఉదాహరణము కాఁగలదు, అట్లుకాకున్న, మోక్షోపాయంబులను (కర్మజ్ఞానభక్తులను) విధించునట్టి శాస్త్రములు నిరర్థకంబులు కాఁగలవు.

ఉపాయాంతరములను గురించిన జ్ఞానంబుండియు, వాటిననుష్ఠించుటకుఁ గావలసిన శక్తియున్ను ఉన్నప్పటికిన్ని, శీఘ్రముగా ఫలము నొసంగఁగల ప్రపత్తియే మనకు మంచి దని తలంచి యుండునట్టివాఁడున్ను ప్రపత్తికి అధికారి కాఁగలడు. ఈ విషయమును "ఇదం తితీర్షతాం పారం" అనువాక్యము తెలుపుచున్నది. అదియెట్లనిన, "తితీర్షతాం పారం"

అనఁగా శీఘ్రముగా అనిష్టము (సంసారము) తొలఁగిపోవల యుననెడి త్వర గలవారికని యర్థము.

"ఆనంత్యమిచ్ఛతాం" అనఁగా స్వరూపప్రాప్తంబగు పరిపూర్ణ భగవదనుభవమును లభించిననే తప్ప,ప్రాణములను ధరించి యుండజాలని వారికని యర్థము. ఈ రెంటిని మనస్సు లోనుంచుకొనియే "స్వభక్త్యైష్యామ్నా వా" అని సాయించి నారు. ఈ తావున "భక్తి"యనఁగా ప్రేమపారవశ్యముకాని, భక్తియోగము కాదు. ఇట్టి భక్తియొక్క భూమ(ఆధిక్యము) అనఁగా—శీఘ్రముగ భగవత్ప్రాప్తి గలుగకపోయినట్లయిన ప్రాణములను విడునాడునట్టి స్థితి ఇట్టి స్థితి శాస్త్రీయంబగు భక్తియోగము లేకపోయినను, కొంఱకికి సుకృత విశేషము మూలముగ భగవదనుగ్రహమువలన కలుగఁగలదు. ఇట్టి యవస్థగలవాఁడును ప్రపత్తికి అధికారి కాఁగలఁడు.

ఇట్లుండుటంజేసి, ఉపాయాంతరముల విషయమున జ్ఞానములేనివారై ఈ ప్రపత్త్యుపాయమువిషయమున సామాన్యజ్ఞానము గలవారును, ఈ ప్రపత్త్యుపాయమును గుఱించి యును, ఉపాయాంతరములను గుఱించియును, జ్ఞానమున్నప్పటికిన్ని, ఉపాయాంతరముల ననుష్ఠించుటకుఁ గావలసిన శక్తి లేనట్టివారును,జ్ఞానమున్ను శక్తియును ఈ రెండున్ను ఉన్నప్పటికిన్ని, మోక్షము లభించుటలో నాలస్యమును సహించియుండజాలనంత ఆర్తిగలవారున్ను ప్రపత్తి నవలంబింప వచ్చును. ఫలయన, మోక్షము లభించుటలో నాలస్యమును సహింపజాలనట్టి యధికారియును తాను తలంచినప్పుడు ఫలమును(మోక్షమును) లభించుటకు ఉపాయాంతరం బెద్దియును లేనివాఁడు,

దీనిని బట్టియే "జగతి గతిమన్యామవిదుషాం" (లోకమునందు వేఱొక్క యుపాయము తెలియనివారికి) అని చెప్పఁబడినది.

వ్యాసాదులు *అధికార పురుషు లగుటంజేసి, ఆలస్యమును సహించునట్టివారై, ఉపాయాంతరముల ననుష్ఠించుటలో సమర్థులు. కావున వారు ఉపాసనము నవలంబించినారు, ఇంతియె కాని, వారు జ్ఞానమాంద్యము మూలమునఁగాని, విశ్వాసమాంద్యము మూలమునఁగాని ఉపాసనము నవలంబించినట్టివారు కారు.

శ్లో॥ అశక్తస్యాతికృచ్ఛ్రేషు దురాశాదార్ఢ్యశాలినః।
కస్యచిద్బుద్ధిదౌర్బల్యం లఘుత్యాగస్య కారణం॥

తా॥ అశక్తుండును, దురాశగలవాడగువానికి యెవ్వనికో ఒక్కనికి, కష్టములు సంభవించినప్పుడు, బుద్ధిదౌర్బల్యమనునది సులభోపాయంబగు ప్రపత్తిని విడనాడుటకు హేతువుకాఁగలదు.

శ్లో॥ తత్ర ప్రపత్త్యనర్హాణా మన్యాదిత్యపి యుజ్యతే।
వ్యాసాదిషు తు నైవైషా నీతిస్సంశయఘాతిషు॥

తా॥ అందులోను ప్రపత్త్యనర్హులైనట్టివారికి దివ్యక్షేత్రవాసాదులలో నెద్దియైన నొక్కటి యుండతగునని చెప్పఁదగును. సర్వసంశయములను నశింపఁజేయఁగలవారగు వ్యాసాదుల విషయమున, ఈ న్యాయమును ప్రవర్తింపఁగూడదు.

* భగవదాజ్ఞా పరిపాలనమునకై యేదొక యధికారమున అనఁగా యుద్యోగమున నియమింపఁబడినట్టివారు. అధికారిక పురుషులనఁబడుచున్నారు. వీరు వీరి యధికార మెంతకాలమువరకో, అంతకాలము ఆయధికారముననుండి తరువాత మోక్షమును బొందగలరు. అట్టివారిలో వ్యాసుండు నొక్కండని యెఱుంగునది.

ఇట్లు ఉపాసనమునకును, ప్రపత్తికిన్ని వెవ్వేఱు అధి
కారము ఏర్పడి యుండుటంజేసి, రెండు శాస్త్రములును (ప్ర
పత్తిశాస్త్రమును, ఉపాసనశాస్త్రమును) సార్థకములు. ఈ
యధికారు లిద్దరికిన్ని స్వధర్మము విషయమున ప్రతిపత్తివైష
మ్యమే కావలసినది. ప్రపన్నునికి తాను కోరిన ఫలమునకుగాను
వేఱొక్క యుపాయము ననుష్ఠించుట, *బ్రహ్మాస్త్ర బంధన్యా
యప్రకారము విరుద్ధంబైనను, స్వయంప్రయోజనముగాను కాని,
భగవద్భాగవత సమృద్ధ్యాదిరూపము(గు ఫలాంతరమునకై గాని
వేఱొక్క దానిని అనుష్ఠించినట్లయిన, విరోధములేదు.

ఇట్లు సర్వధర్మములను స్వరూపతః త్యజించుట కూడ
నిషిద్ధమైనప్పటికిన్ని, వాటివిషయమున మోక్షోపాయంబులనెడి
తలంపునుమాత్రమువిడనాడుట "పరిత్యజ్య" అనుపదముయొక్క
యర్థము కాకూడదా? యంటివేని, చెప్పెదను. ప్రపన్నునికి ప్రప
త్త్యుత్తరకాలమున నుండవలసిన యధ్యవసాయమును తెలుపు
నట్టి వాక్యములయందు (ధర్మములయెడల మోక్షోపాయంబు

---

* బ్రహ్మాస్త్రబంధ న్యాయమన(గా—ఇంద్రజిత్తు ఆంజనేయు
నిపై బ్రహ్మాస్త్రమును ప్రయోగింప(గా, తక్కిన రాక్షసులు బ్రహ్మాస్త్ర
మువిషయమున విశ్వాసమాంద్యమువలన అంజనేయుని త్రాళ్లతో సయి
తము బంధించిరి. బ్రహ్మాస్త్రము సాధనాంతరమును సహింపనిదైనందున
నిష్ప్రయోజనముకా(గా, త్రాళ్లున్ను తునాతునకలై పోయినందున అంజ
నేయుని బంధింప(జాలకపోయిరి. అట్లే ప్రపత్తి నొనర్చినట్టివా(డు దాని
విషయమునవిశ్వాసమాంద్యమువలన దానితో(బాటు సాధనాంతరములను
సయిత మనుష్ఠించెనేని, ప్రపత్తి వేఱొక్కదానిని సహింపనిదైనందున
నిష్ఫలము కా(గలదని యెఱుంగునది.

లనెడి తలంపును విడనాడమని విధించినట్లయిన బాగుండును. ప్రకృతమునన్నో, ఈవాక్యము ప్రపత్త్యుత్తరకాలపు కృత్యమును తెలుపునట్టిది కాకుండ, మోక్షోపాయమును విధించునట్టిది. ఇట్టి వాక్యమునందు చెప్పియున్నందున ఉపాయత్వబుద్ధిని త్యజించి ధర్మంబులను ప్రపత్తికి అంగముగాను అనుష్ఠింపవలయునని యేర్పడుచున్నది. ఇందువలన [1]స్వయంప్రయోజనముగ కేవలకైంకర్యమొనర్చుటప్రపత్త్యుత్తరకాలమునందీప్రపన్నునిచే నొనర్పవలసిన కృత్యమన్న మతము సిద్ధింపకపోవును. [2]ఈ ప్రపత్త్యుపాయము ధర్మాంతరముల సహాయమునపేక్షింపనిది యన్నమాటయును సిద్ధింపదు. ఈ ప్రపత్త్యుపాయమునకు ఆకించన్యమే యధికారమైనది కాకపోవును. అదియెట్లనిన, ఉపాయములుకాని వాటివిషయమున ఉపాయంబులనెడి తలంపును విడనాడమని యీతావున విధింపనక్కఱలేదు. ఉపాయంబులైనట్టి వాటివిషయమున ఉపాయత్వబుద్ధిని విడిచి, వాటిని అనుష్ఠించుట యనునది పూర్వము ఉపాసనాదులనుగురించిచెప్పినట్లువలెనే కాఁగలను. 'పరిత్యజ్య' అనుదానికి ఉపాయత్వబుద్ధిని విడనాడుటయే యర్థంబని చెప్పినయెడల, త్యాగవిధికిన్ని, అనుష్ఠానవిధికిన్ని అధికారిభేదముచే విరోధమును పరిహరించినదియును అనవసరము కాఁగలదు. ఏలయన, ఈ తావున స్వరూపత్యాగమును అర్థము చేసికొనినప్పుడు కదా! ఇట్టి విరోధము ప్రసక్తింపఁగలదు. ఇవ్విధముగ

(1) ఫలము నపేక్షింపకుండ యని యర్థము.

(2) ఉపాయత్వబుద్ధి లేకుండ ధర్మముల ననుష్ఠించుట ప్రపత్తికంగమగుటంజేసి యని భావము.

ఉపాయత్వబుద్ధిత్యాగపూర్వకముగ కర్మజ్ఞానభక్తుల ననుష్ఠించుట ప్రపత్తి కంగమని యొప్పుకొను పక్షమున, ఉపాసనమునకును ప్రపత్తికినిగల యంగాంగిభావమునందు [1]వ్యత్యాసముండగలదు. అంగములను యేదొకవిధముగ ననుష్ఠించినచో, చాలునని చెప్పుటయును అంత సరికాదు. 'సకలాంగోపసంహారే కార్యంకర్మప్రసిద్ధ్యతి' (సకలాంగములను క్రమముగ ననుష్ఠించినచో, కార్మకర్మము ఫలము నొసంగును) అని చెప్పియున్నది కదా!

శ్లో॥ అతస్స్వరూపత్యాగోక్తౌ కైంకర్యస్యాపచారతా।
ఉపాయత్వమతిత్యాగే తత్స్వరూపాంగతాభవేత్॥

తా॥ కావున సర్వధర్మములను స్వరూపతః త్యజింపవలయునన్నచో, కైంకర్యమున్ను అపచారముకాఁగలదు. వాటి విషయమున ఉపాయత్వబుద్ధిమాత్రము విడనాడ వలయునన్నచో, నవి స్వరూపతః అంగములు కాఁగలవు.

శ్లో॥ [2]సాత్త్వికత్యాగయుక్తానా మంగానామేతదంగతా।
నూనంవిస్మృతకాకాది వృత్తాంతైరుపవర్ణితా॥

తా॥ సాత్త్వికత్యాగయుక్తంబులగు ధర్మంబులు ప్రపత్తి కంగంబులనుట పూర్వము శరణాగతినొసర్చినట్టి కాకాసురుడు

(1) భక్తి ప్రధానంబైనపుడు ప్రపత్తి దాని కంగముకాఁగలదు. ప్రపత్తి ప్రధానంబైనప్పుడు కర్మజ్ఞానభక్తులు దాని కంగము కాఁగలవు. ఇట్లు భక్తి ప్రపత్తులకు పరస్పరము అంగాంగిభావ ముండకూడదని భావము.

(2) కర్తృత్వము, మమత, ఫలము, ఫలోపాయత్వము వీటినివదలుకొనుట సాత్త్విక త్యాగ మనఁబడు చున్నది.

శ్రీవిభీషణులవారు మొదలగువారి చరిత్రల నెఱింగియుండని
వారు చెప్పునట్టి మాట.

శ్లో॥ సకృత్ప్రపదనేనైవ ధర్మాంతరదవీయసా ।
తత్తదభిమతం పూర్వే సంప్రాపురితి శుశ్రుమ॥

తా॥ ధర్మాంతరంబులకంటెను మిక్కిలి విలక్షణంబైనట్టిది
యగు ప్రపత్తిని ఒక్కతూరి యనుష్ఠించినంతమాత్రమున
పూర్వులు స్వాభీష్టమును లభించినట్లు వినుచున్నాము.

శ్లో॥ ప్రసక్తాంగత్వబాధేతు బ్రహ్మాస్త్రసమతేజసః।
ఉపాయస్య ప్రభావశ్చ కైంకర్యాదిచ సుస్థిరం॥

తా॥ కావున ప్రసక్తంబైనట్టి యంగత్వముకు బాధగలిగి
నట్లయిన, బ్రహ్మాస్త్ర సమతేజస్కంబగు ఉపాయము (ప్రపత్తి)
యొక్క ప్రభావమున్ను కైంకర్యమున్ను స్థిరముగానుండగలవు.

కావున ' పరిత్యజ్య ' అను తావున సర్వధర్మములను
స్వరూపతః త్యజించుట యనునది ప్రపత్త్యంగముగ విధింపఁ
బడుచున్న దనుపక్షమున్ను, ఆధర్మములు అంగంబగునట్లు వాటి
విషయమున మోక్షోపాయత్వ బుద్ధిత్యాగముమాత్రము విధిం
పఁబడుచున్నదనుపక్షమును ఇవి భగవదాజ్ఞా పాలనాది శాస్త్ర
ములకును, ప్రపత్తి వేఱొక్కదానిసహాయము నపేక్షించునది
కాదని తెలుపునట్టి శాస్త్రములకును, పూర్వాచార్యసంప్రదా
యములకును, ప్రపన్నులై పోయినట్టి పూర్వికులగు శిష్టులయొ
క్క యాచారమునకున్ను విరుద్ధంబులు కాఁగలవు. ఈ పైని
గనఁబఱచిన దోషములనుబట్టి ధర్మములను స్వరూపతఃత్యజిం
చుటయును ప్రపత్తి కంగము కాఁజాలదు. అట్టి ధర్మంబులను
వేటినిన్ని ప్రపత్తి యపేక్షించునది కాదు గాన, వాటి

యొక్క స్వరూపమున్ను దీనికంగము కాఁజాలదు. కావున వేఱే యేధర్మములతోనును ప్రపత్తికి అవసరములేదని తెలుపుటయే 'పరిత్యజ్య' అను తావున విధింపఁబడినట్టి త్యాగము యొక్క ఫలితార్థము.

ఇట్లు నిషేధించుటకు యేదైన నొక ప్రసక్తి యుండవలయును. ఈ తావున యేధర్మములు ప్రసక్తించినవై నిషేధింపఁబడుచున్న వంటివేని తెలిపెదను. వేదాంతశాస్త్రమున విధింపఁబడినట్టి బ్రహ్మవిద్యలలో నొక విద్యయందుఁ జెప్పఁబడినవై యంగములుగాఁ దెలియవచ్చునట్టి వర్ణాశ్రమ ధర్మంబులును, అర్చిరాది గమన స్మరణాదులును వేఱొక విద్యయందును అనువర్తించునట్టి చందంబున, నవి న్యాసవిద్య (ప్రపత్తి) యందును ఆప్రకారముగనే యంగములుగాను అనువర్తించుట తటస్థింపఁగా, ఇవ్విధమున అంగములుగా ప్రసక్తించునట్టి సమస్తధర్మములతోనును ప్రపత్తి కెవ్విధమైనట్టి యావశ్యకతయును లేదని యీ తావున తెలుపఁబడు చున్నదనుట యుచితము. ఈ ధర్మములనుగుఱించి 'సహకారిత్వేనచ' అను బ్రహ్మసూత్రమునఁ జెప్పినట్టి విద్యాసహకారిత్వ (అంగత్వ) స్వరూపము తప్పిపోయినట్లయిన 'విహితత్వాచ్చాశ్రమకర్మాపి' అను సూత్రాంతరమునఁ జెప్పియున్నట్టి వినియోగాంతరమును ఈ ప్రపన్నుని విషయమున నివారించునదియెద్దియును లేదు. కావున నిట్లు ఈ ధర్మంబుల ననుష్ఠించుటకాని, ఈ ధర్మంబులను త్యజించుటకాని ప్రపత్తి కంగము కాకపోవుటం జేసి, అశక్యంబులైనట్టి వాటివిషయమున ఆశ వదలుకొనుటయే యధికారములో నంతర్గతము కాఁగలదు. శక్యంబులగు నిత్య

నైమిత్తికంబుల ననుష్ఠించుట యనునది భగవదాజ్ఞానుపాలన రూపంబగు కైంకర్యముమాత్రము కాఁగలదు.

శ్లో॥ సంకల్పమాత్ర మేవాఙ్గం శ్రుతమాచరణంపునః।
అనఙ్గమాజ్ఞయాప్రాప్తం ససంకల్పనిబంధనం॥

తా॥ ఆనుకూల్యసంకల్పముమాత్ర మేఅంగముగాఁ దెలియ వచ్చుచున్నది. ఆచరణమున్ననో అంగము కాదు. అదిభగవ దాజ్ఞవలనఁ బ్రాప్తంబైనది. కాఁబట్టి యది సంకల్పమునుబట్టి యుండునది కాదు.

ఇట్లగునేని, ఈతనికి నిత్యనైమిత్తిక కర్మములోఁ నంతర్గతం బులు కానివియగుసమృద్ధంబులగు కైంకర్యంబులకుప్రేరకంబు లెవ్వి?యంటివేని, యవి యీతని విషయమున ఉపాయాంతర ములలోఁ జేరవు. వేఱొక్కదాని సహాయము నపేక్షింపనిది యగు ప్రపత్తికంగంబులును కాఁజాలవు ఆచరింపకపోతేసర్వే శ్వరునివలనన్నుకు కష్టము కలుగునని తలంచుకొనియును ఆచ రించుచుండలేదు. ప్రత్యేకముగా నవి తనకొకవిధమైనపాప క్షయమునుగాని, స్వర్గ పశుపుత్రాది ఫలాంతరములను గాని గలుగఁజేయునవియని యాశపడియును చేయుచుండలేదు. లౌ కికులు జూదము మొదలగు వాటిని తమతమ సంతోషముకు గాను ఆడునట్లు, ఈతండును కేవలము తన సంతోషముకు గాను ప్రవర్తించునట్టివాఁడున్ను కాడు. ముక్తులవలెనే భగవద భిప్రాయమును ప్రత్యక్షముగాఁగని, వానిని సంతోషపెట్టుటకు గాను ప్రవర్తించునట్టి వాఁడున్ను కాడు. ఇఁకయెట్లంటివేని, ఈ కైంకర్యంబులకున్ను తక్కినఫలములవలెనే భగవత్ప్రీతి యున్నఫలముగాను శాస్త్రసిద్ధంబగుటంజేసి, భగవంతునిసం

తోషపెట్టుటయందు సత్వోత్తరుండగు తనయొక్క ప్రకృతిస్వభావముచే రుచికలుగుటవలన, స్నేహితులకును విద్వలకునుయీ మొదలగువారికి సంతోషముఁ గలుగఁజేయునట్లు, సర్వవిధబంధువగు సర్వేశ్వరుని సంతోషింపఁజేయు విషయమున శాస్త్రి ముచూపించినవిధమున ప్రవర్తించుచున్నాడు.

అయితే భారమునంతయును సర్వేశ్వరునిపై బెట్టినట్టి వివేకవంతునికి 'ఇది త్యాజ్యము ఇది యుపాదేయము' అని నిర్ణయించునది స్వరూపజ్ఞానముకాదా? ఇట్లు ఈతండు స్వరూపవశ్యుండుకావలయునే తప్ప, శాస్త్రివశ్యుండెట్లు కాఁగలడని మరికొందఱు వాదించుచున్నారు. ఇదియును అనుపపన్నము అదియెట్లనిన, స్వరూపంబివ్విధంబైనది యని శాస్త్రిముఁగొని తెలిసికొనినట్లయిన, ఈ స్వరూపమున కీపురుషార్థమున్ను దానియుపాయంబును త్యాజ్యంబులనియు, ఈ పురుషార్థమున్ను ఈయుపాయమున్ను ఉపాదేయంబులనియు నిట్లు విభజించి తెలిసికొనుటకుగాను, ఈతండు ముముక్షుండగువఱకును, శాస్త్రిముతప్ప వేఱొక్కమార్గము లేదు. అయితే స్వరూపమునఁగల శేషత్వానుల మూలముగ కొంత యౌచిత్యమును మాత్ర మెఱుంగఁదగును. ఇంతమాత్రమే కాని, శేషికి సంతోషకరంబైనట్టి కైంకర్యంబిట్టిది ఈకైంకర్యంబునకుగానగు ఉపాయంబులివి యని యిట్లు నిష్కర్షించి స్వరూపజ్ఞానము తెలియఁజేయదు.

ఇట్లుండ, శాస్త్రిమును అనాదరణచేసి, నిషిద్ధపదార్థములఁగొని కాని, శాస్త్రిసిద్ధంబులయినవాటిలోను న్యాయమార్గమున సంపాదింపఁబడినట్టి పదార్థములఁగొని కాని, తన

కిష్టమునచ్చినవిధమున, శాస్త్రవిరుద్ధంబైనమార్గమున కైంక ర్యమును జరిపింపఁ బూనినట్లయిన, ఉపచారంబులను కొని యాచరింపఁబడునట్టియుపచారంబులకంతులేక పోవును. అట్లగు నేని, తన యిష్టము తప్ప నియామకంబైనది వేఱొ క్కటి లేనందున ముముక్షువులు త్యజించిపోవునట్టి సమస్తనిషి ద్ధకార్యంబులనున్ను తనకిష్టమైనంతమాత్రము కైంకర్యరూ పముగ అనుష్ఠించుట ప్రసక్తించును. హవిర్నివేదనమువిష యముననున్ను శ్రీభాష్యకారులవారు ‘‘ శాస్త్రావిరుద్ధాని సంభృత్య = శాస్త్రనిషిద్ధంబులు కానట్టి పదార్థములను సేక రించి’’ అని వ్రాయించియున్నారు. కావున శాస్త్రవశ్యుండై తన యధికారమునకు శాస్త్రము విధించినట్టి కైంకర్యంబులనే యనుష్ఠించుట యావశ్యకము. ‘‘తస్మాచ్ఛాస్త్రం ప్రమాణం తే కార్యాకార్యవ్యవస్థితౌ జ్ఞాత్వా శాస్త్రవిధానోక్తం కర్మకర్తు మిహార్హసి’’ (ఇది చేయకూడదు. ఇది చేయవచ్చును అని నియమించువిషయమున శాస్త్రమే ప్రమాణము. శాస్త్రమున విధించియున్నట్టి విధము నెఱింగి, కర్మల ననుష్ఠింపుము) అ నెడి యుపదేశము సర్వాధికారులకును సర్వసాధారణముగ హితకరంబయినది. శ్రీయామునాచార్యులు గీతార్థసంగ్రహమను గ్రంథమున,

శ్లో॥ జ్ఞానీతు పరమైకాంతీ పరాయత్తాత్మజీవనః।
తత్సంశ్లేషవియోగైకసుఖదుఃఖస్తదేకధీః॥
భగవద్ధ్యానయోగోక్తివందనస్తుతికీర్తనైః।
లబ్ధాత్మా తద్గతప్రాణమనోబుద్ధీంద్రియక్రియః॥

తా॥ భగవదధీనంబైనట్టి జీవనముగలవాఁడును, భగవత్సంబంధమే సుఖముగానును తద్వియోగమునే దుఃఖమునుగాను తలంచియుండువాఁడును, భగవద్ధ్యానము, ఆరాధనము, నైచ్యానుసంధానము, ప్రణామము, స్తోత్రము, సంకీర్తనము వీటిచేప్రాణములను ధరించియుండువాఁడును, బుద్ధీంద్రియాదులన్నియును భగవంతునియందే లయమైయుండునట్టి జ్ఞాని పరమైకాంతి యనఁబడుచున్నాఁడు,

శ్లో॥ నిజకర్మాదిభక్త్యంత్యం కుర్యాత్ప్రీత్యైవకారితః।
ఉపాయతాంపరిత్యజ్యన్యసేద్దేవేతుతామభీః॥

తా॥ అట్టివాఁడు ప్రీతిచే ప్రేరేఁపఁబడినవాఁడై నిత్యకర్మము మొదలు ఉపాసనమువరకును అన్నింటిని వాటియెడల ఉపాయత్వబుద్ధినివిడిచి భగవదర్పణముగా నొనర్చునది.

అని సాయించియున్నారు.

ఈ పైశ్లోకములయందు "ప్రీత్యైవకారితః = ప్రీతిచే ప్రేరేపింపఁబడినట్టివాఁడై" అనినందున శాస్త్రిమక్కుఱ లేదని చెప్పినట్లుకాదు. అయితే యీతావున స్వామికి సంతోషముఁ గలుగఁజేయవలయునను కోరికవలన శాస్త్రిమూలముగానే తెలియవలసినట్టి కైంకర్యమువిషయమున శేషభూతుండగు తనకుఁగలప్రీతియొక్కప్రేరకత్వముకుఁగలయాధిక్యమును దెలుపుటయందే యుద్దేశము.

ఈ పైశ్లోకములను ఉపాసనాధికారులవిషయమున అర్థము చేసికొనునప్పుడు, ఉపాసనాదులెక్కువ రుచికరముగానుండుటను, ఫలోపాయంబగు శరణ్యునికి ప్రీతిఁగలుగఁజేయుటలో సాక్షాత్తుగ కారణభూతములయినవి కాకుండయుండు

నట్టి స్థితినిన్ని, ఈ యుపాసనముమూలముగ ప్రసన్నుండైన నట్టి సర్వేశ్వరుఁడే ఫలమునిచ్చుటలో సాక్షాత్తుగ ఉపాయం బగుటనున్న, వీటిఁదెలుపుటయందే యుద్దేశము కలవి కాఁ గలవు.

స్వతంత్రప్రపత్తినిష్ఠుని విషయమున, ఈశ్లోకముల నర్థ ముచేసికొనునప్పుడు, ఈతండు భగవదాజ్ఞానుజ్ఞలచే చేయున ట్టి కైంకర్యంబంతయును, భక్తియోగాదుల యేర్పాటుప్రకా రమున్నను, స్వామిని సంతోషపెట్టుటకైయేతప్ప, స్వర్గమోక్షా దులకుపాయము గాను అనుష్ఠించునట్టి వాడు కానందున, ఈత నికి అనన్యోపాయత్వమును, అనన్యప్రయోజనత్వమున్ను చెడిపోకుండయుండుటను, అకించనుండగు ఈతనివిషయమున సర్వేశ్వరుండే యుపాయాంతరస్థానమునునుండి ఫలమిచ్చునట్టి విధమును, వీటిఁదెలుపుటలో నుద్దేశము,

పైనిగనఁబఱచిన రెండువిధముల అధికారులును ‘‘ప్రతిబుద్ధా న సేవన్తే’’ (తత్త్వవేత్తలు దేవతాంతరములను సేవింపరు) అనియు ‘‘అనన్యదేవతాభక్తాః’’ (వేఱొక్కదేవ తను భజింపరు) అనియు ‘‘నాన్యం దేవం నమస్కుర్యాత్’’ (వేఱొక్కదేవతను నమస్కరింపకూడదు) అనియును చెప్పి యున్నట్లు పరమైకాంతులైయుండ, ఈతావున ‘‘నిజకర్మాది భక్త్యంతం=స్వాశ్రమకర్మలుమొదలుకొని యుపాసనమువర కును’’ అని చెప్పియున్న ప్రకారము వీరు వర్ణాశ్రమధర్మము లను అనుష్ఠింపఁబూనినట్లయిన, అవి అగ్నీంద్రాది దేవతా పూజా మిశ్రితంబు లయినవి యైనందున వీరి పరమైకాంతి త్వము చెడిపోదా ? యని వేదాంతశాస్త్రమును బాగుగాఁ

జదివియుండనివారు కొందఱు ఆక్షేపించుదురు. ఈ సందర్భ
మున, ‘‘సాక్షాదప్యవిరోధం జైమినిః’’ అను బ్రహ్మసూత్రమునఁ
జెప్పియున్నట్లు ‘‘అగ్రం నయతీత్యగ్నిః’’ ఇత్యాది వ్యుత్పత్తివలన
అగ్న్యాదిశబ్దంబులను సాక్షాత్తుగ సర్వేశ్వరుని తెలుపునట్టి
వాటినిగాను అర్థము చేసికొనినట్లయిన, ఇవి భగవంతుని సహ
స్రనామములవలెనే యుండునవి (భగవంతుని తెలుపునవి)
యగుటం జేసి, దేవతాంతరసంబంధము వీరికెంతమాత్రముం
డజాలదు. ‘‘దేవాన్, ఋషీన్ పితౄన్ భగవదాత్మకాన్
ధ్యాత్వా సంతర్పయే’’ (అగ్న్యాదిదేవతలను, ఋషులను, పితృ
దేవతలనున్ను భగవదాత్మకములనుగా ధ్యానించి తర్పణముఁ
జేయునది) అని ఆహ్నికగ్రంథములు మొదలగు వాటియం
దు శ్రీభాష్యకారులవారు సాయించినట్లు, ఆ యా దేవతలను
శరీరముగాఁ గలవానినిగాను పరమాత్మను ధ్యానించి ఆయా
కర్మలననుష్ఠించుట శాస్త్రసిద్ధంబగునప్పుడు, ‘‘ఉపాసాత్రై
విధ్యాత్’’ అను బ్రహ్మసూత్రమునఁ జెప్పియున్నట్లు, ప్రతర్ద
నాద్యుపాసనములయందు విశేష్యంబగు(ప్రధానంబగు)దివ్యా
త్మ స్వరూపమును గాను గాని, చేతనాచేతన విశిష్టంబైనట్టి
దానినిగానుగాని పరమాత్మను ఉపాసించుచున్నప్పటికిన్ని, అట్టి
సందర్భమున విశేషణభూతంబులగు చేతనాచేతనపదార్థముల
నారాధింపనట్లు, ఈ తావునను ఈతండు దేవ, ఋషి పితృ
అను ఆరాధించుచుండలేదు.

మరియు, ‘‘అహం హి సర్వయజ్ఞానాం భోక్తాచ ప్రభు
రేవచ’’ (నేనే సర్వయజ్ఞములకును భోక్తయును ప్రభువున్ను,
అనియు, ‘‘ హవ్యకవ్యభుగేకస్త్వం పితృదేవస్వరూపధృక్ ’’

(దేవస్వరూపమును పితృస్వరూపమునున్ను ధరించినవాఁడవై హవ్యకవ్యములను అనుభవించువాఁడవును, నీవే) అనియు, "యే యజన్తిపితౄన్ దేవాన్ బ్రాహ్మణాన్ సహుతాశనాన్। సర్వభూతాంతరాత్మానం విష్ణుమేవ యజన్తితే" (పితృదేవతలను, దేవతలను, నిత్యాగ్నిహోత్రులగు బ్రాహ్మణులనున్ను పూజించునట్టి వారు అందుమూలముగ సర్వాంతరాత్మయగు విష్ణువునే పూజించుచున్నారు) అనియును చెప్పియున్నట్లు, సర్వాంతరాత్మయైనట్టివాఁడే, జ్ఞానియగు ఈచేతనునిచేనారాధింపఁబడునట్టి వాఁడగుటంజేసి, యివ్విధమున నెఱింగియుండి యనుష్ఠించునట్టి వానికి యథాశాస్త్రముగ అనుష్ఠించునట్టి కైంకర్యంబులవలన ఉపాయాంతరసంబంధము ప్రసక్తింపకుండునట్లును, కైంకర్యార్థముగ ద్రవ్యార్జనము నొనర్చుటయును భగవన్నివేదితంబులనుపయోగపఱచుటయును ఈ మొదలగు వాటివలన ప్రయోజనాంతర సంబంధము ప్రసక్తింపకుండునట్లును, ఆరాధ్యుండగు సర్వేశ్వరుని శరీరముగాను శాస్త్రవిధి సంప్రాప్తంబులగు చేతనాచేతన పదార్థములమూలముగ దేవతాంతరసంబంధ మీతని కెంతమాత్రము కలుగదు.

శ్లో॥ నారాయణంపరిత్యజ్య హృదిస్థంప్రభుమీశ్వరం।
యోన్యమర్చయతేదేవం పరబుద్ధ్యా సపాపభాక్॥

తా॥ హృదయమునందు నారాయణుని విడిచి వేఱొక్క దేవతను పరాత్పరుండను తలంపుతో నర్చించునట్టి వాఁడు పాపాత్ముండు.

శ్లో॥ యస్తునారాయణం దేవం సామాన్యేనాభిమన్యతే।
సయాతినరకం ఘోరం యావచ్చంద్రదివాకరౌ॥

తా॥ నారాయణునిని సామాన్యునిగాఁ దలంచునట్టి వాఁడు ఆచంద్రార్కము ఘోరంబగు నరకమును బొందును.

శ్లో॥ బుద్ధరుద్రాదివసతిం శ్మశానం శవమేవచ।
అటవీం రాజధానీంచ దూరతః పరివర్జయేత్॥

తా॥ బుద్ధ, రుద్రాలయములను శ్మశానమును, శవమును అడివిని రాజధానినిన్ని విడిచి దూరముగా నుండునది.

ఈ పై వాక్యములయందుఁ జెప్పియున్నట్లు దేవతాంతరములయెడల పరత్వ సామ్యబుద్ధుల నుంచినఁగాని, నిత్యనైమిత్తికంబులతో సంబంధములేనట్టి దేవతాంతర సన్నిధికిఁబోయినఁగాని, పరమైకాంతికి కూడనిదగును. ఇంతియెకాని, నిత్యనైమిత్తికములయందు ఆరాధ్యుండగు సర్వాంతర్యామికిశరీరభూతులైయుండుటనుబట్టి ఈదేవతలవిషయమున పరత్వబుద్ధియును, సామ్యబుద్ధియును, స్వాంతరాత్మత్వబుద్ధియును, ఆరాధ్యత్వబుద్ధియును, ఫలప్రదత్వబుద్ధియున్ను లేకపోవుటంజేసి, ఉపాస్యవస్తువగు భగవంతునికి విశేషణ (శరీర) భూతంబులగు ప్రాణ, వైశ్వానర, త్రైలోక్యాదులమూలముగ ఈతనికి దేవతాంతరసంబంధము కలుగనట్లు, శాస్త్రసిద్ధంబులగు అగ్నీంద్రాది విశేషణంబుల మూలముగానున్ను ఈతని యైకాంత్యము కెట్టి విరోధమున్ను కలుగదు. వంగిపురపు నంబిగారును ప్రపన్నునికి అహోరాత్రకృత్యంబగు భగవదారాధనముఁ దెలుపుచు

శ్లో॥ గాయత్రీజపపర్యంతం మంత్రాచమనపూర్వకం।
సాధ్యంకర్మాఖిలం సాధు సమాప్యచ యథావిధి॥
సమిదాజ్యాదిభిర్ద్రవ్యైః మంత్రైరపియథోచితైః।
హుత్వాగ్నీనగ్నిహోత్రాద్యుక్తంకాలమపేక్షిపన్॥

తా॥ గాయత్రీజపమువరకును మంత్రాచమనపూర్వకముగ సంధ్యావందనమును యథావిధిగ పూర్తిచేసి,సమిధలు, నెయ్యి మొదలగు వస్తువులతోను, సందర్భానుగుణంబులగు మంత్రములతోనును అగ్నియందు హోమముచేసి, యగ్నిహోత్రముకుగా నేర్పరుపఁబడినట్టి కాలమునిట్లు గడిపి,

శ్లో॥ తతోమాధ్యందినంకర్మస్వోదితంశ్రుతిచోదితం।
స్నానాదిబ్రహ్మయజ్ఞాంతం కృత్వాఖిలమతంద్రితః॥

తా॥ అటుపిమ్మట మాధ్యాహ్నికకర్మమును శ్రుతులయందు విధించియున్నప్రకారము స్నానము మొదలుకొని బ్రహ్మయజ్ఞమువరకును అనుష్ఠించి,

శ్లో॥ హోమంపితృక్రియాంపశ్చాదనుయాగాదికంచయత్।

తా॥ అటుపిమ్మట పితృశ్రాద్ధాదుల నాచరించి భుజించునది.

ఇవ్విధముగ తత్తన్మంత్రపూర్వకములగు వర్ణాశ్రమధర్మములను సాయించియున్నారు.

భట్టరువారును,శ్రీకూరత్తాళ్వారులును వారువారు సాయించిన ఆహ్నిక గ్రంథములయందు ‹‹ శ్రుతిస్మృత్యోదితంకర్మయావచ్ఛక్తిపరాత్మనః । ఆరాధనత్వేనాపాద్య సోర్ధ్వపుండ్రశ్చతర్పయేత్›› (ఊర్ధ్వపుండ్రములను ధరించి శ్రుతిస్మృతివిహితంబైనట్టి కర్మమును భగవదారాధనబుద్ధితో యావచ్ఛక్తి యనుష్ఠించి పితృకార్యాదుల నొనర్చునది) అని యివ్విధముగ సాయించి యున్నారు.

పెరియజీయరును (నంజీయరును) ‹‹శ్రీపరాశరభట్టార్యచరణౌసంశ్రయేమహి›› ఇత్యాదితావుల సంప్రదాయవిశేష

జ్ఞాపకార్థము ఆచార్యవందనాదులనొనర్చి, ‘భగవచ్చరణాంభోజపరిచర్యావిధిక్రమం। ఏకాంతిభి రనుష్ఠేయం నిత్యం సమభిదధ్మహే ’ (నిత్యము పరమైకాంతులచే నొనర్పవలసినట్టి భగవత్పాద పరిచర్యను తెలుపుచున్నాము) అని యారంభించి,

శ్లో॥ ఆపోహిష్ఠేత్యాదిమంత్రైర్ద్వా చక్రే౽పరమాత్మనః।
ప్రతిపాదికయావిష్ణోః సావిత్ర్యాతంజపేద్ధరిం॥
ధ్యాయన్ జప్త్వాపఠిష్ఠేత తమేవపురుషోత్తమం।
నారాయణాత్మకాన్ దేవాన్ ఋషీన్ స్సంతర్పయేత్పితౄన్॥

తా॥ పరమాత్మవాచకములగు ‘ఆపోహి’ ఇత్యాదిమంత్రములచేత ప్రోక్షించి, ఆయామంత్రములచే మంత్రాచమనముఁ జేసి, ఆదిత్యాంతర్గతుండగు పరమాత్మకు అర్ఘ్యమొసర్చి విష్ణువును ప్రతిపాదించునట్టిదియగు సావిత్రితో జపించునది. విష్ణువును ధ్యానించుచు జపించుచు నుండునది. నారాయణాత్మకులగు దేవతలకును, ఋషులకును, పితృవులకును తర్పణముఁ జేయునది.

అని యివ్విధముగ పాయించి యున్నారు.

మరియు శ్రీభాష్యకారులవారి సంప్రదాయమునఁ నున్నట్టి యాయావర్ణముల వారందఱును ఇవ్విధముననే తమతమ సూత్రములయందుఁ జెప్పియున్నప్రకారము వివాహోపనయనాదుల ననుష్ఠించుచున్నట్లు చూచియున్నాము. పెరియనమ్బిమొదలగు పర్వమాచార్యులునయితము తమతమ సూత్రములయందుఁ జెప్పియున్నప్రకారము యజ్ఞాదుల నొనర్చియున్నారను విషయ మందఱును ఎఱింగియున్నదే.

ఇట్లుండుటంజేసి, శ్రీభాష్యకారులవారి యొక్కయును, వారి శిష్యులయొక్కయును వారిశిష్యులయొక్కయును ఉపదేశానుష్ఠానంబులయందు నిష్ఠగలవారు ఆగమ సిద్ధాంతమును అనుసరించి యుండునట్టివియగు సంహితలయందుఁ జెప్పఁబడినట్టి మంత్రములఁగాని కర్మల ననుష్ఠింపఁగూడదు.

అధికారాదుల కనుగుణముగ పంచరాత్రము నాల్గు విధములుగ విభజింపఁబడి యుండుటను, శాస్త్రవిరోధములేనట్టి ప్రదేశమున, ‘అనుక్తమన్యతో గ్రాహ్యం = చెప్పియుండని దానిని వేఱొక్కతావునఁ జెప్పియున్నట్టి విధమునఁగొనునది’ అను న్యాయప్రకారము ప్రవర్తించుటనున్ను, నాల్గు ఆశ్రమముల వారికన్ని బ్రహ్మవిద్యయం దధికారమున్ను మోక్షప్రాప్తియును కలదని శ్రీ భాష్యాది గ్రంథములయందు సమర్థించియున్నట్లు, ఆగమ సిద్ధాంతాదులయందు నాల్గింటియందును సామ్యముగ మోక్షోపాయమును, మోక్షప్రాప్తియును కలదనియును శ్రీ పాంచరాత్ర రక్షయందును ఉపపాదించియున్నాము. ఈ శాస్త్రములయందు నియతముగ విధించియున్నట్టి విధమున తప్ప,తనకు తమకుయిష్టమువచ్చిన మంత్రములఁగాని సర్వ కర్మంబుల ననుష్ఠించినట్లయిన, ప్రాయశ్చిత్తాదులనున్ను విశేషించి యచటనే చెప్పియున్నాము.

కావున ఈతఁడు ముక్తుండగువరకును తనయొక్క అధికారము కనుగుణముగ శాస్త్రమునఁ జెప్పియున్నట్టి విధముననే తప్ప,వేఱొక్కవిధమున కైంకర్యమొనర్చుట కవకాశములేదు. ఇవ్విధమున ప్రపన్నుండును శాస్త్రవశ్యుండై శాస్త్రమునఁ జెప్పియున్నట్టి కైంకర్యమునే చేయవలయునుగాన,

ప్రపన్నుండు విధి నిషేధ శాస్త్రములకు వ్యతిరిక్తముగ ప్రవర్తింపవచ్చునను పక్షమును, విధి నిషేధములను త్యజింపవచ్చునను పక్షమును, వర్ణాశ్రమ ధర్మములు ఔపాధికంబులగుటంజేసి, స్వరూప జ్ఞానముగలవాని కవి త్యాజ్యంబులను పక్షమును, వీటిని విడనాడినట్లయిన, భగవంతునికి సంతోషము కలుగకపోవునే కాని వేదోక్త యనిష్టంబెద్దియును కలుగనేరదను పక్షమును, వీటి ననుష్ఠింపక పోయినట్లయిన, లోకులు నిందింతురే కాని, వేదోక్త యనిష్టం బెద్దియును కలుగనేరదను పక్షమును, ఇంకను ఇవ్విధములగు పక్షములన్నియును, మంచి న్యాయము కనుగుణంబులగు శాస్త్రసంప్రదాయములకు విరుద్ధంబులగుటంజేసి, సత్వనిష్ఠులైనట్టి (ప్రమాణ పరతంత్రులగు) వారి కని యుపాదేయంబులు కావు.

సన్యాసాశ్రమము నవలంబించినట్టివారికి, ముందున్నట్టి ధర్మంబులను కొన్నింటిని నిషేధించి, క్రొత్తగా కొన్నింటిని విధించు చందంబున, భాగవతులైనట్టివారికిన్ని కొన్నింటిని నిషేధించి నూతనముగా మరికొన్నింటిని విధించినప్పటికిన్ని, "సంధ్యాహీనో శుచిర్నిత్య మనర్హ స్సర్వకర్మసు"(సంధ్యావందనము నాచరింపని వాడెల్లప్పుడును అపవిత్రుండు అట్టివాడే కర్మమును అర్హుండు కాడు) అని చెప్పియున్నందున, అవశ్యముగ అనుష్ఠింపవలసినవిగాను చెప్పబడినట్టి నిత్యనైమిత్తికకర్మంబులను విడనాడకూడదు. ధర్మశాస్త్ర, సూత్రవిశేషములయందువలెనే, భగవచ్ఛాస్త్రసంహితావిశేషములయందును, ఇతిహాస పురాణములయందున్ను చెప్పియున్నట్టి సంధ్యోపాసనా విశేషంబులను, ఆయా శాస్త్రముల కనుగుణముగ, ప్రవర్తించు

నట్టివారు అనుష్ఠించునది. ‘‘దైవతాన్యభిగచ్ఛేత్తు’’ (దేవతా సన్నిధికిఁ బోవునది)అనియు, ‘‘దేవస్థాన ప్రణామనం’’(దేవ స్థానమున దండము సమర్పించునది) అనియును ఇవ్విధముగ ధర్మశాస్త్రేతిహాసాదులయందుఁ జెప్పియున్నట్టి ఆచారము న్ను పరమైకాంతియైనట్టి వానికి శాస్త్రబలమువలన భగవ ద్విషయమున నియతముగా నొనర్పవలసినది. కావున నొక్క శాస్త్రముతోనను విరోధముండజాలదు.

‘‘తస్మాదష్టాక్షరం మంత్రం మద్భక్తైర్విత కల్మషైః। సంధ్యాకాలేషు జప్తవ్యం సతతం చాత్మశుద్ధయే’’ (నిర్మలు లగు నా భక్తులచే అష్టాక్షరీ మంత్రము సాయంకాలమున జపింపవలసినది,మనోనైర్మల్యమునకుగాను ఎల్లప్పుడును జపింపవ చ్చును.) అని శ్రీవైష్ణవ ధర్మశాస్త్రములయందుఁ జెప్పియు న్నదియును, ‘‘ద్వయమర్థానుసంధానేనసహ సదైవం వక్తా’’ (సర్వదా ద్వయమును అర్థజ్ఞానముతోనను సంధించుకొనునది) అని గద్యయందు సాయించినదియును,ఇంకను ఇవ్విధములైన వి యన్నియును,అవశ్యముగ ఆచరింపవలసినట్టి నిత్యనైమిత్తిక కర్మంబులకు ఇబ్బంది కలుగకుండునట్లు, వాటివాటి కాలములను వాటికిగాను వినియోగపఱచి, తక్కిన కాలములయందు అను ష్ఠింప వలసినవి. ‘‘శ్రౌతస్మార్తా విరుద్ధేషు కాలేషు జపమాచ రేత్’’ (శ్రౌతస్మార్తకర్మంబులకు ఇబ్బంది కలుగకుండునట్లు తక్కిన కాలములయందు జపము నొనర్చునది) అని శ్రీనార దమహర్షి మొదలగు వారు చెప్పియున్నారు. ‘‘హుత్వాగ్ని నగ్నిహోత్రాదా వుక్తం కాలమపి క్షిపన్’’ (అగ్నిహోత్రాది కర్మంబులకుగాను యేర్పఱుపఁబడినట్టి కాలమున అగ్నిలో

హోమముఁ జేయునది.) అని సంగిపురపు నంబిగారును సా
యించియున్నారు. శ్రీ భాష్యకారులవారును అంతిమ దశ
యందును కష్టపడి లేచి నిల్చొని సాయంకాలమున అర్ఘ్యప్ర
దానముఁ జేసియున్నారు. కాఁబట్టి వర్ణాశ్రమ ధర్మంబులు ఔ
పాధికంబులని తలంచి, వాటిఁ ద్యజించుట పూర్వుల యనుష్ఠా
నాదులతో విరోధించును. ఒకవేళ, అట్లుతలంచి, వాటిఁ ద్యజిం
చినట్లయిన. దేహేంద్రియాద్యు పాధులున్ననే తప్ప, మాలలఁ
గట్టుట, దీపములఁ బెట్టుట, మొదలగు కైంకర్యంబుల నొనర్చు
ట యసంభవము గాన, అవియున్నియును ఔపాధికంబులై (ఒక
యుపాధిని బట్టి యుండునవియై) త్యాజ్యంబులు కాఁగలవు. అట్టి
కైంకర్యంబులకై యాశపడునట్లయిన, వాటి నొనర్చుటకుఁ
గావలసినట్టి యోగ్యతఁగలుగఁ జేయునవియగు శౌచ, ఆచార
సంస్కారాదులనున్ను విడనాడకూడదు. అట్లయినచో

శ్లో॥ ఆహార గ్రహమంత్రార్థ జాత్యాది నియమైర్యుతః।
కుర్యాల్లక్ష్మీశకైంకర్యం శక్త్యానన్య ప్రయోజనః॥

తా॥ ఆహారనియమము ప్రతిగ్రహనియమము మంత్రార్థ
జాత్యాది నియమంబులతోఁ గూడియుండి ఫలము నపేక్షింపక
యథాశక్తి శ్రియఃపతియొక్క కైంకర్య మొనర్చునది.

శ్లో॥ మంగళ్యసూత్ర వస్త్రాదీన్ సంరక్షతి యథావధూః।
తథాప్రపన్నః శాస్త్రీయ పతికైంకర్యపద్ధతిం॥

తా॥ స్త్రీ మాంగల్యమును వస్త్రమును మొదలగు వాటిని
కాపాడుకొనునట్లు, ప్రపన్నుండును శాస్త్రీయంబగు భగవ
త్కైంకర్య పద్ధతిని కాపాడునది.

శ్లో॥ యథామంగళ్య సూత్రాదేస్త్యాగే సంరక్షణేపి వా।
రక్షేన్నిరోధైరోధైగైర్వాపతిస్తద్వదిహాపి నః॥

తా॥ భార్య మంగళసూత్రాదులను త్యజించి నట్లయిన, భర్త కోపించుకొనునట్లును, వాటిని కాపాడుకొనినట్లయిన, భర్త సంతోషపెట్టునట్లును, శాస్త్రీయంబగు కైంకర్యపద్ధతిని విడనాడునప్పుడును, దానిఁ గాపాడు కొనునప్పుడును భగవంతుండును ఈచేతనుని విషయమునను న్నట్లు ప్రవర్తించునని యెఱుంగునది.

శ్లో॥ అవజ్ఞార్థ మనర్థాయ భక్తజన్మాదిచింతనం।
శాస్త్రవ్యవస్థామాత్రార్థం సతు తద్దూష్యతిక్వచిత్॥

తా॥ అవమానింపవలయుననెడి యుద్దేశముతో భక్తుల జాత్యాదులను విచారించుట యనర్థకరము. శాస్త్రవ్యవస్థకుగాను విచారించుట దూషణార్థము కాఁజాలదు.

శ్లో॥ అత ఏవహి శాస్త్రేషు తత్తజ్జాత్యైవదర్శితాః।
ధర్మవ్యాధ తులాధారశబరీ విదురాదయః॥

తా॥ కావుననే ధర్మవ్యాధుండు, తులాధారుండు, శబరీ, విదురాదులు వారివారిజాతితోఁగూడనే శాస్త్రమునఁజెప్పఁబడి యున్నారు.

శ్లో॥ స్వజాత్యనుగుణైవైషాంవృత్తిః ప్రైతిహాసికీ।
విశేషవిధి సిద్ధంతు తద్బలాత్తత్ర యుజ్యతే॥

తా॥వారివారి జాతి కనుగుణమైనది గానే వారివారి వృత్తియును ఇతిహాసములయందుఁ జెప్పబడినది. విశేషవిధియందు జెప్పఁబడినది యట్టి విశేషవిధిబలమువలన దానికి తగినట్లు గొనఁబడును.

శ్లో॥ దేశకాలాధికార్యాది విశేషేషువ్యవస్థితాః।
నధర్మాః ప్రాప్తి మర్హంతి దేశకాలాంతరాదిషు॥
తా॥ దేశ, కాల, అధికారములనుబట్టి విధింపఁబడినట్టి ధర్మములు దేశకాలాంతరములయందు ఆచరింపఁదగినవికావు.
శ్లో॥ కేచిత్తత్తగు పాఖ్యానతాత్పర్య గ్రహణాక్షమాః।
కలికోలాహల క్రీడాం వర్ధయంతి రమాపతేః॥
తా॥ భగవంతునిగుఱించి యీయాయితిహాస పురాణాదులయందుఁ జెప్పఁబడినట్టి యుపాఖ్యానముల యుద్దేశము నెఱుఁగనివారు (స్వకల్పనలవలన) కలిమాహాత్మ్యమును వృద్ధి పఱచుచున్నారు.
శ్లో॥ మాతృభిఃపితృభిశ్చైతాః పతిభిర్దేవరైస్తథా।
పూజ్యా భూషయితవ్యాశ్చ బహుకల్యాణ మీప్సుభి॥
తా॥ సంపత్సమృద్ధిని గోరునట్టివారగు అత్త, మామ, భర్త బావమరుదులు వీరిచే యింటికోడండ్రు యాదరింపవలసిన వారును, వస్త్రభూషణాదులచే నలంకరింప వలసినవారును.
శ్లో॥ జామయోయానిగేహాని శపంత్య ప్రతిపూజితాః।
తానికృత్యాహతానీవ వినశ్యంతి సమంతశః॥
తా॥ ఇట్లు ఆదరింపఁబడనప్పుడు, యే గృహంబులను కోడండ్రు శపించుదురో, ఆగృహములు ఘాతపడిచేసిన గృహములవలెనే నశించి పోఁగలవు.
శ్లో॥ ఏవమాదిషు పూజోక్తిర్యథాచిత్యాన్నియమ్యతే।
భక్తమ్లేచ్ఛాది పూజోక్తిరేవ మేవనియమ్యతాం॥
తా॥ ఇవ్విధముగ కోడండ్రు మొదలగువారిని గౌరవింపమనిచెప్పినట్లు, భగవద్భక్తులైనట్టి ఛండాలులు మొదలగు

వారిని యాదరింపమని చెప్పియున్నది. ఇంతియెకాని, (అంత
మాత్రమున వారి తీర్థప్రసాదముల నంగీకరింప కూడదు)

ఇవియన్నియును శిష్టులగు వారియొక్క యనుష్ఠానము
వలననున్ను సిద్ధింపఁగలవు. కావున తనయొక్క వర్ణాశ్రమం
బుల కనుగుణంబులగు నియమంబులతో భగవత్కైంకర్య
మొనర్చుట పరమైకాంతిత్వమునకు విరుద్ధముకాదు.

శ్లో॥ సాక్షాల్లక్ష్మీపతావేవ కృతం కైంకర్యమంజసా।
సారకల్కవిభాగేన ద్విధా సద్భిరు దీర్యతే।

తా॥ సాక్షాత్తుగ లక్ష్మీపతి విషయమునఁనొనర్చునట్టి కైంక
ర్యమును సారంబనియును కల్కంబనియును రెండు విధము
లైనట్టి దానినిగాను సత్పురుషులు చెప్పుచున్నారు.

శ్లో॥ కృతకృత్యస్యకైంకర్యంయదనన్య ప్రయోజనం।
కుర్వాదిరక్షణార్థం వా తత్సారం సంప్రచక్షతే॥

తా॥ కృతకృత్యుఁడు అనన్య ప్రయోజనముగా నొనర్చు
నట్టి కైంకర్యమును, అథవా ఆచార్యసంరక్షణార్థ మొనర్చునట్టి
దానినిన్ని సారంబని చెప్పుదురు.

శ్లో॥ డంభార్థం పరపీడార్థం తన్నిరోధార్థమేవవా
ప్రయోజనాంతరార్థంవా కైంకర్యం కల్కఇష్యతే॥

తా॥ స్వోత్కర్షను తెలుపుటకై కాని, ఇతరులను బాధించు
టకై కాని, అడ్డుపఱచుటకై కాని వేఱొక్క ప్రయోజనమునకై
గాని యొనర్పఁబడునట్టి కైంకర్యమును కల్కమని చెప్పుదురు.

పరమైకాంతులు కాని వారు ఒనర్చునట్టి కైంకర్యము
ను భగవంతుఁడు తన పాదములతో గైకొనుననియు, పర
మైకాంతులైనట్టి వారొనర్చునట్టికైంకర్యమును తన శిరస్సుతోఁ

గ్గొనుననియును ‘ తత్సర్వం దేవదేవస్య చరణావుపతిష్ఠ తే’ అనియు, ‘యాః క్రియాస్సంప్రయుక్తాస్స్యుః ఏకాంతగతబుద్ధిభిః। తాస్సర్వాశ్శిరసా దేవః ప్రతిగృహ్ణాతి వై స్వయం’ అను తావులశ్రీ వేదవ్యాసుండును తెలిపియున్నాడు, ఇట్లు ఈతండు భగవదాజ్ఞచే నొనర్చునట్టి నిత్యనైమిత్తిక కర్మంబులును, భగవదనుజ్ఞచే వానికి సంతోషముం గలుగఁ జేయుటకై యనుష్ఠింపఁబడునవి యనెడి వైభవముగలకైంకర్యంబులును ఈ ప్రవృత్తితో సంబంధ మెంతమాత్రము లేనివి యనెడి విషయము ‘‘సర్వధర్మాన్ పరిత్యజ్య’’ అను విధానమువలన సిద్ధమగుచున్నది,

శ్లో॥ అతశ్శక్యాని సర్వాణి న ప్రపత్త్యర్థమాచరేత్।
అశక్యేషు చ సామర్థ్యం న తదర్థం సమార్జయేత్॥

తా॥ కావున శక్యంబులైనట్టి కర్మంబుల నన్నింటిని ప్రపత్తికిగాను ఆచరింపనక్కరలేదు. శక్యంబులయిన వాటి ననుష్ఠించుటలో సామర్థ్యమును ప్రపత్తికిగాను సంపాదించుకొన నక్కరలేదు.

ఈపైని చెప్పినట్టివిధయన అర్థము చేసికొనునప్పుడు, అధికారంబగు ఆకించన్యము ‘మా శుచః = దుఃఖపడకుమా’ అను వాక్యముచే సూచింపఁబడుచున్నది.

అనువాద పక్షమునందు, తనకు శక్తిలేనందువ విడనాడిన వాటినితప్ప, శక్యంబులై యొనర్పఁబడునట్టి యనుజ్ఞా పరిపాలనాదులున్న ప్రవత్తితో సంబంధము లేనివనెడి విషయము ‘‘ఏక’’ శబ్దముచేఁ దెలుపఁబడినది కాఁగలదు.

ఈ పక్షమున, ‘ మా శుచః ’ అను వాక్యము ‘‘సర్వధర్మాన్ పరిత్యజ్య’ అను తావునఁ దెలుపఁబడినట్టియధికారమును

విశదపఱచుచు, పైనిచెప్పఁబోవునట్టి నిర్భరత్వాములను పుర స్కరించుకొని ప్రపత్త్యుత్తర కాలమున ఈతండు ప్రవర్తింప వలసినట్టి విధమునంతయును సూచింపఁజేయుచున్నది.

త్యాగవిధి పక్షమునకు ప్రమాణవిరోధము రాకుండు నట్లు, ఇంకను కొన్నిమార్గములు కలవు, ఎట్లనిన,

శ్లో॥ ఆత్మాశక్త్య వృథాయాస నివారణమిహాపివా।
లజ్జాపురస్సరత్యాగ వాదోప్యత్ర నియమ్యతాం॥

తా॥ లోకు లేమందురోయని సిగ్గుపడుచు తనకు దుష్కరంబులైనట్టివాటిని విడనాడమని 'పరిత్యజ్య' అనుదానికి అర్థము కాఁగలదు.

శ్లో॥ స్వదుష్కరేషు ధర్మేషు కుశకాశావలంబతః।
ఆశావేశానువృత్తిర్వా త్యాగోక్త్యా వినివార్యతే॥

తా॥ తనకు దుర్లభంబులగు ధర్మంబుల ననుష్ఠింపఁజాల నప్పుడు, దర్భలు దొరకనప్పుడు వాటికిబదులుగా రెల్లును ఉప యోగపఱచుకొనునట్లు, వాటికి బదులుగా వేఱొక్కధర్మము నాచరించుచు వాటియెడలఁ బ్రీతియున్నచో, చాలుననుటయును 'పరిత్యజ్య' అనుదాని యర్థము.

శ్లో॥ అవిశిష్టఫలత్వేన వికల్పోయశ్చ సూత్రితః।
తన్ముఖేనాపి వాత్రేష్టం బ్రహ్మాస్త్రన్యాయసూచనం॥

తా॥ భక్తిప్రపత్తులకు ఫలమునందు తారతమ్యము లేనం దున నవి పరస్పరము సాపేక్షితంబులు కావని బ్రహ్మసూత్ర ములయందుఁ జెప్పియున్నందున నైనను, బ్రహ్మాస్త్రన్యాయ ప్రకారము వీటిలో నొక్కటి వేఱొక్కదాని కంగము కాదు.

అశక్యంబులైనట్టి వాటి ననుష్ఠించుటకై ప్రవర్తించినట్టి వానిని వాటిని విడనాడమని చెప్పుటయును, దుష్కరంబులైనట్టివాటిననుష్ఠింపవలయునని కోరికగలవానిని అట్టివాటిననుష్ఠింపవలదని తెలుపుటయును, బ్రహ్మసూత్రములయందు వికల్పించి చెప్పియున్నట్టి యుపాయంతరములలో నొక్కదానిని దీనికంగముగాఁగొనినట్లయిన, బ్రహ్మాస్త్రబంధన్యాయప్రకారము విరోధించుననుచు నిషేధించుటయును త్యాగ విధ్యర్థంబులు.

శ్లో॥ అతోఽశక్తాధికారత్వ మాకించన్యపురస్క్రియా।
అనంగభావో ధర్మాణా మశక్యారంభవారణం॥

తా॥ కావున ఆకించన్య పూర్వకముగ అశక్తుండగుటయును, ధర్మంబులెవ్వియును ప్రపత్తికంగము కాకపోవుటయును, అశక్యంబులైనట్టివాటి నారంభింప వలదనుటయును "పరిత్యజ్య" అనుదాని యర్థములు.

శ్లో॥ తత్ప్రత్యాశాప్రశమనం బ్రహ్మాస్త్రన్యాయసూచనం।
సర్వధర్మపరిత్యాగ శబ్దార్థస్సాధు సమ్మతః॥

తా॥ బ్రాహ్మాస్త్ర న్యాయప్రకారము ప్రపత్తికెద్దియైన యంగమా? యనెడి తలంపున్ను కూడదనుటయే "సర్వ ధర్మాన్ పరిత్యజ్య" అనుదాని యర్థము.

శ్లో॥ దేవతాంతర ధర్మాదిత్యాగోక్తేరవిరోధినీ।
ఉపాసకేపి తత్యాగా ద్విహానానవిశేషితా॥

తా॥ ప్రపన్నునికి దేవతాంతర ధర్మాదులను విడనాడమని చెప్పుట విరుద్ధము కాదు, అది యుపాసకులకున్ను సమానమే కదా! వీరి విషయమున విశేషమేమున్నది?

శ్లో॥ ఉపాయాపాయసంత్యాగే॥

తా॥ ప్రపత్త్యుపాయమునకు విరుద్ధంబులైనట్టి వాటిని విడనాడు నది.

ఈ తావున( జెప్ప(బడినట్టి ఉపాయత్యాగమున్ను ఈ పైని గన(బఱచిన విధమున నిర్వహించుకొనవలసినది.

మూ॥ మూండ్రాలుమఱియాతనిల్ ముయలవేండా, మున్నమితి
లాశైతన్నై విడుకైత్తిణ్ణ్మై, వేండాతుశరణనెఱివేఱోర్
కూట్టు, వేండిలయునత్తిరమొన్ఱిల్ వెళ్కినిఱ్కుమ్,
నీండాకునిత్తిరమతియోర్ నెఱియిఱ్కూడా, నిన్ఱనిమెత్తు
కైయాకవెన్ఱన్నాతమ్, పూండాలున్నిణక్కశెల్లామె
ఱుప్పెన్నెన్ఱవణ్ణియనార్పుకళ్గనైత్తుమ్పుకళువోమే॥

తా॥ (అవలంబించినను, అశక్యంబులైనట్టి వాటినను ష్ఠించుట కవలంబింపకుము. ముందుగనే యశక్యంబులైనట్టి వాటికై యాశపడకుండుట వివేకమువలని ప్రయోజనము. భరన్యాసరూపంబగు శరణాగతివేఱొక్కదానిసహాయమునపే క్షింపదు. ఆంజనేయుని బంధించినట్టి బ్రహ్మాస్త్రమునకు సహాయ భూతములుగా నుండుటకై రాక్షసులొనర్చినట్లు, భ్రమించి ప్రపత్తికంగముగ దేనినిన్ని యనుష్ఠింపకుము. చిరకాలసాధ్యం బగు భక్తియోగమన్ననో, దాని ననుష్ఠించుటకు శక్తిగలవారు అవలంబించునట్టిది గాన, దాని నవలంబింపక, ఆకించన్యమును పురస్కరించుకొని నన్ను శరణుజొచ్చితివేని, నీయొక్క పుణ్య పాపములను నశింప(జేసెదను' అనియభయమిచ్చినట్టివాడును, సనాతనధర్మంబునగు శ్రీకృష్ణునియొక్క కల్యాణ గుణములను పలుమాఱు స్తుతించుచున్నాము.

ప్రథమ పాదార్థము ముగిసెను.

శ్లో॥ స్వతంత్రస్యాపినైవస్యాదాశ్రయోదుర్లభస్యతు
అస్వతంత్రాత్ఫలంనస్యాత్సులభాదాశ్రితాదపి॥

తా॥ స్వతంత్రుండైనప్పటికిన్ని దుర్లభుండైనట్లయిన ఆశ్రయించుటకష్టము. స్వతంత్రుండుకాని వాఁడు సులభుండయినందున ఆశ్రయించినప్పటికిన్ని, వానివలన ఫలము కలుగఁజాలదు.

శ్లో॥ అస్వతంత్రే న కైంకర్యం సిద్ధ్యేత్తైస్స్వరప్రసంగతః।
దుర్లభేసాధ్యమప్యేతన్నహృద్యంలోకనీతితః॥

తా॥ మనము యిష్టమువచ్చినట్లు ప్రవర్తింపవచ్చును గాన, స్వతంత్రుండు కాని వాని విషయమున నోనర్పంబడు బట్టి కైంకర్యము సిద్ధింపదు. దుర్లభుండైనట్టి వాని విషయమున కైంకర్యము సిద్ధించినను, లోకప్రసిద్ధినిబట్టి యది యంత రుచికరంబైనది కాదు.

కావున కేవలము సులభంబులగు తృణాదులవలెనే కాకుండ శ్లాఘ్యుండై, దుర్లభంబైనట్టి మేరువుపలెఁగాకుండ సులభుండై పరుండగు శరణ్యుండు (సర్వేశ్వరుండు) ఆశ్రయణీయుండై, ప్రాప్యుండుగానై యున్నాఁడు. ఈ రెండు పదముల చేతను సర్వరక్షకుండగు సర్వశేషి రక్షించుట కవకాశము కై నిరీక్షించుచుండునట్టి స్థితి తెలుపఁబడుచున్నది. ఇట్లు అవకాశముకై నిరీక్షించుచున్నట్టి సర్వేశ్వరుండు ,,రక్ష్యాపేక్షాం ప్రతీక్షతే'' అన్నట్లు వీరు మనల నెప్పుడు రక్షింపుమనికోరుదురా? యనుకొనుచు సంసిద్ధుండుగానుండునట్టి స్థితి 'మాం' అనుపదముచే సూచింపఁబడుచున్నది. పరిశుద్ధంబైనట్టి ఆభరణమును వలెనే మనము వీరినెప్పుడు అంగీకరించుదుమా! యను

అభిప్రాయముతో త్వరపడుచు, తనదిగాఁదలంచుకొని ఫలము
నొసంగుటకై సంసిద్ధుండుగానుండునట్టి స్థితి "అహమ్" అను
పదముచేఁ దెలుపఁబడుచున్నది.

ఇవ్విధమున అకించనుండైనట్టియధికారినుండి యథావిధిగ
రక్షాపేక్షాపూర్వకంబగు భరన్యాసమును తప్ప, వేఱొక్క
దానినపేక్షింపనట్టి సిద్ధోపాయమును (భగవంతుని) "మా
మేకం" అనుదానిచేఁదెలిపి, అందువలన వశీకరణార్థంబగు
సాధ్యోపాయమును "శరణం వ్రజ" అను విధిచేఁ జూపించు
చున్నది.

ఇవ్విధముగ విధింపఁబడునట్టి ప్రపత్తిరూపవిద్యకు, సర్వేశ్వ
రునికి సంతోషముఁ గలుగఁజేయునదిగాను విధింపఁబడుటచే
వచ్చునట్టి యుపాయత్వము భక్తియోగతుల్యము. దీనిమూ
లముగ ప్రసన్నుండయినట్టి యీశ్వరుండు మోక్షమునకు సా
క్షాత్తుగ ఉపాయము. ఈ విద్యయందు విశేషించి తెలిసికొన
వలసినట్టి యాకారము నిరపేక్షోపాయత్వము. దీనికి యుపయు
క్తంబులగు ఆకారంబు లన్నియును "మామ్ ఏకం" అనుపద
ములయందు వివక్షింపఁబడుచున్నవి.

"ఏష నారాయణః శ్రీమాన్" ఇత్యాది తావులఁజెప్పి
యున్నట్టి విధముననుండునట్టి శరణ్యుని (భగవంతుని) తెలు
పునట్టి "మాం" అనుపదముచే తిరుమంత్రమునందును, ద్వ
యమునందును దెలియవచ్చునట్టి సర్వరక్షకత్వమును, సర్వ
శేషిత్వమును, శ్రియఃపతిత్వమును, నారాయణత్వమును, వీ
టినిబట్టి తెలియవచ్చునట్టివై, పరత్వ సౌలభ్యంబులకు ఉపకార
కంబులైయుండునట్టి సర్వజ్ఞత్వ, సర్వశక్తిత్వాదులును, పరమ

కారుణికత్వ, సౌశీల్య, వాత్సల్యాదులును, ద్వయమందుండు ద్వివచనాంత ( చరణౌ అను ) పదము చేఁ దెలియవచ్చునదై, శుభాశ్రయంబును, పరత్వసౌలభ్యవ్యంజకంబునగు పార్థసారథి (శ్రీకృష్ణుని) యొక్క దివ్యమంగళ విగ్రహమును తెలుపఁబడు చున్నవి.

ఈ తావుననే ‹‹నికరిల్ పుకళ్ఱాయ్'' ఇత్యాది తావులఁ జెప్పఁబడునట్టి వాత్సల్య, స్వామిత్వ, సౌశీల్య, సౌలభ్య రూపంబగు ఈ గుణచతుష్టయమును, పూర్వము దయతలచ కూడని సందర్భమున దయతలచుట యీ మొదలగు వాటిచే వ్యాకులచిత్తుండైనట్టి యర్జునుని అనాదరింపకుండుటం జేసియును, ‹‹మత్తః పరతరంనాన్యత్'' (నాకంటెను పరాత్పరంబైనది యొద్దియును లేదు) అని తానే స్వయముగ తెలిపియున్నందునను, ఓ కృష్ణుఁడా! ఓ యాదవుఁడా ! రథము నిలుపుము ! అని యివ్విధమున నియమింపఁబడునట్టి వాఁడుగానుండి సారథ్యాదులనొనర్చుటం జేసియును, విశ్వరూపముఁ జూడవలయునని యాశపడినంతే మాత్రమున దానిఁజూపించి మరల మున్నున్నట్టి సౌమ్యవిగ్రహమును జూపింపమన్నతోడనే సారథియై నిలుపఁబడియున్నందునను, తెలుపఁబడినది.

పైనిచెప్పిన శరణ్య (భగవంతుని) గుణంబులలో, ఆశ్రితులను రక్షించుటకుగాను ప్రధానంబులయినవి ‹‹సర్వజ్ఞోపిహివిశ్వేశస్సదా కారుణికోపి సన్'' (సర్వేశ్వరుండు సర్వజ్ఞుండైనను, ఎల్లప్పుడును కరుణగలవాఁడు) అని భగవచ్ఛాస్త్రమునందును, ‹‹త్వత్ జ్ఞానశక్తికరుణాసు సతీషు'' (నీయొ

క్క జ్ఞానమును, శక్తియును, కరుణయును ఉండఁగా) అను పెద్దల వచనమునందును తెలుపఁబడినవి.

ఈ మూడింటిలోను జ్ఞానశక్తులు నిగ్రహానుగ్రహము లు రెంటికిన్ని సాధారణముగ ఉపయోగపడునవి. స్వామిత్వమున్ను ఈచేతనుని లీలోపకరణముగాఁ జేయుటకుగాని, (సంసారములోనుంచుటకుగాని) భోగోపకరణముగాఁ జేయుటకుగాని (పరమపదమున నుంచుటకుగాని) సామాన్యముగ ఈ రెంటికిన్ని ఉపయోగపడునదియగుటను బట్టి జ్ఞానశక్తులను ఈ జీవుని రక్షించుటలో ముఖ్యములైనట్టి వాటినిగాను నియమించు మండలేదు.

కారుణ్యమును, దీనిఁబట్టియుండునట్టివియగు సౌశీల్య సౌలభ్యములు ౨ అనుగ్రహమునకు ముఖ్యములు. ఇట్లు ఈ కారుణ్యమురెుక్క తారతమ్యముఁగనినట్టి పూర్వాచార్యులు "సోహం తే దేవ దేవేశ నార్చనాదౌ స్తుతౌ న చ సామర్థ్యవాన్ కృపామాత్ర మనోవృత్తిః ప్రసీద మే" (ఓ స్వామీ! నిన్ను అర్చించుటకును, స్తుతించుటకును నేను సమర్థుండను కాను. నాయందు కృపవలన ప్రసన్నుండ వగుమా!) అనియు "నిన్నరుళే ఎర్ద్దరున్దేన్" (నీయొక్క కృపనే యపేక్షించియున్నట్టివాఁడను) అనియు "తుణిమేనిని నిన్నరుళ్లు తెనక్కు" (నీయొక్క కృపనుదప్ప యుత్తారకంబైనట్టి దాని నెద్దియు నెఱుంగను) అనియు "ఉన్నరుళే పార్పనడియేన్" (నీయొక్క కృపకై యెదురుచూచుచున్నట్టి దాసుండను) అనియు "తిరుమామకళై ప్పెఱ్ఱుమెన్నెంజంకోయిల్కొండ పేరరుళాళన్" (సర్వోత్కృష్టురాలగు లక్ష్మిని బొంది యుండియును, అతినీచం

నగు నా హృదయమునందుండునట్టి దయాళువా!) అని యు ‘‘నిన్నిరువరుళాలన్నిరికాక్కప్పటితు’’ (నీకృపవలనఁదప్ప వేఱొక్కవిధమున నాకు రక్షణము గలుగదు) అనియు ‘‘నిన్నిరువరుళున్ పంకయత్తాళ్ తిరువరుళుమ్’’ (నీకృపయును పిరాట్టియొక్క కృపయును) అనియు ‘‘ఆహావెన్ఱిరంగళ్ శెయ్తు’’ (అయ్యో! అని నన్ను దయతోఁజూచి) అనియు, ‘‘కృపయా కేలమాత్మసాత్కురు’’ (నీకృపవలననే నన్ను నీదానునిగాఁగొనుము) అనియు ‘‘కరీశ తేషామపి తావకీనయా తథా త్వత్కృత్సేవతు మే బలంమతం’’ అనియును ఇవ్విధముగ ఈ కృపాగుణమును రక్షకమునుగా ననుసంధించుకొని సంబంధమునున్ను గుణాంతరంబులనున్ను కారుణ్యమునకు పరతంత్రంబులైనట్టి వాటినిగాఁజేసి, తాము కారుణ్యమునే ముఖ్యముగ అనుసంధించుకొనునట్టి వారై యుండిరి.

పిరాట్టియును, తక్కిన గుణములెన్నియో యుండఁగా, ‘‘వధార్హమపి కాకుత్స్థః కృపయా పర్యపాలయత్’’ (కాకాసురుండు వధార్హుండైనను, శ్రీరామచంద్రుండు వానిని కృపవలన రక్షించినాడు) అని చెప్పియున్నది.

గద్యయందును ‘‘మదీయయైవ కృపయా’’ అని చెప్పియున్నందున కృపయొక్క ప్రాధాన్యము వివక్షింపఁబడినది.

ఇట్లు ఆశ్రితరక్షణమునకు ప్రధానములుగానును, సహాయకములుగాను నుండునట్టి సర్వాకారంబులతోనును గూడియున్నట్టి తాను ఎదురుగానిలువఁబడియుండి ‘‘మాం=నన్ను’’ అని చూపించుచున్నాడు.

"మాం" అను తావుననుండు ఏకవచనముచేతనే ఏకత్వము తెలియవచ్చుచుండ, మరల "ఏక" శబ్దమును ప్రయోగించుట "ఏనక్కేతన్నై తన్ద కర్పకం" (నాకే తననిచ్చినట్టి యుపకారకుండు) అని పాడినట్లు, ప్రాప్యుండగు తానే ప్రాపకమును నగుటంజేసి, ఉపాయ ఫలంబులకుంగల యైక్యముం దెలుపుటకుగా ననియును అర్థము చేసికొనుట కద్దు. ఈ యర్థమునకు "మామేకమేవశరణం" అనిసమానప్రకరణముననుండునట్టి వాక్యమున్ను అనుకూలముగా నుండగలదు, ఏవకారముండియుండగామరల 'ఏక' శబ్దమున్ను ఉన్నట్టి తావున అవధారణార్థమును తప్ప వేఱొక యర్థముం గొనుట యుచితమే.

ఇంతియె కాక "ముఖ్య, అన్య, కేవలేషు 'ఏకం'" అను నిఘంటువు ప్రకారము అనేకార్థములుగల "ఏక" శబ్దము ఈ తావున కేవల శబ్దార్థముం దెలుపునదియై, 'మామేవయే ప్రపద్యంతే' 'తమేవశరణంగచ్ఛ' ఇత్యాదితావులయందు వలెనే అవధారణార్థమై శరణ్యగుణ పౌష్కల్యముచే స్వస్వాతంత్ర్యాదులను నివర్తింపఁజేయునని కొందఱు చెప్పుదురు. అదియెట్లనిన, స్వరక్షణకు ఉపయుక్తంబులైనట్టివశీకరణంబులను (ప్రపత్త్యాదులను) శాస్త్రనియుక్తుండగు తాను అనుష్ఠించుటచే రక్షణము విషయమున తనకున్ను కర్తృత్వమున్నట్లు తలంచి సిద్ధోపాయభూతుం శరణ్యుని (భగవంతుని) తోఁ బాటు తననున్ను ఉపాయభూతుడగునిగా దలంపఁబూనఁగా, నిట్లు ప్రసక్తంబైనట్టి యుపాయద్వైవిధ్యమును 'ఏకం' అను శబ్దము నివర్తింపఁ జేయుచున్నది,

అది నివర్తింపఁబడుట యెట్లంటివేని 'కర్తా శాస్త్రార్థవత్త్వాత్' అను బ్రహ్మసూత్ర ప్రకారము జీవునికి కర్తృత్వముం

డుట ప్రామాణికంబేమైనను, అది పరాధీనంబై, అల్పవిషయంబై ప్రతిహతియోగ్యంబైయ్యును ఉండును, కావున ఈతండు ఉపాయానుష్ఠానమొనర్చినను 'వరద తవ ఖలు ప్రసాదాదృతే శరణమితి వచోపి మే నోదియాత్' (స్వామీ నీయనుగ్రహము లేకున్నట్లయిన, శరణాగతుండనను మాటనైనను చెప్పుటకు నేను సమర్థుండను కాను) అని సాయించియున్నట్లు అది అతనికి టూత్తము [illegible]లముగ వచ్చునదియైనందున వానిచేఁ ప్రేరేపింపఁబడినట్టివాఁడై వాని సహాయము లేకున్నట్లయిన, దాచుటకును ముడుచుకొనుటకున్ను అసమర్థుండై, వాఁడొసంగినట్టి దేహేంద్రియంబులఁ గొని, వాడు జూపించినట్టి యుపాయమును వాని సహాయము జేయఁగా ననుష్ఠించి, వాఁడొసంగఁబోవునట్టి ఫలంబునకై యెప్పుడా! యని చాతక పక్షివలెనే యెదురుచూచుచున్నట్టి యీతండు, సర్వమును తన స్వాధీనములో నుంచుకొనియున్నట్టి వాఁడును, అడ్డులేని కర్తృత్వము గలవానితో (భగవంతునితో) తుల్యముగ వేఱొక్క సిద్ధోపాయముగా నుండుటకుగాను కోరుట యనునది వివేకియగు ముముక్షువుకు ఉచితము కాదని 'ఏకం' అను శబ్దము తెలుపుచున్నది.

ఈ పైని చెప్పిన విధమున, సాధ్యోపాయంబగు ప్రపత్తి నిన్ని సిద్ధోపాయముతో నొక కోవలో నుంచునట్టిదానినిగా నెన్నకూడదని 'ఏకం' అను శబ్దము తెలుపుచున్నదని మరి కొందరు చెప్పుదురు. అది యెట్లనిన, ఈ ప్రపత్తియును భక్తి యోగమువలెనే భగవంతునికి సంతోషకరమైనట్టిదిగా విధింపఁ బడినట్టిదియే యైనను, సహజకారుణ్యాది విశిష్టుండగు సర్వేశ్వరునియొక్క కాలుష్యమును (కోపమును) శమింపఁజేయుటకు

గాను మాత్రమేయై, సహజ సామర్థ్య కారుణ్య విశిష్టుండగు
సర్వేశ్వరుని సంకల్పమే సాక్షాత్తుగ ఫలమునకు కారణంబై
వాడే మిక్కిలి అకించనుండగు ప్రపన్నునికి, భారమునంత
యును తనపై బెట్టుకొనినందున, భక్తియోగాది రూపము
లగు సుకరతరోపాయంబులస్థానమునను౦డి, యీ యానుకూల్య
సంకల్పాది విశిష్టంబగు ప్రపత్తిమాత్రమగు వ్యాజమునొక
దాని నపేక్షించునట్టివాఁడై వేఱొక్కదానియం దపేక్షలేనం
దున నిరపేక్షోపాయత్వమునే యీ న్యాసవిద్యకు(ప్రపత్తికి) వే
ద్యాకారమునుగాఁగొని ‘త్వమేవోపాయ భూతో మేభవ’(నీవే
నాకు ఉపాయముగానుండుము) అని యపేక్షింపవలసినట్టివాఁ
డుగా నుండఁగా, ‘ఎన్నుణర్విన్నుళ్ళే యిరుత్తినేనతువుమవనతిన్న
రుళే’ (భగవంతుని నేను నామనస్సులో నుంచుకొన గలిగిన
దియును వానియొక్క కృపయే) అనియు, ‘ఇశైవిత్తెన్నై యున్నా
ళిణైక్కీ ళిరుత్తుమమ్మానే’ (స్వామీ! నీవే నన్ను వొప్పించి నీ
శ్రీపాదములతోఁ జేర్చుకొనినావు) అనియును సాయించినట్లు,
ఉపాయభూతుండగు సర్వేశ్వరుండు చేయింపగా, చేసియు
న్నట్టి వ్యాజమాత్రమును(ప్రపత్తిని) వానితో సమానముగ ఉ
పాయమునుగాఁదలంచుట యుచితముకాదని తెలుపుట ‘ఏక’
శబ్దముయొక్క తాత్పర్యము.

ఇట్లు సిద్ధోపాయమును(భగవంతుని)బట్టి సాధ్యోపాయము
వ్యాజమాత్రంబై, ప్రధానంబైనదికాకుండయుండునట్టి స్థితినిబట్టి
శరణాగతి యనఁగా సంబంధజ్ఞాన మాత్రమనియు, సిద్ధోపాయ
ప్రతిపత్తిమాత్రమనియు, అనివారణ మాత్రమనియు, అనుమతి
మాత్రమనియు, అచిద్వ్యావృత్తిమాత్రమనియు, చైతన్యకృత్య

మనియు, చిత్తసమాధానమనియు, అధికారివిశేషణమనియు
ను, యివ్విధముగ తప్పచారిని కొందఱువాదించుచుందురు. ఈ
వాదములంగాని వీరుచెప్పునదియే వాస్తవమైనట్టి యర్థంబనియె
ఱుంగందగదు. ఇవియన్నియును 'శరణం వ్రజ' అనువిధికి విరు
ద్ధంబులు కాంగలవు. ఈ వాదమున అతిప్రసంగాది దోషం
బులున్ను కలవు. అదియెట్లనిన, సంబంధజ్ఞాన మాత్రమన్నను,
సిద్ధోపాయ ప్రతిపత్తిమాత్రమన్నను, అది వాక్యమాత్రముచేం
దెలియవచ్చునట్టి జ్ఞానంబైనట్లయిన, అది విధింపంబడవలసినట్టి
ది కాందగదు. విధింపబడునట్టి జ్ఞానమువలననే మోక్షముకలుగు
నని చెప్పునట్టివారి మతంబున యుపాసనాదులు (మోక్షోపా
యముగ విధింపంబడుట) విరోధించునుగాన, వారి మతము
శ్రీభాష్యాదివిరుద్ధము. కావున తత్త్వజ్ఞానముగలిగినవానికిఅటు
పిమ్మట కర్తవ్యంబగు జ్ఞానాంతరంబైనను, ప్రపత్తియొక్క విధి,
లక్షణ, అనుష్ఠానవాక్యములయందుం జెప్పియున్న ప్రకారము, దీని
యొక్క స్వరూపంబని యంగీకరింపవలయును. సిద్ధోపాయ
స్వీకారమనుదానికిన్ని, సిద్ధోపాయమును తెలిసికొనం, యది
తనకు ఉపయోగపడునట్లు (ఫలమునిచ్చునట్లు) చేయునట్టి విధి
ప్రార్థనాపూర్వకముగ భరన్యాసరూపంబగు కృత్యమునందే
కదా యుద్దేశము.

అనివారణమాత్రమనంగా—నివారింపకపోవుట మా
త్రమే యర్థమగు పక్షమున, రక్షకుండగు ఈశ్వరుసి ఈజీవుం
డు యింతకు ముందు ప్రబలుండై నివారించియున్నట్టి వాండై
నట్లయిన, ఈశ్వరునియొక్క యీశ్వరత్వముకు సంకోచముగలు
గును. తాను. ఒనర్చియున్నట్టి యపరాధములమూలముగ ఈశ్వ

రునికి తనయెడల కోపముఁగలుగఁజేసి, యందుమూలముగ ఈశ్వరుని నివారించిననాఁడయినట్లయిన, ఈతండొనర్చునట్టి ప్రపత్తి యట్టికోపమును శాంతపఱచునదియే కావలయును. స్వరక్షణార్థమగు వ్యాపారము నవలంబించుటచే ఈశ్వరుని నివారించినాడంటివేని, వ్యాపారరహితములగు సుషుప్తి ప్రళయాద్యవస్థలయందును, వ్యాపారము నొనర్చుటకు యోగ్యుండుగా నుండునట్టి జాగ్రద్దశయందు ఈతండు నివారింపకయున్నప్పుడున్ను అతండు మోక్షము నొసంగియుండ వలయునని ప్రసక్తించును.

అన మతిమాత్ర మంటివేని, యది యుపాసకునికిన్ని సమానము (అదివానికిన్ని కలదనుట)

అచిద్వైలక్షణ్యమాత్రము ప్రతికూలుండుగా నుండునట్టి సమయమునందును ఉండుటంజేసి, యంతమాత్రమే యాతనిని రక్షించుటకు హేతువు కాఁజాలదు.

చైతన్యకృత్యమంటివేని, ఉపాసనాదులును తక్కిన చేతన కృత్యంబులన్నియును చైతన్యకృత్యంబులగుటంజేసి, దీనికొక యాధిక్యముఁ జెప్పఁదగదు.

చేతనునికి శరణాగతి తనకుతానే రాగలదంటివేని, యందులకుగాను ఉపదేశాదులక్కఱలేక పోవలసివచ్చును.

(1) ఫలానుపయుక్తంబగు చిత్తసమాధానము మాత్రమే

---

(1) ఫలోపయుక్తంబైనట్టిచిత్తసమాధానంబనియు, ఫలానుపయుక్తంబగు చిత్తసమాధానంబనియు నిట్లుచిత్తసమాధానము ద్వివిధము. వాటిలో ఫలానుపయుక్తంబగు చిత్తసమాధానమే శరణాగతియంటివేనియిట్టిచిత్తసమాధానము 'లోకోభిన్నరుచిః' అన్నట్లు ప్రతిపురుషునికిని సర్వేశ

శరణాగతి యెట్టిదేని, యది వారివారి యిష్టానుగుణముగ ప్రతి పురుషునికిన్ని వేర్వేఱుగా నుండగలదు.

"వ్రజ" అనునది విధేయంబై, ఫలమున్ను అందులకుగానగు కోరికయున్ను లేకుండ యుండునట్టి శరణాగతిని (1) యధికారి విశేషణంబని (యోగ్యతయని) చెప్పఁదగదు. కర్తవ్యంబుగాను విధింపఁబడినట్టి ప్రపత్తికే యిప్విధముగ నెద్దియైన నొక వంకపెట్టినట్లయిన, ఉపాసనాదులకున్ను ఇట్లావంక అనుపెట్టవచ్చును. అప్పుడున్ను ఇందుమూలముగ ఉపాసనాదులకంటెనున్ను ప్రపత్తికి వైలక్షణ్యముఁ దెలుపఁబూనినది కొనసాగదు.

తనను మోక్షోపాయమునుగా స్వీకరించుటచే ఫలము నొసంగునదిగానున్నను, ఈ సిద్ధోపాయము అట్టి స్వీకారము విషయమునసున్ను నిరపేక్షంబైనది యని ధ్యానింపవలయునంటివేని, ఇది (2) దృష్టివిధివలెనే ఆరోపితంబుకాని, (3) స్వవచన విరుద్ధంబయినది కాని కాఁగలదు. కావున ఈశ్వరుండు అనుగ్రహము గలుగఁజేయఁబడినట్టి వాఁడై ప్రధానంబైనట్టి

గా నుండునుగాన శరణాగతియును ప్రతిపురుషునికిన్ని వేర్వేఱుగానుండు నది యన్నమాట వచ్చును.

(1) 'స్వర్గకామో యజేత' ఇత్యాదివాక్యములయందు ఫలఫలేచ్ఛాదులను గలిగియుండుట అధికారివిశేషణంబుగాను తెలియవచ్చుచున్నందున అట్టిది కానిదియగు శరణాగతిని అధికారివిశేషణంబని చెప్పఁదగదనుట.

(2) దృష్టివిధియనఁగా — బ్రహ్మముకానిదానియందు బ్రహ్మమనెడి బుద్ధినుంచుట. ఇది 'ప్రాణో బ్రహ్మేత్యుపాసీత' ఇత్యాదివాక్యములయందు విధింపఁబడినది. అది యారోపితముకాని వాస్తవమైనది కాదని భావము.

(3) 'మామేకం శరణం వ్రజ' అను స్వవచనముతో విరోధించుననుట.

సిద్ధోపాయము కాఁగలఁడు. భక్తిప్రపత్తులు రెండును అనుగ్రహమును పుట్టించుటకు సాధనంబులై ప్రధానంబులు కానట్టి సాధ్యోపాయంబులు. ఈ రెంటిలో నొక్కదానియందు అధికారాను గుణముగ స్థిరముగా నుండునది.

అపేక్షితంబైనట్టి ఫలముకు ఉపాయంబులుగాను విధింపఁబడినట్టి సాధనాంతరములను మధ్యనుంచుకొనక అవిలేకుండ, ఈతండు ప్రపత్తిచేసినపిమ్మట ఈతని భారమునంతయును తనపైబెట్టుకొనినట్టి శరణ్యుండు (భగవంతుండు) తానొక్కఁడే యుపాయముగానుండునట్టి స్థితినిబట్టి „ఏక" శబ్దము ప్రయోగింపఁబడినది యని మఱికొందఱు చెప్పుదురు. అది యెట్లనిన, ప్రపత్తినిన్ని చేసి, యనంతరము దాని మూలముగ ఉపాసనాదులనున్ను అనుష్ఠించినట్లయిన, ఫలోపాయము కాఁదగినట్టి వాఁడగు శరణ్యుండు, అకించనుండై మోక్షముగలుగుటలో ఆలస్యమును సహింపఁజాలనివాఁడగు ఈతనివిషయము ప్రపత్తికిన్ని తనకున్ను మధ్యను ఒక దుష్కరంబైనట్టిదాని నాచరింపమనక, ఈతనిభారమును తన గుణములపై యారోపించుకొని „శరణం త్వాం ప్రపన్నా యే ధ్యానయోగవివర్జితాః తేపి మృత్యుమతిక్రమ్య యాంతి తద్వైష్ణవం పదం" (ధ్యానయోగరహితులైనన్ను శరణుఁజొచ్చినట్టివారు సంసారము నతిక్రమించి పరమపదమును బొందుచున్నారు) అనియు „ఆరెనక్కు నిన్పాదమే శరణాక త్తన్దొళిన్దాయ్" (నీయొక్క శ్రీపాదంబులనే రక్షకముగా నొసంగియున్నావు) అనియును సాయించినట్లు గుణవిశిష్టుండగు తానే వేఱొక్క దానిసహా

యమున పేక్షింపక ఫలప్రదుండై యుండునట్టిస్థితి ననుసంధించు కొని, శరణుజొచ్చుచు ! యని 'ఏక' శబ్దముచే చెప్పఁబడినది.

ఇట్లు పరిపూర్ణుండగు తనవిషయమున ప్రపత్తిచేయునప్పుడు ఆనుకూల్యసంకల్పాది విశిష్టంబగు దీనినితప్ప వేఱొక్కయంగ మును దీనియందుపాసనాంతరములయందువలెనే చేర్చుకొని, అదియును భగవత్సంతోషకరంబులగు ఉపాయంబులతోఁ బాటు ఉండునదియనెడి తలంపును పోగొట్టుటకుగాను 'ఏకం' అను శబ్దము ప్రయోగింపఁబడినది యనియును చెప్పుదురు.

భగవంతుని యాజ్ఞానుజ్ఞలచే అనుష్ఠించునట్టి కృత్యంబులన్ని యును ప్రపత్తికి సహాయభూతంబులు కావనియు, ఈ ప్రపత్తిచే వశపఱచుకొనబడినవాఁడనై ఫలమునిప్పించునట్టివాఁడను నేనొ క్కండనే యాత్మరక్షోపాయము (ప్రపత్తి) విషయమున జబా బుదారిగానున్నాననియు, ఈప్రపత్తియొక్క ఫలముకుగాను వేఱొ క్కదానిఁ జేయనక్కఱలేదు, అట్టి దానిని సహాయముగాఁగొని నిన్ను నేనురక్షించుచుండలేను అనియును తాత్పర్యము. ఇందువ లన ఆనుకూల్యసంకల్పాదివిశిష్టంబగు ప్రపత్తితప్ప, ప్రపత్త్యం గంబను పేరుతో తనకొక సహకారి కారణమును తోడుగాఁ జేర్పనక్కఱలేదని చెప్పఁబడినది.

"యేనకేనాపి ప్రకారేణ ద్వయవక్తాత్వం" (ఏదొక విధమున ద్వయమును (ప్రపత్త్యనుసంధానవాక్యమును) అనుసంధించుకొనునది) అనియు, 'ప్రపత్తి వాచైవ నిరీక్షితుం వృణే' (ప్రపత్తి వాక్యముచేతనే నీకై నిరీక్షింపఁగోరుచున్నా డను) అనియును చెప్పియున్నట్లు, సంపూర్ణప్రపత్తికిఁ గావల సిన తెలివితేటలు లేకున్నను, యేదొకవిధముగ అనుష్ఠానము

చేతనే ఫలమునుసాధించి యిచ్చునట్టి యీ ప్రపత్తికిగాను వేఱొక్క సహకారమును సంపాదించుకొనుటకు ప్రసక్తియే లేదు కదా!

"తతస్సాగరవేలాయాం దర్భానాస్తీర్య రాఘవః। బాహుం భుజగభోగాభ ముపధాయారిసూదనః। అంజలిం ప్రాఙ్ముఖః కృత్వా ప్రతిశిశ్యే మహోదధేః॥ (అంతట శ్రీరామచంద్రుండు సముద్రమువద్దను దర్భలను పఱచి, బాహువులఁ జేర్చికొని తూర్పుముఖముగ అంజలిఁ జేయుచు సముద్రమునకు సాష్టాంగముగ దండము సమర్పించెను) అని శ్రీరామచంద్రుండు సముద్రమునకు శరణాగతిచేసినట్టి సందర్భమునను, "స రాజాపరమాపన్నో దేవశ్రేష్ఠమగాత్తదా। శరణ్యం సర్వభూతానాం భక్త్యా నారాయణం హరిం। సమాహితో నిరాహారష్షడ్రాత్రేణ మహాయశాః। దదర్శాదర్శనే రాజా దేవం నారాయణం ప్రభుం" (అంతట ఆరాజు ఆపత్తులోనున్నట్టివాఁడై, భక్తితోఁబోయి ఆఱురాత్రులు నిరాహారియును, జితేంద్రియుండునునై, సర్వభూతశరణ్యుండును, దేవదేవుండునగునారాయణుని అదర్శమున సేవించెను) అనిన స్తవవ్యాఖ్యానమునందు బ్రహ్మదత్తచరిత్రమునందును చెప్పియున్నట్టివిధంబులన్నియును ప్రపత్తి శంగంబులు కావు. ఈ రెండు తావులయందును సాంగములగు ప్రతిశయనాదులు ప్రధానంబు లగుటంజేసి, యీ నియమములను చెప్పవలసియున్నది. ఇవ్విధముననే సాష్టాంగకృతప్రణామము విషయమునసున్న యెఱుంగునది.

ప్రపత్త్యధ్యాయానులయందుఁ జెప్పియున్నట్టియానుకూల్యసంకల్పాది పరికరంబులు తప్ప దీనికి వేఱొక్క నియ

ముం బెద్దియును అక్కఱలేదు. ఆకించన్యమే ప్రధానముగాఁ గలవారగు ద్రౌపది, దమయంతి, రాక్షసీ, శ్రీ విభీషణులవారు, క్షత్రబంధువు, ముచుకుందుండు, పాండవులు, దేవసుముఖుండు, త్రిశంకు, శునశ్శేఫుండు, కిరాతుండు, కాకాసురుండు కపోతాదులు శరణాగతులైనప్పుడు ఆనుకూల్యాదులను తప్ప, వేఱే పరికరంబులను చెప్పియున్నట్లు చూచియుండలేము. మరియు క్షణకాలసాధ్యంబై, వేఱొక్కదాని సహాయము నపేక్షింపనిదియగు ప్రపత్తిమాత్రముచే వెంటనే ఆయా శరణాగతులకు వారివారియభీష్టితంబులు సిద్ధించి యుండుటనున్ను చూచియున్నాము. అట్లే మోక్షార్థము ప్రపత్తి చేసియున్నట్టి తావుననున్ను, ఈతండు కోరినకాలమున ఫలము సిద్ధించుటలో కొరతలేదు. ఇది ''మా శుచః'' అనువాక్యముయొక్క తాత్పర్యము. ''పరిత్యజ్య'' అనుతావున అంగాంతర నైరపేక్ష్యమును చెప్పినట్టి సందర్భమున, ''ఏక'' శబ్దమునందు ఇవ్విధముగ అర్థము చేసికొనుట దానిని దృఢపరచుటకుగాను కాఁగలదు.

దీనికి వేఱొక్కవిధమునను అర్థముచేసికొనవచ్చును. ''ఏక'' శబ్దమునకు ఇది యర్థంబైనట్లయిన, ''పరిత్యజ్య'' అనుదానికి ముందుచెప్పినట్టి యర్థాంతరములనున్ను గొనవచ్చును. పరికరవిశిష్టంబగు ప్రపత్తికి, ఉపాసనాదిరూపములగు అంగిధర్మములను వీటికి అంగభూతంబులగు ధర్మాంతరములనున్ను నిషేధించుట 'పరిత్యజ్య' అనుదానికియర్థంబగునప్పుడు, ఈ 'ఏక' శబ్దము శరణ్యునికి విశేషణంబగుటయెట్లంటివేని, ఆకించనుండగు ఈచేతనునియెడల సర్వేశ్వరునికి అనుగ్రహముఁ గలుగఁ జేయుటకుగాను ప్రపత్తి సాధనంబై తనకుశరణ్యునితో సంబం

థము లేకుండుటను తెలుపుటకుగాను "మామేకం" అని చెప్పఁబడినది.

"సర్వధర్మాన్" అని మొదటి పాదముననుండు "సర్వ" శబ్దమును "సర్వపాపేభ్యః" అని మూఁడవపాదమున నుండునట్టి "సర్వ" శబ్దమునున్నుబట్టి ఈ "ఏక" శబ్దముసర్వశబ్దముకుప్రతి సంబంధిగా (వ్యతిరిక్తార్థముగా) నుండునదియనియును చెప్పుదురు.

అట్లగునేని, "సుదుష్కరేణ శోచేద్యోయేన యే నేష్టహేతునా సనతస్యాహమేవేతి చరమశ్లోక సంగ్రహః" (తనయిష్టసాధనముదుష్కరంబైనదియనుకొని దుఃఖపడునట్టివానికిగాను అట్టి సాధనము నేనే అని చరమశ్లోకము తెలుపుచున్నది.) అను శ్లోకముచే ఏమి తెలుపఁబడినది యంటివేని, తెలిపెదను. "యద్యేన కామకామేన న సాధ్యం సాధనాంతరైః ముముక్షుణా యత్సాంఖ్యేన యోగేన చ భక్తితః। ప్రాప్యతే పరమం ధామ యతోనావర్తతే పునః తేన తేనాప్యతే తత్త న్న్యాసేనైవ మహామునే। పరమాత్మాచతే నైవ సాధ్యతే పురుషోత్తమః" అని చెప్పియున్న ప్రకారము తనకు అభిమతంబైనట్టి యెద్దియెన నొక ఫలముకుగాను, దానికనుగుణముగ ప్రత్యేక ప్రత్యేకముగ శాస్త్రములచే విధింపఁబడినట్టి యుపాయంబుల విషయమున జ్ఞానములేకపోవుటచేఁగాని, జ్ఞానమున్నప్పటికిన్ని, శక్తి లేకపోవుటచేఁగాని, ఈ రెండును ఉన్నప్పటికిన్ని, మోక్షము గలుగుటలో నాలస్యమును సహింపియుండఁజాలమిచేఁగాని, దుఃఖపడునట్టి అధికారిని గురించి "ఆ యుపాయములలో నొక్కదానితోనును నీవు కష్టపడవలదు. అవి ప్రత్యేక ప్రత్యేకముగా నిచ్చునట్టి ఫలంబులనన్నింటి

కిన్ని ప్రపత్తి వశీకృతుండనగు నేను ఒక్కండే చాలునని చెప్పంబడినది. అనేక ఔషధంబు లీయంగల ఆరోగ్యమునంతయును ఈ సిద్ధౌషధమొక్కటియే ఈయంగలదు గాన, నీవు ఔషధాంతరములకై శ్రమపడకుము. ఈ యౌషధమొక్కటియే ఆరోగ్యమును గలుగంజేయంగలదు. ఇది నీవు ఇష్టపడునట్టి యౌషధంబులన్నింటిచేతను నివర్తింపంజేయందగినట్టి వ్యాధులన్నింటిని నివర్తింపంజేయంగలదు. అటుపిమ్మట నీవు భోగ్యంబులగు పదార్థంబుల నన్నింటిని అనుభవింపవచ్చును. ప్రస్తుతము ఆరోగ్యమునున్ను భోగంబులనున్ను పోగొట్టుకొనుచున్నామే యని కష్టపడవద్దు అని యివ్విధముగ ఒకరోగికి మనము ఉపదేశించునట్లుగా నుండునది యీ చరమశ్లోకము.

సర్వశబ్దప్రతి సంబంధియగు 'ఏక' శబ్దము సిద్ధోపాయప్రాధాన్యముచే శరణ్యునికిఁగల విశేషము లఁదెలుపునది గానున్నను, 'న్యాసేనైవ' అను తావున సాయించినట్లు, ప్రపత్తియొక్కటియే సమస్త ధర్మములయొక్కయును స్థానమందు విధింపఁబడుచున్నదని యేర్పడును. ఈహేతువువలన ధర్మార్థకామముల నపేక్షించునట్టి వారు ఈ భగవత్ప్రపత్తి నొనర్పఁదగునని సిద్ధమగుచున్నది.

అట్టి సందర్భమున 'త్వయాపిప్రాప్తమైశ్వర్యం యత్తత్తంతోపయామ్యహం । నాహమారాధయామిత్వాం తవ బద్ధోయమంజలిః । నత్వంప్రహరవామావా మయివజ్రంపురందర । నాహముత్సృజ్యగోవింద మన్యమారాధయామిభోః' (నీవున్ను ఐశ్వర్యమును బొందియున్నను, నేను శ్రీమన్నారాయణుని యారాధించువాఁడనుగాన, నిన్ను నేను ఆరాధింపను

ఇదియే నీకు నమస్కారము. నామీఁద వజ్రమును వేసినను, వే యకున్నను నేనుగోవిందునివిడిచి వేఱొక్క దేవతనారాధింపను) అన్నట్లు నిత్యనైమిత్తిక కర్మముల నాచరించునప్పుడు భగవ చ్ఛరీరభూతములుగాను సంప్రాప్తంబులైనవే తప్ప, తక్కిన సమయములయం దెల్లప్పుడును దేవతాంతర సంబంధ మెంత మాత్రము లేకుండుట యుచితము.

మోక్షముకై యుపాయాంతరములను గోరునట్టివారై ఉపాయవిరోధులను నివర్తింపఁ జేసికొనవలయు ననుకొనునట్టి వారున్ను ఈ ప్రపత్తిని యవలంబింపవచ్చును. ప్రాప్తివిరోధిని పోఁగొట్టుకొనవలయునను ఇచ్ఛగలవారికిన్ని ఈప్రపత్తియే చా లునని యిట్లు ప్రపత్తియొక్క సకలాభిమతసాధనత్వము ఈ తావున చెప్పఁబడినది. అందులోను, ఇదిప్రపత్త్యుపాయవిరోధిని తొలగించునట్టి విధమును శ్రీగీతాభాష్యమునందు (చరమశ్లో కముయొక్క) ద్వితీయ యోజనయందుఁ దెలిపియున్నారు. ప్రాప్తివిరోధిని తొలగించునట్టి విధమును గద్యయందు సా యించియున్నారు. ఈ రెండు తావులయందును ఒక్కదానిని అనాదరించి ఒక్కదానిని సాయించినారని అర్థము చేసికొనఁ దగదు. రెండుతావులఁ జెప్పినవియును, సర్వాభిమతసాధనం బగు ఈ యుపాయముయొక్క ప్రభావమునకు ఉదాహరణములు కాఁగలవు.

ప్రణవము మంత్రాంతరములలోఁ బ్రవేశించియుండు నట్లును, స్వతంత్రముగానునుండునట్లును, ఈప్రపత్తియును ఒక యధికారివిషయమున స్వతంత్రముగానునుండుట వచనబలము వలన సిద్ధమగుచున్నది.

ఇట్లు ఆ యా యధికారములనుబట్టి యుండునట్టివియగు భక్తి ప్రపత్తులు ప్రత్యేకముగ ఫలసాధనంబులనెడి విషయము "భక్త్యా పరమయా వాపి ప్రపత్త్యా వా మహామతే" ఇత్యాది వచనములవలన సిద్ధమగుచున్నది. కావున ""సమ్యక్ జ్ఞానేన వా మోక్షం గంగాయాం మరణేన వా ప్రణామాద్వాపి సుకృతాత్ భక్త్యా నాలభతే నరః'' (యథార్థజ్ఞానముచేతను గాని, గంగాతీరమున మరణించుటచేతను గాని, సాష్టాంగముగ దండము సమర్పించుటచేతను (ప్రపత్తి చేతను) గాని, భక్తిచేతను గాని మనుజుండు మోక్షమును బొందుచున్నాడు) ఇత్యాది తావుల సాధ్యోపాయము (ప్రపత్తి) తోc బాటు ఉపాయాంతరములను సయితము పేర్కొనుటకు హేతువు వాటియొక్క ప్రాశస్త్యము తెలియవచ్చుటకు గాను మాత్రము. ఇంతియే.

శ్లో॥ ప్రాప్యస్యైవ ప్రాపకత్వం స్వప్రాధాన్యనివారణం।
ప్రపత్తేర్వ్యాజమాత్రత్వమన్యోపాయైరనన్వయః॥

శ్లో॥ తదంగైరప్యసంబంధః సర్వసాధ్యేష్వభిన్నతా
ఇత్థమర్థాః మదాచార్యైః ఏకశబ్దస్య దర్శితాః॥

తా॥ ప్రాప్యవస్తువే ప్రాపకంబగుటయును, ఆత్మప్రధానుండు కాకపోవుటయును, ప్రపత్తి వ్యాజమాత్రంబగుటయును, తక్కిన యుపాయంబులతో దీనికి సంబంధము లేకుండుటయును వాటియంగములతోనును సంబంధము లేకపోవుటయును, అన్నియును భగవత్ప్రాప్తికే సాధనంబులగుటయును, అను ఈ యా యను ఏకశబ్దముయొక్క యర్థములుగాను పూర్వాచార్యులచేc దెలుపcబడినవి.

శ్లో॥ కేచిత్త్విహైకశబ్దార్థం శరణ్యైక్యం ప్రచక్షతే ।

విశిష్టతథాపి శ్రీర్గుణ విగ్రహ వత్త్వౌభం॥

తా॥ శంఖ్యాంబైనట్టి వస్తువొక్కటియే యనియు,అయినను, అది లక్ష్మితోను గుణవిగ్రహాదులతోనును కూడియుండునదనియును నిట్లు కొందఱు 'ఏక' శబ్దముయొక్క యర్థమును తెలుపుదురు. ఏలయనిన,

శ్లో॥ ఈశ్వరీసర్వభూతానామియంభగవతః ప్రియా।
సంశ్రితత్రాణ దీక్షాయాం సహధర్మచరీస్మృతా॥

తా॥ ఈమె సర్వభూతములకున్న తల్లియైనదిగాను, భగవంతునికి మిక్కిలి యిష్టురాలు గాను, ఆశ్రితరక్షణమువిషయమునతోడ్పడునదిగానును శాస్త్రములయందుఁ జెప్పఁబడినది.

శ్లో॥ ఏకంజగదుపాదానమిత్యుక్తేపి ప్రమాణతః।
యథాపేక్షితవై శిష్ట్యం తథాత్రాపిభవిష్యతి॥

తా॥ జగత్తుకు ఉపాదానకారణభూతంబైనది యొక్కటియే యని శాస్త్రమునఁ జెప్పియున్నను, అందులకుఁ గావలసినవాటితో (జ్ఞానశక్త్యాదులతోఁ)గూడియున్నట్టిదిగానేయది గ్రహింపఁబడు చందంబున, ప్రకృతముననునెఱుంగునది.

శ్లో॥ ఏకోపాస్తివిధానేపి గుణాదీనాంయథాన్వయః
తద్వ్యాకశరణవ్రజ్యావిధానేప్యనుమన్యతాం॥

తా॥ ఉపాసనంబొక్కటిగానేవిధింపఁబడినను,తక్కిన తావులయందుఁ జెప్పఁబడినట్టి గుణంబులు దానియం దన్వయించునట్లు, ,, మామేకం శరణంవ్రజ " అనుతావునను న్నట్లే అర్థము చేసికొనునది.

శ్లో॥ యథాగుణాదివైశిష్ట్యేవిద్యాయామైక్యమక్షతం
ఏవంపత్నీవిశిష్టత్వేప్యభీష్టం శాస్త్రచక్షుషాం॥

తా॥ గుణాది విశిష్టంబైనను, సిద్ధోపాయమును ఐక్యము పొసగునట్లు, పత్నీవిశిష్టునిగాను భగవంతుని గొనుటయును శాస్త్రజ్ఞుల కిష్టము.

శ్లో॥ ప్రభాప్రభావతోర్యద్వదేకోక్త్యావితరాన్వయః।
ఏవమన్యతరోక్త్యాస్యాత్సహవృత్త్యభిధానతః॥

తా॥ సూర్యుని పేరొక్కనినప్పుడు వాని ప్రభయును వానితో సంబంధించియున్నట్టిదిగాను తెలివచ్చునట్లు, పెరుమాళ్లను పేరొక్కనినప్పుడును, పిరాట్టి వానితో నెల్లప్పుడు చేరియుండునదిగాన, వాఁడు ఆమెతో సంబంధించిన వాఁడు గానే తెలియఁగలడు.

శ్లో॥ స్మరంతి హ్యైనాంమునయస్సంసారార్ణవతారిణీం।
ఊచతుస్స్వయమప్యేతత్సాత్వతాదిషు తావుభౌ॥

తా॥ లక్ష్మీదేవిని చేతనులను సంసారమునుండి తరింపఁజేయునట్టి దానినిగాను మునులు స్మృతులయందుఁ జెప్పియున్నారు. పిరాట్టినిన్ని పెరుమాళ్ళనున్ను ఉభయులనున్ను వీరు సాత్వతాదిగ్రంథములయందుఁ జెప్పియున్నారు.

శ్లో॥ ఉపాయోపేయదశయోః ద్వయేఽపి శ్రీస్సమన్వితా
ఇష్టాచశేషిణీద్వంద్వే శేషవృత్తిర్యథోదితా॥

తా॥ ద్వయమునందు ఉపాయోపేయములఁ దెలుపునట్టి రెండువాక్యములయందును లక్ష్మీసంబంధము కలదు. శ్రీ శ్రియఃపతులచేరికయందే కైంకర్యమొనర్పుటయును శాస్త్రసమ్మతము.

శ్లో॥ అతోఽనన్యపరానైక శ్రుతిస్మృత్యనుసారతః।
పత్నీవిశిష్టఏవైకః ప్రపత్తవ్యఇహోదితః॥

తా॥ కావున నిట్లు భగవంతుని మాత్రము ఉపపాదించు నట్టివియగు అనేక శ్రుతిస్మృతులనుబట్టి విచారించినట్లయిన, ,,ఏక'' శబ్దముచే లక్ష్మీవిశిష్టుండై నట్టి వానికే ప్రపత్తిచేయ వలసినది యని యీ తావునఁ దెలుపఁబడినది.

ఈ తావుననుండు ,,శరణ'' శబ్దమునున్ను ద్వయాధికారమునఁ జెప్పిన విధముననే యర్థముచేసికొని యనుసంధించుకొనునది. ఈ శరణాగతి యనునది అరుననివిషయమునను పదేశించినదియే యైనను, ,అనాలోచితవిశేషాశేషలోకశరణ్యా' అన్నట్లు ఇది యందఱికిగాను ఉపదేశింపఁబడినది యను విషయము శ్వేతాశ్వతరోపనిషత్తుచుండి తెలియంగలదు. మరియు ''కృష్ణం ధర్మం సనాతనం'' అనియు ,,శరణ్యం శరణం చ త్వాం'' అనియు ,,యోగో యోగవిదాం నేతా'' అనియు ,,అమృతం సాధనం సాధ్యం''అనియును ఈ మొదలగు తావుల యందు శరణాగతిని ఒక్కరికి మాత్రమే కాకుండ,(అందఱికిని) ఉపదేశించియున్నందున ఈ తావుననున్ను శరణాగతి యందఱికి గాను ఉపదేశింపఁబడినదిగాను వివక్షింపఁబడినది. ఇవ్విధముగ సర్వేశ్వరుండు శరణ్యుండుగాను వరింపఁబడునప్పుడు, ఈ చేతనుండును, అనన్యశరణుండు గానే యుండవలయును.

,,వ్రజ'' అనుశబ్దమున్ను ,, ప్రపద్యే '' అను తావునఁ దెలుపఁబడినట్లు సాంగమగు ఆత్మభరసమర్పణమునే (మహావిశ్వాసాది పూర్వకముగ తన భారమునంతయును సర్వేశ్వరునిపై నుంచుటనే) తెలుపుచున్నది. అయితే ఆ తావున (ద్వయమునందు) అనుసంధించుకొనువాఁడు తానే యగుటం జేసి, ,ప్రపద్యే' అని యిట్లు క్రియాపదము ఉత్తమపురుషము.

ప్రకృతమునను “శిష్యస్తేహం శాధిమాం” అన్నట్లు ఎదు
రుగా నిలుపఁబడియున్నట్టి యర్జునుని గుఱించి విధించుట
యగుటంజేసి “వ్రజ” అని యిట్లు క్రియాపదము మధ్య
మపురుషము. ఇంతియే. ఈ యానుకూల్యసంకల్పాదులును, త
క్కిన యంగములును ఈ తావున సూచింపఁబడుచుండుటను,
ద్వయమునందువలెనే అందుల కవకాశమిచ్చునట్టి పదముల
యర్థమున అనుసంధించుకొనునది. ఉపాసనములను పదేపదే
యాచరింపవలసినట్లు యీ శరణాగతినిన్ని పదేపదే యాచ
రింపనక్కఱలేదు గాన, “సకృత్కృతః శాస్త్రార్థః” (శాస్త్రా
ర్థమునుఒక్కతూరి అనుష్ఠించునది) అనుతావునచేయఁబడినట్టి
నిర్ణయము కెద్దియును బాధకములేదు. ఈ విషయము “సకృ
దేవప్రపన్నాయ” ఇత్యాది ప్రమాణములచేతనున్నూ బాగుగా
నిరూపింపఁబడినది.

ఇట్లు మహోదారుండును, సర్వశక్తుండునునగు సర్వే
శ్వరుని శరణుజొచ్చినట్టి యీచేతనుండు తాను స్వయముగ
ఇష్టపడిననే తప్ప, వేఱొక్కవిధముగ మోక్షము గలుగుటలో
నాలస్యముండజాలదు. కావున ఈ న్యాసవిద్యకుంగల విశేషం
బెద్దియనఁగా నిది ప్రారబ్ధకర్మమునునివర్తించునదియగుటయే.

ఈ సందర్భమున కొందఱిట్లు వాదింతురు. — “స్వ
తంత్రుండైనట్టి వానిని గుఱించి కదా! దేనినైన చేయుమని
విధింపవచ్చును, ఇట్లుండ, మిక్కిలి పరతంత్రుండుగాను వేదాంత
శాస్త్రమునందున, తిరుమంత్రాదులయందును తెలుపఁబడి
నట్టి యధికారిని గుఱించి “వ్రజ=ఆశ్రయింపుము” అని యి
ట్లొక కర్తవ్యమును విధించుట యెట్లు పొసగును?

ఇది పారతంత్ర్యముయొక్క లోతును విచారింపక చెప్పినట్టి మాట. అదియెట్లనిన, ‘‘కర్తా శాస్త్రార్థవత్త్వాత్’’ (జీవుండు కర్త అట్లగునేని శాస్త్రము సార్థకము కాఁగలదు) అనియు ‘‘పరాత్తుతచ్ఛ్రుతే’’(అట్టి కర్తృత్వముభగవత్సంకల్పాధీనంబని శాస్త్రమువలనఁ దెలియుచున్నది) అనియును వేదాంత శాస్త్రమునఁ దెలిపియున్నట్టివిధమున, ఈచేతనునికి భగవదధీనంబగు కర్తృత్వ ముండుటంజేసి, ఈతని విషయమున నట్లు విధించియున్నచో, బాధకములేదు. భగవంతుండు శబ్దాదివిషయములను గలుగఁజేయఁగా, అచేతనపదార్థములు వాటిని వహించియుండునట్లు, ఇంతేమాత్రము స్వాతంత్ర్యమునువహించియుండుటయును యీ చేతనునికిఁగల భగవత్పారతంత్ర్యకాష్ఠయొక్కవిధమే కాఁగలదు. యీతనికి యెవ్విధముననుకర్తృత్వము లేదంటివేని, యదిప్రకృతి, అవిద్య, మొదలగు వాటికి కర్తృత్వ గలదని చెప్పునట్టి వారి సిద్ధాంతమువంటిది కాఁగలదు. జీవునికిఁగల కర్తృత్వము అట్టి జీవుని యధీనములోనుండునది యంటివేని, సర్వాత్మలను నియమించునట్టి వాఁడొక్కండు కలడనెడి యర్థము సిద్ధింపనందున, నది నిరీశ్వరసిద్ధాంతమువంటిది కాఁగలదు. భగవదధీనముగ యీతనికిఁగల కర్తృమున్ను జ్ఞాతృత్వమే యంటివేని, ఈతని కొక పురుషార్థమును సంపాదించుకొనవలయుననెడి యభిలాషయును, అందులకుగా నగు ఉపాయానుష్ఠానమునఁ బ్రవర్తించుటయును లేక పోవలసి వచ్చును. జ్ఞానమున్ను, దాని యవస్థాభేదంబగు ఇచ్ఛయును ఈతనికిఁ గలవు. ఇంతియె కాని, వేఱొక్క వ్యాపారంబెద్దియును యీతనికి లేదనిచెప్పినను, దృష్టాదృష్టఫలసాధనంబగు

యొక్క యుపాయమును, స్వయంప్రయోజనంబులగు కైంక
ర్యంబులనున్ను ఈతండు అనుష్ఠించుటకవకాశము లేక పోవ
లసివచ్చును ! కావున జ్ఞానమును, చికీర్షయును, ప్రయత్నము
న్ను ఈమూండున్ను ఆత్మకుం గలవు. వీటిలో చికీర్షాప్రయత్న
ములు జ్ఞానముయొక్క యవస్థాభేదంబులనెడి విషయమును
శ్రీభాష్యకారులవారు వేదార్థసంగ్రహమున సాయించిన విధ
మున నూత్మదృష్టిచే నెఱుంగునది. యేదైననొక వ్యాపార
మునుబట్టియుండుటయే స్వరూపముగాంగల కర్తృత్వము సా
మాన్యముగ చేతనాచేతనపదార్థములకు రెండింటికిన్నికలదు.
యేదైన నొక ప్రయత్నమునుబట్టియుండునట్టి కర్తృత్వమన్న
నో, చేతనపదార్థములకు మాత్రము కలదు. ప్రయత్నమనం
గా శరీరేంద్రియాదుల నొక కార్యమునందుం బ్రవర్తింపం జేయు
నట్టిదియగు బుద్ధివిశేషము. ఈచేతనుండు జ్ఞానమాత్రముకు
ఆశ్రయమగునప్పుడును అనంగా దేనినైనను తెలిసికొనునప్పు
డును, భోగమాత్రముకు ఆశ్రయమగునప్పుడును అనంగా దేని
నైనను అనుభవింపంబోవునప్పుడును క్రియాశ్రయత్వమాత్రము
గు సామాన్యకర్తృత్వమే యుండంగలదు. ఏదైననొక దానిని
తన బుద్ధిచేం గలుగంజేయునప్పుడు, ప్రయత్నాశ్రయత్వ[illegible]
మగు కర్తృత్వముండగలదు. ఇట్టి కర్తృత్వము కైంకర్యము
నందు మాత్రమే యుండగలదనుటయును యుచితము కాదు.
అత్యల్పమైనను, భగవంతునకు ప్రీతిం గలుగంజేయుట యనెడి యొక
యుద్దేశమునుబట్టి యుపాయానుష్ఠానము నొనర్చుచునే కదా
యుండ గలడు!

ఇట్లుండ కర్తృత్వమునందు బంధహేతువగు అంశ
మును మాత్రమే విడనాడునది. అది యెద్దియనఁగా— ఈశ్వ
రుండొసంగినట్టి జ్ఞానశక్త్యాదులనున్న శరీరేంద్రియాదులనున్న
గాని, అతండు ప్రేరకుండైయ్యును, ధారకుండైయ్యును, అందు
వలనిఫలమున్న తనదియైనట్టివాఁడునై తోడ్పడఁగా, ప్ర
వర్తించునట్టి వాఁడగు ఈజీవుండు తనను యీదులకు విరుద్ధ
ముగాననుసంధించుకొనుటయును, ఈ యనుసంధానమునందు
పరిపూర్ణజ్ఞానమున్నప్పటికిన్ని, దానివలన నొక ఫలమునపేక్షిం
చి యనుష్ఠించుటయును, బంధహేతువు. భక్తి ప్రపత్తులు
సయితము ప్రయోజనాంతరపరుని విషయమున అనఁగా ప్ర
యోజనాంతరము నపేక్షించి యనుష్ఠించునప్పుడు బంధహేతు
వులు కదా కాఁగలవు.

కావున స్వభావసిద్ధంబగునట్టి కైంకర్యమును కోరునట్టి
వాఁడై, వేఱొక్క ఫలము నపేక్షింపకయుండునట్టివానికి ఫలదశ
యందుండు (కైంకర్యము విషయమునఁగల) కర్తృత్వమువలె
నే, ఉపాయదశయందును (ఉపాయానుష్ఠానమునందును) క
ర్తృత్వము విరుద్ధముకాదు.

ఫలదశయందు నానావిధానేకకైంకర్యముల విషయము
నఁగల కర్తృత్వమనునది కేవలము ఈశ్వరేచ్ఛ కనుగుణం
బగు స్వేచ్ఛను (తన కోరికను)బట్టి యుండగలదు. సంసార
దశయందుఁగల కర్తృత్వమంతయును, కర్మాను రూపముగ
సర్వేశ్వరుండు పరిణమింపఁజేసినట్టి సత్త్వరజస్తమోగుణము
లను నిమిత్తీకరించుకొని యనేకవిధములు గలదియై యుండ
గలదు. దీనిలో, రజోగుణమును బట్టియును తమోగుణమును

బట్టియును, ప్రయోజనాంతరసంబంధమును గలుగఁజేయునట్టి స
త్త్వగుణమును బట్టియును ఉండునట్టి కర్తృత్వము బంధహే
తువు. భగవత్ప్రాప్తితో సంబంధమును గలుగఁజేయునట్టిది
యై, యుత్కృష్టంబగు సత్త్వగుణమును బట్టి యుండునట్టి కర్త
త్వము మోక్షహేతువు. మోక్షావస్థయందుండు కర్తృత్వ
ముకన్ననో ఈ మూఁడు గుణములతోను సంబంధ మెంత
మాత్రముండదు.

ఈ పైని చెప్పిన హేతువులను బట్టి ఆత్మకు కర్తృత్వము
లేదని తెలుపునట్టి వాక్యములకును, కర్తృత్వము కలదని తెలు
పునట్టి వాక్యములకును విషయభేదముండుటం జేసి, విరోధ
ముండదు. అదియెట్లనిన, కర్తృత్వము లేదని తెలుపునట్టి వా
క్యములు ఈశ్వరాధీనము గానును, ఈశ్వరాధీనంబులగు ప్ర
కృతిగుణముల కధీనము గాను నుండునట్టి కర్తృత్వమును నిర
పేక్షంబైనట్టి దానినిగా (దేనినిన్ని బట్టి యుండక స్వభావసిద్ధము
గా నుండునట్టి దానినిగా) తలంపఁగూడదని తెలుపుచున్నవి.
కర్తృత్వము కలదని తెలుపునట్టి వాక్యములు యీశ్వరేచ్ఛా
దులను బట్టియుండునట్టి జ్ఞానమునకును, దానియొక్క యవ
స్థాభేదంబులగు చికీర్షాప్రయత్నంబులకును ఈతండే (జీవుండే)
యాశ్రయంబని తెలుపుచున్నవి. ఇట్టి నిష్కర్షను “శరీరవా
ఙ్మనోభిర్యత్” అను శ్లోకము మొదలుకొని శ్రీభగవద్గీతల
యందు భగవంతుండు తెలిపియున్నాఁడు. ఆతావున “దైవం
చైవాత్ర పంచమం” అను వాక్యమున దైవమనఁగా పురుషోత్త
ముండు. ఈతండు జీవుని నెద్దియైన నొక కార్యమునఁ బ్రవర్తింపఁ
జేయునప్పుడు ఆ కార్యము విషయమున నీతండు “కారయితా=చే

యించువాఁడు" అనఁబడుచున్నాఁడు. తానే స్వయముగ ప్ర
వర్తింపఁజేయునట్టి ఫలప్రదానాదుల విషయమునను, సృష్ట్యా
దుల విషయమునను ఈతండు "కర్త=చేయువాఁడు"
అనఁబడుచున్నాఁడు. ఏదైననొక కార్యమున నీ జీవుండు ప్రవర్తిం
పఁగా, ఈతనిని దానినుండి నివర్తింపఁ జేయకుండునప్పుడు
ఈతండు "ఉపేక్షకుండు=ఉపేక్షించియుండువాఁడు" అనఁబడు
చున్నాఁడు, అట్టిసమయమున దానిని నంగీకరించియున్నందున,
"అనుమంతా=అనుమతించిన వాఁడు" అనఁబడుచున్నాఁడు.
(దారిలో నడ్డముగా పడియుండు చెట్టును తీసివేయుటకై) పిల్ల
వాఁడు కొనను పట్టుకొనఁగా వానికంటెను పెద్దవాఁడు మొద
లును పట్టుకొనునట్లు కూడయుండి తోడ్పడినందున "సహ
కారి=కూడపనిచేయువాఁడు" అనఁబడుచున్నాఁడు.

సృష్ట్యాదులయందు దేవమనుష్యాదిభేదము జీవులయొ
క్క కర్మలకుఁగల భేదమును నిమిత్తీకరించుకొనియుండునది
యగుటంజేసి, "చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మవిభాగ
శః। తస్యకర్తారమపిమాం విద్ధ్యకర్తారమవ్యయం" (ఓయర్జునా
నేను బ్రహ్మక్షత్రియాది నాలుగు వర్ణములనున్న వారివారి గుణ
ములనుబట్టియును, కర్మలనుబట్టియును సృజించియున్నాను. అట్లు
వారివారి గుణములనుబట్టియును కర్మలను బట్టియును సృజించి
యున్నంతమాత్రమున నన్ను కర్తనుగాను, నేను ఇష్టము
వచ్చిన ప్రకారము సృజింపనందున అకర్తనుగాను ఎఱుంగు
ము) అనుటచే యీశ్వరుండు కర్త కాడని చెప్పఁబడినది.
ఇవ్విధముగ అన్నివిషయములయందును సామాన్యముగ క
ర్తృత్వముగల యీశ్వరుని మూలముగ జీవునికి, స్వబుద్ధిపూ

ర్వకముగ నొకదానియందు ప్రవర్తించు విషయమున శక్తి రూపంబగు నియోగయోగ్యత్వము (ఒకవిధిచే విధింపఁబడ తగియుండుట) సిద్ధమగుచున్నది. కావున యీ తావున "వ్రజ" అని విధించుటలో బాధకం బెద్దియును లేదు.

ఇవ్విధముగ భక్త్యాదులవలెనే శరణాగతిధర్మము న్నకర్తవ్యముగాను విధింపఁబడుటం జేసి, "తనకు తాను గలుగఁ జేసికొను నట్టి మేలు పోతపాలవంటిది యీశ్వరుండు గలుగఁ జేయునట్టి మేలు తల్లిపాలవంటిది" అని తిరుక్కురుకైప్పిరాన్ పిళ్లాన్ గారి శ్రీసూక్తి భక్తిప్రపత్తి మొదలగునవి యన్నియును సర్వేశ్వరునిచేత నేగలుగఁజేయఁబడునట్టివిగాను తలంపవలసినవి యగుచు తనయొక్క (జీవునియొక్క) కర్తృత్వము పరాధీనం బైనది (సర్వేశ్వరాధీనం బైనది) యని తెలుపుటయందే ముఖ్యోద్దేశము కలది.

శ్లో॥ అన్యవిశ్వాససిద్ధ్యర్థం భక్త్యుపాయవిధింవదన్
సర్వశాస్త్రేష్వవిశ్వాసబాధత్తే ముఖభేదతః॥

తా॥ ప్రతిపత్తివిషయమున నమ్మకము పుట్టించుటకై భక్తి విధింపఁబడుచున్నదని (తెంగలవారు) చెప్పుదురు. అట్లగునేని, తద్ద్వారా సర్వశాస్త్రముల విషయమునను నమ్మకము చెడిపోవుటయే యేర్పడును.

శ్లో॥ మద్యోపహతపాత్రస్థ తీర్థదృష్టాంతవన్ననం ।
అహంకారాన్వయేతుస్యాత్ ప్రపత్తావపిభక్తివత్॥

తా॥ మద్యపు పాత్రములోని యుదకము అపవిత్రం బైనదగు చందంబున, అహంకారసంబంధమును బట్టి వారు భక్తి విషయమున నారోపించునట్టి దూషణము ప్రపత్తి విషయమున నున్న సమానమే.

కావున * "ప్రసీద మద్వృత్తమచింతయిత్వా" (స్వామీ నానడవడికనంతగమనింపక నన్నుదయతో (జూడుము) అని యీ మొదలగు తావులయందుఁ జెప్పినది ముందు తానొనర్చినట్టి ప్రపత్తికిగాను క్షమాపణముఁ గోరుకొనుటయని తెంగలవారు చెప్పునది సరి కాదు. అది అహంకార సంబంధము రాఁగలదే మో యని భయపడిచెప్పినట్టిది కావచ్చును. ఇంతియే. అట్లుకాకున్న, శాస్త్రప్రకారము అనుష్ఠించినట్టి ప్రపత్తి యపరాధంబై దానికిగాను క్షమాపణముఁ గోరుకొనుటయని చెప్పఁదగదు. అట్లగునేని, "పితామహం నాథమునిం విలోక్య ప్రసీద" (ఓస్వామీ! నాపితామహులగు శ్రీమన్నాథమునులనుబట్టియైనను, నన్ను దయతో (జూడుము) అని యిట్లు పూర్వాచార్యులను పురస్కరించుకొనుట మొదలగునదియును యీచేతనుండు చేయునట్టిదియైనందున, నందులకై క్షమాపణముఁ గోరుకొనవలసివచ్చును. ఇవ్విధమున క్షమాపణములకు అంతులేక పోవలసి వచ్చునే?

---

* శ్రీ యాళవందారులు స్తోత్రమున "వపురాదిషు" ఇత్యాదిశ్లోకమునందు తనయాత్మను భగవంతునికి అర్పించి, పిమ్మట అట్లుచేయుట యపరాధంబనితలంచి యందులకై "మమ నాథయదస్తి" అనుశ్లోకమున అనుతాప పడియున్నారని తెంగలవారు చెప్పుదురు. వారుచెప్పునది సరి కాదు. ఎట్లనిన, ఏమాత్రమైనను దేహాత్మ వివేకముచే ఆత్మసమర్పణమును చేయవలయునని "వపురాదిషు" అను శ్లోకముచేతను, భగవదర్పితము చేయఁబడునట్టిదానిని తనదియనుతలంపుతో నట్లుచేయకూడదని "మమ నాథయదస్తి" అను శ్లోకముచేతనున్ను, శ్రీయాళవందారులు తెలిపియున్నారు. అట్లుకాకున్న, ఈ చేతనుండు తానైనను నొనర్చుట దోషంబగునేని, యీతండొనర్చునట్టి యాచార్య పురస్కరణాదులున్ను దోషంబులు కాఁగలవు

ఇది * స్వపర నిర్వాహకంబగుపక్షమున, అటువలెనే ముందొనర్చినట్టి ప్రపత్తినిన్ని, స్వపర నిర్వాహకమునుగాఁ గొనవచ్చునే. ఈపై నిగనఁబఱచిన కుతర్కంబుల మూలముగ పూర్వాచార్యులొనర్చినట్టి ప్రపత్తియే యపరాధంబైనట్టిది గాను తెలియవచ్చుటంజేసి, తానొనర్చునట్టి వాటికి పూర్వాచార్యులను పురస్కరించుకొనకూడదని ప్రసక్తించునే!

కావున ఈస్తోత్రమునందు (శ్రీయాళవందారు స్తోత్రమునందు) ఆద్యంతములయందు వారొనర్చినట్టి పూర్వాచార్య పురస్కార మనునది ఈతావున సాయించునట్టిప్రపత్తికి యపేక్షితంబైనదియై కాని, లోపమును పరిహరించునదియై కాని, యుపయుక్తంబైనది యైవచ్చినది. ఇంతియే,

ఇట్టి యాచార్య పురస్కారమునందువలెనే ప్రపత్త్యాదుల విషయమునను పరాధీన కర్తృత్వ మొక దోషము కాదు. ఇట్లు, పరాధీనంబగు కర్తృత్వము ఆత్మకున్నట్లు శాస్త్రసిద్ధము. కావున ఆత్మకు కర్తృత్వము లేకపోవుటంజేసి స్వరూపజ్ఞానముగలవాఁడు నిషిద్ధకర్మంబుల నాచరించినను, వాటిలో నొక్కటియును ఈతనితో సంబంధింపదను పక్షము ఇందు మూలముగ నిరసింపఁబడుచున్నది.

---

* స్వపర నిర్వాహకంబనఁగా — తనదోషమును సర్దుపాటుచేసికొని వేఱొక్కని దోషమునున్ను సర్దుపాటుచేయునదియని యర్థము. ప్రకృతమున ఆచార్యపురస్కరణ మనునది యీచేతననిచే చేయఁబడునదియై, అందుమూలముగ తనయందుఁగల దోషమును సర్దుపాటు చేసికొనుచు అట్లే ప్రపత్తిచేయుటచేఁ గలుగునట్టి దోషమునున్ను సర్దుపాటు చేయుచున్నదని తెంగలవారుచెప్పఁగా, అట్టిది ప్రపత్తియే ఫల కాకూడదని యీతావున చెప్పఁబడినది.

ముముక్షువును గుఱించి (ఉపనిషత్తులయందు) చెప్పి యున్నట్టి బాల్యంబనునది బాలచేష్టితంబులగు యథేష్టసంచారాదులు కావనియును, అది స్వమాహాత్మ్యము నెఱింగి యుండకపోవుట యనియును ఈ విషయమును 'అనావిష్కుర్వన్నన్వయాత్' అను బ్రహ్మసూత్రమునందు శ్రీభాష్యకారుల వారు సమర్థించి యున్నారు.

'అనిష్టమిష్టంమిశ్రంచ' 'యస్యనాహంకృతోభావః' ఇత్యాదివచనములు బుద్ధిపూర్వకంబగు ఆగామిపాపకర్మమునుగుఱించినవియగు విషయమును, తక్కిన శాస్త్రములతో విరోధము సంప్రాప్తింపకుండుటకుగాను, శ్రీభాష్యాది గ్రంథములయందు సమర్థింపఁబడినది.

''హత్వాపి'' అని శ్రీభగవద్గీతలయందు చెప్పినదియును ధర్మయుద్ధాదులను గుఱించినదె.

శ్లో॥ ఉపభుక్తౌషధన్యాయాదుత్తరాపద్యమర్దనం।
అనన్యపరనిర్బాధశ్రుతిస్మృతిశతైర్హతం॥

తా॥ వ్యాధికిగాను ఔషధము పుచ్చుకొనినపిమ్మట, అట్టి వ్యాధినుండి భయంబెద్దియును లేకుండునట్లు, మొదట ప్రపత్తిచేసినపిమ్మట పాపములనుండి భయంబెద్దియు నుండదు గాన, నందులకుగాను పునఃప్రపత్తిచేయ నక్కఱలేదను మాట ప్రపత్తి ప్రతిపాదకంబులగు అనేక శ్రుతిస్మృతులకు విరుద్ధము.

శ్లో॥ జీవితాత్యయమాపన్నో యోన్నమత్తియతస్తతః।
ఆకాశమివపంకేన నసపాపేనలిప్యతే।

తా॥ ప్రాణము లు పోవునట్టి సమయము తటస్థించినప్పుడు యెవ్వని యన్నమును తినినను, ఆకాశమును బురదంటనట్లు, అట్టివానితో అందువలని పాపంబెద్దియును సంబంధింపదు.

శ్లో॥ ప్రాణసంశయమాపన్నో యోఽన్నమత్తియతస్తతః।
లిప్యతేనసపాపేన పద్మపత్రమివాంభసా॥

తా॥ ప్రాణములు పోవునట్టి స్థితి తటస్థించినప్పుడు యెవ్వనియన్నమును తినినను, తామరాకును నీరంటనట్లు, అట్టివానితోనందువలని పాపంబెద్దియును సంబంధింపదు.

అని నియమించియున్నారు.

ఈపైని చెప్పినవిషయము బ్రహ్మవేత్తలవిషయమున నున్న సమానంబేయని "సర్వాన్నానుమతిశ్చ ప్రాణాత్యయే తద్దర్శనాత్" అను బ్రహ్మసూత్రమున దృష్టాంతరూపముగ సాధింపఁబడినది. కావున కర్తృత్వము ఆత్మకులేకుండుటను బట్టికాని, పారతంత్ర్యజ్ఞానమునుబట్టికాని, బుద్ధిపూర్వకంబగు ఆగామిపాపకర్మము ఎవ్విధమునను ఈజీవునితో సంబంధింపదనియు, కావున నింగులకై పునః ప్రవత్తినిచేయనక్కఱలేదనియును చెప్పుట యనునది ప్రామాణికము కాఁజాలదు.

ఈ సందర్భమున కొందఱు "వ్రజ" ఇత్యాదివిధులకు విపరీతార్థములఁగొని, "యోఽన్యథా సంతమాత్మానమన్యథా ప్రతిపద్యతే కింతేన నకృతంపాపం చోరేణాత్మాపహారిణా" (భగవచ్ఛేషంబైనట్టి యీయాత్మను వేఱొక్కవిధముగాఁ దలంచుటచే నాత్మాపహారియైనట్టి యీచేతనుండొనర్పని పాపంబెద్ది?) అనియు, "యమోవైవస్వతోరాజాయ స్తవైషహృదిస్థితః తేనచేదవివాదస్తేమాగంగామాకురూన్గమః"

(నీలోనంతరాత్మగానుండునట్టి భగవంతుని కిష్టుండవైతివేని, కురుక్షేత్రమునుగాని, గంగాస్నానముకుగాని పోఁబనిలేదు),, ఆత్మదాస్యంహరే స్స్వామ్యం స్వభావం చ సదాస్మర'' (ఆత్మదాసుండనియు విష్ణువు స్వామియనియును సర్వదా స్మరించుకొనుము ) అనియును ఈ మొదలగు వాక్యములయొక్క ముఖ్యోద్దేశమునుపరిశీలింపక, వీటిఁగాని శాస్త్రమునుండి తెలియవచ్చునట్టి సంబంధజ్ఞానము తప్ప, ముముక్షువుచే సనుష్ఠింపవలసినట్టిదియగు ఉపాయంబు వేఱొక్కటిలేదు అని చెప్పుదురు.

వీరు చెప్పునది భక్తిప్రపత్త్యాది విధుల స్వారస్యముతో విరోధించును. ఈచేతనుండు స్వేచ్ఛచేతనే ప్రవర్తించునట్టి శ్రవణమననాదులచే సిద్ధంబగునట్టి శాస్త్రజన్యజ్ఞానమును ప్రత్యేకించి విధింపనక్కఱలేదు. ఇట్లు విధింపఁబడనట్టి జ్ఞానమును మోక్షసాధనమునుగాఁ గొనునట్టి వారిపక్షమున విధివిరోధాదిరూపములగు దోషములు సంప్రాప్తించునని సాధింపఁబడినది కదా!

ఇట్లుండ, సర్వవిద్యా (ఉపాసన) నిష్ఠులగు ముముక్షువులకును సమానముగ ఉపయుక్తంబై, పరంపరయా ఉపకారకంబగుటంజేసి పరమాత్మజ్ఞానము శాస్త్రమూలముగ గలిగినట్టి వానికి మనయొక్క స్వామియై నిరతిశయభోగ్యుండగు సర్వేశ్వరునిబొందించునట్టి యుపాయంబెద్దియనెడి తలంపు గలిగినప్పుడు,, ఈ తావున అట్టి సందర్భమున అధికారివిశేషానురూపముగ విధింపఁబడునట్టి జ్ఞానాంతరంబులు భక్తిప్రపత్తులు. వాటిలో ప్రపత్తి యనఁగా ,,యత్సంరత్న్యతయార్ప్యతే''

అన్నట్లు సాంగముగు రక్షాభరసమర్పణము. ఇది సంబంధ జ్ఞానముతోఁగూడియే యుండవలయుననుటకుగాను సంబంధ జ్ఞానమే ప్రపత్తి యని చెప్పియున్నారు. ఇంతియే. ఈ భర న్యాసరూపంబగు ప్రపత్తియొక్క స్వరూపమును దాని యం గములనున్ను యింతకు ముందే చెప్పియున్నాము.

పా॥ శాదనముఞ్ఱ్పయను నానేయావఙ్
శాదకఙ్మెఙ్వళియావదెన్నప్పఱ్పమ్
శాదనముమ్ శరణనెఱియున్నుమక్కు
చ్చాదనజ్గళిప్పలైకోఁరిడైయవిల్లా
వేదనై శేర్ వేరంగమిదిఁల్ వేండా
వేఱెల్లానిఱ్కుమ్ నిలైనానేనిఱ్ప్వఙ్.

తా॥ సాధనమును తత్ఫలమున్ను నేనే. సాధకుండును (జీవుండును) నాయధీనుండై నన్నె శరణుజొచ్చునది. భరన్యా సమున్ను సాక్షాత్తుగ ఉపాయముకాదు. నేనే యుపాయము. ఇట్టి యకించనాధికారంబగు భరన్యాసముకు సాధనాంతరము లతోఁ బనిలేదు. అనుకూల్యసంకల్పాదులుతప్ప శ్రమసాధ్య ములగు అంగాంతరములతో దీనికిఁ బనిలేదు. సాధనాంతర ములొసంగునట్టి ఫలమునంతయును వాటి స్థానముననుండిన వాఁడనై నేనే యీయఁగలను. ఇట్లు సర్వోత్కృష్టుండనై నప్పటికిన్ని, దూత్యాది నీచకార్యములఁ జేయుటచే సులభుం డైనట్టి నన్నే శరణుజొచ్చి సంసారరూపశోక విముక్తుండ వగుమా!

ద్వితీయపాదార్థము ముగిసెను.



## తృతీయపాదార్థము.

తృతీయపాదము—"అహంత్వా సర్వపాపేభ్యః"

అవతారిక:—ఇట్లుపూర్వార్థముచే ఒకయధికారికి ద్వయమునందు పూర్వఖండమునందు అనుసంధేయంబై, సర్వధర్మంబులకుఁగల(సామాన్య) ప్రభావమును, వాటికిలేనిదై తనకు మాత్రముండునట్టి(విశేష)ప్రభావమునున్ను గలిగియున్నట్టిదై, సకృత్కర్తవ్యంబగు ఉపాయవిశేషమును (ప్రపత్తిని) అధికారిస్వర పేత్యాదివివరణపూర్వకముగవిధించి, ఉత్తరార్థముచేఁ దెలుపఁబడినట్టి ఫలమును, సమశ్శబ్దముచే వివరింపఁబడినట్టి యనిష్టనివృత్తిని వివరించుచు, తద్ద్వారా తెలుపుచున్నారు.

ఈ తావున పూర్వార్ధమునే అధికారికృత్యమును తెలిపియున్నారు. శరణ్యుండై, ఈ చేతనుని రక్షించుటలో నగు భారమునంతయును తనపై బెట్టుకొనియున్నట్టివాఁడగు తన యొక్క కృత్యమును ఉత్తరార్థముచేఁ దెలిపి కృతకృత్యుండైనట్టి యీ జీవుని ఓదార్చుచున్నాఁడు.

ఈ తావున "మోక్షయిష్యామి" అను తావుననుండు ఉత్తమపురుషచేతనే "నేను" అనునది తనంతనే తెలియవచ్చుచుండఁగా, అందుఁ లక్షై ప్రత్యేకముగ ప్రయోగింపఁబడునట్టి "అహం=నేను" అనుపదము అర్థస్వభావముచే సర్వపాపవిమోచనమునకుఁగావలసినట్టి యఘటితఘటనాసామర్థ్యాదులనువివక్షించుచు ఉపయుక్తంబైనది కాఁగలదు.

అపరాధములనొనర్చినట్టి వానిని చరలోనుంచి, నాతో సమానుండును అధికుండునులేని వాఁడనగు నేను యేదొక నిమిత్తమున దయగలవాఁడనై రక్షింపఁబోవునప్పుడు, నన్ను

అడ్డు పెట్టువారు లేరు. వేఱొక్కండు ఈతనిని ముక్తునిగాఁ జేయఁజాలడని తెలుపుటయును దీనియొక్క తాత్పర్యము. ఈ యర్థము ‹‹పశవః పాశితాః పూర్వం పరమేణస్వలీలయా తేనైవమోచనీయాస్తే నాన్యైర్మోచయితుంక్షమాః'' (భగవంతుండు తనలీలచే ఈ చేతనులను సంసారబంధమున నుంచి యున్నాడు, గాన నతండే వీరిని (అట్టి సంసారబంధమునుండి విముక్తులనుగాఁ జేయఁగలడు అది వేఱొక్కనిచే కాఁజాలదు) ఈ మొదలగు తావులయందుఁ దెలుపఁబడినది.

ఈ ‹‹అహం=నేను'' అనుశబ్దమునందు సహజకారుణ్యాదులు ప్రధానంబై ప్రపత్తిమూలకముగాఁగలిగినట్టి యనుగ్రహవిశేషము అప్రధానంబై, నిరంకుశమగు స్వాతంత్ర్యము సర్వవిరోధినిరాకరణముకుగాను ముందుండగలదు, అదియెట్లనిన, సహజకారుణ్యంబనునది యేదొక స్వల్పకారణమును బట్టి లెక్కలేని యపరాధంబులను గణింపకుండునట్టి యనుగ్రహమును గలుగఁజేయుచున్నది. ఈ యనుగ్రహంబనునది కారుణ్యముతోఁగూడినదై, సర్వేశ్వరుని నిరంకుశస్వాతంత్ర్యమును, ఆశ్రితులయొక్క సమస్తవిరోధులను నివారింపఁజేయుటకనుకూలంబైనట్టి దానినిగాఁ జేయఁగలదు. ఇట్లు సర్వపాపవిమోచనముకుఁగావలసినట్టి వస్నియునుగలిగియున్నట్టి వాఁడగుసర్వేశ్వరునియొక్క నిరపేక్షకర్తృత్వమును తెలుపునట్టిదియగు ‹‹అహం=నే'' అనుశబ్దముకు (నేనేఅను)అవధారణార్థము నిశ్చితమగుచున్నది.

‹‹త్వాం=నిన్ను'' అనఁగా ‹‹నత్వేవాహం''ఇత్యాదితావులనొసంగఁబడినట్టి యుపదేశములవలన చిదచిదీశ్వరులనఁబడు

తత్త్వత్రయము విషయమున మంచి జ్ఞానముగలిగి, ఐశ్వర్యాదిపురుషార్థములు అల్పాస్థిరత్వాదోషయుక్తంబులని యెఱింగి, నన్ను పొందుటయనెడి పరమపురుషార్థమును లభించుటయందభినివేశముగలవాఁడవై అందులకుగాను ఉపదేశింపఁబడినట్టి దుష్కరోపాయాంతరములతో సంబంధము లేక, ప్రాప్యుండనై సర్వవిరోధి నిరాకరణసమర్థుండనగు నాపై భారమునంత నునుంచి కృతకృత్యుండవై కోరినఫలమును లభించుటకుగాను నొక కర్తవ్యాంతరము నొనర్చుటకు ప్రాప్తి లేనట్టి నిన్ను అనియర్థము.

ఇట్లు బంధమోక్షములకు సమర్థుండగు మోక్షప్రదుని (భగవంతుని) గుఱించియును, వానిపై భారమునుంచియున్నట్టి ముముక్షువుని (జీవుని) గుఱించియును తెలిపి, అటుపైని, ‹‹సర్వపాపేభ్యః'' అనుటచే బంధకములగు వాటిని తెలుపుచున్నారు.

పాపమనఁగా— శాస్త్రిమునుండి తెలియవచ్చునట్టిదియగు అనర్థసాధనము. అనర్థమనఁగా— ప్రతికూలప్రాప్తియును, ఆనుకూల్యనివృత్తియును, ఈ తావుననుండు ‹‹పాప'' శబ్దము ముముక్షువులవిషయమున అనిష్టఫలంబులగు సాంసారిక పుణ్యంబులనున్ను తెలుపునది. ‹‹ఏతేవై నిరయాస్తాత స్థానస్య పరమాత్మనః'' (ఇవియును (స్వర్గాదులును) పరమాత్మను బొందుట కాటంకములు) అనుటచే స్వర్గాదులు సయితము ముముక్షువువిషయమున, నరకంబులగుటంజేసి, ఈ తనివిషయమున స్వర్గహేతువులకును (పుణ్యములకును) నరకహేతువులకును (పాపములకును) భేదము లేదు. కావుననే ముముక్షువుని

గుఱించి పాపంబులను త్యజింపమని చెప్పినట్లు ‘‘త్రైవర్గికాన్ త్యజేద్ధర్మాన్’’ (ధర్మార్థకామహేతువులగు ధర్మములను (పుణ్యములను) విడనాడునది) అని చెప్పఁబడినది. ‘‘ఇరువల్వి నైకళుమ్ శరిత్తు’’ (సుకృతదుష్కృతరూపంబగు పాపద్వయమును నివర్తింపఁజేసి) అని సాయించినట్లు, పుణ్యపాపంబులు రెండున్ను ముముక్షువులచే త్యజింపవలసినవిగానును కదా శ్రుతిస్మృతులు తెలుపుచున్నవి.

ఇట్లు పుణ్యపాపరూపంబగు బంధహేతువును ‘‘సర్వపాపేభ్యః’’ అనుతావున ‘పాప’శబ్దముచేఁ దెలిపి, అందుండు బహువచనముచే నట్టి పుణ్యపాపంబులయొక్క యానంత్యము తెలుపఁబడుచున్నది, అట్లగునేని, సర్వశబ్దమెందులకంటివేని, చెప్పెదను. భగవత్ప్రాప్తికి విరోధియగు కర్మంబునకు కారణముగానును కార్యముగానును సంప్రాప్తించునట్టి యవిద్యనున్ను విపరీతవాసననున్ను, విపరీతములైనట్టివాటి విషయమున రుచినిన్ని, స్థూలముగాను సూక్ష్మముగానునుండునట్టి ప్రకృతితోఁగల సంబంధమును, వీటిని పాపరాశిలోఁజేర్చుటకుగానని యెఱుంగునది. ఇట్లు ‘‘సర్వపాపేభ్యః’’ అనుతావున తెలుపఁబడినట్టివిరోధివర్గమునంతయును, ‘‘మనోవాక్కాయైః’’ అని యారంభించి మూఁడు చూర్ణికలచే శాబ్దముగానును, అర్థముగానును సాయించియున్నారు.

‘‘తపయిత్వాధికారాన్ స్వాన్ శశ్వత్కాలేనభూయసా। వేధసోయత్రమోదంతే శంకరాస్సపురందరాః’’ (చాలా కాలమునడచిన పైని తమతమ అధికారకృత్యములను పూర్తిచేసికొని యేపరమపదమున బ్రహ్మాదులు క్రీడించుచున్నారో)

అనియు ‘‘ యావదధికారమవస్థితిరాధి కారికాణాం ’’ (బ్ర. సూ.) (అధికారనియుక్తులగు బ్రహ్మేంద్రాదులు తమ యధి కారకృత్యము పూర్తియగువరకును ఈలోకమున నుందురు) అనియును చెప్పఁబడియున్నట్లు, కొందఱికి అధికారకృత్యము ము గించినపిదప మోక్షము గలుగుట కద్దు.అట్లు అధికారనియమి తులుకాని వారికి ‘అనారబ్ధకార్యే ఏవతు పూర్వే తదవధేః’ అనుబ్రహ్మసూత్రమునఁజెప్పియున్నట్లు ప్రారబ్ధకర్మము ముగి యగానే మోక్షము గలుగుట కద్దు.ఇట్లుండ, ఈ సందర్భమున ఆరబ్ధకార్యమును (ప్రారబ్ధకర్మమును) క్షమించుట యనఁగా నేమి యంటివేని, చెప్పెదను, ఫలము నిచ్చుటకై సన్నద్ధంబై నట్టి కర్మముతోనును జన్మాంతరదివసాంతర స్థిత్యాదులఁగలు గఁజేయునట్టి యంశమున్ను ఈ స్వతంత్ర ప్రపత్తి నిష్ఠుని కని ష్టంబై, దానికిగానును ఈతండు దుఃఖపడినట్లయిన, ఆ యం శమునున్ను సర్వేశ్వరుండు క్షమించిన వెంటనే, మోక్షము లభించిననే తప్ప ధరించియుండజాలనంత ఆతురత గలవానికి ఆక్షణముననే వాని ప్రారబ్ధకర్మమునున్ను క్షమించి నిశ్శేష ముగ పోగొట్టును. కావున ప్రారబ్ధకర్మములను క్షమింపమని ప్రార్థించుటలో బాధకంబెద్దియును లేదు, ఈ తావున గద్య యందు ప్రపత్తిచేయుటకు పూర్వమొనర్చియున్నట్టి కర్మలను ‘‘తాన్’’అని పేర్కొని, అటుపైని యొనర్పంబోవునట్టివాటిని ‘‘కరిష్యమాణాః’ అని పేర్కొనియున్నారు.

ప్రపత్తికాలమునం దీతండు పాపంబుల నొనర్చుచున్న ట్లు చూచియుండలేదే? ఇట్లుండ, క్రియమాణంబులను (అప్పు డు చేయుచున్నట్టి కర్మలను)క్షమించుట యనఁగా నేమి యం

టివేని చెప్పెదను. 'ప్రారబ్ధో౽పరిమార్ష్టశ్చ వర్తమానః' అను
ప్రక్రియవలన ప్రపత్తిచేయుటకుముందుగ ఆరంభింపఁబడి, ప్రప
త్తిచేసినపిదప ముగింపవలసినంత చిరకాల సాధ్యంబులగు వా
టినిన్ని, అట్టి సమయమున, ప్రామాదికముగ నొనర్చినట్టివాటి
నిన్ని గద్యయందు 'క్రియమాణాః' అని పేర్కొనియున్నారు.
కరిష్యమాణంబు లనఁగా ఇఁకమీఁదు ఆరంభింపఁ బోవునవి.
ఇట్లు ఇప్పుడు చేయుచున్నట్టివాటిలోఁ గొన్నియును, ఇఁక
మీఁదుచేయఁ బోవునవియును నగు యాగామి కర్మంబులలో
బుద్ధిపూర్వకంబులుకాని వాటిని, ఈశ్వరుండు క్షమింపఁగా,
నవి యాతనితో సంబంధింపవు. బుద్ధిపూర్వకంబు లైనట్టివి
యున్ననో, ఈ ప్రపన్నునిగుఱించి 'ప్రాయశ్చిత్తిరియం సాత్ర
యత్పునః శరణం వ్రజేత్' అని చెప్పియున్నందున పునః ప్రపత్తి
నొనర్చుటచే శమింపఁ గలవు.

సర్వేశ్వరుండు తాను మోక్షము నివ్వఁదలంచినప్పుడు
పాతకంబులున్ను అడ్డుపడవనఁగా—ఇఁకమీఁదు ఈతండుబుద్ధి
పూర్వకముగ పాపంబుల నొనర్చినట్లయిన, సర్వేశ్వరుండు
కోపపడడనికాని, అందులకుగాను ప్రాయశ్చిత్తమున్న అక్క
ఱలేదనికాని యభిప్రాయము కాదు. అయితే దాని యభిప్రా
యమేమనఁగా—ఈతండు ఆశ్రయించుటచే సర్వేశ్వరుండు
ప్రసన్నుండైనట్లయిన, మోక్షము అవశ్యముగాఁ గలుగఁగల
దనుటయే దాని యభిప్రాయము. ఇందులకై పైని చెప్పిన ప్ర
కారము సర్వేశ్వరుం డీతనిని పునః ప్రపత్తిరూపమగు ప్రాయ
శ్చిత్తములోఁ బ్రవేశపెట్టుటయును వానికిఁగల క్షమాగుణము
యొక్క ఫలంబని యెఱుంగునది.

తాను వలసిన స్త్రీయొక్క శరీరమునందుండు మాలిన్యము కాముకునికిభోగ్యముగా నుండునట్లును, తానుకనినట్టి దూడయొక్క శరీరమునందలిమాలిన్యము ఆవునకు భోగ్యముగానుండునట్లును ప్రపన్నునియొక్క దోషంబులును అట్లేసర్వేశ్వరునికిభోగ్యములుగానుండుననుటకభిప్రాయం బెట్టిదియనఁగా— దుష్టులున్న శరణాగతులైనట్లయిన, సర్వేశ్వరుండు వారినివిడనాడక, వారిని దిద్దుపాటుచేసిరక్షించు ననుట. అట్లుకాకున్న, ప్రపన్నుండుబుద్ధిపూర్వకముగ అపరాధంబుల నొనర్చినను, సర్వేశ్వరుని కవి యిష్టంబు లంటివేని, ప్రపన్నుండు ఇట్లు బుద్ధిపూర్వకముగ అపరాధంబులను యథాశక్తి యొనర్చుచునే యుండవలసివచ్చును! ప్రకృతిభేదమునుబట్టి యపరాధంబులు బుద్ధిపూర్వకముగానే సంప్రాప్తంబు లైనప్పటికిన్ని, పునఃప్రపత్తిని చేయనివారి విషయమునను న్ను, 'దేవం శార్ఙ్గధరంవిష్ణుం యేప్రపన్నాః పరాయణం। న తేషాంయమసాలోక్యంనచ తేనరకౌకసః। యస్మిన్ కస్మిన్ కులేజాతాః యత్రకుత్రనివాసినః। వాసుదేవపరానిత్యం యమలోకంనయాంతి తే' (శార్ఙ్గధరుండగు శ్రీమన్నారాయణుని శరణుజొచ్చినట్టివారు యమలోకమును బొందరు నరకమును బొందరు. ఏకులమున జన్మించినను, ఏతావున వసించినను, విష్ణుభక్తులైనట్టివారు యమలోకమును బొందరు) అను శావులఁ జెప్పియున్నట్లు, నరకప్రాప్తి మొదలగునవి గలుగకుండచేసి, రాజపుత్రుం డపరాధంబొనర్చినప్పుడు సులభముగ నేదొక స్వల్పశిక్షను వేయునట్లు, వీరికిన్ని యేదొక స్వల్పశిక్ష నొనర్చుటయును వానికిఁగల క్షమయొక్క ఫలమే.

పాపంబుల మూలముగ ఈ లోకమున కొన్ని కష్టంబు లును, పారలౌకికములగు నరకానుభవాదులును యేర్పడి యుండి యుండఁగా, నరకాదులను ప్రపన్నులు పొందరని విశేష శాస్త్రమునఁ జెప్పియున్నట్లయిన, యీలోకమునఁ గలుగఁగల కష్టంబులను నివారించువారెవ్వరున్ను లేరే! వచన విరుద్ధముగ న్యాయము (తర్కము) ప్రవర్తింపదు గదా!

అపరాధంబుల నొనర్చినట్టివారై, యందులకై పశ్చాత్తాపమునున్ను పడక, పునః ప్రవర్తినిన్ని చేయక యుండునట్టి కొందఱి ప్రపన్నులకు శిక్షారూపములుగాను చెప్పఁబడినట్టి కాణత్వము మొదలగు లోకదృష్టంబులగు కష్టంబులు గలుగు చుండునట్లు యెచ్చటనున్ను చూచియుండలేదనుట బుద్ధిమంతులు చెప్పునట్టి మాటకాదు. ఏలయన, వారికిన్ని వారు వారొనర్చియున్నట్టి యపరాధంబుల కనుగుణముగ నానావిధ తాపత్రయానుభవమును, ఉపయుక్త జ్ఞాన మాంద్యమును, ఈ లోకమున భగవదనుభవమునకు సంకోచమున్ను, విచ్ఛేదమున్ను, భగవద్భాగవత కైంకర్య విచ్ఛేదమున్ను, భగవదపచార, భాగవతాపచారాదులును, నిందా బహిష్కారంబులును, సుకృత విశేష నాశమును, సాత్త్వికానాదరమును, మనోరథ భంగమువలని క్లేశమును ఇవ్విధంబులగు వాటిలో నెద్దియైన నొక్కటి శిక్షారూపంబగు కష్టము సంభవించునట్లు చూడ వచ్చును.

అకృత్యకరణ కృత్యాకరణ రూపంబులగు నానావిధ పాపంబులు ఇవ్విధముగ ఈ లోకమునందు కష్టములఁ గలుగఁ జేయుట యనునదియును శ్రుతులయందును మన్వాదిధర్మ

శాస్త్రములయందును, ఇతిహాసపురాణ భగవచ్ఛాస్త్రాదుల యందును ప్రసిద్ధంబగుటంజేసి, కాణత్వాదిరూపమగు కష్టము నెద్దియో యొకదానిని ఉదాహరణమునుగాఁగొనుట యుపలక్షణమునకుగానను విషయము వాక్యోపక్రమమునందు మొత్తముగ దెలిపియున్నందున తెలియుచున్నది. ప్రమాణవాక్యము నుండి తెలియవచ్చునదియై, బుద్ధిపూర్వకమగు ఆగామి పాప కర్మముయొక్క ఫలంబగు కష్టసముదాయమును ప్రారబ్ధకర్మ ఫలంబని నిర్ణయించుట కవకాశము లేదు.

సందర్భానుగుణముగ ఉభయవిధ కర్మములమూలముగసంప్రాప్తించునట్టివియైనందున కదా ! బుద్ధిపూర్వకము లగు ఆగామి పాపకర్మములకు సాత్వికులు భయపడుచుందురు. అట్లుకాకున్న, అందులకుగాను పునఃప్రవృత్తిని విధించునట్టి శాస్త్రమున్ను, అందుల కనుగుణమగు శిష్టానుష్ఠానమున్ను,పూర్వుల సంప్రదాయమున్ను విరోధించును. మరియు ‘అపచారముల నొనర్చినపిమ్మట, పశ్చాత్తాపము గలుగనట్లయిన, అట్టివానికి జ్ఞానము కలుగనే లేదని చెప్పవచ్చును’ అని నంజీయరువారి శ్రీసూక్తికిన్ని అనుతాపము గలుగని వారి యొక్క జ్ఞాన సంకోచముఁ దెలుపుటయందే తాత్పర్యము. ఏదో యొకదానినిమిత్తమున నుండునట్టి భగవదభిప్రాయముకనుగుణముగవచ్చునట్టి బుద్ధి పూర్వకాపచారము కొందఱికి కలుగదు. కొందఱికట్టియపచారముకలిగినను, అనుతాపాదులచేనశించును. కఠినస్వభావులకు అనుతాపము కలుగదు. కావున బుద్ధిపూర్వకమగు ఆగామిపాపకర్మముసంప్రాప్తించినట్లయిన,అనుతాపమును బొందినవాఁడై పునఃప్రవృత్తిని చేయనిచో, కష్టము

లు సంప్రాప్తించునని తెలుపునట్టి శ్రుతులప్రకారము ఏదొక స్వల్ప శిక్షచే నది నశించిపోవును.

శ్లో॥ వివేకినాంప్రపన్నానాంధీపూర్వాగస్యనుద్యమః
మధ్యానామనుతాపాదిః శిక్షా కఠినచేతసాం॥

తా॥ వివేకవంతులు బుద్ధిపూర్వకముగ అపరాధంబుల నొనర్పనే యొనర్పరు. సామాన్యవివేకవంతుల కట్టి యపచారములు సంభవించినను, అవి పశ్చాత్తాపాదులచే నశింపఁగలవు. కఠినస్వభావులైనట్టి వారి కవి శిక్షచేతనే నశించును.

కావున ఎవ్విధముననున్ను భగవంతుని మనస్సుకు కష్టము గలుగకుండుటకు గాను బుద్ధిపూర్వకములగు అపరాధంబులను విడనాడ వలయును.

శ్లో॥ ప్రీతిమేవ సముద్దిశ్య స్వతంత్రాజ్ఞానుపాలనే।
నిగ్రహానుదయోప్యస్య నాంతరీయకఏవ వా॥

తా॥ భగవత్ప్రీతినే యుద్దేశించి, భగవదాజ్ఞను పాలించినట్లయిన, భగవన్నిగ్రహము కలుగకపోవుటచే నందు మూలముగ భగవత్ప్రాప్తికిన్ని ఆటంకముండదు.

ఇవ్విధముగ యథాశక్తి అపరాధపడకుండ ప్రవర్తించుచున్నట్లయిన, భాగవతాపచారమును, అట్టి భాగవతాపచారముగలవారితో సంబంధమునున్ను విడనాడునది.

శ్లో॥ బ్రహ్మవిత్పాపవర్గాణామనంతానాం మహీయసాం।
తద్ద్వేషిసంక్రమంజానన్ త్రస్యేత్తదపరాధతః॥

తా॥ అనంతములును, గొప్పవియునగు బ్రహ్మవేత్తల పాపములు వారిని ద్వేషించునట్టివారికి సంక్రమించును గాన, అట్టివారియెడల అపరాధపడకూడదు.

శ్లో॥ పాపరాధేనుసంశ్లేష్యపరాధాన్ వహత్యసౌ।
వోఢుమాశ్వరకృత్యాని తద్విరోధాదభీప్సతి॥

తా॥ భగవద్ద్వేషులతో సహవాసముచేయుటచేతనున్ను ఈతండు అపరాధి యగుచున్నాడు. సర్వేశ్వరుని ద్వేషించుటచే వాని కృత్యంబులను సయితము తనపై బెట్టుకొని తానే యొనర్చవలయుననియాశపడుచున్నాడు,

పా॥ తన్నినై విల్ విలక్కిన్ని త్తనై న్నణ్ణార్।
నినైవనైత్తున్దాన్ విళైత్తుమ్ విలక్కునాతన్
ఎన్నినై వైయివ్వ త్తిలిస్తుమాఱ్ఱి
యిన్నైయడిక్కీఝ్ అడైక్కలమెన్ఱినై ఎవైత్తు
మున్నినైవాల్ యాన్ మువియన్ఱవినైయాల్వన్ద
మునివయర్న్దుము త్తిఱర మున్నే తోన్ఱి
నన్నినైవానామిశైయుజ్కాలమిన్ఱో
నాళై యో వెన్ఱునక్కై శైకిన్ఱానే.

తా॥ సత్యసంకల్పుండగు భగవంతుండు తనను ఆశ్రయించినట్టి వారి సంకల్పంబుల నన్నింటిని తానే స్వయముగ గలుగఁజేసియును, వాటిని తానే పోగొట్టునట్టివాఁడై, నాయొక్క సంకల్పమును (సంసారికసంబంధమును) ఈ సంసారమునందు ఈరోజున నివర్తింపఁజేసి, తన శ్రీపాదములక్రింద రక్ష్యవస్తువనెడి తలంపుతో నన్ను చేర్చుకొని, బుద్ధిపూర్వకముగ నేనొనర్చియున్నట్టి పాపంబుల మూలముగ తనకుఁ గలిగినట్టి కోపమును మరచిపోయి, మోక్షము నొసంగుటకై అర్చావతారముగ నాయెదుట నిలిచి, మంచి సంకల్పముతో నేను మోక్ష

ముక్తి యిష్టపడినట్టి కాలము యిప్పాళనా ? రేపా? అని పరి
హాసించునట్టివానివలెనే అత్యాదరముతో నిరీక్షించుచుండును.

తృతీయపాదార్థము - ముగిసెను.

---

చతుర్థపాదార్థము.

చతుర్థపాదము——"మోక్షయిష్యామి మాశుచః"

"మోక్షయిష్యామి=విడదలచేసెదను" అనఁగా, నీకు ఇష్ట
మైనప్పుడు ముక్తునిగాఁ జేసెదననుట. కొన్ని పాపంబులను "నక్ష
మామి=క్షమింపను" అనుటయును, ఈ తావున, 'సర్వపాప
ములనుండి విడదల చేయుచున్నాను' అని చెప్పుటయును
విరుద్ధము కాదా? కావున నిట్లుచెప్పుట ఓదార్చుటకుగాను
ఊరికె పైకిచెప్పినమాట కావచ్చునంటివేని, యీరెండును వెవ్వే
ఱు విషయములనుబట్టి యుండునవి యగుటంజేసి విరుద్ధములు
కావు. ఎట్లనిన, "నక్షమామి=క్షమింపను" అనిచెప్పినది,
"పద్మపత్రశతేనాపి నక్షమామి వసుంధరే", "ఉపచారశతేనా
పి నక్షమామివసుంధరే" అనిచెప్పియున్నట్టివాటివంటివి యగు
ప్రాయశ్చిత్తాంతరములచే క్షమింపననుట. ప్రకృతమునన్,
సర్వపాపంబులకున్ను ప్రాయశ్చిత్తముగా నుండునట్టి యొక
యుపాయవిశేషముమూలముగ అన్నింటిని క్షమించెదననుట.
"యదివారావణస్స్వయం=రావణుండు నేరుగావచ్చి శరణం
బొచ్చినను క్షమించెదను" అన్నట్లు కదా శరణ్యుండగు భగ
వంతునియొక్క యభిప్రాయంబుండగలదు?

ఇట్లు, ఇవి వెవ్వేఱు విషయములను గుఱించి యేర్పడి
నవిగాను చెప్పియున్నందున, వీటికి పరస్పరము విరోధము

లేదు. కావున నిదియోదార్చుటకై పైకిమాత్రము ఊరకె చె ప్పిన మాటయని చెప్పఁదగదు, అట్లుకాకున్న, భక్తి ప్రపత్తి రూపంబులగు మోక్షోపాయంబులను విధించునట్టి శాస్త్రంబు లన్నియును నిరర్థకంబులు కాఁగలవు.

ఈ తావున ‘‘పాపంబులనుండి విముక్తునిగాఁజేయుట’’ యనఁగా—అనాదికాలముగ యొనర్చుచువచ్చినట్టి విపరీతా నుష్ఠానములవలన నీచేతనునియెడల యీశ్వరునికిఁగలిగినట్టి కో పమును ఈశ్వరుండు తనకు తానే వదలుకొనుట. ఇట్లు కో పము పోవుటచే కోపమూలకములగు అవిద్యాదులన్నియును నివర్తింపఁగలవు. ఈశ్వరుని కోపము పోవుటయనఁగా— ‘‘మత్ప్రసాదాత్’’ అన్నట్లు వానికి ఈచేతనుని యెడల అను గ్రహము గలుగుట. జీవునియొక్క యవిద్యాదులు నివర్తించు టయనఁగా జ్ఞానవికాసాదులు మొదలగునని గలుగుట.

ఈతని కిట్లు పుణ్యపాపరూపంబగు సంసారహేతువు నశించునట్టి విధంబెద్దియంటివేని, చెప్పెదను. ఉపాయవిరో ధులు ఇంతకుముందే తమతమ కారణంబులతోఁగూడ నశిం చినట్లయిన, ప్రారబ్ధకర్మముకంటెను వేఱయినవియై భగవ త్ప్రాప్తితో విరోధింపఁగల సంచిత పుణ్యపాపంబులు ఉపా యానుష్ఠానారంభమున నిశ్శేషముగా నశింపఁగలవు. ఆగామి పాపకర్మంబులలో, బుద్ధిపూర్వకంబులు కానివియును, దేశ కాల వైషమ్యము మూలముగ సంప్రాప్తించునవియును, ఈత నితో సంబంధింపవు. ఆపత్తులో లేనప్పుడు బుద్ధిపూర్వకంబులగు ఆగామి పాపకర్మములు తమతమ యధికారంబుల కనుగుణం

బులగు ప్రాయశ్చిత్తాదుల నొనర్చుకొనుటచేగాని, శిక్షార్థం బులగు కొన్ని స్వల్పకష్టంబులను ఈ లోకమున ననుభవించుటచేగాని, నశింపఁగలవు. ప్రపన్నునికి ప్రారబ్ధకర్మానుభవము కుగాను యేర్పడినట్టి కాలమునందు పరిపాకావస్థను బొందినట్టి కర్మాంశము అనుభవముచేతను, మధ్యమధ్య నొనర్పంబడునట్టి ప్రాయశ్చిత్తంబులమూలముగను నశింపఁగలదు. దానికి పైగానుండునట్టి కర్మంబులు ఉపాయమాహాత్మ్యముచే నశింపఁగలవు. ఉభయభావనా(కర్మజ్ఞానముల) సామర్థ్యముచే సంప్రాప్తించినట్టివియు, బుద్ధిపూర్వకంబులగు ఆగామిపుణ్యకర్మంబులలో, ప్రతిబంధకలబెట్టుమునులేనివియును, ఉపాసకుని యుపాసనమునకు అనుకూలంబులగు సంచితాగామిపుణ్యకర్మములును ఫలము నొసంగి తమంతనే నశింపఁగలవు. ఉపాసనకు ఉపయుక్తంబులు కానట్టివియు, బుద్ధిపూర్వకంబులగు ఆగామిపుణ్యకర్మంబులలో, ఫలము నొసంగుటలో నాటంకపెట్టఁబడినవియును, ఉపాసనోపయుక్తంబులగు సంచితాగామి పుణ్యకర్మంబులలో అనుకూల, ప్రతికూల, ప్రబల కర్మాంతరముల ఫలంబులచేతాము ఫలము నిచ్చుటలో నాటంకపఱుపఁబడినవినై ఒకవేళ కొన్నిఫలము నిచ్చినను ఇఁకను మిగిలి యున్నట్టివియును మరణకాలమున నశింపఁగలవు. ఈ యర్థము "ఇతరస్యాప్యేవమసంశ్లేషః పాతేతు" అను బ్రహ్మసూత్రమున నుద్దేశింపఁబడినది. భగవంతుని సంతోషముకై యనుష్ఠింపఁబడినట్టి కేవలము కైంకర్యరూపంబులగు సుకృతంబులు వెంటనే ఫలము నిచ్చినవి యగుటంజేసి వాటికి, అశ్లేషము (యీాతనితో సంబంధింపవని) చెప్పనక్కఱ లేదు. లోకసంగ్రహార్థవిధిచేఅనుష్ఠింపఁబడినవి

యును, తన కవి భగవదాజ్ఞాసిద్ధము లగుటంజేసి, ఈ
తని విషయమున కేవల కైంకర్యంబులై ఫలము నొసంగినవి
యగుచున్నవి. వాటిలో మంచి యధ్యవసాయము లేనందున,
సాత్త్విక త్యాగరహితంబులుగా ననుష్ఠింపఁబడినవి యున్నట్లయిన,
అవి యన్నియును, "తాన్యేవ భావోపహతాని కల్కః" అని
చెప్పియున్నట్లు పాపతుల్యంబులై "మోక్షయిష్యామి" అను
భగవద్వాక్యము ప్రకారము విడఁదలఁ గాఁగలవు. ఫలాంతరము
లకుగాను నొనర్పఁబడినట్టి తక్కిన ప్రపత్తులును వాటివాటి
ఫలములనొసంగి పోఁగలవు. పూర్వము ప్రపత్తిచేయుటచే కో
రినట్టి ఫలముకుగాను పునః ప్రపత్తినిఁ జేయుటయనునది, పూ
ర్వము మహావిశ్వాసముతోఁగూడ అనుష్ఠించినట్టి ప్రపత్తి విష
యమగు జ్ఞానమునుబట్టికూడనిది. ప్రపత్తులన్నియును చేరి మో
క్షముకు ఒక్కటియే ఫలమునొసంగునవి యనుకొని యనుష్ఠిం
చినట్లయిన, అవి యుపాంతరములతోఁ బాటు కాఁగలవు.

బ్రహ్మవిద్యామాహాత్మ్యముచే కర్మములు నశించుట
యనఁగ — వాటికిఁ గాను ఫలము నియ్యవలయుననెడి సంకల్పము
ను భగవంతుఁడు వదలుకొనుట. అశ్లేషమనఁగా — ఈ యా
శ్రితులవిషయమున ఈ కర్మములకుగాను ఫలము నొసంగవల
యుననెడి సంకల్పము కలుగనే కలుగకుండుట.

ఇవ్విధముగ సర్వేశ్వరుండు సమస్తకర్మంబులను నశిం
పఁజేయుచుండఁగా, ఈతని స్నేహితులును శత్రువులును పం
చుకొనునట్టి కర్మంబులెవ్వియంటివేని, యవి యశ్లేషవినాశ
విషయంబులగు కర్మంబులును, బుద్ధిపూర్వకంబులగు ఆగామి

పుణ్యకర్మంబులలో ఫలము నీయకుండ, కర్మాంతరములచే నిర్బంధింపఁబడినవియును.

సర్వేశ్వరుండు ఈకర్మలకు ప్రవృత్తికాలమువంటే స్నేహితులకును శత్రువులకున్ను సంక్రమింపఁజేయకుండ, మరణకాలమువరకును నిరీక్షించియుండుటకుఁ గారణమేమంటివేని, స్నేహితులు తన యాశ్రితుని విషయమున నింతకు పూర్వమొనర్చినట్టిమేలును తప్ప దానికి పైగా విపరీతంబులను (క్రీడను) చేసినట్లయిన, ఈతని సుకృతంబులను వారికి సంక్రమింపకుండునట్లు చేయుటకున్ను, శత్రువులు తన యాశ్రితుని విషయమున ప్రాతికూల్యము నొనర్చిన పిమ్మట, అందుఁకుగాను క్షమాపణముఁ గోరుకొనుటకుగాను వారి కవకాశ మిచ్చుటకుగానును తన యాశ్రితుల మరణకాలమువరకును వారియొక్క పుణ్యపాపంబులను ఇతరులకు సంక్రమింపఁ జేయుడు మరియు స్వర్గాదిప్రాప్తికిగానగు సుకృతము ముముక్షువగు వానివిషయమున పాపముతోఁ బాటుగా నెన్నంబడునదిగాన, నదియును ముముక్షువైనట్టి స్నేహితునికి సంక్రమింపదు.

ఎవ్వరో యొనర్చినట్టి కర్మలు వేఱొక్కటికి సంక్రమించుట యనఁగానేమి? యంటివేని, యది కర్మముల నాచరించినట్టివానివిషయమున ఈశ్వరునికిఁ గలుగఁగల నిగ్రహానుగ్రహంబులతోఁ బాటు ఈతని శత్రుమిత్రుల విషయమునన్నున్ను ఈశ్వరునికి నిగ్రహానుగ్రహబుద్ధిగలుగుటయె. యెవ్వరో యొనర్చియున్నట్టి కర్మంబులకుగాను సర్వేశ్వరునికి వేఱొక్కని విషయమున నిగ్రహానుగ్రహంబులు గలుగునట్లయిన, అతిప్రసంగము రాదా? యంటివేని, యది ముముక్షువు విషయమున

అనుకూలులును, ప్రతికూలులును అయినట్టి వారొనర్చియున్న ట్టి ఉపచారాపచారరూపంబులగు కర్మంబుల కనుగుణముగ సంప్రాప్తంబగుటచే నతిప్రసంగము రాజాలదు. కావుననే కదా! ఉదాసీనులకు అనగా ఈతని విషయమున దేనినిన్ని చేసియుండని వారికి సుకృతదుష్కృతంబు లెవ్వియును సంక్ర మింపవు. ఫలసారూప్యమాత్రమును బట్టి యీతావున సంక్ర మణంబని గౌణముగాఁ జెప్పఁబడినది. అయితే ఇట్టి సుకృత దుష్కృతముల సంక్రాంతిని దెలుపునట్టి శ్రుతిచే ఈశ్వరు నికి మిక్కిలి ప్రియుండగు జ్ఞాని విషయమున నొనర్చిన ఉపచా రాపచారంబుల మూలముగ యీశ్వరునికిఁగలుగఁగల నిగ్రహా నుగ్రహంబుల యొక్క తీవ్రతమత్వము సూచింపఁబడినది య గుచున్నది.

"సుమష్కరేణశో చేద్యః" అను శ్లోకముయొక్కయ ర్థములో "సర్వపాపేభ్యః" అనునది అధికారియొక్క య పేక్ష కనుగుణముగ ప్రాప్తివిరోధులనున్ను, ఉపాయవిరోధుల నున్ను, ప్రతికూలానుభవ హేతువులనున్ను సంగ్రహించు చున్నది,

ఈ సందర్భమున ప్రాప్తివిరోధి యనఁగా—అపరాధ యుక్తుండగు యీచేతనుండు మనలను ఆనుభవింపఁజాలడనెడి భగవత్సంకల్పము. ఉపాయవిరోధియనఁగా—మనలను ఈ చేతనుండు తెలిసికొనివశపఱచుకొనజాలడనెడిభగవత్సంకల్పము ప్రతికూలానుభవ హేతువనఁగా—ఆ యా ప్రతికూలంబుల నాచరించుటచే నందులకనుగుణంబులగు ఫలముల నొసంగవల యుననెడి భగవత్సంకల్పము. ముముక్షువు విషయమున సర్వే

శ్వరునికిఁగల సమస్తనిగ్రహంబులును (కోపములును) నివర్తిం
చినట్లయిన, నిగ్రహకార్యంబులగు అచిత్సంబంధాదులును ని
గ్రహనివృత్తిరూపంబగు అనుగ్రహముచేనివర్తింపఁగలవు. అటు
పైని కారణంబెద్దియునులేనందున, కార్యసంతంబులగు ప్రతి
కూలంబులలో నొక్కటియును సంప్రాప్తింపదు. ఈ
యర్థము ‹‹అనావృత్తిశ్శబ్దాత్›› అనుసూత్రముచే వివ
క్షింపఁబడినది. ఈ నిర్ణయంబులన్నియును శ్రీభాష్యము
నందు సత్సంప్రదాయముతోఁగూడ చిరకాల పరిశ్రమముఁజేసి
నట్టి మహాప్రాజ్ఞుల మనంబున స్థిరముగానుండ గలవు.

ఇట్లు ‹‹సర్వపాపేభ్యో మోక్షయిష్యామి›› అనుటచే కా
ర్యకారణరూపములగు సమస్తప్రతిబంధకంబులును నివర్తింను
నని చెప్పియున్నందున దానిమూలముగస్వతః ప్రాప్తంబగుపరి
పూర్ణభగవదనుభవము అవిర్భావపడగలదని తెలిపినట్లయినది.

శ్లో॥ యథానక్రియతే జ్యోత్స్నా మణిప్రక్షాళనాన్మణేః।
దోషప్రహాణాన్నజ్ఞానమాత్మనః క్రియతే తథా॥

తా॥ మణియొక్క పైమురికిని కడిగివేసినందున ముం
దున్నట్టి కాంతి ప్రకటితమగుచున్నదేకాని, యది క్రొత్తగా
సృజింపఁబడనట్లు, దోషములను పోగొట్టినంతమాత్రమున ఆ
త్మయొక్క జ్ఞానమున్ను సృజింపఁబడుచుండలేదు.

శ్లో॥ యథోదపానకరణాత్ క్రియతే నజలాంబరం।
సదేవనీయతే వ్యక్తిమసతః సంభవః కుతః॥

తా॥ బావిత్రోవ్వినంతమాత్రమున జలము సృజింపఁ
బడదు కదా! అట్లే ముందున్నట్టిదే ప్రకృతమున విశదము
గాఁ దెలియును మొదటికే లేనిది యెట్లు యుత్పన్నమగును?

శ్లో॥ తథా హేయగుణధ్వంసాదవబోధాదయో గుణాః
ప్రకాశ్యంతే న జన్యంతే నిత్యా ఏవాత్మనో హి తే॥

తా॥ అట్లే హేయగుణములను నశింపఁజేయుటచే ఆత్మయొక్క జ్ఞానానందాదిగుణములు ప్రకటితములగుచున్న కాని, యవి నూతనముగా సృజింపఁబడుచుండలేదు. ఆత్మయందవి నిత్యముగా నుండునవి కదా? ఇవ్విధముగ శ్రీశౌనక మహర్షి తెలిపియున్నాడు.

జ్ఞానరూపంబగు వస్తువమును (ఆత్మయును), దానియొక్క సర్వవిషయ వికాసంబునకు స్వరూపయోగ్యతారూపంబగు శక్తియును నిత్యముగా నుండునవి యగుటంజేసి, వాటి విషయమున "ఆవిర్భవించుట=ముందున్నవే ప్రకటితములగుట" అనిచెప్పుట ముఖ్యార్థమే. సర్వవిషయవికాసమును, దుఃఖనివృత్త్యాదులును, సంకల్పాదులును, కైంకర్యములును, ఆగంతుకంబులై యుండ, అట్లుండుట అవిద్యాదిరూపమగు ప్రతిబంధకమునుబట్టి యగుటంజేసి, ఇఁక మీఁదనున్న ఇవి యెల్లకాలము యెడతెగకుండ జరుగునవి యని తెలుపుటకుగాను, వీటిని గుఱించి చెప్పునప్పుడు "ఆవిస్స్యుర్మమ సహజకైంకర్యవిధయః" ఇత్యాది తావుల "ఆవిస్స్యుః" అని ఆవిర్భావవాచకంబగుక్రియాపదమును ప్రయోగించియున్నారు. కర్మనిమిత్తముగ నానావిధములగు ఆనుకూల్య ప్రాతికూల్యములను గలుగఁజేయునవియును, భగవద్విభూతియగు వస్తువులకు ఇఁకమీఁదు మోక్షావస్థయందు ఆనుకూల్యమే స్వరూపప్రాప్తంబగుటంజేసి, ఆవిషయమునను ఆవిర్భావ

సాధింప(గలవు) అన్నట్లు తనకు శక్యంబైనట్టి యేదోక యు
పాయముచే సిద్ధించినట్లయిన, ఇట్టి యనుభవము అచేతనము
లగు శబ్దాదివిషయముల యనుభవముతోనుసు భగవదనుభవ
ముతోనుసు సంబంధములేనిదైయెనందున, దీనికి కైవల్యంబని
పేరు పెట్టియున్నారు. (కైవల్యమనగా వేఱైనది—విషయా
నుభవముకంటెను భగవదనుభవముకంటెనున్ను వేఱైనది
యని యర్థము.)

సర్వోపాధినివృత్తినిబట్టి భగవత్ప్రాప్తినిన్ని కైవల్యం
బని పేర్కొనుట కద్దు. ఆత్మమాత్రానుభవమును తెలుపునట్టి
దిగాను, స్వాత్మానుభూతిరితియాకిలము క్తిరుక్తా'' ఇత్యాది తా
వుల బ్రయోగింపఁబడినట్టి 'ముక్తి' శబ్దమున్ను ''విగతేచ్ఛాభ
యక్రోధో యస్సదాముక్త ఏవసః'' ఇత్యాది తావులం బ్రయో
గింపఁబడినట్టి ముక్తి'' శబ్దమునకు వలెనే యేదోకవిధముగ అర్థ
ముచేసికొనునది. ''జరా మరణ మోక్షాయ'' అని చెప్పినది
యును, దేవతలు అమరులు (మరణరహితులు) అన్నట్లు
కొంతవరకు కాలావధినిబట్టి చెప్పినమాట. అథవా, ఈతా
వున క్రమేణ ముక్తి కలుగఁగలదని చెప్పినట్లును కావచ్చును.
ఇవ్విధముననే విభవ, వ్యూహ, సాలోక్యాది మాత్రమును
గుఱించి చెప్పఁబడినట్టి ముక్తి శబ్దమునకున్ను అర్థము చేసి
కొనునది.

''లోకేషు విష్ణోః నివసన్తి కేచిత్ సమీపమృచ్ఛంతి చ
కేచిదన్యే । అన్యేతు రూపం సదృశం భజంతే సాయుజ్యమ
న్యే సతు మోక్షఉక్తః'' (కొందరు విష్ణులోకమున వసించుచు
న్నారు. కొందఱు విష్ణువుయొక్క సమీపమును బొందుచు

న్నారు. మరికొందఱు విష్ణువుతో సారూప్యమును బొందుచు న్నారు. మరికొందఱు సాయుజ్యమును పొందుచున్నారు. సాయుజ్యంబనునదియే మోక్షమనఁబడుచున్నది) అని యివ్విధముగ నియమింపఁబడియున్నది కదా! ఈ కావునఁజెప్పఁబడినట్టి సాయుజ్యంబనునది పరమపదమునకుఁ బోయినట్టి వానికిఁ గలుగునట్టి భోగసామ్యము.

కేవలము ఆత్మానుభవము నిత్యంబైనదికాదను విషయమును, సాక్షాత్తుగా నది మోక్షముకాదను విషయమున్ను ‹‹చతుర్విధా మమజనాః భక్తా ఏవహి తే శ్రుతాః తేషామేకాంతినశ్శ్రేష్ఠా స్తే చైవానన్యదేవతాః। అహమేవ గతి స్తేషాం నిరాశీఃకర్మకారిణాం। యేతుశిష్టాస్త్రయోభక్తాః ఫలకామాహి తేమతాః। సర్వేచ్యవనధర్మాణః ప్రతిబుద్ధస్తు మోక్షభాక్'' (నాయొక్క భక్తులు నాలు తెగలవారు. వారిలో ఏకాంతులు శ్రేష్ఠులు, వారు వేఱొక్కదేవత నారాధించునట్టి వారుకారు. ఫలాపేక్షతో కర్మలననుష్ఠించునట్టివారున్ను కారు. వారికి నేనే రక్షకుండను. తక్కిన ముగ్గురును ఫలాపేక్షకలవారు. వారు పొందునట్టి ఫలములును నశ్వరములు. కావున పరమైకాంతియగు జ్ఞానియే మోక్షమును బొందునట్టివాఁడు) అనువాక్యములవలన సిద్ధమగుచున్నది (అనఁగా మోక్షము తప్ప తక్కినవన్నియును నశ్వరములనుటచే మోక్షేతరంబగు కైవల్యమున్ను నశ్వరంబని యేర్పడుచున్నది) మరియు ‹‹ముచ్యేతార్తస్తథారోగాత్ శ్రుత్వేమామాదితః కథాం। జిజ్ఞాసుర్లభతేభక్తిం భక్తో భక్తగతింలభేత్'' అనుకావున శ్రీభగవద్గీతలయందు ‹‹జిజ్ఞాసుః'' అను పదముచే పేర్కొనఁబడినట్టి

యాత్మనిష్ఠుండును (కేవలుండును) క్రమేణ జ్ఞాని కాఁగల డని చెప్పఁబడినది. ‹‹మఱ్ఱ్నతిల్=నిత్యసిద్ధంబగు పరమపురుషార్థము నపేక్షించితివేని'' అను పాశురమున భగవదనుభవమును నిత్యంబైనట్టి దానినిగాఁ దెలుపుటంజేసియును, దీని కంటెను వేఱయినదిగాను తెలియవచ్చునట్టి యాత్మ మాత్రానుభవము (కైవల్యము) నిత్యంబైనదికాదని సూచితంబగుచున్నది. ‹‹ఇతుక్కు ఇరుతికూడా=నాశరహితంబైనది'' ఇత్యాది తావులయందు దీనికి నాశములేదని చెప్పుటయును చాతుర్మాస్యాదికర్మఫలంబులను నాశరహితంబులని చెప్పినట్లు ‹‹ఎన్నై యూ ప్తి=అనేకకాలవర్తి'' అన్నట్లు అది చిరకాలస్థాయియని తెలుపుటయంగే యుద్దేశము. ‹‹యోగినామమృతం స్థానం స్వాత్మ సంతోషకారిణాం'' అనుతావున ఈ యాత్మానుభవమునకుగాను ఒకస్థానవిశేషమును చెప్పఁబడినది. ఈ స్థానము పరమపదము కాదను విషయము ఈ ప్రకరణమునందే ‹‹ఏకాంతినస్సదా బ్రహ్మ ధ్యాయినో యోగినో హియే తేషాం తత్పరమంస్థానం యద్వై పశ్యంతి సూరయః'' అని భగవత్ప్రాప్తిని కోరునట్టివాఁడగు పరమైకాంతికి నిత్యసూరిసేవ్యంబగు స్థానాంతరమును చెప్పియున్నందున సిద్ధమగుచున్నది. పంచాగ్నివిద్యాదులయందుఁ జెప్పియున్నట్టి బ్రహ్మాత్మకత్వానుసంధానముఁజేయునట్టివానికి అర్చిరాదిగతియును, బ్రహ్మప్రాప్తియును కలవని శ్రీభాష్యాదులయందుః జెప్పియున్నది, కావున పంచాగ్ని విద్యానిష్ఠులకు ఆత్మమాత్రానుభవరూపంబగు అవాంతరఫలము సంప్రాప్తించినను, మధువిద్యాన్యా

యప్రకార మది బ్రహ్మప్రాప్తి పర్యంతము యీతనిఁగొని పోవును.

ప్రకృతితోఁగూడియున్నట్టిది గాని, ప్రకృతిసంబంధము లేనిదై కాని యుండునట్టి యాత్మవస్తువును ప్రత్యేకముగ దానిని గాని, దానియందు బ్రహ్మదృష్టినుంచి గాని యుపాసించుట యనెడి యీనాల్గువిధంబులగు ఉపాసనములకును "నామబ్రహ్మేత్యుపాసీత" ఇత్యాది నామాద్యుపాసనములకు వలెనే అర్చిరాదిగతియును, బ్రహ్మప్రాప్తియును లేవను విషయమును "అప్రతీకాలంబనాన్నయతీతి బాదరాయణః ఉభయథాచ దోషాత్తత్క్రతుశ్చ" అను బ్రహ్మసూత్రమునఁదెలిపియున్నారు "శ్రుతోపనిషత్కగత్యభిధానాచ్చ" అను సూత్రమునందును ఒకయుపాసనమున ఉపాస్యవస్తువు। పరమాత్మయనెడివిషయమును ఆయుపాసనమునందు అర్చిరాదిగతిచెప్పియుండుటనుబట్టి సాధించియున్నందున, జీవమాత్రమును ఉపాసించునట్టి వారికి (ఆత్మోపాసకులకు) అర్చిరాదిగతి లేదని సిద్ధమగుచున్నది. కావున బ్రహ్మప్రాప్తిలేనివారికి ఈ చరమశ్లోకమునఁజెప్పియున్నట్టి సర్వపాపనివృత్తి కలుగదు. సర్వపాపనివృత్తి గలిగినవారికి బ్రహ్మానుభవమునందు యెవ్విధమైనట్టి కొరతయును ఉండజాలదు.

ఇట్లు ఈ చరమశ్లోకమున సర్వపాపనివృత్తి చెప్పియుండుటనుబట్టి కేవలాత్మానుభవమునకు కారణంబై, పరిపూర్ణభగవదనుభవమునకు ప్రతిబంధకంబైనట్టి కర్మవిశేషమున్ను తొలఁగి పోవుటంజేసి, "మామేవైష్యసి" అని ముందుశ్లోకమునఁజెప్పియున్నట్టి యర్థము ఈ తావున సిద్ధమగుచున్నది.

“మామేవైష్యసి” అను శ్లోకమునఁ జెప్పియున్నట్టి ప్రాప్తియనునది పరిపూర్ణానుభవము; ఈ పరిపూర్ణానుభవము సిద్ధించుటకుగాను అర్చిరాదిగతియును, దేశవిశేషప్రాప్తియును గలుగవలయును. ఇవ్విధముగానే యిట్టి యనుభవము గలుగు నట్లు భగవంతుండు అనాదికాలముగ నియమించియున్నాఁడను విషయము ఈయర్చిరాదిగతి విశేషాదులఁ బ్రతిపాదించునట్టి శాస్త్రమువలనఁ దెలియుచున్నది. ఈ యర్చిరాదిగతి గలుగుటకు ముందు శాస్త్రమువలన బ్రహ్మ స్వరూపముఁ దెలిసి కొనునప్పుడును, విభవ లోకాదులను బొందినప్పుడును ఆత్మ నికిఁ గలుగునట్టి ప్రకాశము ( జ్ఞానము ) సుకృతాధీనంబై యున్నను, ఇంద్రియాధీనంబైయున్నను గలుగునట్టిది యగుటం జేసి, యది పరిమితంబైనది గానును, నాశయుక్తం బైనట్టిది గాను నుండ గలదు, మోక్షానస్థయందు గలుగునట్టి ప్రకాశమున్ననో, అప్పుడు సంకోచ విచ్ఛేదంబులకు కారణం బెద్ది యును లేక పోవుటంజేసి, పరిపూర్ణ విషయం బైనదిగాను, నాశరహితం బైనట్టిది గాను నుండగలదు, ఇట్టి పరిపూర్ణాను భవము మూలముగ “క్రియతామితి మాంవద” అన్నట్లు భగవదభీష్టంబగు కైంకర్యము తనంతనే సిద్ధింపఁగలదు. “పారమార్థిక” అను తావున గద్యయందుఁ జెప్పియున్నట్టి ఫలపర్వపరంపర యంతయును ఈసందర్భమున యథాప్రమా ణము వివక్షింపఁ బడుచున్నది,

“మాశుచః=దుఃఖింపకుము” అనుటచే ముందు చెప్పి నట్టి యర్థముయొక్క పర్యవసానము తెలుపఁబడుచున్నది,

“మాశుచః” అనునది విధి యగుటంజేసి, ప్రపన్నుం

డైన పిమ్మటనున్ను శోకించుట విధిని అతిక్రమించి ప్రవర్తించుటయై, ఈతనిని ఉపాయభూతుండగు సర్వేశ్వరుండు విడనాడి, తనపనిని తానే నెరవేర్చుకొనువాఁడగుట యనెడి యాపత్తు సంభవించునని కొందఱు చెప్పినది, బుద్ధిపూర్వకంబులగు ఆగామి పాపకర్మంబులనున్న 'సర్వపాపేభ్యః' అనుదానిలో నిమిడ్చి తామే చేసినట్టి వ్యాఖ్యానమున్ను, ప్రపన్నుండైనట్టివానిని భగవంతుఁడెన్నటికిన్ని విడనాడడని తెలుపునట్టివాక్యములకున్న, విరుద్ధము కాఁగలదు. కావున ఈ యుపాయము నవలంబించినట్టి వానిని శోకహేతువులన్నియును విడిచిపోవుటం జేసి, 'ఇఁక దుఃఖపడవద్దు' అని తెలుపుచు విశ్వాసమును దృఢపఱచుటయే 'మాశుచః' అను దానితాత్పర్యము.

'బంధునాశాదయః పూర్వం బహవశ్శోకహేతవః। తత్తత్సముచితైస్సమ్యగుపదేశైరపోదితాః। సుదుష్కరత్వాద్ధర్మాణామపారత్వాద్విరోధినాం సిద్ధః ఫలవిలంబాచ్చ శోకోద్య వినివార్యతే' అనఁగా అభిమత ఫలమునకుఁగానగు సాధనము దుష్కరంబైనది కాకుండ. సమస్త నిరోధులను తొలగించుటకు సమర్థంబైనదై, ఫలము నొసంగుటలో నాలస్యమునుచేయనిది యగు ఈ యుపాయవిశేషము (ప్రపత్తి) ఉపదేశింపఁబడిన పిమ్మట, ఉపాయదుష్కరత్వాదుల మూలముగ నీవు దుఃఖింపఁబనిలేదు. ఈ యుపాయమును అనుష్ఠించితివేని, నీ పని నాపై బడినదై, అది నాపనియై నిన్ను రక్షింపక పోతినేని, నాకు తలవంపులు కలుగునట్లుండునట్టి యాస్థితియందును, నాసొత్తువంటి వాఁడవగు నీకు దుఃఖపడవలసినది యేమున్నది! యని యభిప్రాయము.

ఈతావున దుఃఖపడవలదని చెప్పుటచే నిషేధింపఁబడు
నట్టి దుఃఖంబనునది బంధువధాదులమూలముగఁ గలిగినదై,
యాత్మస్వరూప జ్ఞానాదుల నుపదేశించుటచే పోయినట్టి పూ
ర్వపు దుఃఖము కాదు. ప్రకృతసందర్భమునుబట్టి యిది వేఱే
దుఃఖము. అది యెట్లనిన, 'దైవీ సమ్పద్విమోక్షాయ నిబంధా
యాసురీమతా' (దేవస్వభావము మోక్షముకైనది. అసుర
స్వభావము నరకదాయకము) అని ప్రకృతులనువిడతీసిచెప్పినతో
డనేమనము అసురస్వభావులమై యున్నట్లయిన, ఏమి చేయఁగ
లము? అనుకొని దుఃఖపడునట్టి యర్జునుని గుఱించి, 'మాశుచ
స్సంపదం దైవీ మభిజాతోఽసి పాండవ' (దుఃఖపడకుము నీవు
దైవస్వభావముగలవాఁడవు) అని చెప్పినతోడనే శ్లాఘ్యఫలం
బగు మోక్షంబెప్పుడు గలుగునాయని తొందర గలిగినప్పుడు,
చిరకాలానుష్ఠేయంబై విఘ్నబహుళమై, మంచి బుద్ధిమంతుల
కున్ను కష్టసాధ్యంబగు ఉపాయమునున్ను (భక్తినిన్ని) తన
యొక్క శక్తినిన్ని చూచి మనకీ యుపాయానుష్ఠానము నెర
వేరి, ఫలము సిద్ధించుట యెక్కడ? అనుకొని దుఃఖపడునట్టి
యర్జునునికి క్షణకాల సాధ్యంబై, విఘ్నము లెవ్వియును
ఎంతమాత్రము లేనిదై, సులభ సాధ్యంబగు ఉపాయమును
(శరణాగతిని) చూపించియిచ్చి, అందుమూలముగ ఫలసిద్ధి
విషయమున నిశ్చింతుండును, నిస్సంశయుండును నగునట్లుచేసి,
'మాశుచః = దుఃఖింపకుము' అని చెప్పినట్లయిన, అది ఉపా
యాంతరములు దుష్కరంబులగుటను బట్టి కలిగినట్టి దుఃఖము
ను పోగొట్టుట కాఁగలదు. ఇంతియే కదా!

ఈ భగవద్గీతలయందు ముందుగ ప్రకృత్యాత్మ వివేక ముఁ గలుగఁజేసి, అటుపిమ్మట క్రమముగ మోక్షకారణంబులగు కర్మయోగ జ్ఞానయోగంబులను, సాక్షాత్తుగ మోక్షసాధనముగాను వేదాంతశాస్త్రముచే విధింపఁబడినట్టి భక్తియోగమునున్న, ఆయా యంగములతో సహా ఉపదేశించి, 'ఇతి తే జ్ఞానమాఖ్యాతం గుహ్యాద్గుహ్యతమం మయా! విమృశ్యైతదశేషేణ యథేచ్ఛసి తథాకురు' (మిక్కిలి రహస్యంబైనట్టి జ్ఞానమును నీకు తెలిపియున్నాను దీనిని బాగుగ పరిశీలించి నీయిష్టమువొచ్చిన విధమునఁ జేయుమూ' అని చెప్పఁవెంటనే, యర్జునుని ముఖము ( దుఃఖముచే ) వాడిపోవుటను జూచియును, వెంటనే సులభోపాయమును తెలియఁజేయక, 'పరీక్షాంచ జగన్నాథః కరోత్య ధృఢచేతసాం' (స్థిరమనస్కులుకాని వారిని భగవంతుండు పరీక్షింపును ) అన్నట్టి నియమముఁజూచి మేము ఇట్టిది నీకుసాక్షాన్మోక్షసాధనమగుపరమహితము. ఇది ప్రధానంబని నిర్ణయించి చెప్పి, యిందులకను గుణముగ ప్రవర్తింపుమని నియమింపక, మార్గస్థునితో ఈదారి విదర్భదేశముకుఁ బోవునది ఆదారి కోసలదేశముకుఁ బోవునది యిష్టప్రకారము పొమ్మని చెప్పినట్లు, ఉపేక్షకుండనిఅనుమానపడుట కవకాశమిచ్చునట్లు, నీయిష్టము వచ్చినట్లుచేయుమనిచెప్పి విడనాడినామని తలంచుకొని యందుమూలముగ దుఃఖించి నాడనుకొని, ఇంకను ఒకపర్యాయము భక్తియోగమును గుఱించి నిష్కర్షించి యుపదేశించి చూచెదమనుకొని ఇదియును నొకవినోదముఁ జేయఁబూని, ముందు ఉపదేశించినట్టి భక్తియోగమునే 'సర్వగుహ్య తమంభూ

యః' అను శ్లోకము మొదలుకొని రెండుశ్లోకములచే నమ్మకము
కలుగునట్లు, నిష్కర్షించి నియమింపఁగా, అప్పుడును ఈతని శ్లోక
ము రెట్టింపైనదానిఁ గటాక్షించినట్టి సారథియగు సర్వేశ్వరుండు
ఇఁక యీతండు పరమరహస్యంబై సులభంబైనట్టి మోక్షోపా
యమును ఉపదేశించుటకు సంపూర్ణముగ అర్హుండైనాడని
తలంచి, సాధింపఁబోవునట్టి గొప్పసులభోపాయమును (శరణా
గతిని) స్తుతించుటకుగానైనను కొంచము సేపు ఆలస్యముచే
యక వెంటనే సకలఫలసాధనంబై స్వవిషయంబగు శరణా
గతిని యుపదేశించి, ఈతని యొక్క మనోరథమునకును (మ
నోరూపంబగు రథమునకును) సారథియై, సమస్తదుఃఖంబుల
నున్ను పోఁగొట్టుచున్నందున, ఈతావున నివారింపఁబడునట్టి
శోకము ముందెప్పుడో కలిగినట్టి శోకముకంటెను వేఱైనదని,
ప్రకరణమును పరిశీలించి చూచినట్లైన, విశదము కాఁగలదు.

వేఱొక్కయుపాయంబెద్దియును లేనివానినిగుఱించి,
'మామేకం శరణం వ్రజ' అని విధించియున్న ప్రకారము, అస
మర్థుండైనవాఁడు సమర్థుండైనవాని చేతిలో తనభారమునంత
యును యొప్పచెప్పుటం జేసియును స్వతంత్రుండును, కారుణికుండు
నునగు శేషి అట్టి భారమును తనపైపెట్టికొనియున్నందునను,
ఈ చరమశ్లోకమునందలి పూర్వార్ధమునందు నిర్భరత్వమును,
సర్వసమర్థుండై భారమును స్వీకరించినట్టివాఁడును, ఆశ్రితులవి
షయమున సత్యవాదియగు శేషి 'అహంత్వా సర్వపాపేభ్యో
మోక్షయిష్యామి' అని చెప్పియున్నందున వానిపై భారము
నంతయును ఉంచియున్నవాఁడగు ఈతనికి ఇఁక మీఁదను నరకాది
రూపంబులగు ఆటంకములెవ్వియైనను వచ్చునేమోయనియును

మానపక్షటకున్ను ప్రసక్తిలేకపోవుటంజేసి నిర్భయత్వమును, ఈశ్లోకము ఆశ్రితులను విడనాడనట్టి యార్జవగుణముగల శ్రీరంగనాథుండు చెప్పినమాట యగుటంజేసి నిస్సంశయత్వమును ఇవి సిద్ధముగుచున్నవి. కావున ఉపాయశ్రవణానుష్ఠానంబులు ప్రసక్తించినట్లయిన, ఉపాయమునుబట్టియును, ఫలమునుబట్టియును శోకింపఁబనిలేదని యీతావునఁ దెలుపఁబడినది.

ఈ పైని చెప్పిన దానినిబట్టి శోకావిష్టుండైనట్టి వాఁడు, ప్రపత్తికి అధికారియని తెలియవచ్చుచుండఁగా, 'అహం భీతో స్మి' (నేను భయపడుచున్నాను) అనియు, 'పావీతల్హవెన మొ త్రివతఅ్కుంజి నమ్బనేవందుక్ వడియడైందేక్' (పాపియైనట్టి నేను యమయాతనలకు భయపడి మహావిశ్వాసముతో నీ శ్రీపాదములనాశ్రయించినాడను) అనియు నిట్లు భయపడినట్టివాఁడు ప్రపత్తికి యధికారియనుట యెట్లంటివేని, ముందు అభీష్టము సిద్ధింపకున్నట్టి స్థితినిజూచుటచే దుఃఖమును, ఇఁక మీఁదు అభీష్టము సిద్ధించుటలో ప్రతిబంధకంబులగు ప్రబల విరోధులఁగని భయమును కలుగవచ్చును గాన,ముముక్షువుకు ఇష్టప్రాప్తి, అనిష్టనివృత్తులలో నొక్కటి యున్నట్లు చెప్పినట్లయిన, రెండును ఉండియున్నట్లు తెలియవచ్చునట్లు, అధికారమును గుఱించియును భయశోకంబులలో నొక్కదానిని పేర్కొనినట్లయిన, రెండును ఉన్నట్టివి గానే తెలియఁగలవు.

కావున, అత్యంతము అకించనుండైనట్టి వానికి భయశోకంబులు రెండును అతిశయించి యుండును గాన, ఈతావున మిక్కిలి దుఃఖితుండైనట్టి యధికారికి తగినట్టి యుపాయమును జూపించి ఈతనిని సంశయ రహితునిగాను, సంతుష్టమానసుని

గాను చేసి యుగించుచున్నది. ఇట్టి మిక్కుటమగు భయము కు భయపడినట్టి నీవు నన్ను ఆశ్రయింపుమని చెప్పినట్టివారు వచ్చియుర్నాగసియును చెప్పియున్నాము,

ఇట్లు కృతకృత్యుండగు ఈతనికి 'కర్మతత్తు సమాచరేత్' అని విధింపఁబడినట్టి కర్తవ్యాంతరము కైంకర్యముతోఁ జేరియుండునట్టి సదాచారమును గుఱించి చెప్పినదియగు విషయము పూర్వాపర గ్రంథంబులను బట్టియును, ఈశ్లోకమునందును 'అక్రియావదనర్థాయ' (క్రియ లేనిది యనర్థము) అని చెప్పియున్నందునను సిద్ధమగుచున్నది.

కావున నీకమీఁదు ఫలము సిద్ధించువిషయమున సంశయము లేకపోవుటం జేసియును, మోక్షోపాయముగాను నొక్కటియును చేయనక్కఱ లేనందునను, ఈతండు చేయవలసినది భగవదాజ్ఞాను పాలనరూపంబగు స్వయం ప్రయోజనంబు (కైంకర్యంబు) అగుటం జేసియును, అపరాధంబులు ప్రసక్తించినట్లయిన, వేఱొక్క యధికారమునఁ జెప్పియున్న ప్రకారము, అనుతాపాదుల మూలముగ పరిహృతంబులగుటం జేసియును, ఈతని మనస్సుకు సంతోషము గలుగుటలో బాధకం బెద్దియును లేదు.

ఈ సంతోషంబనునది వివేకియున్నై, హేయంబులగు శరీరాదులతో సంబంధముగల యీతనికి నిర్వేద (వైరాగ్య)మిశ్రంబై యుండియున్నట్టిదే యైనను, నిర్వేదమును, శోకనివృత్తియును భిన్నవిషయంబు లగుటం జేసి విరోధము లేదు.

మాశుచః' అనునదియే శోకనిమిత్తంబులైనవి యన్నియును విడనాడవలసినవియనుటకు నియమనంబగుటంజేసి,

ప్రారబ్ధకర్మమునందును శోకనిమిత్తంబగు అంశమంతయును విడిచిపోవుటంజేసి మిక్కుటమగు ఆర్తిగల వానికి తత్క్షణమే మోక్షము సిద్ధించును. 'మరణమానాల్ వైకున్దమ్ కొడుక్కుమ్ పిరాన్' (దేహవియోగంబైనట్లయిన, మోక్షమునొసంగునట్టి యుపకారకుండు) ఇత్యాదితావుల( జెప్పియున్నట్లు ప్రారబ్ధకర్మములో శేషించినదంతయును నశించిపోయి, శరీరావసాన కాలమున మోక్షము సిద్ధించునని యొప్పుకొనవలసినందున, ఈశరీరము విషయమునను అయుశ్శేషము అనిష్టంబుగా(దోచినప్పుడు, ప్రపత్తిచే వశపఱచుకొన(బడినట్టి వా(డును, సర్వసమర్థుండునగు సర్వేశ్వరునియొక్క సంకల్పముచే నదియును నశించిపోవుటలో బాధకములేదు కదా!

శ్లో॥ ప్రాయశ్చిత్త విశేషేషు సర్వస్వారాదికర్మసు।
నాత్మహింసన దోషాస్తి తథార్తశరణాగతౌ॥

తా॥ ప్రాయశ్చిత్తరూపములగు సర్వస్వారాది కర్మలయందును, అర్తుల శరణాగతి యందును ఆత్మహింసారూపంబగు దోషము లేదు.

శ్లో॥ దృప్తస్యతు యథా శాస్త్రం చిరంజీవితు మిచ్ఛతః।
ప్రాణరక్షణ శాస్త్రార్థ లంఘనంత్వపరాధనం॥

తా॥ చిరకాల జీవనేచ్ఛగలవా(డగు దృప్తప్రపన్నుండు ప్రాణరక్షణ శాస్త్రము నతిక్రమించి ప్రవర్తించుట అపరాధముగా నెన్న(బడుచున్నది,

యోగులు యోగవిశేషముచే దేహమును విడనాడునట్లు, ఎక్కువ యార్తిగలవా(డు, ప్రపత్తిమూలముగ దేహమును విడనాడుటకుగాను తీర్థప్రవేశాదులయందువలెనే యు

గవిశేష నియమం బెద్దియును లేదు. ఈయార్త ప్రపన్నుండే యందఱికంటెను శీఘ్రముగ ఆత్మరక్షణముఁ జేసికొనువాఁడు.

ఇట్లు ఆర్తుండనియును, దృప్తుఁడనియు నిట్టి భేదమును ఈతనికిఁ గలిగినట్టి శోకమునఁగల తారతమ్యమును బట్టి చెప్పబడినది. ఇంతియే కాని, ఒక్కనికి దుఃఖము కలుగదన్న మాట కాదు. జన్మాంతరాది మాత్రము శోకనిమిత్తంబై, ఏదొకరోజున మోక్షమును పొందగలమనుకొని, సహించుయుండునట్టివాఁడు ఈతావున దృప్తప్రపన్నుం డనఁబడుచున్నాఁడు. ఇంతియె కాని, గొప్పవారిని అవమానపఱచుట మొదలగు వాటికి హేతుభూతంబగు గర్వమనఁబడు అనాత్మగుణము గలవాఁడని యర్థము కాదు. ఈశరీరముతోనున్నప్పుడు చతుర్ముఖునియైశ్వర్యము లభించినను, అది పరిపూర్ణంబగు భగవదనుభవముతో విరోధించునదిగానైనందున, నిట్లు అనర్థకరంబగు దేహసంబంధమున్ను గొప్పయగ్నివలెనే దుస్సహంబైనదై, 'ఉడలుముయిఱుమ్ పంగవొట్టు' (శరీరమున్ను, ప్రాణములున్నున్ను విడనాడునట్లు ఆజ్ఞాపింపుమా!) అని ప్రార్థించినట్లు, ప్రపత్తి నొనర్చినపిదప క్షణమాత్రంబైనను, మోక్షము గలుగుటలో నాలస్యమును సహించియుండజాలని వాఁడు ఆర్త ప్రపన్నుం డనఁబడుచున్నాడు. ఇంతియెకాని, నాడు 'ఆర్తోజిజ్ఞాసురర్థార్థీ' అనుతావున ఆర్తుండని పేర్కొనఁబడినట్టివాఁడు కాదు. 'ఆర్తోవాయదివా దృప్తః' అనునది అతివాదంబని చెప్పునట్టివారికిని ఈతావున ఈయర్థము విషయమున వివాదముఁ జేయకూడదు. మోక్షంబనునది యుపాయానుష్ఠానము నొనర్చినపిమ్మట గలుగఁబోవునది యగుటం జేసియును ఇది యుపదేశసమయమగు

టంజేసియును ఈయార్త ప్రపన్నుని విషయమునను 'మోక్షయిష్యామి' అని భవిష్యత్కాల క్రియను నిర్దేశించుటలో బాధకం బెద్దియును లేదు. ఇట్లు ఆర్త ప్రపన్నుండనియు, దృప్త ప్రపన్నుండనియును ఇవ్విధంబులగు విభాగంబులన్నియును సుకృత తారతమ్యము మూలకముగ భగవదనుగ్రహమునం గల తారతమ్యమువలన రాగలవు.

'ప్రారబ్ధ మాత్రభుక్త్వత్ర తత్త్వవిత్సుఖ మాప్నుయాత్' (ప్రారబ్ధకర్మమును మాత్రము అనుభవించుచు నచట సుఖముగా నుండగలడు) ఈ మొదలగునవి ఆర్త ప్రపన్నుని గుఱించి చెప్పినవనుట కవకాశము లేదు. దృప్త ప్రపన్నునివిషయమగు ఉత్తర కృత్యాంశమును గుఱించి, 'మాశుచః' అను వాక్యముయొక్క యభిప్రాయమును 'ఆధ్యాత్మికాధి భౌతిక' అని యారంభించి 'అతస్త్వం తవ తత్త్వతో మత్ జ్ఞాన దర్శన ప్రాప్తిషు నిస్సంశయ స్సుఖమాస్వ' (కావున నీవు నావిషయమగు తత్త్వజ్ఞానము, సాక్షాత్కారము వీటివిషయమున సంశయరహితుండవై సుఖముగా నుండుము' అని సాయించియున్నారు. ఈతావున చెప్పంబడినట్టి శోకనివృత్తికి ఒక్కవిధమునను సంకోచాపాదకంబైనది లేనందున, ఈ యుపాయ విశేషమును (ప్రపత్తిని) గుఱించిన జ్ఞానముచేతను, అనుష్ఠానముచేతనున్ను సర్వవిధములగు శోక హేతువులన్నియును నివర్తించునట్లు చెప్పంబడినది. అనుష్ఠాన పర్యంతము కానట్టిదియగు జ్ఞానముమాత్రము ఈయుపదేశముచేఁ గలిగినను, 'నగాధాగాధినంశాస్తి బహుచేదపి గాయతి । ప్రకృతింయాంతిభూతాని కులింగశకునిర్యథా' (శాస్త్రము నెంతచదివినను అనుభవ

ములేకున్నట్లయిన,* కళింగపక్షివలెనే ఆయాయింద్రియములు వాటిస్వభావముప్రకారము ప్రవర్తించును. ) అన్నట్లునివృత్తి యోజనము. కావున జ్ఞానానుష్ఠానంబుల రెంటియొక్కయును ఫలంబగు శోకనివృత్తియంతయును ఈతావున వివక్షింపఁబడు చున్నది.

కావున ఉపాయానుష్ఠాన దశయందు పూర్వాపర మధ్యదశలనుబట్టి సంభావితంబగు శోకంబంతయును ఈతావున నివర్తింపఁబడుచున్నది. అది యెట్లనిన, అధికారమునుబట్టి యును, ఉత్తరకృత్యమును బట్టియును, పరిపూర్ణకైంకర్య పర్యంతంబగు ఫలసిద్ధిని బట్టియును అనేకవిధములుగ శోకము గలుగుట కవకాశము కలదు. అందులో, అనుష్ఠింపఁబోవునట్టి శరణాగతి ధర్మము జాతి, వర్ణ, ఆశ్రమాది నియమరూపంబులగు నిర్బంధము లెవ్వియును లేనిది యగుటంజేసి, ప్రాప్యరుచియును, ప్రాపక (భగవంతునియెడల) విశ్వాసమును, ఆకించన్యజ్ఞానాదులును ఉండియుండఁగా, ఒక్కరికిన్ని మనము దీని కధికారులము కామనుకొని దుఃఖపడ నక్కఱ లేదు.

ఈయుపాయము (శరణాగతి) అంగములతోసహా క్షణకాలసాధ్యంబై, సుశకంబై, పదేపదే యాచరింపవలసినది కానిదై, ఉపాయాంతర వ్యవధానమున్ను, దుష్కరంబగు అంగాంతరమున్ను లేకుండ యుండునదియై, కోరినకాలమున

* కళింగపక్షియనునది యొక పక్షి, అది 'సాహసము చేయకుము' అని పలుకుచుండును. అట్లు పలుకుచున్నను, అది సింహము ఆవలించునప్పుడు దాని కడుపులోనికిదూరి అందుండు మాంసమును గొనిపోవుటయను నెడి సాహసకృత్యముల నాచరించుచునే యుండును.

అపేక్షితంబుల నన్నింటిని నొసఁగునది యగుటంజేసి, ఆకించ నులమును, మోక్షము గలుగుటలో నాలస్యమునకు భయపడున ట్టివారమును నగు మనకు సాంగముగ చిరకాలానుష్ఠేయంబై, మంచిబుద్ధి మంతులకున్ను కష్టసాధ్యంబై, అట్టిది యగు అంగాం తరములసహాయము నపేక్షించునదియై, ఆలస్యముగ ఫలమునొ సంగఁగల ఉపాయాంతరములలో శ్రమపడవలసివచ్చునేమో! యనుకొని దుఃఖపడ నక్కఱలేదు,

ఇట్లు సులభోపాయము మాత్రముచే వశపడుచు నొసఁదగి నట్టివాఁడై ఫలము నొసంగఁగల శరణ్యుండు (సర్వేశ్వరుండు) సర్వసులభుండై, ఎక్కువ విశ్వసనీయుండై, పరమకారుణికుం డై, నిరంకుశ స్వతంత్రుండై యుండుటంజేసి, సిద్ధోపాయమును బట్టి దుఃఖింపఁ బనిలేదు.

ఈయుపాయానుష్ఠానముఁ జేసినపిదప భగవదాజ్ఞాను జ్ఞలనుబట్టి యొనర్పఁబడునట్టి సత్కర్మంబులన్నియును, ఈప్ర వృత్తికంగంబులు గాకపోవుటంజేసి, వాటిలో దేశకాలాదివైష మ్యమునుబట్టి కొన్ని లోపములున్నను, ఉపాసనమునకువలెనే దీనికిన్ని అంగవైకల్యం బెద్దియైనను కలుగఁగలదేమో యనుకొని దుఃఖింపఁ బనిలేదు.

భగవత్కైంకర్యాదుల విషయమున అనర్హతఁ గలుగ జేయఁగలవి యగు బుద్ధిపూర్వక మహాభాగవతాపచారాదు లను కలుగఁజేసి దగ్ధపటమువలెఁ జేయఁగల ప్రారబ్ధకర్మఫలంబ గు పాపవిశేషమునకు భయపడి, మొట్టమొదట ప్రవృత్తిచేసినప్పు డు కాని, తరువాత నొకప్పుడు అందులకుగాను ప్రవృత్తిచేసికా ని, నిరపరాధంబగు ఉత్తరకృత్యమును అపేక్షించినట్లయిన,

ఇఁకమీఁదు అపరాధంబులు ప్రసక్తించునేమో యనుకొని దుఃఖింపఁ బనిలేదు.

ఇవ్విధముగ నిరపరాధంబగునట్టి యుత్తరకృత్యము న పేక్షింపని వారికిన్ని ఇఁకమీఁదు బుద్ధిపూర్వకంబులగు అపరాధంబులు తటస్థించినను, 'నత్యజేయం కథంచన' (ఆశ్రితులనెన్నటికిని విడనాడను) అని నడుముకట్టుకొని యున్నట్టి శరణ్యుండు ఈతనికి అనుతాపముఁ గలుగఁజేసి, పునః ప్రపత్తి రూపంబగు ప్రాయశ్చిత్తము నవలంబించునట్లు చేసియును, అదియును తప్పిపోవునట్లు కఠినస్వభావులైనట్టివారికి శిక్షారూపంబులగుకొన్నికష్టంబులఁగలుగఁజేసి, ఇఁకమీఁదు అపరాధంబుల నొనర్పకుండునట్లు అడ్డుపఱచియును, ఫలము కోరినకాలము లోఁగా కలుగనందున ప్రపన్ననికి మెఱుపువలెఁ దెలియవచ్చి మాయమై పోవునట్టి బుద్ధి పూర్వకాపరాధ లేశంబులచే నరకాది మహాకష్టంబులు సంప్రాప్తించినచో ఏమిచేయుదు మను కొని యనుమానపడి దుఃఖింపఁబనిలేదు.

ఆర్త ప్రపన్ననికి అప్పటికప్పుడే ఫలసిద్ధి గలుగునట్లుండుటంజేసి, 'దేహేచేత్ప్రీతిమాన్మూఢో భవితానరకేపిసః' (దేహమునఁ బ్రీతిగల మూఢుండు నరకములోను నుండగలడు) అన్నట్లు నరకతుల్యంబగు ఈశరీరము అనువర్తించునేమో యనుకొని దుఃఖింపఁబనిలేదు.

కర్మయోగము మొదలుగాఁగల నివృత్తిధర్మంబులన్నియును 'నేహాభిక్రమనాశోస్తి' ఇత్యాదితావులయందుఁ జెప్పియున్నట్లు, మంచి ఫలాదికలవి యగుటంజేసియును, ఈశరణాగతునిగుఱించి విశేషముగ 'నత్యజేయం కథంచన' అని చెప్పి

యున్నందునను, దృష్ట ప్రపన్నునికి వాఁడుకోరి కాలమువరకు ను (మోక్షము గలుగుటలో) ఆలస్యమైనను, ఫలము సిద్ధించుటలో సంశయము లేనందుచే 'యజ్ఞోనృతేన క్షరతి తపః క్షరతి విస్మయాత్ । ఆయుర్విప్రపరీవాదాత్ దానంచ పరికీర్తనాత్' (అసత్యము పలికినంతమాత్రమున యజ్ఞఫలము నశించును. విస్మయపడినంత మాత్రమున తపస్సు నశించును. బ్రాహ్మణులను నిందించుటచే నాయుస్సు క్షీణించును. ఇతరులతోఁ జెప్పుకొనుటచే దానఫలము క్షీణించును) ఇత్యాది శాస్త్రములఁ జెప్పియున్నట్లు సుకృతనాశకంబులగు కొన్ని దుష్కర్మంబులచే ప్రపత్తిరూపంబగు సుకృతము నశించి, ఫలము సిద్ధింపక పోయినట్లయిన, ఏమిచేయగలను మనుకొని దుఃఖింపఁబనిలేదు.

ఈశరీరావసానమున మోక్షము కలుగవలయునని కాలమును యేర్పఱచుకొనియున్నందున జన్మాంతరాదులకు హేతుభూతంబులగు ప్రారబ్ధకర్మంబులచే మనకు జన్మాంతరములు సంప్రాప్తించినట్లయిన, ఏమి చేయఁగల మనుకొని దుఃఖింపఁబనిలేదు.

అనన్యప్రయోజనుండును ప్రపన్నుండును నైనట్టి యీతనికి ప్రతిబంధకంబులగు సర్వపాపంబులును తొలఁగిపోవుటచే కేవలాత్మానుభవాదిరూపములగు అంతరాయంబుల మూలముగ భగవదనుభవ రూపంబగు మోక్షమునకు ఆలస్యము గలుగునేమో యనుకొని దుఃఖింపఁబనిలేదు.

ఇట్లు సర్వవిధములగు శోకహేతువులు తొలంగిపోవునట్లు నా యనుగ్రహమునకు విషయభూతుండవగు నీవు ఇఁకమీఁదు

శోకించుట యనఁగా, ఇంతకుముందు నాయొక్క నిగ్రహ
ముకు విషయభూతుండవై యున్నప్పుడు దుఃఖింపని వాఁడవై
యున్నట్టి చందంబున, అనిపుణకృత్యంబై ఈయుపాయవిశేష
ముకుఁ (శరణాగతికిఁ) గల వైలక్షణ్యమునకున్ను నిన్ను రక్షించు
టలోనగుభారమును నాపై బెట్టుకొనియున్నట్టి సిద్ధోపాయభూ
తుండనగు నాయొక్క ప్రభావమునకున్ను, సమస్తభారమును
నాపైయుంచి కృతకృత్యుండవై యున్నట్టివాఁడవగు నీయొక్క
స్థితికిన్ని తగినట్టిది కాదని యభిప్రాయము.

ఇట్లు చరమశ్లోకమునందు సారతమంబగు 'మాశుచః'
అను చరమవాక్యముయొక్క తాత్పర్యమును తమ యంతిమ
దశయందు పూర్వాచార్యులు సచ్ఛిష్యులకు ఉపదేశించుదురు.

ఈ శ్లోకమునందలి పదములయందు క్రమముగ అధికారి
విశేషము, ఆకించన్య పురస్కారము, దుష్కర పరికరాంతర
నైరపేక్ష్యము, అశక్యప్రవృత్త్యనౌచిత్యము, దుష్కరాభినివే
శవైయర్థ్యము, ఉపాయవిశేషము తప్పక ఫలమునిచ్చునదగుట
ముముక్షువు విషయమున శరణ్యునికిఁగల విశేషంబగుటయు,
శరణ్యునిసులభత్వసుశీలత్వాదిగుణపూర్తియు, హితోపదేశిత్వ
ము, ప్రాప్యమే ప్రాపకంబగుట, నిరపేక్షసర్వవిషయనివృత్త్యు
పాకర్తృత్వము, వ్యాజమాత్రప్రతీక్షత్వము, ఉపాయాంతరవ్య
వధాన నిరపేక్షత్వము, పరికరాంతర నిరపేక్షప్రసాద్యత్వము,
సర్వఫలార్థి శరణ్యత్వము, శరణ్యుపై శిష్టత్వము, ఉపాయాంతరస్థా
న నివేశ్యత్వము, భరస్వీకర్తృత్వము, భరన్యాసరూపసాధ్యో
పాయవిశేషము, దానిపరికరంబులు, సర్వాధికారత్వము, సకృ
త్కర్తవ్యత్వము, సుకరత్వము, అవిళంబిత ఫలప్రదత్వము,

ప్రారబ్ధనివర్తన క్షమత్వము, అధికారియొక్క పరాధీనకర్తృత్వము, శాస్త్రవశ్యత్వము, రక్షకునియొక్క పరమకారుణికత్వము, సుప్రసన్నత్వము, నిరంకుశ స్వాతంత్ర్యము, దుర్నివారత్వము, పరానపేక్షత్వము, అవసరప్రతీక్షత్వము శరణాగతుని కృతకృత్యత్వము, అంగీకరించినట్టి యుపాయముకుగానును ఫలముకుగానును వేఱొక్కదాని నాచరింప నక్కఱలేకుండుట, భగవదత్యర్థప్రియత్వము, త్రైకాలికవిరోధి భూయస్త్వము, విరోధివర్గవైచిత్ర్యము, అట్టి విరోధులు ఈశ్వర సంకల్పముచే మాత్రమునివర్తించునవియగుటయు, ప్రపన్నేచ్ఛానియతంబగు విరోధినివృత్తికాలము, విరోధి నివృత్తిస్వభావము, ఆత్మయొక్క కైవల్య విలక్షణంబగు యథావస్థితి స్వరూపము ఆవిర్భూతంబగుట, పరిపూర్ణ భగవదనుభవము, సర్వవిధకైంకర్యప్రాప్తియు, అపునరావృత్తియు, ముందు శోకహేతుప్రాచుర్యము, పిమ్మటశోకించుట కవకాశము లేకపోవుటయును, విమర్శకాలమందంతట నిస్సంశయత్వమును, శోకనివృత్తియును, నిర్భయత్వమును, హార్దవిశేషమును, శరీరావసానకాలముకై నిరీక్షించుచుండుటయును, నిరపరాధి కైంకర్యరసికత్వమును, అను ఇవి ప్రధానంబులై ఇంకను వీటికిఁ గావలసినవి యన్నియును శబ్దశక్తిచేతనున్ను అర్థస్వభావము చేతనున్ను ఉపదేశింపఁబడినవి.

అల్పజ్ఞుండవై, అల్పశక్తుండవై, పరిమిత కాలవర్తివై మోక్షము గలుగుటలో నాలస్యమును సహించియుండజాలని వాఁడవగు నీచే తెలిసికొనుటకున్ను అనుష్ఠించుటకున్ను, అపరూపంబై, ఫలము నాలస్యముగా నిచ్చునట్టివియగు ఉపాయాం

తరములతో కష్టపడక, సులభుండనై, సర్వలోక శరణ్యుండనై, శరణ్యత్వమునకుఁ గావలసినట్టి యన్ని యాకారములతోను విశిష్టుండనైయున్నట్టి నన్నొక్కనినే ఉపాయముగాను నిశ్చయించుకొని, అంగపంచక సంపన్నంబగు ఆత్మరక్షాభరసమర్పణమునొనర్పుమా!

ఇట్లు ఉపాయానుష్ఠానము నొనర్చినట్టివాఁడవై, కృతకృత్యుండవై, నాకొక నిక్షేపమువంటివాఁడవై, మిక్కిలి ప్రియుండవగు నిన్ను, పరమ కారుణికుండనై, సుప్రపన్నుండనై, నిరంకుశ స్వాతంత్ర్యముగలవాఁడనై, స్వార్థముగ ప్రవర్తించినట్టివాఁడనగు నేనే నాసంకల్పమును మాత్రమే సహాయముగాఁగొని, నానావిధంబై, అనంతంబై, దురత్యయంబగు స్వవిరోధి వర్గముతోఁగలసంబాధమును మరల యెన్నటికిని రాకుండునట్లు పోగొట్టి, నాతోఁగూడ నాయొక్కయాత్మాత్మీయంబుల నన్నింటిని యనుభవించుటచే నాతో సమానంబగు భోగముగలవానినిగాఁజేసి, పరిపూర్ణానుభవ పరీవాహ రూపంబగునట్టి సర్వకాల సర్వావస్థోచిత సర్వవిధకైంకర్యమునున్ను గలుగఁజేసి, అందుమూలముగ నిన్ను సంతోషింపఁజేయఁగా, నీవింక దుఃఖింపఁబనిలేదని చరమశ్లోకముయొక్క ముఖ్యార్థము.

శ్లో॥ ఏకంసర్వప్రథంధర్మం శ్రియాజుష్టంసమాశ్రితైః।
ఆపేతశోకైరాచార్యై రయంపంథాః ప్రదర్శితః॥

తా॥ పిరాట్టితోఁ గూడియున్నట్టి పెరుమాళ్ళను ఆశ్రయించి వీతశోకులైనట్టి మాపూర్వాచార్యులచే ఈ మోక్షోపాయము మాకు ఉపదేశింపఁబడినది.

పా॥ కుఱిప్పుడన్ మేవు న్తరుమఙ్గళిన్ఱియక్కోనలనార్
వెఱిత్తుళవక్కழల్ మెయ్యరణెన్ఱు విరైన్దడైన్దు
పిఱిత్తువినై త్తిరళ్ పిన్తొడరావకై యప్పెరియోర్
మఱిప్పడైమన్నరుళ్ వాశకత్తాల్ మరుళత్తనమే॥

టీ॥ కుఱిప్పుడన్ = సావధానముగ, మేవుమ్ = అనుష్ఠింపవలసినట్టివియగు, తరుమంగళ్ = ధర్మంబులు, ఇన్ఱి = లేనందున, అక్కోవలనార్ = అకించనులను రక్షించుటకుగాను అవతరించినట్టి శ్రీకృష్ణునియొక్క, వెఱిత్తుళవక్కழల్ = పరిమళముగలతులసిదళములతో నలంకరింపఁబడినట్టి శ్రీపాదంబులను, మెయ్ = సత్యముగ, అరణెన్ఱు = రక్షకంబని, విరైన్దు = శీఘ్రముగ, అడైన్దు ఆశ్రయింపఁగా, పిఱిత్తు = వేఱు చేయఁబడినట్టి వినైత్తు = పాపరాశి, పిన్ = వెనుక, తొడరావకై = మరలరాకుండునట్లు, అప్పెరియోర్ మఱిప్పడై, మన్నరుళ్ వాశకత్తాల్ = రామకృష్ణాదిరూపముగా నవతరించినట్టి భగవంతునిచేకృపతో నుపదేశింపఁబడినట్టి చరమశ్లోకముచే మరుళత్తనమే = అజ్ఞాననివృత్తిగలవార మైతిమి.

తా॥ ఉపాయాంతరశూన్యులమైనట్టి మేము మావంటివారికిభగవంతుండే యుపాయంబని సత్యముగా పల్కినట్టి భగవంతుని శ్రీపాదములనాశ్రయించి యజ్ఞానరహితుల మైతిమి.

శ్లో॥ వ్యాసామ్నాయపయోధికౌస్తుభనిభం హృద్యంహరేరు
త్తమం। శ్లోకం కేచన లోకవేదపదవీ విశ్వాసితార్థం విదుః।
యేషాముక్తిషు ముక్తిసౌధవిశిఖాసోపానపఙ్క్తిర్వ్యధా
వైశమ్పాయనశౌనకప్రభృతయశ్శ్రేష్ఠాశ్శిరఃకమ్పనః॥

టీ॥ వ్యాసామ్నాయపయోధికౌస్తుభనిభం = వ్యాస = వేదవ్యాసవిరచితంబై, ఆమ్నాయ = పంచమవేదంబని యొప్పుచుండు మహాభార

తంబనెడి, పయోధి = పాలసముద్రములోనుండి తీయఁబడినట్టి, కౌస్తుభ నిభం = కౌస్తుభమణితో తుల్యంబైనదియు, హృద్యం = మనోహరంబును, హరేః = శ్రీకృష్ణునియొక్క, ఉత్తమం = సర్వశ్రేష్ఠంబగు, శ్లోకం = చరమశ్లోకమును, కేచన = కొందఱు, లోకవేదపదవీ విశ్వాసితార్థం = లౌకికరీతినిబట్టియును, వైదికరీతినిబట్టియును విశ్వసింపఁదగినట్టియర్థము గలదానినిగాను, విదుః = తెలిసికొనుచున్నారు. ముక్తిసౌధవిశిఖాసోపానపంక్తిషు = మోక్షరూపంబగు మేడపై నెక్కుటకు మెట్లవలెనుండునట్టి, యేషాం = యే చరమశ్లోకార్థ నిష్ఠులయొక్క, ఉక్తిషు = శ్రీసూక్తులవిషయమున, శ్రేష్ఠాః = మహానుభావులగు, వైశంపాయన శౌనకప్రభృతయః = వైశంపాయనుండు మొదలుగాఁగల మహర్షులు, శిరఃకంపినః = శిరఃకంపనాదులచే నానందపడుచున్నారో.

తా ॥ వ్యాసవిరచితంబగు మహాభారతంబనెడి క్షీరసముద్రములోనుండితీయబడినట్టి కౌస్తుబంబాయని చెప్పఁదగినట్టి చరమశ్లోకముయొక్కయర్థమును తెలిసికొని దానియందు నిష్ఠగలవారియొక్క శ్రీసూక్తులను మోక్షసౌధ సోపానములనుగాఁగొని వైశంపాయనాది మహర్షులు ఆనందపడుచున్నారు.

చతుర్థపాదార్థము ముగిసెను.



చరమశ్లోకాధికారము ముగిసెను.



పదవాక్యయోజనావిభాగః
తృతీయః సమాప్తః.









# రహస్యత్రయసారము

## సంప్రదాయ ప్రక్రియాభాగః చతుర్థః.

## ఆచార్యకృత్యాధికారము.

శ్లో॥ అధిజిగమిషురాద్యం ధామదివ్యంత్రిధామ్నః
శ్రుతవివిధపరీక్షా శోధితే క్వాపి పాత్రే।
అనఘగుణదశాయాం మాహితస్నేహమార్యః
ప్రదిశతినిరపాయం సంప్రదాయప్రదీపం॥

టీక॥ త్రిధామ్నః= శ్రీమన్నారాయణునియొక్క, ఆద్యం= అనాదియగు, దివ్యంధామ = పరమపదమును, అధిజిగమిషుః = పొందగోరు నట్టి, ఆర్యః = ఆచార్యుండు, శ్రుతవివిధపరీక్షాశోధితే = నానావిధము లగు పరీక్షలచే పరీక్షింపబడినట్టి, క్వాపి = ఒకానొక, పాత్రే= యోగ్యుండగు శిష్యునివిషయమున, అనఘగుణదశాయాం= సత్త్వగుణముఅతి శయించియున్నప్పుడు, ఆహితస్నేహం= ప్రీతిపూర్వకముగ,నిరపాయం= నరకాద్యపాయరహితంబగు, సంప్రదాయప్రదీపం = సంప్రదాయ జ్ఞాన మును, ప్రదిశతి = ఉపదేశించుచున్నాడు.

తా॥పరమపదప్రాప్తి కర్తుండగు ఆచార్యుండు శాస్త్రప్రకారము పరీక్షింపబడినట్టి శిష్యునికి సత్వగుణ మతిశయించినప్పుడు, ప్రీతిపూర్వక ముగ సంప్రదాయార్థముల నుపదేశించుచున్నాడు.

ఇట్లు “గురుర్గరీయాన్” అనియు “తమిమం సర్వసంపన్నమాచార్యం పితరంగురుం” అనియును చెప్పియున్నట్లు, పరమాచార్యుండగు సర్వేశ్వరుండు మొదలుకొని సదాచార్య సంప్రదాయ పూర్వకముగఁ దెలియవచ్చినట్టివై సింహాము యొక్క పాలవలెనే యితరులకు రసము తెలియనివియగు రహస్యత్రయార్థంబులను పూర్వాచార్యులు సంగ్రహముగఁ జేర్చిపెట్టుకొని, తాము న్న అనుసంధించుకొనుచు,

శ్లో॥ యోగాపయుత్య యోగ్యానాం యోగ్యానాసంప్రయచ్ఛతి।
ఇమమర్థం సమాన్యోమే స్వస్తివోస్తు ప్రజామ్యహం

తా॥ ఈ యర్థములను అయోగ్యులకుపదేశింపక, యోగ్యులకు మాత్రము ఉపదేశించునట్టివాఁడు నాకత్యంతము ఇష్టుండు.

శ్లో॥ ఇదం తేనాపతస్కాయనాభక్తాయ కదాచన।
నచాశుశ్రూషవేవాచ్యం నచమాం యోభ్యసూయతి।

తా॥ ఇంద్రియనిగ్రహములేనివానికిని, భక్తుండుకానివానికిని, శుశ్రూషాపరుండుకానివానికిని, భగవంతుని ద్వేషించునట్టి వానికిన్ని యీ యర్థములను ఉపదేశింపఁగూడదు,

శ్లో॥ యఇమంపరమంగుహ్యం మద్భక్తేష్వభిధాస్యతి।
భక్తింమయిపరాంకృత్వా మామేవైష్యత్యసంశయం।

తా॥ ఈయర్థమును నాభక్తులైనట్టి వారికి ఉపదేశించునట్టివాఁడు తప్పక నన్ను పొందగలడు.

శ్లో॥ నావేదనిష్ఠస్య జనస్యరాజన్
ప్రదేయమేతత్పరమంత్వయాభవేత్।
వివిత్సమానస్య విబోధకారకం
ప్రబోధహేతోః ప్రణతస్య శాసనం॥

తా॥ తెలియఁగోరునట్టివానికి తెలివిఁగలుగఁజేయునట్టిదియును, ప్రణతిపూర్వకముగఁ దెలిసికొనునట్టి వాని స్వరూపమును చక్కఁబఱచు నదియునునగు ఈమంత్రమును వేదప్రమాణికుండుకాని వానికి ఉపదేశింపఁగూడదు.

శ్లో॥ నదేయమేతచ్చ తథానృతాత్మనే
శఠాయక్లీబాయ నజిహ్వబుద్ధయే।
నపండితజ్ఞాయపరోపతాపినే
దేయంత్వమేదంవినిబోధయాదృశే॥

తా॥ అసత్యమాడువానికిని, దుర్మార్గునికిని, నపుంసకునికిని, కుటిల స్వభావునికిని, పండితులను గుర్తెఱింగి ప్రవర్తింపనివానికిన్ని, పరులను బాధించునట్టివానికిన్ని ఇట్టివానికి ఈ మంత్రమును ఉపదేశింప కూడదు.

శ్లో॥ శ్రద్ధాన్వితాయాథగుణాన్వితాయ
పరాపవాదాద్విరతాయనిత్యం।
విశుద్ధయోగాయ బుధాయచైవ
క్రియావతేఽథక్షమిణే హితాయ॥

తా॥ శ్రద్ధగలవానికిని, గుణవంతునికిని, పరులనునిందింపనివానికిన్ని మంచిభక్తిగలవానికిన్ని, జ్ఞానముగలవానికిన్ని. కర్మిష్ఠునికిన్ని, క్షమావంతునికిన్ని ఈ మంత్రమును ఉపదేశించునది.

శ్లో॥ వివిక్తశీలాయవిధిప్రియాయ
వివాదభీతాయబహుశ్రుతాయ।
విజానతేచైవ తథాహితంక్షమా
దమాయనిత్యాత్మసమాయదేహినాం॥

తా॥ మంచి స్వభావముగలవానికిని, శాస్త్రప్రియునికిని, వివాదము విషయమున భయముగలవానికిని, మంచి శాస్త్రజ్ఞానముగలవానికిని, దాని

యనుష్ఠానముగలవానికిని, క్షమాదమాది గుణములుగలవానికిని అందఱికిని ప్రియుండైనట్టివానికిన్ని యీమంత్రమును ఉపదేశించునది.

శ్లో॥ ఏతైర్గుణైర్హీనతమేన దేయ
మేతత్పరంబ్రహ్మవిశుద్ధమాహుః ।
నశ్రేయసా యోజ్యతి తాదృశే కృతం
ధర్మప్రవక్తారమపాత్రదానాత్ ॥

తా॥ పరిశుద్ధంబైనట్టి యీపరబ్రహ్మమును ఇట్టిగుణములులేనివానికి ఉపదేశింపఁగూడదు. అట్టివాని కుపదేశించినట్లయిన, వాఁడుపాత్రుండు కానందున, అట్టియుపదేశము శ్రేయస్కరము కాఁజాలదు.

శ్లో॥ పృథ్వీమిమాం యద్యపి రత్నపూర్ణాం
దద్యాన్న దేయం త్విదమవ్రతాయ ।
జితేంద్రియాయైతదసంశయం తే
భవేత్ప్రదేయంపరమం నరేంద్ర ॥

తా॥ రత్నపూర్ణంబగునట్టి యీభూమినంతయును నొసంగినను, అపాత్రునికి యీ మంత్రమును ఉపదేశింపఁగూడదు. జితేంద్రియుండైనట్టివానికి యీ యర్థమును అవశ్యముగ ఉపదేశించునది.

శ్లో॥ కరాళమా తేభయమస్తుకించిదే
తత్పరంబ్రహ్మశ్రుతంత్వయాద్య ।
యథావదుక్తంపరమంపవిత్రం
విశోక మత్యంతమనాదిమధ్యం ॥

తా॥ ఓకరాళుఁడా! నీవుభయపడవద్దు. నీవు పరబ్రహ్మమునుగుఱించి తెలిసికొనియున్నావు. ఉత్కృష్టమును, పవిత్రమును, దుఃఖరహితమును, ఆదిమధ్యాంతములులేనిదియగు పరబ్రహ్మమునుగుఱించి తెలుపఁబడినావు.

శ్లో॥ విద్యయైవసమంకామంమర్తవ్యంబ్రహ్మవాదినా।
అపద్యపిచఘోరాయాంనత్వేనామిరిణావదేత్ ॥

తా॥ బ్రహ్మవేత్తయైన వాఁడు మరణించువరకును విద్యను కాపాడునది, ఎట్టి యాపత్తు సంభవించినను, అనధికారులైనట్టి వారికి విద్య నుపదేశింపఁగూడదు,

శ్లో॥ మూర్ఖాశ్చపండితంమన్యా అధర్మా ధార్మికాఇవ।
ధర్మయుక్తాన్ ప్రబాధంతే సాధూనాంలింగమాస్థితాః ॥

తా॥ మూర్ఖులైనట్టివారు పండితులమని చెప్పుకొనుచు, అధార్మికులైనను, ధార్మికులమనుచు, సత్పురుషులవలె నటించుచు, ధార్మికులైనట్టి వారిని బాధించుచుందురు.

శ్లో॥ ఏకత స్త్వపవర్గార్థమనుష్ఠానాదికౌశలం।
లోకానుసార స్త్వేకత్ర గురుఃపశ్చాదుదీరితః ॥

తా॥ ఒకప్రక్కన మోక్షార్థము ప్రయత్నించుచు, వేఱొకప్రక్కన లోకానుసారముగ ప్రవర్తించునట్టివాఁడు గురు వనఁబడుచున్నాడు.

శ్లో॥ భవంతిబహవోమూర్ఖాః క్వచిదేకోవిశుద్ధధీః।
త్రాసితోపి సదామూర్ఖైరచలోయస్సబుద్ధిమాన్ ॥

తా॥ మూర్ఖులనేకులు గలరు. జ్ఞానియైనట్టి వాఁడెవ్వఁడో, ఒక్కఁడుండును. మూర్ఖులు బెదరించినను, స్థిరముగా నిలువఁబడియుండునట్టివాఁడు బుద్ధిమంతుండు.

శ్లో॥ నవిశ్వాసఃక్వచిత్కార్యో విశేషాత్తు కలౌయుగే।
పాపిష్ఠా వాదవక్షేణ మోహయంత్యవిచక్షణాన్ ॥

తా॥ సాధారణముగ నెవ్వరినిన్ని నమ్మఁగూడదు. కలియుగమునందు బొత్తుగ నమ్మనేకూడదు. పాపిష్ఠులైనట్టివారు తమ వాక్చాతుర్యముచే బుద్ధిమంతులనున్ను మోసబుచ్చగలరు.

శ్లో॥ గోపయన్నాచరేద్ధర్మం నాపృష్టః కించిదుచ్చరేత్ ।
పృష్టోపి నవదేదర్థం గుహ్యం సిద్ధాన్తమేవ చ ॥

తా॥ ధర్మమును బాగ దాఁకతో ననుష్ఠించునది. అడుగకుండ దేని నిన్ని చెప్పగూడదు. అడిగినను, రహస్యంబగు సిద్ధాంతార్థమును తెలియఁ జేయకూడదు.

శ్లో॥ ఆశ్రితాయాతిభక్తాయ శాస్త్రశ్రద్ధాపరాయ చ ।
న్యాయేన పృచ్ఛతే సర్వం వక్తవ్యం శౌచ యోగినే ॥

తా॥ ఆశ్రితుండును, భక్తుండును, శాస్త్రమునందు నమ్మకముగలవాఁడును నైనట్టివాడు శాస్త్రప్రకారము వచ్చి అడిగినట్లయిన, శౌచమునున్ను యోగమునున్ను గలిగియున్నట్టివానికి తెలుపవలయును.

శ్లో॥ ఆత్మపూజార్థమర్థార్థం డంభార్థమపి ఖిన్నధీః ।
ఆరోగ్యేషు వదన్ శాస్త్రం సన్మార్గాత్ప్రచ్యుతో భవేత్ ॥

తా॥ ఆత్మగౌరవమునకుగాను, ద్రవ్యమునకుగాను, డంబమునకుగాను, అరోగ్యులైనట్టి వారికి శాస్త్రార్థములఁ దెలుపుటచే సన్మార్గమును తప్పి ప్రవర్తించినట్టి వాఁడగును.

శ్లో॥ ఊషరే నివపేద్బీజం షండే కన్యాం ప్రయోజయేత్ ।
సృజేద్వా వానరే మాలాం నాపాత్రే శాస్త్రముత్సృజేత్ ॥

తా॥ ఊషరభూమియందు విత్తనములఁ జల్లుటవలెను, నపుంసకునికి కన్యనిచ్చుటవలెను, వానరము మెడలో మాలికను వేయుటవలెనున్ను అపాత్రునికి శాస్త్రార్థముల నుపదేశించుట యని రెండుంగునది.

శ్లో॥ న నాస్తికాయానృజవే నాభక్తాయ కదాచన ।
నైవ హింసాభిరుచయే న లుబ్ధాయ విశేషతః ॥
దాతవ్యో మంత్రరాజోయం మంత్రోయం హీనతాదృశః ।

తా॥ నాస్తికుండును, కుటిలస్వభావుండును, భక్తుండు కానివాడును, పరహింసాతత్పరుండును, లుబ్ధుండునైనట్టివానికి మంత్రోపదేశముఁ జేయ

కూడదు. మంత్రశ్రేష్టంబయినట్టి తిరుమంత్రమట్టి వారికి ఉపదేశింపఁదగినది కాదు.

శ్లో॥ ఋజవే గురుభక్తాయ వైష్ణవాయ విశేషతః।
సర్వప్రాణ్యనుకూలాయ దాతవ్యో దేశికేనతు।

తా॥ మృదుస్వభావుండును, గురువునందు భక్తికలవాఁడును, ముఖ్యముగ విష్ణుభక్తుండును, సర్వప్రాణులకును హితముఁజేయునట్టివాఁడును నగు వానికి మంత్రమును ఉపదేశించునది.

“తొణ్డర్కు ముదుణ్ణచ్చొన్మాలైకళ్ శొన్నే” (భగవద్దాసులకు గుణామృత పానముగాను గుణప్రతిపాదకంబు లగు పాశురములను రచియించినాడను) అనియు “అందాది మేలిట్టఱివిత్తేనాళ్ పొరుళ్లై చ్చిందామల్ కొళ్ మినీర్ తేర్న్దు” (అంతాదిరూపముగ రచియించినట్టి ప్రబంధమున నొక్కభాగమునైనను విడువకుండ అంగీకరించి యానందింపుడు) అనియు నిట్లు, సాత్వతమునందును, శ్రీభగవద్గీతలయందును, వసిష్ఠకరాళసంవాదమునందును, శాండిల్యస్మృతియందును, సాత్యకి తంత్రాదులయందును చెప్పియున్నట్లు, శరణ్యుండగు సర్వేశ్వరుండు అనుమతి యిచ్చుటకుఁదగినట్టి సాత్వికతాస్తిక్యాది గుణంబులఁ గలిగియున్నట్టివారై “అభయం సత్వసంశుద్ధిః జ్ఞానయోగవ్యవస్థితిః। దానందమశ్చ యజ్ఞశ్చస్వాధ్యాయస్తప ఆర్జవం। అహింసాసత్యమక్రోధస్త్యాగశ్శాంతిరపైశునం। దయాభూతేష్వలోలుత్వంమార్దవంహ్రీరచాపలం। తేజః క్షమాధృతిశ్శౌచమద్రోహోనాతిమానతా। భవంతి సంపదం

దైవీమభిజాతస్యభారత’’ (ఓయర్జునా! సంసారభయరాహి
త్యము, శుద్ధసత్వగుణము, జ్ఞానయోగము, దానము, ఇంద్రి
యనిగ్రహము, యజ్ఞము, వేదాధ్యయనము, తపస్సు, ఆర్జ
వము, అహింస, సత్యము, కోపరాహిత్యము, త్యాగము,
శాంతము, ఔదార్యము, భూతదయ, వ్యభిచారరాహిత్యము,
మృదుస్వభావము, మానము, చాంచల్యరాహిత్యము, తేజ
స్సు, క్షమా, మనోధైర్యము, శౌచము, ద్రోహచింతనారా
హిత్యము, గర్వాభావము, ఇవియన్నియుఁ జేరి దైవసంపత్తనఁ
బడుచున్నవి. ఇట్టి దైవసంపత్తు మంచివంశమునఁబుట్టినట్టి
వానికుండగలదు) అనియు ‘‘ద్వివిధోభూతసర్గోయం | దైవ
ఆసురఏవచ, విష్ణుభక్తిపరోదైవః’’ (దేవస్వభావముగలవార
నియు, అసురస్వభావముగలవారనియును జనులు రెండుతెగల
వారు. వారిలో విష్ణుభక్తుండు దైవస్వభావముగలవాఁడు) అని
యును చెప్పఁబడినట్టి దైవస్వభావముగలవారికి ‘‘సంవత్సరం
తదర్ధం వా మాసత్రయమథాపివా పరీక్ష్యవివిధోపాయైః కృప
యానిస్పృహోవదేత్ | యదృచ్ఛయోపసన్నానాందేశాం
తరనివాసినాం | ఇష్టోపదేశఃకర్తవ్యః నారాయణపరాత్మనాం
(సంవత్సరముగాని, ఆరుమాసములుగాని, మూఁడుమాసము
లుగాని పరీక్షించి సద్విషయములఁదెలుపునది. అకస్మాత్తుగ
దేశాంతరమునుండివచ్చినట్టిభగవద్భక్తులైనట్టి వారికి యిష్టము
వచ్చినట్లు ఉపదేశముల నొసంగునది) ఇత్యాది తావులఁజెప్పి
యున్నట్లు పరీక్షాదులమూలకముగ వారి వారి గుణంబులను
గన్పెట్టి, ‘‘శ్రుతాదన్యత్ర సంతుష్టస్తత్రైవచ కుతూహలీ’’

(తక్కినయర్థములయందు సామాన్యంబగు తృప్తిగలవాఁడై, ఆచార్యుఁడు ఉపదేశించినట్టి యర్థములయం దెక్కువప్రీతిగల వాఁడు) అన్నట్టి స్థితియందు రహస్యముగ ఉపదేశించి, ‹‹డంభో దర్పోతిమానశ్చ క్రోధః పారుష్యమేవచ అజ్ఞానంచాభిజాతస్య పార్థ సంపదమాసురీం'' (డంబము, గర్వము, అహంభావము, క్రోధము, కఠినస్వభావము, అజ్ఞానము ఇవియన్నియును చేరి అసురసంపత్తు) అనియు ‹‹విపరీతస్తథాసురః'' (అసురస్వభావము దైవస్వభావవిపరీతంబైనది) అనియును చెప్పఁబడినట్టి యాసుర స్వభావముగలవారికి తెలియకుండ, గొప్ప ధనముగలవారు ధనమును చేర్చిపెట్టుకొని సుఖముగా నుండునట్లు, చరితార్థులై ప్రవర్తించునట్టివారు పూర్వాచార్యులు.

ఈ పూర్వాచార్యులు ‹‹దేహేంద్రియాదులకంటెను విలక్షణుండై నిత్యుఁడగు ఆత్మ కలఁడనియు, ఈ చేతనాచేతన పదార్థములు రెండే కాకుండ, వీటిలో నంతరాత్మగానుండునట్టి వాఁడై, శేషిగా నుండునట్టివాఁడగు పరమాత్మ యొక్కఁడు కలండనియు, ఈ పరమాత్మతప్ప, ఈ యాత్మకు తాను గాని, యితరులుగాని రక్షకులు కారనియునట్టి తత్వమునున్ను, అనాది కాలముగ పుట్టుచుగిట్టుచు సంసారమునఁబడియుండునట్టిదాసు నకి ఇఁకమీఁదు గర్భవాసాదిక్లేశంబెద్దియును రాకుండునట్లు, శ్రీ పాదంబుల నొసంగి రక్షింపవలయునని, ఆచార్యుఁడు ప్రసా దించినట్టి గురుపరంపరాపూర్వకమగు ద్వయముచే, శ్రీమన్నా రాయణునియొక్క శ్రీపాదంబులను రక్షకమునుగాఁ గొని, ఆత్మాత్మీయంబులనున్ను వాటినిబట్టియుండునట్టిసమస్తబాధ్య తలనున్ను వాని శ్రీపాదములయందే యొప్పగించుటయనెడి

హితమునున్ను, సదాచార్యుండు యొప్పగింపఁగా మనలనఁ కరించినట్టి వాఁడగు భగవంతుండు మనల నెన్నటికిన్ని విఁ నాడనెడి గౌరవముతో ఈ లోకముననున్నంతకాలము మోక్ష ముకు పూర్వావస్థయగు నిరపరాధానుకూలవృత్తితో (కైఁ కర్యముతో) కాలము గడుపుటయనెడి ఉత్తర కృత్యమ మున్ను, సంగ్రహముగాఁ జెప్పినచో రుచి గలవారికి, అట్ల సంగ్రహముగానే సాయించు చున్నారు.

శ్లో॥ ప్రత్యగ్వస్తువిలక్షణః ప్రకృతితస్త్రాతాపతి స్తత్పర
స్తస్మిన్నాత్మభరార్పణం హితతమం తచ్ఛేషవృత్తిః ఫలం।
ఇత్థం తత్త్వహితే పుమర్థ ఇతి నస్త్రేధా విభక్తం ధనం
దాయత్వేన దయాధనాస్స్వయమదుర్దత్తాత్మనాం దేశికాః॥

టీ॥ దయాధనాః = కారుణికులగు, దేశికాః = పూర్వాచార్యులు, ప్రకృతితః = శరీరముకంటెను, విలక్షణః = విలక్షణుండుగాను జీవుండు, ప్రత్యయః = తెలియవలసినవాడనియు, త్రాతా = సర్వరక్షకుండగు, పతిః = సర్వేశ్వరుండు, తత్పరః = ప్రకృతిపురుషులకంటెను విలక్షణుం డుగాను, ప్రత్యేయః = తెలియఁదగినవాఁడనియు, తస్మిన్ = శేషియగు సర్వేశ్వరునియందు, ఆత్మభరార్పణం = రక్షాభరసమర్పణము, హితతమం = పరమోపాయంబనియును, తస్మిన్ = ఆశేషివిషయమున, శేషవృత్తిః = కైంకర్యము, ఫలం = పుమర్థంబనియును, ఇత్థం = ఇవ్విధమున, తత్త్వ హితే = తత్త్వహితంబులు గానున్ను, పుమర్థ ఇతి చ = పురుషార్థముగా నున్ను, త్రేధా = మూఁడుభాగములుగాను విభజింపఁబడియున్నట్టి, ధనం = ధనమును, దాయత్వేన = మాభాగమునుగాను, దత్తాత్మనాం = ఆత్మరక్షాభర మును సర్వేశ్వరునిపై యుంచినట్టిమాకు, స్వయం = స్వయముగ, అదుః = ఇచ్చియుండిరి.

తా॥ ప్రకృతికంటెను జీవుండు విలక్షణుండనియు, ఆరెంటికంటెను సర్వేశ్వరుండు విలక్షణుండనియు, సర్వేశ్వరునిపై స్వరక్షణవిషయమగు భారము నుంచుటయే మోక్షోపాయంబనియు, వానికి కైంకర్యము నొనర్చు

టయే పురుషార్థంబనియును నిట్లు తత్త్వ, హిత, పురుషార్థంబులను పూర్వాచార్యులు తెలిపి యున్నారు.

ఇవ్విధముగ రహస్యత్రయమును గుఱించి యింతకు ముందు చెప్పినవియును, ఇఁకమీఁదు చెప్పఁబోవునవియునునగు వాక్యంబులన్నియును వేదాంతోదయన (కిడాంబి ఆచ్చాను గారి) సంప్రదాయముతో సంబంధించినవి. ఇవి శ్రీమత్ కిడాంబి ఆచ్చానుగారికి శ్రీరామానుజులవారిచే * వంటయింట్లో ఉపదేశింపఁబడినవి. వీటిని తమ ఆచార్యసన్నిధియందు తాము వినియున్నట్లుగానే కిడామ్బి అప్పుళ్ళారు (ఆత్రేయరామానుజాచార్యులవారు) చిలుకకు మాటలనునేర్పి యిచ్చినట్లు, దాసునికి సాయింపఁగా, వారి విషయమునఁగల ప్రీతి కనుగుణముగ వెగుమాళ్ళు వాటినన్నింటిని తేట తెల్లముగాఁ దెలిపి, నాకవి మఱపు తగులకుండునట్లు చేసి, తప్పురాకుండ నాచేఁ జెప్పించినట్టి వాక్యము లివి.

పా॥ పాట్టుక్కురియపఞ్జియవర్ మూవరై ప్పణ్డొరుకాల్
మాట్టుక్కరుతరుమాయన్ మలిన్దువరుత్తుదలాల్
నాట్టుక్కిరుళ్ శెకనాన్ మత్తైయున్దినన్దై విళఙ్గ
వీట్టుక్కిడైకళిక్కే వెళికాట్టుమిమ్మెయ్ విళక్కే॥

టీ॥ పాట్టుక్కురియ = పాశురములచే భగవంతుని స్తుతింపుటకు తగినట్టివారగు, పఞ్జియవర్ = పురాతనులగు పొయ్గై, పూతత్త, పేయాళ్వారులను, మూవరై = ముగ్గురిని, పండు = పూర్వము, ఒరుకాల్ = ఒక

* కిడాంబి ఆచ్చానుగారు శ్రీరామానుజులవారి సన్నిధియందు తళిగ కైంకర్యము నొనర్చుచు, వారికి శ్రద్ధతో రుచికరంబులగు వంటకములఁ జేసిపెట్టుచు వచ్చినందున, శ్రీరామానుజులవారు వారియెడల తమకుఁగల ప్రీతివలన వారికి ఈ యర్థంబుల నుపదేశించినారని పెద్దలు చెప్పుదురు.

ప్పాడు, మాట్టుక్కుఱతమాయన్ = యదృశ్యుండైనను, సమీపమునకు వచ్చి, ఆలింగనము చేసికొనినట్టి యాశ్చర్యచేష్టితుండగు శ్రీకృష్ణుండు, మలిం గు = అధికుండై, వయత్తుదలాల్ = నిర్బంధించుటచే ప్రవర్తింపఁబడినట్టి ప్రబంధజాలము, నాట్టుక్కు = ఆదేశమున నుండునట్టివారికి, ఇరుళ్ = అజ్ఞానము, శెక = నశించునట్లును, నాన్మఱైయన్దినడైవిళక్కు = చతుర్వేదోక్తంబగు భక్తిప్రపత్తిరూపంబగు మోక్షోపాయము విశదపడునట్లు వీట్టుక్కడైక్కుఱిక్కు = పరమపదద్వారమునందుండునట్టి, వెళి = దీపమువంటి అర్థపంచకజ్ఞానమును, కాట్టుమ్ = చూపించునట్టి, ఇమ్మెయ్విళక్కు = జ్ఞానదీపమువలె నున్నది.

తా॥ * భగవంతుండు తాను అదృశ్యుండైనను, ఆశ్రితవాత్సల్యము వలన సమీపమునకువచ్చి ముదలాళ్వారుల నాలింగనము చేసికొని, వారిచే ప్రవర్తింపఁజేసినట్టి ప్రబంధజాలము మోక్షసాధనంబగు అర్థపంచకమును తెలుపునట్టిదియై, పరమపదద్వారమున నుండునట్టి దీపమువలెనున్నది.

పా॥ మరుళ్ఱ్ఱదేశికర్ వానుకప్పాలిన్దవైయమెల్లామ్
ఇరుళ్ఱ్ఱత్రైయవసిన్ఱైయడిప్పూణ్డిడ వెణ్ణుదలాల్
తెరుళుఱ్ఱశెన్దోక్కిత్తుళ్వామ్ప్పిరుకిచ్చి అన్దవర్పాల్
అరుళుఱ్ఱశిందైయినాలక్షియావిళక్కేఱ్ఱినరే॥

టీ॥ మరుళ్ఱ్ఱ = అజ్ఞానరహితులగు, దేశికర్ = ఆచార్యులు, వానుకప్పాల్ = పరమపదమునకుఁ బోవుటలోఁగల ప్రీతిచే, ఇన్దవైయమెల్లామ్ = కర్మభూమియందున్నట్టివన్నియును, ఇరుళ్ఱ్ఱ = అజ్ఞానరహితంబులగునట్లు

---

* పెరుమాళ్లు ముదలాళ్వారులను ముగ్గురిని ఏకకాలమున ఆలింగనము చేసికొనతలంచి, ఒక గొప్పవర్షమును కురిపించిరి. అప్పుడు తిరుక్కోవిలూరునందు ఒక యాళ్వారులు ఒకయింటి తిన్నెమీద పరుండియుండఁగా, వర్షములో తడియుచు వేఱొక యాళ్వారులు వచ్చిరి. వీరు ఉభయులును ఆకొంచమునుజాగాలో కూర్చుకొనియుండఁగా, వేఱొక యాళ్వారులువచ్చిరి. ఈముగ్గురును ఆతావునజాగాచాలక నిలువఁబడియుండఁగా, నచ్చటికి యింతలో పెరుమాళ్లువచ్చి వారితోఁగూడ యిరుక్కొని నిలువఁబడి వారిచే ప్రబంధములను పాడింపఁజేసిరని పెద్దలు చెప్పుదురు.

ఇవైయవని వైయడిప్పార్థిడ = సర్వస్వామియగు శ్రీమన్నారాయణునియొక్క చరణములను శరణముగాఁగొని యాశ్రయింపవలయునని యెడి, వేణ్ణుదలాల్ = బుద్ధితో, తెరుళుత్తిరు శెన్నోర్గళ్ = తత్త్వజ్ఞానపూర్వకమగు శుశ్రూషయును, శెల్వం = కైంకర్యరూపంబగు సంపత్తును, పెరుకి = సంపదభివృద్ధియును గలిగి, శిరందవర్ పాల్ = సర్వోత్కృష్టులయినట్టివారివిషయము, అరుళుత్తిరు = కృపాపూర్ణంబగు, శిందైయినాల్ = తలంపుతో, అఱ్ఱిమూవిళక్కు = నాశరహితంబగు జ్ఞానదీపమును, ఏత్తినర్ = ప్రవర్తింపఁజేసిరి.

తా॥ పరమపదమునకుఁబోవ తలంచినట్టి యాచార్యులు లోకమునందుండువారంతటను భగవంతుని యాశ్రయించి కైంకర్యపరులగుటకుగాను తత్త్వజ్ఞానము నుపదేశించి పోవుదురు.

శ్లో॥ నిరవధిదయాదివ్యోదన్వత్తరంగనిరంకుశై
ర్నియమయతియశ్శిష్యాన్ శిక్షాక్రమైర్గుణసంక్రమైః।
అచరమగురోరాజ్ఞాపారంపరీపరవానసౌ
నపరమిహాతాం స్తల్లక్షేణస్వమప్యభిరక్షతి॥

టీ॥ యః = ఏ యాచార్యుండు, నిరవధిదయాదివ్యోదన్వత్తరంగనిరంకుశైః = నిరవధికంబగు దయయనెడి క్షీరసముద్రముయొక్క తరంగములవలె నిరంకుశంబులును, గుణసంక్రమైః = శమాదిగుణములకు హేతుభూతంబులగు, శిక్షాక్రమైః = శిక్షణపద్ధతులచేత, శిష్యాన్ = ఆశ్రయించినట్టిశిష్యులను, నియమయతి = శిక్షించుచున్నాడో, అసౌ = ఈ యాచార్యుండు, అచరమగురోః = ప్రథమాచార్యుండగు భగవంతునియొక్క, ఆజ్ఞాపారంపరీపరవాన్ = ఆజ్ఞాపరిపాలనము నొనర్చునట్టి వాఁడగుచున్నాడు, ఇహ = ఈ లోకమునందు పరం = కేవలము, తాన్ = శిష్యులనే, అభిరక్షతీతి న = రక్షించుచున్నాడనికాదు, తల్లక్షేణ = అందుమూలముగ, స్వమపి = తననున్ను, అభిరక్షతి = రక్షించుకొనుచున్నాడు.

తా॥ ఆచార్యుండు భగవదాజ్ఞాపరిపాలనము నొనర్చుటచే శిష్యులనే కాకుండ, వారిని రక్షించుటచే తననున్ను రక్షించుకొనుచున్నాడు.

ఆచార్యకృత్యాధికారము ముగిసెను.

శ్రీమతే నిగమాంతమహాదేశికాయనమః.

    

# రహస్యత్రయసారము



## శిష్యకృత్యాధికారము.

శ్లో॥ అశిథిలగురుభక్తిస్తత్ప్రశంసాదిశీలః
ప్రచురబహుమతిస్తద్వస్తువాస్త్వాదికేపి।
గుణవతివినియోక్తుంగోపయన్సంప్రదాయం
కృతవిదనఘవృత్తిః కిన్నవిందేన్నిధానమ్॥

టీ॥ అశిథిలగురుభక్తిః = దృఢమైనట్టి యాచార్యభక్తికలవాఁడును, తత్ప్రశంసాదిశీలః=ఆచార్యస్తోత్రపరుండును, తద్వస్తువాస్త్వాదికేషు =ఆచార్యుని వస్తువులవిషయమునను, గృహక్షేత్రాదుల విషయముననున్న ప్రచురబహుమతిః=మిక్కిలి భక్తికలవాఁడును, సంప్రదాయం = సంప్రదాయార్థములను, గుణవతి=గుణవంతుండగు శిష్యునియందు, వినియోక్తుం = ఉపయోగపఱచుటకుగాను, గోపయన్ =వాటిని కాపాడుకొనునట్టివాఁడును, కృతవిత్ =కృతజ్ఞుండైనట్టి వాఁడును, అనఘవృత్తిః = సదాచారసంపన్నుండగు సచ్ఛిష్యుండు, నిధానం= సర్వగుణసంపన్నుండగుభగవంతుని నవిందేత్కిమ్=ఏల పొందఁడు?

తా॥ ఆచార్యునివిషయమున దృఢమైనట్టి భక్తి శ్రద్ధాశుశ్రూషాదులఁగల సచ్ఛిశిష్యుండు భగవంతుని తప్పక పొందగలఁడు.

ఈ యర్థంబుల నన్నింటిని, శుద్ధదరిద్రునికి తానున్నచో
టనే మహానిధిని జూపించి యిచ్చినట్లు, తెలియఁబఱచుటఁ
జేసి మహోపకారకుండగు ఆచార్యుని విషయమున, శిష్యుండు
కృతజ్ఞుండై యుండవలయుననియు, ద్రోహముఁ జేయఁగూడదని
యును శాస్త్రములు చెప్పుచుండుట యనునది, ఉభయ విభూ
తులనేతను, విభూతి నాయకుండగు సర్వేశ్వరునిచేతనున్ను చీ
గొట్టఁదగినట్టివాఁడును, హితమునుబోధించినట్టి ప్రహ్లాదవిభీష
ణాదులకు ప్రతికూలులగుహిరణ్యరావణాదులతో తుల్యుండును,
‘విద్యాచోరో గురుద్రోహీ వేదేశ్వరవిదూషకః। ఏతే బహుపా
ప్మానః సద్యోదండ్యాఇతిశ్రుతిః’ (విద్యాచోరుండును, గురు
ద్రోహియును, వేదములనున్ను సర్వేశ్వరునిన్ని నిందించునట్టి
వాఁడును వీరు మహాపాపులు. ఇట్టి వారిని వెంటనే దండింప
వలసినది యని శ్రుతి తెలుపుచున్నది) అన్నట్లు దండనార్హుం
డును కాకుండుటకుగాను ఇంతమాత్రము ప్రత్యుపకారముఁ
జేయవలసినది యని తెలుపుటకై కాదు.

‘శరీరమర్థం ప్రాణంచ సద్గురుభ్యో నివేదయేత్’ (శరీర
మును, ద్రవ్యమును, ప్రాణములున్ను సదాచార్యునికై విని
యోగ పఱచునది) అనియు, ‘సర్వస్వంవా తదర్థంవా తదర్థా
ర్థమేవవా। గురవే దక్షిణాం దద్యా ద్యథాశ క్త్యపివా
పునః’ (తనకుండుకున్న దంతయునుగాని, దానిలో సగభాగ
మును గాని, నాల్గవ వంతును గాని, లేకపోతే శక్తియున్నంత
మట్టుకుగాని, సదాచార్యుని కర్పించునది) అనియు నివ్విధ
ముగాఁ జెప్పియున్నట్టివియును, ప్రణిపాతాభి వాదనాదుల
వలెనే యీతనిచే నొనర్పవలసినవియగు కొన్నికర్తవ్యంబులఁ

దెలుపుచున్నవి. ఇంతియెకాని, అట్లుచెప్పుట 'కృపయానిస్పృహోవదేత్' (కృపతో ప్రతిఫలము నపేక్షింపనివాఁడై యుపదేశించునది) అన్నట్లు అనన్యప్రయోజనుండగు ఆచార్యునికిగానగు ప్రత్యుపకారముఁ దెలుపుటకై కాదు.

భగవంతునియెడల ప్రవర్తించునట్టివిధమున ఆచార్యునివిషయముననున్న ప్రవర్తింపవలయుననియు, వానికిమంచివాఁడుగానున్నట్టివిధమున, ఆచార్యునికిన్ని మంచివాఁడుగా నుండవలయుననియు, నిట్లు వేదాంతశాస్త్రమునఁ జెప్పినదియును, 'సప్రమాద్యేద్గురౌ శిష్యో వాఙ్మనఃకాయకర్మభిః । అవిభజ్యాత్మనాచార్యం వర్తేతాస్మిన్ యథాచ్యుతే' (శిష్యుండు ఆచార్యునివిషయమున నెన్నటికిన్ని మనోవాక్కాయంబులచే నపచారపడకుండ భగవంతుని విషయమున నెట్లు ప్రవర్తించునో, ఆచార్యునివిషయముననున్న అట్లే ప్రవర్తించునది) అనియు, 'దేవమివాచార్య ముపాసీత' (భగవంతునివలెనే ఆచార్యునిన్ని ఉపాసించునది) అనియును, శాండిల్యాపస్తంబాదులు చెప్పినదియును ఆచార్యునికిగాను నొక ప్రత్యుపకారముఁ జెప్పుటకై కాదు.

అయితే శాస్త్రచక్షుస్సగు ఈతండు కండ్లు తెలుచుకొనియున్నను, యేమిన్ని కానరానట్టి యంధుండు కాకుండుటకుగానును, భగవదనుభవములెనే విలక్షణంబైనట్టి యీ యనుభవమును గర్భదరిద్రుండగు ఈతండు పోగొట్టుకొనకుండుటకు గానును ఈపైని గనఁబఱచినవిధమున చెప్పఁబడినది. ఇంతియే.

ఇట్లు ఆచార్యుని విషయమున సరియైనట్టి ప్రత్యుపకారము లేనేలేదనువిషయమును 'బ్రహ్మవిద్యాప్రదానస్య దేవైరపినశక్యతే। ప్రతిప్రదానమపివాదద్యాచ్ఛక్తితఆదరాత్' (బ్రహ్మవిద్య

నొసంగినందులకుగాను సరియైనట్టి ప్రత్యుపకారము నొనర్చుట దేవతలకున్ను అలవికాదు. కావున శక్తికొలది ఆదరముతో ఆచార్యుని సత్కరించునది) అని శాండిల్యుండును చెప్పియున్నాడు.

ఈ తావున 'యథాశక్తి సత్కరింపవలసినది' యనఁగా తనకుఁగల యాదరముకుఁదగినట్లని యభిప్రాయము. ఇంతమాత్రము చేయుటచే నీతండు తనను ప్రత్యుపకారము నొనర్చినట్టి వానినిగాఁ దలంపఁదగదు.

ఇట్లు ప్రత్యుపకారం బెద్దియును లేనట్టివాఁడగు ఈతనికిఁ జేయవలసినది యెద్దియంటివేని, ఈతండు ఉపదేశించినట్టియర్థంబులను "కపాలస్థం యథాతోయం శ్వదృతౌ చ యథా పయః దుష్టంస్యాత్ స్థానదోషేణ వృత్తహీనే తథా శ్రుతం" (కపాలముననుండుటచే ఉదకమును, కుక్కతోలునందుండుటచే పాలున్ను స్థానదోషముచే నపవిత్రంబులగునట్లు, సత్ప్రవర్తన లేనట్టి వానికొసంగినట్టి విద్యయును అట్లే కాఁగలదు) అన్నట్లు వివరీతానుష్ఠానంబులచే కపాలాదులయందుండునట్టి జలాదుల వలెనే ఇతరుల కుపయోగపడని దానినిగాఁ జేయకయుండుటయును, "యచ్ఛ్రితం నవిరాగాయ న ధర్మాయ న శాంతయే సుబద్ధమపిశబ్దేన కాకవాశితమేవతత్" (చదివిన చదువు వైరాగ్యమునకు గాని, ధర్మమునకుగాని, శాంతికిగాని యుపయోగపడనట్టియిన,నది బాగుగ శబ్దగుంభితంబైనదియైనను, కాక రోదనమువంటిదే కాఁగలదు ) అన్నట్లు అభ్యసించి యుండుటయే ప్రయోజనం బనుకొనకుండుటయు, నద్విషయములఁ దెలిసికొనియును, ఇతరుల సాంసారిక విషయములలోఁ బ్రవేశింపకుండుటయు, వీటి నన్నింటిని "పండితైరర్థకార్పణ్యాత్ పణ్య

స్త్రీభిరివ స్వయం ఆత్మా సంస్కృత్య సంత్కృత్య పరోప కరణీకృతః'' (కొందఱు పండితులు ద్రవ్యలోభమువలన వేశ్యాంగనవలెనే తామును స్వయముగ సంస్కరించుకొని (అలంకరించుకొని) ఇతరులకుగాను ఉపయోగపడుచున్నారు) ఇత్యాది తావుల పరిహసించియున్నట్లు, గణికాలంకారము వలెగాని, కష్టపడితీసిన చందనమును అమ్ముకొనునట్లు గాని, గుంపులో అటుకులను విదజల్లినట్లు గాని, కోతిచేతిలోని పుష్పమాలికవలెఁగాని వ్యర్థపఱుపకుండుటయు, మొట్టదట విద్యయే ‹‹శేనధిష్టేస్మిరక్షమాం''(శరణుజొచ్చినాను నన్నురక్షింపుము) అని బ్రాహ్మణుని వేడుకొనియున్నందునను, ముందుగనే అసూయాదులతోఁగూడియుండునట్టి వారి కుపదేశింపక, రక్షించుకొనుటయును, జన్మాంధుండగుతనను, అజ్ఞానాన్యథాజ్ఞానాదిరహితులగు నిత్యసూరులగోష్ఠిలోనికిఁబోవుట కర్హుండగు నట్లు దిద్దుపాటుచేసినట్టి మహోపకారకుండగు ఆచార్యునికిఁ జేయఁదగినట్టిప్రత్యుపకారంబెద్దియును లేదని తెలిసికొని, ‹ఏకాంతీవ్యపదేష్టవ్యో నైవగ్రామకులాదిభిఃవిష్ణునావ్యపదేష్టవ్య స్తస్య సర్వంసఏవహి'(పరమైకాంతియైనట్టివానిని గ్రామకులాదులను బట్టి పేర్కొనఁదగదు. భగవత్సంబంధునిగానే పేర్కొనునది వానికంతయును భగవంతుండే కదా!) అన్నట్టి స్థితికంటెను, ‹‹వసిష్టవ్యపదేశినః'' (వసిష్ఠునిగా పేర్కొందురు) అన్నట్లుభగవంతుండు వంశక్రమముగ అవతరించి వచ్చినట్టి స్థితియే యీ యాచార్యత్వమనిగ్రహించి‹‹ఏన్నైత్తీమనంకెడుత్తాయ్ ఉనక్కెన్న శెయ్ కేన్'' (నాదుష్టమనస్సును పోగొట్టినావు నీకేమి చేయఁగలను ) అన్నట్టి కృతజ్ఞతతోనుండుట యావశ్యకము.

తాను ఇవ్విధముగ లభించినట్టి రహస్యత్రయసారార్థంబగు మహాధనమును పూర్వపు అధికారమునఁ జెప్పియున్న ప్రకారము యోగ్యుండైనట్టి శిష్యుని గన్పెట్టి, వానికి ఉపదేశించునప్పుడు "కథయామియథాపూర్వం దక్షాద్యైః మునిసత్తమైః। పృష్టః ప్రోవాచ భగవానబ్జయోనిః పితామహః। తైశ్చోక్తం పురుకుత్సాయ భూభుజే నర్మదాతటే। సారస్వతాయ తేనాపి మమ సారస్వతేన చ" (ఒకప్పుడు దక్షప్రజాపతి మొదలగు వారు చతుర్ముఖునియొద్దకు వెళ్ళి జ్ఞానోపదేశముకై ప్రార్థింపఁగా, నతండు వారి కుపదేశించెను. వారు దానిఁ దెలిసికొని, నర్మదాతీరమున పురుకుత్సుండను క్షత్రియుని కుపదేశించిరి. అతండు సారస్వతుని కుపదేశించెను. సారస్వతుండు నాకు ఉపదేశించెను) అనియివ్విధముగ చెప్పును సారస్వతమహర్షి మైత్రేయుని కుపదేశించినట్లు, గురుపరంపరం దెలుపుచు అర్థము యొక్క గౌరవము బయలుపడునట్లు ఉపదేశింపవలయును.

అధ్యాత్మరహస్యంబులఁ దెలుపువట్టివాఁడు తాను వాటి నాచార్యముఖతః తెలిసికొనియుండక, పుస్తకమునుజూచికాని, ఆచార్యుం డెవ్వరికైనను ఉపదేశించునప్పుడు, గోడచాటున నుండికాని తెలిసికొని ఉపదేశించునట్లయిన, దొంగిలించినట్టి యాభరణమును ధరించినట్టివానివలె నేచూచినవారికందఱికిన్ని తాను భయపడవలసినట్లయి, "యదృచ్ఛయా శ్రుతో మంత్రః ఛన్నేనాథ ఛలేన వా పత్రేక్షితో వావ్యర్థస్స్యాత్ ప్రత్యుతానర్థదో భవేత్" (అకస్మాత్తుగ వినఁబడినదిగాని, దొంగతనముగ గాని, యేదైననో కమిషచేఁగాని, పుస్తకములఁజూచిగాని తెలిసికొనఁబడినట్టి మంత్రము వ్యర్థంబగుటయేకాక మీఁదు

మిక్కిలి యనర్థముఁ గలుగఁజేయఁగలదు) ఇత్యాది తావులఁ
జెప్పియున్నట్లు అనర్థమును సయితముగలుగఁజేయునట్టిదియై,
పెద్దలవలనఁదెలిసికొని యుపదేశించునప్పుడును (తద్విద్ధిప్రణిపా
తేనపరిప్రశ్నే నసేవయా' (ప్రణిపత్యాభివాద్యచ' ఇత్యాదితా
వులఁ జెప్పియున్నట్టి (దండప్రణామాదిరూపమగు) శాస్త్రని
యమమును అతిక్రమించిఅడిగి తెలిసికొని యితరులకుబోధించి
నట్లయిన,దొంగిలించినట్టిఆభరణమును ధరించినట్టి వానివలెనే
చూచిన వారందఱును తనను భయపెట్టునట్లు కాఁగలదు.

"యశ్చాధర్మేణ విబ్రూతే యశ్చాధర్మేణ పృచ్ఛతి।
తయోరన్యతరః ప్రైతి విద్వేషం వాధిగచ్ఛతి" (శాస్త్రక్రమ
మును తప్పి యుపదేశించునట్టి వాఁడును శాస్త్రక్రమమును
తప్పి తెలుసుకొనునట్టి వాఁడును వీరిద్దఱిలో నొక్కఁడు అనర్థ
పడును. అథవా భగవన్నిగ్రహమునైనను పొందగలడు) అన్నట్లు
అనర్థముఁగలుగఁజేయునదియును కాగలదు.

శాస్త్రక్రమప్రకారము తెలిసికొని యుపదేశించుచు
న్నప్పటికిన్ని, అట్లు ఉపదేశించునప్పుడు, తన యాచార్యుని
గుఱించిప్రస్తాపింపకఁబోయినట్లయిన, ఈతండు ఉపదేశించునట్టి
యర్థంబు, లన్నియును, వేఱులేని తీగ వలెనే నిర్మూలంబు
లాయేమి ? అని శిష్యునికిన్ని అనుమానము గలుగునట్లయి, ఆ
దరింపఁదగినట్టివి కాకపోవును. "స్వగురూణాం స్వశిష్యేభ్యః
ఖ్యాపనంచా కృతం తథా" అని గురువును తన శిష్యులకుఁ
దెలుపకుండుట యనునది ముప్పదిరెండుఅపచారంబులలో నొ
క్కటిగాను పేర్కొనఁబడినది. అట్లుచేయునేని, "గురుంప్రకా
శయేద్ధీమాన్ మంత్రంయత్నేన గోపయేత్ । అప్రకాశప్రకా

శాభ్యాం క్షీయేతే సంప్రదాయుషీ" (బుద్ధిమంతుండై నట్టివాఁడు తన యాచార్యుని స్తుతించునది. ఆచార్యుం డుపదేశించినట్టి మంత్రమును అనధికారులచెవిని పడకుండ కాపాడునది. ఈ రెంటినిచేయనందున సంపత్తున్ను ఆయుస్సున్ను క్షీణింపఁగలవు) అన్నట్లు జ్ఞానవైశద్య పూర్వకంబగు భగవదనుభవసంపత్తున్ను, ఆత్మసంతానహేతువై శేషత్వాను సంధానపూర్వకంబగు స్వకీయనిష్ఠయున్ను చెడిపోఁగలవు.

ఆచార్యుని స్తుతింపకఁబోవుటయే కాక, అతండొసంగి నట్టి శాస్త్రీయోపదేశంబులకు విరుద్ధముగఁ జెప్పినట్లయిన, వంచకుండని పేరుపొంది నట్టివాఁడై "జ్యోతిషం వ్యవహారం చ ప్రాయశ్చిత్తం చికిత్సితం వినా శాస్త్రేణ యోబ్రూయాత్తమాహుః బ్రహ్మఘాతకం" (జ్యోతిషమును, వ్యవహారవిషయమును, ప్రాయశ్చిత్తమును, వైద్యమునున్ను, శాస్త్రప్రకారము తెలుపనివాఁడు బ్రహ్మఘాతకుండని పించుకొనుచున్నాడు) అన్నట్లు పాపిష్ఠుండై, సచ్ఛిష్యునికి యుక్తకాలమునను నుపదేశంబుల నొసంగనియెడల లుబ్ధుండని పేరుపొందినట్టివాఁడై "పాత్రస్థమాత్మజ్ఞానం చ కృత్వాపిండం సముత్సృజేత్ నాంతరాయ స్వయం యాతి జగద్బీజమబీజకృత్" (యోగ్యుండగు శిష్యునికి ఆత్మజ్ఞానము నుపదేశించి శరీరమును విడనాడునది. జగత్కారణంబగు బ్రహ్మజ్ఞానమును ఇతరుల కుపదేశింపక శరీరమును విడనాడకూడదు) అన్నట్టి భగవదాజ్ఞనున్ను అతిక్రమించి ప్రవర్తించినట్టి వాఁడగును.

కావున, రాజువద్ద దీపముపట్టుకొని యుండునట్టి సేవకుండు, తనను రాజు వేఱొక కార్యమునకై పొమ్మని నియోగిం

చినప్పుడు, తన చేతిలోనుండు దీపమును దానికిఁదగినట్టి వారి చేతికిచ్చి పోవునట్లు, సత్పాత్రములైనట్టి వారికి తాను ఉపదేశించునప్పుడు తనకు ఉపదేశించియున్నట్టి యాచార్యుని పేరును ముంగకు తెచ్చి, అటుపిమ్మట, తనకు ఉపదేశించినట్టి యర్థమునే యితరుల కుపదేశించునది.

ఏదైన నొక కారణమువశమున, దివ్యజ్ఞానమును లభించి, అందుమూలముగ తాను తెలిసికొని యుపదేశించునట్టి వాటి నిన్ని, 'వ్యాసప్రసాదాచ్ఛ్రుతవానేతద్గుహ్యమహంపరం యోగం యోగీశ్వరాత్ కృష్ణాత్ సాక్షాత్కథయతస్స్వయం" (యోగీశ్వరుండగు శ్రీకృష్ణుండు సాక్షాత్తుగ ఆనతిచ్చుచుండఁగాఁ దెలిసికొనినట్టి వేదవ్యాసుని యనుగ్రహమువలన పరమరహస్యంబగునట్టి యీ యోగమును దెలిసికొంటిని) అన్నట్లుసదాచార్యుని యనుగ్రహమువలన ఈ యర్థములఁ దెలిసికొంటినే కాని, స్వబుద్ధిచే తెలిసికొని యుపదేశించుచుండలేదని యీ నిజస్థితిని తెలియపఱచుచు ఉపదేశించునది. అట్లొనర్చిన పక్షమున, ఈతండు కృతజ్ఞుండై యున్నాఁడని సాత్త్వికులున్ను ఈతనిని శ్లాఘించిఅనుగ్రహింపఁదగినట్టి వాఁడగును. ఈతండుసత్త్వాదిగానున్నాఁడనిఉపనిషత్తులును ఉపనిషత్ప్రతిపాద్యుండగుసర్వేశ్వరుండును తమతోఁబాటు ఈతనినిన్ని ప్రామాణికునిగాఁ గొని యాదరించుటకుఁదగినట్టి వాఁడగును. ఇట్లుబుద్ధిమంతుండగు శిష్యుని విషయమున తాను చేసియున్నట్టి కృషి ఫలించినదనుకొనితనయాచార్యుండును ఈతనియెడలకృతార్థుండు కాఁగలఁడు.

శ్లో॥ సాక్షాన్ముక్తేరుపాయాన్ యో విద్యాభేదానుపాదిశత్।
కథ్యతేమోక్షశాస్త్రేషు సతుశ్రేష్ఠతమోగురుః ॥

తా॥ మోక్షమునకు సాక్షాత్తుగ ఉపాయభూతంబులగు విద్యలను ( ఉపాసనములను ) గుఱించి యుపదేశించునట్టివాఁడు శ్రేష్ఠుడైనట్టి గురువుగాను చెప్పఁబడుచున్నాడు.

శ్లో॥ ఆచార్యవత్తయా మోక్షమామనన్తి స్మరంతిచ ।
ఇహాముత్రచ తత్పాదా శరణం దేశికా విదుః॥

తా॥ ఆచార్యునిద్వారా సద్విషయములఁదెలిసికొని యనుష్ఠించుకొనునట్టి వానికే మోక్షముకలుగఁగలదు గాన, ఇహలోకపరలోకములయందు ఆచార్యుని శ్రీపాదంబులే శరణంబని పూర్వాచార్యులు వక్కాణించుచున్నారు.

శ్లో॥ ప్రన్రిమనత్తొళిర్ ఞానవిళక్కు యిరుళనైత్తుమ్
మాఱ్ఱినవర్క్కొర్ కైమ్మాఱు మాయనుమ్ కాణ్గిలాన్।
పోఱ్ఱియుకప్పదుమ్ పున్దియిల్ కొళ్వదుమ్ పొంగుపుకழ்
చాఱ్ఱివళర్ప్పదుమ్ శఱ్ఱల్లవో మున్నమ్ పెఱ్ఱదఱ్కే

టీ॥ మనత్తు=మనస్సునందు, ఎఱ్రిల్ ఞానవిళక్కై = సమ్యగ్ఙ్ఞానరూపంబగు దీపమును, ఏత్తి = వెలిగించి, ఇరుళ్=అజ్ఞానమును, అనైత్తుమ్=అంతను, మాఱ్ఱినవర్క్కు=పోగొట్టినట్టివారగు మా యాచార్యులకు ఒర్కైమారు=ఒక ప్రత్యుపకారమును, మాయనుమ్=ఆశ్చర్యచేష్టితంబుల నొనర్చినట్టివాఁడగు భగవంతుండును, కాణ్గిలాన్=కన్పట్టఁజాలఁడు. కావున, పోఱ్ఱి=స్తుతించి, ఉకప్పదుమ్=సంతోషపెట్టుటయును, పుంది యిల్ కొళ్వదుమ్=సర్వదా ఆచార్యుండొనర్చినట్టి యుపకారమును స్మరించుకొనుటయును, పొంగు=వృద్ధిపొందునట్టి, పుకழ்=కీర్తిని, చాత్తివళర్ప్పదుమ్=అక్కడక్కడ ప్రవేశంసించివృద్ధిపఱచుటయును, మున్నమ్ పెఱ్ఱదఱ్కే =ముందులభించియున్నట్టి పురుషార్థమునకు, శఱ్ఱల్లవో=ఏకదేశము న్నుకాదా?

తా॥ మనస్సున జ్ఞానముం గలుగంజేసినట్టి యాచార్యులకు ప్రత్యుపకారంబు కాదగినట్టి దానినొక్కదానినిన్ని భగవంతుండు సయితము చూపింపజాలనందున, వారిని స్తుతించుటయును, సంతోషపెట్టుటయును వారిగుణములను ప్రచురపఱచుటయును ఈతండు చేయవలసినట్టి కైంకర్యములో నేకదేశమే కాంగలదు.

శ్లో॥ అధ్యాసీనతురంగవక్త్రవిలసజ్జిహ్వాగ్ర సింహాసనా
దాచార్యాదిహ దేవతాం సమధికామన్యాంన మన్యామహే।
యస్యాసౌ భజతే కదాచిదజహద్భూమా స్వయం భూమికాం
మగ్నానాం భవినాం భవార్ణవసముత్తారాయ నారాయణః॥

టీ॥ అధ్యాసీనతురంగవక్త్రవిలసజ్జిహ్వాగ్రసింహాసనాత్ = అధ్యాసీన = అధిష్ఠింపంబడినట్టి, తురంగవక్త్ర = గుఱ్ఱపునోటిలో, విలసత్ = ప్రకాశించుచున్నట్టి, జిహ్వాగ్రసింహాసనాత్ = నాలుకయనెడి సింహాసనమున హయగ్రీవురూపుండగు, ఆచార్యాత్ = ఆచార్యునికంటెను, ఇహ = ఈ విభూతిద్వయమునందు, అన్యాం = వేఱొక్క దేవతను, సమధికాం = సమానంబైనట్టి దానినిగానుగాని, అధికంబైనట్టిదానినిగాను గాని, నమన్యామహే = మేము తలంపము. అసౌ = ఈ నారాయణుండు అజహద్భూమా = ఆచార్యత్వమునను న్న ప్రసిద్ధిగలవాండై, మగ్నానాంభవినాం = సంసారసముద్రమునమునిగియున్నట్టి సంసారులను, భవార్ణవసముత్తారాయ = సంసారసముద్రమును దాటించుటకుగాను, కదాచిత్ = సమయమువచ్చినప్పుడు, యస్య = ఏయాచార్యునియొక్క, భూమికాం = వేషమును, భజతే = స్వీకరించుచున్నాడో.

తా॥ హయగ్రీవుండనంబడునట్టి యాచార్యునికంటెను వేఱొక్క దేవతను ఇహలోకపరలోకములయందు మేము ఆదరింపము. ఏలననంగా, ఈతండు ఈ జనులను సంసారమునుండి కడతేర్చుటకై ఆచార్యస్వరూపమును ధరించుచున్నాడు.

శిష్యకృత్యాధికారము ముగిసెను.









# రహస్యత్రయసారము

## నిగమనాధికారము.

శ్లో॥ కరబదరితవిశ్వః కశ్చిదాచార్యదృష్ట్యా
ముషితనిఖిలమోహో మూలమంత్రాదిభోగః।
సగుణవిషయసిద్ధౌ సంప్రదాయం ప్రయచ్ఛన్
సుచరితనిలహారీ సూరిబృందాభినంద్యః॥

టీ॥ కశ్చిత్ = ఒకానొకఁడు, ఆచార్యదృష్ట్యా = ఆచార్యకటాక్షముచే, కరబదరితవిశ్వః = సమస్తమును కరతలామలకముగాఁ దెలిసికొనినవాఁడై, ముషితనిఖిలమోహః = అజ్ఞానమంతయును పోయినట్టివాఁడై, మూలమంత్రాదిభోగః = రహస్యత్రయార్థానుసంధానముతో కాలక్షేపము జేయునట్టివాఁడై, సగుణవిషయసిద్ధౌ = పాత్రుండైనట్టి శిష్యుండు లభించినప్పుడు, సంప్రదాయం = సంప్రదాయార్థములను, సంప్రయచ్ఛన్ = ఉపదేశించుచు, సుచరితనిలహారీ = మహానుభావుల సదాచారముఁ దెలిసికొనుటకై పాటుపడుచు, సూరిబృందాభినంద్యః = నిత్యసూరులచే గౌరవింపఁబడినట్టివాఁడు అగుచున్నాఁడు.

తా॥ ఒకానొకండు ఆచార్యకటాక్షముచే తత్త్వహితపురుషార్థంబుల నెఱింగి రహస్యత్రయార్థానుసంధానముతో ప్రొద్దుపుచ్చుకొనుచు, సచ్ఛిష్యుండు లభించినప్పుడు సంప్రదాయార్థముల నుపదేశించుచు నిత్యసూరులచే సత్కరింపఁబడునట్టి వాఁడగుచున్నాఁడు.

ఇట్లు జీవాత్మ నిత్యసూరులతోఁ బాటు భగవదనుభవ రసమునకు స్వభావసిద్ధముగనే యర్హుండై యున్నను, అనాదికాలముగ దానిఁబోగొట్టుకొని, మరల నొకప్పుడు సదాచార్యసంబంధముగలవాఁడై తత్త్వహితంబులఁ దెలిసికొనుటకారంభించునట్టి విధమును — వీటిఁ దెలుపునట్టి ప్రమాణంబులలో, రహస్యత్రయము సారతమంబగుటను — దీనిఁగొని తెలుసుకొనఁబడునట్టి యర్థంబులలో ఆత్మపరమాత్మలకుఁగల శరీరశరీరిభావ సంబంధాదులు ప్రధానప్రతితంత్రంబులై జ్ఞాతవ్యంబులగుటను — ఈ సంబంధముతోఁబాటు జ్ఞాతవ్యముగ పూర్వాచార్యులు ఏర్పఱచినట్టి యర్థపంచకము రహస్యత్రయములో నిమిడియుండుటను — ఈ యర్థపంచకము లోపల తత్త్వత్రయాది విభాగమును గన్పట్టునట్టి వారి యుద్దేశమును — ఈ తత్త్వత్రయములో నీశ్వరుండుగను సాత్త్వికశాస్త్రములయందుఁ జెప్పఁబడినట్టివాఁడు శ్రియఃపతియగుటను — ఈ యర్థంబులనన్నింటిని తెలిసికొనినట్టివాఁడు ముముక్షువై మోక్షోన్ముఖుండగుటను — అధికారివిభాగమును — ఈ యధికారులకనురూపంబగు ఉపాయవిభాగమును — ఈ యుపాయంబులలో స్వతంత్రప్రపత్తిననవలంబించినవారి యధికారవిశేషముండునట్టి విధమును - సకృత్కర్తవ్యంబగునట్టి యీ యుపాయమునకు అనురూపముగ విధింపఁబడినట్టి అంగవిభాగమును — ముముక్షువునకు సాంగమగు భరన్యాసరూపప్రధానకర్తవ్యము యొక్క సన్నివేశముండుటను — ఇట్లు సాంగముగ ప్రపత్తిని అనుష్ఠించినట్టివాఁడు సర్వరక్షకుండగు సర్వేశ్వరునిపై భారమునుంచినట్టివాఁడైనందున కృతకృత్యుండగుటను — ఇట్టి నిష్ఠ తనకుఁగలిగినదానిఁ దెలిసికొని,

తానునిర్భరుండుగానుండుటలోఁగుర్తులను - ఈతనికి ఆర్తితక్కు
వగానున్నందున, శరీరము అనువర్తించినట్లయిన, ఈలోకమున
నున్నప్పుడుస్వయంప్రయోజనంబైనస్వరూపప్రాప్తంబగు శేషవృ
త్తిరూపమగు కైంకర్యముయొక్క విధమును - భగవత్కైంకర్య
ముయొక్క యంతిమదశ భాగవతకైంకర్యమగుటను - శాసకుం
డగు సర్వేశ్వరునికి ఇష్టముకానిది కైంకర్యముకాకపోవుటం
జేసి, శాస్త్రప్రకారమే కైంకర్యము ననుష్ఠింపవలయుననుటను
- ఇట్టి శాస్త్రీయంబగు కైంకర్యమునఁ బ్రవర్తించినట్టి వానికి
అపరాధంబులు సంభవింపకుండుటకున్ను, సంప్రాప్తంబులై
నవి నశించుటకున్ను ఉపాయంబులను - ఇట్టి నిరపరాధకైంక
ర్యముకు స్థానముగాను స్వస్థతగానున్నప్పుడున్ను ఉచితంబైన
ది భాగవతాశ్రితంబగు భగవత్క్షేత్రంబగుటను - ఇట్లుండు
నట్టి యీయధికారికి భగవంతుని సంకల్పవిశేషమువలన,
ప్రశస్తంబులగు దేశకాలాదులతో నిమిత్తములేకుండ స్థూల
శరీరములోనుండియే నిర్యాణము గలుగుటను - ఇట్లు ఈ యా
త్మస్థూలశరీములోనుండి బయలువెడలినట్లయిన, యువరాజ్య
మున పట్టాభిషిక్తునిగాఁ జేయుటకై తండ్రిచే రప్పింపఁబడినట్టి
రాజకుమారునివలెనే గొప్ప గౌరవముతో పరమపదపర్యంత
ము అర్చిరాదిమార్గమునఁ బోవుటను - ఇవ్విధమునఁ బోయినట్ల
యిన, అచ్చట గలుగఁగల స్వచ్ఛందకైంకర్యపర్యంతమై పరి
పూర్ణభగవదనుభవరూపంబగు ముక్తైశ్వర్యమును - ఇట్లు తె
లియవలసినట్టివిగాను చెప్పఁబడినట్టి వాటిలో ముఖ్యంబైనట్టి
సిద్ధోపాయమును, కర్తవ్యంబులలోఁ బ్రధానంబైనట్టిదియగు
సాధ్యోపాయమును, ఈ యుపాయనిష్ఠునియొక్క ప్రభావము

విషయమున శాస్త్రములు వొప్పుకొనట్టి హెచ్చుతక్కువలను
గుఱించి ఆహారదోష, హైతుకసంసర్గ యుగస్వభావాదు
లను బట్టి రాఁగల మనోనైకల్యంబులకుఁగాను పరిహారంబు
లఁజేయవలసినట్టి విధంబులను—వీటినన్నింటిని అనుసంధించు
కొనుటకు ద్వారభూతంబగు రహస్యత్రయమునందు పదవాక్య
యోజనలను—ఈ యర్థంబులకిన్నింటికిన్ని శాస్త్రప్రకారము
ప్రచారము నొనర్చునట్టి యాచార్యునికి ఉపదేశాదుల నొసం
గఁగూడిన వరిని కూడని వారినిన్ని—ఇట్లు పరమోపకార
కుండగు ఆచార్యుని విషయమున తగినట్టి ప్రత్యుపకారము
నొనర్పకంబోవుటచే నిత్య ఋణియగు శిష్యునికి చేయవలసిన
వాటినిన్ని వీటి నన్నింటిని శ్రుతి, స్మృతి, సూత్ర, సంప్ర
దాయంబులచేతనున్ను, వీటి కనుకూలంబులై సమీచీనంబు
లగు యుక్తులచేతనున్ను, అజ్ఞానసంశయ విపర్యయంబులు
గలుగకుండునట్లు, మేము వినియున్నట్లును మా హృదయము
ననున్నట్లును ఉపపాదించినాము.

ఈ యర్థంబులనన్నింటిని ముందుగ సాంప్రదాయకుం
డగు సదాచార్యుని శ్రద్ధతో నాశ్రయించి, "శిష్యస్తేహం శా
ధిమాం త్వాం ప్రపన్నం" (స్వామీ నిన్ను ఆశ్రయించినా
డను నాకు బోధింపుమా) అని విన్నవించి, ఆదరణతో విశద
ముగాఁ దెలిసికొని, వీటి కుపయుక్తంబులగు మంచి శ్రీసూ
క్తులనున్ను "సువ్యాహృతాని మహతాం సుకృతాని తత స్త
తః సంచిన్వన్ధీర ఆసీత సిలహారీ సిలం యథా" (గొప్పవారి శ్రీ
సూక్తులనున్ను ఆచారములనున్ను సిలధాన్యమును భుజించు
వాడు దానిని సంపాదించుకొనునట్లు వాటినన్నింటిని ప్రీతితో

మనస్సున నుంచుకొనునది) అన్నట్లు పర్యుకొని పదేపదే వా
టిని గమనించి తెలిసికొనుచుండునది.

„సూక్ష్మః పరవిజ్ఞేయః సతాం ధర్మః ప్లవంగమ” (ఓ
మారుతీ ! సత్పురుషులాచరించునట్టి ధర్మము బహుసూక్ష్మ
మైనది) అనియు „ధర్మస్య తత్త్వం నిహితంగుహాయాం” (ధ
ర్మముయొక్క తత్త్వము బహురహస్యముగా నుంచబడినది)
అనియు, „అణీయాన్ క్షురధారాయాః కోధర్మంవక్తుమర్హ
తి” (ధర్మము కత్తియొక్క కొనకంటెను ఎక్కువ సూక్ష్మమై
నది దానిని నిష్కర్షించి చెప్పునట్టి వాడెవ్వండును కలడు)
అన్నట్లు మహర్షులు సయుక్తము తోట్రుపాటుపడునట్టి విషయ
ములు తటస్థించినప్పుడు „ మహాజనోయేన గతస్సపంథాః ”
(పెద్దలుపోయినదే మార్గము) అనియు „ధర్మశాస్త్రరథారూ
ఢావేదఖడ్గధరాద్విజాః క్రీడార్థమపియద్బ్రూయుః సధర్మః పర
మోమతః” (ధర్మశాస్త్రరూపమగు రథమునెక్కినట్టి వారై
వేదరూపమగు ఖడ్గమును ధరించియున్నట్టివారగు బ్రాహ్మ
ణోత్తములు క్రీడార్థము చెప్పినట్టి మాటయున్ను ధర్మముగా
నెన్నదగినది) అనియును చెప్పియున్నట్లు, శ్రుతిస్మృతులను
నమ్మియుండునట్టి పూర్వాచార్యులు చక్కపఱచిపోయిన మా
ర్గమునఁ బోతిమేని మనకెవ్విధమైనట్టి కొరతయును కలుగఁ
జాలదు.

ఇవ్విధముగ ప్రవర్తించునట్టి వారికి „అవిశ్రాంతమనా
లంబమపాథేయమదేశికం తమఃకాంతారమధ్వానం కథమే
కోగమిష్యసి” (విశ్రాంతిగాని, ఆధారముగాని, భోజనముగాని
దారి చూపువాఁడు గాని, లేనట్టి చీకటి యడవి మార్గమున

కిరీటినం - నౌపమ్యంవిద్యతే తస్య త్రిషు లోకేషు కించన తంసైత్రవణసంకాశ ముపవిష్టం స్వలంకృతం - దదర్శసూతః పర్యంకే సౌవర్ణే సోత్తరచ్ఛదే - వరాహరుధిరాభేణ శుచినాచ సుగంధినా - అనులిప్తంపరార్ధ్యేన చందనేనపరంతపం - స్థితయాపార్శ్వతశ్చాపివాలవ్యజన హస్తయా - ఉపేతంసీతాయాభూయ శ్చిత్రయాశశినంయథా - తంతపంతమివాదిత్య ముపపన్నం స్వతేజసా - వవందే వరదంవందీ వినయజ్ఞోపనీతవత్" అని భారతరామాయణములయందుఁ జెప్పియున్నట్టి యవతారస్థితిచే సూచితంబైనట్టి పరమపదపర్యంకమునందు వేంచేసియున్నట్టి పత్నీవిశిష్టుండగు సర్వేశ్వరుని యొక్క శ్రీపాదముల - సన్నిధియందు «ఒళ్లివిల్ కాలమెల్లా ముడనాయ్ మన్ని వఝువిలావడిమై శెయ్యవేండునామ్" (ఎడతెగకుండ సర్వకాలసర్వావస్థలయందును సర్వవిధకైంకర్యములనున్ను శ్రద్ధతో నొనర్పవలయును) అన్నట్టి మనోరథము ప్రకారము సర్వదేశ సర్వకాల సర్వావస్థోచిత సర్వవిధకైంకర్యంబులనున్ను లభించి సుఖపడుచురు. ఇట్టి శ్రియఃపతియగు నారాయణునియొక్క శ్రీపాదంబులే ఉపాయదశయందునుఫలదశయందును ఆధారభూతంబులుగాఁ గొనఁదగినవి.

నిగమనాధికారము ముగిసెను.



## అనుసంధానోపయుక్తంబులగు

## పాశురములును శ్లోకములును



పా॥ ఉఱుశకడముడైయవారుకాలుఱ్ఱుణర్న్దన।
ఉడఙ్మరుత మొడియవారుపోదిఱ్ఱవళర్న్దన,
ఉఱితడవుమళవిలురలూడుఱ్ఱునిన్ఱన,
ఉఱునెఱియోర్తరుమఙ్ విడుతూదుక్కుశెన్దన,
మఱనెఱియర్కుఱియపిరతానత్తువన్దన
మలర్మకళ్ కైవరుడ మలరోప్పిదిత్చివందన
మఱుపిఱవియఱుముఃవర్మాలుక్కిశైందన
మనుముఱైయిల్ వరువదోర్వ్యూహానత్తుఱైందన
అఱముడైయ విశయనమర్తేరిఱ్ఱికళ్ందన
అడలురక పడమడియవాడిక్కడిందన
అఱుశమయమఱివరియతానత్తలర్న్దన
వణికురుకైనకర్ మురుక నావుక్కమైందన
వెఱియుడైయతుళవమలర్ వీఱుక్కణిందన
విఴుకరియోర్కుమరనెనమేవిచ్చిఱందన
విఱలశురర్పడైయుడైయవీయత్తుడర్న్దన
విడలరియపెరియపెరుమాళ్ మెయ్ప్పదంగళే॥

శ్లో॥ ఇతియతిరాజ మహానస పరిమళపరివాహ వాసితాంపిబత।
విబుధపరిషన్నిషేవ్యాం వేదాంతోదయనసంప్రదాయసుధాం॥

శ్లో॥ కలకంఠగణాస్వాద్యే కామస్యాస్త్రే నిజాంకురే।
నింబవృత్తిభిరుద్గీర్ణే న చూతః పరితప్యతే॥

పా॥ మున్బిఱ్ఱ ఞానము మోకన్తు అక్కలుమూన్ఱురై యిల్
తన్బిఱ్ఱతనై మ్మయున్నాఴ్న్దవర్కళయున్తని త్తకవుమ్
మన్బిఱ్ఱినిన్ఱవకైయురైకిన్ఱమత్తైయవర్ పాల్
శిన్బిఱ్ఱియెన్బయల్ శీరరివోర్కళనై శెప్పినమే॥

శ్లో॥ నిర్విష్టం యతిసార్వభౌమవచసా మావృత్తిభిర్యౌవనం
నిర్ధూతేతరపారతంత్ర్యనియమానీతాస్సుఖం వాసరాః।
అంగీకృత్య సతాం ప్రశస్తిమసతాం గర్హోఽపి నిర్వాపితః
శేషాయుష్యపి శేషితం పణిదయాదీక్షాముదీక్షామహే॥

పా॥ శెప్పచ్చెవిక్కముదెన్న త్తికఴుఞ్ఞెఴుంగుణత్తు
త్తప్పఱ్ఱవర్కట్కు త్తామెయుకన్దుతరుం దకవాల్
ఒప్పఱ్ఱనాన్మఱై యుళ్ళక్కరుత్తిలురైత్తురైత్త
ముప్పత్తిరండివైముత్తమిఴ్ శేర్న్దమొఴిత్తిగవే॥

శ్లో॥ ఆస్తిక్యవాన్నిశితబుద్ధిరనభ్యసూయః
స్సత్సంప్రదాయపరిశుద్ధమనాస్సదర్థీ।
సంకేతభీతిరహితస్సతృణేష్వసక్త
స్సద్వర్తనీమనువిధాస్యతి శాశ్వతీం నః॥

మత్తైయురైక్కు మెవ్వురుళెల్లా మెయ్యెన్ఱోవారమన్నియకూర్
మతియుడైయార్వణక్కత్తిల్, కుత్తైయురైక్కనినై విల్లార్
కురుక్కడమ్మాల్ ఓదఱ్ఱమనమ్బొఱ్ఱారో శ్వార్షమ్మే.

శిష్ట్రవళరుక్కిచ్చిరమాందర్చ్చజ్ఞేతత్తాత్చ్చిత్తైయాదతిణ్మాదియోర్
తెరింగదోర్వార్, పోత్తైనిలత్తిఱ్ మికుప్పునిదర్కాట్టు
మెజ్ఞళ్ప్రెన్నాదనన్నైత్తిఱైయిల్పుకుదువారే॥

పా॥ ఇదువఴియిన్నముదెన్ఱవరిన్పులన్ వేఱిడువార్
ఇదువఴియామలవెన్ఱఱివారెజ్ఞదేశికరే
ఇదువఴియెయ్దుకవెన్ఱుకప్పారెన్నిఱైపాఱుప్పార్
ఇదువఴియామ్ఱైయోరరుళాల్యామిశైన్దనమే॥

పా॥ ఎట్టుమిరండుమఱియాదవెమ్మైయివైయఱివి
త్తెట్టవొణ్ణాదవిడందరుమెంగళ్ మాదవనార్
ముట్టవినైత్తిరళ్ మాళమున్ఱిడుమంజలెన్ఱార్
కట్టెళిల్వాశకత్తాఱ్కలంగానిలైపెఱ్ఱనమే॥

పా॥ వానుళమర్దవరుక్కుమ్ వరుందవరుమిన్నలైకళ్
తానుళనాయకక్కుత్తరమింగున్నముక్కుళదే
కూనుళనెంజుకళాఱ్కుఱ్ఱమెణ్ణక్కైతీరందడినమ్
తేనుళపాదమలర్ తిరుమాలుక్కుత్తిత్తిక్కుమే.

పా॥ వెళ్ళైప్పరిముకర్ దేశికరాయ్ విరకాలడియోమ్
ఉళ్ళత్తెళుదియదోలైయిట్టనర్యామిదఱ్కు
కొళ్ళత్తుణియినుఙ్కోదెన్ఱిగళినుఙ్కూర్ మదియీర్
ఎళ్ళత్తనైయుకవాదికళాదెన్నైయిఱ్ఱమనమే.

